
సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్ధం మహానుభావులైన శ్రీ చిన్న జీయర్ వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) చిన్న జీయర్ వెబ్ సైట్: http://www.chinnajeeyar.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో చిన్న జీయర్ వెబ్ సైట్ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

# చిన్న జీయర్ వారి వెబ్ సైట్

## http://www.chinnajeeyar.org



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

## విషయ సూచిక.....



## పంచాంగ వివరాలు

### జనవరి 2004

3 వైకుంఠైకాదశి

4 శూన్య తిథి కూర్మద్వాదశి
**శ్రీశ్రీశ్రీ పెద్దజీయరు స్వామివారి పరమ పదోత్సవము.**

5 త్రయోదశి తిథి

7 శివాలయాలలో ఆర్ద్రమహోత్సవం

8 ఎంబార్ తిరు॥

11 తిరుమ**రి**శైయాళ్వార్ తిరు॥

12 త్యాగరాజస్వామి ఆరాధన

14 మకర సంక్రాంతి తె. 4-1, భోగి పండుగ

15 సంక్రాంతి పండుగ ఉత్తరాయణ పుణ్యకాలం

16 కనుమ

17 తిథిద్వయం

18 సర్వేషామేకాదశి, ద్వాదశితిథి

19 **తె.కం. గోపాలాచార్యస్వామివారి తిరు॥**

20 మాస శివరాత్రి

21 సర్వేషాం అమావాస్య

26 వసంతపంచమి, భారతదేశ గణతంత్ర దినోత్సవం

28 రథసప్తమి, సూర్యచంద్రుల వ్రతం

### ఫిబ్రవరి 2004

2 **సర్వేషాం భీష్మైకాదశి శ్రీ విష్ణు సహస్రనామ జయంతి**

3 భీష్మద్వాదశి

5 పౌర్ణమి తిథి

6 శూన్యతిథి

7 పాడ్యమి తిథి

**ముఖచిత్ర వివరణ:** జనవరి 26వ తేదీన శ్రీస్వామివారు ప్రారంభించబోతున్న జీయరు గురుకుల పాఠశాల భవనసముదాయాల్ని ముఖచిత్రంగా మనం చూస్తున్నాం. సంబంధిత వివరాలు 28వ పేజిలో చూడండి.


మీ సేవలో....

**భక్తినివేదన,** సీతానగరం-522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, (08645) 272929,

**చందావివరాలు** :- సంవత్సరచందా రూ. 50/-, జీవితచందా రూ. 500/-,
విదేశాలకు సంవత్సరచందా $ 25,

E-mail : jetsitanagaram@yahoo.com Internet : www.chinnajeeyar.org

D.T.P. & Design by : పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రాసెసర్స్, సీతానగరం,


శ్రీమతే రామానుజాయ నమః

# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాస పత్రిక




స్వభాను నామ సంవత్సరం పుష్యమాసం

సంపుటి 56 2004 జనవరి సంచిక 10


వ్యవస్థాపకులు

శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యులు
శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు

సంపాదకులు :

శ్రీ ఉ. వే. శ్రీమాన్ T.P. **శ్రీరామచంద్రాచార్యులు**

సంపాదకీయం

# సత్యవైభవము

సత్యం కంటె పరమధర్మం మరొకటి లేదని సనాతన వాఙ్మయం బహుధా ప్రశంసిస్తోంది.

సత్యాన్ని పలకమంటోంది శ్రుతి. సత్యం పట్ల ఏమరుపాటు వద్దనీ హెచ్చరిస్తోంది. సత్యం వల్ల లోకాలను జయించ వచ్చు నంటోంది ఇతిహాసం.

"సాంకర్యం పొందకుండా ఉండే శుద్ధమైన ధర్మం సత్యమే" అంటున్నారు ప్రాజ్ఞులు.

సత్పురుష నిష్ఠం, సనాతనమూను సత్యం

సత్యానికి నమస్కరించాలి. సత్యమే పరమగతి.

సత్యమే ధర్మం, తపం, యోగం, పరమ మైన యజ్ఞం. సత్యమే సనాతనమైన బ్రహ్మం.

"సత్యమందే సర్వం సుప్రతిష్ఠితం" సత్యానికి పంచమవేదం ఇంతగా పట్టం కట్టింది.

ఇంత మహోన్నతంగా సత్యం వెలుగొందటానికి కారణం తెలియాలంటే సత్య స్వరూపవైభవం మనకు ముందు తెలియాలి. దాన్ని చక్కగా తెలిసి మరీ అనుష్ఠించాలి. అప్పుడే అది ఫలప్రదం అవుతుంది.

కేవల యథార్థ కథనం మాత్రమే కాదు సత్యమంటే యథార్థం కావటంతోపాటు సత్యం ప్రియం కావాలి. హితం కావాలి, అనుద్వేజకం కావాలి. లోకానికి దాని వల్ల మేలు కలగాలి. ప్రాణికోటికి మేలుకలగాలి. ఒకరిమేలువల్ల వేరొకరి మేలు చెడరాదు.

అంచేతనే విశ్వాన్ని నడిపిస్తోంది సత్యం

విశ్వాన్ని నిలబెడుతోంది సత్యం.

సత్యం పదమూడు రూపాలతో విలసిల్లు తూంటుందంటుంది భారతం. సమత్వం, దమం, మాత్సర్యరాహిత్యం, క్షమ, లజ్జ, సహనం, అసూయ లేకుండా ఉండటం. త్యాగం, ధ్యానం, ఆర్యత్వం, ధృతి, దయ, అహింస– సత్యానుష్ఠానికి ఇవన్నీ అంగాలు.

మనిషి వీటిని తాను ముందు ప్రోది చేసుకోవాలి. అప్పుడే అతడు అచ్చపు సత్యవ్రతుడౌతాడు.

కామక్రోధాదులుపశమించి మిత్రా మిత్రభేదం లేకుండా ఇష్టానిష్టాలన్న తేడా లేకుండా సర్వాన్నీ సమభావంతో సందర్శింప గలగాలి మనిషి.

పరద్రవ్యాపేక్షలేకుండా, వెలితి పడకుండా నిండుకుండలా ఉండాలి. దానాలు కావించాలి. ధర్మాలు కావించాలి. కాని సంయమనం కావాలి. పోటీ కోసం,





పరువుకోసం పరుగులు పెట్టరాదు.

ప్రియాన్ని అప్రియాన్ని ఒక్కలా తట్టుకో గలగాలి. మనసులో మాటలో వినయం తొణికిసలాడుతూ మంచి పనులు చేస్తూ ఉండాలి. నైచ్యాన్ని, హైన్యాన్ని దరి చేరనీయ రాదు. ఓర్పుతో అర్థాన్ని సాధించాలి. ధర్మాన్ని ఆచరించాలి. అసూయను ఆవలకు నెట్టాలి. రాగద్వేషాలను విషయ స్నేహాలను విడనాడాలి. సమస్త ప్రాణికోటికీ శుభం చేకూరే పనులు చేస్తూండాలి. మేరువు ముంగిట వచ్చి నిలిచినా, కడలి ఉప్పెనగా ముంచవచ్చినా చలింపక నిలబడ గలగాలి. మనసా, వాచా, కర్మణా ఏ ప్రాణికీ ద్రోహం చేయరాదు. కాదు ద్రోహ చింతకూడా చేయరాదు. సర్వప్రాణులపట్ల అనుకూలంగా ఉంటూ కలదాన్ని కలిమి మేరకు సర్వులకూ ఇస్తూండాలి.

ఇట్లా ఉంటూ సత్యాన్ని హితంగా, ప్రియంగా, అనుద్వేజకంగా పలకాలి. అదీ సత్యం. అదే ధర్మం. ఇంతటి విశ్వరూపం కలది సత్యం. ఇంతటి భూమికపై ఏర్పడినది కనుకనే సత్యానికి ఆ వైభవం. సత్యమే ధర్మానికాధారం. సత్యాన్ని మరగుపడ నీయరాదు.

కనుకనే సత్యానుష్ఠానంతో జాతి చరితార్థం కావాలి.

**-శ్రీ.రామచంద్రాచార్య**

శ్రీమతే రామానుజాయ నమః

**శ్రీమదుభయవేదాన్తాచార్య పీఠము సమర్పించు**

## ఆచార్య వరివస్య

**"7వ గోపాలోపాయన పురస్కారము"**

శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యులు

**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి** ప్రత్యక్ష పర్యవేక్షణలో

**గోపాలోపాయన స్వీకర్త :** శ్రీమత్ ఉ.వే. **తిరుమల పురిహొళ్ళ వెంకటాచార్యస్వామి**వారు

గీతాభవనం, రాజమండ్రి

**సమయం:** 18.1.2004 సాయంత్రం గం.5.30 నుండి

**వేదిక :** పుష్పాగార్డెన్స్, చైతన్యపురి మెయిన్‌రోడ్, దిల్‌షుక్ నగర్, హైదరాబాద్

## ఆచార్య సంస్మరణము

**ఇటీవల ఆచార్య తిరువడి చేరిన మహామహోపాధ్యాయ గోపాలోపాయన గ్రహీత శ్రీ ఉ.వే. శ్రీమాన్**

**శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారి సంస్మరణము.**

**వీరు శ్రీఉ.వే. శ్రీమాన్ తె.కం. గోపాలాచార్య స్వామి వారి ప్రియశిష్యులు. వారివద్ద ఉభయవేదాంతాలు స్వీకరించారు.**

**శ్రీరామాయణ, తిరుప్పావై ప్రవచనాలలో జగత్ప్రసిద్ధులు.** ఇట్లు :

శ్రీమదుభయ వేదాంతాచార్య పీఠం

# మహర్షుల చరిత్ర

తమిళమూలం :
వై.వా. నావల్‌పాకం దేవనాథ తాతాచార్యస్వామి

తెలుగు సేత :
శ్రీ.ఉ.వే.ప్ర శ్రీమాన్ తూపురాణి ఉడయవర్‌స్వామి, విజయవాడ

శరమర్షణ గోత్రం వారి 'ప్రవర'లో వినిపించే ముగ్గురు మహర్షుల పేర్లు వరుసగా – అంగిరస, పురుకుత్స, త్రసదస్యు. ఈ ఋషులకు సంబంధించినవారు, అను అర్థంలో తద్ధిత ప్రత్యయము చేర్చగా క్రమముగా – ఆఙ్గిరస, పౌరుకుత్స, త్రాసదస్యవ, అని ఏర్పడును. ఈ శరమర్షణ గోత్రం వారు ఈ ప్రవరను నిత్యము, అనేకసార్లు చెప్పుకొని వీరి మూలంగా తమవంశము పునీతమైనదని భావించి ఆనందిస్తూ ఉంటారు.

ఈ గోత్రంలో ఈ ముగ్గురు మహర్షులేకాక తరువాతి కాలంలో లోకప్రసిద్ధిగాంచిన అనేకమంది మహర్షులు జన్మించారు. ప్రవరలో ముగ్గురు మహర్షులపేర్లే చెప్పడం అలవాటుగా ఉండడంచేత అందులో ప్రసిద్ధిచెందిన ఇతర ఋషులపేర్లు చేర్చబడలేదు. అలా ప్రసిద్ధిచెందిన మహర్షులలో ఒకరే 'శరమర్షణ' మహర్షి. పవిత్రమైన ఈ మహర్షిపేరే ఈ గోత్రానికి ఏర్పడింది. గోత్రంలో చెప్పబడని ఋషిపేరుతో గోత్రాన్ని పిలవడం కొత్తఏమీ కాదు. శ్రీవత్స గోత్రంకూడ ఇటువంటిదే. ప్రవరలో చెప్పబడిన ఒక ఋషి పేరుతో గోత్రం ఏర్పడడం సామాన్యమే. అందుచే ఈ రెండు పద్ధతులూ ఉన్నవని మనం గ్రహించవచ్చును.

**శరమర్షణ మహర్షి:-**

'శరమర్షణ' అనునది చక్కటి అర్థపుష్టి గల పేరు. 'శర' 'మర్షణ' అను రెండు పదాలతో ఏర్పడింది. శర – అనునది ఒక విధమయిన వాయువుకు పేరు. మర్షణ – అనగా తరిమికొట్టు. వీరు జన్మించునపుడే ఈ శరవాయువును దగ్గరకు రాకుండా తరిమి కొట్టారట. అందుచేతనే వీరికి శరమర్షణులు అనుపేరు పెట్టబడింది. శ్రీవైష్ణవాచార్యులలో ఆదిపురుషులైన నమ్మాళ్వార్లకు కూడ ఇదేపేరు– 'శరమర్షణ' (శఠకోప) ఏర్పడింది. వీరుకూడా తాము ఈ భూమిపై జన్మించే సమయంలోనే 'శఠ'వాయువును తరిమి కొట్టారట. అందుచే వీరికి శఠారి – శఠజిత్ – శఠకోప – శఠమదన – శఠరిపు– శఠవైరి అని అనేక పేర్లు వాడుకలో ఏర్పడ్డాయి.

ఆసక్తికరమైన ఈ విషయాన్ని కొంచెం వివరించుకుందాం.

విశాలమైన ఈ లోకంలో కోట్లాది జీవులు తల్లి గర్భంలో ప్రవేశించడం, తగిన సమయంలో గర్భం నుండి బయటపడి, పెరిగి పెద్దవారై సంసారయాత్ర గడుపుతూ ఉండడం అందరికీ తెలిసినదే. కాని గర్భంలో ఉండగా జీవుని అనుభవం వేరు. జన్మించిన తరువాత అనుభవం వేరు. జన్మించిన తరువాత కలిగే అనుభవం, గర్భవాస అనుభవానికి విరుద్ధంగా ఉంటుంది. గర్భంలో ఉన్న శిశువుకు తనకు ఇంతకు పూర్వము జరిగిన అనేక జన్మలగురించి, రాబోవు అనేక జన్మల గుఱించి స్పష్టంగా తెలుస్తుందట. ఇతిహాసాలు, పురాణాలు, ఉపనిషత్తులు ఈ విషయాన్ని మనకు ఉదాహరణలతో సహా స్పష్టంగా తెలియజేస్తున్నాయి. తల్లిగర్భంలో ఉన్న





శిశువుకు అక్కడ అన్నివిధాలా సౌకర్యంగా ఉండి దినదినం అభివృద్ధి చెందుతూ ఉంటుందట. అదే సమయంలో ఆ శిశువు మనస్సులో పెద్దపోరాటం కూడ జరుగుతూ ఉంటుందట. "ఇరుళ్ తరుమా ఞాలత్తిల్ ఇని పిఱవి యాన్ వేణ్డేన్" అని నమ్మాళ్వారు చెప్పినట్లుగా 'అజ్ఞానాన్ని ఇచ్చే ఈ భూమిలో నాకు జన్మయే వద్దు. ఇలా చాలాసార్లు పుట్టడం, మరణించడం కూడ జరిగింది. వేరువేరు జన్మలలో వేరు వేరు ప్రసవకాలం సమీపించగానే తల్లి ప్రసవవేదన బయట పడాలనే శిశువు ప్రయత్నం, భగవంతుని అనుగ్రహం, శరీరానికి ఉండే సహజమైన ఏర్పాటు, కార్యాన్ని నిర్విఘ్నంగా నడిపేశక్తులు– అన్నీ చేరి క్షేమంగా ప్రసవం జరుగుతుంది. అందరికి మనశ్శాంతి ఏర్పడుతుంది.

కాని, పుట్టిన శిశువు గర్భంలో ఉండగా చేసుకున్న నిర్ణయాలు ఎక్కడికి పోయాయో తెలియనట్లు గాలిలో కలిసిపోతాయి. "బభూవ ప్రాకృతః శిశు" అని చెప్పబడినట్లు అది సాధారణ శిశువుగానే మారిపోతుంది. తల్లిపాలకోసం ఏడ్చి ఆ పాలు త్రాగి ఆనందాన్ని అనుభవిస్తుంది. ఆ తల్లిపాలే శిశువుకు స్వర్గం కదా! ఇది విపరీత మార్పేగదా! ఈ స్థితి ఎలా ఏర్పడింది? శఠమనే వాయువే దానికి కారణము. ఈ వాయువు ప్రాణుల మానసిక స్థితిలో గొప్ప మూర్పును కలుగజేస్తుంది. బుద్ధి క్షీణించిపోతుంది. శిశువు పుట్టినవెంటనే ఈ వాయువు శిశువు శరీరాన్ని ఆక్రమించి బాధిస్తుంది. దీనితో అంతవరకూ చక్కగా ప్రకాశిస్తున్న జ్ఞానజ్యోతి కాంతిహీనమై పోతుంది. తత్త్వజ్ఞానమంతా కనుమరుగై పోతుంది. ఈ శఠవాయువు శక్తి అపారమైనది కావడంతో దానిని ఎవరూ అడ్డగించలేరు. ఈ వాయువుతో సంబంధం కలిగిన వెంటనే గర్భస్థ శిశువుగా ఉన్నప్పుడు కలిగిన తాత్త్విక చింతన అంతా చెల్లాచెదరయి పోతుంది. ఏ అడ్డు, అదుపూలేని ఈ శఠవాయువును గత చరిత్ర కాలంలో జయించినవారు ముగ్గురే ముగ్గురు. వారే, విష్ణుపురాణంలోని జడభరతుడు, శఠమర్షణుడు, నమ్మాళ్వారు. ఇంకను ఎవరైన ఉండి ఉండవచ్చును. కాని మనకు తెలిసినవారు వీరే. తల్లి తండ్రులు బంధువులు ఏర్పడ్డారు. ఇకపై ఈ జన్మచక్రంలో నేను చిక్కుకోను.

**"పునరపి మరణం పునరపి జననం
పునరపి జననీ జఠరే శయనం"**

చనిపోవడం, తిరిగి తల్లి గర్భంలో ప్రవేశించడం – ఇలా పరంపరగా జరిగే ఈ స్థితి నాకు వద్దేవద్దు– అని గర్భంలోని శిశువు భావిస్తూ ఉంటాడట. కాని ఏం చేయగలడు? గర్భకోశంలో చిక్కుకున్నాడే, తగిన సమయంలో తల్లి ప్రసవించినపుడు తిరిగి జన్మించడం తప్పదుగదా! దుర్గంధ భూయిష్టమైన ఈ శరీరమనే చెరసాలలో నుండి తప్పించుకొనుట సాధ్యమా? ఇందులో నుండి బయటపడి ఆత్మానందాన్ని అనుభవించేది ఎప్పుడు?"మాశూణాచ్చు దరుడంబాయ్ మలరాదు కువియాదు, మాశూణా జ్ఞానమాయ్'' (దోషము లేని తేజోమయ విగ్రహుడై, వృద్ధిలేని క్షయము లేని జ్ఞానియై) అని నమ్మాళ్వార్ తెలిపిన రీతిలో అట్టి స్థితిని పొందేది ఎట్లు? అని ఈ విధంగా గర్భస్థ శిశువు మనస్సు పరిపరి విధాల కలత చెందుతూ ఉంటుందట.

బదరలోనే గదా తామర పూచేది. ఈ శరీరంలో ఉండే గదా, నిరంతర భగవ ద్ధ్యానంతో వేలాది మహర్షులు మోక్షాన్ని పొందారు. నేను కూడా పుట్టిన తరువాత వారిలాగే నిరంతర భగవద్ధ్యానంతో కాలం గడుపుతాను. లౌకిక సుఖాలను దరిచేర నీయను. ఇదేనాకు ఆఖరి జన్మ" అని ఈ విధంగా దృఢ నిశ్చయంతో ఉంటుందట గర్భస్థ శిశువు.



# రామాయణంలో రమ్య గాథలు

## హనుమంతుని జన్మ వృత్తాంతము

-చెవుటూరి కుసుమ కుమారి, విజయవాడ.

**వీరవానర లోకస్య సర్వశాస్త్ర విదాంవర**
**తూష్ణీమేకాంత మాశ్రిత్య హనూమన్ కిం న జల్పసి"**

"ఓ హనుమా! సర్వశాస్త్ర కోవిదుడవైన నీవు ఏకాంతమున కూర్చుండి మౌనవేంల పాటించుచున్నావు? అంజనా సుతా! నీవు తేజోబలములచేత వానరరాజు సుగ్రీవుని తోనూ, దశరథాత్మజులతోనూ సరిసాటివి. వినతాకశ్యపుల సుతుడైన గరుత్మంతుడు మహాబలశాలి. అతడు సముద్రములోని మహాసర్పములను వెలికి లాగుచుండగా నేను చాలసార్లు చూచినాను. అతని రెక్కల బలముకన్న నీభుజబలమెక్కువ. తేజోబల పరాక్రమాల్లో నీవతనికి తీసిపోవు. నీకున్న బుద్ధి, ధైర్యము, తేజస్సు ఏ ఇతర ప్రాణుల లోనూ లేదు. హనుమా! నీవీ రామకార్యమునకేల సన్నద్ధుడవగుటలేదు?

ఆంజనేయా! నీశక్తి **"విశిష్టం సర్వ భూతేషు కిమాత్మానం న సజ్జసే"** సమస్త ప్రాణులలోకెల్లా విశిష్టమైనది. కాని నీవెందుచేత కార్యరంగము నకు ఉరుకుటలేదో తెలియకున్నది. హనుమా! నీ శక్తి యుక్తులను నేను పూర్తిగా తెలిసినవాడను. చెప్పెదను వినుము.

**"అప్సరసాం శ్రేష్ఠా పుఞ్జకస్థలా**
**అంజనేతి పరిఖ్యాతా పత్నీ కేసరిణో హరేః"**

"పుంజికస్థల అను పేరుగల ఒక ప్రఖ్యాత అప్సరస వుండెడిది. ఆమె ముల్లోకాలా ఎన్నదగిన సౌందర్యరాశి. ఆమె ఒకానొక శాపవశమున స్వేచ్ఛారూపము ధరించగల వానరస్త్రీగా భూలోకమున వానరరాజైన కుంజరుని కూతురుగా అంజన అనుపేరుతో జన్మించినది. ఆమె వానరుడైన కేసరి భార్య. ఉత్తమ నియమ నిష్ఠలుగలది. ఆమె ఒకనాడు సర్వాంగ సుందరంగా అలంకరించుకొని మానవ స్త్రీ వేషమున ఒక పర్వత శిఖరమున విహరించుచుండగా, వాయుదేవుడు తన పొడవైన చేతులతో ఆమెను మనః పరిష్వంగమున చేర్చుకొన్నాడు. ఎవరెవరని గద్దించగా వాయుదేవుడు ఈవిధంగా చెప్పినాడు.

**"మనసాస్మి గతో యత్త్వాం పరిష్వజ్య యశస్వినీ**
**వీర్యవాన్ బుద్ధిసమ్పన్న స్తవ పుత్రో భవిష్యతి"**

"హే అంజనా! నేను మనసా నిన్ను కోరుటచేత మహాసత్త్వ సంపన్నుడు, ఎగురుట దుముకుట వంటి పనులలో నాతో సమానుడు అయిన పుత్రుడు నీకు జన్మించగలడు" అని వరమిచ్చినాడు. అంజనాదేవి ఆవిధంగా నిన్ను కన్నది. నాయనా! భయంకర పరాక్రమముగల నీవు వాయుదేవునకు ఔరసపుత్రుడవు. కేసరికి క్షేత్రజ పుత్రుడవు. కనుక ఎగురుటలో వాయు పుత్రుడవైన నీకన్న పరాక్రమవంతులు నీకు





సాటిలేరు. నీకొక సంఘటన చెప్పెదను వినుము.

**"అభ్యుత్థితం తతః సూర్యం బాలో దృష్ట్వా మహావనే**
**ఫలం చేతి జిఘృక్షుస్త్వం ఉత్ ప్లుత్యాభ్యుదితోదివమ్"**

ఆకసమునందు ఉదయించుచున్న బాలభానుని చూచి ఫలమని భావించి, దానిని పట్టుకొనవలెనని మూడువందల యోజన ములు ఆకాశమువైపు ఎగిరి సూర్యతేజమును ఆక్రమించగా, కోపావిష్టుడైన ఇంద్రుడు తన వజ్రాయుధాన్ని ప్రయోగించినాడు. ఆ ప్రహారముచేత నీవొక పర్వతశిఖరాన పడిపోగా నీ వామహనువు (గడ్డమునకు ఎడమవైపు) విరిగిపోగా అంజనాసుతుడవైన నీకు హనుమంతుడని పేరు వచ్చినది.

ఆవిధంగా దవడ విరిగిన నిన్ను చూచిన నీ తండ్రి వాయుదేవునకు దేవేంద్రునిమీద పట్టరాని కోపం వచ్చినది. వాయువు ముల్లోకాలా వీచుట మానివేసినాడు. వాయువు స్తంభించుట చేత ప్రాణికోటి అంతా సంక్షోభించినది. ప్రాణులన్నీ నశించి పోగలవని భీతచిత్తులైన లోకపాలురు అంతా వాయుదేవుడిని ఇలా ప్రార్థించినారు.

**"ప్రసాదితేన పవనే బ్రహ్మా తుభ్యం వరం దదౌ**
**అశస్త్ర వధ్యతాం తాత సమరే సత్య విక్రమ"**

ఆవిధంగా దేవతలు క్షోభపడుతూ వుండగా బ్రహ్మ వాయువును ప్రసన్నం చేసుకొని, శస్త్రాస్త్రములచేత నీకు మరణము లేకుండునట్లు వరమిచ్చినాడు. నాయనా! ఇంకనూ వినుము. వజ్రాయుధ ప్రహారము చేతకూడా నీకు బాధకలుగకుండుటను చూచి సంతసించిన దేవేంద్రుడు నీవు కోరినప్పుడే నీకు మరణము సంభవించునని గొప్ప వరమిచ్చినాడు. నీవునూ సుగ్రీవు నంతటి పరాక్రమశాలివి. ఇప్పటి వానర వీరులలో నీకన్న పరాక్రమ వంతులులేరు. తండ్రీ! హనుమా! యిప్పుడు మా ప్రాణములు పోకుండ నీవే కాపాడవలె.

నాయనా! ఆంజనేయా శ్రీమహావిష్ణువు త్రివిక్రముడై వ్యాపించినవేళ నేను పర్వతారణ్య సహితమైన ఈ భూదేవికి ఇరువది ఒక్క మార్లు ప్రదక్షిణము చేసినాను. దేవతల ఆజ్ఞానుసారము అమృతమథన సమయమున సముద్రములో వేయుటకు వాడబడిన ఔషధములనన్నింటినీ తిరిగి తిరిగి సేకరించి తెచ్చినాము. అప్పుడు మాకు అపారమైన బలముండెడిది. ఇప్పుడు వృద్ధుడనై బలమంత క్షీణించినది. ఇప్పుడు నీవొక్కడివే సమస్త గుణశాలివైన పరాక్రమశాలివి. ఈ వానరసేన అంతా నీ పరాక్రమము చూడవలెనని ఉవ్విళ్ళూరు చున్నది. నీవు వానరశ్రేష్ఠుడవు. నీవు రామకార్య నిర్వహణధురీణుడవు. ఉత్తముడవు.

హరిశార్దూలా! హనుమా! లెమ్ము లెమ్ము. వానరులంతా దీనవదనులై నీవంక చూచుచున్నారు చూడుము. అంజనా సుతా! వాయుపుత్రా! నీ గమన శక్తికి మించిన గమనశక్తి ఈ జగత్తులోనే ఏ ప్రాణికీ లేదు. మహాశక్తివంతుడా! ధీశాలివైన హనుమా! యింక ఏమాత్రము ఉపేక్షించకు. మహావేగశాలీ! విష్ణువు తన పద విన్యాసము చేత ముల్లోకాలనూ ఆక్రమించినట్లు నీవునూ విజృంభించి నీశక్తినీ, పరాక్రమమును ప్రదర్శించుము. శ్రీరామచంద్ర ప్రభువు నీపై ఉంచిన కార్యభారమును అవలీలగా

పూరించగలవాడవు నీవొక్కడవే. వాయు నందనా! మహావీరా! మహావేగవంతా! హనుమంతా! ఇప్పటికే సమయము మించిపోయినది. నాయనా! ఆలస్యము తగదు. లేచి వెంటనే విజృంభించు" అని జాంబవంతుడు ప్రేరేపించినాడు.

మహాబుద్ధి కుశలుడు, వృద్ధుడు అయిన జాంబవంతుని ప్రేరణకు ఉత్తేజితుడైన ఆ వానరశ్రేష్ఠుడు హనుమంతుడు తన శరీరాన్ని మహత్తరంగా పెంచినాడు. నూరు యోజనముల సాగరాన్ని దాటుటకు ఉద్యుక్తుడైనాడు. వానరులందరూ సాక్షాత్తూ త్రివిక్రముడైన శ్రీమన్నారాయణుని చూచుటకు ఉత్సాహపడిన ప్రజలవలె ఆశ్చర్యముతో చూచి, శోకం, దిగులు పోయినవారై, హనుమను స్తుతిస్తూ బిగ్గరగా అరచినారు. వానరుల స్తుతులు, సంతోషము చూచిన హనుమ బలం మరింత వృద్ధి చెందింది. మహాతేజస్సుతో అతని ఆకారము మహోత్తమంగా వృద్ధిచెంది, అద్భుతంగా భాసించింది.

తెరువబడిన పర్వత గుహలో విజృంభించిన సింహంలా వాయుసుతుడు విజృంభించినాడు.

**"అశోభత ముఖం తస్య జృంభమాణస్య ధీమతః**
**అమ్బరీష మివాదీప్తం విధూమ ఇవ పావకః"**

ధీశాలి అయిన హనుమ ఆవులించగా అతని వదనము ధూమము లేని అగ్నిలా ఎర్రగా ప్రకాశించింది. వానరుల మధ్యనుండి అంజనాసుతుడు ఒక్కసారిగా లేచినాడు. ఆ మహాత్ముని శరీరము ఒక్కసారి గగుర్పాటు చెందినది. బుద్ధిశాలి అయిన హనుమ వృద్ధ వానరవీరులందరికీ నమస్కరించి

"మారుతస్యౌరసః పుత్రః ప్లవనేనాస్మి తత్సమః" శీఘ్రగామి అయిన వాయుదేవుని ఔరస పుత్రుడను. ఎగురుటలో నేనునూ ఆ మహాత్మునికి సమానుడను. సముద్రమును నా బాహుబలం చేత కుదిపివేసి, పర్వత సహితంగా లోకాలను ముంచెత్తగలను. వరుణాలయాన్ని జలజంతువులన్నీ పిక్కటిల్లి దిక్కుతోచక పైకి లేచునట్లు నా తొడలతో తొక్కిపెట్టగలను. ఆకాశమున పక్షిరాజైన గరుత్మంతుడు ఎగురుచుండగా అనేక వేలసార్లు అతనికి ప్రదక్షిణలు చేయగలను. వానరయోధులారా! ఇంకనూ వినుడు. శ్రీకరుడైన సూర్యుడు ఉదయపర్వతమున బయలుదేరి అస్తాద్రిని చేరులోపల నేనాతనిని పలుకరించి, తిరిగి భూమిని చేరకముందే అతనికి ఎదురు వెళ్ళగలను. ఆకాశయానము చేయు వారినందరనూ నేను అతిక్రమించ గలను. క్షితిని చీల్చగలను. జలనిధిని ఎండింప చేయగలను. వానర పుంగవులారా! యిప్పుడు నేను ఎగురుచుండగా వృక్షములు, లతలు, పుష్పములు నావెన్నంటి రాగలవు చూడుడు.

వానరవీరులారా! మహామేరువు సమాన దేహంతో నేను ఆకాశాన్నావరించి మ్రింగు చున్నానేమో అన్నట్లున్న నన్ను ఇప్పుడు మీరు చూడగలరు. అటువంటి సమయమున నన్నునుసరించగలవారు వాయువు, వినతా సుతుడైన గరుత్మంతుడు తప్ప మరెవరూ లేరు. సముద్రము దాటునప్పుడు నా రూపము మూడు పాదములతో న్యాసము చేయుచున్న విష్ణువులా తోచగలదు, అంటూ హనుమంతుడు తన శక్తి సామర్థ్యాలను వివరిస్తున్నాడు.

\5/
*Mydocuments\
Bn Jan. o4.p65*



# శ్రీవిష్ణు మహాపురాణం

## 8వ అధ్యాయం

శ్రీ ఉ.వే. శ్రీమాన్ S.V. రంగరామానుజాచార్యస్వామి, రాజమండ్రి

### లక్ష్మీ వైభవ ప్రకాశిక

భగవతి అయిన లక్ష్మి ఈ భూమి అయితే, స్వామి ఈ భూమిని ధరించే 'భూధరం' (పర్వతం) పర్వతాలవల్లనే ఈ భూమి విశీర్ణం కాక గోలాకారంగా నిలచి ఉందని శాస్త్రజ్ఞుల అనుభవం. భగవానుడు సంతోషం, లక్ష్మి తుష్టి. ఏదైనా విషయాన్ని అనుభవించినప్పుడు కలిగే 'ఇది ఇంక చాలు' అనే పరితృప్తిని తృష్టి అని అంటారు. ఇలాంటి తుష్టి శాశ్వత మైనప్పుడు ఆ పరితుష్టి వల్ల మనస్సుకు కలిగే ఉల్లాసమే ''సంతోషం'' ఈ రెంటికీ అవినాభావం. శాశ్వత పరితుష్టి వలన కలిగే సంతోషమూ శాశ్వతమే. 'ఇచ్ఛ' అమ్మ కాగా 'కామం' భగవంతుడు. ఇచ్ఛాకామాలకూ అవినాభావం ఉంది.

సాధారణంగా ఏదైనా కావాలనే సామాన్యంగా కలిగే కోరిక ఇచ్ఛ. అది ఉత్కటమై అది లేనిదే బ్రతుకలేననే భావన కలిగినప్పుడు ఆ ఉత్కటేచ్ఛయే కామం అవుతుంది.

ఇక, యజ్ఞం స్వామి అయితే, ఆ యజ్ఞానికి ఫలయోగ్యతను కలిగించేది – యజ్ఞనిర్వహాకులకు ఇచ్చే దక్షిణ. అ దక్షిణాకమైన ఏ దేవకార్యమూ, యజ్ఞాదికం ఫలవంతం కాదు. కనుక యజ్ఞ దక్షిణలకు అవినాభావం. యజ్ఞంలో సమర్పించే 'ఆజ్యం' రూపమైన ఆహుతి అమ్మవారైతే, పురోడాశం (పిండితో చేసిన రొట్టె మొదలైనది) స్వామి అవుతున్నాడు. యజ్ఞంలో ఆజ్యాహుతి అగ్ని ప్రీతికరం కాగా, పురోడాశం దేవతా ప్రీతికరమై యజ్ఞప్రసాదం అవుతున్నది. ఈ రెండూ యజ్ఞాల్లో తప్పని సరిగా ఉండవలసినవే. పరస్పర సహచరితాలు. ఇక స్వామి 'ప్రాగ్వంశం' కాగా, అమ్మ 'పత్నీశాల' (ప్రాగ్వంశం అంటే హ విర్గృహానికి తూర్పున ఉండే యజ్ఞశాలగా చెప్పబడే గృహం దీక్షిత పత్నులుండేశాల పత్నీశాల) లక్ష్మీదేవి 'చితి' స్వరూపిణికాగా, శ్రీహరి 'యూప' స్వరూపుడు. (చితి అంటే ఉత్తరవేదికా స్థానం)

అలాగే స్వామి 'కుశ' స్వరూపుడుకాగా, లక్ష్మి 'ఇధ్మ' స్వరూపిణి. 'కుశ' అనేది దర్భవంటి ఒక రకపు గడ్డి. దీన్ని పవిత్రమైన వైదిక క్రియలో విశేషంగా వినియోగించడం ఉంటుంది. ఇధ్మమంటే 'సమిధ'. సమిధలు అగ్నిని వ్రేల్చడానికి, కుశలు, యాగనిర్వహణం చేస్తున్న ప్రదేశాన్ని ద్రవ్యాలను పవిత్రించే వస్తువులు. ఈ రెండూ యజ్ఞాది వైదిక కర్మల్లో అవినాభావాలు. అపరిహార్యాలు. 'సామ' స్వామి అయితే. 'ఉద్గతి' అమ్మవారు. (యాగాల్లో గానం చేసే రథన్తరం' మొదలైన

సామ గాన యుక్తాలైన మంత్రాలు. ఉద్గానం అనేది వీటిని గానం చేసే విధానం) యజ్ఞంలో వినియోగించే గానయుక్తమైన మంత్రం 'సామ'. దానికి కూర్చబడిన గాన విశేషమే ఉద్గతి అన్న సామగానంలో ఈ రెంటికీ (సామకు- గానానికి, అవినాభావం. లక్ష్మీ నారాయణులు ఈ రెండూ అవుతున్నారు. అగ్నిలో ఆయా దేవతలనుద్దేశించి ఆహూతాలను వేస్తూ, స్వాహా' కారం మంత్రానికి చేరుస్తారు. 'ఇంద్రాయ స్వాహా, వరుణాయ స్వాహా, అని ఇలా. ఈ స్వాహా శబ్దం చేత అగ్ని పత్ని కూడా చెప్పబడు తుంది. ఈ స్వాహాకారం లేనిదే మంత్రం వినియోజకం కాదు. ఇలా స్వాహాకారంతో మంత్రోచ్చారణ పురస్సరంగా సమర్పించే ఆహుతి అగ్నిలోనే. కనుక, ఆయనకు 'హుతాశనుడు' అని పేరు. హోతమ్ అశ్నాతి ఇతిహృతాశనః. హోమంలో వ్రేల్చ బడిన హవిర్ద్రవ్యాన్ని తానే సర్వదేవతల పక్షాన అగ్ని స్వీకరిస్తాడు కనుక, 'అగ్ని ముఖా వై దేవాః' అని శాస్త్రం చెబుతున్నది. ఇలా ఆహుతులను స్వీకరించే అగ్ని (హుతాశనుడు) స్వామికాగా, ఇలా సమర్పించేటప్పుడు వినియోగించే మంత్రానికి ఆ ప్రయోజకత్వాన్ని కలిగించే స్వాహాకారం అమ్మ అవుతున్నది. ఈ రెంటికి అవినాభావం. ఇక దేవతలలో ఉచ్చకోటికి చెందిన దేవతలలో గణ్యుడైన 'శంకరుడు' స్వామి అయితే ఆయనకు అర్ధాంగిగా మాంగల్యదాయిక అయిన ''గౌరీదేవి'' లక్ష్మీదేవియే అవుతున్నది. దీనిని బట్టి పుందేవతలంతా నారాయణ విభూతులైతే స్త్రీదేవతలంతా లక్ష్మీ విభూతులని వ్యక్తమవు తున్నది.

ఇక ఈ లోకానికంతటికీ వెలుగునిస్తూ నిత్యం ఆరాధింపబడే నారాయణ వ్యూహ స్వరూపుడైన సూర్యదేవత సాక్షాన్నారాయణుడే కాగా, అమ్మ లక్ష్మీదేవి సూర్యానపాయిని అయిన 'ప్రభ' అవుతున్నది. సూర్య-తత్ప్రభ లకు అవినాభావం కదా!

కనుకనే శ్రీరామాయణములో 'భాస్కరస్య ప్రభాయథా' అని రాముని భాస్కరునిగాను, సీతకు భాస్కర ప్రభగాను వాల్మీకి పేర్కొన్నాడు. ఈ భావమే ఈ శ్లోకాల్లో పరాశరుడు చెప్పాడు.

"చితిర్లక్ష్మీర్భార్యాప, ఇధ్మాశ్రీర్భగవాన్ కుశః ।
సామ స్వరూపీ భగవాన్, ఉద్గీతిః కువలాలయా॥
స్వాహా లక్ష్మీర్జగన్నాథో వాసుదేవో హుతాశనః
।శంకరో భగవాన్ శౌరిః గౌరీ లక్ష్మీర్ద్విజోత్తమ॥
మైత్రేయ కేశవః సూర్యః తత్ప్రభా కమలాలయా।

ఈ శ్లోకాలలోని అభిప్రాయమే పైన నిరూపింపబడింది.

**భక్తినివేదన చందాదారులకు విజ్ఞప్తి**

మీ సభ్యత్వమును ఒకనెలముందుగనే పునరుద్ధరించుకోగలరు. మీ చందానెంబరు మార్పును రేపరుపై గమనించి మాతో జరుపు ఉత్తర ప్రత్యుత్తరములలో క్రొత్త నెంబరు తప్పక సూచించగలరు. సభ్యత్వ రుసుమును ఎమ్.ఒ. లేదా డి.డి. విజయవాడలో ఏ బ్యాంక్ ద్వారా అయిననూ భక్తినివేదన, సీతానగరం అడ్రెన్‌కు పంపవచ్చును. భక్తినివేదనకు చెక్‌లు అనుమతించబడవు. - భక్తినివేదన -





# శ్రీమద్భగవచ్ఛాస్త్రవైశిష్ట్యమ్

శ్రీమాన్ రమాకాంతాచార్యస్వామి, హైదరాబాద్

అఖిలలోకముల సృష్టి, స్థితి, లయముల తన సంకల్పాను సారముచేయు పరమాత్మ సర్వేశ్వరుడు, శ్రీమన్నారాయణుడు. అనంతమైన కాలములో ఒక ప్రళయాంతమున వేదశబ్దము లుప్తము కాగా బ్రహ్మచే ప్రార్థింపబడినవాడై శ్రీపాంచరాత్ర దివ్యాగమమును ఉపదేశించినాడు. ఈ శాస్త్రమునకు పలువిధములైన పేర్లున్నవి. ఆగమము, తంత్రము, మోక్షశాస్త్రము, మహోపనిషత్, సాత్త్వతము, భాగవతధర్మము, ఏకాయనము, సర్వసిద్ధాంతము అని పాంచరాత్రమను శబ్దమును సంహితలు వివిధ రూపములతో నిర్వచించినవి. మహాభారతము-శాంతిపర్వమున

**"ఇదం మహోపనిషదం చతుర్వేద సమన్వితం**
**సాంఖ్యయోగకృతం తేన పాంచరాత్రాను శబ్దితం**
**నారాయణముఖోద్గీతంనారదోఽ శ్రావయన్మునిః"**

నాలుగువేదములతో గూడిన ఈ మహోపనిషత్తే శ్రీపాంచరాత్రమని, అది సాక్షాత్ శ్రీమన్నారాయణుని ముఖారవిందము నుండి వెలువడినదని, సాంఖ్యయోగసిద్ధాంత సమన్వితమని తెలియుచున్నది. శ్రీపాంచ రాత్రాగమ సంహితలలో యోగమునను సరించుచున్నట్లు స్పష్టము.

అలాగే సాంఖ్యముగూడ భారత ప్రమాణమును బట్టి అప్పటికే ప్రాచీనమై ప్రసిద్ధినందినట్లు తెలియుచున్నది. శ్రీపాంచరాత్రమున ఏకాయన మంత్రముల ప్రయోగము కాననగును... ఏకాయన శాఖగా యజుర్వేదాంతర్గతమైన కాణ్వశాఖయే ప్రసిద్ధమని ఈ క్రింది వచనమును బట్టి గ్రహింపవీలగును.

**"ఇయం శుద్ధ యజు శ్శాఖా ప్రథమేత్యభిధీయతే।**
**మూలశాఖేతి చాప్యుక్తా తథా చైకాయనీతిచ॥**

(ప్రథమ శాఖీయులుగా పాంచరాత్రులను వ్యవహరించుట గలదు.) ఈ పేర్లన్నీ శ్రీపాంచరాత్రమున ప్రసిద్ధములైన సాత్త్వత, జయాఖ్య, ఈశ్వర, పారమేశ్వర, పాద్మ సంహితలలో పేర్కొనబడినవి. ఇక పాంచ రాత్ర శబ్ద నిర్వచన విషయమున సంహితలు బహుతెరగుల సిద్ధాంతీకరించినవి. వాటిలో కొన్ని శ్రీపాద్మసంహిత

**"పంచేతరాణి శాస్త్రాణి రాత్రీయన్తే మహాన్త్యపి"**

అనే శ్లోకముతో ప్రారంభించి-సూర్య ప్రకాశములో చంద్రుడు, నక్షత్రములు కనిపించక మరుగున పడునట్లు శ్రీపాంచరాత్ర శాస్త్రముచే- సాంఖ్య, యోగ, బౌద్ధ, జైన-శైవశాస్త్రములు ప్రకాశహీనములై నవి. ''పంచత్వం జీవములేనివిగా అనియు తెలుపుచున్నది. పౌష్కర సంహితలో వేద, వేదాంత, పురాణ, సాంఖ్య, యోగమను ఐదువిధముల జ్ఞానమును ఒక పాంచరాత్రమే కలిగించుచున్నందున పై ఐదు అప్రకాశముగా చేయబడి పాంచరాత్రము సార్థకమైనదని

**"రాత్రి రజ్ఞాన మిత్యుక్తం- పంచేత్యజ్ఞాన నాశకం"**

అని అజ్ఞాన నాశకమైన శాస్త్రమగుటచే పాంచరాత్రమని శ్రీప్రశ్న సంహిత నిర్వచించినది. పంచభూతములు, పంచతన్మాత్రలు, అహంకారము, బుద్ధి, అవ్యక్తము అనునవి రాత్రివంటివని పాంచరాత్రజ్ఞాన ప్రకాశముచే రాత్రివంటి అజ్ఞానము తొలగజేయు చున్నందున పాంచరాత్రమని పరమ సంహితా సమర్థనము. శ్రీపాంచరాత్రమును ఆగమమని వ్యవహరిస్తారు. ఆగమనిర్వచనం- **"పరంపరయా ఆగచ్ఛతీత్యాగమః"** ఈ శాస్త్రమును గూర్చి శ్రీమద్భాగవతంలో ఉద్ధవునికి ఉపదేశించుచు

**"కాలేన నష్టా ప్రళయేవాణీయం వేద సంజ్ఞితా,**
**మయాదౌ బ్రహ్మణే ప్రోక్తా ధర్మో యస్యాం మదాత్మకః**
**తేనప్రోక్తా స్వపుత్రాయ మనవే పూర్వజాయగసా,**
**తతో భృగ్వాదయోఽ గృహ్ణన్ సప్త బ్రహ్మ మహర్షయః"**

అని తననుండి పరంపరగా విస్తరించిన విధానమును తెలుపబడినది.

భారతయుద్ధమున అర్జునుని ఉద్దేశించి స్వామి జ్ఞానయోగంలో

**ఇమం వివస్వతే యోగం**
**ప్రోక్తవానహ మవ్యయం।**
**వివస్వాన్ మనవే ప్రాహ**
**మనురిక్ష్వాకవేఽ బ్రవీత్॥**
**ఏవం పరంపరా ప్రాప్తమిమం రాజర్షయోవిదుః।**
**సకాలేనేహ మహతా యోగోనష్టః పరంతప! ॥**
**సఏవాయం మయాతేఽ ద్య**
**యోగఃప్రోక్తః సనాతనః॥**

అని భగవానుడు సనాతనమైన యోగమే నని స్పష్టపరచుటచే ఆగమ సంజ్ఞ స్పష్టమైనది. అంతే కాదు ప్రియభక్తుడైన అనిరుద్ధునికి ఉపదేశించుటవలన ఈ ధర్మము భాగవత ధర్మమైనది.

**"జ్ఞానామృతం భాగవతాయ భాషితం"** అని శ్రీశుకోక్తి.

**"ధర్మంచ మత్తో గృహ్ణీష్వ**
**సాత్త్వతం నామ నామతః**
**తేన స్పష్టం కృతయుగం**
**స్థాపయస్వ యథావిధి"** అని బ్రహ్మకు స్వామి ఉపదేశించి నపుడు ఇది సాత్త్వత నామక ధర్మమని ఉపదేశించుటచే సాత్త్వతశాస్త్రం అని సార్ధకం. దీనినే ఏకాంతి ధర్మమని భారతంలో తెలుపబడినది. మన పూర్వాచార్యులు అనుష్ఠించిన గృహతిరువారాధన క్రమం కూడా ఇలా ప్రారంభమగుచున్నది.

**"అథ పరమైకాన్తినో భగవదారాధన క్రమం వక్ష్యే, ప్రాతః ప్రబుధ్య, తీర్థ తీరంగత్వా, విధివత్స్నాత్వా, ఊర్ధ్వపుండ్రాణి ధారయిత్వా, నిత్యకర్మ పరిసమాప్య, గృహమాగత్య, పాదౌ ప్రక్షాళ్యాఽ చమ్య, దేవస్య సన్నిధి ముపగమ్య, ప్రణమ్య-నమోస్మదాచార్య పరంపరాభ్యో- నమో నమో భాగవత వ్రజాయ, నమో నమోఽ నన్త ముఖామరేభ్యః, నమో నమః శ్రీశ్రియఃపతయేనమః"** అని - దీనిని బట్టి ప్రపన్న శ్రీవైష్ణవులు ఏకాన్తి, పరమైకాన్తి ధర్మములనుష్ఠించు విధము తెలియదగును.

తంత్ర శబ్ద నిరుక్తి :-

**తతో విపుల సంజ్ఞానం, మత్ప్రతిష్ఠాది గోచరం.**
**త్రాణం చ కురుతే యస్మాత్ తస్మాత్ తంత్రమితీరితమ్॥**

పరమాత్మ ప్రతిష్ఠా విషయక జ్ఞానాన్ని రక్షించేది కనుక ఈ శాస్త్రము తంత్రమనబడును. అంతేగాక

**"తంత్రేణ తేన మార్గేణ యోమాం నిత్యం సమర్చయేత్,**
**తం త్రాయతీతి సంసారాత్ తంత్రమిత్యభిధీయతే"**

అని తంత్ర శబ్దం నిర్వచించబడినది. ప్రసంగ





వశమున జ్ఞాన, విజ్ఞాన, సంజ్ఞాన శబ్దములు భగవచ్ఛాస్త్రమున ప్రయోగింపబడినప్పుడు భగవద్విషయ జ్ఞానమే తప్ప సాధారణము గాదని తెలియవలెను.

**"విజ్ఞానం భగవద్జ్ఞానం తద్జ్ఞానాత్ ముక్తి రుచ్యతే"** అని పాద్మంలో చెప్పబడింది.

ఇలా శ్రీపాంచరాత్ర దివ్యాగమము శ్రీమన్నారాయణుని ముఖకమల నిసృతమై- నిత్యమై బ్రహ్మాది దేవతలకు, శాండిల్య, ఔపగాయన, మౌంజాయన, కౌశిక, భరద్వాజ, భృగు, వశిష్ఠాది బ్రహ్మర్షులకు- మను, ఇక్ష్వాకు ప్రభృతి శ్రీరామచంద్రుని వరకు-రాజర్షులకు, ఇక కలియుగానికొస్తే- ఈ శాస్త్రమును, విశిష్టాద్వైత, ద్వైతాఽద్వైత, ద్వైత, శుద్ధాద్వైత, భేదాఽభేదాది దార్శనిక సిద్ధావలంబులైన వైష్ణవులంతా ముక్తకంఠంగా పరమ ప్రమాణంగా అంగీకరించుచున్నారు.

మన పూర్వాచార్యులలో అందినంత వరకు భగవద్యామునమునులు ఆగమ ప్రామాణ్యమనే గ్రంధాన్ని రచించి సిద్ధాంత రక్షణగావించిన మహానుభావులు భగవద్రామానుజులు శ్రీభాష్యగ్రంధమున "ఉత్పత్యసంభవాత్" అనే అధికరణంలో శంకరుల వాదాన్ని ఖండించి శ్రీపాంచరాత్ర ప్రామాణ్యమును సుదృఢము చేసిరి.

ఆ తర్వాత పరాశర భట్టర్ ప్రభృతులు విశేష ప్రచారము-గ్రంధస్థం చేయుట ద్వారా ప్రామాణికతను చాటిరి. శ్రీమద్వేదాన్త దేశికులు పాంచరాత్రరక్షా గ్రంధమూలక ముగా ఆగమశాస్త్రము పరమ ప్రమాణము అని నిరూపించినారు. ఇట్లే మధ్వాచార్యులు బ్రహ్మసూత్ర భాష్యమున శ్రీపాంచరాత్రం-వేదములు- భారతము- రామాయణము శాస్త్రప్రమాణమునంగీ కరించిరి. ఇట్లే చైతన్య ప్రభువులు, శ్రీవల్లభాచార్యులు, నింబార్కరా చార్యులు రామానంద-శ్రీస్వామినారాయణ ప్రభృతులందరూ అంగీకరించుటేగాక- పాశుపతాది ఆగమాలు శ్రీమన్నారాయణుని ముఖతః వెలువడి రుద్రుని ద్వారా ప్రవర్తింప జేయుబడినవవటం జేసి శ్రీపాంచరాత్రా గమం నిరాకరించరానిదని ఉద్ఘోషించాయి (పరమశివుడుకూడా బ్రహ్మాదుల క్రమంలో **"అనన్తో, గరుడశ్చైవ, విష్వక్సేనః, కపాలభృత్''** ఉపదేశం పొందినట్లు విహగేంద్రసంహిత ప్రథమ పటలంలో తెలిపబడినది. అహిర్బుధ్న్య సంహిత రుద్ర ప్రోక్తముగా వచ్చును.) భగవచ్ఛాస్త్రము మూర్ధన్యమై- మోక్షైక ఫల లక్షణమై-

**"యథోక్తం కర్మకుర్వాణః"**

ప్రాప్నువన్తి పరంపదం- అని శాసించినది. అందలి సిద్ధాంత భేదాలను క్రమముగా తెలుసుకుందాం.



## ప్రథమ వర్ధంతి

**శ్రీ మొగళ్ళపు విద్యా సుగుణ పూర్ణచంద్రరావు**గారి ప్రథమవర్ధంతి (ది.**15-2-04 ఆదివారం)** సందర్భంగ, వారి కుమారులు, కుమార్తె భక్తినివేదన పత్రికకు కైంకర్యం సమర్పించినారు.

# కూరనాథ వైభవము

డా॥ పి.టి.జి. యతిరాజ సంపత్కుమారాచార్యులు, తిరుపతి

భగవద్రామానుజులకు అత్యంత సన్నిహిత శిష్యులు శ్రీకూరనాథులనబడెడి శ్రీవత్సాంక మిశ్రులు, వీరికి సాంప్రదాయికమయిన మరియొక తిరునామము ఆళ్వాన్. అనగా జ్ఞానియని అర్థము. వీరు కాంచీపురమునకు నాలుగుమైళ్ళ దూరమునగల కూరం అను శ్రీరామమిశ్ర–పెరుందేవి దంపతులకు కలియుగమునందు 4109 సం॥ సౌమ్య వర్ష పుష్య–మాసమున హస్తా నక్షత్రమునందు అవతరించిరి. అభిజ్ఞులు వీరిని శ్రీరామావతారునిగా అభివర్ణింతురు. వీరు తండ్రిగారినుండి వ్యాకరణ వేదాంత శాస్త్రములను అభ్యసించిరి. వీరి ధర్మపత్ని ఆండాళ్ కూడ విదుషీమణియే. కూరంగ్రామమున కంతయు వీరు స్వామియగుటచే వీరికి కూరనాథులని, కూరేశులని, కూరత్తాళ్వాన్ అనియు వ్యవహార మేర్పడెను. ఉత్తమపూర్ణులయొక్క లక్ష్మీకావ్యము నందును, గురుపరంపర, ప్రపన్నామృతము యందును, బాలధ్వని జగ్గు వెంకటాచార్యులవారి దివ్యసూరిచరితమునందును కూరేశుల చరితము తెలియవచ్చుచున్నది.

**ఆరాధనానాం సర్వేషాం విష్ణోరారాధనం పరమ్।**
**తస్మాత్ పరతరం ప్రోక్తం తదీయారాధనం నృప॥**

అన్ని ఆరాధనలలోను విష్ణువును ఆరాధించుట శ్రేష్ఠము. విష్ణువునారాధించుట కంటెను వైష్ణవులనర్చించుట ఉత్కృష్టమైదని భారద్వాజ సంహితయందు చెప్పబడినరీతిగా కూరనాథులు నిరంతరము భాగవత తదీయారాధనమునొనరించు చుండిరి.

భగవద్రామానుజులు శ్రీరంగమున వేంచేసి యుండి, విశిష్టాద్వైత సిద్ధాంతమును ప్రవర్తింప జేయుచుండగా, కూరమునందలి శ్రీవత్సాంక మిశ్రులయొక్క జ్ఞాన, భక్తి, వైరాగ్యములను విని వారిని శ్రీరంగమునకుగొని రావలసినదిగా వర్తమానమునంపిరి. భగవద్రామానుజుల ఆజ్ఞను శిరసావహించి కూరనాథులు సంపదల నన్నిటిని విడచి, భార్యతోడ శ్రీరంగమునకేగి, రామానుజుల నాశ్రయించి, వారిని భక్తిప్రపత్తులతో సేవించు చుండిరి.

పరమాచార్యులయిన యామునుల ఆదేశముగ రామానుజులు బ్రహ్మసూత్రములకు విశిష్టాద్వైత పరమయిన భాష్యమును రచింపదలచి, పూర్వాచార్యులైన బోధాయనులు బ్రహ్మసూత్రములకు విస్తారమయిన వృత్తిని రచించియున్నట్లును, దాని ప్రతి కాశ్మీరమునందలి శారదాభండారమున నిక్షిప్తమయియున్నట్లు తెలిసి, కూరనాథులనుగొని కాశ్మీరమునకేగిరి. కూరనాథులు బోధాయన వృత్తిని ఒక్కరాత్రి లోనే పూర్తిగానధికరించిరి. ప్రాంతీయ భేదములవలన వారాప్రతిని శ్రీరంగమునకు తీసుకురాలేక పోయిననూ, మహామేధావియైన కూరనాథుల స్మృతియందున్న ఆ గ్రంథమునాధారముగా భగవద్రామానుజులకు శ్రీభాష్యమును బోధాయన వృత్తిననుసరించి పూర్తియగునట్లు సహకరించి, శ్రీవైష్ణవ సిద్ధాంతమునకు మహోపకారము కావించి, ఆచార్యులకృపకు పాత్రులైనారు.

చోళమండలమునందలి శైవవైష్ణవ ద్వేషము లలో క్రిమికంఠచోళుని శైవాగ్రహము నుండి భగవద్రామానుజులను రక్షింపగోరి, కూరనాథులు తానే చోళుని ఆస్థానమునకు పోయి, విష్ణు పారమ్యమును ప్రతిపాదించుచు వాదమొనర్చిరి. మూర్ఖుడయిన క్రిమికంఠుడు తనను శిక్షింబోవగా తన కన్నులను తానే పెరికి ఇచ్చిన గొప్ప ఆచార్యనిష్ఠగలవారు కూరనాథులు. విశిష్టాద్వైత






దర్శనమును రక్షించుటకు తన దర్శనమునే (నేత్రములనే) త్యజించిన పరమవైరాగ్యశాలి వీరు. ఈ శైవ కలహలముచే శిష్యులు రామానుజులను శ్రీరంగమునుండి కర్ణాటదేశమునకు గొనిపోగా, ఆచార్యవియోగముననుభవించుచు కూరనాథులు 12 సంవత్సరములు మదురై సమీపమునందలి వనాద్రియందు సుందరబాహుస్వామిని సేవించుచు కాలమును గడిపిరి.

ఆ సమయమున వనగరీశుడైన సుందర బాహుస్వామినే ప్రత్యక్ష దైవముగా తలచి, భగవంతుని స్వరూపరూపగుణ వైభవములను కీర్తించుచు, శ్రీవైకుంఠస్తవము, అతిమానుషస్తవము, సుందరబాహు స్తవములను రచించిరి.

పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చా రూపములుగనున్న పరమాత్మయొక్క యథార్థ స్వరూపస్వభావములను వర్ణించు ఈ స్తోత్రములు శ్రీవైష్ణవసంప్రదాయమునందు అత్యంతో పాదేయములు. ఇందు శ్రీవైకుంఠ స్తవమునందు పరమపదనాథుడైన శ్రీమన్నారాయణుని గుణ గణములు, భగవదనుగ్రహమునొందు మార్గమును వివరించిరి. ఇది 101 శ్లోకములతో వసంత తిలకమను వృత్తమున మనోహరముగ రచింప బడినది. రెండవది అతిమానుష స్తవము. పరమాత్మ యొక్క విభవావతారము లైన రామకృష్ణాద్యవ తారములందలి మానవాతీతములైన దివ్యలీలలు, అద్భుతము లైన చేష్టితములను ఇందు 61 శ్లోకములలో వసంతతిలకవృత్తముననే అభివర్ణింప బడినవి. మూడవదయిన సుందరబాహు స్తవమునందు అర్చామూర్తి వైభవము, భగవంతుని దివ్యవిభూతియు వర్ణింపబడినవి.

12 సంవత్సరముల తరువాత శైవ విప్లవములు తీరి, క్రిమికంఠచోళుని మరణానంతరము భగవద్రామానుజులు తిరునారాయణపురమునుండి శ్రీరంగమునకు తిరిగివచ్చిరని తెలిసి కూరనాథులు శ్రీరంగమునకు పోయి ఆచార్యులను సేవించగా, రామానుజులు తన కారణముగ కూరేశులు నేత్రహీనులగుటకు చింతించి, కాంచీపురము నందలి వరదరాజ స్వామిని తనమాటగా ప్రార్థించి నేత్రములు పొందమని ఆదేశింప, కూరనాథులు కాంచీపుర మునకేగి వరదరాజ స్వామిని 100 శ్లోకములతో స్తుతించి, సదా దర్శనమును కోరిరి. వరదరాజ స్వామి హరితవారణ దాసుడను భాగవతునకు నేత్రదృష్టి యొసగినట్లు ఐతిహ్యము గలదని సుందరబాహు స్తవమున (126శ్లో.) కూరనాథులు కీర్తించి యుండిరి. వరదరాజస్వామి కూరేశుల ప్రార్థనను మన్నించి భౌతిక నేత్రదృష్టినిగాక వారడిగిన సదాదర్శనరూపమగు ముక్తిని అనుగ్రహించిరి. అదివిన్న రామానుజులు నేత్రములునీయ నందుకు వరదరాజుతో కలహించిరి. అటుపైన వరదరాజస్వామి కూరనాథుల కోరిక మేరకు కేవలము ఆచార్య దర్శనలాభమును మాత్రముననుగ్రహించిరి. అంతియే గాక కూరనాథులతోటి సంబంధము గలవారికందరికిని ముక్తినొసగితినని ఆనతీయ, కూరేశులతో ఆచార్యసంబంధము కలిగియుండుటచే తనకును ముక్తి లభించినదని భగవద్రామానుజులు కూడ కూరనాథులను కొనియాడిరి.

శ్రీభాష్య రచన ముగిసిన కొంతకాలమునకు తమ పుత్రులయిన వ్యాస, పరాశరభట్టరులను భగవద్రామానుజుల కైంకర్యమున నియోగించి, కూరనాథులు పరిపూర్ణభగవదనుగ్రహమును, ఆచార్యానుగ్రహమును పొందినవారై పరమపదమునధిష్ఠించిరి.

మహనీయులు ప్రాతఃస్మరణీయులైన శ్రీకూరనాథులు రచించిన పంచస్తవములను అనుసంధానము చేయుచూ కూరేశుల అభిమానమునకు అనుగ్రహమునకు పాత్రులై వారందరు ఉజ్జీవింపబడినవారేయగుదురు.

ఆచార్యతిరువడిగళే శరణమ్

# ఇతిహాసబోధ -20(1)

జ్ఞానమార్గంలో ప్రయాణించాలనుకునే జిజ్ఞాసువులైన సాధకులు తమ దారిని సక్రమంగా గుర్తించడంకోసం భగవానుడు ''అమానిత్వ, అదంభిత్వాది'' లక్షణాలను చిహ్నాలుగా మనకు అందజేసాడు. ఆసురీ, దైవీగుణ సంపత్తులలో ఏవి మనలో ఎంత అధికంగా ఉన్నాయో తెలియజేసేందుకున్న నిఖార్సైన పరీక్షలివి.

అమానిత్వాన్ని ఆశ్రయించుకొని అదంభిత్వ మున్నట్లే, అహింసను అంటిపెట్టుకొని ఉండే లక్షణం క్షాంతి. గత సంచికలో 'అహింస' తత్త్వాన్ని అర్థం చేసుకునేందుకు చిరుప్రయత్నం చేసాము. "క్షాంతి"ని గూర్చి మన అవగాహనను పెంచుకునేందుకు ఈ 'ఇతిహాసబోధ'ను ఉపయోగించుకునే ప్రయత్నం చేద్దాం.

సహనం లేదా ఓరిమిని మనం క్షాంతిగా సామాన్య అర్థంలో వివరించుకోవచ్చు. భావావేశాలను నిగ్రహించుకుని వర్తించడం "సహనం" యొక్క స్వభావం. ఈ "సహనాన్ని" కోల్పోయినప్పుడు వ్యక్తి మనోవాక్కాయముల ద్వారా ఇతరులను బాధించే హింసాప్రవృత్తికి లోనైపోతాడు. కనుక "అహింసావ్రతధారి"కి ఉండాల్సిన తప్పనిసరి నియమం "క్షాంతి" లేదా "సహనం" లేదా "ఓర్పు".

ఈ క్షాంతి మనలోని కష్ట సహిష్ణుతకు కొలమానం. మానసిక క్లేశాల రూపంలో, భౌతికమైన సమస్యల రూపంలో, తలెత్తే సమస్తమైన తీవ్ర ఒత్తిడులను తట్టుకోగలిగే "స్థిరత్వాని"కి సంబంధించిన సంకేతం – "క్షాంతి".

అయితే ఈ ఓరిమి యొక్క పరిధి ఎంత? ఏ విషయంలో ఎంత "ఓర్పు" ఉంటే అది దైవీగుణ సంపత్తి లేదా ''జ్ఞానం'' అనిపించుకుంటుంది? అసమర్థుని యొక్క చేతకాని తనంనుండి వ్యక్తమయ్యే నిష్క్రియాత్మకమైన నిస్సహాయస్థితిని ''సహనం''గా మనం గుర్తించగలమా? అనివార్యమైన వొత్తిడికి అణగారిపోతూ, తప్పించుకోవడానికి దారిలేనివాడు కూడా తనను తాను "సహనమూర్తి"గా భ్రమించి ప్రకటించుకునే అవకాశముంది కదా!

తాము ప్రతిస్పందించాల్సిన సమయం ఆసన్నమైందని నిర్ణయించుకొని సహనరేఖను దాటి దూసుకు వెళ్ళేవారి చర్యల సమంజసత్వానికి సంబంధించిన తీర్పుకు ప్రాతిపదికలేమిటి?

తొందరపాటు తనానికి, చేతకాని తనానికి, సహనానికి మధ్య ఉన్న అసలైన హద్దులను నిర్ణయించేదెలా? ఏఏ సందర్భాలలో ఏమేరకు "ఓరిమి" వహిస్తే అది భగవంతుడు మెచ్చే ''క్షాంతి''గా వ్యక్తమౌతుంది?

పరిస్థితుల ప్రాబల్యానికి తలవొగ్గి తాను వ్యవహరించిన తీరును అసహనంతో కూడిన "తొందరపాటుచర్య"గా గర్హిస్తారా? "చేతకాని తనం"గా ఈసడిస్తారా? లేక "క్షాంతి"గా ఆదరిస్తారా?– అనేవి జిజ్ఞాసువులైన సాధకుల ముందున్న కఠోర ప్రశ్నలు.





ఈ ప్రపంచమనే పెద్ద "పరిశోధన శాల"లో "పరమ సత్యాన్ని" అన్వేషించేందుకు తమ జీవిత కాలాన్ని ''ప్రయోగాల మయంగా చేసుకోదలచిన జిజ్ఞాసువులైన సాధకులకు ఈమేరకు సందేహాలుండడం సహజం.

ఈ సందేహాలకు సమాధానం వెతుక్కునేందుకు "వశిష్ఠ – విశ్వామిత్రుల స్పర్థ"ను – ఇతిహాసబోధ ద్వారా విశ్లేషించుకునే ప్రయత్నం చేద్దాం!

"బ్రహ్మ మానసపుత్రులు"గా ప్రసిద్ధికెక్కిన ఏడుగురు మహర్షులలో "వశిష్ఠుడు" ఒకడు. ఆయన మహాతపశ్శక్తి సంపన్నుడు. బ్రహ్మర్షి. మూడవ మనువైన ఔత్తమి మన్వంతరంలో ఆయన పుత్రులు ఏడుగురు 'సప్తర్షి మండలం'గా వెలుగొందారు. స్వయంగా వశిష్ఠుడు వైవస్వత మన్వతరంలోని 'సప్తర్షుల'లో ఒకడిగా ప్రకాశించాడు. అంతేకాదు, ఇదే మన్వంతరంలోని ఎనిమిదవ మహాయుగంలో "వేదవ్యాసు"నిగా అవతరించి "వేద విభజన" కావించిన మహానుభావు డాయన.

ఇక విశ్వామిత్రుడైతే, చంద్రవంశానికి చెందిన, కన్యాకుబ్జాధీశుడైన గాధిరాజు తనయుడు. జగత్ప్రసిద్ధుడైన పరశురాముని తండ్రి జమదగ్నికి మేనమామ. దేవేంద్రుని అనుగ్రహాన్ని పొందిన కుశికునికి మనుమడై "కౌశికుడి"గా ప్రసిద్ధికెక్కి, గాయత్రి మంత్ర ద్రష్టగా, బ్రహ్మర్షిగా,వైవస్వత మన్వంతరంలో ''సప్తర్షి మండలం''లో వశిష్ఠునితో పాటు తానూ ఋషిగా యశస్సు పొందిన మహాతేజస్వి విశ్వామిత్రుడు.

విధివిలాసంవల్ల బహుకాలం వీరిరువురి మధ్య సాగిన జగడం పురాణేతి హాసాలు ప్రస్తుతించేంత ప్రసిద్ధమైంది. ఆ క్రమాన్ని తెలుసుకునే ప్రయత్నం చేద్దాం.

అవి కన్యాకుబ్జాన్ని విశ్వామిత్రుడు పరిపాలిస్తున్న రోజులు. శత్రుభయంకరుడై, ధర్మాత్మునిగా రాజ్యమేలుతూ విశ్వామిత్రుడు ఒకసారి అక్షౌహిణీ సైన్యసమేతుడై భూప్రదక్షిణానికి బయలుదేరాడు. అలా ప్రయాణిస్తూ వాగులూ, వంకలూ, నదులూ, పర్వతాలూ దాటుకుంటూ వశిష్ఠుని ఆశ్రమం దాపుకు చేరాడు.

మరో "బ్రహ్మలోకం"లా, తాపసులతో, వన్యమృగాలతో కళకళలాడుతున్నది వశిష్ఠాశ్రమం. దేవ, దానవ, గంధర్వ, కిన్నెర, సిద్ధ, చారణాదులకెందరికో ఆ ఆశ్రమం తీర్థస్థానం. కందమూల ఫలాలను స్వీకరిస్తూ ఇంద్రియ జయాన్నికోరి, జప తపాదులతో సాధనచేస్తున్న ఋషులతో నిండిన ఆ ఆశ్రమానికి వెళ్ళాడు విశ్వామిత్రుడు. ఇరువురిమధ్య కుశలప్రశ్నల సంభాషణ సాగింది. పరస్పరం గౌరవంగా మంచి మాటలు మాట్లాడుకున్నారు. కొద్దిసేపయ్యాక విశ్వామిత్రుడు శెలవు తీసుకోవడానికి అనుమతినడిగాడు వశిష్ఠుడిని.

"ససైన్యంగా ఆతిథ్యాన్ని స్వీకరించమ'ని ఆత్మీయంగా బలవంతం చేసాడు వశిష్ఠుడు. కాదనలేకపోయాడు విశ్వామిత్రుడు. వశిష్ఠుడి వద్ద కామధేనువు పుత్రిక అయిన "శబళ" ఉన్నది. కోరినవాటన్నింటినీ సమకూర్చగల దివ్యశక్తి సంపన్నురాలు కావడంచేత, వశిష్ఠుడు కోరిందే తడవుగా విశ్వామిత్రుని సమస్త పరివారానికి షడ్రసోపేతమైన అద్భుతమైన విందును అప్పటికప్పుడే "శబళ" సమకూర్చింది.

ఆశ్చర్య చకితుడయ్యాడు విశ్వామిత్రుడు.

ఇంతటి పరమాద్భుతమైన శక్తి సామర్థ్యాలున్న గోవు తనలాంటి చక్రవర్తి దగ్గర ఉంటేనే సార్థకమౌతుందని నిర్ణయించుకొన్నాడు. 'శబళ'ను తనకప్పగించమని బేరం పెట్టాడు వశిష్ఠుడితో. వేల ఆవులిస్తానన్నాడు. బంగారంతో నిండిన 14వేల ఏనుగులిస్తానన్నాడు. 11వేల గుఱ్ఱాలనిస్తానన్నాడు.

వశిష్ఠుడు తిరస్కరించేకొద్దీ విశ్వామిత్రుడి పట్టుదలా పెరగసాగింది. కోటిగోవులను ఇస్తానన్నాడు. రత్నాలు, బంగారం ఏది అడిగితే అది ఇస్తానన్నాడు విశ్వామిత్రుడు. ఏది ఇచ్చినా ''శబళ''ను ఇచ్చేది లేదన్నాడు వశిష్ఠుడు.

అప్పటిదాకా ముఖానికి తగిలించుకొన్న గౌరవమర్యాదల తొడుగుల్ని తీసి ప్రక్కన పెట్టాడు విశ్వామిత్రుడు. "రాజునన్న అహం" విశ్వరూపం దాల్చి విఱ్ఱవీగింది. తనకోర్కెను తిరస్కరించినందుకు కోపంతో రాజు రగిలిపోయాడు.

నిర్లజ్జగా తిన్న ఇంటి వాసాలు లెక్కపెట్టడానికి సిద్ధమయ్యాడు. నట్టడవిలో పిలిచి భోజనం పెట్టినవాడినే నిలువునా దోచుకోవడానికి నడుం కట్టాడు. రాజాజ్ఞతో భటులు పశువును ఈడ్చుకెళ్ళే ప్రయత్నం చేసారు.

అక్షౌహిణి బలం చూసుకొని మిడిసి పడుతున్న రాజు దురాగతానికి తగిన బుద్ధి చెప్పడానికి వశిష్ఠుని అనుమతి తీసుకొని సిద్ధమైంది శబళ. పహ్లావులు, యవనులు, శకులు, కాంభోజులువంటి వీరులెందరినో శబళ సృష్టించి, విశ్వామిత్రుని సైన్యాన్ని సర్వనాశనం చేసింది. అదిచూచి విశ్వామిత్రుని కుమారులు వశిష్ఠుని వధించడానికి వెళ్ళి, అతని హూంకారానికి బూడిదయ్యారు.

తన పుత్రులకు సైన్యానికి పట్టిన గతిని తిలకించి నిశ్చేష్టుడయ్యాడు విశ్వామిత్రుడు. తగిన ప్రతీకారం చేయకుండా రాజ్యానికి మరలడానికి అతనికి మనసొప్పలేదు. మిగిలిన కుమారుడికి పట్టంకట్టి పరమశివుడిని ప్రసన్నం చేసుకోడానికి హిమాలయాలకు అటునుండి అటే వెళ్ళిపోయాడు.

ధనుర్వేదాధిష్ఠానదేవత, లయకారకుడు అయిన పరమశివుడిని తన ఘోర తపస్సుతో ప్రసన్నం చేసుకొని సాంగోపాంగంగా ధనుర్వేద రహస్యాలను తెలుసుకొన్నాడు విశ్వామిత్రుడు. దివ్యాస్త్ర శస్త్రాలతో ప్రతీకారేచ్ఛతో వశిష్ఠుని ఆశ్రమం మీదికి విరుచుకుపడ్డాడు.

అయితే వశిష్ఠుని బ్రహ్మదండం విశ్వామిత్రుని దివ్యాస్త్ర సంపత్తిని విఫలం చేసింది. మరొకసారి ఓడిపోయినందుకు విశ్వామిత్రుడు కుమిలిపోయాడు. వశిష్ఠుని మించిపోవాలంటే తానూ అంతటి కఠోర తపస్సు చేయాలని నిర్ణయించుకున్నాడు.

వశిష్ఠుడివలె తానూ బ్రహ్మర్షి కావాలనే పట్టుదలతో ఎన్నో విఘ్నాలకోర్చి, ప్రయాసలకు, భంగపాట్లకు గురై విశ్వామిత్రుడు చివరకు అనుకొన్నది సాధించడమే కాకుండా పరిపూర్ణ వికాసాన్ని పొంది, శ్రీరామచంద్రునికి గురువై, సీతారామ కళ్యాణం ద్వారా నిజంగా విశ్వానికి మిత్రుడు కాగలిగాడు విశ్వామిత్రుడు. ఈ విధంగా ఆయన కృషిచేసి సాధనకు, పట్టుదలకు ప్రతీకగా చరిత్రలో నిలిచి మానవాళికి మహోన్నత ఆదర్శమూర్తి అయ్యాడు.





అలాగే వశిష్ఠుని క్షాంతి కూడా ఎంతో ప్రశంసనీయమైనది. శబళగాని, తానుగాని, తమపై దురాగతానికి పాల్పడ్డ విశ్వామిత్రుడిని ససైన్యంతో, సబాంధవంగా వధించవచ్చు. లేదా ఏ రాయిగానో, రప్పగానో, రాక్షసుడివిగానో కమ్మని శపించవచ్చు. అంత శక్తి ఉన్నప్పటికీ వశిష్ఠుడాపని చేయలేదు. ఓటమితో తలవంచుకొన్న విశ్వామిత్రుడిలో మార్పును ఆశించాడాయన. ఆత్మరక్షణకే ప్రాధాన్యమిచ్చాడు తప్ప, ఎదుటివారి నాశనాన్ని కోరుకోలేదు.

విశ్వామిత్రుడు దివ్యాస్త్రాలతో దాడికి తెగపడినప్పుడు కూడా అదేవిధానం శత్రువుగా తనను భావించి నాశనం చేయడానికి సర్వశక్తులొడ్డి పోరాడినా, విశ్వామిత్రుడిని "శత్రువు"గా భావించక, అతనిని ప్రాణాలతో వదలిపెట్టడం, అతడి తప్పును అతడై తెలుసుకొనేటట్లు చేయడం-వశిష్ఠుడి క్షమాగుణానికి సంకేతం. అది శక్తివంతుడి "క్షమా విధానం"!

అయితే మనకథ ఇంతటితో ముగియలేదు. ఇది ప్రారంభ ఘట్టం మాత్రమే!

కారడవుల్లో, ముక్కు మూసుకొని దైవాన్ని తలుచుకొంటూ, కాలక్షేపం చేస్తూ, ఏదో వచ్చిన వాడికి ఇంత అన్నం పెట్టిన పుణ్యానికి 'విశ్వామిత్రుడు' పగ, ప్రతీకారం అంటూ తనను వేధించే యత్నం చేస్తే-సాధనా బలంచేత- ఎంతో కొంత ''క్షమ''ను ప్రదర్శించి తట్టుకోగలిగాడు వశిష్ఠుడు.

ఇదే వశిష్ఠుడు కొంతకాలం రాజ్యాలలోకి వెళ్ళి రాజులకు కులగురువై, పురోహితునిగా ఉండేవాడు. అప్పట్లో అతని ప్రవర్తన ఎలా ఉన్నది? అనేది మనం తెలుసుకోవాలి.

బ్రహ్మకు మానస పుత్రుడైన మరీచి మహర్షికి కశ్యపుడు, అతనికి వివస్వతుడు అతనికి శ్రాద్ధ దేవుడనబడే వైవస్వతుడు జన్మించారు. ఈ వైవస్వతుడే ఏడవ మనువు.

ఈ ఏడవ మన్వంతరంలో వైవస్వతుడు వశిష్ఠుడిని ఆచార్యునిగా స్వీకరించి పుత్ర సంతానార్థమై, "మైత్రావరుణ"మనే యాగం ప్రారంభించినప్పటినుండి వశిష్ఠునికి రాజాశ్రయం ప్రారంభమైంది.

ఈ వైవస్వత మనువు సంతానానికి వంశ పారంపర్యంగా ఆయన రాజగురువుగా, పురోహితునిగా బాధ్యతలు నిర్వహిస్తూనే ఉన్నాడు. ఈ బాధ్యతల నిర్వహణలో వశిష్ఠుని "క్షాంతి" పలుమార్లు పరీక్షకు గురైంది.

ఈ క్రమంలో వైవస్వతమనువుకు జన్మించిన ఇక్ష్వాకువు యొక్క రెండవ కుమారుడైన నిమితో వశిష్ఠుడు ఘర్షణ పడ్డతీరు ఎంతో ఆసక్తికరం.

నిమి చక్రవర్తికి నిరంతరం యజ్ఞాలను నిర్వహించాలనే అపేక్ష ఎక్కువ. కులగురువులైన వశిష్ఠుని ద్వారా ఆయన సశాస్త్రీయంగా పలు యజ్ఞాలు నిర్వహించారు. యజ్ఞాలను అనుష్ఠింపచేసి, చేసి అలసిపోయాడు గురువు. శిష్యునికి శ్రద్ధ ఏమాత్రం తగ్గలేదు. యజ్ఞ సంభారాలన్నీ సమకూర్చుకొని విశ్రాంతి తీసుకొంటున్న గురువుగారి వద్దకు వెళ్ళి యజ్ఞ నిర్వహణ బాధ్యత స్వీకరించ వలసిందిగా కోరాడు నిమి!

"చేసి చేసి అలసి ఉన్నాను. కొంత కాలం ఆగవయ్యా"-అన్నాడు వశిష్ఠుడు.

"ఆగితే ఎట్లా"? అంటాడు నిమి చక్రవర్తి!

"యముడు నాకు స్నేహితుడుకాడు! అతడు ఎప్పుడు పట్టుకు వెళతాడో తెలియదు! ఈ జీవితం స్థిరం కాదు. ధర్మమొక్కటే శాశ్వతం.

దానికోసం త్వరపడకపోవడం దోషం! మరణానంతరం కూడా సుఖాన్నిచ్చేది ధర్మమొక్కటే కదా!

రేపటి పనిని ఈరోజే ఆచరించేటట్లు త్వరపడాలి! అపరాహ్ణానికి చేయాల్సిన పనిని పూర్వాహ్ణానికే చేయాలి! మనిషి పనిచేసినా చేయకపోయినా మృత్యువు ఆగదు. అది తోడేలు గొఱ్ఱెపిల్లను కబళించినట్లు కబళిస్తుంది.

దానికి "ఇది ప్రియము, ఇది అప్రియము" అనే తేడా ఉండదు. ఏ క్షణాన బ్రతుకుంటే అదే బ్రతుకు! మరోక్షణం మనదౌతుందో కాదో తెలియదు. కనుక దేవతా ఋణాన్ని తీర్చుకోవడానికి సంభారాలన్నీ సమకూర్చుకొని త్వరపడుతున్నాను.

''మీరు యజ్ఞం నిర్వహించలేనంటే చెప్పండి! మరొక యాజకుడిని వేడుకుంటాను"- అన్నాడు వినమ్రంగా నిమి చక్రవర్తి.

వశిష్ఠుడికి నిమిచక్రవర్తి మరొక "యాజకుడి"ని చూసుకొంటాననేసరికి పట్టరాని కోపం వచ్చింది. "అంత మాటంటావా! నన్ను కాదని మరొక యాజకుడిని చూసుకొంటానన్న పాపానికి ఇప్పుడే విదేహుడవుకా''! అని శపించాడు. తెల్లబోయాడు నిమిచక్రవర్తి.

"పుణ్యకార్యం. చేసిపెట్టవయ్యా అంటే కాదు పొమ్మన్నావు! నీవు చేయవు! ఇతరులతో చేయించుకొంటానయ్యా అంటే నశించి పొమ్మని శాపనార్థాలు పెడతావు! నీవేం గురువువయ్యా! నీవు నాలాగే విదేహుడవుకా"! అని తిరుగుశాపం పెట్టాడు నిమి!

ఇరువురి మాటలూ ఫలించాయి. దేహాలు విడిచి జీవులిద్దరూ బ్రహ్మను చేరారు. మాట తొందరకు ఫలితమిది. బ్రహ్మ నిమికి ప్రాణుల కనురెప్పలను స్థానంగా చేసాడు. దానివల్ల ప్రాణులకు ''నిమిషము'' (ఱెప్పపాటు) ఏర్పడింది. (నిమి+శ=నిమి దీనియందు శయనించి విశ్రాంతి పొందాడు).

వశిష్ఠునికి మిత్రావరుణులనే జంట దేవతలకు కుమారునిగా పుట్టమని బ్రహ్మ ఆదేశించాడు. అగస్త్యునితో పాటు వశిష్ఠుడు పూర్వజన్మ స్మృతితో "కుంభ సంభవు"నిగా మిత్రావరుణుల తేజస్సును స్వీకరించి దేహధారి అయ్యాడు.

బ్రహ్మ మానస పుత్రునిగా అవతరించిన వశిష్ఠుడు "నిమి" చక్రవర్తి విషయంలో నోరు సంబాళించుకోలేక ఇచ్చిన శాపఫలంగా "కుంభ సంభవత్వం" లభించింది.

తన తొందరపాటుతనం ఎదుటివారితో పాటు తనకూ చేటు తెచ్చిపెడుతుందనే విషయం స్వయంగా అనుభవంలోకి రావడంతో వశిష్ఠుడు వాక్సంయమనంతో తపస్సాధన చేస్తూ విశ్వామిత్రుడిని "సహించే" పరిస్థితి ఏర్పడింది.

మనమాటను ఎదుటివాడు మన్నించేవరకే మనశాంతం. మన మర్యాద! మన సహనం. ఎదుటివాడు ఏమాత్రం మనల్ని తిరస్కరించినా మన అహంకారం దెబ్బ తింటుంది. క్రోధం నెత్తికెక్కుతుంది. శక్తివంతుడి విషయంలో ఇది మరీ ఎక్కువ. ఆ సమయంలో ప్రతీకారేచ్ఛతో బుసలుకొట్టే వైఖరి "క్షాంతి"కి సమాధి కట్టి, హింసకు పట్టాభిషేకం చేస్తుంది. 'వశిష్ఠ-నిమి' వృత్తాంతం - ఈ సత్యాన్నే చాటుతున్నది.

వశిష్ఠుని 'క్షమా' గుణానికి మరెన్ని పరీక్షలెదురయ్యాయో వచ్చే ఇతిహాస బోధలో! తెలుసుకుందాం!!





నచికేతుడు

-








# ఇది తెలుసుకుందాం!
## అవతార ప్రయోజనాన్ని అర్థం చేసుకుందామా!

గత సంచికలో మనం భగవదవతారాలు అనంతమని తెలుసుకున్నాం. అవతార తత్త్వాన్ని తెలుపుతూ 6 విభాగాలను గర్గసహిత తెలియపరచింది. అవి- 1) పరిపూర్ణావతారం, 2).పుర్ణావతారం, 3). ఆవేశావతారం, 4).కళావతారం, 5).ఆంశావతారం, 6).అంశాంశావ తారం- ఈ సంచికలో భగవదవతార ప్రయోజనాన్ని మరింత లోతుగా చర్చించే ప్రయత్నంచేద్దాం.

"ధర్మానికి గ్లాని సంభవించి అధర్మం విజృంభించినప్పుడల్లా సాధువులను రక్షించడానికి, దుష్కృతు లను దండించడానికి, ధర్మాన్ని స్థాపించడానికి తాను అవతరిస్తానని" భగవానుడు మనకు హామీ ఇచ్చాడు. దానితో మనందరికీ ఎంతో నిశ్చింత. మనకెప్పుడు కష్టం వచ్చినా, రక్షించడానికి దేవుడే దిగివస్తాడు కదా అనే ధైర్యం. రక్షిస్తానని హామీ ఇచ్చాడు కనుక ఎదో ఒక రూపంలో ఆయనే వచ్చి తన పని చేసుకు వెళతాడనే విశ్వాసం మన జాతి నరనరాల్లోనూ జీర్ణించుకు పోయింది. పర్యవసానంగా వివిధ అవతార మూర్తులకు గుడులు కట్టేసి ఆరాధనలు చేయడానికే జాతి ప్రధానంగా పరిమిత మైపోయింది.

భగవానుడు మన కోసం ఇచ్చిన హామీని గుర్తుచేసుకొంటూ భజనలు చేసుకోవడమే తప్ప. మన పక్షం నుండి స్వామి కోరుతున్న **"స్వకర్మణా తమభ్యర్చ్య"** అనే వికాసాన్ని గూర్చిన ఆలోచన చేయడాన్ని దారుణంగా మరచి పోయాము.

దైవం కోసం మనం నిర్వహించాల్సిన విధులను గూర్చిన చింతనను విస్మరించి, మన కోర్కెలను నెరవేర్చటమే దేవుని బాధ్యతగా నిర్ణయించు కున్నాము. దానితో ఎవరు మనల్ని కష్టాలనుండి కాపాడి, మన కోర్కెలను నెరవేర్చ గలుగుతారనే నమ్మకం ఏర్పడితే వారల్లా దేవుని అవతారమే అని నిర్ణయించేసి వారికో గుడికట్టి దండవేసి, దైవంగా మార్చి ఋణం తీర్చేసుకొనే స్థితికి భారతజాతి దిగజారింది.

తమలోని అంతర్గత శక్తుల ఔన్నత్యాన్ని గమనించి, వాటి వికాసం కోసం కృషి చేయక, కేవలం కోర్కెలను నెరవేర్చుకోడానికై పరిమిత మైన **"ఘరానా బిచ్చగాళ్లగుంపు"**గా జాతి దిగజారి పోయింది.

వేదభూమి, శ్రీరామ శ్రీకృష్ణాది అవతారాలు నడియాడి బోధించిన ధన్య భూమి, కర్మ భూమి, దేవతలు మానవులుగా జన్మించి తరించాలనుకొని తపించే ఈ పుణ్య భరత భూమి సంతానం వేలసంవత్సరాలు భయంకర దాస్యానికిలోను కావడానికి ప్రధాన కారణం- భగవంతుని సందేశాన్ని అర్థం చేసుకోలేక, ఆచరణలో పెట్టలేక పోవడమే!

**"అవతారతత్త్వ"** రహస్యాన్ని అర్థం చేసుకోక, అజ్ఞానంతో ప్రక్కదారి పట్టిన జాతి దుస్థితిని గమనించిన ఆర్యసమాజస్థాపకుడైన స్వామి దయానంద సరస్వతి తన **"సత్యార్థ ప్రకాశిక"** గ్రంథంలో అవతార సిద్ధాంతంపై ఆసక్తి కరమైన చర్చ చేసారు.

ఆయన **"అజఏకపాత్"**--- **"సపర్య గాచ్ఛుక్ర మకాయం"**--- అనే యజుర్వేద వచనాలను ప్రమాణంగాచూపుతూ

భగవానుడు జన్మ ఎత్తడని వాదించారు.

"భగవానుడు అవతరించకపోతే కంస రావణాది దుష్ట సంహారం ఎలాజరుగు తుంది?" అనే ప్రశ్నకు ఆయన సమాధానం ఇలా చెప్పారు.

"పుట్టిన ప్రతి ప్రాణీ మరణించక తప్పదు కదా! శరీరాన్ని ధరించకుండానే సృష్టిస్థితి లయాలను నిర్వహిస్తున్న భగవానుని ఎదుట కంసరావణాదులు ఎంత? క్షుద్రాతిక్షుద్ర కీటకంతో కూడా వారు సమానులుకాదు. సర్వవ్యాపకుడైన భగవానుడు కంసరావణాదుల శరీరంలో కూడా పరిపూర్ణంగా ఉన్నాడు. ఆయన సంకల్ప మాత్రం చేత మర్మచ్ఛేదనం కావించి వారిని నశింపచేయగలడు.

అనంతగుణ, కర్మ స్వభావుడైన పరమాత్మ ఒక్క క్షుద్రజీవుడిని వధించడం కోసం జనన మరణాలను స్వీకరించాల్సి ఉందా? అలా చెప్పేవారిని మూర్ఖులనక ఏమనాలి?

తనకు విధేయులై వర్తించే భక్తులను కాపాడే సమర్థతకూడా భగవంతునికి ఉన్నది. భూమిని, సూర్య, చంద్రాది జగత్తుల నెన్నింటినో సృష్టించి ధరించి పాలించే భగవానునికి కంసరావణాదు లను సంహరించే కార్యం పెద్ద పనా? ఈశ్వరునితో సమానుడైన వాడు ఎవ్వడూ లేడని'' అంటూ దయానందుడు తన సమకాలీన సమాజంలో బహుళ ప్రచారంలో ఉన్న అవతారతత్త్వానికి సంబంధించిన తప్పుడు అవగాహనను ఖండించాడు. వేదాన్ని ప్రమాణంగా విశ్వసించిన దయానందుడు ఆనాటి సామాజిక అజ్ఞానాన్ని ప్రక్షాళన చేసే క్రమంలో భాగంగా "అవతారతత్త్వం"పై తనదైన తార్కిక శైలిలో ప్రతిస్పందించారు.

దేహాన్ని ధరించక పోయినా సరే భగవానునికి దుష్టులను శిక్షించి, శిష్టులను రక్షించగల సమర్థత ఉందనే విషయంలో ఆస్తికులకెవ్వరికీ సందేహంలేదు. **జెనరేటర్** Generator (సృష్ట), **ఆర్గనైజర్** Organiser (పోషకుడు) **డిస్ట్రాయర్** Destroyer (లయకారకుడు) కనుకనే కదా ఆయనను "గాడ్" (God) అన్నారు. సృష్టి స్థితిలయాలకు సంబంధించిన భగవంతుని పూర్ణ శక్తికి ఏ దుష్టుడూ పరిమితిని విధించలేడు లేదా?

అలాంటప్పుడు అంతటా వ్యాపించిన భగవానుడు ప్రత్యేకంగా "మానవజన్మ"నెత్తి కర్మలను ఆచరిస్తాడా? అనే సందేహన్ని నివృత్తి చేస్తూ శ్రీ కృష్ణభగవానుడు భగవద్గీత లో

**"బహూని మే వ్యతీతాని – జన్మాని తవచార్జున**
**తాన్యహం వేద సర్వాణి – నత్వం వేత్థ పరంతప ।"**

**-4 అ॥3 శ్లో॥**

**అజోపిసన్నవ్యయాత్మా–భూతానా మీశ్వరోపిసన్**
**ప్రకృతింస్వామధిష్ఠాయ– సంభవామ్యాత్మమాయయా"**

**-4అ॥ 6 శ్లో॥**

"అర్జునా! నీకూ,నాకూ ఎన్నో జన్మలు గడిచాయి. అయితే అవన్నీ నాకుతెలుసు. నీకు తెలియదు. నేను పుట్టుకలేనివాడనూ, నశించని వాడనూ, సర్వభూతాలకు ఈశ్వరుడనూ అయినప్పటికీ నా అమోఘమైన సంకల్పం ద్వారా, నా ప్రకృతిని అధిష్ఠించి జన్మిస్తున్నాను" అంటూ తన ''దివ్యజన్మను'' గూర్చి ప్రకటించాడు.

అంతేకాక అర్జునునికి మరో పరమ రహస్యాన్ని ఈ సందర్భంగానే తేటతెల్లం చేసాడు.

**"జన్మ కర్మచ మే దివ్యం– ఏవం యోవేత్తి తత్త్వతః**
**త్యక్త్వా దేహం పునర్జన్మ– నైతి మామేతి సోర్జున"**

**-4అ॥ 9శ్లో॥**

"అర్జునా! ఎవరైతే నా దివ్య జన్మ యొక్క





దివ్య కర్మయొక్క తత్త్వాన్ని సక్రమంగా అర్థం చేసుకోగలుగుతారో,వారు దేహాన్ని విడిచిన తర్వాత మరల జన్మించరు".

ఎవరైతే నా **అవతార (దివ్యజన్మ) ప్రయోజనాన్ని, నా పని విధానాన్ని (దివ్యకర్మ)** సరిగ్గా అర్థంచేసుకో గలుగుతారో వారికి పునర్జన్మ ఉండదని స్వామి ఇంతగా స్పష్టం చేస్తుంటే కేవలం ఆయా కాలాలలో విజృంభించిన కొందరు దుష్టులను వధించి మరికొందరు శిష్టులను రక్షించే **"రక్షకుని"** విధికి మాత్రమే, (శాంతి భద్రతలకు సంబంధించిన విధికి) అవతారప్రయోజనాన్ని పరిమితంచేయడం, ఘోరమైన పొరపాటే అవుతుంది.

కేవలం ఆయాకాలాల భౌతిక సమస్యల పరిష్కారాలతో అవతార మూర్తుల కార్యం పూర్తి కాలేదు. అవతార మూర్తులైన శ్రీరామ కృష్ణాదులు తమ వర్తమాన సమాజ సమస్యల పరిష్కారానికే పరిమితం కాక భవిష్యత్ తరాలకు అందించగలుగుతున్న **"ఆధ్యాత్మిక ప్రేరణ"**ను మనం గమనించినపుడు అవతార ప్రయోజన విస్తృతి, లోతు ఎంతో ఉన్నదని మనకు బోధ పడుతున్నది.

భగవానుడు మొత్తం మనవాళిని తన భక్తులుగానే ప్రకటించాడు. వారి అవగాహనా స్థాయినిబట్టి వారు నాలుగు రకాలు 1.ఆర్తులు 2.అర్థార్థులు, 3. జిజ్ఞాసువులు, 4. జ్ఞానులు. ఈ విధంగా లోకమంతా ఎదో విధంగా ఏదో ఒకరూపంలో తెలిసో తెలియకో భగవానుని ఆరాధించేదే.

అయితే ఆ ఆరాధనంతా పరిమితులతో, షరతులతో, దోషాలతో, అస్పష్టతతో కూడు కున్నది. పుట్టుక, చావుల మధ్య ఉన్న జీవిత కాలాన్ని సద్వినియోగం చేసుకునే క్రమం తెలియని ''మనుష్యులు మూర్ఖత్వంతో, అవివేకంతో వ్యర్థమైన ఆశలతో, వ్యర్థమైన కర్మలతో, వ్యర్థమైన జ్ఞానంతో రాక్షస, ఆసురీ ప్రకృతి మోహంలో పడికొట్టుకు పోతుంటారు". పర్యవసానంగా ఈ మూర్ఖులు దుష్కృతులుగా తయారు కావడం వల్ల వారి జ్ఞానాన్ని " మాయ" హరించి వేస్తుంది. ఈ నరాధములు అసురీ భావాన్ని ఆశ్రయించి భగవానుని ఎప్పటికీ చేరలేరు".

**("మోఘాశా మోఘ కర్మణో – మోఘజ్ఞానాః విచేతసః**
**రాక్షసీం అసురీంచైవ – ప్రకృతిం మోహినీంశ్రితాః"**

**-9అ॥12శ్లో**

**నమాందుష్కృతినో మూఢాః – ప్రపద్యంతే నరాధమాః**
**మాయయాఽపహృతజ్ఞానా – ఆసురం భావ మాశ్రితాః"**

**-7అ॥ 15శ్లో)**

అంతటావ్యాపించి ఉన్న తన తత్త్వ అనుభూతిని అసురీ భావాన్ని ఆశ్రయించిన మానవులు పొందలేరని భగవానుడు స్పష్టం చేసాడు.

అసురీభావసంపన్నులు అధార్మికులుగా వర్తిస్తారు. వారికి దైవం పట్ల భక్తి విశ్వాసాలు ఉండవా? అంటే తప్పక ఉంటాయి. వారూ తపస్సు చేస్తారు. వారూ స్తోత్రాలు, పారాయణాలు, యజ్ఞ యాగాది కర్మలు ఎంతో నిష్ఠగా చేస్తారు. అయితే వారు చేసే వ్రత నియమాలన్నీ "దైవాన్ని" సంతోష పెట్టటానికి కాదు, తమ "అహంకారాన్ని" సంతృప్తి పరచు కోవడానికి.

అందుకోసమై వారు సాగించిన సాధన తీవ్రతను బట్టి వారు కోరిన వాటినీ భగవానుడు అనుగ్రహిస్తాడు. భగవదనుగ్రహం చేతనే అవి తమకు లభించినప్పటికీ ఆసురీ ప్రవృత్తిపరులు అవి తమ "విజయంగా" అహంకరిస్తారు.

భగవానుడు అందించిన లవలేశమంత

జ్ఞాన, శక్తి, బల, ఐశ్వర్య, వీర్య, తేజస్సులకు విఱ్ఱవీగి, తమ పరిసరాలపై "అహంకారపు ఆధిపత్యాన్ని నెలకొల్పే ప్రయత్నం చేస్తారు. ఈ పరిణామంలో వారు భగవానుడు తమపై ప్రసరింపచేసిన అనుగ్రహసంపత్తిని దుర్వినియోగం చేసుకొని లోక పీడకులుగా తయారౌతారు.

మరికొందరు మానవులు దైవీసంపత్తి కలవారై, ధార్మికులుగా, దైవీసేవకులుగా "సమగ్రజీవన వికాసం" కోసం కృషి చేస్తుంటారు. అట్టి సాధన చేసేవారే సాధువులు. "వారు జ్ఞాన తపస్సులచే పవిత్రులైన వారు. ఎప్పుడూ దైవభావంతో నిండినవారు. రాగము, భయము, క్రోధమును విడిచిన వారు దైవాన్ని మాత్రమే ఆశ్రయించడం చేత పవిత్రులైనవారు. కావడం చేత- నిశ్చితంగా దైవంతో వారికి పొందు ఏర్పడుతుంది".

**("వీతరాగ భయక్రోధా - మన్మయా మాముపాశ్రితాః**
**బహవో జ్ఞాన తపసా పూతాః మద్భావ మాగతాః**

**-4అ॥10శ్లో॥**

ఈ విధంగా భగవానుడు మరల లోకాన్ని (తన భక్తులను) రెండు వర్గాలుగా దైవీసంపత్తి కలిగినవారు, ఆసురీసంపత్తికలిగిన వారుగా విభజించాడు. వీరందరూ ఆయనను ఏవిధంగా అనుసరిస్తే వారిని ఆవిధంగా ఆయన అనుగ్రహిస్తున్నాడు.

తమ "అహంకారాలను" సంతృప్తి పరచుకోవడం కోసం దైవంపై భక్తి శ్రద్ధలను ప్రకటించి, దైవాన్ని చేరలేని ఆసురీ ప్రవృత్తి కలవారు కొందరైతే, దైవాన్ని సంతృప్తి పరచడం కోసం, దాసులై విధేయతతో వర్తించే సాధువులైన దైవీసంపత్తి కలవారు మరి కొందరు.

వీరిరువురి జీవనమార్గాల మధ్య ఏర్పడే సహజసిద్ధమైన స్పర్థలో తన అనుగ్రహాన్ని దుర్వినియోగం చేసుకొని ఆసురీ ప్రవృత్తి కలిగిన అధార్మికులు దైవానికి అవిధేయులై విజృంభించి సాధువులూ, ధార్మికులూ, తనకు విధేయులూ అయిన దైవీసంపత్తి కలవారికి గ్లానిని కలిగిస్తున్నప్పుడు. సాధు సంరక్షణార్థం భగవానుడు అవతరిస్తున్నాడు.

తన పంటను కాపాడుకోవడమనే లక్ష్యంతో కలుపుమొక్కలను తీసివేసే రైతులా భగవానుడు దుష్టశిక్షణం కావిస్తున్నాడు. సాధు సంరక్షణమనే ప్రధాన కర్తవ్యానికి దుష్టశిక్షణ కార్యం ఆనుషంగికం మాత్రమే.

సర్వభూతమహేశ్వరుడైన భగవానుని పరమ ప్రకృతిని నిరసించకుండా షరతులులేని సమర్పణ భావంతో ఆయన దిశగా సాధన సాగించే సాధువులంటే భగవానుడికి వల్లమాలిన ప్రీతి.

భగవదనుగ్రహ వియోగం క్షణకాలం సంప్రాప్తించినా, యుగ సహస్రాల పర్యంతంగా భావించి, వేదనతో తల్లడిల్లే తన భక్తుల కష్టాలను తనవిగా స్వీకరించి, వారికి రక్షకునిగా నిలబడడానికి త్వరపడే దయాంతరంగుడు కావడంచేతనే దైవం "అవతారధారణం" కావిస్తున్నాడు. సాధువులు ఆయనకోసం. ఆయన సాధువులకోసం.

సర్వవ్యాపి అయిన భగవానునికి పూర్ణ సమర్పణ కావించుకున్న ప్రహ్లాదుడు, శ్రీశుకుడు, నమ్మాళ్వార్ల వంటి సాధువులు చూపిన బాటలో నడవగలిగినప్పుడే అవతార ప్రయోజన మర్మం మనకు సుబోధకమౌతుంది. "మహాత్మభిః యేనగతః సపంథాః"- పెద్దలు నడిచినదే మంచిమార్గం"- అనికదా ఆర్యోక్తి!

మానసిక, భౌతిక సమస్యల వొత్తిడికి తట్టుకోలేని ఆర్తులకు, మానసిక, భౌతిక





సుఖాలను కోరుకునే అర్థార్థులకు, పరమ సత్యం దిశగా అడుగు వేయాలనుకునే జిజ్ఞాసువులకు, తమ అస్తిత్వాన్ని దైవానికి సమర్పితం చేసుకున్న జ్ఞానులకూ- అందరికీ భగవదనుగ్రహం కావాలి.

ఆ అనుగ్రహాన్ని అందించడానికి భగవానుడు విగ్రహరూపంలో, పశుపక్ష్యాదుల రూపంలో, చెట్టు పుట్టల రూపంలో, ఒకటేమిటి, సమస్త చేతనాచేతన పదార్థాలలో నిలిచి, స్వీకరించే యోగ్యతనుకూడా మనకు కల్గించటానికి సిద్ధంగా ఉన్నాడు.

ఆ దిశగా నడిచిన సాధువులు మాత్రమే భగవదనుగ్రహాన్ని అనుభవించగలిగారు. అనుభవించ గలుగుతున్నారు.

మనబోటి పామరజనానికి అంతటా తట పటాయింపే. మనమొలకబోస్తున్న ప్రీతిని చూచి నిజమే కాబోలనుకొని "మన సమర్పాణాసక్తి"కి దైవం చిన్న పరీక్షపెట్టి శోధిస్తే చాలు. క్షణకాలమోర్వలేక చిందుతు త్రొక్కుతూ మన కలవాటైన "అహంకారపు బురద గుంట"లో మునకలువేస్తూ గట్టిగా గగ్గోలుపెట్టేస్తాము.

భగవానుడు ఆదుకుందామని చాపిన హస్తాన్ని అందుకోవటానికి తిరస్కరిస్తూ, మనకు "పన్నీటి స్నానం" చేయించలేదని ఆయననే నిందిస్తుంటాం. దానితో భగవంతుడు మనల్ని బుజ్జగించి బురదగుంటనుండి బయటపడవేసే బాధ్యతను మన జీయరుస్వామివారి వంటి సాధువులకు అప్పగించారు.

మనల్ని తరింపచేయటానికై అంతటా వ్యాపించి ఉన్న భగవంతుని తత్త్వాన్ని దర్శించే మార్గంగా ''వికాసతరంగిణి''ని స్వామి వారు మనకందించారు. "అహంకారపు బురద గుంట"నుండి లేచి నిలబడి దైవం దిశగా అడుగులు వేసేందుకు ''వికాస తరంగిణి'' మనకు ఊతకర్రగా ఉపయోగ పడుతుంది.

మాధవసేవగా సర్వప్రాణిసేవ లక్ష్యంతో వికాసతరంగిణి ద్వారా మనం చేసే ప్రతిపనీ ''మాధవుని తృప్తికోసం'' తప్ప, మన "అహంకారపు తృప్తి"కోసం కాదన్న సత్యాన్ని గుర్తుంచుకొని మనం సాధన చేయాలి. అప్పుడే "అవతార ప్రయోజనం" అర్థమయ్యే యోగ్యత మనకు లభిస్తుంది. మరి ఈ దిశగా మన సాధనను కొనసాగిద్దామా!

**జై శ్రీమన్నారాయణ!**

**ముఖచిత్ర వివరణ:** జనవరి 26వ తేదీన శ్రీస్వామివారు ప్రారంభించబోతున్న జీయరు గురుకుల పాఠశాల భవన సముదాయాన్ని ముఖచిత్రంగా మనం చూస్తున్నాం. ఆదిలాబాద్ జిల్లా, అల్లంపల్లి గ్రామంలో గిరిజనుల కోసం ఈ పాఠశాల ప్రారంభం కాబోతున్నది. దట్టమైన అడవిలో రాకపోకల సదుపాయం కూడా సక్రమంగలేని ఊరది. వాగులు వంకలు దాటుకుంటూ ఈ ఊరిని చేరాలి. ఆర్థికంగా, సామాజకంగా కూడా బాగా వెనుకబడిన ప్రాంతం. కరెంటు సదుపాయం కూడా ఇప్పడిప్పడే రాబోతున్నది. నక్సలైట్ల ప్రభావం బలీయంగా ఉండటం చేత ప్రభుత్వచొరవ, పర్యవేక్షణ అంతంతమాత్రమే. ఇలాంటి ప్రదేశంలో గిరిజనుల అభివృద్ధికోసం 40లక్షల ఖర్చుతో ఈ పాఠశాలభవనాన్ని శ్రీస్వామివారు నిర్మించారు. ఇంకా 15 లక్షల ఖర్చు పెట్టవలసి ఉన్నది. ఈ భవననిర్మాణానికి అమెరికాలోని ప్రవాస భారతీయులు కూడ కైంకర్యాన్ని కావించారు.

ప్రతిష్ఠాత్మకంగా ఈ పాఠశాల భవనాల్ని నిర్మించి ఉన్నత విద్యావిలువలను గిరిజన బాలబాలికలకు అందించి, వారికి భవ్య జీవితాన్ని అందించాలని శ్రీస్వామి వారి సంకల్పం. వదాన్యులై వ్యక్తులు ఈ బృహత్తర కార్యక్రమంలో ఆర్థికంగా, హార్దికంగా భాగస్వాములై శ్రీస్వామివారి మంగళాశాసనాలను పొందాలని జీయరు ఎడ్యుకేషనల్ ట్రస్ట్ సొసైటీ తరుపున శ్రీమాన్ డా॥ జె. రామేశ్వరరావుగారు విజ్ఞప్తి చేస్తున్నారు.

# ఈనెల విశేషాలు

## వైకుంఠ ఏకాదశి : 3-1-04

సూర్యుడుత్తరాయణ ప్రవేశమునకు ముందున్న పూర్ణిమ ముందరి ఏకాదశి వైకుంఠైకాదశిగా నిర్ణయింపబడినది.

ఈ సంవత్సరము పుష్యమాసంలో వచ్చే శుక్ల ఏకాదశియే వైకుంఠ ఏకాదశి. ధనుర్మాసంలో వచ్చే ఈ ఏకాదశి విశేష ప్రదమైనది. ఈ పర్వదినంనాడు విష్ణ్వర్చనం మోక్షప్రదమైనది. వైకుంఠైకాదశి నాడు వైకుంఠద్వారాలు తెరచి ఉంటాయని, ఆనాడు భగవత్సేవానిమగ్నులైన భక్తులు వైకుంఠప్రాప్తి పొందుతారు. భగవంతుని సమీపంలో గడపడం అనే 'ఉపవాసం', భగవచ్చింతనతో జాగత్రం కావడం అనే జాగరణలతో, భగవత్ కథాశ్రవణాలతో వైకుంఠ ఏకాదశి ఉత్సవాలను ఆలయాలలో ఏర్పాటు చేస్తారు.

మధు, కైటభులనే రాక్షసులు వేదములను అపహరించుకొని, పాతాళ లోకమునకు చేరారు. బ్రహ్మవలన ఈ విషయం తెలుసుకొన్న శ్రీమహావిష్ణువు శ్రీమత్స్య సహిత హయగ్రీవ రూపంలో వెళ్ళి, సకిలించగానే వారు భయపడి పారిపోయారు. వారిని పట్టుకొని రాక్షససంహారం చేస్తాడు శ్రీమహావిష్ణువు. వేదాలను అపహరించడం వలన వారు మోక్షార్హతను కోల్పోతారు. వారికి మోక్షార్హతను కలిగించాలని, ప్రత్యేకంగా ఉత్తరదిశగా ఒక ద్వారమును ఏర్పాటుచేసి, ఆ ద్వారం గుండా ప్రవేశించ మని శ్రీమహావిష్ణువు చెబుతాడు. వారు ప్రవేశించిన ద్వారమే వైకుంఠద్వారము. ఈ వైకుంఠద్వార ప్రవేశం ఏకాదశినాడు జరిగినది కనుక వైకుంఠ ఏకాదశి అని పేరు వచ్చింది.

ఆనాడు భద్రాచలం వంటి ప్రసిద్ధ విష్ణు క్షేత్రాలలో వైకుంఠ ద్వారదర్శనం ఏర్పాటు చేస్తారు. ఆళ్వారులలో ఒకరైన నమ్మాళ్వారు, ఈ ఏకాదశి తరువాతి పంచమినాడు పరమ పదించినందున ఈరోజునుండి రాపత్తు ఉత్సవాలు జరిపి, పంచమినాడు నమ్మాళ్వార్ మోక్షోత్సవం జరపడం వల్లగూడ, దానికి నాంది అయిన ఈ ఆళ్వారులకి విశేష ప్రాధాన్యముంది. శ్రీరంగం, తిరుపతి మున్నగు క్షేత్రాలలో ఈ వైకుంఠ ఏకాదశిని గొప్ప ఉత్సవంగా జరుపుకొంటారు. ఈ నెల 3వ తారీఖునాడు వైకుంఠైకాదశిని జరుపుకొంటాం. మనం కూడా ఈ ఏకాదశి నియమాలను పాటిస్తూ శ్రీమన్నారాయణ అనుగ్రహ పాత్రులమై వైకుంఠప్రాప్తికి అర్హులమగుదుము గాక!

## శ్రీశ్రీశ్రీ పెద్దజీయరుస్వామివారి పరమపదోత్సవం : 4-1-04

శ్రీవైష్ణవ సంప్రదాయాన్ని, విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని, ఈమధ్యకాలంలో, అంటే, 11వ శతాబ్దంలో భగవద్రామానుజులు, 15వ శతాబ్దంలో శ్రీ మణవాళ మామునులు తర్వాత అంత విస్తృతంగ ప్రచారంచేసి, సామాన్య జనులకు గూడ ఆచరణ యోగ్యంగ అందించిన మహనీయులు మన శ్రీ పెద్దజీయరు స్వామివారే అంటే అది అతిశయోక్తికాదు.

1909లో అవతరించి, 1979వరకూ ఈ పుడమితల్లిని పునీతురాలను కావించి, సాత్విక యజ్ఞయాగాదులు జరిపే రీతిని లోకానికి ప్రకాశింపచేసి, వైదిక సత్సంప్రదాయాలను పునరుజ్జీవింప చేసినది మన స్వామివారు.







అందరికీ సంప్రదాయం, అందరిదీ సంప్రదాయమనే ఉమ్మడి భావనకు రూపుకల్పన చేసిన సమాజశ్రేయఃప్రదాత శ్రీ మన జీయరు స్వామివారు. శైవ, వైష్ణవ మతస్థులందరనూ ఒక త్రాటిపైకి తెచ్చి యజ్ఞములలో పాల్గొనచేయడం, గొప్ప, అల్ప వర్గాల వారినందరినీ చేర్చి పరస్పరము అంతరాల అడ్డుగోడలను అంతరింప చేయడం శ్రీ స్వామివారు సాగించిన కృషి ఫలితమే.

దళితజనోద్ధరణ, వారికీ దైవారాధన కల్పించుట, గృహ నిర్మాణాదులు చేయుట శ్రీవారి సమతావాదానికి నిదర్శనం.

దివ్యదేశ జీర్ణోద్ధరణ, తమిళనాట, ఆంధ్రావనిలోనూ ఆరంభంచేసిన ఘనత చాల దివ్య దేశాలు పునశ్శోభతో వెలుగొందు తున్నాయీవేళ అంటే అదికేవలం శ్రీస్వామి వారి చారిత్రక స్థలాల పరిరక్షణ, ఉద్ధరణలపై సాగించిన ఉద్యమముయొక్క ఫలితమే.

భారతభూమిలో, ఇప్పుడు వేదాలను సజీవంగ పోషించే వేదవిదులు విలసిల్లు తున్నారంటే, అది శ్రీవారి సంకల్పబలమే. శ్రీ పెద్దస్వామివారి వేదరక్షణ దీక్షను చూచి వేలసంవత్సరాల సుదీర్ఘ పీఠాలు, మఠాలూ ఇతర పీఠాధిపతులు, ఆ తర్వాత చాలకాలానికి హఠాత్తుగ మేల్కొని వేదాల పేరిట ఎన్నెన్నో కార్యక్రమాలు ప్రారంభించారు. శ్రీవారి ఆనాటి వేదరక్షణ సంకల్పబలమే ఈనాటికీ ఫలిస్తూ, మన జెట్ వేద పాఠశాలల రూపంలో, శాఖోపశాఖయై విలసిల్లుతోంది, విస్తరిస్తోంది. వారి సంకల్ప బలమే ఈనాటికీ శ్రీ చిన్న జీయరుస్వామి వారి ద్వారా ప్రపంచమునందంతటా సత్సంప్రదాయ పరిరక్షణ, పరిపోషణా కావిస్తున్నదని శ్రీవారు అనుగ్రహిస్తుంటారు.

సుమారు 80 సంవత్సరముల క్రితమే అత్యం ఆధునిక భావ సంపుటిని సమాజాని కందించిన ప్రాచీన – నవీన భావనా సమన్వయ సారథులు శ్రీశ్రీశ్రీ పెద్దజీయరు స్వామివారు. జ్ఞాన దేహముతో సదా మనమధ్యనే ఉండి వారు చూపిన మార్గాంలో మనలను నడిపిస్తుంటారు. ఆచార్యులకు మరణంలేదు. అయితే వారు మన మధ్య అంతర్ధానమై, భగవత్సన్నిధిలోనికి అడుగుపెట్టి యిప్పటికి 23 సంవత్సరములు అయింది. వారి పరమపదోత్సవం పుష్య శుద్ధ ద్వాదశీ తిథినాడు 4-1-04న వస్తుంది. వారినీ చరమతనియన్‌తో సమారాధించు కుందాం:

**అబ్దే సిద్ధార్థభిఖ్యే విశతి దినుమణౌ చాపరాశిం సితాయాం**
**ద్వాదశ్యాం పుణ్యతిథ్యాం దినకర దివసే కృత్తికాతారకాయామ్।**
**శ్రీమద్వేదాద్య సంస్థాపన పటుధిషణః సర్వ శాస్త్రర్థవేత్తా**
**శ్రీమన్నారాయణారో యతిపతి రతులః ప్రాప నిత్యాం విభూతిమ్.।**

## ఎంబార్ తిరునక్షత్రం : 8.1.04

ఆచార్య నిష్ఠను కలిగి ఉండడం అన్నది సామాన్య విషయము కాదు. ఆచార్యుల యందు పరిపూర్ణ విశ్వాసము కలిగి ఉండి, వారి కైంకర్యమునకు తమ జీవితములను అర్పించిన మహానుభావులు కొందరున్నారు. ఆచార్యనిష్ఠ వలన జగమంతా వారి నిత్య విభూతిగా, వెలుగుగా దర్శించి జీవితము లను ధన్యమొనరించుకొన్నవారున్నారు.

జగదాచార్యులైన రామానుజుల వారి కున్న శిష్యపరమాణువులలో గోవిందభట్టరు అటువంటివారిలో ఒకరు. వారి జీవిత విశేషాలే మనకి ఆచార్యనిష్ఠను కలిగించడానికి స్ఫూర్తి.

ఒకసారి గోవిందభట్టరు, ఆచార్యుల కేర్పరచిన శయ్యమీద, రాత్రిదానినమర్చిన తర్వాత, పడుకొని ఇటు అటు దొర్లుతున్నారు. అది చూచి అక్కడి భాగవతోత్తములు అలా చేయడం తగని పనికదా! నరకప్రాప్తి

కలుగుతుంది కదా! అని ప్రశ్నించారు. దానికి గోవిందభట్టరు, ఆచార్యులు శయనించు ప్రక్క వారికి ఇబ్బంది కలిగించకుండా, సుఖముగా నిద్రించడానికి అనువుగా గ్రుచ్చుకోకుండా ఉందో లేదో చూస్తున్నా! అలా వారికి సుఖంగ ఉంటే చాలుకదా! దానివలన నాకు నరకం ప్రాప్తించినా పర్వాలేదని చెప్పారు. వారికున్న ఆచార్య ప్రతిపత్తికి అక్కడి భాగవతోత్తములతో పాటు, రామానుజుల వారు గూడ ఎంతో ఆనందపడ్డారు.

ఇంకొకసారి నాలుకమీద ముల్లు గ్రుచ్చుకొని బాధపడుతున్న పాము నోట్లో చెయ్యి పెట్టి, ముల్లుని లాగివేసారు. అది ప్రమాదము కదా! పాముకరిస్తే ఏమై ఉండేదని ప్రశ్నిస్తే, ద్వయ మంత్ర ప్రభావము వలన పుష్కరిణిలో స్నానము చేసి, శ్రీరంగని కైంకర్యము చేసుకోవడమో లేక విరజానదిలో స్నానము చేసి పరమపదంలో స్వామి కైంకర్యము చేసుకోవడమో జరుగుతుందని సమాధాన మిచ్చారు. వారి విశ్వాసానికి, భూతదయకి రామానుజుల వారు సంతోష పడ్డారు.

ఒకసారి రామానుజులవారు స్వాములందరితో గోష్ఠిలో ఉన్నారు. అపుడా స్వాములు గోవిందులయొక్క జ్ఞాన, భక్తి, వైరాగ్యములను ఆచార్యనిష్ఠను పొగడు తున్నారు. గోవిందులు వారి పొగడ్తలకి అవునవునని వంతవలకడం ప్రారంభించారు. ఇది విన్న ఆచార్యులు తమని తాము పొగడుకోవడం నైచ్యానుసంధానమునకు విరుద్ధము కదా అని ప్రశ్నించారు. దానికి గోవిందులు క్షుద్రదేవతోపాసనలతో చెడి తిరుగుతున్న తనని తీసుకొచ్చి, తీర్చిదిద్ది, పెద్దలముందు నిలబడేటట్లు, వారుకూడ కీర్తించేటట్లు చేసిన ఆచార్యుల వారినే వారంతా ప్రశంసిస్తున్నా రని చెప్పారు. తమ అస్తిత్వపు ఔనత్యమంతా ఆచార్యులకే చెందుతుంది. అందుకే తన అంగీకారాన్ని తెలియజేసినట్లు చెప్పేరు. వీరి పారతంత్ర్యానికి అందరూ ఆశ్చర్యపడ్డారు.

ఒకరోజు గోవిందుభట్టరు ఒకవేశ్యాగృహ ముంగిట నిలచి ఉండడం చూసి, ఒక శిష్యుడు తమ గురువు గారితో ఈ విషయం చెప్పేరు. రామానుజులవారు వారిని ఇదేమిపని అని ప్రశ్నించారు. ఆ గృహములో దేవరవారి గుణగణములను కీర్తిస్తూ, నృత్య గీత వాద్యములు చెవులకింపుగా ఉండగా, తన్మయుడనయ్యానని సమాధానం చెప్పారు. ఆచార్య రూపగుణములనే నిరంతరం అనుసంధించుకొంటూ, తన్మయులైన గోవిందుని నిష్ఠకు రామానుజుల వారు సంతోషపడ్డారు.

గోవిందభట్టరుకు పెద్దలు బలవంతంగ వివాహం చేసారు. వివాహానంతరము సంసార జీవితము గడపవలసివచ్చినది. రామానుజులవారు గృహస్థాశ్రమ ధర్మము స్వీకరించమని పంపారు. కాని గోవిందభట్టరు తన భార్యకు జ్ఞానబోధచేసి, తిరిగి ఆచార్యుల సన్నిధికి చేరారు. ఆచార్య దివ్యమంగళ విగ్రహమే కనులు ముందు కదలాడుతూ ఉంటే, తనకి వెలుగే కాని, చీకటీ, ఏకాంతము లభించలేదు. అందుచేత తాను గృహస్థాశ్రమ ధర్మాన్ని స్వీకరించలేక పోయానని సమాధానమిచ్చారు. వీరి వైరాగ్యాన్ని గుర్తించిన భగవద్ రామానుజులు, వారికి త్రిదండ, కాషాయాదులననుగ్రహించి, తమ పేరులోని మొదటి చివరి అక్షరములను కలిపి **"ఎంబారు"** అను నామకరణమును చేసినారు.

ఈ 8వ తేదీ, పుష్యమాస కృష్ణపక్ష పాడ్యమి, పునర్వసు నక్షత్రాన వారి తిరునక్షత్రమహోత్సవం. వారి తనియన్‌ను ఇలా





స్మరించుకొని మనకూ అంతటి ఆచార్య నిష్ఠను, నిరాడంబరతను ఇమ్మని ప్రార్థిద్దాం!!

***తిరునక్షత్ర తనియన్:***

**పుష్యే పునర్వసు దినే జాతం గోవింద దేశికమ్।**
**రామనుజ పదాంభోజ ద్వంద్వ ప్రవణమానసమ్॥**
**రామానుజ పదచ్ఛాయాగోవిందాహ్వానపాయిని।**
**తదాయత్త స్వరూపా సాజియ్యాన్మద్వి శ్రమస్థలి॥**

## తిరుమళిశైయాళ్వారుల

### తిరునక్షత్రము 11.1.04

తిరుమళిశైయాళ్వార్ల తిరునక్షత్రము ఈపుష్యమాసంలో కృష్ణపక్ష చవితి గురువారం మఖా నక్షత్రమున వస్తోంది.

సాధారణంగా భగవద్దర్శన, స్పర్శన, సాన్నిధ్యముల కొరకు భక్తులు తపన పడడం చూస్తూ ఉంటాం. భగవంతుని అనుగ్రహ ప్రాప్తికొరకు ఎదురుచూస్తూ ఉండడం భక్తుల ఆర్తికి నిదర్శనం.

భగవంతుడు తమ హృదయమందిరంలో నిరంతరం ఉండి రక్షణ కలిగించాలని ఆరాట పడుతూ ఉంటారు. కానీ భగవంతుడే భక్తుని కొరకు తన వాసమును మార్చుకొని, అతని వెంట వెళ్లడం చాలా అరుదైన విషయం. తన హృదయంలో భక్తుని నిలుపుకోవడం మహా అద్భుత విషయం. అటువంటి అరుదైన అద్భుతాలతో నిండినది శ్రీ తిరుమళిశైయాళ్వార్ల చరిత్ర.

తిరుమళిశైయాళ్వార్లు మేదరవృత్తిలో నున్న దంపతులకు వెదురుపొదలలో లభించారు. బాలుడుగ పాలుత్రాగక, ఏడ్వక, మలమూత్ర రహితుడై దినదినాభివృద్ధి పొందుతు ఉండగా, సంతానములేని ఓ నిమ్నజాతి దంపతులు వచ్చి, శిశువుయొక్క దివ్యతేజస్సును చూసారు. వారు ఆశ్చర్యపడి శిశువును పాలుత్రాగమని ప్రార్థించారు. కొద్దిపాలు మాత్రం ఆ బాలుడు స్వీకరించి వదిలేశాడు. మిగిలిన పాలను ఆ వృద్ధదంపతులు స్వీకరించారు. వారవి త్రాగి యౌవ్వనం పొంది, 'కణికణ్ణన్' అనే ఒక సత్పుత్రుని కన్నారు. ఆ బాలుడికి సకల విద్యలు చెప్పించారు. నిరాహారంగా పెరిగిన ఆ శిశువే తిరుమళిశైయాళ్వార్లై లోకాన్ని ఉద్ధరించారు.

తిరుమళిశైయాళ్వారులు అనేక మత గ్రంథములను అధ్యయనం చేసారు. వేదాలనంగీకరించని ఆయా మతగ్రంథాల వలన వారికి ప్రయోజనం కనిపించలేదు. వారు ఆ మతగ్రంథముల నన్నిటిని నెత్తిమీద పెట్టుకొని సంచరిస్తూ ఉండేవారు. ఇలా ప్రయాణం సాగిస్తూ ఉండగా వారు ఒకరోజు ఒక వింత దృశ్యం చూసారు. పేయాళ్వార్లన బడు ఒక మహనీయులు ఒక చెట్టును తలక్రిందులుగా ఆకులు కొమ్మలు భూమిలోకి పాతి, వేళ్ళు గాలిలోకి ఉంచి దానికి నీళ్ళు చిల్లుకుండతో పోస్తున్నారు. ఇది చూసిన తిరుమళిశైయాళ్వారు 'ఇదేమి పిచ్చి పని దీనివలన ప్రయోజనమేమి' అని ప్రశ్నించారు.

అందుకు పేయాళ్వారు 'మీ నెత్తిమీదనున్న మతగ్రంథములోని విషయములను మీకు ప్రయోజనము కలిగిస్తాయని మీరు భావిస్తూ ఉండగా నేను చేస్తున్న పని ప్రయోజనం కలిగించదా' అని ప్రశ్నించారు. ఈ సమాధానం విన్న తిరుమళిశైయాళ్వారు వెంటనే పేయాళ్వార్ మహాజ్ఞానులని గ్రహించి, వీరి వల్లనే పరతత్త్వ నిర్ణయం కాగలదని భావించారు. వెంటనే వారి పాదములపై వ్రాలి తత్త్వనిర్ణయకో పదేశం చేయమని ప్రార్థించారు. అంత పేయాళ్వారు వారికి పంచసంస్కారములొనర్చి తత్త్వ నిరూపణం చేసారు. వీరు పుండరీకాక్షుడు, జగన్నాథుడు, శ్రియఃపతి అయిన నారాయణుని

హృదయమున ధ్యానిస్తూ తిరుమ ఓశైనందు వేంచేసి ఉండేవారు. ఇట్లు భగవద్ధ్యానము నందున్న వీరిని పరిక్షించవలెనని ఒకసారి పార్వతీ పరమేశ్వరులు వారిని ఏదైనా ఒక వరము కోరుకోమని అడిగారు. ఆళ్వారులు వెంటనే మోక్షమునియ్యగలరా? అని ప్రశ్నించారు. అది శ్రీమన్నారాయణుని వలనే సాధ్యమని తమవలన కాదన్నారు. అయితే తమకింకే కోరికా లేదని చెప్పారు.

ఆళ్వార్లు భగవద్భక్తిసారముగా కలవార గుటచే వారికి భక్తిసారులని బిరుదునిచ్చి వెళ్ళిపోయారు. శ్రీమన్నారాయణునియందు వీరికి ఉన్న విశ్వాసము అఖండమైనది.

మరొకసారి ఆకాశమార్గమున పోతున్న ఒక ఖేచరుడు బొంత కప్పుకొని, తులసి మాలను ధరించిన ఆళ్వారుని చూసాడు. వజ్రనిర్మితమైన వస్త్రమును, హారమును ధరింపమని ఇచ్చాడు. అంతట ఆళ్వార్లు తనుకప్పుకొన్న వస్త్రమును అమూల్యమైన మణులచే నిర్మించినదిగాను, మెడలోని తులసీపద్మాక్ష మాలలను, నవరత్న హారములుగను కన్పింపచేసెను.

కొంకణ సిద్ధుడనెడి రసవాది రసగుళికను సమర్పింపబోగా, వారు తమ శరీరమునున్న మట్టిని ఉండగా చేసి, విలువైన రసగుళికగా చూపించారు. భగవద్భక్తి కలవారికి భౌతిక సంపదలను పొందే శక్తి, అవకాశము ఉన్నా అవి వారికి తృణప్రాయాలని వీరు నిరూపించారు.

కణికణ్ణన్ భక్తిసారులను ఆశ్రయించాడు. ఒక వేశ్యవృద్ధకాంత భక్తిసారులను సేవించి వారి ఆశ్రమమున శుశ్రూష చేస్తూ ఉండేది. వారు ఆమె కోరికననుగ్రహించి, యవ్వవన మును ప్రసాదించారు. యవ్వనవతి, సౌందర్యవతి అయిన ఆమెను ఆ దేశపు రాజు వివాహమాడాడు. కాలక్రమమున ఆమె యవ్వనవతిగాను, రాజు వృద్ధుడుగాను అవ్వటం చూసి రాజు ఇదేమిటని ఆమెను ప్రశ్నిస్తాడు. తాను ఆళ్వారుల కటాక్షం వలన యవ్వనవతిగా ఉన్నానని తెలుపుతుంది. తనకి కూడా యవ్వనం కావాలనుకుంటాడు రాజు. 'కణికణ్ణన్'ని అడుగగా, తమ ఆచార్యులు భక్తిసారులను సేవింపమని చెప్తారు. ఐతే వారిని పిలుచుకొని రమ్మనమనగా, 'వారికి ఒకరితో పనిలేదు కనుక వారు రారు' అని సమాధానం చెప్తారు. రాజు, కణికణ్ణన్ని తనపై చక్కని కవిత్వము చెప్పమనగా భగవత్ భాగవత విషయములను తప్ప తన నాలుక ఇతరములు పలుకదని చెప్పాడు. రాజుగారికి కోపం వచ్చి దేశం నుండి వెళ్ళిపొమ్మని ఆజ్ఞాపిస్తాడు.

కణికణ్ణన్ ఆచార్యులను చేరి దేశమును వీడిపోవుటకు అనుజ్ఞ ఇమ్మని కోరగా, శిష్యుడులేని చోటు తనకు పనిలేదని ఆళ్వార్లు కూడా దేశం విడిచి బయలుదేరారు. అంతట అక్కడ వేంచేసి యున్న ... పెరుమాళ్ళుకూడా శేషపాన్పును చుట్టుకొని వారిని అనుసరించారు. పెరుమాళ్ళు భక్తుని అనుసరించడం పరమాద్భుతం కదా! రాజ్యములోని దేవతామూర్తులన్నీ అదృశ్యమయ్యాయి. దేశంలో ఉపద్రవాలు ప్రబలి పోవటంతో భీతిల్లిన రాజు కణికణ్ణన్ పాదములపై పడ్డాడు. అతడు ఆళ్వార్లను వేడుకొన్నాడు. దయతో వారంగీకరించారు. వారు తిరిగి రాగానే, అక్కడి పెరుమాళ్లను గూడ తిరిగి తన పడకను పరచు కొమ్మన్నారు. ఆ పెరుమాళ్ళతో మిగిలిన దేవతామూర్తులూ తిరిగి వచ్చారు. రాజూ తరించాడు. తిరువేఃకా అనే ఆ ఆలయంలోని పెరుమాళ్ళను 'శొన్న వణ్ణమ్ శెయ్తు పెరుమాళ్ళు' (చెప్పినట్లు చేసిన స్వామి) అని ప్రసిద్ధినొందారు.

\17/
Mydocuments\
Bn Jan. o4.p65



ఒకరోజు కొంతమంది పండితులు వేదం పారాయణ చేస్తూ తమ సమీపమునకు ఈ ఆళ్వారు వచ్చినపుడు వీరు నిమ్నజాతికి చెందినవారని వేదపఠమును ఆపివేసారు. వీరు అది గమనించనట్టు వారిని దాటి వెళ్ళినతరువాత వేదపఠనము కొనసాగింప ప్రయత్నింపగా వారికి తరువాతి భాగం గుర్తురాలేదు. అపుడు భక్తిసారులు వారికి నల్లని వడ్లగింజను చీల్చిచూపి, ఆ సంబంధిత వాక్యమును గుర్తు తెచ్చారు. వీరు సామాన్యులు కాదని, పరమ భాగవతోత్తము లని తెలిసి వారికి నమస్కరించి కృతార్థుల య్యారు. భగవదంశ సంభూతులకు తెలియని అంశమేముంటుంది!

కుంభకోణమున 'ఆరావముతు' పెరుమాళ్ళని ఆళ్వారు లేవమని ప్రార్థించి వారు లేవబోతూ ఉండగా ఆ సౌలభ్యమునకు ముగ్ధులై లేవవలదని ప్రార్థించారు. ఆనాటి నుండి ఆ స్వామికి ఉత్థానశయనులు అను తిరునామమేర్పడినది. అలా లేస్తూ కొంత తలయెత్తుకొని పరున్న స్వామిని సేవిస్తూ, వీరు "నాన్ముకన్తి రువన్దాది, తిరుచ్చన్ద విరుత్తము'' అను దివ్యప్రబంధములను వెలువరించారు. వీరు భగవంతునే ఆదేశించగల ప్రజ్ఞావిశారదులు కదా! ఈ విధంగా భగవంతుడే తన మాట వినేటట్లు చేసుకొన్న తిరుమ ఓశైయాళ్వార్లను ఈ శ్లోకంతో స్మరించి తరిద్దాం!

**తిరుమరిశైయాళ్వార్ల తిరునక్షత్ర తనియన్:**

**శ్లో॥ మఖాయాం మకరే మాసే చక్రాంశం భార్గవోద్భవమ్।**
**మహీసార పురాధీశం భక్తిసారమహం భజే ॥**

**శ్లో॥ శక్తి పంచమయ విగ్రహాత్మనే**
**శుక్తిసార జిత చిత్తహారిణే ॥**
**ముక్తిదాయక మురారి పాదయోః**
**భక్తి సారమునయే నమో నమః ॥**

## గోదారంగనాథుల కల్యాణం 14-1-04

సృష్టికి పూర్వమే స్వయం వ్యక్తమైన దేవాధిదేవుడు శ్రీరంగనాథుడు. బ్రహ్మదేవుడు ఆ స్వామిని అర్చించాడు. మూలపురుషుడైన ఇక్ష్వాకు మహారాజుకీస్వామి కులదైవం. నాటినుండి శ్రీరామచంద్రుని వరకు గల మహా చక్రవర్తులందరకు ఈ దేవుని పూజించి తరించినవారే. ఉభయకావేరీ మధ్యలో శ్రీరంగదివ్య క్షేత్రంలో విలాసంగా యోగనిద్రా ముద్రితుడై పరుండినదీయనే. అట్టి శ్రీరంగనాధుని భర్తగా చేసుకోవాలనుకున్నది గోదాదేవి.

ధనుర్మాసవ్రతమాచరిస్తూ, తాను రచించిన తిరుప్పావైలోని 30పాశురాలు రోజుకొక్కటి చొప్పున ఆశువుగ విన్నవిస్తూ స్వామికైంకర్యంలో ముప్పయి రోజులు గడిపింది. చివరకు రంగనాథుడు స్వప్నంలో కనిపించి వివాహమాడుతానని ఆనతి నిచ్చాడు. అలాగే సర్వభోగాలను ఆమె అనుభ వించిన ఆ రోజుకి **భోగి** అనే పేరు వచ్చింది.

రంగనాథుడు గోదాదేవిని శ్రీరంగంలో వివాహమాడుతానని శ్రీవిల్లిపుత్తూరులోనున్న శ్రీవిష్ణుచిత్తులవారి (గోదాదేవి తండ్రి)కి కబురు పెట్టాడు. స్వామివారి బంగారు పల్లకిలో వధువును కూర్చుండబెట్టారు. ఛత్రచామరాదు లతో, భేరీమృదంగాది మంగళవాద్యాలతో పెండ్లివారు తరలివెళ్ళారు. మార్గమంతా రంగురంగుల పుష్ప తోరణాలతో అలంక రింపబడింది. దేశప్రజ లందరూ శ్రీరంగం చేరారు. సప్తప్రాకారాలను అరటి చెట్లతో అలంకరించారు. నేల అంతా ముత్యాల ముగ్గులు పెట్టారు. శుభలగ్నంలో వధువును మంగళస్నానం చేయించారు. అనంతర మామె స్వామివారి సన్నిధిని చేరింది. శ్రీవైష్ణవ స్వాములు సంస్కృత ద్రావిడ దివ్యప్రబంధ

పారాయణ చేస్తూ వారివెంట వెళ్ళారు. ఆ పల్లకికిరువైపుల పెరియాళ్వారు (గోదాదేవి తండ్రి), మత్స్య ధ్వజ మహారాజు నడిచారు. ఆ ఊరేగింపు ప్రధాన ద్వారం ప్రవేశించగానే భవనాలనెక్కిన జనం మంగళ జలం కురిపించారు. ఇలా వధువు నవ్వప్రాకారాలకు ప్రదక్షిణం చేసి శంతనమంటపాన్ని ప్రవేశించింది.

శ్రీరంగపతి కూడ మంగళస్నానం చేసి, సర్వాలంకారాలను ధరించి వధువు రాక కెదురు చూడసాగాడు. సుముహూర్తంలో ద్విజ దేవతాగ్ని సన్నిధిలో రంగనాథుడు గోదాదేవిని పాణి గ్రహణం చేసుకొన్నాడు. రంగేశుని అర్ధాంగియైన గోదాదేవి శేషతల్పాన శయనించియున్న మూలవిరాట్టును చేరి సేవించడానికి చాల కుతూహలపడింది. రంగవిమానానికి ప్రదక్షిణ చేసి శేషశయ్యను సమీపించింది. శ్రీరంగనాథుని అద్వితీయ సౌందర్య లావణ్యాలను మనసార అనుభవించిన ఆ సాధ్వి శేషశయ్యనారోహించి తత్పాదమూలం చేరుకొన్నది.

ఇప్పటికీ అలాగే ప్రతి సంవత్సరం భోగినాడు శ్రీగోదారంగనాథుల కళ్యాణం జరుపుకొంటున్నాము. ఈ నెలలో 14వ తారీఖున వస్తోన్న గోదారంగనాథుల కళ్యాణ మహోత్సవమును మనము కూడా జరుపుకొని, ఆ పుణ్యదంతుల కరుణా కటాక్షములకు పాత్రులగుదుముగాక! వారిని ఈ శ్లోకంతో స్మరించుకుందాం!

**కర్కటే పూర్వ ఫల్గున్యాం తులసీకాననోద్భవామ్ ।**
**పాండ్యే విశ్వంభరాం గోదాం వందే శ్రీరంగనాయకీమ్॥**
**నీళాతుఙ్గస్తనగిరితటీ సుప్తముద్బోధ్య కృష్ణం**
**పారార్థ్యం స్వం శ్రుతిశత శిర స్సిద్ధమధ్యాపయన్తీ ।**
**స్వోచ్ఛిష్టాయాం స్రజి నిగళితం యా బలాత్కృత్య భుఙ్క్తే**
**గోదా తస్యై నమ ఇదమిదం భూయ ఏవాస్తు భూయః ॥**

## మకర సంక్రాంతి 15-1-04

సూర్యుడు మకరరాశిలో సంక్రమణం చేసే, అంటే ప్రవేశించే రోజును మకర సంక్రాంతి అంటారు.

ఈ సంక్రాంతి పండుగని మూడు రోజులు జరుపుకొంటారు. మొదటి రోజు భోగి. గోదాదేవి రంగనాథుని వివాహమాడి భగవానునుభవించిన రోజు కనుక భోగి అనే పేరు వచ్చింది.

రెండవరోజు సంక్రాంతి. శ్రీమహావిష్ణువు చేత పాతాళానికి త్రొక్కబడిన బలిచక్రవర్తి, తాను పాలించిన భూమిమీది ప్రజల సుఖసంతోషాలు చూడ్డానికి సంక్రాంతినాడు భూమీమీదకు వస్తాడట! సంక్రాంతి పురుషునికి స్వాగతంగా ఒక ఇంటినుండి మరో ఇంటికి ముగ్గుల రథాలు వేస్తారు.

వ్యవసాయదారులు సంవత్సరమంతా పడిన శ్రమకి ఫలితంగా పంటలు అందే సమయమిది. ధాన్యరాశులు, చెరుకుగడలు, పనసతొనలు, గుమ్మడిపళ్ళు, బంతిపూలు, రేగుపళ్ళు, గంగిరెద్దుల మేళాలు, గోపూజలు, బొమ్మలకొలువులు, కోడిపందాలు, నీటిలో పడవ పందాలు, హరిదాసుల ఆధ్యాత్మ రామాయణ గానాలు, భాగవతుల నగర సంకీర్తనలతో అందరి మనసులలో వెల్లివిరిసే ఆనందానికి ప్రతిరూపం ఈ సంక్రాంతి పండుగ.

మూడవరోజు కనుమ. కనుమనాడు పితృదేవతలకి తర్పణాలిస్తారు. ఇంటింటా వేసే రంగు రంగుల ముగ్గుల రథాలనెక్కి ఊరూర వాడ వాడలా ఊరేగుతూ ఇంటింటా సుఖసంతోషా సౌఖ్యాలు నిండాలని చల్లని చూపులు ప్రసరించాలని స్వాగత సుమాంజలి సమర్పించుదాం. ధర్మమార్గాన పయనిస్తూ, గీతాజ్యోతి వంటి మహోన్నత కార్యక్రమాలను





అందరం కలిసిమెలిసి నిర్వహించుకొనే సామర్థ్యం కలుగజేయమని ప్రార్థిద్దాం. ఈ నెల 14,15,16 తేదీలలో వచ్చే ఈపండుగలను అందరం కలసి మెలసి ఆనందంగా జరుపుకుందామా!

## శ్రీ తె.కం. గోపాలాచార్యస్వామి తిరునక్షత్రోత్సవం 19-1-04

"నాకు గురుదక్షిణ ధన రూపంలో ఎంత మీరిచ్చినా తృప్తిలేనేలేదు. మీరు నానుంచి సంపాదించిన విజ్ఞానాన్ని కనీసం ఒక్కొక్కరూ ఒక్కొరికయినా నేర్పి, మీ అంతవారుగ తయారు చేయండి. అదే నాకు తగిన గురుదక్షిణ. ఒక వేళ అలానేర్పే శ్రద్ధకలవారు దొరకరంటారా? అయితే వినండి – మీ శ్రీమతి మీమాట వింటారు గద! పిల్లలు వినవచ్చు. వినకపోవచ్చు. భార్య మీ మాటను గౌరవిస్తారు గద! వారిని కూర్చోబెట్టి, సమయం లభించినపుడే ఒక గంటో, రెండు గంటలో, పాఠం చెప్పేయండి".

రాజమహేంద్రిలో 45సం॥ క్రితం జరిగిన ఉభయవేదాంత శిక్షణ శిబిర సమాప్తిరోజు ముగింపు సందేశంలో వైకుంఠ వాసియైన శ్రీ గోపాలాచార్యస్వామివారు, తమవద్ద ఉభయ వేదాంత శ్రవణం చేసి ముగించుకొన్న పండితులందరినీ కోరిన కోరిక ఇది. నిరంతరమూ శాస్త్రాధ్యయనం చేయడం, అధ్యయన ప్రక్రియలో పాఠాలను బోధించడం, వీలయినన్ని గ్రంథాలను సామాన్యులకు అర్థం చేసుకొనేలా, శాస్త్రజటిల విషయాలతో తెలుగులో అందించడమే జీవత లక్ష్యంగ ఉండేవారు స్వామి.

జ్ఞాన వృద్ధులు తారసపడితే, తమ 70వ ఏటగూడ, వారి వద్దకు వెళ్ళి క్రొత్త విషయాలను గ్రహించే ప్రయత్నంలో వెనుకాడటంకానీ, సిగ్గుడపటంకానీ లేని నిరాడంబర ప్రవృత్తి శ్రీ గోపాలాచార్య స్వామి వారిది. ఉత్తర భారత దేశం, నేపాల్ దేశాలలో సుప్రసిద్ధ రామానుజ సంప్రదాయ ప్రవర్తకాచార్యులందరూ వీరివద్ద గ్రంథాలను అధ్యయనంచేసిన వారే. ముఖ్యంగ అయోధ్య, బృందావనం, బదరీనాథ్‌లలో ఉండి వీరు స్వయంగ అక్కడివారికి పాఠాలు చెప్పి సంప్రదాయ నిష్ఠులుగ తీర్చిదిద్దారు. బృందావనంలో పండితులందరినీ శిరో భూషణంగ చతుశ్శాస్త్ర విద్వాంసులుగ ఉంటూండే శ్రీరంగాచార్యస్వామి వీరివద్ద ద్రావిడ వేదాంతాధ్యయనంచేసి వీరికి "భగవద్విషయ గ్రంథ విచ్ఛేత్తా" అనే బిరుదాన్ని ప్రదానంచేసి తాము తరించామనుకున్నారట.

మన శ్రీచిన్నజీయరుస్వామి వారిని సంప్రదాయమార్గంలోనికి తెచ్చి శ్రీ పెద్దజీయరుస్వామివారి వద్దకు చేర్చి, ఆతర్వాత తామే 2 సం॥ తమవద్ద ఉభయ వేదాంతాలలో శిక్షణనిచ్చి జీయరులై, ప్రామాణికాచార్యులై అలరారేట్టు తీర్చిదిద్దారు.

మన భక్తినివేదనకు చివరివరకూ సంపాదకులై 1903లో అవతరించి 1996లో పరమపదమునకు పయనించిన శ్రీగోపాలాచార్యస్వామివారి తిరునక్షత్రం ఈ 19వ తేదీన వస్తోంది. వారిని ఆ శ్లోకంతో సంభావించుకుందాం.......

**శ్లో॥ పుష్యమాసే సితే పక్షే జ్యేష్ఠాయాం హరివాసరే**
**కందాడవంశే సంజాతం గోపాల గురు మాశ్రయే॥**
**శ్రీ రంగసింహగిరి దేశికపాదసేవా**
**ప్రాప్తాఖిల ద్రవిడవేద రహస్యజాతం ।**
**శ్రీ గౌతమాన్వయజ మాశ్రితభాగధేయం**
**గోపాలదేశిక మహం శరణం ప్రపద్యే ॥**

**భీష్మ ఏకాదశి ౨-౨-౦4 :**

మాఘమాసంలో పౌర్ణమిముందు వచ్చే ఏకాదశిని 'భీష్మ ఏకాదశి' అని అంటారు. భీష్మపితామహుడు అంపశయ్యపై ఉండి, ఈ ఏకాదశినాడే శ్రీవిష్ణు సహస్రనామస్తోత్రాన్ని లోకానికి అందించారు. అందుచేతనే ఈ ఏకాదశి విష్ణుసహస్రనామ జయంతికూడ. సర్వజీవులు, ఉజ్జీవించడానికి తెలియవలసిన తత్త్వమేది? ఎవరినిస్తుతిస్తే, అర్చిస్తే మానవులు కోరిన సుఖాలన్నీ పొందుతారని ధర్మరాజు భీష్ముడుని అడుగుతాడు. ఈ సర్వజగత్కారణ మైన సర్వలోకేశ్వరుడయిన శ్రీమన్నారాయణుని స్తోత్రము చేస్తూ, ప్రేమతో పూజిస్తే అన్ని దుఃఖములను దాటి పోవచ్చు. ఆ పుండరీకాక్షుని అర్చించడమే అన్ని ధర్మాలలోకి శ్రేష్ఠమైన ధర్మం. అతని నామాలు కీర్తిస్తే సకల పాపాలు పోతాయి. పవిత్రులౌతారు. దీనిని మించిన మంత్రం లేదు. ఋషులచే గానము చేయబడింది. శ్రీమన్నారాయణుని గుణముల ననుభవించిన ఋషులు, ఆ అనుభవసారంగ ఒక్కొక్కరు ఒక్కొక్క నామాన్ని కీర్తించి ఆనందించారు. అక్కడక్కడగల ఆ ఋషుల వాగామృతం కలిపి పరీవాహమై లోకములో మనం కూడా పాడ గలిగేటట్లు శ్రీవ్యాస భగవానుడు కృపచేయగా నేను దర్శించానని'' భీష్ములవారు శ్రీవిష్ణుసహస్ర నామవైభవమును గూర్చి వివరించి చెపుతారు. పాండవులతో పాటు శ్రీకృష్ణపరమాత్మకూడ వినడం చేత ప్రభావం ఎక్కువ. మహాభారత సారం, పరమఋషులచే దర్శితం, శ్రీభీష్మపితా మహుని అభిమతము, శ్రీవేదవ్యాస ఉపదేశలబ్ధము, భగవద్గీతకంటే శ్రేష్ఠం. ఎందరో ఆధునికులుకూడ ఇదే సకల శ్రేయస్సంధాయకమని స్వీకరించి నారు. ఈ విష్ణుసహస్రనామస్తోత్ర విరాట్ పారాయణని మన జగదాచార్యులు **"శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామి"** వారు ప్రతి సం॥ ఒక్కొక్క చోట కొన్ని లక్షల మందికి ఉపదేశ పూర్వకముగా అనుగ్రహిస్తున్నారు.

ఈసంవత్సరం భీష్మఏకాదశి శ్రీవిష్ణ సహస్రనామపారాయణను కార్యక్రమమును ఫిబ్రవరి 2వ తారీఖున విశేష కార్యక్రమముగా కాక, ఎక్కడివారు అక్కడే నిర్వహించుకొనమని శ్రీస్వామివారు సెలవిచ్చారు. మనమందరం కూడా మనకి సంబంధిత ప్రదేశాలలో జరిగే కార్యక్రమములో భాగస్వాములమై తరిద్దాం!





పరమహంస పరివ్రాజకులు

## శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి

### పర్యటనా వివరములు

| | |
|---|---|
| జనవరి 14 | ఖమ్మంలో గోదాకళ్యాణం. అనంతరం రాత్రికి హైదరాబాద్ శ్రీగోదాకళ్యాణ నిమిత్తం చేరుకుంటారు. |
| 15.1.17 | హైదరాబాద్‌లో వేంచేసి ఉంటారు. |
| 18.1.04 | శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారి సంస్మరణదినోత్సవము. సాయంత్రం గోపాలోపాయనం. రాత్రికి జహీరాబాద్ చేరుట. |
| 19.1.04 | జహీరాబాద్ ధర్మక్షేత్రము, రాత్రికి కామారెడ్డి చేరుట. |
| 20.1.04 | కామారెడ్డి ధర్మక్షేత్రము, రాత్రికి నిజామాబాద్ చేరుట. |
| 21.1.04 | నిజామాబాద్ ధర్మక్షేత్రము, రాత్రికి మునిరాబాద్ చేరుట. |
| 22.1.04 | మునిరాబాద్‌లో గీతాజ్యోతి కార్యక్రమంలో పాల్గొని మధ్యాహ్నం అరగుల్ గ్రామంలో దేవాలయ దర్శనం, రాత్రికి పోన్కల్ చేరుట. |
| 23.1.04 | పోన్కల్ దేవాలయ జీర్ణోద్ధరణకు శంఖుస్థాపన. అనంతరం పోచంపాడు కళ్యాణమండపం ప్రారంభం. రాత్రికి నిర్మల్ చేరుట. |
| 24.1.04 | నిర్మల్ ధర్మక్షేత్రము, |
| 25.1.04 | నిర్మల్‌లో సమాశ్రయణ కార్యక్రమము. అనంతరము రాత్రికి ఉట్నూరు చేరుట. |
| 26.1.04 | ట్రైబల్స్ స్కూల్ ప్రారంభోత్సవము- అల్లంపల్లి, రాత్రికి ఆదిలాబాద్ చేరుట. |
| 27.1.04 | ఆదిలాబాద్‌లో నర్సింగ్‌హోమ్ ప్రారంభోత్సవంలో పాల్గొనుట. రాత్రికి ఖానాపూర్ చేరుట. |
| 28.1.04 | ఖానాపూర్ ధర్మక్షేత్రము |
| 29.1.04 | గోదావరిఖని ధర్మక్షేత్రము, రాత్రికి కోరుట్ల చేరుట. |
| 30.1.04 | మెట్‌పల్లి ధర్మక్షేత్రము, |
| 31.1.04 | చొప్పదండి ధర్మక్షేత్రంలో పాల్గొనుట. |
| 1.2.04 | పోతుగల్ ధర్మక్షేత్రము |
| 2.2.04 | సిద్ధిపేట ధర్మక్షేత్రము, |
| 3.2.04 | సిద్ధిపేటలో ఆరాధన పూర్తిచేసుకొని బోధన్ ప్రయాణం. బాన్సవాడ V.T. ప్రారంభం. |
| 4.2.04 | బోధన్:- దేవాలయ ప్రతిష్ఠ. రాత్రికి హైదరాబాద్ చేరుట. |
| 5.2.04 | సంతోష్‌నగర్ ధర్మక్షేత్రము (హైదరాబాద్). |
| 6.2.04 | సంతోష్‌నగర్-సమాశ్రయణాలు. రాత్రికి మాసాబ్ ట్యాంక్. |
| 7.2.04 | మాసాబ్ ట్యాంక్ ధర్మక్షేత్రము |
| 08.2.04 | ఉదయం-ఆరాధన పూర్తిచేసుకొని పొన్నూరు ప్రయాణం. |
| 09.2.04 | పొన్నూరులో (శ్రీమాన్ క్రేన్ సుబ్బారావుగారు) శ్రీ ఆంజనేయస్వామి దేవాలయ కార్యక్రమం. సాయంత్రానికి వరాహపట్నం-కృష్ణాజిల్లా. |
| 10.2.04<br>11.2.04 | ఉదయం వరాహపట్నం ధర్మక్షేత్రం. రాత్రికి పెదనందిపాడు. |
| 12.2.04<br>13.2.04<br>15.2.04 | హైదరాబాద్‌లో V.T. & ఇతర సంస్థల శిక్షణా శిబిరం |

# గీతాజ్యోతి ధర్మక్షేత్రాల సమాచారం

### శ్రీవారు డిసెంబరు మాసంలో దర్శించిన ధర్మక్షేత్రాలు, జరిగిన సేవలు

| | | |
|---|---|---|
| 2. | మొత్తం ధర్మక్షేత్రాలు | 6 |
| 3. | గ్రామాలు | 886 |
| 4. | మొత్తం పశువైద్య శిబిరములు | 9 |
| | చికిత్సపొందిన పశువుల సంఖ్య | 3,505 |
| 5. | పశువైద్య శిబిరముల మొత్తం ఖర్చు | 28,400 |
| 6. | మొత్తం దంతవైద్య శిబిరములు | 3 |
| | చికిత్స పొందినవారు | 650 |
| 7. | దంత వైద్య శిబిరముల మొత్తం ఖర్చు | 6,135 |
| 8. | నేత్రవైద్య శిబిరముల సంఖ్య | 2 |
| | చికిత్స పొందినవారు | 1,160 |
| 9. | నేత్రవైద్య శిబిరముల ఖర్చు | 7,335 |
| 10. | సాధారణ వైద్య శిబిరముల సంఖ్య | 5 |
| | చికిత్స పొందినవారు | 8,275 |
| 11. | సాధారణ వైద్య శిబిరముల ఖర్చు | 1,53,750 |
| 12. | మొత్తం వాలంటీర్ల సంఖ్య | 5,705 |
| 13. | మొత్తం పని గంటలు | 3,80,530 |
| 16. | కార్యక్రమానికి అయిన ఖర్చు | 26,96,000 |
| 17. | గీతాజ్యోతి ప్రతిజ్ఞచేసినవారు | 53,000 |
| 18. | గీతాజ్యోతి సందేశం అందుకున్న భక్తులు | 3,55,000 |

### శ్రీస్వామివారు దర్శించిన మొత్తం ధర్మక్షేత్రాల వివరములు

| | | |
|---|---|---|
| 1. | ధర్మక్షేత్రాల సంఖ్య | 36 |
| 2. | గ్రామాల సంఖ్య | 4,336 |
| 3. | పశువైద్య శిబిరములు | 53 |
| | చికిత్స పొందిన పశువుల సంఖ్య | 39,407 |
| 4. | పశువైద్య శిబిరముల ఖర్చు | 9,98,300 |
| 5. | దంత వైద్య శిబిరములు | 52 |
| | చికిత్స పొందినవారు | 18,079 |
| 6. | దంతవైద్య శిబిరముల ఖర్చు | 2,61,435 |
| 7. | నేత్రవైద్య శిబిరముల సంఖ్య | 30 |
| | చికిత్స పొందినవారు | 9,106 |
| 8. | నేత్రవైద్య శిబిరముల ఖర్చు | 2,10,890 |
| 9. | సాధారణ వైద్య శిబిరములు | 39 |
| | చికిత్స పొందినవారు | 20,120 |
| 10. | సాధారణ వైద్య శిబిరముల ఖర్చు | 8,75,350 |
| 11. | వాలంటీర్ల సంఖ్య | 43,581 |
| 12. | పనిచేసిన గంటలు | 1,11,73,102 |
| 13. | కార్యక్రమమునకు అయిన ఖర్చు | 3,34,06,534 |
| 14 | ప్రతిజ్ఞ చేసినవారు | 8,86,000 |
| 15. | గీతాజ్యోతి సందేశం అందుకున్న భక్తులు | 55,61,100 |

### శ్రీ స్వామివారు దర్శించాల్సిన ధర్మక్షేత్రాలలో కూడ జరిగిన కార్యక్రమ వివరములు

| | | |
|---|---|---|
| 1. | ధర్మక్షేత్రాల సంఖ్య | 74 |
| 2. | గ్రామాల సంఖ్య | 7,250 |
| 3. | పశువైద్య శిబిరములు | 65 |
| | చికిత్స పొందిన పశువుల సంఖ్య | 33,527 |
| 4. | పశువైద్య శిబిరముల ఖర్చు | 1,67,747 |
| 5. | దంతవైద్య శిబిరములు | 124 |
| | చికిత్సపొందినవారు | 55,018 |
| 6. | దంతవైద్య శిబిరముల ఖర్చు | 7,14,870 |
| 7. | నేత్రవైద్య శిబిరములు | 55 |
| | చికిత్స పొందినవారు | 19,664 |
| 8. | నేత్రవైద్య శిబిరముల ఖర్చు | 5,55,100 |
| 9. | సాధారణ వైద్య శిబిరములు | 158 |
| | చికిత్స పొందినవారు | 55,911 |
| 10. | సాధారణ వైద్య శిబిరముల ఖర్చు | 29,81,195 |





# గీతాజ్యోతి ధర్మక్షేత్రాల సమాచారం

### మొత్తం ధర్మక్షేత్రాలలో ఇంతవరకు జరిగిన కార్యక్రమాలు

| | | |
|---|---|---|
| 1. | మొత్తం ధర్మక్షేత్రాలు | 110 |
| 3. | గ్రామాలు | 11,586 |
| 4. | మొత్తం పశువైద్య శిబిరములు | 118 |
| | చికిత్సపొందిన పశువుల సంఖ్య | 72,934 |
| 5. | పశువైద్య శిబిరముల మొత్తం ఖర్చు | 11,66,047 |
| 6. | మొత్తం దంతవైద్య శిబిరములు | 176 |
| | చికిత్స పొందినవారు | 73,097 |
| 7. | దంత వైద్య శిబిరముల మొత్తం ఖర్చు | 9,76,305 |
| 8. | నేత్రవైద్య శిబిరముల సంఖ్య | 85 |
| | చికిత్స పొందినవారు | 28,770 |
| 9. | నేత్రవైద్య శిబిరముల ఖర్చు | 7,65,990 |
| 10. | సాధారణ వైద్య శిబిరముల సంఖ్య | 197 |
| | చికిత్స పొందినవారు | 76,031 |
| 11. | సాధారణ వైద్య శిబిరముల ఖర్చు | 38,56,545 |
| 12. | మొత్తం వాలంటీర్ల సంఖ్య | 75,440 |
| 13. | మొత్తం పని గంటలు | 2,50,00,000 |
| 14. | మొత్తం పాఠశాలల సంఖ్య | 5,291 |
| 15 | విద్యార్థుల సంఖ్య | 7,15,260 |
| 16 | మొత్తం ఖర్చు | 3,80,00,000 |

# వరాహపట్నం గీతాజ్యోతిధర్మక్షేత్రం

## ఆహ్వానము

సభాస్థలి: –

**వరహాపట్నం గ్రామము, కృష్ణాజిల్లా**

పరమహంస పరివ్రాజకులు

**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి**

ప్రత్యక్ష పర్యవేక్షణలో...

**9.2.2004 సాయంత్రం 4గంటలనుండి "శోభాయాత్ర"**

**10.2.2004 ఉదయం 9గంటలకు ధార్మిక సదస్సు**

**"శ్రీకృష్ణ పూజలు, గీతాజ్యోతి ప్రతిజ్ఞ కార్యక్రమం"**

శ్రీవారి పర్యవేక్షణలో జరిగే ఈ ధార్మిక కార్యక్రమమునకు భగవద్బంధువులు వచ్చి శ్రీవారి అనుగ్రహభాషణము శ్రవణం చేసి మంగళాశాసనములు పొందవలసినదిగా కోరుచున్నారు.

**సంప్రదించవలసిన ఫోన్ నెంబరు: 08677 223711, 222043**



# బదరికాశ్రమంలో పునర్నిర్మించే సత్సంగసదనమునకు విరాళాలు సమర్పించిన దాతలు

**శ్రీమాన్ పాతాళం సుబ్బారావుగారి ద్వారా...**

**పోషకులు**:

శ్రీమతి పాతాళం అశ్వినీ కీర్తి – డోన్,

**జీవిత సభ్యులు**:

శ్రీమతి రాజీ రామలక్ష్మమ్మ – డోన్, శ్రీమాన్ పాతాళం సతీష్ కుమార్ – డోన్, శ్రీమాన్ పాతాళం నరేంద్రకుమార్ – డోన్, శ్రీమాన్ పాతాళం కల్పన – డోన్, శ్రీమతి మద్ది లీలామాధవ్ – డోన్, శ్రీమాన్ మద్ది తారక సుదర్శన్ – డోన్, శ్రీమాన్ అడికె మిధున్ కుమార్ – డోన్, శ్రీమాన్ అడికె హేమంత కుమార్ – డోన్, శ్రీమాన్ మహల్దార్ నీలోఫర్ – డోన్, శ్రీమాన్ మహల్దార్ హసీనా – డోన్, శ్రీమతి నందిగమ వెంకట సుబ్బలక్ష్మమ్మ – డోన్, శ్రీమాన్ నందిగమ నాగఉపేంద్ర – డోన్,

**శ్రీమాన్ ఎం.ఆర్.కె. ప్రసాద్‌గారి ద్వారా.**

**రాజపోషకులు :**

లేటు **శ్రీమతి మద్దె సుబ్బమ్మగారు** – గుంటూరు.

**జీవిత సభ్యులు:**

శ్రీమాన్ బి. రామచంద్రరావు & శ్రీమతి లక్ష్మికుమారి – గుంటూరు, శ్రీమాన్ మాజేటి హరికృష్ణ పూర్ణప్రసాద్ – గుంటూరు,

**అభిమానులు:**

శ్రీమాన్ టి. నాగేశ్వరరావు – గుంటూరు, శ్రీమాన్ టి. సుబ్బారావు – గుంటూరు, శ్రీమతి మోటే సత్యవతి, సతీష్ – బెంగుళూరు, శ్రీమాన్ అల్లా నాగేశ్వరరావు, విజయలక్ష్మి– గుంటూరు, శ్రీమాన్ బి.సి.కె. అనీల్ కుమార్ –బెంగుళూరు, శ్రీమాన్ ఎన్. ఎస్. కృష్ణమూర్తి, అహల్య – గుంటూరు, శ్రీమాన్ లేటు జె. వసుదేవరావు – గుల్‌బర్గా, శ్రీమాన్ మోటే రమేష్ ప్రసాద్ & మీన – బెంగుళూరు, శ్రీమాన్ ఎస్. నరేంద్ర – బెంగుళూరు, శ్రీమతి లేటు జి. లక్ష్మి సామ్రాజ్యం – గుంటూరు, శ్రీమాన్ కె.ఎ. రాంబాబు – గుంటూరు, శ్రీమతి పి. అంకమ్మ – గుంటూరు, శ్రీమాన్ అల్లా లోకనాథరావు – గుంటూరు, శ్రీమాన్ వి. గోపాల కృష్ణమూర్తి – గుంటూరు, శ్రీమతి మోటె ఇందిర– బెంగుళూరు, శ్రీమతి జి. పద్మావతి – గుంటూరు, శ్రీమతి ఎం. తిరుపతమ్మ – గుంటూరు, శ్రీమతి యల్లాప్రగట శకుంతలమ్మ – గుంటూరు.

**శ్రీమతి జి. సుబ్బరత్నంగారి ద్వారా...**

**అభిమానులు:**

శ్రీమతి కలిదిండి అన్నపూర్ణమ్మ–కంచుమర్రు, శ్రీమాన్ ఎస్. భూపాలరాజు–హైదరాబాద్, శ్రీమతి ఎస్.సత్యవతి–హైదరాబాదు, శ్రీమాన్ కె. నరేంద్ర వర్మ–హైదరాబాదు, శ్రీమతి బి. సీతారావమ్మ–విజయవాడ, శ్రీమాన్ ఆర్ శ్రీనివాసరావు–కృష్ణలంక, శ్రీమాన్ ఆర్ సంపత్‌కుమార్–కృష్ణలంక, శ్రీమతి పి.రాజేశ్వరి–విజయవాడ, శ్రీమాన్ ఎమ్. వంశీకృష్ణ–విజయవాడు, శ్రీమాన్ వి. జయకృష్ణ–సుభాకుమారి, శ్రీమాన్ వి. పవన్ నరేంద్రవర్మ–విజయవాడ, శ్రీమాన్ వి. శ్రీహరి, వేణుగోపాల్, సంధ్యాకుమారి–విజయవాడ, శ్రీమతి పి. మీనా–విజయవాడ, శ్రీమాన్ జి. అశోకవర్మ–విజయవాడ, శ్రీమాన్ ఎ. వెంకట రామరాజు–విజయవాడ, శ్రీమతి కె. కుసుమ కుమారి–విజయవాడ, శ్రీమాన్ వి. శివరామ కృష్ణ–ఏలూరు, శ్రీమతి కె. పద్మావతి–విజయవాడ, శ్రీమతి జి. సీతారావమ్మ–విజయవాడ, శ్రీమాన్ జి. మురళీకృష్ణంరాజు–విజయవాడ, శ్రీమాన్ ఎమ్. కృష్ణమోహన్–విజయవాడ, శ్రీమతి కె. సీతా స్వరాజ్యలక్ష్మి–విజయవాడ, శ్రీమాన్ కె. రోశయ్య–విజయవాడ, శ్రీమాన్ డి. సుబ్బారావు– విజయవాడ.





**ఆఫీసు ద్వారా :**

**పోషకులు: శ్రీమాన్ కె. సుందరరాజు–సిద్ధిపేట**

**శ్రీమతి కె. సుందరమ్మ–కరీంనగర్**

**జీవిత సభ్యులు :** శ్రీమాన్ బి.వి.ఎస్.ఆర్. వర్మ–తోరనెగల్లు, శ్రీమాన్ గంజి రాజమౌళి గుప్త–హైదరాబాదు, శ్రీమతి బి. వజ్రమ్మ– శ్రీమాన్ ఇందుకూరి శివరామరాజు– హైదరాబాదు, శ్రీమాన్ సిహెచ్. పూర్ణచంద్రరావు– శ్రీమాన్ పి. రమేశ్–బెంగుళూరు, శ్రీమాన్ పి. నాగరాజు, శ్రీలత–విజయవాడ, శ్రీమతి కె. కరుణ–హైదరాబాద్, శ్రీమతి అనూరాధ–విశాఖపట్నం, శ్రీమతి జి. శకుంతల–విశాఖపట్నం, కీ.శే. శ్రీమాన్ చిదానంద రంగనాథం–విశాఖపట్నం, శ్రీమాన్ డి. వెంకట వీరభద్రరావు, సత్యవతి–ఎ. అన్నవరం, శ్రీమాన్ డి. సురేష్‌బాబు–విశాఖపట్నం, శ్రీమాన్ కె. కామరాజు జయలక్ష్మి–విజయవాడ, శ్రీమాన్ బొప్పన భద్రయ్య, సత్యవతి–గుడివాడ, శ్రీమాన్ ఎ. గోపాలరావు, గోపిదేవి–గుడివాడ.

**అభిమానులు :** శ్రీమాన్ నల్లా కృష్ణమూర్తి– వైజాగ్, శ్రీమాన్ ఎ. అప్పారావు–విశాఖ, శ్రీమాన్ సిహెచ్. వెంకట్రావు–విశాఖపట్నం, శ్రీమతి సిహెచ్. వెంకటచల్లాయమ్మ–విశాఖపట్నం, శ్రీమాన్ సిహెచ్. చిరంజీవరావు–విశాఖపట్నం, శ్రీమాన్ ఎమ్. రఘురామరాజు–వైజాగ్, శ్రీమాన్ వి. శివహరికృష్ణ మృణాళిని–విజయవాడ, శ్రీమాన్ ఎమ్. ఋషికృష్ణ ఖాజీపేట, శ్రీమతి కె. జానకీదేవి–పెద్దగన్నూరు, శ్రీమాన్ వి. సీతారామయ్య, వరలక్ష్మి–మర్రెపాలెం, శ్రీమతి కట్టా సరస్వతి– ధవళేశ్వరం, శ్రీమాన్ మల్లా సాంబశివరావు– అనకాపల్లి, శ్రీమతి కె. పిచ్చెమ్మ–ఖమ్మం, శ్రీమాన్ అమరేంద్ర–ఖమ్మం, శ్రీమాన్ కె. రవికుమార్–తదివలస, శ్రీమాన్ కె.కృష్ణారావు–తదివలస, శ్రీమాన్ కె. చంద్రశేఖర్–తదివలస, శ్రీమాన్ ఎస్. వెంకటేశ్వర రావు–శ్రీకాకుళం, శ్రీమాన్ సి.హెచ్ లక్ష్మీనాథ్–శ్రీకాకుళం, శ్రీమాన్ ఎస్. ప్రకాశరావు– శ్రీకాకుళం, శ్రీమాన్ కె. అమరనాథ్–తౌగారన్, ట్రాన్స్ వరల్డ్ గరన్ట్(పి)లిమిటెడ్– శ్రీకాకుళం, శ్రీమాన్ పి. జగ్గయ్య–కనుగుల వలస, శ్రీమాన్ కె.ఎస్.ఎన్. రెడ్డి– శ్రీకాకుళం, శ్రీమాన్ జె. జగన్మోహనరావు–ఆముదాలవలస, శ్రీమాన్ పి.బి. రమణ–వనజంగి, శ్రీమాన్ వి.టి. చౌదరి– ఆముదాల వలస, శ్రీమాన్ పి. సత్యప్రాద రావు–పాలకొండ, శ్రీమాన్ వి. చంద్రమౌళిరాజు–శ్రీకాకుళం, శ్రీమాన్ కె.వి.ఎల్. సత్యన్నారాయణ, ఆముదాల వలస, శ్రీమాన్ ప్రకాశరావు–తగరపువలస, శ్రీమతి బి. నాగమణి–విశాఖపట్నం, శ్రీమాన్ సిహెచ్. ఎన్.ఎన్. మూర్తి–విశాఖపట్నం, శ్రీమతి శ్రీపెరంబుదూర్ లక్ష్మి–విశాఖ, శ్రీమాన్ ఆర్.వి.ఆర్.ఎస్. అప్పారావు–విశాఖ, శ్రీమతి డి. సుధారాణి–చిన్నబాదాం, శ్రీమతి ఎన్. ధనలక్ష్మి–వెంకనూరు, శ్రీమతి ఆర్. లక్ష్మి శ్రీనివాసరావు–చిలకలూరిపేట, శ్రీమతి సుంకరపల్లి నారాయణమ్మ–బొబ్బిలి, శ్రీమాన్ జయవరపు రామచంద్రరావు, పద్మావతి– వినుకొండ, శ్రీమాన్ దోసపాటి ఈశ్వరయ్య, భాగ్యలక్ష్మి–వినుకొండ,

శ్రీమాన్ బి. కోటేశ్వరరావు, సుజాత–వినుకొండ

శ్రీమాన్ ఎస్ రామరాజు– హైదరబాద్, శ్రీమాన్ ఎ. సుబ్రహ్మణ్యం, పార్వతి– గుడివాడ, శ్రీమాన్ సందీప్, శ్రీకల్యాణి–గుంటూరు, శ్రీమాన్ కె. నాగమనోహర రావు–గుడివాడ, శ్రీమాన్ ఎన్. లక్ష్మయ్య, మాణిక్యం–విజయవాడ, శ్రీమతి సన్నిధి సీతారామలక్ష్మి, భీమవరం.

న్యూస్

# ప్రచార వార్తలు

నవంబరు 27, 28 తేదీలలో శ్రీచిన్న జీయరుస్వామివారు తిరుమలలో వేంచేసి ఉన్నారు. ఆ సమయంలో మన మఠ అభివృద్ధి కార్యక్రమాలను సమీక్షించారు. అదే సమయంలో T.T.D. కార్యనిర్వాహకాధికారి శ్రీమాన్ అజయ్‌కల్లాంIAS, JEO శ్రీమాన్ బాలసుబ్రహ్మణ్యంగార్లతో సమావేశమై ఆలయవిషయంలో చెలరేగుతున్న లోపాల వివాదాల విషయంలో తమ సలహాల నందించారు. సుమారు 11నెలల క్రితం, అంటే గత జనవరి నెలాఖరులో 3 దినాలు సమావేశమై ఎన్నో సంస్కరణలను చర్చించి, తీసుకోవలసిన చర్యల గురించి ఒక లిస్టు తయారు చేసారు. దానిని సవ్యంగ అమలు పరచే విషయంలో ఇంకా చాల జాప్యం జరుగుతోంది. కొన్ని అమలు పరుస్తున్నామని అధికారులంటున్నా వాస్తవంలో అవి జరగటంలేదు. ఈ విషయంలో శ్రీస్వామివారు అధికారులను హెచ్చరించారు. అందులో కొన్ని:

1. భక్తులు ఎక్కువగ ఉన్నారు కనుక వారి దర్శనాలు పూర్తయ్యేంత వరకు శ్రీశ్రీనివాసునికి శయనోత్సవం జరుగదు. రాత్రి గం.2.45కి అప్పటి దాక ఆలయ డ్యూటీ చేసిన అర్చకులు 'శాస్త్రార్థము' ఏకాంతసేవ తంతు ముగించి, బయటకు వచ్చి, బంగారు వాకిలి తలుపులు దగ్గరగ చేరుస్తారు. అప్పటికే తరువాతి డ్యూటీ సుప్రభాత సేవ చేసే అర్చకులు అక్కడకు వచ్చి ఉంటారు. రాత్రి డ్యూటీ అర్చకులు వెళ్ళగానే, తరువాతి వారు, వేద పండితులూ సుప్రభాత సేవను ప్రారంభిస్తారు గం.3.00కి. ఇలా రాత్రి అసలు దేమునికి శయనోత్సవము జరుగుతున్నా నామమాత్రంగానే ఉంది. ఇది తగదని శ్రీస్వామివారు చెప్పారు. దేమునికి నిద్రయేమిటి అనేది కొందరు దేవస్థాన ఆగమ సలహాదారుల వాదన. దేమునికి, ఆయన సహజరూపంలో, విశ్వవ్యాప్తమై ఉన్నపుడు ఆరగింపులు, నిద్రాదులు మనం అర్పించే అవసరంలేదు. కానీ ఆలయంలో అర్చామూర్తిగా వచ్చినది మనకోసమని, మానవులకు చేసే ఉపచారాలన్ని యధావిధి జరగాలని, తల్లి తన పిల్లల విషయంలో చూపేటంత శ్రద్ధ ఆలయంలోని అర్చామూర్తి విషయంలో చూపాలని ఆగమాలు, సంప్రదాయము నిర్దేశిస్తున్నాయి.

ఈ రెంటిపై విశ్వాసమున్న వారే ఆలయ విధులు నిర్వహించాలి. అదిలేనివారు వాటిలో వేలుపెట్టరాదు. అర్చకులు, అధికారులు విశ్వాసమున్నవారైతే, సంప్రదాయపద్ధతులను పాటించాలి. లేనివారు వాటిలో తలదూర్చ తగదు. ఆ సేవ అవసరమా, కాదా? దేమున కది అవసరమా? లేదా? ఇలాంటి ప్రశ్నలు ఈ విషయంలో పనికిరావు. రాత్రి తప్పని సరిగా విశ్రాంతినివ్వాలి. అవిగూడ పూర్వమున్న రీతిలో తాళము వేసి ఒకటి అధికారులు, ఒకటి అర్చకులు, ప్రధానమైనవి జీయరుమఠానికి చేరుస్తారు. అలా జరిగి, తిరిగి అదే క్రమంలో ముగ్గురు వచ్చి తీసే సంప్రదాయం జరగాలి. ఈ విషయాన్ని కొన్ని ఒత్తిడుల వల్ల అంగీకరించి, అధికారులు, జీయర్లు అర్చకులు, ఏకాంగులు అందరూ ఒప్పుకొని రాత్రి 1.00 నుండి 3.00 వరకు విశ్రాంతి నిచ్చి, గం. 3.00 కి సుప్రభాతసేవ చేస్తాం. 2 గంటలు మొదట విశ్రాంతి లభిస్తుందని అందరూ ఒప్పుకొన్నారు. ఫిబ్రవరి 1వ తేదీన శ్రీచిన్నజీయరుస్వామివారే దగ్గరుండి దానిని ప్రారంభింపచేసారు. కానీ అది ఆ తర్వాత కొన్ని రోజులకే తిరిగి యధాపూర్వ స్థితికి చేరిందని తెలిసింది. అక్కడి ఉద్యోగులు ఈ





తాళాలు వేయడం, తీయడం... ఇదంతా ఓ అనవసరపు శ్రమక్రింద తలచి మానివేసారు.

ఇదే విషయాన్ని శ్రీజీయరుస్వామి EO, JEO గార్లతో ప్రస్తావించి, దేముని విషయంలో అలాంటి ఉదాసీనత, నిర్లక్ష్యము తగదని అనుకున్న ఆ రెండు గంటలకాలమైనా ఖచ్చితంగ అమలు పరచాలని స్పష్టం చేసారు.

2. జగత్ప్రసిద్ధుడైన శ్రీవేంకటేశుడు లక్షల, కోట్ల మందికి తిండి పెడుతున్నా, ఆయనకు శుద్ధమైన తిండి పెట్టేనాథుడు కరువైపోయాడు. వండి, ప్రజలకు ప్రసాదంగ పంచిపెట్టే క్వింటాళ్ళ ప్రసాదాలు దేముని ఆరగింపుకు పోనేపోవు. వండేవాళ్ళు అన్ని రకాల వాళ్లు ఉన్నారు. ఆరగింపుచేయు అర్హత గలవిగా ఆ వంటకాలు తయారుకావు. శుచి, ఆచారము రెండూ అక్కడ మృగ్యములే.

బయటి వారికిచ్చేవి ఎలా ఉన్నా దేమునికి పడితరంగ నిర్దేశించినవి అంతంత ఎక్కువగలేవు. ధ్వజస్తంభం దాటి లోపలికి వెళ్ళాక, బంగారుబావి ప్రక్కనున్న 'పాకశాల'లో అంతా మిషనరీ బిగించి, గ్యాస్‌మీద వంటలు జరుగుతాయి. శ్రీవారు చర్చలలో ఆ వంటశాలను శుద్ధిచేసి, అందు లోని యంత్ర పరికరాలు తొలగించి, గ్యాసు వంటను ఆపి శిఖాదారులైన శ్రోత్రియుల ద్వారా ఆ పడితరం వరకూ అవసరమైన పదార్థాలన్ని లోపల వండించి, అవి దేమునికి ఆరగింపు చేయడమవసరం. మిగిలినవి మీ యిష్టమని ఏడాది క్రితం సూచించారు.

కానీ ఇప్పటికీ జరగలేదు. ఇంజనీర్లు ఒప్పుకోలేదని, వంటవాళ్ళు అంగీకరించ లేదని, ఇవనీ అవనీ కుంటిసాకులు చెపుతున్నారు. వంటవారు మాత్రం, 1) మరో 5,6గురిని వంటకి తీస్కొంటే, బ్యాచులుగా మేం చేస్కొంటాం, 2) కొన్ని గాడిపొయ్యలు కట్టించాలి, 3) కళాయి పూసిన ఇత్తడి అండాలు 6 లేక 10 అవసరం. ఇవి ఉంటే మేమే శుచిగ, శుభ్రంగ చేస్తాం స్వామికి, అంటూ వారు అంగీకరించారు.

10 ఇత్తడి అండాలు కొని, 6-10మంది వంటవాళ్ళను చేర్చి, ఉన్న గాడిపొయ్యి కట్టి పరిధి పెంచడానికి దేవస్థానానికి చేతగాలేదు. ఇంకా ముహూర్తం కుదరలేదు. ఇదిగో, అదిగో అంటూ కాలం గడిపేస్తున్నారు. ఇది సవరించమని, వెంటనే ఆ పాకశాల సంగతి సరిచేసి, అమలు పరచమని శ్రీస్వామివారు హెచ్చరించారు. లోకాలన్ని ఆరగించినవాడా! నీకు తృప్తిగ ఆహారాన్నందుకొనే అదృష్టమెప్పుడో కద!

3. ఆలయ చరిత్రను పరిరక్షిస్తూ కొండను అందంగ తీర్చిదిద్దాలే తప్ప చారిత్రక చిహ్నాలన్ని తుడిచివేసి, చుట్టూ పార్కులు పెంచి, ఓ తోటమధ్యలో నిలబడ్డ వేంకటేశుని గుడిగ, తిరుమలను చరిత్రహీనము చేయదగదు అని శ్రీ చిన్న జీయరుస్వామి తెలిపారు.

1) చుట్టూ ఉండే మాడవీధి పోయింది. 2) శ్రీనివాసునికి తీర్థ కైంకర్యం చేసిన తిరుమల నంబి అనే శ్రీరామానుజుల మేనమామగారు నివసించిన గృహం పోయింది. అక్కడ చిన్న గుడి వెలిసింది. 3) శ్రీరామానుజుల ఆజ్ఞతో "పుష్కరిణి త్రవ్వి, తోటపెంచి, పూలు పెంచి, మాలలు కట్టి, ఆరాధనకర్పించి, ఆలయంలో ఏది జరగాలన్నా, నిర్ణయించే సర్వాధికారము కలిగినవారు వీరే" అని శ్రీరామానుజులువారు శాసించిపెట్టిన అనంతాళ్వాన్ తోట, మురికి గుంటగ మారింది. వారి గృహము కూల్చివేయ బడింది. మాడవీధి నిర్మూలమైంది. తిరువీధి జరిగితే హారతిచ్చేనాదుడు లేడు. ఇచ్చినా వాటిని ఆదరించే, స్వీకరించే స్థితి, సమయమూ లేవు. 4) 7 కొండలూ, వేల ఎకరాల భూమికల వేంకటేశుడికి రోజూ ధరింపచేసే పూలు, తన కొండలపై పండించుకొనే అదృష్టంలేదు. బజారులోంచి కొనుక్కొచ్చి, శీతలగృహాల్లో, కోల్డు స్టోరేజీలో ఉంచి అర్పించే దుర్గతి పట్టింది. 5) వేయికాళ్ళమండపం, అవకాశం లేదని ఉన్నచోటునుండి స్థానభ్రంశం పొందించడానికి కూల్చివేసారు. 6) ఆలయాన్ని నిర్వహించవలసిన జీయరుస్వామి మఠానికి ముందర కటకటాల

కంచెలు కట్టారు. బేడీ ఆంజనేయుడికి ముందుగూడా ఆయన్ని అడుగు ముందుకి కదుపవీలులేదు. స్వామివైపు రావద్దు అన్నట్టుగ అవే కటకటాలు అడ్డుగోడలుగ నిలిపారు. గొల్లదాని మండపాన్ని స్థానభ్రంశం కల్గించారు. 7) ఆలయార్చక స్వాములకు వీధులకావలదూరంగ క్వార్టర్లలో మకాం మార్చారు. వారు విధులకు, హాజరు అయ్యేటప్పుడు, చెప్పులు లేకుండా రావాలి. వీధులలో శుభ్రత ఉండదు. అలా అక్కడక్కడ చెత్తాచెదారం తొక్కుతూనే అశుచిగ ఆలయ కైంకర్యంలో ప్రవేశించాల్సి వస్తోందీమధ్య. 8) శ్రీ భగవద్రామానుజులు దాడి ఆలయ వ్యవస్థనంతనూ చక్కబెట్టిన చోటే, ఇప్పటి పెద్దజీయరుమఠం. వారి నిర్దేశల మేరకే భోగశ్రీనివాసుడు ఆమఠంలో ఆరాధనలందు కుంటున్నాడు. అక్కడి ఆరాధ్యమూర్తిగ శ్రీరామచంద్రుడ్ని శ్రీరామానుజులేర్పరచారు. దాన్ని అక్కడి నుండి తొలగించేందుకు ఏర్పాట్లు చేస్తున్నారు. 9) శుచిపేరిట శ్రీభాష్యకారులు రామానుజుల సన్నిధిలో పెద్దలకిచ్చే గోష్ఠిప్రసాదం నిలిపి బయటకు పంపేశారు. భక్తుల సౌకర్యమంటూ మరో ప్రాకారానికి, వంటశాలకూ, కళ్యాణమండపనిర్మాణానికి సన్నాహాలు గతంలో ప్రారంభించారు.

గతంలో అక్కడున్న గృహాలలో అవాంఛనీయ, స్వార్థపర కార్యక్రమాలు, సంఘ, దైవవిద్రోహ చర్యలకు పాల్పడే వ్యక్తులు ఎందరోచేరిపోయారని వారిని తొలగించి ఆలయ రక్షణవ్యవస్థను పటిష్ఠపరచడానికి ఆమాడవీధిని కూల్చివేయడం జరిగిందని అధికారులు తెలిపారు. భక్తుల సౌకర్యానికి, ఉన్నవిచాలక, వంటశాల, కళ్యాణ మండపాలు నిర్మించవలసి ఉందని తెలిపారు.

ఈ విషయాలన్ని శ్రీజీయరుస్వామి చర్చించారు. ఇప్పటికి వస్తున్న భక్తులకే సమయం చాలక పోతూంటే, ఇంకా సౌకర్యాలు, వసతులూ పెంచి మరింత జనం చేరితే ఈ మాత్రం ఆరాధన కూడా కరువై పోతుందని, ఉన్నవాటిని సరిచేయడం అవసరమేనని శ్రీస్వామివారు తెలిపారు.

భగవంతుని ఆరాధనాదికమైనాక లభించిన సమయంలో ఆయన్ను సేవించుకోడానికి భక్తులకవకాశమివ్వాలేతప్ప, ఆయన ఆరాధనను తెగకోసి కాదు. దేముని కోసం భక్తులు వస్తారే తప్ప, దేముని సేవకు లోపం కల్గించనంతవరకే భక్తులకు అవకాశం యివ్వాలి తప్ప, దేమునికి హాని కల్గించి కారాదు. భక్తుల అవసరాల కోసం దేముణ్ణి బలిపశువును చేయడం సహించరానినేరం, రుచి, శ్రద్ధ ఉంటే, అవకాశమిచ్చే వరకూ భక్తులు వేచి ఉండాలి. అదిలేనివారు దూరంగ ఉండాలి. అధికారివర్గమూ, ఆచార్యవర్గమూ కూడా ఈ విషయాన్ని స్పష్టంగా తాము తెలుసుకోవాలి. భక్తులకు, నేతలకూ, పైఅధికారులకూ ధర్మకర్తలకూ, భడానాయకులకూ గూడ విస్పష్టంగ తెలియ చేయాలి. మారే భౌగోళిక పరిస్థితులు, ఉగ్రవాద పరిస్థితుల దృష్ట్యా శ్రీనివాసుని ఆలయం చుట్టూ రక్షణ వ్యవస్థ అవసరం. అది ఉండేట్టుగా, గతంలో నిర్మితమై ఉన్నట్లే రాతి కట్టడంగ మాడవీధిని పునర్నిర్మించాలి. ఆ వీధిలోనే ఆలయ అర్చకులు కొంత ప్రాంతంలో ఉండాలి. వారికక్కడ తమ విధి నిర్వహణకవసరమైన ఆచార, వ్యవహారాలు చేయగలిగే కట్టుదిట్టమైన భద్రతా వ్యవస్థ కల్పించాలి. అలానే చిన్న, పెద్ద జీయ్యంగార్ల మఠాలూ అదే వీధుల్లో ఉండాలి. ఆలయ వైదిక సిబ్బందికీ అక్కడే వసతులు కల్పించాలి. కుటుంబాలతో ఉండదగిన వైదిక సిబ్బందికే ఆ వీధులలో మరోప్రక్క ఆ నూతన నిర్మాణాలతో వసతి చేయాలి. అవసరమైతే మరోప్రక్క వైదికేతర సిబ్బంది గూడ అక్కడ ఉండవచ్చు. దీనివల్ల రక్షణ వ్యవస్థగూడ కట్టుదిట్టమౌతుంది. తిరువీధులలో వెడలేస్వామికి నిండుదనం, హారితిచ్చే సంప్రదాయం సురక్షితమౌతుంది.

2. తిరుమలనంబి తిరుమాళిక (గృహం) పూర్వమున్న చోటనే గృహంలానే నిర్మించి అందులో వారు చేసిన సేవ దర్శనమిచ్చేట్టు దృశ్య-శ్రవణాది ఆధునిక వసతులతో ప్రాచీనత గోచరించే రీతిలో





నిర్మాణం జరపాలి. ఆ వంశం వారికి ఆలయనియమ నిబంధనల కనుగుణంగా సేవచేసే రీతి కల్పించి మాడవీధులలో వారుగూడ నివశించే వ్యవస్థ చేయాలి. ఆ తిరుమాళికలోకాదు. అంతే తప్ప ఆ కొండపై ఏ ఇతర ఆలయాలూ, ఆరాధ్యదైవాలూ, మందిరాలూ, క్రొత్తగ చరిత్ర విరుద్ధంగ ఏర్పడనీయరాదు. ఇప్పటికే అలాంటివి 4,5 పైగ అక్కడ ఏర్పరచుకొని, వాటికి ఆలయ ప్రతిపత్తి కల్పించుకొని కూర్చున్నవారు కొందరున్నారు. అవి చరిత్ర విరుద్ధచర్యలు. వాటిని క్రమబద్ధం చేయాలి.

3. అనంతాళ్వాన్ తోటను పునరుద్ధరించాలి.

4. అనంతాళ్వాన్ తిరుమాళికను పునరుద్ధరించి, అది గతంలోవలె, ఆధునిక వ్యవస్థతో నిర్మించి, చారిత్రక లక్షణాలుట్టిపడే రీతిలో నిర్మించి అందులో వారు చేసిన సేవలూ, వారి ప్రాముఖ్యమూ రాబోయే తరాలకు తెలిసేట్టు దృశ్య, శ్రవణయంత్రాలద్వారా ఏర్పాటు చేయాలి. వారి వంశాలవారికి మాడ వీధులలో వసతినేర్పరచవలెను. అంతే తప్ప ఆ నూతన నిర్మిత తిరుమాళికలోకాదు.

5. అంతాళ్వాన్ తోటతోపాటు, మరిన్ని తోటలను బయట ఏర్పరచి, గార్డెన్ డిపార్టుమెంటును సమర్థపరచి, దేమునికి పెట్టదగిన పుష్పాలను మాత్రమే అందులో పెంచి, బయటకొననవసరం లేకుండా, తన తోటలో పుష్పాలే స్వామి ధరించేట్టు చేయాలి. అసలే చలిలో, కోల్డుస్టోరేజిమాలలు స్వామికి ధరింపచేయడం తగదు.

6. దేమునికి తిరుమంజనాన్ని క్లోరినేటెడ్ జలంతో చేయడం ఆపాలి. శుద్ధజలాన్ని అభిషేకానికి, ఏర్పాటు చేయడానికి అవసరమైన వ్యవస్థ, ఖర్చైనా సరే, వెంటనే చేపట్టాలి.

7. లోపలి వంటశాలలో గాడిపొయ్యి నిర్మించి, గ్యాస్‌మాన్పించి, కట్టెలు అందించి, స్టీము వంటకాక, ఆచారవ్యవహారయుక్తమైన, శాస్త్రీయమైన వంటపద్ధతితో ఆచారవ్యవహారం కల వ్యక్తులతో ప్రసాదాలు పడితరం వరకూ పూర్తిగ, ఇక్కడే చేయించి అర్పించాలి. వారికవసరమైన జనాలను, గిన్నెలను వెంటనే ఇవ్వాలి. వీలుకాకపోతే మేమేయిస్తామని శ్రీచిన్నజీయరుస్వామివారన్నారు. అవసరం లేదు, అవి చేస్తామన్నారు E.O.గారు.

8. రామానుజులవారి సన్నిధిలో బాలభోగ ప్రసాద వినియోగ క్రమాన్ని తిరిగి సవ్యంగ జరిపించాలి. శుభ్రతకు వ్యవస్థ బాగానే ఉంది దాన్ని వినియోగించుకోవాలి.

బేడీ ఆంజనేయునికీ, పెద్దజీయరుగారి మఠానికి ముందున్న ఇనుపకంచెను వెంటనే తొలగించాలి.

9. వేయికాళ్ళమండపాన్ని అదే చోటు పునః ఆధునిక పద్ధతిలో, ప్రాచీనత చెడకుండా పునర్నిర్మించి, చారిత్రకతను పరిరక్షించాలే తప్ప చరిత్రను తుడిచివేయరాదు.

10. వంటశాలలూ, కళ్యాణ మంటపాలూ బయటివారికోసమే, అవి “ఆర్జిత సేవలకే” ఆ వంటకాలు ఆరగింపు చేసేవి కానేకావు. కనుక వాటిని బయట ఎక్కడ నిర్మించినా ఏ ప్రమాదమూ లేదు. దానికి శాస్త్రము అంగీకరిస్తుంది. బయట ఆర్జిత కళ్యాణాలే కాదు. ఆలయ వ్యవస్థలో భాగమైన వార్షిక కళ్యాణాదులుగూడ ఆలయమునకు బయట జరగడం, ఇప్పటకీ పరమప్రామాణిక మైన వైఖానస దివ్యదేశ ఆలయాలలో జరుగుతూనే ఉంది కనుక అది సంప్రదాయసిద్ధమే. దానికోసం ప్రాకార మక్కరలేదు. మాడవీధిరాతితో సాంప్రదాయకంగ నిర్మిస్తే రక్షణ కదే గొప్ప అవకాశమిస్తుంది గూడ.

11) ఇవి కాక, ఆలయంలోపల, ఏ భాష్యకార్లకూ, యోగనృసింహస్వామికీ అలానే వరాహస్వామివారికీ ఆరాధనలు జరుగెడివని ఇతిహాసమాల తెలుపుతోండగ, ఎంతో కాలంగ ఆ సన్నిధులలో కనీసం అర్ఘ్యపాద్యాలుగూడ లేకుండా ఉంచేసి, అలాంటి ఆచారం లేదని ఇప్పటి వైదిక వర్గం వాదిస్తోంది. విగ్రహాలున్న పుడు ఆరాధనలేక పోవడమనేది శాస్త్రవిరుద్ధం, ఆచార విరుద్ధం. ఏ కాలంలో అది నిలిపి వేసినా తిరిగి ఆరాధననాసన్నిధులలో జరుప వలసిందే.

శ్రీవేంకటేశునికి ఆరగింపు కాగానే ఆ ప్రసాదాన్ని మాత్రం ఆలయసన్నిధులలో చూపించి, అదే తీర్థమును ఆ సన్నిధులలోగూడ ఇస్తున్నారే తప్ప ఆరాధనాదులు చేసికాదు. ఆ సన్నిధుల ఆరాధన వ్యవస్థను సరిచేయాలి.

ఇలా ఎన్నెన్నో అనాచారాలు, దురాచారాలు చోటుచేసుకోవడం, ఉన్నవి నిలిపివేయడం, పద్ధతులను క్రమక్రమంగ మార్చివేయడం, రూపుమాపి వేయడం జరుగుతున్నాయి. ఇవి దేశానికి అరిష్టం. రాష్ట్ర, దేశ నేతలకు మంచిది కాదు. వీటిని సరిచేయాలని శ్రీచిన్నజీయరు స్వామివారు స్పష్టం చేసారు.

ఇలాంటివి జరుగుతూడటంతో వర్తమాన అధికారులది పూర్తి దోషం కాదని, ఇలా జరగాలని చెప్పి, చేయించకపోవడం, వైదికవర్గం వారిలోపమని, దానికీ కారణం పూర్వపు అధికారులు ఇలాంటి సూచనలను వినడానికి అందుబాటులో ఉండకపోవడం, విన్నా పట్టించుకొనే శ్రద్ధ లేకపోవడం, తమకు తోచినదే చేసే మనస్తత్వం ఉండటం ప్రధాన కారణాలని ఇపుడు ఉండే E.O.,J.E.O. వంటి టీము, విషయాన్ని విని, బాగు చేయాలి సిస్టమ్‌ను అనే సంకల్పం కలవారు కనుకనే ఈ మాత్రం చెప్పి, చేయించగలుగు తున్నామని శ్రీస్వామివారు సెలవిచ్చారు.

వీటితోపాటు ధర్మప్రచార పరిషత్ కార్యక్రమాలను శ్రీవారు E.O.గార్లతో చర్చించారు. T.T.D. వారి నేతృత్వములో ధర్మప్రచార పరిషత్, అన్నమాచార్య ప్రాజెక్ట్, ఆళ్వార్ ప్రాజెక్ట్, దాససాహిత్య ప్రాజెక్ట్‌వంటి 4,5 ప్రాజెక్ట్‌లు సమాంతరరేఖల్లా, ఒకరితో ఒకరికి సంబంధం లేకుండా ఎవరి కార్యక్రమాలు వారు చేసుకొంటూ పోతున్నారు. ఏవీ అంతగా ప్రభావవంతంగ తమ ముద్రను సమాజం మీద వేయలేక పోతున్నాయి. DPPని ప్రజలకు చేరవేసే సంస్థగను, మిగిలినవి. విషయాన్ని వివిధ రీతులలో తయారు చేసే ప్రాజెక్టులుగ ఉంచి DPP ఆర్గనైజర్స్‌కి, శిక్షణద్వారా గీతాజ్యోతి వంటి కార్యాన్ని గూడ తెలిపి ప్రచారం క్రమబద్ధం చేస్తే మరింత సత్ఫలితం పొందచ్చని, అసలు అదే సరి అయిన దిశ అవుతుందని గూడ సూచించారు.

ఇదిలా ఉండగా T.T.D. విషయంలో, కంచీ కామకోటి పీఠాధిపతి శ్రీజయేంద్ర సరస్వతి స్వామి వారు చాల సందర్భాలలో పేరు చెప్పి T.T.D. విషయాలలో శ్రీచిన్న జీయరుస్వామివారి జోక్యాన్ని ఖండించారు.

తిరుమల వైఖానసాగమం ప్రకారం జరిగే వైష్ణవ దేవాలయమని, దానిలో ఇతరులు అంటే వైఖానసాగమానికి చెందనివారు, శ్రీపాంచరాత్రా గమానికి చెందినవారు జోక్యం చేసుకోనవసరం లేదని శ్రీచిన్న జీయరుస్వామి పాంచరాత్రానికి చెందినవారు కనుక ఈ విషయాలలో వారి ప్రమేయము అనవసరమని, ఆలయంలో పూజాది కాలు ఏ లోపం లేకుండా బాగానే జరుగుతున్నాయని ప్రకటించారు. వారి ప్రకటనలు ఆస్తికలోకాన్ని అయోమయంలో పడవేసాయి. T.T.D. లోని లోపాలను ప్రశ్నిస్తున్న శ్రీచిన్నజీయరుస్వామివారిని తప్పు పడుతు, T.T.D.కి క్లీన్ సర్టిఫికెట్ ఇస్తూ కంచిస్వామివారు చేస్తున్న పత్రికా ప్రకటనలను చదివిన భక్తులు, విలేఖరులు, పాఠకులు వాస్తవాలను తెలుసుకోగోరుతూ మన శ్రీజీయరు స్వామివారిపై ప్రశ్నలవర్షం కురిపిస్తున్నారు.

పాఠకులకు ఈ విషయంపై స్పష్టమైన అవగాహనను అందించేందుకై ఈ క్రింది వివరాలను తెలియపరుస్తున్నాం.

ఆలయ వ్యవస్థకు ఆగమాలు ప్రమాణం. శైవాగమాలు, శాక్తేయాగమాలువంటి వివిధ ఆగమాలు ఎలా ఆ సంబంధిత దైవాల ఆలయ వ్యవస్థకు ప్రమాణాలుగా ఉన్నాయి. అలాగే విష్ణు సంబంధమైన ఆలయాలకు: 1. వైఖానససూత్రం, 2. శ్రీపాంచరాత్రా గమము ప్రమాణాలుగా ఉన్నాయి.

వైఖానస దీక్షితులైన కుటుంబాలు శరీర సంస్కారాదులనుండి వైష్ణవ ఆలయంలోని ఆరాధనా విధానాల వరకూ ఉండాల్సిన పద్ధతులను వైఖానస





సూత్రం వివరిస్తుంది. ఈ సూత్రాన్ని అనుసరించే అర్చకులు తాముండే వైష్ణవాలయాలలో ఈ సూత్రానుసారం ఆరాధనా విధానాలను నిర్వహిస్తారు.

శ్రీపాంచరాత్రాగమం కేవలం భగవంతుని ఆరాధనను మాత్రవే కాకుండా, ఆలయ సంబంధంగా ఉండే నిత్య, నైమిత్తిక, కామ్య విధుల న్నింటినీ శాసిస్తుంది. ఋషులు బోధించిన వైదిక సంస్కారాలను పొంది, ఈ శ్రీపాంచరాత్రాగమ దీక్షను స్వీకరించిన అర్చకులు ఈ ఆగమ విధానాన్ని అనుసరించి వైష్ణవాలయాలలో ఆరాధనాదులను నిర్వహిస్తారు.

11వశతాబ్దంలో అవతరించిన శ్రీమద్రామానుజాచార్యులవారు వైష్ణవ దేవాలయ వ్యవస్థను కట్టుదిట్టమైన నియమాలతో ఆచారాలతో క్రమబద్ధం చేసారు. అందువల్లనే అన్ని వైష్ణవవాలయాలలోనూ **"రామానుజాచార్య దివ్యాజ్ఞాం! వర్ధతాం! అభివర్ధతాం!"** అంటూ ప్రతిరోజూ మూడు పూట్లా అనుసంధానం చేస్తున్నారు. **"సాహిలోకహితైషిణీ"** అంటే లోక హితకారి అయిన రామానుజులవారియొక్క శాసనము **"అప్రతిహతంగా సాగుగాక"** అని గొంతెత్తి చాటుతున్నారు.

వైష్ణవ ఆరాధనా విధానానికి వైఖానసమూ, పాంచరాత్రమూ రెండూ రెండు నేత్రాలు. వైష్ణవాచార్యులైన వారెవ్వరూ ఒకనేత్రాన్ని ప్రేమించి, రెండవ నేత్రాన్ని దూరం చేసుకోవాలనుకునే హ్రస్వదృష్టి కలవారు కారు.

రామానుజాచార్య సంప్రదాయమనే గొడుగు క్రింద ఉన్న అనేక వైష్ణవాలయాలలో కొన్ని పాంచరాత్రాగమ విధానాన్ని అనుసరిస్తే, మరికొన్ని వైఖానస విధానాన్ని అనుసరిస్తున్నాయి.

దివ్యక్షేత్రాలుగా ప్రసిద్ధి పొందిన 108లో శ్రీవైకుంఠం, పాలకడలి తప్పిస్తే మిగిలినవి ఈ లోకంలో ఉన్న 106 దివ్య దేశాలలో శ్రీపాంచరాత్రాగమ దివ్యదేశాలు-47, వైఖానస దివ్యదేశాలు-37, ఇతరములైన దివ్యదేశాలు-13, కేరళ, ఉత్తరభారత దివ్యదేశాలు-9, శ్రీవైష్ణవ సంప్రదాయాన్ని అప్రతిహతంగా కొనసాగిస్తున్నవే అనేది వాస్తవం, జగద్విదితం.

దక్షిణ భారతదేశంలోని సుప్రసిద్ధ ఆలయాలైన వానమామలై, శ్రీవిల్లిపుత్తూరు, తిరుమంగై ఆళ్వారుల దివ్యక్షేత్రాలు, భగవద్రామానుజుల అవతార స్థలమైన శ్రీపెరంబుదూరు, తిరుమల వంటివన్నీ **"రామాను జాచార్య దివ్యాజ్ఞ"**ను పరిపాలిస్తూ, నేటికీ శ్రీవైష్ణవ సంప్రదాయానికి కేంద్రాలుగా విరాజిల్లుతున్నాయి.

రామానుజ సంప్రదాయాన్ని, ఆ పరంపరను అనుసరించే ఏ ఆచార్యునికైనా వైష్ణవాలయాల పరిరక్షణ బాధ్యత, యోగ్యత సహజసిద్ధంగా సంక్రమిస్తాయనేది ఎవ్వరూ కాదనటానికి వీలుకాని వాస్తవం.

వైష్ణవ ఆలయాలలోని ఆగమ విధానాలను సంప్రదాయసిద్ధమైన ఆచారాలను రెండింటినీ పరిరక్షించటం కోసం శ్రీపెద్దజీయరు స్వామివారు ఏర్పరచిన బాటలో ముందుకు సాగుతున్న మన చిన్నజీయరుస్వామివారి ఉద్యమ స్వరూప స్వభావాలను అర్థం చేసుకోలేక, అపోహలతో వాస్తవ దూరమైన ఆక్షేపణలను కొందరు బుద్ధిమంతులైన పెద్దలు చేస్తున్నారు.

"తిరుమల" శ్రీవేంకటేశ్వరదేవాలయం భగవత్ రామానుజులచే వ్యవస్థితమైన ఈ 108 శ్రీవైష్ణవ దివ్యదేశాలలో ఒకటి. సంపద, వైభవం, అధిక ప్రాచుర్యం, జనాదరణవంటి విశేషాలెన్నో ఉన్నా, ఆలయనిర్వహణకు శ్రీమద్రానుజాచార్యుల వారు ఏర్పరచిన ఆచార నియమాలు, వైఖానస సూత్రం పాటించే, సుసంస్కృతులైన అర్చకులు చేసే ఆరాధనా విధానమే ప్రమాణం.

11వ శతాబ్దంలో శ్రీమద్రామానుజాచార్యుల వారు ఏకాంగులను, పెద్దజీయంగారి మఠస్థాపన, ఆలయపూర్తివ్యవస్థను నియంత్రించడానికే ఏర్పరచారు. ఆ తర్వాత, 15వ శతబ్దాంలో శ్రీమణవాళ మహామునులు తిరుమల తిరుమల దేవాలయ వ్యవస్థను క్రమబద్ధీకరించేందుకు ఏర్పరచినదే తిరుమలలోని (చిన్నజీయంగారి

మఠంగూడ (మనస్వామివారు కారు.) ఆ తిరుమల తిరుపతి దేవస్థానం ఆలయవ్యవస్థ, నిర్వహణ, నియంత్రణలకు సంబంధించిన వివరాలన్నీ తెలుగులో అనువదించి 1987లో ప్రచురించిన ''శ్రీవేంకటాచలేతిహాసమాల'' సవివరంగా తెలియపరుస్తోంది. ఈ గ్రంధమొకటున్నదన్న విషయం మన శ్రీచిన్న జీయరుస్వామివారు తెలిపే దాక ఆలయాధికారులకు గూడ తెలియక పోవడం గమనార్హం. అక్కడి జీయంగార్లు తదితర వైదిక వర్గంగూడ ఇదే స్థితిలో ఉండటమూ శోచనీయము.

దురదృష్టవశాత్తూ ఇటీవల కాలంలో ఎక్కడ సంపదలు చేరితే అక్కడే కద అక్రమాలు, అనాచారాలు చోటుచేసుకొనేది. దురదృష్టవశాత్తూ ఇటీవల కాలంలో దేవాలయ నిర్వహణ విషయంలో చోటుచేసుకొన్న అవాంఛనీయమైన ఆధిపత్యధోరణులు తరతరాలుగ అమలౌతున్న విధివిధానాలకు తిలోదకాలిస్తున్నాయి. రాజకీయ నేతలచే నియమించ బడే ధర్మకర్తలకు కానీ, పాశ్చాత్య విధానాలను నేర్చిన అధికారగణాలకు కాని, స్వామివారికి వచ్చే ఆదాయం, భక్తుల వసతివంటి అంశాలపై ఎంతో కొంత అవగాహన ఉన్నదే తప్ప ఆరాధనావిధానాలు, సంప్రదాయాలు, వాటి పరిరక్షణ పట్ల అవగాహన, శ్రద్ధలేవు.

ఆరాధనా విధానాలను, సంప్రదాయాలను పరిరక్షించడానికై శ్రీమద్రామానుజాచార్యుల వారి కాలం నుండి వస్తున్న జీయంగార్ పరంపర కాల ప్రభావానికి లోనై బలహీనమై పోయింది. జరుగు తున్న లోపాలను సరిదిద్దలేక, సరిదిద్దే ఆసక్తిలేక, ఆ లోపాలకు సాక్షులుగా, భాగస్వాములుగా తమ పనేదో తమదని గిరిగీసుకొని మౌనంగా నిలిచి పోతున్నారు.

1. రాజకీయ పలుకుబడి ఉన్నవారికి సాధారణ అధికారిగణం అన్నివిషయాలలో సంప్రదిస్తు ఉంటుంది. కంచి వారికుండే విశేష రాజకీయ ప్రభావాన్ని బట్టి తిరుమలలో జరిగే ఏ చిన్న విషయానికైనా వారిని సంప్రదించడం అనే ఒక అవాంఛనీయ ధోరణికి తెరలేపారు. దీనితో పాటు కొందరు అర్చకులు కూడ అధికారిగణపు ప్రాపుకోసం, రాజకీయ లబ్ధికోసం పైమార్గాన్నే పట్టారు.

ఇది ఆలయ సంప్రదాయాలలో కొన్ని అవాంఛనీయమైన పుంతలు త్రొక్కింది. కంచివారు గర్భాలయంలో తలుపులు వేయించుకొని పెరుమాళ్ళ యొక్క శంఖు చక్రాలను పరిశీలించే ప్రయత్నం చేయడంతో దర్శనార్ధులైన భక్తులు గడబిడ చేయడం దానితో వారు బయటకు రావడం, దీనికి కొందరు వైదిక సిబ్బంది తోడ్పడడం, దైనందిన పత్రికలలో పెద్ద దుమారాన్ని లేపింది.

ఇలాంటివి కొన్ని చూసిన తర్వాత మన స్వామివారు అవసరమైనరీతిలో స్పందించారు.

2. ఆలయస్థితి ఇంతకంటే దిగజారరాదని 2001లో ఆలయ విషయంలో జోక్యం కల్పించు కోవాల్సివచ్చింది. 2001 నవంబరులో ఏర్పాటు చేసిన సమావేశంలో అర్చకులూ, జీయరులు, దేవాలయ పద్ధతులలో ఏ లోపం లేదు, అన్నీ సలక్షణంగా జరుగుతున్నాయంటూ వాదించారు.

2002 జనవరిలో మరొక సమావేశాన్ని శ్రీస్వామివారు ఏర్పాటు చేసి శ్రీమాన్ ఉన్నికృష్ణన్‌గారి ద్వారా వాస్తవాన్ని చెప్పించడంతో, అటు అర్చకులు, ఇటు జీయంగార్లు, ఏకాంగులు, అధికారులు కూడ పరమదారుణంగ జరుగుతున్న వాస్తవాలను అంగీకరించక తప్పదు.

3. ఇప్పుడు ప్రస్తుతం E.O.గా ఉన్న శ్రీమాన్ అజయ్‌కల్లాంగారు J.E.O. శ్రీమాన్ బాల సుబ్ర మణ్యంగార్ల ముందే ఈ సమీక్ష జరిగింది. ఎవరి లోపాలు వారు స్పష్టంగా అంగీకరించారు కూడ.

ఫిబ్రవరి 1వ తారీఖునాడు ఆరేళ్ళ తర్వాత మొదటిసారిగా శ్రీవేంకటేశ్వరస్వామివారికి రాత్రి 1గం. నుండి 3గం. వరకు రెండు గంటలసేపు విశ్రాంతినివ్వాలని అందరూ అంగీకరించాక మన చిన్న జీయరుస్వామివారు దగ్గరుండి దీనిని అమలు జరిపించారు.

సవరించాలని ఆ సమయంలో నిర్ణయించుకొన్న





ఎన్నో అంశాలు ఇప్పటికీ సవరణకు నోచుకోకుండా అలానే ఉన్నాయి. ఈ విషయం ఏమీ తెలియని శ్రీ కంచి స్వామివారు 'అంతా బాగుందని' అదేదో తమ నేతృత్వంలో జరుగుతున్నట్లుగా చెప్పుకోవడం హాస్యాస్పదం.

ఏవేవి లోపాలుగ ఉన్నాయని వర్తమాన అధికారులు, అర్చకలు, ఆగమసలహాదారులు, జీయంగార్లు, తదితర ఆచార్యప్రముఖులు అంగీకరించారో, అలాంటివాటిని సవరించి, వ్యవస్థను సరిచేయమనే మనస్వామివారు కోరుతున్నారు.

అంతేకాని ఆగమాలు మార్చమని, క్రొత్త పద్ధతులు ప్రవేశపెట్టమనికాదు. అన్య సంప్రదా యస్థులు తిరుమలలో హస్తాక్షేపణ చేసినప్పుడే రామానుజులవారు ప్రామాణికంగా "బింబాధరు" లనే అప్పటి వైఖానస అర్చకులకు పంచసంస్కారాలు చేసి, ఆచార రక్షణ చేస్కోని చరిత్ర చెబుతూంటే, ఈనాడు తిరిగి అదే చరిత్ర పునరావృతం కావడానికి కంచి స్వామివారు లాంటి పెద్దలు కారణం కావడం ఆ మఠాల యొక్క గౌరవానికే తగని పని.

మన జీయరుస్వామివారు అటు అధికారి గణాల్ని ఇటు ముఖ్యమంత్రివంటి రాజకీయ నేతలను, అర్చకులను, ఉద్యోగస్తులనూ అన్ని వర్తాలవారినీ సంప్రదిస్తూ ఆలయవ్యవస్థ లోపాలను సరిదిద్దేందుకు శ్రమిస్తున్నారు. ఈ ఉద్యమంలో శ్రీవారికి సహకరించకపోగా, ఆక్షేపించడం దేవాలయాలను తద్వారా ధర్మాన్నీ అవమానించడమే అవుతుంది. సంప్రదాయాలను, ఆచారాలను కావాలని కాలరాసే ప్రయత్నమే. అందుకోసమై ఈ అంశాలపై బహిరంగ చర్చకు మన శ్రీస్వామివారు సంసిద్ధతను వ్యక్తం చేస్తూ పత్రికా ముఖంగా శ్రీజయేంద్ర సరస్వతివారి నుద్దేశించి పత్రికా ప్రకటన కూడ విడుదల చేసారు. ఏ మతాచార్యుడైనా సాంప్రదాయక ఆలయాల వ్యవస్థ గురించి జోక్యం చేసుకొనేటప్పుడు ఆయా ఆలయాలకు సంబంధించిన సంప్రదాయ చరిత్రకు భంగం కాని రీతిలోనే వ్యవహరించాలి తప్ప తద్భిన్నంగకారాదు. ఎక్కడైనా అట్లాంటిది జరిగితే, ఆ స్థితిని ఎదుర్కోవడానికి భగవత్ప్రేమ కలిగిన భక్తులందరూ సదా సంసిద్ధంగా ఉండాలి.

**శ్రీస్వామివారి చెన్నై పర్యటన:** 29,30,1వ తేదీలలో మూడురోజులపాటు శ్రీస్వామివారు చెన్నైలో విడిది చేసారు. ఋషీకేశ్, కోయంబత్తూరులలో ఆర్ష విద్యాపీఠానికి వ్యవస్థాపకులైన పూజ్యశ్రీ దయానంద సరస్వతి స్వామీజీ ఆహ్వానం మేరకు "ఆచార్య సభ"లో పాల్గొనేందుకు శ్రీస్వామివారు చెన్నై వెళ్ళారు.

"ఆచార్యసభ"కు సుమారు 70మంది పీఠాధి పతులు, భిన్న సంప్రదాయాలకు చెందిన మండలాధీశ్వరులువంటి సుప్రసిద్ధులు పాల్గొన్నారు. 1. గోవధ నిషేధం, 2. మతమార్పిడి, 3. నదుల అనుసంధానం, 4. మైనారిటీలు-వారి స్థితి, 5. ఉమ్మడి పౌరసత్వహక్కులువంటి అంశాలపైన సభ ఆచార్యుల అభిప్రాయాలను స్వీకరించింది.

ఈ సభ మొదటి రోజు కార్యక్రమంలో శ్రీస్వామివారు పాల్గొన్నారు. 30వ తేదీన యు.కె.లో బెర్‌హోమ్‌కు చెందిన శ్రీమాన్ జి.పి.నాధ్‌గారు బెంగుళూరులో "అంతర్జాతీయ గీతాసదస్సు"ను ఏర్పాటు చేసారు. ఈ కార్యక్రమ సమాపనోత్సవంలో ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత సంప్రదాయాలకు చెందిన పూజ్యశ్రీ ఉడిపి విశ్వేశ్వర తీర్థస్వామివారి(పెజావర్ స్వామివారు)ని, పూజ్యులు కంచి జయేంద్రసరస్వతి స్వామివారు, మన జీయరుస్వామి వారు పాల్గొన్నారు.

తమ సంప్రదాయాలకు అనుగుణంగా భగవద్గీత 18వ అధ్యాయ సారాన్ని తెలియజేయాలని నిర్వాహకులు ఈ పెద్దలను ఆహ్వానించారు. శ్రీస్వామివారు ఈ కార్యక్రమంలో పాల్గొని వెంటనే చెన్నై వచ్చేసారు.

**చవటపాలెం గీతాజ్యోతి ధర్మక్షేత్రం:**

చెన్నైనుండి బయలుదేరి శ్రీస్వామివారు డిసెంబరు 1వ తేదీ సాయంత్రానికి చవటపాలెం ధర్మక్షేత్ర కార్యక్రమంలో పాల్గొనటానికి వెంకటాచలం

చేరారు. అక్కడి నుండి శ్రీమతి వైదేహమ్మగారు, శ్రీమతిమనోహరమ్మగారు, శ్రీనివాస్‌గారు ప్రభృతులు ఎంతో వైభవంగా, ఊరేగింపుగా శ్రీస్వామివారిని చవటపాలెం గ్రామం మీదుగా శ్రీరాంపూర్‌లో శ్రీవారికి ఏర్పరచిన విడిదికి తీసుకొని వెళ్ళారు.

సామాన్య మధ్యతరగతి రైతు కుటుంబీకు లైనప్పటికీ పొలం పనులను కూడా ప్రక్కన పెట్టి ఎంతో శ్రద్ధాసక్తులతో, ఉత్సాహంతో 120 గ్రామాలకు గీతాజ్యోతి సందేశాన్ని అందించారు ఇక్కడి కార్యకర్తలు. మన తత్త్వశాస్త్ర ప్రచారకురాలు కుమారి సూర్యకుమారిగారు ప్రచారకార్యక్రమాలను సమర్థవంతంగా నిర్వహించారు. 2వ తేదీన జరిగిన గీతాజ్యోతి ధర్మక్షేత్ర కార్యక్రమంలో భాగంగా శ్రీస్వామివారు వైద్యశిబిరాన్ని ప్రారంభించారు. ఆ తర్వాత జరిగిన ధార్మిక సదస్సులో వివిధ గ్రామాల ప్రతినిధులు తమ గీతాజ్యోతి అనుభవాలను వివరించారు. సాయంత్రం సామూహిక కృష్ణపూజలు అనంతరం పదివేల మంది భక్తులతో గీతాజ్యోతి ప్రతిజ్ఞను శ్రీస్వామివారు నిర్వహించారు.

2వతేదీ రాత్రి 8గంటలకు శ్రీస్వామివారు చవటపాలెం నుండి బయలుదేరి శ్రీమాన్ మాగుంట శ్రీనివాసులరెడ్డిగారి ఎన్‌క్లేవ్‌కు చేరారు. శ్రీమాన్ లక్ష్మీనారాయణ రెడ్డిగారి ప్రేరణతో శ్రీవేంకటేశ్వర స్వామివారి ఆలయధర్మకర్త శ్రీమాన్ మాగుంట శ్రీనివాసులరెడ్డిగారు నెల్లూరులో వేదపాఠశాలను పెట్టమని స్వామివారిని కోరారు. పర్యవసానంగా గతనెల 1వ తేదీన వేదపాఠశాలకు గృహప్రవేశం జరిగింది. శుక్లయజుర్వేదీయశాఖ గురువైన వరదాచార్యస్వామివారు ఈ వేద పాఠశాలకు అధ్యాపకులుగా ఉన్నారు. 3వ తేదీన శ్రీస్వామివారు ఈ పాఠశాలను ప్రారంభించి, సమావేశానికి విచ్చేసిన భక్తులకు 'గీతాజ్యోతి' సందేశాన్ని అందజేసారు. నెల్లూరు పరిసర ప్రాంతాలలో గీతాజ్యోతి ధర్మక్షేత్రాలను రూపొందించమని ఆదేశించి శ్రీస్వామివారు సోమశిల ఆశ్రమానికి చేరారు.

సోమశిల ఆశ్రమంలో నీటి వసతి కోసం జడ్.పి. చైర్మన్ శ్రీమాన్ పి. చెంచల్‌బాబుగారు, 11 లక్షల 70వేల రూపాయల గ్రాంటును శాంక్షన్ చేసారు. 3.12.03 మధ్యాహ్నం 3 గం.లకు శ్రీస్వామివారు ఈ వాటర్ టాంక్ పథకానికి శంకుస్థాపన చేసారు. శ్రీమాన్ శ్రీనివాసులరెడ్డిగారు, శ్రీమాన్ బొల్లినేని కృష్ణయ్యగారు, శ్రీమాన్ ఎమ్. గంగాధరంగారు, శ్రీమాన్ మాదాసు శేషయ్యగారు, శ్రీమాన్ సుందరరామిరెడ్డిగారు, శ్రీమాన్ అనిల్ కుమార్‌గారు, శ్రీమతి బుజ్జమ్మగారు, తదితర ప్రముఖులు కార్యక్రమంలో పాల్గొన్నారు. ఆలయ అర్చకులు శ్రీరామాచార్యులగారికి వేదపాఠశాల అధ్యాపకులు శ్రీ గోవర్ధనాచార్యులు, వారి శిష్య బృందానికి శ్రీస్వామివారు మంగళాశాసనములను కృపచేసి 'గాలిపాలెం' కార్యక్రమానికి బయలుదేరారు.

**గాలిపాలెం గీతాజ్యోతి ధర్మక్షేత్రం:** నెల్లూరు జిల్లా చేజెర్ల మండలంలోని గాలిపాలెం గ్రామంలో శ్రీహరిస్వామిగారు అవధూత శ్రీవెంకయ్యస్వామివారి ఆశ్రమాన్ని ఏర్పరచి చక్కగా పరిసర ప్రాంతాలలో ధార్మిక ప్రచారం కావిస్తున్నారు. శ్రీస్వామివారి పట్ల శ్రీహరిగారికున్న అపార భక్తివిశ్వాసాల కారణంగా గీతాజ్యోతి ధర్మక్షేత్ర కేంద్రంగా 'గాలిపాలెం' రూపుదిద్దుకొన్నది. శ్రీహరిస్వామివారు, వారి శిష్యబృందం 220 గ్రామాలకు గీతాజ్యోతి సందేశాన్ని అందించి 4.12.03 తేదీన ధార్మిక సదస్సును ఏర్పరిచారు. శ్రీహరిగారు అకస్మికంగా ఏర్పడ్డ పితృవియోగ దుఃఖాన్ని సహించి ఈ కార్యక్రమాన్ని అత్యద్భుతంగా తీర్చిదిద్దారు. మన శ్రీస్వామివారి పర్యవేక్షణలో 4వ తేదీ మధ్యాహ్నం ఎన్నో వాహనాలతో గాలిపాలెంకు 15 కి.మీ. దూరంలో ఉన్న పొదలకూరుకు తరలివెళ్ళి వేలాదిమంది భక్తులు భగవన్నామ సంకీర్తనం చేస్తూ చక్కని శోభాయాత్రను శ్రీహరిగారు నిర్వహించారు.

ఆ తర్వాత గాలిపాలెంలో శ్రీకృష్ణపూజలు, గీతాజ్యోతి ప్రతిజ్ఞను శ్రీస్వామివారు నిర్వహించారు. ముఖ్య అతిథులుగా శ్రీమాన్ సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డిగారి కుటుంబ సభ్యులు, ఎస్.పి.





గారు కార్యక్రమంలో పాల్గొన్నారు. కార్యక్రమ అనంతరం శ్రీస్వామివారు వరగలిగ్రామానికి వెళ్ళి శ్రీమాన్ వేమారెడ్డి కుటుంబ సభ్యులకు మంగళా శాసనం చేసారు. 5వ తేదీ ఉదయం అక్కడ ఉన్న కోదండరామస్వామి దేవాలయానికి వేంచేసి, కోవెల జీర్ణోద్ధరణను గూర్చి సూచనలను, ప్రవచనాన్ని అనుగ్రహించారు. శ్రీరామనవమి కార్యక్రమంలో 2,3 రోజులైనా పాల్గొనే ప్రయత్నం చేస్తామని మాట ఇచ్చారు.

అనంతరం మదనపల్లి గీతాజ్యోతి ధర్మక్షేత్ర కార్యక్రమంలో పాల్గోటానికి శ్రీస్వామివారు బయలుదేరారు.

**మదనపల్లి గీతాజ్యోతి ధర్మక్షేత్రం:** 5.12.03 సాయంత్రం 6గంటలకు శ్రీస్వామివారు మదనపల్లి పట్టణానికి వేంచేసారు. మదనపల్లి వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమతి ఇందిరా ప్రభాకరరెడ్డిగారు తదితర ప్రముఖులు శ్రీవారికి స్వాగతం పలికారు. వెంటనే గీతాజ్యోతి శోభాయాత్ర వివిధగ్రామాలనుండి వచ్చిన భజన బృందాలతో అశేషజన వాహినితో అత్యంత వైభవంగా జరిగింది.

డిసెంబర్ 6వ తేదీన Z.P.H.స్కూలులో జరిగిన సదస్సులో శ్రీస్వామివారు గీతాజ్యోతి సందేశాన్ని అందించి శ్రీకృష్ణపూజలను నిర్వహించారు. అనంతరం భక్తులచేత ఆవునేతి దీపాలతో గీతాజ్యోతి ప్రతిజ్ఞ చేయించారు. ఈ కార్యక్రమంలో శ్రీమాన్ కలిచర్ల ప్రభాకరరెడ్డిగారు, శ్రీమాన్ కడప సుధాకరరెడ్డిగారు, శ్రీమాన్ ప్రకాశరావుగార్లు ముఖ్య అతిథులుగా పాల్గొన్నారు. V.T. కార్యదర్శి శ్రీనరసింహాచారిగారు, కోశాధికారి శ్రీకేశాచార్యులుగారు, శ్రీ పెరుమాళ్ళు, శ్రీవిశ్వేశ్వర శర్మ, శ్రీచక్రవర్తి, శ్రీసాయి, శ్రీమతి సత్యభామ, శ్రీవిజయభాస్కర్‌చౌదరి, శ్రీమతి పద్మజ, శ్రీ చెంగళ్‌రాయుడు, శ్రీనాగేంద్రసాయి (చిత్తూరుజిల్లా గీతాజ్యోతి కన్వీనర్) వాసవి మహిళాక్లబ్, ఆర్యవైశ్య యువజన సంఘం తదితర ప్రముఖులెందరో కార్యక్రమ విజయానికి గణనీయమైన కృషిచేసారు.

7వ తేదీన ధర్మక్షేత్ర కార్యక్రమానికి వేదిక ఏర్పాట్లు చేసిన శ్రీమాన్ చౌదరిగారి కాలేజీని దర్శించి శ్రీస్వామివారు బెంగుళూరు మీదుగా హైద్రాబాద్ చేరారు. 8.12.03న శ్రీస్వామివారు ముఖ్యమంత్రి శ్రీనారా చంద్రబాబునాయుడిగారితో సమావేశమయ్యారు. ఇంతవరకూ జరిగిన గీతాజ్యోతి కార్యక్రమాల ప్రోగ్రెస్‌ను సి.యమ్‌కు చెప్పి, టి.టి.డి ఈ కార్యక్రమాలలో చొరవ చూపించాల్సిన ఆవశ్యకతను, బాధ్యతను గుర్తుచేసారు. తిరుమల కొండమీది చరిత్ర పరిరక్షణకోసం చేపట్టవలసిన అంశాలను హెచ్చరించారు. దేవాలయభూములను ప్రభుత్వ పథకాలకోసం విచక్షణారహితంగా దానాలు చేసే విషయంలో తీవ్రమైన అసంతృప్తిని వ్యక్తం చేసారు. అంతకుముందురోజే పేపర్‌లో కనిపించిన శ్రీరాంకుప్పం(చిత్తూరుజిల్లా)లోని కోదండరామ స్వామివారి ఆలయానికి చెందిన 125 ఎకరాల భూమిని ప్రభుత్వం డాబర్ కంపెనీకి అప్పగించిన విషయాన్ని శ్రీస్వామివారు ఉదాహరణగా చూపారు. దానిపై వెంటనే సి.ఎమ్ స్పందిస్తూ ఆ ఆర్డర్‌ను కాన్సిల్ చేయించారు.

ఇలాంటి పొరపాట్లకు అవకాశమిచ్చే జి.వో. 405(2002 సంవత్సరం మేలో రూపొందించబడిన) పై తగు చర్యతీసుకోవడం అవసరమని శ్రీస్వామివారు స్పష్టం చేసారు. టి.టి.డి. 90కోట్ల రూపాయలు వెచ్చిస్తూ వివిధ నియోజక వర్గాలలో ఎమ్.ఎల్.ఎ.ల ద్వారా "గీతామందిరాలకు" నిర్మింపచేసే పథకాన్ని ప్రస్తావించి ఈ చర్య దేవస్థానపు నిధులను దుర్వినియోగం చేయడమేనని రాజకీయ ప్రయోజనాలు దానిలో స్పష్టంగా కనిపిస్తున్నాయని, ప్రభుత్వానికికాని, వ్యక్తిగతంగా సి.ఎమ్‌కు కానీ, టి.టి.డి భవిష్యత్తుకు కాని మంచిదికాదని శ్రీస్వామివారు తెలియచేసారు.

ఆ తర్వాత యాదగిరి గుట్టపై జరిగిన శ్రీసుదర్శన యజ్ఞపూర్ణాహుతి కార్యక్రమంలో పాల్గొన్నారు. దేవాదాయశాఖ కమీషనర్ శ్రీమాన్ రమణాచార్యులుగారు కూడా ఈ కార్యక్రమంలో

పాల్గొన్నారు. ఆలయ సంప్రదాయాల పరిరక్షణలో స్థానాచార్యుల పాత్ర. అవి లేకపోవడం వల్ల ఇప్పుడు కలుగుతున్న నష్టాలు ఈ వ్యవస్థను పునరుద్ధరించుకోవాల్సిన అవసరాన్ని గూర్చి శ్రీస్వామివారు తమ ప్రవచనంలో వివరించారు.

ఈ కార్యక్రమ అనంతరం ఇబ్రహీంపట్నం వద్ద ఉన్న రాజ్యలక్ష్మి రైస్‌మిల్‌ను ప్రారంభించి, వనస్థలిపురం "వికాసతరంగిణిశాఖ, దశమ వార్షికోత్సవం"లో పాల్గొన్నారు. ఈ సందర్భంగా ఈ శాఖ వారు రూపొందించిన "ప్రత్యేక సంచిక"ను శ్రీస్వామివారు ఆవిష్కరించారు.

హైదరాబాద్‌నుండి శ్రీస్వామివారు 10వ తేదీరాత్రి కుంచెనపల్లి గ్రామానికి విచ్చేసి "గీతాజ్యోతి సందేశాన్ని" భక్తులకు అందించారు. 11వ తేదీన విజయవాడ నగంలోని "ముత్యాలంపాడు"లో విష్ణు సహస్రనామ గోష్ఠివారు 108 ఏకాహాలు పూర్తిచేసిన సందర్భంగా షిర్డిసాయి మందిరంలో ఏర్పాటు చేసిన సమావేశంలో శ్రీస్వామివారు పాల్గొన్నారు. అనంతరం మంగళగిరిలో శ్రీమాన్ వి. నాగేశ్వరరావుగారి గ్రానైట్ ఫ్యాక్టరీని ప్రారంభించి, గుంటూరులోని రామ నామక్షేత్ర కార్యక్రమంలో పాల్గొన్నారు. ఈ సమావేశంలో పెదనందిపాడు ధర్మక్షేత్ర నిర్వాహ కులు శ్రీమాన్ శేషగిరిరావుగారు రూ.71,169/- గీతాజ్యోతి ప్రచార కార్యక్రమ నిమిత్తంగా అవసరమైన సాహిత్య ముద్రణకోసం, గతంలో వారు వినియోగించిన సాహిత్య సామాగ్రి కోసం శ్రీస్వామి వారికి సమర్పించారు.

గీతాజ్యోతి ప్రచార కార్యక్రమానికి వాహనాల పరంగ ప్రచారకుల పరంగా, ప్రచార సామగ్రి ముద్రణపరంగా ఎంతో వ్యయమౌతున్నది. ప్రచారం సమర్థవంతంగా సాగాలంటే వదాన్యతతో ఉద్యమాన్ని ఆర్థికంగా బలోపేతం చేసేందుకు శ్రీ శేషగారిరావుగారిని స్ఫూర్తిగా చేసుకొని కార్యకర్తలు ముందుకు వచ్చి ఆర్థిక సహకారాన్ని అందించాల్సిన అవసరముంది.

12వ తేదీరాత్రికి శ్రీస్వామివారు జగ్గయ్యపేట లోని శ్రీకాకతీయ సిమెంట్స్ ఆవరణలో ఉన్న శ్రీపాంచరాత్రాగమ పాఠశాలను దర్శించి, పర్యవేక్షించారు. సమర్థవంతంగా పాఠశాలను నిర్వహిస్తున్న మన వికాసతరంగిణి ఉపాధ్యక్షులు శ్రీమాన్ వీరయ్యగారి (కాకతీయ సిమెంట్స్, కల్లూరు సుగర్ ఫ్యాక్టరీల నిర్వాహకులు)కి శ్రీస్వామివారు మంగళాశాసనం చేసారు.

**కోదాడ గీతాజ్యోతి ధర్మక్షేత్రం:** 13వ తేదీరాత్రికి కోదాడ ధర్మక్షేత్రానికి శ్రీస్వామివారు విచ్చేసారు. శ్రీమాన్ కాశీనాధంగారింట్లో శ్రీవారు విడిది చేసారు. శ్రీమాన్ కాశీనాధం, వారబ్బాయి శ్రీమాన్ కోటేశ్వరరావు, శ్రీమతి లక్ష్మిగారు, శ్రీమాన్ గురవయ్య, శ్రీమాన్ ఇమ్మిడి నరసింహారావుగార్లు ప్రభృతుల సమిష్ఠికృషితో కోదాడ ధర్మక్షేత్రం 108 గ్రామాలలో ప్రచార కార్యక్రమాన్ని పూర్తి చేసుకొని శ్రీస్వామివారి మంగళాశాసనాలకు సిద్ధమైంది. 14వ తేదీన పశువైద్యశిబిరాన్ని ప్రారంభించి, శ్రీస్వామివారు 'వైష్ణవి ప్రాంగణం'లో నిర్వహించిన ధార్మిక సదస్సులో పాల్గొన్నారు. వివిధ గ్రామాల ప్రతినిధుల అభిప్రాయాలను విని భక్తులనుద్దేశించి శ్రీస్వామివారు గీతాజ్యోతి సందేశాన్ని అందజేసారు.

ఆ తర్వాత సాయంత్రం మహావైభవంగా కోదాడ వీధుల్లో శోభాయాత్ర కన్నులవిందుగా జరిగింది. అనంతరం శ్రీకృష్ణపూజలు, ఆవునేతి దీపాలతో గీతాజ్యోతి ప్రతిజ్ఞ జరిగాయి. కార్యక్రమ అనంతరం రాత్రికి శ్రీస్వామివారు గంపలగూడెం చేరారు.

**గంపలగూడెం గీతాజ్యోతి ధర్మక్షేత్రం:**

శ్రీస్వామివారికి శ్రీమాన్ కొల్లా వెంకటేశ్వర రావుగారి నూతనగృహం వసతిగృహంగా ఏర్పాటైంది. 15వ తేదీ ఉదయం మహిళలకు ఏర్పాటు చేసిన ఉచిత వైద్య శిబిరాన్ని శ్రీస్వామి వారు ప్రారంభించారు. తుఫాను కారణంగా గాలి, వాన తాకిడి ఉన్నప్పటికీ ధార్మిక సదస్సు ప్రారంభమైంది. వర్షంలోనే శ్రీస్వామివారు ఇచ్చిన గీతాజ్యోతి సందేశాన్ని భక్తులు ఎంతోశ్రద్ధతో





స్వీకరించారు. 16వ తేదీ ఉదయం కళ్యాణ మండపంలో సామూహిక శ్రీకృష్ణపూజలను, ఆవునేతి దీపాలతో గీతాజ్యోతి ప్రతిజ్ఞను శ్రీస్వామి వారు నిర్వహించారు.

ఎంతో శ్రద్ధాసక్తులతో గంపలగూడెం ప్రచార కార్యక్రమ నిర్వహణ బాధ్యతలు స్వీకరించిన శ్రీమాన్ కోటేశ్వరరావుగారు, శ్రీమతి జయప్రద దంపతులకు స్వామివారు మంగళాశాసనాలు చేసారు. తత్త్వశాస్త్ర ప్రచారకురాలు శ్రీమతి హైమతిగారు చక్కగా ఈ ధర్మక్షేత్ర ప్రచారబాధ్యతలు నిర్వహించారు.

**ధనుర్మాస కార్యక్రమం-ఖమ్మం:**

16వ తేదీ సాయంత్రానికి శ్రీస్వామివారు ఖమ్మం పట్టణం చేరారు. ఖమ్మం జిల్లా గీతాజ్యోతి కన్వీనర్ శ్రీ ఇ. రామారావుగారు ధనుర్మాస నిర్వహణకు అవసరమైన ఏర్పాట్లన్నీ చేసి, శ్రీవారి రాకను శోభయాత్రతో ప్రారంభించడానికి చక్కని ఏర్పాట్లు చేసారు. శ్రీమాన్ మన్నా మాధవరావుగారి ఆధ్వర్యవంలో సర్వాంగ సుందరంగా అలంకరించిన 88 జతల ఎడ్లు శోభాయాత్రకు సిద్ధమయ్యాయి. గోధూళిలో ఖమ్మం పట్టణాన్ని పవిత్రం చేయడానికా అన్నట్లు, వేలాది భక్తులు 'జై శ్రీమన్నారాయణ' నినాదాలు చేస్తుంటే ఎడ్లు ముందుకు నడుస్తూ శ్రీస్వామివారి "శోభాయాత్ర" మహావైభవంగా సాగింది 4గంటలపాటు. సుమారు 10వేల మందితో సాగిన ఈ శోభాయాత్ర పెవిలియన్ గ్రౌండ్స్‌లోని 'శ్రీరంగధామ వేదిక' వద్దకు చేరింది.

ధనుర్మాస ప్రారంభోత్సవ సమావేశానికి పలువురు నగరప్రముఖులు విచ్చేసారు. శ్రీలక్ష్మీనారాయణగారు, శ్రీ కోటేశ్వరరావుగారు, శ్రీ మనోహర్‌గారు, శ్రీమతి స్వర్ణకుమారి, శ్రీ విశారదన్, శ్రీ షేక్ జాన్ మహమద్, శ్రీమతి నాగమల్లికావంటి ప్రముఖులందరు ఈ సమావేశంలో ప్రసంగించి స్వామివారితో ధనుర్మాస వైభవాన్ని పొందే అదృష్టాన్ని కొనియాడారు.

ప్రతిరోజూ ఉదయం ఉపనిషత్ ప్రవచనాలు, సాయంకాలం తిరుప్పావై ప్రవచనాలు సాగుతూ వేలాది భక్తులను అలరిస్తున్నాయి. పెవిలియన్ గ్రౌండ్స్ ప్రక్కనే ఉన్న శ్రీభక్తరామదాసు కళాకేంద్రంలో భక్తులకు వసతిని తదియారాధన ఏర్పాట్లను నిర్వాహకులు చక్కగా చేసారు. శుక్రవారాల్లో శ్రీరామపూజలు, లక్ష్మీనారాయణ పూజలలో భక్తులు చక్కగా పాల్గొన్నారు.

25వ తేదీన వెంకటాయపాలెంలో శ్రీస్వామి వారు పశువైద్య శిబిరాన్ని ప్రారంభించారు. 27వ తేదీన SBH ATM శాఖ కార్యాలయాన్ని ఖమ్మం పట్టణంలో ప్రారంభించారు. 28వ తేదీన 1200మంది శ్రీస్వామివారి వద్ద సమాశ్రితుల య్యారు. 29వ తేదీన శ్రీస్వామివారు భద్రాచలంలో జరుగుతున్న అధ్యయనోత్సవ వేడుకలలో పాల్గొన్నారు.

ఈ సందర్భంగా 20 రోజులపాటు జరిగే 'అధ్యయనోత్సవ వేడుక'ల ప్రాధాన్యాన్ని శ్రీస్వామివారు వివరించారు. ఆళ్వార్ల గొప్పతనాన్ని చాటి, వారి ప్రబంధాల విశిష్ఠతను తెలియ జేయాల్సిన ఈ వేడుకలు కేవలం "ముక్కోటి ఏకాదశి"కే పరిమితం అవడం సమంజసం కాదని శ్రీస్వామివారు తమ ప్రవచనంలో స్పష్టం చేసారు. డిసెంబర్ 31వ తేదీ ఆంగ్ల సంత్సరం చివరిరోజు కావడంతో 2003 వీడ్కోలు చెప్పి 2004ను ఆహ్వానించటానికి వివిధ ప్రాంతాలనుండి వందలాదిగా భక్తులు శ్రీస్వామివారి మంగళా శాసనాల కోసం విచ్చేసారు.

శ్రీవారున్న వసతివద్ద ఉన్న స్థలాభావం దృష్ట్యా 31వ తేదీ అర్థరాత్రి శ్రీస్వామివారు "శ్రీరంగనాథ మంటపం"లోనే భక్తులనుద్దేశించి ప్రసంగించి నూతన సంవత్సర శుభాకాంక్షలు అందించారు. ఆ తర్వాత శ్రీరామారావుగారు భక్తులందరికీ స్వీట్లను పంపిణీ చేయించారు. ఈ కార్యక్రమం ముగిసేసరికి రాత్రి ఒంటిగంట అయంది. ఈ విధంగా 2003కు ఘనంగా వీడ్కోలునూ భగవన్నామస్మరణం మధ్య 2004కు స్వాగతం పలికారు మన స్వామివారు.

ఓం అస్మత్ గురుభ్యో నమః

# పదాలవిందు-4 పూరించండి:



**అడ్డము:-**

1. స్త్రీలలో ఉత్తమజాతి (3)
2. అష్టకర్ణం 6 చెవులకు వినపడకూడనిది (3)
3. పొట్టకు తాడు కలవాడా! (4)
4. ...... దమాదులు (2)
5. కృష్ణ తత్త్వంలో మిగిలిన భారం (2)
6. భక్తిసూత్రములందించినమహానుభావా (3)
7. ఈనక్షత్రంలో పుడితే ధరణి నేలవచ్చుట (3)
8. ఇది కలవారికి పరమాత్మే అమ్ముడై పోతాడట
9. ఎన్నో ఆటంకాలెదురైనా పట్టుదలతో ప్రయత్నించే..... పేరే
10. ముముక్షువు కోరుకునే కాంత (2)
11. తమిళంలో చెరువు, ఓ ఆళ్వారిపేరు
12. యజ్ఞయాగాదులలో దేవతలకి ప్రీతి కలిగించే గానం
13. యోగంలో చిత్తాన్ని విషయముల నుండి మరల్చుట
14. హనుమ సుగ్రీవునికి...... (2)
15. యోగానికి మొదటి అంగం (2)
16. శ్రీరంగనాథునికే ఆచార్యులైన ముని (4)
17. దేవతలే భర్తరూపంలో వచ్చినా అసలు భర్తనే 2వసారి స్వయంవరమాడిన పతివ్రత (4)
18. త్రాగదగినది (3)
19. ఆండాళ్ బృందం నీళాదేవినర్థించిన 'ఉక్కుమువమ్' సంస్కృతిలో (3)

9





**నిలువు:-**

1. పద్మోద్భవుని తండ్రిని పిలవండి (4)
2. నీరునిచ్చేదానా! (3)
3. దాసుని భావము (2)
4. పదిదిక్కుల రథమునడుపగలవాడా (4)
5. వ్యూహమే, బలరామునిపేరు (4)
6. ఇది పరమాత్మ పట్ల ఉంటే మిగిలినది తృణప్రాయమే (2)
7. మన దేశానికా పేరు తెచ్చిన చక్రవర్తి (3)
8. విభీషణుని భార్య (3)
9. శివపార్వతులు అభిమానించిన ఓ ఆళ్వార్ (4)
10. మన్మథుని జీవింప చేసుకొన్న ఆమె (2)
11. ఒక ఆళ్వార్లుకి గురువైన మరొక ఆళ్వార్లు (2)
13. గోపికలని కృష్ణునితో చేర్చిన వ్రతం (4)
14. ఓ తమిళ అమ్మాయి తల్లకిందులైంది.
15. ఓంగి ఉళగన్ద ఉత్తమావతారం (4)
16. కదనంలాంటిదే, చంద్రబింబంతో పోలుస్తాం(3)
17. సంస్కృతంలో మనం (2)
18. రక్షించు అనే ప్రార్థన, రామదాసు కీర్తన (2)
19. "అ"తో కూడి ఉంటే లోటేలేదు. అదిలేక పరిస్థితి తిరగబడి అంతా ఖర్చయిపోతుంది (2)

## పదాలవిందు-3: సమాధానాలు

| 1 ప్ర | తి | 2 మా | ■ | 3 మ | రు | 3 పు | ■ | 4 స | తి |
|---|---|---|---|---|---|---|---|---|---|
| భా | ■ | 2 త | ల్లి | ■ | ■ | న్న | ■ | రి | ■ |
| ■ | 5 వా | లి | ■ | 6 మా | లి | మి | ■ | 7 సం | త |
| 8 క | రి | ■ | 9 మో | వి | ■ | ■ | ■ | ఖ్య | ■ |
| లి | ■ | 10 క | దం | ■ | 11 గ | తి | ■ | ■ | ■ |
| 12 మి | క్కి | లి | ■ | 13 మ | రి | ది | ■ | 7 స | ■ |
| ■ | ■ | ■ | మ | హి | మ | ■ | 15 అ | రి | ■ |
| 16 స | 17 మా | ధి | ■ | షి | ■ | 18 హ | ■ | 18 గ | ద |
| 17 త | ల | ■ | 12 ప | ■ | 19 అ | ను | ప | మ | ■ |
| తం | ■ | 20 ము | ది | మి2 | ■ | మ | ■ | లు | ■ |

ముందుగా సమాధానాలు వ్రాసి పంపినవారి పేర్లు ప్రచురించుతాం. మీరు చేయవలసిన పని సంచికలోని పదాలవిందు శీర్షికను పూరించి 20వ తారీఖులోగా పంపిచవలెను.

## విషయ సూచిక.....



## పంచాంగ వివరాలు

**ఫిబ్రవరి 2004**

9 తిథి ద్వయం
10 పంచమి తిథి కూరత్తాళ్వాన్ తిరు॥
శ్రీవైష్ణవ గృహాలలో ద్రావిడ వేదాధ్యయన ప్రారంభం
13 కుంభ సం॥ ప 2-45
16 సర్వేషామేకాదశి
18 మహాశివరాత్రి శ్రీశైలం వేములవాడాది శైవక్షేత్రములలో అభిషేక కల్యాణోత్సవములు
20 సర్వేషాం అమావాస్య
22 శ్రీయాదగిరి శ్రీలక్ష్మీ నృసింహస్వామివారి బ్రహ్మోత్సవారంభం
23 చవితి తిథి
24 శూన్యతిథి
25 పంచమితిథి
29 శ్రీలక్ష్మీనృసింహస్వామివారి కల్యాణ మహోత్సవం, తిరుకచ్చినంబి తిరు॥

**మార్చి**

1 యాదగిరి రథోత్సవం
2 సర్వేషాం ఏకాదశి కులశేఖరాళ్వార్ తిరు॥ తిరుమాలైయాండాన్ తిరు॥
4 కామదహనం
5 పిళ్లై ఉరంగావిల్లి దాసర్ తిరు॥
6 హోళికోత్సవం
7 వసంతోత్సవం

**ముఖచిత్ర వివరణ:** 1.శ్రీగోపాలోపాయన పురస్కార గ్రహీతలైన శ్రీ ఉ.వే. శ్రీమాన్ వేంకటాచార్యస్వామి వారిని సమ్మానిస్తున్న శ్రీశ్రీశ్రీ జీయరుస్వామివారు.

2. జనవరి 26న అల్లంపల్లిలో జీయర్ గురుకుల పాఠశాల ప్రారంభోత్సవ దినాన రిపబ్లిక్ డే సందర్భంగా జాతీయ పతాకావిష్కరణ కావిస్తున్న శ్రీశ్రీశ్రీ స్వామివారు. మిగిలిన చిత్రాలకు 28వ పేజీలో చూడండి.


మా సేవలో.... 

**భక్తినివేదన,** సీతానగరం-522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, ✆ (08645) 272929,
**చందావివరాలు** :- సంవత్సరచందా రూ. 50/-, జీవితచందా రూ. 500/-,
విదేశాలకు సంవత్సరచందా $ 25,
E-mail : jetsitanagaram@yahoo.com Internet : www.chinnajeeyar.org
D.T.P. & Design by : పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం,


శ్రీమతే రామానుజాయ నమః

# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాస పత్రిక




స్వభాను నామ సంవత్సరం మాఘమాసం

**సంపుటి 56** **2004 ఫిబ్రవరి** **సంచిక 11**

వ్యవస్థాపకులు
శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యులు
శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు

సంపాదకులు :
శ్రీ ఉ. వే. శ్రీమాన్ T.P. **శ్రీరామచంద్రాచార్యులు**

సంపాదకీయం

# ఎవరి ధర్మం వారిని రక్షిస్తుంది

సమాజం సజావుగా సాగటానికి తోడ్పడేది ధర్మం. ప్రతివ్యక్తీ ఒరులకు తనవల్ల చేటు కలక్కుండా తాను సుఖంగా బతకటానికి కొన్ని 'కట్టుబాట్లు' ఏర్పడ్డాయి. సామాజిక సామరస్యానికి కాని వైయక్తిక-అభ్యుదయా నికి కాని వీటిని అంతా అనువర్తించాలి. ఇందులో కొన్ని కర్తవ్యాలుంటాయి. కొన్ని అకర్తవ్యాలుంటాయి.

సత్యం పలకటం, ఉపకారం చెయ్యటం, ఉపకృతిని గుర్తు పెట్టుకోవటం. ప్రత్యుపకారం కావించటం, దయగలిగి ఉండటం, ఉన్న దాన్ని ఒరులతో పంచు కోవటం, పరదుఃఖాలపట్ల పరితాప పడటం చేతనైనంతలో వాటిని తొలగింప పూనుకోవటం-వంటివి కర్తవ్యాలు.

మాటలతో చేతలతో ఒరులను నొప్పించటం, మేర మీరి వర్తించటం, చెడు తలపులతో దుడుకుగా మెలగటం, ఒరుల సొత్తు హరించటం-వంటివి అకర్తవ్యాలు.

**కర్తవ్యాల నాచరించటం ధర్మం**

**అకర్తవ్యాలను తలపకపోవటం ధర్మం**

**కర్తవ్యాన్ని నెరవేర్చకపోవటం ధర్మాతిక్రమణం**

**చెయ్యకూడనిదాన్ని చెయ్యబూను కోవటం ధర్మాన్ని అతిక్రమించటమే.**

ధర్మానుష్ఠానం అసిధారావ్రతమే అయినా వ్యక్తి ధర్మాన్ని అనుష్ఠించితీరాలి. అతడనుష్ఠించిన ధర్మమే అతణ్ణి రక్షిస్తుంది.

ధర్మానుష్ఠానంలో ఎంతటి గాంభీర్యం ఉందో ఎంతటి క్లేశం ఉందో దాన్ని సక్రమంగా అనుష్ఠించినందువల్ల ఎంత పరితృప్తి ఏర్పడుతుందో, ఎంతటి సత్ఫలితాలు సమకూరుతాయో అన్న దాన్ని మహాభారతం చక్కగా వివరిస్తుంది.

ఇద్దరన్నదమ్ములు. మంచి అనుష్ఠానం, నియమనిష్ఠలు కలవారు. బాహుదానదీ తీరాన ఇద్దరూ వేర్వేరుగా రెండు ఆశ్రమాలు నిర్మించుకుని నివసిస్తున్నారు.

ఒకనాడు తమ్ముడు అన్నగారి ఆశ్రమానికి వచ్చేడు. అప్పుడాశ్రమంలో అన్నగారు లేడు. కాస్సేపు అటూ ఇటూ తిరుగుతూంటే మంచి ఫలవృక్షాలు కనవచ్చేయి. ఓ చెట్టు నుంచి పండొకటి కోసుకొని తినసాగాడు.

ఇంతలో వచ్చేడు అన్నగారు. చూసేడు పండుతింటున్న తమ్ముణ్ణి.

నువ్వు తింటున్న పండెక్కడిది? ఎవరిచ్చేరు నీకు? అన్నాడు.

ఎవరూ ఇవ్వలేదు. ఇక్కడిదే. నేనే కోసుకుతింటున్నాను అన్నాడు తమ్ముడు.

"నీదియ్యకుండా ఒరుల సొమ్ము తీసుకోవటం దొంగతనం. అధర్మం. పంచ మహాపాతకాలలో ఒకటి. కనుక రాజు దగ్గరకు పోయి నీ దొంగతనం మాట చెప్పి దండననుభవించు" అది నీ ధర్మం అన్నాడు అన్నగారు.

వెంటనే తమ్ముడు రాజుదగ్గరకు వెళ్ళి





విషయం చెప్పి తనను దండించమన్నాడు. రాజు- తప్పుచేసేవు. అది తప్పని తెలుసుకున్నావు. కనుక వేరే శిక్ష అక్కరలేదు అన్నాడు. కాని తనను శిక్షించాల్సిందే అన్నాడు తమ్ముడు. పరితాపం చాలదు. దండన శారీరకంగా అనుభవించాల్సిందే అన్న తలపుతో.

అప్పుడు రాజు అతని రెండు చేతులూ తెగనరికించేడు. చేతులు తెగిన తమ్ముడు అన్నగారి దగ్గరకు వచ్చి అధర్మంగా వర్తించేను దానికి తగిన దండన పొందేను. నన్ను మన్నించు అన్నాడు.

నీమీద నాకేం కోపంలేదయ్యా, ధర్మాన్ని అతిక్రమించేవు దండన అనుభవిస్తున్నావు. దీనివల్ల నీ పాపం పోయింది. సుఖంగా ఉంటావు పోయి నదిలో (బాహుద) స్నానం చేసిరా అన్నాడు అన్నగారు.

"బాహుద"లో తమ్ముడు మునగగానే చేతులు మొలుచుకు వచ్చేయి.

ఆశ్చర్యంతో ఆనందంతో అన్నగారికి తన చేతులు చూపించేడు తమ్ముడు.

అవును తమ్ముడూ నా తపశ్శక్తి వల్ల నీకు చేతులు వచ్చేట్టు చేసేను అన్నాడు అన్నగారు.

అయితే నన్ను ముందే తపశ్శక్తి వల్ల ఎందుకు పరిశుద్ధుణ్ణి చేయలేదు అన్నాడు తమ్ముడు.

నాయనా, దండనాధికారం నాదికాదు. అది రాజధర్మం దాన్ని అనుష్ఠించి అతడు కృతార్థుడయేడు. దండనం పొంది నువ్వు పరిశుద్ధుడివయ్యేవు. నీలో దోషాలు తొలగిపోయేయి. కనుక ఇప్పుడు నా తపశ్శక్తి వల్ల నీకు చేతులు వచ్చేట్టు చేయగలిగేను అన్నాడు అన్నగారు.

ధర్మం తెలిసినవాడు కనుక అన్నగారు తమ్ముని దండన అనుభవించమన్నాడు. తన ధర్మాన్ని తాను పాటించేడు. దండనం రాజు ధర్మం కనుక దండనాన్ని విధించి తాను కృతకృత్యుడయేడు రాజు. అకృత్యానికి దండన పొంది పరిశుద్ధుడై ధర్మాన్ని ఆచరించిన వాడు కనుక చేతులను మళ్ళీ పొందగలిగేడు తమ్ముడు.

రాజు, అన్నదమ్ములిద్దరూ ఎవరి ధర్మాలను వారు నిర్వర్తించినారు.

స్వధర్మాచరణం వల్ల కృతార్థులయేరు.

సృష్టిలో ఎవ్వరూ తమ ధర్మాన్ని అతిక్రమించి నడచుకోకూడదు.

మనిషేకాదు నేల, నింగి, నీరు, నిప్పు ఏవీ తమ ధర్మాన్ని తాము మీరి వర్తింప రాదు. అట్లా మీరితేనే ప్రకృతిలో వైపరీత్యాలు సమాజంలో సంక్షోభాలూనూ.

వ్యక్తులు తాము ధర్మానుష్ఠాన పరు లయి తమ ధర్మ నియత సామాజిక వర్తనం ద్వారా ప్రకృతినీ ధర్మబద్ధంగా నిలుపుకోవాలి.

అప్పుడే లోకంలో సుఖశాంతులు.

చెప్పటం తేలిక. ఆచరణం ఆషామాషీ కాదు. కాలాలు గడచిన కథలు ఇవి అను కోవచ్చు. కాని యీ కాలంలోనూ కనీసం ఈ ధర్మానుష్ఠానంలో ఉన్న 'స్ఫూర్తి'ని బుద్ధి మంతులు గ్రహించాలని వీటిని ప్రస్తావించటం.

**- శ్రీరామచంద్రాచార్య**

# మహర్షుల చరిత్ర

## త్రసదస్యు మహర్షి

తమిళమూలం :
వైై.వా. నావల్‌పాకం దేవనాథ తాతాచార్యస్వామి

తెలుగు సేత :
శ్రీ.ఉ.వే.ప్ర శ్రీమాన్ తూపురాణి ఉడయవర్‌స్వామి, విజయవాడ

జడభరతుడు తల్లిగర్భం నుండి బయటపడిన వెంటనే శఠవాయువు ఆయనను ఆక్రమించి కప్పివేయాలని ప్రయత్నించింది. కాని జడభరతుడు దానిని త్రిప్పి తరిమికొట్టడంతో, పుట్టడానికి పూర్వం తనకున్న తత్త్వజ్ఞానాన్ని ఏమాత్రం పోగొట్టుకోకుండా కాపాడుకోగలిగాడు. అందుచేతనే నిద్రాహారాలు లేకపోయినా ఏ కష్టమూ లేకుండా జీవించాడు. తన యోగము పూర్తి అయిన వెంటనే ఈ శరీరాన్ని విడచి పెట్టి ఆత్మానందాన్ని అందుకున్నాడు. ఈతనికి తల్లిదండ్రులు పెట్టినపేరు 'భరతుడు'. ఈ పేరుకు ముందు 'జడ' అనేమాట చేర్చి లోకులు వ్యవహరించగా ఇదే పేరు (జడభరతుడు) ప్రసిద్ధిచెందింది. లోకుల దృష్టిలో ఇతడు మూర్ఖుడుగానే గోచరించాడు.

ఇక రెండవ వారు నమ్మాళ్వార్. వీరిని గూడ పుట్టిన వెంటనే శఠవాయువు కప్పివేసి వారి తత్త్వజ్ఞానాన్ని నశింపచేయాలని చూచింది కాని, నమ్మాళ్వార్లు దానిని తమ దగ్గరకు రాకుండ తరిమి కొట్టారు. తల్లి గర్భంలో ఉండగా కల్గిన తత్త్వజ్ఞానం ఏమాత్రము తగ్గకుండ పుట్టిన పిదప కూడ అదే తాత్త్విక చింతన దినదినాభివృద్ధి చెందింది. అందుచేతనే వీరికి **'మారన్ శఠకోపన్'** అనేపేరు ఏర్పడింది.

**యన్ముహూర్తం క్షణంవాపి, వాసేదేవో న చింత్యతే।**
**సా హాని స్తన్మహచ్ఛిద్రం, సా భ్రాన్తిః సా చ విక్రియా॥**

"ఏ క్షణమందు మనము భగవంతుని విస్మరింతుమో, ఆ క్షణమందే మనలో అనేక అనర్థములు ప్రవేశించి విపరీత జ్ఞానం కలిగి, నిషిద్ధాచారమునందు ఆసక్తి కలిగి మనము నశించి పోవుటకు అవకాశము ఏర్పడుచున్నది." అని పై శ్లోకము చెప్పినట్లు వీరు తమ జీవితకాలంలో భగవానుని ఒక్కక్షణం కూడ మరచిన వారు కారు. ఆ పరబ్రహ్మానంద అనుభవంలో పరిపూర్ణంగా మగ్నులైనవారు కావడం చేత వీరికి లౌకిక సుఖములన్ని సారహీనములుగనే గోచరించినవి.

ఈ స్థితినే ఆళవందారు తమ స్తోత్రరత్నంలో ఈ విధంగా వర్ణించారు.

**శ్లో॥ తవామృతస్యందిని పాదపంకజే**
**నివేశితాత్మా కథమన్యదిచ్ఛతి ।**
**స్థితేऽరవిందే మకరంద నిర్భరే**
**మధువ్రతో నేక్షురకం హి వీక్షతే॥**

శఠమను వాయువును కోపించిన వీరందరూ సంసారయాత్ర సాగిస్తూనే బ్రహ్మజ్ఞానమును స్వాధీనము కావించుకొనిన మహానుభావులు. వీరెవ్వరికీ భార్య, పిల్లలు మొదలైన ప్రతిబంధకము లేవీ లేవు. కానీ, ఈ గోత్ర ప్రవర్తకుడైన శఠమర్షణ మహర్షి విషయంలో మాత్రం ఒక ప్రత్యేకత ఉంది.

శఠమర్షణ మహర్షికి భార్యలు, లెఖ్ఖ లేనంత సంతానం, ఉన్నట్లు మనకు ఈ కథలోనే 'ప్రవర' ఋషుల చరిత్రలో తెలియబోతోంది. ఈ ప్రవర ఋషుల చరిత్ర ఇపుడు పరిశీలిద్దాం.

వీరిలో మొదటి మహర్షి 'అంగిరసుడు' ఈయన చరిత్ర వేద, ఇతిహాస, పురాణాల్లో విస్తరంగా వివరించబడి ఉంది. ఈయన పేరు, ఈ శఠమర్షణ గోత్రంలోని ప్రవరలో మాత్రమే కాక





అనేక ఇతర గోత్రాల ప్రవరలలో కూడ మనకు కనబడుతూ ఉంటుంది. ఈయన గొప్పదనం కూడ మనం 'అంగిరస మహర్షి" అనే వ్యాసంలో చూడగలము.

చతుర్ముఖ బ్రహ్మ నోటినుండి ఆవిర్భవించిన ఈ అంగిరస మహర్షి, కర్దమ ప్రజాపతి కుమార్తె అయిన 'శ్రద్ధ'ను వివాహం చేసుకున్నాడు. దేవగురువైన బృహస్పతి, ఉశత్యుడు ఈ మహర్షి కుమారులే. ఈ వంశంలోని వాడే 'పురుకుత్స' మహర్షి. వీరి చరిత్ర కూడ "కుత్స మహర్షి" అనే వ్యాసంలో మనం పరిశీలించగలం.

### త్రసదస్య మహర్షి

పురుకుత్స మహర్షి కుమారుడే త్రసదస్య మహర్షి. శఠమర్షణ గోత్రంలోని ప్రవర ఋషులలో మూడవవారు. వీరి పేరే వీరి గొప్పతనాన్ని మనకు తెలియచేస్తుంది. ఈ పేరును త్రస+దస్యు అని రెండు భాగములుగా చేయవచ్చును. ఇది కూడ కారణపేరే, అనగా యౌగికముగా ఏర్పడినదే.

'దస్యు' అనే పదం వేదాలలో మనకు విస్తరంగా గోచరిస్తుంది. 'దొంగలు', 'దుష్టులు', 'రౌడీలు' అని ఈ పదానికి అర్థం వ్యాఖ్యాతలు చెప్పి ఉన్నారు. ఈ దొంగలు మొదలైన వారు వేదకాలం నుండి కూడ లోకంలోని ప్రజలను అనేక విధాలుగా హింసించుచున్నట్లు తెలియ వస్తోంది. ఇంద్రుడు అప్పుడప్పుడు వీరిని నిర్బంధించి శిక్షించినట్లుగా వేదమంత్రాల వల్ల మనకు తెలియవస్తోంది. 'త్రస' అనే పదానికి 'భయపడు' అని అర్థం. ఈ మహర్షిని చూచి ఆ 'దస్యు'లు భయపడి పారిపోయేవారు. కనుక ఈయనకు 'త్రసదస్యు' అనే పేరు ఏర్పడింది.

లోకులకు చక్కని మంచి కార్యాలు అనేకం చేసి ప్రసిద్ధిచెందిన వారు త్రసదస్యు మహర్షి. ఋగ్వేదమంత్రాలలో ఈతని గొప్పదనం విస్తరంగా వర్ణించబడింది. ఋగ్వేద మంత్రాలలో ప్రతిమంత్రానికి ఒక ఋషి, ఒక దేవత, ఒక ఛందస్సు చెప్పబడ్డాయి. అనేక మంత్రాలకు ఈ త్రసదస్యు మహర్షే ఋషిగాను, దేవతగాను చెప్పబడారు.

ఉదాహరణగా ఋగ్వేదం నాల్గవమండలం 42వ సూక్తం ఇలా ఆరంభం అవుతుంది.

మం॥

త్రసదస్యుః **పౌరుకుత్స్యః।**

త్రసదస్యుఃఇంద్రావరుణౌ। త్రిష్టుప్.

**మమ ద్వితా రాష్ట్రం క్షత్రియస్య విశ్వాయోర్విశ్వే అమృతాయథానః।** క్రతుం సచన్తే వరుణస్య **దేవారాజామి** కృష్టేరుపమస్య వవ్రేః ।

ఇలా పదిమంత్రాలతో కూడుకొని ఉన్నది ఈ సూక్తం. ఈ సూక్తాన్ని దర్శించి ఉపదేశించినవాడు 'త్రసదస్యు మహర్షి'. ఈ సూక్తం 'త్రిష్టుప్' అనే ఛందస్సుతో కూడినది. (త్రిష్టుప్‌ఛందస్సులో ఒక్కొక్క మంత్రానికి 44 అక్షరాలు ఉంటాయి.)

ఈ సూక్తమునకు దేవత కూడ 'త్రసదస్యు' మహర్షే. చివరి 10వ మంత్రమునకు మాత్రము 'ఇంద్రవరుణులు' దేవతలు. మంత్రం ఎవరిని గురించి చెబుతుందో అతడే ఆమంత్రానికి దేవత. మంత్రాన్ని దర్శించి ఉపదేశించినవాడే ఆ మంత్రమునకు ఋషి. ఇచ్చట ఆ రెండూ కూడ (ఋషి, దేవత) 'త్రసదస్యు' మహర్షే.

## అభినందనలు

భక్తినివేదన పాఠక కుటుంబాన్ని మరింత పెంచేందుకు కృషి చేస్తున్నవారిలో **శ్రీమతి వై. సుజాత**గారు ఒకరు. వీరు నల్గొండ వికాసతరంగిణిశాఖ సభ్యులు. వీరికి శ్రీశ్రీశ్రీస్వామివారు అనేక మంగళాశాసనములు కృపచేయుచున్నారు.



# రామాయణంలో రమ్య గాథలు

## హనుమంతుని జన్మ వృత్తాంతము

-చెవుటూరి కుసుమ కుమారి, విజయవాడ.

కపిశ్రేష్ఠులారా! నేను నా మనోబలంతో చూడగలుగుతున్నాను. మీకందరకూ సంతోషము కలిగించు విషయమును చెప్పుచున్నాను వినుడు. వాయువేగగామినైన నేను పదివేల యోజనములైన ఎగురగలను అని తలచుచున్నాను.

వజ్రాయుధధారి అయిన దేవేంద్రుని చేతినుండిగానీ, లేక పరమేష్ఠి చేతినుండి అయిననూసరే అమృతమునైననూ ఇక్కడికి తేగలను. లంకా పట్టణమునైననూ నా మూపున మోసుకొని యిక్కడికి తేగలను అని తలచుచున్నాను.

**బుద్ధ్యా చాహం ప్రపశ్యామి మనశ్చేష్టా చ మే తథా**
**అహం ద్రక్ష్యామి వైదేహీం ప్రయోదధ్వం ప్లవంగమాః॥**

మిత్రులైన వానర శ్రేష్ఠులారా! నా మనస్సు నొక్కి వక్కాణిస్తున్నది. నేను తప్పక సీతను చూడగలనని. కనుక మీరందరూ శోకాన్ని విడిచి చిత్తశాంతిని పొందండి. చింతా క్రాంతులు అయిన వానరులకు వాయుపుత్రుని మాటలు అమృతోపమానంగా తోచాయి. సంతోషించిన వానం నాయకుడు జాంబవంతుడు...

నాయనా కేసరీ నందనా! హనుమా! వేగవంతుడా! మహావీరుడా! మా శోకాన్ని నశింపచేసి మా ప్రాణములు కాపాడినావు. తండ్రీ! నీకు శుభమగుగాక! నీ కార్యసిద్ధిని కోరి వానర శ్రేష్ఠులమందరమూ కలసి స్థిరచిత్తులమై మంగళకార్యములాచరించెదము.

**ఋషీణాం చ ప్రసాదేన కపివృద్ధ మతేన చ।**
**గురూణాం చ ప్రసాదేన సంప్లవ త్వం మహార్ణవమ్॥**

నాయనా! హరిశ్రేష్ఠా! పెద్దల ఆశిస్సులచేత, ఋషివరుల అనుగ్రహంచేత నీవు మహాసాగరాన్ని దాటగలవు. నీవు తిరిగి వచ్చువరకు మేము ఒంటి పాదముమీద నిలబడి తపించగలము. నాయనా! సమస్త వానర ప్రాణములూ నీ చేతవున్నవి. తండ్రీ! నీకు శుభమగుగాక! నాయనా! నీకు దైవమను కూలించుగాక! అంతట వానర శ్రేష్ఠుడైన హనుమంతుడు కపిశ్రేష్ఠులారా!

**కోపి లోకే న మే వేగం ప్లవనే ధారయిష్యతి**

నేను ఎగురునప్పుడు నా వేగాన్ని ఈ లోకమున ఎవరూ భరించలేరు. స్థిరమైనవి, మహాఎత్తైనవీ, గొప్పవీ అయిన మహేంద్ర పర్వత శిఖరములు మాత్రమే అందుకు సమర్థములు. కనుక నేనా మహేంద్ర పర్వత శిఖరముమీద నుండే నా వేగమునందుకొందును. అని పలికి, మహేంద్రునితో సమాన బలుడైన ఆ హనుమంతుడు ఆ గిరిని ఎక్కినాడు.

ఆ మహాకపి బాహువుల చేత పీడింపబడిన ఆ మహేంద్ర పర్వతము సింహము చేత కుంభస్థలమున కొట్టబడిన మత్తగజంలా రణగొణ ధ్వని చేసినది. ఆ పర్వతము మీది శిలలు చెల్లాచెదురైనవి. మహా మహా వృక్షములు పెకలి వచ్చినవి. పర్వతమును పట్టి పిండినట్లు సమస్త జలప్రవాహములు స్రవించినవి. సింహశార్దూలాది క్రూరమృగములు కూడా విచలితములు అయినవి. లేళ్ళు మొదలైన అల్పజంతువులు భీతిల్లి పరుగులు పెట్టినవి.

మద్యపానమత్తులై స్త్రీజనముతో విహరిస్తున్న





గంధర్వాదులు, విద్యాధరులు, యక్షులు ఆ పర్వతచరియల నుండి భయముతో విహాయసానికి ఎగిరినారు. అనేక మహోరగాలు పర్వత పీడనానికి నలిగిపోయినవి. శిఖరాగ్రాన జంతువుల వలె శిలలు కూడ ఎగిరినవి. ఆ మహేంద్ర పర్వతమునుండి సగముపైకి వచ్చి శిరస్సులను మాత్రము పైకి పెట్టిన పెద్దపెద్ద సర్పములు ఆ మహేంద్రపర్వతమును అలంకరించిన పతాకాల్లా భాసించాయి.

కించిత్ భయభ్రాంతులై తొట్రుపాటు పడిన ఋషి సముదాయం ఆ పర్వతమును విడిచి వెళ్ళి పోవుచుండగా ఆ మహేంద్రగిరి గుంపునుండి వేరైపోయిన మహారణ్యంలోని బాటసారిలా దృశ్యమానం అయినది.

**"స వేగవాన్ వేగ సమాహితాత్మా**
**హరిప్రవీరః పరవీర హంతా**
**మనస్సమాధాయ మహానుభావో**
**జగామ లంకాం మనసా మనస్వీ"**

మహావేగశాలి, వేగము మీదనే ఏకాగ్ర దృష్టికలవాడూ ఉత్తమోత్తమ మనస్వీ, శత్రుసంహార కుశలుడు సమర్థుడు, మహావీరుడు అయిన హనుమంతుడు ఏకాగ్రచిత్తుడై మనసా లంకా నగరానికి బయలుదేరాడు.

జయ హనుమాన్ జయ జయ హనుమాన్

కిష్కింధకాండ సంపూర్ణము.

## శ్రీలక్ష్మీనారాయణ-శ్రీకోదండరామస్వామివార్ల బ్రహ్మోత్సవములు

లక్షమల్లె పుష్పార్చన సహిత శ్రీలక్ష్మీనారాయణ యాగం

**29.2.04 నుండి 06.03.04 వరకు**

**మన పరమాచార్యులు శ్రీశ్రీశ్రీ పెద్దజీయరుస్వామివారు అర్చామూర్తిగా వేంచేసియున్న శ్రీవాసుదాసాశ్రమంలో (నడిగడ్డపాలెం) శ్రీలక్ష్మీనారాయణ, శ్రీకోదండరామస్వామివార్ల బ్రహ్మోత్సవమునకు భక్తులందరికి ఇదే మా శుభాహ్వానము.**

**విశేష కార్యక్రమాలు:**

| | | |
|---|---|---|
| శని | 28.02.04 రా॥ | విష్వక్సేనారాధన, అంకురారోపణ, వైనతేయ ప్రతిష్ఠాదులు |
| ఆది | 29.02.04 ఉ॥ | ధ్వజారోహణం, అగ్నిప్రతిష్ఠ, వైనతేయ ఇష్టి, రా॥ శేషవాహన సేవ |
| సోమ | 01.03.04 ఉ॥ | విష్వక్సేన ఇష్టి, రా॥ గజవాహన సేవ |
| మంగ | 02.03.04 ఉ॥ | సుదర్శన ఇష్టి, రా॥ హంసవాహన సేవ |
| బుధ | 03.03.04 ఉ॥ | నారసింహ ఇష్టి రా॥ హనుమంతసేవ |
| గురు | 04.03.04 ఉ॥ | హయగ్రీవ ఇష్టి రా॥ గరుడవాహనసేవ |
| శుక్ర | 05.03.04 ఉ॥ | లక్ష్మీనారాయణ ఇష్టి రా॥ అశ్వవాహనసేవ, దోపిడీ ఉత్సవం |
| శని | 06.03.04 ఉ॥ | రథోత్సవం, లక్ష్మీదేవికి 108 కలశక్షీరాభిషేకం, మహాపూర్ణాహుతి, లక్ష్మీనారాయణ కళ్యాణం |

**కైంకర్య వివరములు**

| | |
|---|---|
| ఒకరోజు పూర్తి యాజమాన్యం | రూ.6,000/- |
| ఒకరోజు ఇష్టి కార్యక్రమమునకు | రూ.2,500/- |
| ఒకరోజు బ్రహ్మోత్సవం, వాహనసేవలకు | రూ.3,500/- |
| ఒకరోజు సహస్రదీపారాధన, ఊయలసేవ | రూ.2,000/- |
| ఒకరోజు మల్లెపుష్ప సహస్రనామార్చన | రూ.100/- |
| కళ్యాణ మహోత్సవమునకు | రూ.300/- |

**వివరములకు:** శ్రీవాసుదాసాశ్రమం, నడిగడ్డపాలెం, వయా చుండూరు, గుంటూరుజిల్లా522318.

ఫోన్ : 08644 276150, 276522, 276606.

# శ్రీవిష్ణు మహాపురాణం

## 8వ అధ్యాయం

శ్రీ ఉ.వే. శ్రీమాన్ S.V. రంగరామానుజాచార్యస్వామి, రాజమండ్రి

**విష్ణుః పితృగణః, పద్మా**
**స్వధా శాశ్వతపుష్టిదా।**
**ద్యౌః శ్రీః సర్వాత్మకో విష్ణుః**
**అవకాశోఽతి విస్తరః ॥**

**శశాంక శ్శ్రీధరః కాంతిః శ్రీస్తథైవానపాయినీ।**
**ధృతిర్లక్ష్మీర్జగచ్చేష్టా వాయుస్సర్వత్రగోహరిః॥**

**జలధి ర్ద్విజ గోవింద**
**తద్వేలా శ్రీర్మహామునే।**
**లక్ష్మీ స్వరూప మింద్రాణీ**
**దేవేంద్రో మధుసూదనః॥**

**యమ శ్చక్రధర స్సాక్షాత్**
**ధూమోర్ణా కమలాలయా।**
**ఋద్ధిః శ్రీః శ్రీధరో దేవః**
**స్వయమేవ ధనేశ్వరః ॥**

**గౌరీలక్ష్మీ ర్మహాభాగ కేశవో వరుణః స్వయమ్।**
**శ్రీర్దేవసేనా విప్రేంద్ర దేవసేనాపతి ర్హరిః ॥**

**అవష్టంభో గదాపాణిః**
**శక్తిర్లక్ష్మీ ర్ద్విజోత్తమ ।**
**కాష్ఠా లక్ష్మీర్నిమేషోసౌ**
**ముహూర్తోసౌ కలాత్వియమ్॥**

ఇంత వరకూ మరికొన్ని విశిష్టవస్తువులను, వ్యక్తులను పేర్కొని అవి లక్ష్మీనారాయణ స్వరూపాలని పరాశర మహర్షి వివరిస్తున్నాడు.

పితృదేవతలనుద్దేశించి ద్రవ్యాలను సమర్పించేటపుడు 'స్వధా'కార పురస్సరంగా సమర్పించడం జరుగుతుంది. పితృగణం స్వామి అయితే, లక్ష్మీదేవి 'స్వధ' అవుతున్నది. విశ్వమంతా వ్యాపించి ఉన్న అవకాశరూపమైన ఆకాశం, స్వామి అయితే దాన్ని ఆధారంగా చేసి కొన్ని ద్యులోకం అమ్మవారు. చంద్రుడు స్వామి అయితే ఎప్పుడు ఎడబాయని వెన్నెల అమ్మవారు. నిఖిల జగచ్చేష్టాహేతువైన వాయువు స్వామి, దాని వలన కలిగే స్థిరత (ధృతి) అమ్మవారు. మేఘాదుల ధారణం అన్నమాట. సముద్రం స్వామి, చెలియలికట్ట అమ్మవారు. ఇంద్రాణి లక్ష్మి-దేవేంద్రుడు నారాయణుడు. యముడు స్వామి తత్పత్ని అయిన ధూమోర్ణ - లక్ష్మి. స్వామి కుబేరుడైతే తత్పత్ని అయిన బుద్ధి అమ్మవారు. వరుణుడు స్వామి-తత్పత్ని 'గౌరి' అమ్మవారు. (వరుణ పత్నిపేరు కూడా గౌరియే, స్కందుడు స్వామి కాగా, స్కందపత్ని-అమ్మవారు. ఉద్యమం స్వామికాగా, దానికి కావలసిన 'శక్తి'(బలం) అమ్మవారు. అవష్టంభ శబ్దానికి ఆధారమని కొందరు వ్యాఖ్యాతలు వ్రాశారు) 'కాష్ఠ' (పదిహేను నిమేషాల పరిమితిగల కాలం) అమ్మవారు కాగా-'నిమేషం' (అక్షిస్పందనోప లక్షితమైన కాలం) స్వామి. కాష్ఠకు నిమేషానికి అవినాభావమన్నమాట. స్వామి





'ముహూర్తం' అయితే అమ్మ 'కల'. (నాడికా ద్వయ కాలం ముహూర్తం- ముహూర్తానికి చెందిన ముప్పదియవభాగం కల.) ప్రదీపం స్వామి అయితే, దానికాంతి అమ్మ. మరికొన్ని వస్తువులను కూడా మహర్షి నిర్దేశించాడు.

**లతాభూతా జగన్మాతా**
**శ్రీర్విష్ణు ర్ద్రుమసంజ్ఞితః।**
**విభావరీ శ్రీర్దివసో**
**దేవశ్చక్ర గదాధరః ॥**

చెట్లను లతలు ఆశ్రయించి అల్లుకొని ఉంటాయి. పగటికి చివర రాత్రి-పగటిని అంటి పెట్టుకొని ఉంటుంది. అమ్మకూడా స్వామిని అలాగే అంటిపెట్టుకొని ఉంటుంది. కనుక లత, రాత్రి అవుతున్నది. స్వామి వృక్షం-పగలు అవుతున్నాడు.

**వరప్రదో వరో విష్ణుః వధూః పద్మవనాలయా।**
**నదస్వరూపీ భగవాన్ శ్రీర్నదీ రూపసంస్థితా॥**

వధూవరులను లక్ష్మీనారాయణ స్వరూపులుగా చెప్పడం లోకపరిపాటి ఇక్కడ లక్ష్మీనారాయణులే వధూవరులంటున్నాడు పురాణకర్త. సముద్రో న్ముఖంగా దీర్ఘంగా ప్రవహించేవి నదులు. పశ్చిమదిశగా ప్రవహించేవి నదాలు. హిమాలయాల్లో హిమానీ నదాలున్నాయని ప్రసిద్ధి. వాస్తవానికి లింగభేదమే తప్ప రెండూ జలప్రవాహాలే.

నదశబ్దం సముద్రవాచకమని కొందరు వ్యాఖ్యానించారు. నారాయణుడు సముద్రుడైతే, సముద్రంలో చేరు'నది' లక్ష్మీదేవి. ఈ రెండింటికి గల అనుబంధం ప్రసిద్ధమే. ఇక, స్వామి ధ్వజం అయితే, ఆ ధ్వజానికి కట్టబడిన 'పతాక' అమ్మవారు. ఈ రెంటిదీ ఆశ్రయాశ్రయి భావ సంబంధం. అమ్మవారు 'తృష్ణ' (మాటి మాటికి పొందాలనే కోరిక) అయితే, స్వామి, 'లోభ' స్వరూపుడు. పొందవలసినది లేదా పొందగోరినది పొందినా తనివితీరని చిత్తవృత్తి- లోభం. ఈ రెంటికీ అవినాభావం. లోభం ఉన్నచోటల్లా తృష్ణ పెరుగుతూనే ఉంటుంది. ఒకదాన్ని విడచి మరొకటి ఉండదు. అలా ఒకరినొకరు విడచి ఉండనివారే లక్ష్మీనారాయణులు.

'రతి' అమ్మవారైతే, 'రాగం' స్వామి. ప్రియసమాగమమందు కలిగే ప్రీతి 'రతి' అయితే, ఇలాంటి ప్రియసమాగమేచ్ఛకు మూలమైనది రాగం. అంటే రాగం లేనిదే 'రతి'కల్గదన్న మాట. ఈ రెంటికీ అవినాభావమే. అని ఇలా ఎన్నో వస్తువులను లక్ష్మీనారాయణుల పారస్పరిక బంధం ఎలాంటిదో నిరూపించ డానికి నిదర్శనంగా చూపి చివరకు పరాశరుడు ఇలా అన్నాడు.

**కించాతి బహునోక్తేన**
**సంక్షేపేణేదముచ్యతే!**
**దేవతిర్యఙ్ మనుష్యాదౌ**
**పుంనామా భగవాన్ హరిః।**
**స్త్రీనామ్నీ శ్రీశ్చ విజ్ఞేయా**
**నానయోర్విద్యతే పరమ్॥**

అధికంగా చెప్పడం ఎందుకు? సంగ్రహంగా ఇది చెబుతున్నాను. ఏమంటే, దేవతలు పశుపక్ష్యాదులు, మనుష్యులు మొదలైన సమస్త ప్రాణికోటిలోను పుంస్త్వ ధర్మం కల ప్రతిప్రాణి నారాయణుడైతే, స్త్రీత్వ ధర్మం కల ప్రతిప్రాణి-అమ్మవారే. సృష్టి రహస్యం ఇదే ఉపనిషత్తులోనూ (సుబాలోపనిషత్తులోను) ఇదే పురాణంలో వెనుకటి అధ్యాయాల్లో సూచించబడింది. నారాయణుని అంశతో విరాట్పురుషుడు ఆవిర్భవించగా ఆయనలోని ఒక అంశం పురుషునిగాను, ఒక అంశం స్త్రీగాను అయిందని వెనుక చెప్పబడింది.

# శ్రీమద్భగవచ్ఛాస్త్రమ్

శ్రీమాన్ రమాకాంతాచార్యస్వామి, హైదరాబాదు

శ్రీపాంచరాత్రము తొలుత బ్రహ్మకు ఉపదేశింపబడి అతని నుండి మనువునకు అతనినుండి ఋషులద్వారా ఈ లోకమున మనుష్య వ్యవహారంలోకి వచ్చినట్లు తెలియుచున్నది. శ్రీమన్నారాయణుని దివ్యాయుధములైన శ్రీసుదర్శన, పాంచజన్య, నందక, శార్ఙ్గకౌమోదకీ యంశలచే క్రమముగా శాండిల్య, ఔపగాయన, మౌంజాయన, కౌశిక, భరద్వాజులు ఒక్కొక్క దివారాత్రము శ్రీమన్నారాయణుని సన్నిధిలో భగవచ్ఛాస్త్రము ను అధ్యయనమొనరించి భూలోకమున బ్రహ్మర్షులుగానవతరించి వ్యాప్తిజేసిరని శ్రీపారమేశ్వర సంహిత తెలుపుచున్నది. ఈ విధముగా పఞ్చర్షి ప్రవర్తితమైనదే శ్రీపాఞ్చరాత్ర దివ్యశాస్త్రము. అనంత, గరుడ, విష్వక్సేన, బ్రహ్మ, రుద్రులు ఐదుగురు అధ్యయనమొనరించుటచే శ్రీపాఞ్చరాత్రసంజ్ఞ యేర్పడినదని శ్రీవిహగేంద్ర సంహితా వచనము శ్రీ, శేష, పక్షీశ్వర, పద్మగర్భ, సేనేశముఖ్యాన్ ప్రతి బోధయంతం–శ్రీపాఞ్చరాత్రాగమ శాస్త్రం–ఆద్యం విష్ణుం సదాహం శరణం ప్రపద్యే అని శ్రీవిష్ణు సంహితా నిర్వచనము. పంచభూతములు, పంచతన్మాత్రలు, పంచ కర్మేన్ద్రియములు, పంచ జ్ఞానేంద్రియము లను పంచలక్షణము లను 'పఞ్చరాః' అని వ్యవహృతము. వీటిని జ్ఞానప్రకాశముచే ''త్రాయంతేతి'' (రక్షించునది కనుక) పాంచరాత్రమని శ్రీనారద పాంచరాత్ర ప్రవచనము. ఇక "జ్ఞానం పంచవిధం ప్రోక్తం" అని జ్ఞానవైవిధ్యమును తెలిపి రాత్రం=అంటే ప్రసాదించునదిగాన పాఞ్చరాత్రమని మరొక సంహిత. ఇట్లు బహువిధముగ వ్యాఖ్యా నింపబడినది శ్రీపాఞ్చరాత్ర దివ్యాగమము.

"ఋగాదిభేదవత్ వేదః చతర్ధాభిద్యతే యథా తద్వత్ సిద్ధాంత భేదేన పాఞ్చరాత్రం చతుర్విధమ్"

అని నాలుగు సిద్ధాంతములుగా విభజింపబడినదని శ్రీపాద్మసంహితలో, చతుర్ధాభేదభిన్నస్తు పాంచరాత్రాఖ్య ఆగమః అని శ్రీపారమేశ్వర సంహిత

**తచ్చతుర్ధా స్థితం శాస్త్రం ఋగాది వదనే కథా**

**ఏకైకం భిద్యతే తంత్రం శాఖాభేదేన భూయసా**

## సిద్ధాంత చతుష్టయమ్

వేదము–ఋక్, యజుస్, సామ, అథర్వ భేదములచే నాలుగు విభాగముల నొందినట్లు శ్రీపాంచరాత్రాగమము సిద్ధాంత భేదలముచే నాలుగు విభాగములుగా ఏర్పడినట్లు తెలియుచున్నది. ఆగమ సిద్ధాంతమునకు చెందిన శ్రీపారమేశ్వర సంహిత– 1. ఆగమ, 2. మంత్ర, 3. తంత్ర, 4. తంత్రాంతరముల నామములను పేర్కొనగా శ్రీపాద్మసంహితలలో... మంత్ర, ఆగమ,

\6/
Mydocuments\
Bn Feb. o4.p65



తంత్ర, తంత్రానంతరములని–తమ సిద్ధాంతము ముఖ్యమని మొదట ప్రయోగించుటచే గమనింప వీలగును.

"తేష్వయం మంత్ర సిద్ధాంతః
పాద్మసంజ్ఞోఽభిధీయతే"

అని స్పష్టముగా తెలియపరచినది. ఇట్లు ఏ సంహితలలోను సిద్ధాంతమును గూర్చి స్పష్టముగా కనిపించుటలేదు. లక్షణము లను, ఆచారములను, పాత్రాసాధన విధిని బట్టి సిద్ధాంతమునూహింప వలసియున్నది.

ఇక సిద్ధాంత లక్షణము తెలియ పరచుచు ఆగమ సిద్ధాంతము మూల సిద్ధాంతమని, స్వయంవ్యక్తమని. దీనినుండే మిగతా సిద్ధాంతములు ఉత్పన్నములైనవని పారమేశ్వర సంహిత పేర్కొనుచున్నది.

**"ఆగమాఖ్యం హి సిద్ధాంతం
సన్మోక్షైక ఫలప్రదమ్"**

అని నిరూపిస్తూ ఆగమసిద్ధాంతానువర్తకమైన అర్చా విధానమును గూడా వ్యక్తపరచు చున్నది. ''వాసుదేవాదయో వ్యూహాః చత్వారః సాధకైరపి..... కర్మణామపి సన్యాసః కథ్యతే యత్ర చాగమే తంత్రమాగమసిద్ధాంతం తదుక్తం కమలాసన!'' అని వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ నామకములైన నాలుగు వ్యూహరూపములను క్రమము తప్పకుండా సమానముగా పూజింపబడుటయు,, కర్మసన్యాసము ఏ ఆగమము పేర్కొనినదో, అదే ఆగమసిద్ధాంతము. ఈ సిద్ధాంతము పరమాత్మచే స్వయం ప్రోక్తమైనదని సాత్వతమని ఈశ్వర సంహితలో తెలుపబడినది.

ఇక మంత్ర సిద్ధాంత విషయమున శ్రీపాద్మమున "ఏకమూర్తి ప్రధానంతు మంత్ర సిద్ధాంత ముచ్యతే" అంటూ వాసుదేవాత్మక మైన ఆరాధన "విధిని స్పష్టపరచినది. నవమూర్తి ప్రధానముగలది తంత్ర సిద్ధాంత మని 1. వాసుదేవ, 2. సంకర్షణ, 3. ప్రద్యుమ్న, 4. అనిరుద్ధ, 5. నారాయణ, 6. హయగ్రీవ, 7. విష్ణు, 8. నృసింహ, 9. వరాహమూర్తుల ఆరాధన ప్రధానమైనదిగా వివరింప బడినది.

మూడు ముఖములు, నాల్గు ముఖములు మొదలగు బహుముఖ స్వరూప ముగా అర్చించు విధము తంత్రాంతమని నిరూపింపబడినది. ఇంకనూ ఈ సిద్ధాంత విధానములను పరిశీలించ వలసియున్నది. సంహితలు అందుబాటులో లేకుండట ఆగమజ్ఞుల కృషియు కొఱవడియున్నది. ఆగమ సిద్ధాంతము నుండి త్రేతాయుగము ప్రారంభమున భోగ మోక్ష సాధకముగా అనేక భేదములు ఏర్పడినవి అని "చతుర్ధా భేద భిన్నస్తు పాంచరాత్రాఖ్య ఆగమః" తచ్చతుర్ధా స్థితం శాస్త్రం ఋగాదివత్ అనేకధా, ఏకైకం భిద్యతే తన్త్రం శాఖా భేదేన భూయసా'' ''తస్మాత్ ఆగమసిద్ధాంతాత్ నిఃసృతం బహుభేదకమ్'' అనియు శ్రీపారమేశ్వర సంహిత.

మూల ఆగమముగా ఆగమసిద్ధాంత మును, ముఖ్యముగా పేర్కొని మన్త్ర సిద్ధాంతము దివ్యమనియు ఇందు "ఏకైవ మూర్తి రారాధ్యా ప్రాధాన్యేన ఇతరాపునః

దేవ్యః శ్రియాదయశ్చాపి సంపూజ్యాః పరివారవత్" అంటూ వ్యూహ మూర్తులకు మూలమైన వాసుదేవునొక్కనినే ప్రధానముగా భావించి లక్ష్మీ, భూ, నీళాది మూర్తులు పరివారమువలె ఆరాధించవలె ననియు శంఖ, చక్రాది ఆయుధములు, శ్రీవత్సాదులు, భూషణములు, మూర్తిమత్త్వము అనగా శరీరధారులైయుండ వలెను. లేదా లేకుండను ఉండవచ్చునని మంత్ర సిద్ధాంతము యొక్క విశేషతను చాటిచెప్పినది. ఇది దివ్యశాస్త్రమని బ్రహ్మోపనిషత్ అని వివేక ప్రదమని దివ్యమంత్ర, క్రియలతోగూడి మోక్ష ఫలము ఈయదగిన ఏకైక ఆగమము శ్రీపాంచరాత్ర మని శ్రీమన్నారాయణునిచే, సాత్త్వత, ఒపౌష్కర, జయాఖ్య సంహితల రూపముగా మూలవేదమే ఉపదేశింపబడిన దనియు సంకర్షణాదులచే ప్రవర్తింపజేయ బడినదనియు, ఈ శాస్త్రము సర్వలోక హితముగోరి ప్రవర్తింపజేయుటచే భగవచ్ఛాస్త్రమైనదని తెలియుచున్నది.

ఈ శాస్త్రమర్యాదను పాటించుటచే మనము పొందదగిన పరమపురుషార్థము లభించి తీరునని మన పూర్వాచార్యుల అనుష్ఠానములు ప్రమాణముగా చూడ దగును. ఇక ఆరాధనాది విశేషములు తెలుసుకునే ముందు ఆగమము, జ్ఞాన, యోగ, క్రియా, చర్యా పాదములుగా నాలుగు తెరగుల విభజింపబడి ఒక్కొక్క విభాగము ప్రత్యేక ప్రయోజనమును సాధకునికొసగి దృఢ విశ్వాసముతో అనుష్ఠించుటకు ఎట్లు తోడ్పడగలవో తెలుసుకొనగలము.

గత నెల నూతనంగా ప్రారంభించిన పాంచరాత్రాగమానికి సంబంధించిన **భగవచ్ఛాస్త్ర వైశిష్ట్యమ్** వ్యాసశీర్షికలో 'వ'కారము లోపించడం జరిగింది. పొరపాటు క్షమించగలరు.

**బదరీనాథ్ పెరుమాళ్‌కు తదియారాధన నిమిత్తం వస్తురూపేణ, ఇవ్వదలచిన కైంకర్యపరులు ఏప్రిల్ 5వ తేదీ లోపు సీతానగరమునకు వస్తువులు పంపగలరు.**

**ఆ విధముగ వచ్చినవి పెరుమాళ్ కైంకర్యమునకు వినియోగించబడును.**

### భక్తినివేదన చందాదారులకు విజ్ఞప్తి

మీ సభ్యత్వమును ఒకనెలముందుగనే పునరుద్ధరించుకోగలరు. మీ చందానెంబరు మార్పును రేపరుపై గమనించి మాతో జరుపు ఉత్తర ప్రత్యుత్తరములలో క్రొత్త నెంబరు తప్పక సూచించగలరు. సభ్యత్వ రుసుమును ఎమ్.ఒ. లేదా డి.డి. విజయవాడలో ఏ బ్యాంక్ ద్వారా అయిననూ భక్తినివేదన, సీతానగరం అడ్రెన్‌కు పంపవచ్చును. భక్తినివేదనకు చెక్‌లు అనుమతించబడవు.

**- భక్తినివేదన -**





# ఇతిహాసబోధ -20(2)

మనిషికీ మనిషికీ మనిషికీ ప్రకృతికి, మనిషికీ దైవానికీ మధ్య ఉన్న అనుబంధాన్ని నిరంతర నిశిత పరిశీలన అనంతరం తపస్వులైన మన ఋషులు అర్థం చేసుకోగలిగారు. జీవ, జగత్, జగదీశ్వరుల సంబంధం విషయంలో తాము పొందిన జ్ఞానాన్ని మొత్తం మానవజాతికి పంచడానికై వారు తమ అనుభవాలను జీవన విధాన సూత్రాలుగా మలిచారు. తాము దర్శించిన "పరమసత్యం" మానవులకు సాక్షాత్కరించ డానికి వీలుగా "ధర్మార్థ కామమోక్షాల"ను చతుర్విధ ఫలపురుషార్థ సాధనాలుగా వారు ఏర్పరిచారు.

మానవుని చేతనాశక్తికి దిశానిర్దేశం చేసి, అతని అస్తిత్వ ప్రయోజనాన్ని అర్థవంతంగా వ్యక్తీకరించేందుకై ఋషులు చూపిన "వెలుగుబాట"ను వేదం "సనాతన ధర్మం"గా ప్రకటించింది.

గ్రామాలను, పట్టణాలను, మహానగరా లను, రాజ్యాలను, సామ్రాజ్యాలను నిర్మించి నాగరికతల నెన్నింటినో సృష్టించగలిగినప్పటికీ మానవజాతి ఈ ''ఋషి సంస్కృతి'ని వారసత్వంగా స్వీకరించడంలో తడబాటుకు గురౌతూనే ఉన్నది.

విషయసుఖాలకు చిరపరిచితమైన "అర్థకామాల" పట్ల ఉన్న రుచి, ఆకర్షణ, పట్టుదల, మక్కువ "ధర్మాన్ని" అనుసరించ డంలో లేని కారణంగా మానవజాతి సంక్షోభపు ఊబిలో కూరుకుపోయి తీరని సంఘర్షణతో సతమతమౌతున్నది.

అందుకే వేదవ్యాసుడు

**"ఊర్ధ్వబాహు ర్విరౌమ్యేష**
**న చ కశ్చిచ్ఛృణోతి మామ్**
**ధర్మాదర్థశ్చ కామశ్చ**
**స ధర్మః కిం న సేవ్యతే"**

"నేను చేతులెత్తి గట్టిగా అరచినా ఎవ్వరూ వినిపించుకోవడం లేదు. ధర్మాన్ని అనుసరిస్తే అర్థకామాలు వాటంతటవే లభిస్తాయి. అలాంటి ధర్మాన్ని ఎందుకు సేవించరు"? అని బాధపడ్డాడు.

ఋషులు సేవించమని చెబుతున్న ధర్మం యొక్క స్వరూపమేమిటో మహానుభావుడైన విదురుడు స్థూలంగా వివరించే ప్రయత్నం చేసాడు.

**న తత్ పరస్య సందద్యాత్**
**ప్రతికూలం యదాత్మనః**
**సంగ్రహేణైష ధర్మః స్యాత్**
**కామాదన్యః ప్రవర్తతే**

తనకు యేది కష్టాన్ని, నష్టాన్ని కలిగిస్తుందో గుర్తుంచుకుని, అలాంటి కష్టాన్ని, నష్టాన్ని తాను ఇతరులకు కలిగించకుండా ఉండటమే 'ధర్మమ'ని విదురుడు తేల్చి చెప్పాడు. ఈ సూత్రాన్ని అర్థం చేసుకొని ఆచరించే వ్యక్తులే ధార్మికులు. తమ ఇష్టం వచ్చిన విధంగా జీవించడానికై ఇతరులను కష్టనష్టాలకు గురిచేసేవారు అధార్మికులు.

ఈ విధంగా ధర్మం వ్యక్తియొక్క ''ఇష్టం''పై హేతుబద్ధమైన ఆంక్షలను విధించింది. ఇతరులకు ఇబ్బంది

కలిగించకుండా ఇష్టాన్ని నెరవేర్చుకోమని కట్టుబాటును ఏర్పరచింది. ఈ క్రమంలో సహజీవనం సమరసభావంతో సాగడానికి వీలైన రక్షణవ్యవస్థగా రాజ్యం అవతరించింది. వ్యక్తి వికాసాన్ని సమాజవికాసాన్ని సమన్వయించి ముందుకు తీసుకొని వెళ్ళడానికి 'రాజధర్మం' రూపొందింది. వ్యక్తుల విశృంఖల వర్తనాన్ని అరికట్టేందుకు ఎన్నో నియమనిబంధనలు సిద్ధమయ్యాయి.

ఇన్ని ఏర్పడ్డా రాగద్వేషాలతో కూడిన మానవుని భావోద్వేగం విచక్షణాజ్ఞానాన్ని ప్రక్కకుతోసి ధార్మిక జీవనాన్ని ధిక్కరిస్తూనే ఉన్నది. యావత్ సమాజం తన ఆశల మూసలో వొదిగి పోవాలనే మూర్ఖపు పట్టుదల తోటి వారిని అణచివేసే వికృత ధోరణులు తలెత్తుతూనే ఉన్నాయి.

నియమోల్లంఘనం చేసిన వ్యక్తులను శిక్షించి, సామాజిక ధర్మాన్ని రక్షించాల్సిన పాలకునికి ఈ బాధ్యతల నిర్వహణ ఎప్పుడూ సవాలే! ఎందుకంటే తప్పుచేసిన వాడుకూడా తాను చేసిందే న్యాయమంటాడు. తన చర్యల సమంజసత్వాన్ని సమర్థించుకునేందుకు కావలసిన తర్కాన్ని తెలివితేటలను ప్రదర్శిస్తాడు. పక్షపాతంతో అన్యాయంగా తనను తప్పుపడుతున్నారని ఆక్రోశిస్తాడు. ఇలాంటి సందర్భాలలో ఏది ఒప్పో, ఏది తప్పో, ఏది ధర్మమో, ఏది అధర్మమో సూక్ష్మ విచారణచేసి నిర్ణయించగల వివేకం, అమలు పరచగలస్థైర్యం పాలకునికి ఉండాలి.

ఈ రెండూ ఉన్నప్పటికీ కోసల చక్రవర్తి త్రయ్యారుణుడు తన ధర్మాన్ని నిర్వహించే విషయంలో తీవ్రమైన ఒత్తిడితో సతమతమ య్యాడు. ఎందుకంటే అతని ముందున్న సమస్య అతని కుమారుడే. రాజకుమారుడననే గర్వంతో చిన్నప్పటి నుండి తన కలిమినీ, బలిమినీ చూసుకొని విర్రవీగే సత్యవ్రతుని ప్రవర్తనను సరిదిద్దడానికి రాజపురోహితుడు వశిష్ఠుడుతో సహా ఎందరో విఫలప్రయత్నాలు చేసారు. తన తర్వాత రాజధర్మాన్ని నిర్వహించాల్సిన వాడు భోగలాలసుడై, ప్రజాపీడకుడౌతున్నాడే అని త్రయ్యారుణునికి దిగులు. సత్యవ్రతుని ఆగడాలు అన్నీ రాజు చెవిన పడవు. చేరవేసే ధైర్యమూ అందరూ చేయలేరు. ఒక్కగానొక్క కొడుకు కావడం చేత రాజుకూ కుమారుడంటే గారాబం.

ఈ కారణంగా తన తెలివితేటలను, బలసామర్థ్యాలను నచ్చిన దానిని అనుభవించేందుకై వినియోగించే ఉద్ధృత ప్రవృత్తి, తెగువ సత్యవ్రతుడిలో మెండుగా ఏర్పడ్డాయి.

ఒకసారి రాజాంతఃపుర రక్షణలో ఉన్న ఒక గృహస్థు ఇంట కళ్యాణం జరుగుతున్నది. పెండ్లికి వెళ్ళాడు సత్యవ్రతుడు. వేదమంత్రా లతో సాగుతున్న ఆ వివాహంలో వధువును చూడగానే కామంతో కళ్ళుమూసుకుపోయా యతనికి. విచక్షణను కోల్పోయి బలవంతంగా పెండ్లిపీటల మీదనున్న వధువును ఈడ్చుకు పోయాడతడు.

తన పుత్రుడు దౌర్జన్యంగా వేరొకరి భార్యను పెళ్ళిమండపంనుండే అపహరించుకు పోయాడని తెలిసినప్పుడు రాజు త్రయ్యారుణుడు కోపంతో రగిలిపోయాడు. బాధతో కుమిలిపోయాడు. రేపోమాపో రాజుకావలసినవాడు, వంశగౌరవాన్ని నిలపాల్సిన వాడు ఇట్లా చెడిపోయాడే అని కృంగిపోయాడు.

రాజధర్మం గుర్తుకు వచ్చి గుండెదిటవు చేసుకొని కొడుకుకు కఠినశిక్ష విధించాడు.





"పన్నెండేళ్ళపాటు కారడవుల్లో ఉపాంశు వ్రతంతో శ్వపాకుల పాకల్లో జీవించమని' శాసించాడురాజు.

ఇంద్రియాలను, మనస్సును నిగ్రహించు కొని, రాజభోగాలను విడచి మునిలా శ్వపాకుల మధ్య బ్రతకమన్న రాజాజ్ఞను జీర్ణించుకోలేక పోయాడు సత్యవ్రతుడు. తాను చేసింది దోషం కాదని వాదించాడు. "సప్తపదితోనే పాణి గ్రహణం పూర్తవుతుంది. నేను ఆ వధువును అపహరించే సమయానికి 'సప్తపది' జరుగ లేదు. కనుక ఆమె మరొకరి భార్యకాదు. కనుక తనది నేరం కాదు. తనకా శిక్ష తగదు" అని సత్యవ్రతుని వాదన.

రాజపురోహితుడు వశిష్ఠుడు తనను రక్షించకుండా మౌనంగా ఉండటం, రాజు తన వాదనను పెడచెవిని పెట్టి శిక్షించడం సత్యవ్రతునికి బాధ కల్గించింది. బాల్యం నుండి సత్యవ్రతుని ప్రవర్తనను గమనిస్తున్న వశిష్ఠుడు రాజు విధించిన శిక్ష అతని పరివర్తనకు కారణమౌతుందని భావించాడు. తన తండ్రి తీర్పు వెనుక కులగురువు వశిష్ఠుని ప్రభావం ఉన్నదని సత్యవ్రతుడు విశ్వసించి వశిష్ఠునిపై ఆగ్రహం పెంచుకున్నాడు.

వశిష్ఠుడు బ్రహ్మర్షి. కులపురోహితుడు. వంశ ఆచారాలు, సంప్రదాయాలు అతనికే వత్తాసు పలుకుతాయి. ఇలాంటి వ్యక్తిపై తన ద్వేషాన్ని బహిర్గతం చేయకుండా తగిన ప్రతీకారం చేయాలని నిర్ణయించుకున్నాడు సత్యవ్రతుడు.

పుత్రుడిని శిక్షించినప్పటికీ, అతని వియోగ బాధను భరించలేని రాజు త్రయ్యారుణుడు రాజ్యాన్ని, అంతఃపురాన్ని రక్షించే బాధ్యతను వశిష్ఠునికి అప్పగించి తాను వానప్రస్థాశ్రమం స్వీకరించాడు. కోసలరాజ్యంలో ఈ పన్నెండేళ్ళు భయంకరమైన క్షామం ఏర్పడింది.

వశిష్ఠుడి వల్ల భంగపాటుకు గురై రాజ్యాన్ని వదలి తనలాగే అడవులపాలైన విశ్వామిత్రుడిని చూచాడు సత్యవ్రతుడు. ఆ కన్యాకుబ్జాధీశుని బలపరాక్రమాలు, పట్టుదల పరమశివుని ప్రసన్నం చేసుకొని సంపాదించు కొన్న అస్త్ర సంపత్తితో వశిష్ఠుని ఢీకొని అతడు ఓడిపోయిన వైనం అన్నీ సత్యవ్రతునికి తెలుసు.

వశిష్ఠునికి ధీటుగా శక్తిసామర్థ్యాలను సంపాదించడానికై కఠోర తపస్సు చేస్తున్న విశ్వామిత్రుని అనుగ్రహం ఉంటే తాను వశిష్ఠుని ఎదిరించగలనని భావించాడు. పన్నెండేళ్ళ వనవాస సమయాన్ని అందుకు వినియోగించుకోవాలని నిర్ణయించు కొన్నాడు సత్యవ్రతుడు.

దైవికంగా సంభవించిన కరువు విశ్వామిత్రునికి దగ్గరకావడానికి సత్యవ్రతుడికి ఉపయోగపడింది. తిండిదొరకని దుర్భర పరిస్థితులలో కుటుంబాన్ని కాపాడుకోవడానికి నడిమి కొడుకును తెగనమ్మడానికి సిద్ధపడింది విశ్వామిత్రునిభార్య. నూరు ఆవులకై అమ్మకానికి "గళమందు" బంధితుడైన విశ్వామిత్రుని పుత్రుని మూల్యం చెల్లించి విడిపించాడు సత్యవ్రతుడు. విశ్వామిత్రుని సంతోషపెట్టటానికి ఆ విధంగా "గాలవుడి"ని రక్షించాడాయన.

అంతేకాదు, వినయవిధేయతలతో విశ్వామిత్రుని భార్యకు, సంతానానికి ఎన్నో ఉపచారాలు చేసాడు. ప్రతిరోజూ మృగాలను

వేటాడి తెచ్చి ఆ మాంసాన్ని ముని ఆశ్రమానికి సమీపంలో ఉన్న చెట్టుకు వ్రేలాడగట్టేవాడు. సత్యవ్రతుని భక్తిశ్రద్ధలకు ఎంతో సంతోషించింది విశ్వామిత్రుని కుటుంబం. జీవనానికి లోటులేకుండా పన్నెండేళ్ళ గడ్డుకాలం అతనివల్ల వారికి సుఖంగా గడిచి పోయింది.

రాజు కొడుకునైన తనను ఆటవికునిగా మార్చాడనే కక్షతో వశిష్ఠునిమీది కోపాన్ని అతని ఆశ్రమంలోని ధేనువుపై చూపించాడు సత్యవ్రతుడు. ఏ కామధేనువును ఆశించి, విశ్వామిత్రుడు గర్వభంగం చెంది, అడవులదారి పట్టాడో ఆ కామధేనువును కరువును సాకుగా చేసుకొని పట్టి వధించాడు సత్యవ్రతుడు. ఆ కామధేనువు మాంసాన్ని తాను తిని, విశ్వామిత్రుని కుమారులచేత తినిపించాడు.

విశ్వామిత్రుని సమస్త సైన్యం, నూరుగురు పుత్రులు నశించడానికి కారణమైన కామధేనువు ఆయన పుత్రులకే ఆహారంగా ఉపయోగపడిందని తెలిస్తే విశ్వామిత్రుని 'అహం' సంతోషిస్తుంది. అందుకు కారణమైన తనను తప్పక అనుగ్రహిస్తాడని సత్యవ్రతుడు సంబరపడ్డాడు.

సత్యవ్రతుని క్రౌర్యం తెలిసింది వశిష్ఠునికి. ఒక నేరం చేసి శిక్ష అనుభవిస్తూ పరివర్తన కోసం ప్రయత్నించకుండా మరలా పాపాన్ని మూటకట్టుకుంటున్నాడే అని బాధపడ్డాడాయన. మొదటి పాపానికి తోడు మరి రెండు పాపాలను చేసాడు సత్యవ్రతుడు.

1. పరాయివాడి భార్యను అపహరించడం మొదటి పాపం.
2. గురువు ధనమని తెలిసీ ధేనువును అపహరించి, వధించడం రెండవ పాపం.
3. కరువు వల్ల తిండి దొరకక ఆ పనిచేసాననే సాకు చూపుదామనుకున్నా ఉపాంశువ్రత దీక్షలో ఉండి భగవంతునికి నివేదించకుండా (ప్రోక్షించకుండా) ధేనువు మాంసాన్ని ఆరగించడం (ఆకాలంనాటి ధర్మాన్ని అనుసరించి) మరొక పాపం.

"ఈ మూడు అపరాధాలను కావించినందుకు నేటి నుండి సత్యవ్రతుడిని **త్రిశంకువు"** (మూడు పాపాలు చేసినవాడు) గా లోకం గుర్తిస్తుందని వశిష్ఠుడు ప్రకటించాడు.

తనమీద మాత్సర్యం పూని, తనకి బాధకలిగించినా వశిష్ఠుడు సత్యవ్రతుడి అజ్ఞానాన్ని మన్నించాడు. అతని దోషాలను ప్రపంచం గుర్తించి గర్హించే శిక్షమాత్రమే విధించాడు. పెద్దలు పెట్టిన **"సత్యవ్రతు"**డనే పేరుకు బదులు **''మూడు తప్పులు చేసినవాడు"** వీడని లోకం 'త్రిశంకువు'గా అతడిని గుర్తించింది.

వైవస్వతమనువు తర్వాత ముప్పై ఒకటవ తరానికి చెందిన త్రిశంకువునకు 30వ తరానికి చెందినవాడు శ్రీరామచంద్రుడు. ఈవిధంగా ముందు వెనుకల ఎందరో మహానుభావులను పూర్వీకులుగా, వారసులుగా పొందగలిగిన త్రిశంకువు వంశాన్ని అతన్ని శపించడం ద్వారా అతనితో ముగించేందుకు వశిష్ఠుడు సిద్ధపడలేదు. తాను ఏ ఆశ్రమంలో ఉండి ఏ ఆవుపాలు త్రాగి విద్యాబుద్ధులు గడించాడో ఆ ఆశ్రమం యొక్క ఆవును వధించి తీరని గురుద్రోహం కావించినా సత్యవ్రతుని క్షమించి కోసలకు ప్రభువును చేసి అతనికి పురోహితునిగా సేవలు చేయడం వశిష్ఠునికే సరిపోయింది.

తండ్రివలె తనను ఆదరించి, కేకయ వంశానికి చెందిన సత్యరధను తెచ్చి తనకు పెండ్లిచేసి, ఎంతో ప్రేమతో తనకు





పౌరోహిత్యం వహిస్తున్నప్పటికీ, ఆ కోసల ప్రభువుకు వశిష్ఠునిపై ద్వేషం చల్లారలేదు.

వశిష్ఠుడు పెట్టిన పేరుతో తనను "త్రిశంకువ"ని పిలుస్తూ ప్రజలూ, సాటి రాజులూ తన దోషాలను వ్రేలెత్తిచూపి గేలిచేస్తున్నట్లుగా సత్యవ్రతుడు బాధపడ్డాడు. పౌరుషవంతుడైన ఏ ప్రభువూ భరించలేని పరాభవం తనది. వశిష్ఠుడు విధించిన చిత్రమైన శిక్ష ఇది. కంటికి కనపడని గాయం.

మనసుకు ఏర్పడ్డ ఈ గాయం మానక రోజు రోజుకూ సత్యవ్రతుడిని తగిన ప్రతీకారం తీర్చుకోమని తొందరపెట్ట సాగింది. అతనిలోని రాజనీతిజ్ఞుడు వశిష్ఠుని అవమానించేందుకు తగిన పన్నాగాలను వెతుకసాగాడు.

రాజుచేత పుణ్యకార్యాలను చేయించాల్సిన బాధ్యత పురోహితునిది. యజ్ఞం చేసేవాడు రాజు. చేయించేవాడు పురోహితుడు. తాను కోరిన విధంగా యజ్ఞాలు నిర్వహించడంలో వశిష్ఠుడు ఆసక్తి చూపకపోతే, దానిని సాకుగా చేసుకొని పురోహితుని మార్చడం ద్వారా అతనిని అవమానించవచ్చని త్రిశంకువు భావించాడు.

సర్వసమర్థుడైన వశిష్ఠుడు తనచే ఏ యజ్ఞాన్ని చేయించడానికి నిరాకరిస్తాడో అలాంటి యజ్ఞాన్ని చేయించవలసినదిగా తాను అతడిని కోరాలని భావించి త్రిశంకువు వశిష్ఠుని వద్దకు వెళ్ళాడు.

"మహానుభావా! నాకు బొందితో స్వర్గానికి వెళ్ళాలని ఉంది. అలాంటి యజ్ఞాన్ని నా చేత చేయించండి'' అని ప్రార్థించాడు కులగురువును.

వశిష్ఠుడు ఒప్పుకుంటే "మూడు పాపాలు చేసిన వాడు" సశరీరంగా స్వర్గానికి వెళ్ళగలిగాడనే ఘనత తనకు దక్కుతుంది. ఒప్పుకోకపోతే వశిష్ఠుడిని పౌరోహిత్యం నుండి తప్పించే అవకాశం లభిస్తుంది. త్రిశంకువు ఎత్తుగడకు రెండు వైపులా పదునుంది.

అతడు ఊహించిన విధంగానే వశిష్ఠుడు యాగాన్ని నిర్వహించడానికి వ్యతిరేకించాడు. తక్షణమే త్రిశంకువు సంప్రదాయం ప్రకారం కులగురువు పుత్రులకు తన కోర్కెను తెలియపరిచాడు.

"వశిష్ఠుడు వద్దన్న కార్యాన్ని చేయాలనుకోవడం మూర్ఖత్వం. ఆయనను అవమానించడం కూడా. అలాంటి పనిని తామెలా చేస్తామని ప్రశ్నించారు గురుపుత్రులు.

''పద్ధతి ప్రకారం కులగురువును, కులగురువు సంతానమైన మిమ్మల్ని కోరాను తాము నిరాకరిస్తే, వేరొకరిని ఆశ్రయించడం నాకు తప్పదుకదా" అంటూ తన మనసులోని మాటను చల్లగా బయటపెట్టాడు త్రిశంకువు.

వశిష్ఠుని సంతానం వశిష్టుడంతటి సహనశీలురుకారు. త్రిశంకువుకు తండ్రిపై నున్న మాత్సర్యం, అతని దురాగతాలు అన్నీ వారికి ఎఱుకే. తరతరాలుగా ఇక్ష్వాకు వంశానికి, వశిష్ఠునికీ ఉన్న అనుబంధాన్ని త్రెంచివేసి, వేరొకరి ద్వారా యజ్ఞాన్ని నిర్వహించుకునే సాకుతో త్రిశంకువు తండ్రిని అవమానించజూస్తున్నాడు.

పన్నెండేళ్ళు శ్వపాకుల మధ్య జీవించి ఆ బుద్ధినే ప్రదర్శిస్తున్న త్రిశంకువు మహారాజుగా ఉండతగడని వారు ఆగ్రహంతో అతడిని "ఛండాలుడవు" కమ్మని శపించారు.

వారి శాపం తక్షణం ఫలించింది. త్రిశంకువు ఛండాలరూపాన్ని ధరించాడు. మంత్రులు, పురజనులు అతడిని విడచి పెట్టారు. త్రిశంకువు వెళ్ళి విశ్వామిత్రుడిని

శరణుజొచ్చాడు.

కరువుకాలంలో పన్నెండేళ్ళు తన కుటుంబాన్ని సాకినవాడు, తన కుమారుడిని బానిస కాకుండా రక్షించినవాడు, తన భంగపాటుకు కారణమైన ధేనువును చంపి, తన బిడ్డలకు తినిపించినవాడు, తన ప్రత్యర్థి వశిష్ఠుడిని పురోహితుని స్థానం నుండి భ్రష్టుడిని చేయడానికై "ఛండాలత్వాన్ని" పొందినవాడైన త్రిశంకునిపై విశ్వామిత్రునికి ప్రేమ పొంగిపోయింది.

రాజుకు ధైర్యం చెప్పాడు. తాను పౌరోహిత్య బాధ్యతలు స్వీకరించాడు. త్రిశంకువును బొందితో స్వర్గానికి పంపటానికి అవసరమైన మహాయజ్ఞాన్ని ప్రారంభించాడు.

"ఛండాలుడు యజమాని అయితే క్షత్రియుడు యజ్ఞం చేయించేవాడా"? అని వశిష్ఠుని నూర్గురు పుత్రులూ విశ్వామిత్రుని యత్నాన్ని ఈసడించారు. వారి విమర్శలు విన్న విశ్వామిత్రుడు ఆగ్రహంతో వశిష్ఠపుత్రులను శపించి భస్మం చేసాడు.

విశ్వామిత్రుని తపఃశక్తి ప్రభావంచేత త్రిశంకువు స్వర్గానికి చేరుకున్నా, దేవేంద్రుడు గురుశాపోపహతుడైన అతడిని తల్లక్రిందులుగా క్రిందికి త్రోసివేసాడు. మాటనెగ్గించుకోవడం కోసం విశ్వామిత్రుడు త్రిశంకువును ఆకాశంలో అలా తల్లక్రిందులుగానే నిలిపి, అతనికో స్వర్గలోకాన్నే సృష్టించి ఇచ్చాడు.

విశ్వామిత్రుని వల్ల పుత్రులను కోల్పోయినప్పటికీ వశిష్ఠుడు తన నిగ్రహాన్ని కోల్పోలేదు. పంతానికి పోయి తపఃశ్శక్తిని వృధా చేసుకున్న విశ్వామిత్రుడు తన లక్ష్యానికి "త్రిశంకువు" రూపంలో ఎదురైన విఘ్నాన్ని స్మరించుకొని పుష్కర తీర్థ తీరానికి వెళ్ళి మరల తపస్సు ప్రారంభించాడు.

"ఆధ్యాత్మిక పునాదుల ఆధారంగా ధార్మిక జీవనాన్ని సమాజంలో విస్తరింప చేయాలనే" ఆశయంతో పనిచేసే మన వికాసతరంగిణి కార్యకర్తలకు ఎంత సహనం అవసరమో ఈ ఇతిహాసగాథ మనకు బోధిస్తుంది.

లోకహితైషీ, మహాజ్ఞానీ అయిన వశిష్ఠుడు ఎంతో ఓర్పుతో త్రిశంకువు, విశ్వామిత్రుడు తన పట్ల చేసిన ఘోర అపచారాలను మన్నించాడు. అంతటి మహర్షి కూడా ఏమరుపాటుతనం వల్ల ఎలా చిక్కుల్లో పడ్డాడో వచ్చే "ఇతిహాస బోధ"లో తెలుసుకుందాం!

జైశ్రీమన్నారాయణ!

**గమనిక:** సందేహాలు-సమాధానాల శీర్షికకి ప్రశ్నలు కార్డ్‌మీద మాత్రమే వ్రాసి పంపవలెను. వ్యక్తిగతంగా సమాధానాలు కోరుకొనేవారు రిప్లై కార్డ్‌పై మీ చిరునామా వ్రాసి జతపరచండి. అనివార్య కారణాలవల్ల ఈ నెలకూడా 'సందేహాలు-సమాధానాలు' శీర్షిక ప్రచురించలేకపోతున్నందుకు చింతిస్తున్నాం.







# శ్రీరామస్థూపములు -1

శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామివారు 9సం॥లపాటు నిరాటకంగా భారతదేశమంతటా, వివిధ ప్రాంతాలలో శ్రీరామ మహాక్రతువులను నిర్వహించి ఆయా ప్రాంతాలలో శ్రీరామక్రతు స్తంభాలను నిర్మించారు. సుమారు అర్ధశతాబ్దిపైబడిన ఈ స్థూపాలను మన ఆచార్యులైన శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు పునరుద్ధరించి శ్రీరామనామ వైభవాన్ని అందరిలో జాగృతం చేయ సంకల్పించినారు. శ్రీస్వామివారి ఈ సంకల్పాన్ని కార్యరూపంలో అమలు పరచటానికి హైదరాబాద్‌కి చెందిన కుమారి విజయలక్ష్మిగారు విశేష కృషిచేస్తున్నారు. ఈమె గత 4,5 సం॥లుగా ఆయా ప్రాంతాలన్నీ తిరిగి, అక్కడి భక్తులను సంప్రదించి, వారిలో ప్రేరణకలిగించి వారి సహాయ సహకారాలతో ఆ స్థూపాలను పునరుద్ధరణ కావింపచేస్తున్నారు. ప్రస్తుతం మన రాష్ట్రంలోనే గాక, ఇతర రాష్ట్రాలతో కలిపి సుమారు 66 స్థూపాలకి నూతనరూపం, నిత్య ఆరాధనాదులు జరిగే ఏర్పాట్లు కావిస్తున్నారు. ఆయా విశేషాలను, భక్తులు ఆయా ప్రాంతాలకు యాత్రచేసినపుడు మహా మహిమాన్వితమైన ఆ శ్రీరామక్రతుస్థూపాలను కూడా దర్శించే వీలుకల్పిస్తూ ఆ వివరాలను అందించ దలచుకుంది మన భక్తినివేదన.

ఈ చిత్రంలోని స్థూపము ఉత్తరప్రదేశ్‌లోని "ఫిరోజాబాద్" అను గ్రామమునందు ఉన్నది. ఇది 24.5.1996 తేదీన 75వ శ్రీరామమహాక్రతు చిహ్నంగా నిర్మించబడింది. అంటే 38 సం॥ల క్రితం నిర్మించబడిన ఈ స్థూపాన్ని స్థానిక భక్తుల సహకారంతో పునరుద్ధరించి అందమైన శ్రీరామనామ లిఖిత టైల్స్‌తో అలంకరించి సుందరంగా తీర్చిదిద్దారు కుమారి విజయలక్ష్మిగారు. పునరుద్ధరణ జరిగి నిత్యధూపదీపాలతో ప్రకాశిస్తున్న ప్రస్తుత స్థూపాన్ని మనమీ చిత్రంలో చూస్తున్నాము.

ఈ స్థూపము ఫిరోజాబాద్‌లోని 'హనుమాన్ ఘడ్' హనుమాన్ మందిరంగా పిలవబడే ఆలయం ఎదురుగా నిర్మించబడి ఉంది. ఈ ఆలయంలో చిన్నగుట్టపై వేంచేసియున్న హనుమమూర్తి ఉంది. ఆ హనుమకి ఎదరుగా (ఈ స్థూపనిర్మాణ) జరిగింది. అదీ స్థూపంలోని శ్రీరామచంద్రప్రభువు (పట్టాభిషేకమూర్తి) ఆలయంలోని హనుమ హృదయప్రదేశంలో అమరినట్లుండే విధంగా ఎత్తుని సరిచూసి శ్రీశ్రీశ్రీ పెద్దస్వామివారు నిర్మింపచేసారని స్థానికులు చెప్పారట. ఈ ఫిరోజాబాద్ గాజు పరిశ్రమకి బాగా ప్రసిద్ధి. ఈ పట్టణ ప్రజలు తాము తయారు చేసిన గాజు వస్తువులుని పదిలంగా చూసుకుంటూనే మన రామస్థూపాన్ని కూడా భక్తిశ్రద్ధలతో అపురూపంగా సేవిస్తూంటారు. ఆలయంలోని పూజారిగారు కూడా ఆలయానికి

వచ్చే భక్తులందరితో హనుమ అనుగ్రహం కావాలంటే ఎదురుగా ఉన్న శ్రీరామస్థూప ప్రదక్షిణ కావించి సేవించిరమ్మని చెప్తూ ఉంటారు. అక్కడి ధూపదీపాదులు కూడా స్వయంగా నిర్వర్తిస్తూ ఆ స్థూప ప్రభావాన్ని కాపాడుకుంటూ వస్తున్నారు.

ఈ ఊరు చేరాలంటే ఢిల్లీకి ముందువచ్చే ఆగ్రా స్టేషన్‌లో దిగి "ఫిరోజాబాద్"కు బస్‌లో వెళ్ళాలి. ఆగ్రానుండి 4గం॥లు ప్రయాణ దూరంలో ఈ ఊరు ఉంది. బదరీయాత్రలో భాగంగా ఆగ్రా, మధుర దర్శించినపుడు ఈ స్థూపాన్ని, ఆ హనుమ ఆలయాన్ని కూడా సందర్శించవచ్చును.

**గమనిక:** ఈ రామస్థూపాల పునరుద్ధరణలో ఆయా ప్రాంతాలకి చెందిన భక్తులతోపాటు ఇక్కడ మన స్వామివారి శిష్యబృందం కూడా భాగస్వాములు కావచ్చు. అలాంటి వారు తమ ద్రవ్యాన్ని ఈ పవిత్ర కార్యక్రమంలో సద్వినియోగపరచుకోవచ్చు. ఈ కైంకర్య నిమిత్తమై గతంలో కొందరు ఉత్సాహవంతులైన భక్తులకి రశీదు పుస్తకాలు అందించడం జరిగింది. వారంతా కూడా ఆ పుస్తకాలని త్వర త్వరగా సద్వినియోగపరచి సీతానగరంకు పంపించగలరు. తద్వారా 108 స్థూపాల పునరుద్ధరణ వేగవంతంగా జరగడంలో మీరూ భాగస్వాములు కాగలరని ఆశిస్తూ వచ్చేనెల మరొక స్థూపం గురించిన వివరాలతో కలుద్దాం!

పరమహంస పరివ్రాజకులు

## శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి

### పర్యటన వివరములు

| తేదీ | వివరాలు |
|---|---|
| 08.2.04 | ఉదయం-ఆరాధన పూర్తిచేసుకొని పొన్నూరు ప్రయాణం. |
| 09.2.04 | పొన్నూరులో (శ్రీమాన్ క్రేన్ సుబ్బారావుగారు) శ్రీ ఆంజనేయస్వామి దేవాలయ కార్యక్రమం. సాయంత్రానికి వరాహపట్నం-కృష్ణాజిల్లా. |
| 10.2.04 | ఉదయం వరాహపట్నం ధర్మక్షేత్రం, శోభాయాత్ర, కృష్ణ పూజలు, రాత్రికి పెదనందిపాడు. |
| 11.2.04 – 12.2.04 | పెదనందిపాడు-గుంటూరుజిల్లాలో టీచర్స్ ట్రైనింగ్ క్యాంప్ రాత్రికి హైదరాబాద్ చేరుట. |
| 14.2.04 – 15.2.04 | హైదరాబాద్‌లో V.T సంస్థల శిక్షణ శిబిరం |
| 23.2.04 | వరంగల్ జిల్లా మొరిపిరాల జీయర్ గురుకుల పాఠశాల శంకుస్థాపన |
| 27.2.04 | పోచంపల్లి దేవాలయ కార్యక్రమం, ధర్మక్షేత్రం |
| 28.2.04 | హైదరాబాద్ నుండి తిరుపతి ప్రయాణం |
| 29.2.04 | తిరుమలలో సిహెచ్ రామచంద్రారెడ్డిగారి కార్యక్రమం |
| 1.3.04 | తిరుమల, రాత్రికి మానుకోట చేరుకొనుట |
| 2.3.04 | మానుకోట ధర్మక్షేత్రం, వరంగల్‌జిల్లా |
| 3.3.04 | నాగులవంచ లక్ష్మీనరసింహస్వామి దేవాలయ పునః ప్రతిష్ఠ, రాత్రికి వైజాగ్ |
| 4.3.04 | వారిజలో వేంచేసి ఉంటారు |
| 5.3.04 | వారిజ సమావేశం |
| 6.3.04 | రాత్రికి జస్టిస్ యతిరాజులుగారి ఆహ్వానంపై శ్రీకాకుళం వేంచేస్తారు |
| 7.3.04 | శ్రీకాకుళంలో ధర్మక్షేత్రం, సమాశ్రయణములు, శోభాయాత్ర, కృష్ణపూజలు |
| 8.3.04 | శ్రీవేంకటేశ్వర ఆలయ సంప్రోక్షణ, ప్రతిష్ఠ, రాత్రికి కాకినాడ |
| 9.3.04 | కాకినాడ ధర్మక్షేత్రం |





# నచికేతుడు










# గీతాజ్యోతి ధర్మక్షేత్రాల సమాచారం

### శ్రీవారు జనవరి మాసంలో దర్శించిన ధర్మక్షేత్రాలు, జరిగిన సేవలు

| | | |
|---|---|---|
| 1. | మొత్తం ధర్మక్షేత్రాలు | 5 |
| 2. | గ్రామాలు | 564 |
| 3. | మొత్తం పశువైద్య శిబిరములు | 15 |
| | చికిత్సపొందిన పశువుల సంఖ్య | 4,410 |
| 4. | పశువైద్య శిబిరముల మొత్తం ఖర్చు | 1,23,000 |
| 5. | మొత్తం దంతవైద్య శిబిరములు | 24 |
| | చికిత్స పొందినవారు | 5,555 |
| 6. | దంత వైద్య శిబిరముల మొత్తం ఖర్చు | 63,200 |
| 7. | నేత్రవైద్య శిబిరముల సంఖ్య | 20 |
| | చికిత్స పొందినవారు | 3,360 |
| 8. | నేత్రవైద్య శిబిరముల ఖర్చు | 1,18,000 |
| 9. | సాధారణ వైద్య శిబిరముల సంఖ్య | 30 |
| | చికిత్స పొందినవారు | 9,700 |
| 10. | సాధారణ వైద్య శిబిరముల ఖర్చు | 61,000 |
| 11. | మొత్తం వాలంటీర్ల సంఖ్య | 965 |
| 12. | మొత్తం పని గంటలు | 7,29,760 |
| 13. | కార్యక్రమానికి అయిన ఖర్చు | 14,60,000 |
| 14. | గీతాజ్యోతి ప్రతిజ్ఞచేసినవారు | 53,000 |
| 15. | గీతాజ్యోతి సందేశం అందుకున్న భక్తులు | 8,68,000 |

### శ్రీస్వామివారు దర్శించిన మొత్తం ధర్మక్షేత్రాల వివరములు

| | | |
|---|---|---|
| 1. | ధర్మక్షేత్రాల సంఖ్య | 41 |
| 2. | గ్రామాల సంఖ్య | 4,900 |
| 3. | పశువైద్య శిబిరములు | 68 |
| | చికిత్స పొందిన పశువుల సంఖ్య | 43,817 |
| 4. | పశువైద్య శిబిరముల ఖర్చు | 11,21,300 |
| 5. | దంత వైద్య శిబిరములు | 76 |
| | చికిత్స పొందినవారు | 23,634 |
| 6. | దంతవైద్య శిబిరముల ఖర్చు | 3,24,635 |
| 7. | నేత్రవైద్య శిబిరముల సంఖ్య | 50 |
| | చికిత్స పొందినవారు | 12,466 |
| 8. | నేత్రవైద్య శిబిరముల ఖర్చు | 3,28,890 |
| 9. | సాధారణ వైద్య శిబిరములు | 69 |
| | చికిత్స పొందినవారు | 29,820 |
| 10. | సాధారణ వైద్య శిబిరముల ఖర్చు | 9,36,350 |
| 11. | వాలంటీర్ల సంఖ్య | 44,546 |
| 12. | పనిచేసిన గంటలు | 1,19,02,862 |
| 13. | కార్యక్రమమునకు అయిన ఖర్చు | 3,48,66,534 |
| 14 | ప్రతిజ్ఞ చేసినవారు | 9,39,000 |
| 15. | గీతాజ్యోతి సందేశం అందుకున్న భక్తులు | 64,29,100 |

### శ్రీ స్వామివారు దర్శించాల్సిన ధర్మక్షేత్రాలలో కూడ జరిగిన కార్యక్రమ వివరములు

| | | |
|---|---|---|
| 1. | ధర్మక్షేత్రాల సంఖ్య | 69 |
| 2. | గ్రామాల సంఖ్య | 6,692 |
| 3. | పశువైద్య శిబిరములు | 60 |
| | చికిత్స పొందిన పశువుల సంఖ్య | 32,581 |
| 4. | పశువైద్య శిబిరముల ఖర్చు | 1,53,747 |
| 5. | దంతవైద్య శిబిరములు | 104 |
| | చికిత్సపొందినవారు | 51,895 |
| 6. | దంతవైద్య శిబిరముల ఖర్చు | 6,92,870 |
| 7. | నేత్రవైద్య శిబిరములు | 39 |
| | చికిత్స పొందినవారు | 16,549 |
| 8. | నేత్రవైద్య శిబిరముల ఖర్చు | 4,20,100 |
| 9. | సాధారణ వైద్య శిబిరములు | 137 |
| | చికిత్స పొందినవారు | 51,671 |
| 10. | సాధారణ వైద్య శిబిరముల ఖర్చు | 28,86,195 |

# గీతాజ్యోతి ధర్మక్షేత్రాల సమాచారం

**శ్రీవారు జనవరి మాసంలో దర్శించిన ధర్మక్షేత్రాలు, జరిగిన సేవలు**

| | | |
|---|---|---|
| 1 | మొత్తం ధర్మక్షేత్రాలు | 5 |
| 2 | గ్రామాలు | 564 |
| 3 | మొత్తం పశువైద్య శిబిరములు | 15 |
| | చికిత్సపొందిన పశువుల సంఖ్య | 4,410 |
| 4 | పశువైద్య శిబిరముల మొత్తం ఖర్చు | 1,23,000 |
| 5 | మొత్తం దంతవైద్య శిబిరములు | 24 |
| | చికిత్స పొందినవారు | 5,555 |
| 6 | దంత వైద్య శిబిరముల మొత్తం ఖర్చు | 63,200 |
| 7 | నేత్రవైద్య శిబిరముల సంఖ్య | 20 |
| | చికిత్స పొందినవారు | 3,360 |
| 8 | నేత్రవైద్య శిబిరముల ఖర్చు | 1,18,000 |
| 9 | సాధారణ వైద్య శిబిరముల సంఖ్య | 30 |
| | చికిత్స పొందినవారు | 9,700 |
| 10 | సాధారణ వైద్య శిబిరముల ఖర్చు | 61,000 |
| 11 | మొత్తం వాలంటీర్ల సంఖ్య | 965 |
| 12 | మొత్తం పని గంటలు | 7,29,760 |
| 13 | కార్యక్రమానికి అయిన ఖర్చు | 14,60,000 |
| 14 | గీతాజ్యోతి ప్రతిజ్ఞచేసినవారు | 53,000 |
| 15 | గీతాజ్యోతి సందేశం అందుకున్న భక్తులు | 8,68,000 |

**శ్రీస్వామివారు దర్శించిన మొత్తం ధర్మక్షేత్రాల వివరములు**

| | | |
|---|---|---|
| 1 | ధర్మక్షేత్రాల సంఖ్య | 41 |
| 2 | గ్రామాల సంఖ్య | 4,900 |
| 3 | పశువైద్య శిబిరములు | 68 |
| | చికిత్స పొందిన పశువుల సంఖ్య | 43,817 |
| 4 | పశువైద్య శిబిరముల ఖర్చు | 11,21,300 |
| 5 | దంత వైద్య శిబిరములు | 76 |
| | చికిత్స పొందినవారు | 23,634 |
| 6 | దంతవైద్య శిబిరముల ఖర్చు | 3,24,635 |
| 7 | నేత్రవైద్య శిబిరముల సంఖ్య | 50 |
| | చికిత్స పొందినవారు | 12,466 |
| 8 | నేత్రవైద్య శిబిరముల ఖర్చు | 3,28,890 |
| 9 | సాధారణ వైద్య శిబిరములు | 69 |
| | చికిత్స పొందినవారు | 29,820 |
| 10 | సాధారణ వైద్య శిబిరముల ఖర్చు | 9,36,350 |
| 11 | వాలంటీర్ల సంఖ్య | 44,546 |
| 12 | పనిచేసిన గంటలు | 1,19,02,862 |
| 13 | కార్యక్రమమునకు అయిన ఖర్చు | 3,48,66,534 |
| 14 | ప్రతిజ్ఞ చేసినవారు | 9,39,000 |
| 15 | గీతాజ్యోతి సందేశం అందుకున్న భక్తులు | 64,29,100 |

**శ్రీ స్వామివారు దర్శించాల్సిన ధర్మక్షేత్రాలలో కూడ జరిగిన కార్యక్రమవివరములు**

| | | |
|---|---|---|
| 1 | ధర్మక్షేత్రాల సంఖ్య | 69 |
| 2 | గ్రామాల సంఖ్య | 6,692 |
| 3 | పశువైద్య శిబిరములు | 60 |
| | చికిత్స పొందిన పశువుల సంఖ్య | 32,581 |
| 4 | పశువైద్య శిబిరముల ఖర్చు | 1,53,747 |
| 5 | దంతవైద్య శిబిరములు | 104 |
| | చికిత్సపొందినవారు | 51,895 |
| 6. | దంతవైద్య శిబిరముల ఖర్చు | 6,92,870 |
| 7 | నేత్రవైద్య శిబిరములు | 39 |
| | చికిత్స పొందినవారు | 16,549 |
| 8 | నేత్రవైద్య శిబిరముల ఖర్చు | 4,20,100 |
| 9 | సాధారణ వైద్య శిబిరములు | 137 |
| | చికిత్స పొందినవారు | 51,671 |
| 10 | సాధారణ వైద్య శిబిరముల ఖర్చు | 28,86,195 |

# గీతాజ్యోతి ధర్మక్షేత్రాల సమాచారం

**మొత్తం ధర్మక్షేత్రాలలో ఇంతవరకు జరిగిన కార్యక్రమాలు**

| | | |
|---|---|---|
| 1 | మొత్తం ధర్మక్షేత్రాలు | 110 |
| 3 | గ్రామాలు | 11,592 |
| 4 | మొత్తం పశువైద్య శిబిరములు | 128 |
| | చికిత్సపొందిన పశువుల సంఖ్య | 76,398 |
| 5 | పశువైద్య శిబిరముల మొత్తంఖర్చు | 12,75,047 |
| 6 | మొత్తం దంతవైద్య శిబిరములు | 180 |
| | చికిత్స పొందినవారు | 75,529 |
| 7 | దంత వైద్య శిబిరముల మొత్తం ఖర్చు | 10,17,505 |
| 8 | నేత్రవైద్య శిబిరముల సంఖ్య | 89 |
| | చికిత్స పొందినవారు | 29,015 |
| 9 | నేత్రవైద్య శిబిరముల ఖర్చు | 7,48,990 |
| 10 | సాధారణ వైద్య శిబిరముల సంఖ్య 206 | |
| | చికిత్స పొందినవారు | 81,491 |
| 11 | సాధారణ వైద్య శిబిరముల ఖర్చు | 38,22,545 |
| 12 | మొత్తం వాలంటీర్ల సంఖ్య | 75,440 |
| 13 | మొత్తం పని గంటలు | 2,50,00,000 |
| 14 | మొత్తం పాఠశాలల సంఖ్య | 5,291 |
| 15 | విద్యార్థుల సంఖ్య | 7,15,260 |
| 16 | మొత్తం ఖర్చు | 4,17,30,621 |

# గీతాజ్యోతి ధర్మక్షేత్రాల సమాచారం

**మొత్తం ధర్మక్షేత్రాలలో ఇంతవరకు జరిగిన కార్యక్రమాలు**

| | |
|---|---|
| 1. మొత్తం ధర్మక్షేత్రాలు | 110 |
| 3. గ్రామాలు | 11,592 |
| 4. మొత్తం పశువైద్య శిబిరములు | 128 |
| చికిత్సపొందిన పశువుల సంఖ్య | 76,398 |
| 5. పశువైద్య శిబిరముల మొత్తంఖర్చు | 12,75,047 |
| 6. మొత్తం దంతవైద్య శిబిరములు | 180 |
| చికిత్స పొందినవారు | 75,529 |
| 7. దంత వైద్య శిబిరముల మొత్తం ఖర్చు | 10,17,505 |
| 8. నేత్రవైద్య శిబిరముల సంఖ్య | 89 |
| చికిత్స పొందినవారు | 29,015 |
| 9. నేత్రవైద్య శిబిరముల ఖర్చు | 7,48,990 |
| 10. సాధారణ వైద్య శిబిరముల సంఖ్య | 206 |
| చికిత్స పొందినవారు | 81,491 |
| 11. సాధారణ వైద్య శిబిరముల ఖర్చు | 38,22,545 |
| 12. మొత్తం వాలంటీర్ల సంఖ్య | 75,440 |
| 13. మొత్తం పని గంటలు | 2,50,00,000 |
| 14. మొత్తం పాఠశాలల సంఖ్య | 5,291 |
| 15 విద్యార్థుల సంఖ్య | 7,15,260 |
| 16 మొత్తం ఖర్చు | 4,17,30,621 |

## జీయర్ వృద్ధాశ్రమం నడిగడ్డపాలెం

మన వాసుదాసాశ్రమం నడిగడ్డపాలెం నందు శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామి వారి బృందావనం వెనుక జీయర్ వృద్ధాశ్రమమునకు శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్‌స్వామివారి శ్రీహస్తములతో గత 19.11.03 శిలాన్యాస కార్యక్రమము జరిగిన విషయం విదితమే. యిందు ప్రతి గది 12X14 వెడల్పుతో గది, వెనుక అటాచ్‌డ్ 15 అడుగుల స్నానపు గదితో నిర్మించబడుతున్నది. నిర్మాణ పనులు చురుకుగా జరుగుచున్నవి. ఫిబ్రవరి నెలాఖరుకు శ్లాబు వేయుట జరుగవచ్చును. యిప్పటివరకు హైదరాబాద్ వాస్తవ్యులు శ్రీమతి&శ్రీమాన్ మాదాది లక్ష్మి సురేంద్రరెడ్డిగారి పేరున వారి కుమారుడు మాదాది రాం సుధాకర్‌రెడ్డి, కూతరు శ్రీనీల సమర్పించిన ద్రవ్యం రూ.75,000/-లు, గుంటూరు వాస్తవ్యులు శ్రీమాన్ సూర్యనారాయణ రాజుగారి జ్ఞాపకార్థం: కుమారులు రూ.50,000/-లు, శ్రీమాన్ జూపల్లి రామేశ్వరరావుగారు ఒక లారీ సిమెంట్ మహా సిమెంటు వారు కైంకర్యముతో ప్రస్తుత నిర్మాణము జరుగుచున్నది. నిర్మాణ కార్యక్రమములను ఇంజనీరు రాయపూడి మురళీమోహన్‌రావుగారు, రాయపాటి రామచంద్రమూర్తిగారు శ్రీ యు.వి.ఎల్. నరశింహాచార్య స్వామి, బదరీస్వామీగారు పర్యవేక్షిస్తున్నారు. నిర్మాణము జరుగుచున్న ఈ జీయర్ వృద్ధాశ్రమము నుండు 16 గదులతో నిర్మించాలని సంకల్పము. యిందుకుగాను 17 లక్షలదాకా ఖర్చు అగునని అంచనా, ఒక గది నిర్మాణమునకు గాను రూ.1 లక్షవరకు అగునని అంచన.

చక్కని ప్రశాంత వాతావరణం. పరమాచార్యుల శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామి వారు తపోధనులు, శ్రీవాసుదాసస్వామివారి తపోభూమి. పాంచరాత్ర దివ్య ఆరాధనతో త్రికాలములందొట్టి లోపములేకుండ అర్చనలు, ఉత్సవాదులు జరుగును. శ్రీలక్ష్మీనారాయణ, శ్రీకోదండరామస్వామి వార్ల సన్నిధి. నిరంతరం హరినామ సంకీర్తన... అలరారు దివ్య ఆశ్రమం నందు నిర్వహించుచున్న జీయర్ వృద్ధాశ్రమము వానప్రస్థమునందు చక్కటి ఆధ్యాత్మిక జీవితం గడపాలన్న కోరికగలవారి కోసం.

ముందుగా గ్రౌండ్‌ఫ్లోర్ నిర్మాణము జరుగుచున్నది. అందు పెరుమాళ్ళ వాహనశాలను, తరువాత 8 గదులను విశాలమైన అటాచడ్ బాత్‌రూమ్‌తో నిర్మించబడుచున్నవి. ఒక లక్షరూపాయలు సమర్పించిన వారి పేరున ఒక గది నిర్మాణము జరుగును. భక్తులు వారి కైంకర్యములను ఒక గదికిగాను, తమకు తోచిన విధముగా కైంకర్యమును విరాళములను శ్రీవాసుదాసాశ్రమం పేరున బ్యాంక్ డ్రాఫ్ట్ ద్వారా పంపవచ్చును.





# శ్రీరంగం భోగమండపంలో ఉత్సవ విశేషాలు

శ్రీమదుభయవేదాంత ఆచార్యపీఠ వ్యవస్థాపకులు, సత్యసంకల్పులు, పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ పెద్దజీయరుస్వామివారి పరమపదోత్సవం **భోగమండపం** (మన వీరరాఘవ రామానుజ కూటము)లో అత్యంత వైభవముగా జరిగినది. శ్రీశ్రీశ్రీ పెద్దజీయరుస్వామివారు అనేకమార్లు శ్రీరంగంలో చాతుర్మాస్య దీక్షాసమయంలో వేంచేసి ఉండి, శ్రీరంగనాథుని సేవిస్తూ అనేక కైంకర్యములను ఏర్పాటు చేసారు. భారతీయ ఆలయ పునరుద్ధరణ కమిటీని ఏర్పరచి శిథిలమైన శ్రీరంగాలయ గోపురాలను పునరుద్ధరించారు. ఉత్తరవీధిలోని ప్రాకారం చుట్టూ పచ్చటి కొబ్బరిచెట్లను నాటించారు. కావేరీనది వరదలవలన మునిగిపోయిన నందనవనముని, రంగని పూలతోటని పునరుద్ధరించారు. ఇంకా ఆలయంలో సుదర్శనాళ్వారుల సన్నిధికి ఎదురుగా శంఖువుని ప్రతిష్ఠించడంలాంటి అనేక కైంకర్యాలను చేసారు. ఉభవవేదాంతచార్య పీఠం స్థాపించి ఇక్కడనే ఒక దివ్యప్రబంధ పాఠశాలను ఏర్పాటు చేసి, పాఠాలను అధ్యయనం చేయించేవారు. ఉభయవేదాంత పండితులను ఆహ్వానించి వేదాంత సభలను నిర్వహించి, పండితులను సమ్మానించే వారు.

అటువంటి శ్రీశ్రీశ్రీ పెద్దస్వామివారి పరమపదోత్సవాన్ని మన "భోగమండపం" (రామానుజకూటంలో) మన వేద అధ్యాపక శిష్యబృందం వైభవంగా నిర్వహించారు. ఈ కార్యక్రమానికి రంగనాథుని అరయర్‌స్వాములు మన శ్రీశ్రీశ్రీ పెద్దస్వామివారిమీద ఉన్న ఆరాధనాభావంతో వేంచేసారు. శ్రీరంగనాథుని ఆలయంలో దివ్యప్రబంధాన్ని అనుసంధించే అధ్యాపకులు వేంచేసి సేవాకాలం జరిపారు. శ్రీపెరియపెరుమాళ్ కోయిల్ (శ్రీరంగనాథుని) ప్రసాదాన్ని నివేదన చేసి తీర్థప్రసాదగోష్ఠి జరిగినది. శ్రీమనవాళ మాముని సన్నిధినుండి కూడా శ్రీవారికి శేషమాల, ప్రసాదం సమర్పించడం జరిగింది. శ్రీవారి అష్టోత్తర కార్యక్రమంలో నేపాల్‌నుండి వచ్చిన 50మంది భక్తులతోపాటు స్థానికులు 200మంది పాల్గొని శ్రీపాదతీర్థాన్ని సేవించి జీవించారు. మన మఠ నిర్వాహకులు శ్రీఅరయర్‌స్వాములను, అధ్యాపక స్వాములను సమ్మానించారు. అందరికీ తదీయారాధన కార్యక్రమము జరిగింది.

**శ్రీ గోదారంగనాథుల కళ్యాణం:** ఈ నెల 14వ తేదీన 'భోగమండపం'లో (మన రామానుజకూటంలో) శ్రీరంగనాథుల కళ్యాణమహోత్సవం మన వేద విద్యార్థులు అంగరంగ వైభవంగా ఆగమోక్తంగా అత్యంత వైభవంగా జరిపారు. శ్రీ ఉ.వే. శ్రీమాన్ విల్లిపుత్తూరు కణ్ణన్‌స్వామి గోదా అమ్మవారి తరపున, శ్రీరంగని తరపున శ్రీ ఉ.వే.శ్రీకష్ణన్ అయ్యంగార్ వధూ, వర అన్వేషణ జరిపారు. ఆగమపద్ధతిలో శ్రీరంగంలో కళ్యాణం అంటూ ప్రత్యేకించి జరగనందున మన భోగమండపంలో (మన రామానుజ కూటంలో) జరిగిన కళ్యాణోత్సవాన్ని సేవించిన స్థానికులు, భక్తులు అనేకమంది ఎంతో సంతోషించారు.

## నడిగడ్డపాలెంలో పరమాచార్యుల పరమపదోత్సవం

పరమాచార్యులు శ్రీశ్రీశ్రీ పెద్దజీయరు స్వామివారి పరమపదోత్సవము 4.1.2004 శ్రీవారి బృందావనం నందు జరిగినది. ఆలయం నందు ధనుర్మాస కార్యక్రమము పూర్తయిన తరువాత పెద్దజీయరుస్వామి వారి మూల, ఉత్సవ మూర్తులకు పంచామృత అభిషేకం, తరువాత అష్టోత్తర శతానమార్చన సేవాలకాలము, వైభవముగా జరిగినవి. శ్రీ పెద్దజీయరు స్వామి వారి నిర్వహించిన కార్యక్రమములను వారి ఆశయాలకు అనుగుణంగా మన కార్యాచరణ గురించి, శ్రీమాన్ గుదిమెళ్ళ బదరీనాథస్వామి, వివరించిరి. తెనాలి మరియు గుంటూరు వికాసతరంగిణి శాఖల సభ్యులు చుండూరు పరిసర ప్రాంతీయ భక్తులు పాల్గొన్నారు. భక్తులందరికీ తదీయారధన జరిగింది.

# ఈనెల విశేషాలు

**తిరుమఙిశైయాళ్వార్ల తిరునక్షత్రం 7.02.04**

తిరుమఙిశై ఆళ్వారు తిరునక్షత్రము ఈ నెల 7వ తేదీన జరుపుకోవలసి ఉన్నది. పొరపాటున గతనెల 11వ తేదీనని ప్రచురించటం జరిగింది. మకర సంక్రమణం జరిగిన తరువాత వచ్చే మఖానక్షత్రము వీరి తిరునక్షత్రము. పాఠకులు ఈ విషయాన్ని గమనించగలరు.

**తిరుమఙిశైయాళ్వార్ల తిరునక్షత్ర తనియన్:**

శ్లో॥ మఖాయాం మకరే మాసే చక్రాంశం భార్గవోద్భవమ్॥
మహీసార పురాధీశం భక్తిసారమహం భజే ॥

శ్లో॥ శక్తి పంచమయ విగ్రహాత్మనే
శుక్తిసార జిత చిత్తహారిణే ॥
ముక్తిదాయక మురారి పాదయోః
భక్తి సారమునయే నమో నమః ॥

**శ్రీకూరత్తాళ్వాన్ తిరునక్షత్రము 10.2.04**

శ్రీకురత్తాళ్వాన్ మాఘమాసంలో హస్తా నక్షత్రమునందు అవతరించినారు. వీరికి తమిళ భాషయందు 'తిరుమఱుమార్పన్' అనియు సంస్కృతి భాషయందు 'శ్రీవత్సాంక మిశ్రులు' అనియు నామధేయములున్నవి.

రామానుజులనాశ్రయించిన వారిలో ప్రధానులు కూరత్తాళ్వాన్. ఆచార్యనిష్ఠ కల కైంకర్యపరులు వీరు. దయానిధి-పరమ కారుణ్యమూర్తి-ఏకసంథాగ్రాహి. ఆచార్య రక్షణార్థం తమజీవితమునే పణముగా పెట్టిన వారు. ఆచార్యులయందు వీరికున్న భక్తి నిరుపమానమైనది. ఆచార్యులకే తన జ్ఞాన, భక్తి విశేషములచే అపార ఆనందం కలిగించిన వారు. వీరివంటి శిష్యులవలన తనకూ మోక్షప్రాప్తి కలుగునని ఆచార్యులే ఆనందించగలిగినంతటి మహనీయులు అటువంటి కూరేశులవారి చరిత్రను మనం తెలుసుకుందామా!

కూరేశులు ఏకసంథాగ్రాహి. ఏదైనా ఒకసారి చూస్తే నోటికి వచ్చేస్తుంది. మరుపేలేదు. ఆ మహనీయులు రామానుజుల సన్నిధిని చేరి తమను శిష్యులుగా స్వీకరించమని ప్రార్థించారు.

రామానుజులు కూరేశులకు పంచసంస్కారాలు ప్రసాదించి, మంత్రాన్ని కటాక్షించారు. యాదవప్రకాశకులు శ్రీరామానుజుల వారి పూర్వాశ్రమ గురువులు. వారికి విశిష్టాద్వైత సిద్ధాంతము పట్ల అనేక సందేహాలుండేవి. వాటినివృత్తి కోసం రామానుజులవారిని చేరగా, వారు కూరేశులను చూపి, వీరు మీ సందేహాలన్ని పోగొట్టగల సమర్థులు. వారి ద్వారా తమ సందేహాలన్నీ నివృత్తి చేసుకొనమని తెలిపారు. కూరేశులకు యాదవప్రకాశకులకు వాగ్వివాదాలు జరిగాయి. గుణాలు, రూపాలు లేని నిర్గుణ బ్రహ్మాన్ని యాదవప్రకాశకులు వివరిస్తే, పరమాత్మ సగుణుడు, సరూపుడు అని చక్కని ఉదాహరణలతో మంత్ర పూర్వకంగా వివరించారు కూరేశులు. నిర్గుణుడు అంటే మనలాంటి గుణములు కాక, కళ్యాణగుణ సంపన్నుడని, రూపం లేకపోవడమంటే మనలాంటి ప్రాకృత దేహంకాక, అప్రాకృత దివ్యతేజోమూర్తి పరమాత్మ అని, వివరించారు. సమాశ్రయణం పొందడం అత్యంత ఆవశ్యకమని తెలిపారు. ఉపనిషత్తులు. వేదాలు-పురాణాలు అన్నింటిని దృష్టాంతంగా చూపిస్తూ విష్ణువే పరతత్త్వమని స్థాపించారు కూరేశులు. కూరేశులు చేసిన పరతత్త్వ





ప్రదిపాదన యాదవ ప్రకాశకుల సంశయాలను క్షుణ్ణంగా తీర్చింది.

ఒకప్పుడు శ్రీరంగంలో యతిరాజుల మఠములో తదీయారాధన సమయమున పెరటిలోని అరటియాకులు కోసి, తేవడానికి కూరేశులను నియమించారు. వారు ఒక ఆకును కోయగా దానివెంట సొన కారడం చూచి, అయ్యో! ఇది ఎంతగ బాధకలిగి దుఃఖించుచున్నది అని తలచి చెట్టుదగ్గిరే మూర్ఛిల్లారు. వారి ఆచార్యులు అటువంటి పనులకు వారిని నియమింపవలదని కట్టడి చేసారు. అంతటి హృదయమార్దవం కలిగిన వారు కూరేశులు.

ఒకప్పుడు రామానుజుల సన్నిధికి ఒక వైష్ణవుడు వచ్చి, దుఃఖించసాగాడు. అతని దుఃఖముకు కారణమడుగగా అతడు తన కుమార్తె జాతకమున వైధవ్య యోగమున్నదని ఎవ్వరు వివాహ మాడటానికి ముందుకు రావటం లేదని వాపోయేడు. కులమంతా చెడుతుందనే భయంతో తాను దుఃఖిస్తున్నానని అన్నాడు. అక్కడే ఉండి ఇదంతా విన్న కూరేశులు ఆ కన్యను తాను వివాహమాడుతానని తన అంగీకారాన్ని తెలియ జేసారు. వివాహా నంతరం కూరేశులు ఆ వివాహ వేదికపైననే వానప్రస్థాన ఆశ్రమమును స్వీకరించారు. ఆశ్రమం మారడం జన్మాంతర ముతో సమానం అవడం వలన ఆమెకు వైధవ్య దోషం తీరిపోయింది. ఈ విధంగా వారు కరుణామూర్తిగా ప్రశంసింపబడి, ఆచార్యులకు సంతసం కలుగజేసారు.

రామానుజులు బ్రహ్మసూత్రాలకి భాష్యం రాద్దామని సంకల్పించుకొన్నారు. కొన్ని ప్రాచీన గ్రంథాలని పరిశీలిస్తూ ఉన్నారు. బోధాయన వృత్తి అనే గ్రంథం కాశ్మీరులో శారదాపీఠంలో ఉందని తెలుసుకొని, అక్కడకు బయలుదేరారు. వారి వెంటనే ఉన్న కూరేశులు ఆ బోధాయన వృత్తి గ్రంథాన్ని రాత్రిపూట కూలంకషంగా అధ్యయనం చేసారు. ఆ గ్రంథాన్ని తీసుకొని వచ్చి, శ్రీభాష్య రచనకు పూనుకొందామను కొన్నారు. రామానుజులు. కాని ఆ పీఠంలోని పండితులు ఆ గ్రంథాన్ని ఇవ్వడానికి అంగీకరించలేదు. రామానుజులవారు దిగులుపడగా, కూరేశులు తనకాగ్రంథం కంఠస్థంగా వచ్చిందని, దిగులుపడ వలదని ధైర్యం చెప్పారు. ఆచార్యులవారు అడిగిన సూత్రానికి చక్కటి వివరణనిచ్చి, వారిని ఆనందపరవశులను చేసారు.

రామానుజులు గ్రంథరచనకు శ్రీకారం చుట్టారు. కూరేశులవారిని వ్రాస్తూ ఉండమని, తాము చెప్పడం మొదలు పెట్టారు. రచనకి పూనుకునేముందు కూరేశులు ఎక్కడైనా తప్పుదొర్లినట్టుగా భావిస్తే, ఆపివేయమని చెప్పారు. అలా రచన సాగిస్తూ ఉండగా ..... జీవస్వరూప నిరూపణ ఘట్టం వచ్చింది. ఆ సందర్భంలో జ్ఞాతృత్వం-శేషత్వం అనే మాటలకి వివరణ ఇవ్వవలసి వచ్చినపుడు, రామానుజులు శేషత్వానికి అప్రాధాన్యాన్ని, జ్ఞాతృత్వానికి ప్రాధాన్యాన్ని ఇనస్తూ వివరణ ఇచ్చారు. భగవంతుని గురించిన జ్ఞానం కంటే భగవంతునికి శేషభూతులము అనే జ్ఞానం గొప్పది. కాని రామానుజులు దీనికి కొంత వ్యతిరేక వివరణ ఇవ్వడంతో కూరేశులు వ్రాయకుండా కూర్చున్నారు. ఇది చూసిన రామానుజులకి కోపం వచ్చి, వ్రాయనక్కర లేదు వెళ్ళమని గద్దించారు. కూరేశులు ఆచార్యులకి నమస్కరించి, బయటకి నడిచారు.

రామానుజుల శిష్యులందరూ ఈ విషయముపై ఆశ్చర్యం వ్యక్తం చేయగా, కూరేశులు వారందర్నీ చూసి చిరునవ్వు నవ్వేరు. ఇందులో విశేషమేముంది? వారు తమ ఆచార్యులని, తను వారి సొత్తునని, వారికి

తనమీద సంపూర్ణ అధికారం ఉందని తెలియజేసారు. ఆచార్యులు ఇష్టమొచ్చినట్లు ప్రవర్తించడానికే, దాసుని శరీరం, జీవితం అంతకంటే ఏమీలేదు అని చెప్తూ శిష్యులకి ఆశ్చర్యం కలిగించారు. రామానుజుల వారు ఈమాటలను అటుగా వెడుతూ విని, శేషత్వం అన్నమాటని అక్షరాలా ఆచరణలో చూపించిన కూరేశుల వారి భావానికి విస్తుపోయారు. శాస్త్రమునందు వారికున్న పరిజ్ఞానానికి, విశ్వాసానికి ఆచార్యులపట్ల వారికున్న భక్తి, వినయవిధేయత ఈ సంఘటన నిదర్శనం.

కూరేశులు ఏనాటికవసరమైన ధాన్యం ఆనాడే సంపాదించుకొని జీవితం గడిపేవారు. ఒకనాడు విపరీతమైన వర్షము కారణముగా ఆహారం తీసుకొని రాలేకపోయి నారు. ఆనాడు శ్రీరంగనాథుని ఆలయంలో ఆరగింపుగంట మ్రోగడం విని, ఆండాళ్లమ్మ గారు (కూరేశుల ధర్మపత్ని) నీ భక్తులు ఉపవాసముండగా నువ్వు ప్రసాదం ఆరగిస్తున్నావాస్వామి అనుకున్నారు. వెంటనే శ్రీరంగనాథుడు ప్రసాదాన్ని కూరేశుల ఇంటికి పంపవలసి నదిగా ఆజ్ఞాపించారు. ప్రసాదాన్ని చూసిన కూరేశులు భార్యని నువ్వు ప్రసాదం పంపమని కోరుకొన్నావా అని అడిగారు. మీరు పస్తు ఉండగా చూడలేక మనస్సులో అనుకొన్నానని ఆమె సమాధానమిచ్చారు. వారు ఒక మెతుకు ప్రసాదం తీసుకొని మిగిలినది భార్యకు స్వీకరించమని ఇచ్చివేసారు. ఆరోజు కలలో శ్రీరంగనాథుడు కూరేశులకు కన్పించి, ఈ ప్రసాదం వలన నీ భార్యకు సంతానం కలుగుతుందని చెప్పారు. శ్రీరంగనాథ ప్రసాద ఫలితంగా ఆండాళ్ళమ్మగారు గర్భవతియై ఇద్దరు పుత్రుల్ని కన్నారు. వారికి శ్రీపరాశరభట్టర్, శ్రీవ్యాసభట్టర్ అని శ్రీరామానుజులవారు నామకరణం చేసారు. భట్టరులకు సకాలంలో ఉపనయనం చేసి వారిని వేదాధ్యయనం కోసం గురువుల వద్దకు పంపించారు కూరేశులు. శ్రీపరాశర భట్టర్ విష్ణు సహస్రనామానికి, భాష్యం రచించారు. వేదనిష్ఠాగరిష్ఠులైన వారికి, అటువంటి సత్‌సంప్రదాయనిష్ఠగల సంతానం కలగడం భగవత్ అనుగ్రహమే కదా! సాక్షాత్తు భగవత్ ప్రసాదిత సంతానం సకలవిధాల ఉత్తమోత్తమైన పాండిత్య నిష్ఠ కలిగి ఉండడంలో ఆశ్చర్యమేముంది!

చోళరాజ్యాన్ని పాలించే కులోత్తుంగుడు శైవమతస్థుడు. శ్రీవైష్ణవ ద్వేషం మనస్సు నిండా నింపుకొన్నాడు. శైవమతాన్ని స్వీకరించ నివారికి శిరశ్ఛేదం అమలు చేయడం ప్రారంభించారు. శ్రీవిశిష్టాద్వైత ప్రచారకు లయిన రామానుజులవారిని తన సిద్ధాంతం అంగీకరింపచేస్తే, మిగిలిన వైష్ణవు లందరూ అంగీకరించినట్లే అని భావించి వారిని బంధించి తీసుకొని రావలసినదిగా ఆజ్ఞాపించాడు. రామానుజుల వారిని బంధించి తీసుకువెళ్ళడానికి భటులురాగా, కూరేశులు ఈ విషయమంతా తెలుసుకొని, త్రుటిలో తమ ఆచార్యుల కాషాయవస్త్రాన్ని, త్రిదండాన్ని ధరించి, తానే రామానుజులని తెలిపారు. కూరేశులు, పెరియనంబి (మహా పూర్ణులు రామానుజులవారి ఆచార్యులు) రాజసభకు తీసుకొని రాబడ్డారు. సభలోని వారందరుకు తమకు యతిపతులు రామానుజ దర్శనమైనది ఆనందించ సాగారు. అంతరంగంలోని ఆరాధనా భావాన్ని రాజభయంతో వ్యక్తపరచలేక పోయారు. రాజుగారు పరతత్త్వ నిర్ణయము చేయమని కోరగా కూరేశులు శ్రీమన్నారాయణుడే పరాత్పరుడు, జగత్కారణభూతుడని తెలియజేసారు. ఆయన ఆజ్ఞకు లోబడి చరాచరసృష్టి ప్రవర్తిస్తున్నదని తెలిపారు. ఈ రకమైన సంభాషణ సహించలేని రాజు అహంకారం, అజ్ఞానం ఆవరించగా శివుని





మించిన పరతత్త్వము లేదని, పత్రంమీద వ్రాసి సంతకం చెయ్యమని ఆజ్ఞాపించారు. ఇందుకు నిరాకరించిన కూరేశుల, పెరియనంబి గారి నేత్రములను పెకిలించి వేయమని క్రూరంగా ఆజ్ఞాపించారు. ఇంతటి దుర్మార్గాన్ని చూసిన ఈ నేత్రాలు తమ ఆచార్యులైన భగవద్ రామానుజులను, శ్రీరంగనాథుని చూడలేనని, తమ కనులు తామే తీసుకున్నారు. భయంకరమైన ఆ దృశ్యం సభలోనున్న వారందరిని కలచివేసి, కన్నీటి ధారలను తెప్పించింది. భటులు పెరియనంబిగారి నేత్రాలను పెకిలించి వేసారు. రామానుజులనంతటి మహనీయుని రక్షించిన భాగవతోత్తముడు కూరేశులు ఆచార్యరక్షణలో నేత్రద్వయాన్నే అర్పించిన మహనీయులు. ఆచార్యుల కొరకై ప్రాణసమర్పణకి కూడ వెనుదీయనివారు కూరేశులు. అటువంటి దివ్యపురుషుని స్మరణం జన్మ ధన్యతనొందిస్తుంది కదా!

రామానుజులు కూరేశులను నేత్రములు ప్రసాదించ వేడుకొనమని శ్రీరంగనాథుని దగ్గరకు పంపించారు. శ్రీరంగనాథుడు వారికి ఆచార్యుల, పెరుమాళ్ళను చూడగల దృష్టిని ప్రసాదించారు. ఉత్తమ గురుశిష్య సంబంధము అంటే ఇదేకదా! శ్రీరంగనాథుడు కూరేశులకు, వారి పరివార మంతటికి పరమపదం ప్రసాదిస్తానని చెపుతాడు. అప్పుడు రామానుజులవారు తాము ఇంతకాలము తిరుమంత్రం బయటికి చెప్పినందువల్ల నరకప్రాప్తి కలుగుతుందేమోనని భయపడ్డానని ఇపుడు ఇంక కూరేశుల వల్ల తనకాభయం తొలగిపోయిందని, ఆనందంతో కందువాని లేపి ఊపుతూ నాట్యం చేసారు. భాగవత కటాక్షం ఎంతటి దివ్యత్వమును ప్రసాదిస్తుందో కదా!

కూరేశుల జీవితం అంతా భగవద్రామానుజుల జీవితంతో ముడిపడి ఉంది. గురుశిష్య సంప్రదాయానికి ప్రతీకగా నిలచినవారి ఆదర్శజీవితం అందరికీ అనుసరణీయం. ఆచార్య సంరక్షణార్థం, ప్రాణాలనైనా సమర్పిస్తాననే దృఢసంకల్పం శ్రీవైష్ణవసిద్ధాంతానికి ప్రతీకమైనది. మోక్షం పొంది పరమపదంలో కూడ ఆచార్యుల సేవచేసుకోవాలనే కూరేశుల ఆచార్యనిష్ఠ అందరికీ ఆదర్శము. మనముకూడ అటువంటి మహనీయుల స్ఫూర్తినందుకొని, వారి అడుగుజాడలలో నడవడానికి ప్రయత్నిస్తూ ముందుకు పయనం సాగిద్దామా! వారి దివ్య సందేశము అందుకొని వారి తనియన్‌ని తిరునక్షత్ర సందర్భంగా అనుసంధానము చేసుకొందామా!

## కూరత్తాళ్వాన్ తిరునక్షత్ర తనియన్:

**మకరే హస్తనక్షత్రే సర్వనేత్రాంశ సంభవమ్**
**శ్రీమత్కూరకులాధీశం శ్రీవత్సాంకముపాస్మహే॥**
**శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యో నమ ఉక్తి మధీమహే।**
**యదుక్తయ స్త్రయీకంఠే యాంతి మంగళసూత్రతామ్॥**

ఈ కూరత్తళ్వాన్ తిరునక్షత్రమునుండే గృహాలలో తిరిగి ద్రావిడ వేదాధ్యయనం ప్రారంభించుకుంటాం. తిరుకార్తి సమాప్తమ వుతుంది.

### తిరుక్కచ్చినంబి తిరునక్షత్రము 29.2.04

తిరుక్కచ్చినంబిగారి తిరునక్షత్రం మాఘమాసమున మృగశిర నక్షత్రమున వస్తోంది. ఏ కులములో జన్మించినా కూడ, భగవత్ కైంకర్యనిష్ఠులై సాక్షాత్ పెరుమాళ్ళ దివ్యదర్శనముపొంది, వానితో సంభాషించ గల్గిన మహాభక్తులలో తిరుక్కచ్చినంబిగారు ఒకరు.

వరదరాజస్వామివారిని ప్రత్యక్ష దర్శనము కావించుకొని, వారితో సంభాషించగల్గిన వారి జన్మ ఎంత పరమోత్తమమైనదో కదా! అంతటి భగవదనుగ్రహ పాత్రులైనా, రామానుజుల వారు ప్రార్థించినా ఆచార్యత్వమునకు అంగీకరించని మహావినయశీలి వీరు.

తొండరమండలమున తూర్పు సముద్రమునకు పశ్చిమమున 'పూనమల్లి' అనే పట్టణము ఉంది. అక్కడ మల్లి తీగలు ఎప్పుడూ పుష్పించడం చేత ఆ పట్టణానికా పేరు వచ్చింది. ఆ పట్టణంలో వైశ్యకులములో కమలాపతి అనే వారికి కాంచీపూర్ణులు (తిరుక్కచ్చినంబి) అవతరించిరి.

వారు కంచియందు వరదరాజులయందుండే భక్తిచే ఒక పూదోటను పెంచి, పుష్పమాలికలు కట్టి ప్రతి ఉదయం పూనమల్లి నుండి బయల్దేరి మధ్యాహ్నమునకు కంచికిజేరి మాలలు వరదరాజస్వామివారికి సమర్పిస్తూ ఉండేవారు. భక్తవత్సలుడగు వరదరాజ స్వామి వీరికైంకర్యమునకు ప్రీతుడైనాడు. ప్రతిరోజూ తిరుక్కచ్చినంబి, స్వామికి వింజామరలు వీస్తూ, భక్తిపారవశ్యమున నీదుతూ ఉండేవారు. రాత్రి సమయములో శ్రీవరదరాజస్వామి వారు, వీరికి దర్శనమిస్తూ, ప్రత్యక్షముగా క్షేమసమాచార ములు అడిగి తెలుసుకునే వారు. భగవంతునితో స్వయముగా సంభాషించడం, ఎంతటి సుకృతమోకదా! భగవత్ అనుగ్రహానికి జాతి, కుల, మత, వర్ణ వైవిధ్యములు అడ్డుకావని కదా వీరిరువురి సంబంధం తెలియజేస్తోంది. వీరు శ్రీరంగమునకు వెళ్ళి, ఆళ్వన్దారుల నాశ్రయించి వేదార్థ రహస్యములను ఎన్నింటినో తెలుసుకొంటూ, కంచిలో వరదరాజుల నిత్యకైంకర్యము చేస్తూ ఉండేవారు.

రామానుజులు, తిరుక్కచ్చినంబిని తన గురువులుగా భావించుకున్నారు. తన మనస్సుకి శాంతిని చేకూర్చిన ఈ తిరుక్కచ్చినంబినే ఆచార్యునిగా భావించారు. తనని శిష్యునిగా స్వీకరించ మని తిరుక్కచ్చినంబి గారిని అర్థించారు రామానుజులు. వారివద్ద సకల విషయాలు తెలుసుకోవాలని అభిలషించారు. రామానుజులువంటి బ్రాహ్మణోత్తమునికి ఆచార్యత్వం వహించలేనని చెప్పారు. ఏ జాతి వారైనా భగవత్ అనుగ్రహం పొందినప్పుడు ఉత్తములే అవుతారు కదా! అని రామానుజులవారు అన్నారు. వర్ణాశ్రమ ధర్మాన్ని సామాన్యులు పాటించే ఆవశ్యకత ఉందని నంబిగారు సమాధానమిచ్చారు. పెరుమాళ్ళదర్శనం లభించినా, తాను సామాన్యుడననే నిరహంకారస్థితిని తెలియచేసుకున్నారు. తాను ఉత్తముడని, అన్ని అర్హతలు కలవాడననే అహంకారాన్ని దరిచేరనీయ లేదు.

రామానుజులు తనకి కలిగిన సందేహాలకి సమాధానములు చెప్పమని కోరగా, వరదరాజస్వామినడిగి, ఆయన సంశయాలకు సమాధానములను ఆయనచేతనే చెప్పిస్తానని సమాధాన పరిచారు. కాని, తానే అంతటి అర్హత కలవాడనని సమాధానం చెప్పలేదు. రామానుజులయందు వారికున్న పూజ్యభావానికి ఇది నిదర్శనం. రామానుజుల వారు ఎంత వేడినా వారు ఆచార్యత్వానికి అంగీకరించలేదు. అందుచేత రామానుజుల వారు వారిని ఆచార్యులుగా భావించి, భుక్తశేష ప్రసాదం తీసుకోవాలని భావించారు. దీనికోసం వారిని ప్రసాదము తీసికోవడానికి ఇంటికి రమ్మని ఆహ్వానించారు. అలాగే వస్తానని అంగీకరించారు నంబిగారు. అంతటి మహనీయుని ఇంట ప్రసాదం





తీసుకోవడం మహా భాగ్యమని భావించారు. రామానుజులు ఇంటిలో షడ్రసోపేత భోజనం ఏర్పాటు చేసి, భగవన్నివేదన పూర్తిచేసి తిరుక్కచ్చినంబిని తీసికొని రావాలని వారింటికి బయలుదేరి వెళ్ళారు. ఇంతలో తిరుక్కచ్చినంబిగారు రెండోదారిలో వారింటికి వెళ్ళి, సాపాటు పూర్తిచేసి, తొందరగా ఇంటికి చేరుకున్నారు. రామానుజుల వారి భార్య తంజమాంబ, వారు వెడలిన తరువాత, ఆకుతీసి, శుద్ధిచేసి, పొయ్యి అలికి, ముగ్గు పెట్టింది. నూతిదగ్గరకు పోయి స్నానం చేసింది. రామానుజులవారు తిరిగివచ్చి, విషయం తెలుసుకొని ఆచార్య భుక్తశేషం లభించలేదని బాధపడ్డారు. తన అదృష్టంచేత పవిత్రమైన వారి గృహమునందు ప్రసాదము లభించిందని, వారు బాధపడవలదని ఓదార్చారు. రామానుజులు పంచసంస్కారాలు అనుగ్రహించమని ప్రార్థించగా, తనకు అట్టి అధికారం లేదని చెప్పారు. వారి సంశయాలకి సమాధానములు వరదరాజస్వామినడిగి తెలుపుతామన్నారు భగవత్ దర్శనం కలిగినా, తాను మధ్యవర్తియే కాని స్వతంత్రుడననే భావాన్ని వారు ఎక్కడా ప్రకటించుకోలేదు. భగవత్ దర్శనం వారికి వినయ, విధేయతల్ని మరింత పెంచిందేగాని, అహంకారాన్ని కలుగనీయలేదు.

శ్రీరామానుజులు తిరుక్కచ్చినంబిగారి ద్వారా వరదరాజస్వామిని అడిగిన ప్రశ్నలు ఆరు అవి 1. పరతత్త్వమెవరు? 2. జీవాత్మ పరమాత్మలమధ్య భేదముందా? వారొకరేనా? 3. ముక్తిని కోరేవారికి పరమోపాయమేమి? 4. భక్తులు తమ శరీరాన్ని వదిలేవేళ భగవంతునే తలుస్తూ శరీరం విడవాలా? మోక్షం అనేది ఎన్నో జన్మల తరువాత లభించేదా? లేకపోతే ఒక జన్మాంతరంలోనే లభిస్తుందా? 6. నేను ఎవరిని ఆచార్యునిగా వరించాలి? ఆ రోజు రాత్రి వరదరాజస్వామి తిరుక్కచ్చినంబిగారి ద్వారా రామానుజుల వారు వేసిన ప్రశ్నలను తెలుసుకొన్నారు వారి మనస్సుని గ్రహించేరు. వాటికి సమాధానములను ఈ విధంగా తెలియజేసారు.

1. నేను ఈ జగత్తునకు కారణభూతుడనగు పరమాత్మను.
2. జీవుడు కర్మబద్ధుడు. పరమాత్మ జ్ఞానానంద స్వరూపుడు. వేదవేద్యుడు. పరమపురుషుడు. జీవుడు పరమాత్మ ఎన్నటికి ఒక్కరు కాదు.
3. ముక్తిని కోరువారికి పరమోపాయం ప్రపత్తి. (రక్షణ భారం పరమాత్మదేననే భావం)
4. అంతిమస్మృతి అనే ఏముంది, సర్వకాల సర్వావస్థలయందునన్నే తలచేవారికి, చివరి క్షణములలో నన్ను తలవక పోవడమనేదే ఉండదు. ఒకవేళ దైహికస్థితి వారిని తలవనీయకుండా చేసినా నేనే వారిని స్మరించి నాతో చేర్చుకుంటాను.
5. నన్ను తలచిన వారికి ప్రారబ్ధంతో సహా కర్మతొలగిపోతుంది కనుక, ఇక శరీర ములెందుకు? అందుచే ఆ దేహాన్ని విడిచి పెట్టగానే మోక్షమే.
6. ఇక చివరగా ఆళ్వాందారుల శిష్యులలో ఒకరయిన మహాపూర్ణులను అంటే పెరియనంబిగారిని ఆశ్రయించి ఆచార్యులుగా స్వీకరించమని రామానుజులుకు తెలియ చేయ వలసినదిగా చెపుతాడు.

ఆరు సమాధానములకు 'వార్తా షట్క'మనే పేరు, తిరుక్కచ్చినంబిగారు ఎంతో శ్రద్ధతో ఆనందముతో విని కృతార్థుడ నయ్యానని పొంగిపోయారు. ఆ దివ్యసూక్తుల్ని ప్రొద్దున్నే రామానుజులవారికి తెలియ చేసారు.

రామానుజులు వద్దన్నా వినకుండా తిరుక్కచ్చినంబి పాదపద్మాలపై వ్రాలి, సాష్టాంగదండప్రమాణం చేసారు. తనకు మార్గం చూపిన ఆచార్యుల పట్ల ఆనందం, కృతజ్ఞతాభావంతో పొంగి పోయారు.

భగవంతుడే స్వయంగా మాట్లాడి, తన తత్త్వమేమిటో తెలుపుకొన్న వైనం పరమోత్తమైనది కదూ!.

జీవుడు తరించు మార్గనిర్దేశనమును లోకమునకు తిరుక్కచ్చినంబిగారి ద్వారా తెలియచేయుట వారి జీవన ఔన్నత్యమును తెలియచేయుచున్నది తానే తెలియ చెప్పుటకన్న, భగవంతని ద్వారా ఆ రహస్యములను చెప్పించుకోగల 'భక్తి'కి సాటియైనది ఏముంది? తిరుక్కచ్చినంబి గారి జీవితము మనకి ఆదర్శప్రాయము కావాలని కోరుతూ వారి తిరునక్షత్ర తనియన్‌ను మనము ఈ విధముగా స్మరించుకుందామా!

తిరునక్షత్ర తనియన్ :

**కుంభే మృగశిరోద్భూతం శ్రీకాంచీపూర్ణమాశ్రయే।**

**షట్సూక్తిం యతిరాజాయ యన్ముఖాత్ వరదోఽవదత్ ॥**

**దేవరాజదయాపాత్రం శ్రీకాంచీపూర్ణముత్తమమ్ ।**

**రామానుజమునే ర్మాన్యం వన్దేఽహం సజ్జనాశ్రయమ్॥**

## కులశేఖరాళ్వార్ తిరునక్షత్రము 2.03.04

కులశేఖరులు కేరళ దేశమున ఒకరాజు. భగవద్భాగవత నిష్ఠ మెండుగా కల్గినవారు. వీరు కలియుగములో పరాభవ నామ సంవత్సర మాఘమాస శుక్లపక్షమున పునర్వసు నక్షత్రమున జన్మించిరి. చిన్నతనము నుండి శ్రీరామచంద్రుడన్న భక్తి ఎక్కువ. రాజైన తర్వాత కూడా నిత్యము శ్రీరామాయణ కథా శ్రవణము చేయుచు తన్మయులౌతుండే వారు. ఒకనాడు రామాయణకథలో ఖరదూషణుల ఘట్టం వచ్చింది. రాముడొక్కడే 14,000మందితో యుద్ధము చేయవలసి వచ్చిందని వినగానే తన్మయావస్థలో ఆకాలంలోకి వెళ్ళిపోయిన కులశేఖరులు రామునికి సహాయంగా చతురంగ బలాలతో యుద్ధానికి సన్నద్ధమయ్యారు. ఆ రాజుస్థితి తెలిసిన ఆ పండితులు వెంటనే రాముని విజయవార్తను తెలిపి శాంతింపచేయవలసి వచ్చింది. మరొకనాడు సీతాపహరణఘట్టం రాగానే రాముడు లేనిసమయంలో సీతనపహరిస్తున్న రావణుని నశింప చేయాలని దక్షిణదిక్కుగా సముద్రంలో పడి వెళ్ళసాగిరి. వారి భక్తి పారవశ్యానికి స్వామి సీతమ్మతో కలసి దర్శనమిచ్చి వెనుకకి మరలించవలసి వచ్చెను. అంతటి భక్త్యావేశం భగవన్నిష్ఠ కలవారు కులశేఖరులు.

వారికి భాగవత విరక్తి కలిగించి రాజ్యపాలనవైపు ఉన్ముఖులను చేయాలని మంత్రులు ఒక ఆలోచన చేసిరి. భగవన్మూర్తి మెడలోని హారమును తీసి దాచి, భాగవతులే ఈ చౌర్యం చేసారని చెప్పారు. శ్రీవైష్ణవులు అలాంటి అపచారం చేయరని, ప్రతిజ్ఞచేసి, నిరూపణకై కులశేఖరులు త్రాచుపామున్న కుండలో చెయిపెట్టిరి. ఆ పాము వారికి ఎటువంటి హాని కలిగించలేదు. భగవద్భక్తులు ఎన్నడూ తప్పుచేయరని ఆ విధంగా భాగవతనిష్ఠని ప్రకటించారు కులశేఖరులు.

వీరికి ఒకనాడు రంగనాథుని సేవించవలెనని కోరిక కలిగింది. తామొక్కరే కాక, రాజ్యములోనివారంతా రావచ్చని చాటింపు వేయిస్తూండేవారు. భగవంతుని యందు నిష్ఠతో వారు శ్రీరంగమునందే ఉండి రాజ్యపాలన విస్మరిస్తారని మంత్రులు భయపడేవారు. ఎలాగైనా వారిని ఆపాలని సరిగ్గా ప్రయాణసమయంలో భాగవతులని





ఎదురుపంపేవారు. భగవదారాధనకన్న భాగవతారాధన శ్రేష్ఠమని నమ్మిన కులశేఖరులు ఆ వచ్చిన భాగవతులకు అతిథి పూజాదులు నిర్వహించి వారిని సేవించి, వారి శ్రీసూక్తులను శ్రవణం చేస్తూ ఆరోజుకి ప్రయాణం వాయిదా వేసేవారు. ఆ విధంగా "ఘుష్యతే యస్యనగరే రంగ యాత్రా దినేదినే" అయిపోయేది. చివరికి వారు రాజ్యభారం తమ కుమారునకు అప్పగించి శ్రీరంగాది దివ్యదేశములను సేవించిరి. వీరు 105 పాశురములుగల "పెరుమాళ్ తిరుమొజి" అను దివ్యప్రబంధ మును "ముకుంద మాల" అను స్తోత్రమును పాడిరి. వారికిగల భగవద్భాగవత నిష్ఠ మనకీ లభించాలని ప్రార్థిస్తూ వారి తనియన్ అనుసంధించు కుందాం.

**కుంభే పునర్వసౌ జాతం కేరళే చోళపట్టణే**

**కౌస్తుభాంశం ధరాధీశం కులశేఖరమాశ్రయే॥**

**ఘుష్యతే యస్యనగరే రంగయాత్రా దినే దినే**

**తమహం శిరసావందే రాజానం కులశేఖరమ్॥**

## తిరుమాలైయాండాన్ తిరునక్షత్రం 2.03.04

వీరు యామునాచార్యుల ఆజ్ఞపై భగవద్రామానుజులకు గ్రంథజ్ఞానాన్ని అందించిన పంచనంబులలో ఒకరు. వీరు భగవద్రామానుజులకి భగవద్విషయ కాలక్షేపము చేసినారు. వారు పాశురార్థములను వివరించే సందర్భములో భగవద్రామానుజులు విశేష ప్రజ్ఞ కలవారగుటచే దీనికి ఇలా కూడా అర్థం చెప్పవచ్చుకదా! అని 2,3 నిర్వాహాలు చెపుతూ ఉండేవారు. దానికి తిరుమాలైయాండాన్ వారికి కోపం వచ్చేది. మేమా గురువులం, మీరా? గ్రంథంలో లేని క్రొత్తక్రొత్త వ్యాఖ్యానాలు పుట్టిస్తున్నారని కోపగించి కాలక్షేపం ఆపివేసారు. కొంతకాలానికీ విషయం తిరుక్కోష్ఠియూర్ నంబి అనే మరో గురువుగారికి తెలిసింది. వారు వచ్చి ఆండాన్‌గారినడిగి జరిగింది తెలుసుకున్నారు. రామానుజులే వేరువేరు నిర్వాహములు చెప్పుతున్నారు. వారికి నేనేమి చెప్పవలసిన అవసరం లేదన్నారు ఆండాన్‌గారు. తిరుక్కోష్ఠియూర్ నంబిగారు రామానుజులు చెప్పిన నిర్వాహము వారి కల్పితము కాదని, అది తామిదివరలో యామునాచార్యుల వద్దనే విన్నామన్నారు. కాబట్టి ఆ విశేషార్థము పూర్వాచార్య సమ్మతమేనని తెలుపుతూ రామానుజులకి యామునాచార్యుల వారితో సాక్షాత్ సంబంధము లేకున్ననూ, రామానుజులు యామునలకవారికి ఏకలవ్య శిష్యులన్నారు. ఆచార్య శిష్య సంప్రదాయము నిలబెట్టుటకోసం మీవద్ద అధ్యయనం చేస్తున్నారే తప్ప, నిజానికి రామానుజులకి తెలియకకాదు అని నచ్చచెప్పారు. తిరుమలైయాండాన్ కూడా రామానుజుల విశేష ప్రజ్ఞకి ఆశ్చర్యపోయి అంతటివారికి గురువుకాగలిగినందుకు ఆనందించి వారికి కాలక్షేపమును పూర్తిచేసిరి. జగదాచార్యులకే ఆచార్యులైన తిరుమాలైయాండాన్‌గారి తిరునక్షత్రము మార్చి 2వ తేదీన జరుపుకుంటున్నాం.

## పిళ్ళై ఉరంగావిల్లి దాసర్ తిరునక్షత్రము 5.03.04

వీరి పేరు సంప్రదాయపరులు ఏ కొద్దిమందికో మాత్రమే తెలిసి ఉండచ్చు. తెలుగులో ఆపేరు వింటే మనకందరికీ కూడా తెలిసిన పరమభాగవతోత్తముడు ఆయన. ఆ పేరుకి అర్థము ''నిద్రపోని ధనస్సుని ధరించినవారు" అని. ఈ పాటికి వారెవరో మీకందరికీ తెలిసిపోయి ఉంటుంది. ఆయనే "ధనుర్దాసు" నిచుళాపురమున నివసించే ఒక మల్లయోధుడీయన! భార్య హేమాంగి. గొప్ప

సౌందర్యరాశి. ఆమె సౌందర్యానికి వశపడి ధనుర్దాసు ఆమె వెంట గొడుగు పట్టి నడిచేవారట! ఇది చూసి లోకులంతా భార్యావిధేయుడని హేళనగా నవ్వేవారట. అదే దృశ్యాన్ని మన భగవద్రామానుజులు కూడా చూసారు. అది చూసి నవ్వుతున్న శిష్యవర్గాన్ని వారించారు. ధనుర్దాసు ఒక గొప్ప సౌందర్యారాధకుడని గుర్తించారు. అలాంటి సౌందర్యోపాసకునికి భగవంతుని దివ్యసౌందర్యాన్ని చూపించితే భగవదారాధకుడుగా మారతాడన్నది జగదాచార్యులైన రామానుజులు భావించారు. ఆచార్యుల గొప్పతనమే అది. లోకులందరికీ బలహీనతగా, భార్యా విధేయతగా కనపడింది ధనుర్దాసులోని "సౌందర్యోపాసన" మనేగుణం. అతనిలోని ఆ గుణంతోటే అతనిని భగవదుపాసకునిగా మలచాలను కున్నారు ఆచార్యులైన రామానుజులు. ధనుర్దాసుని పిలిచి నేరుగా శ్రీరంగని ఆలయానికి తీసుకొనివెళ్ళారు. ''శ్రీరంగ నాథుని విశాలనేత్రాలు" దర్శింపచేసారు. ఆచార్యులు కృపతో లభించిన ఆ దివ్యదర్శనం ధనుర్దాసుని ఆ దివ్యసౌందర్యా రాధకునిగా మార్చివేసింది. ఆనాటి నుండి ఆ దంపతులిద్దరూ భగవద్రామానుజుల శిష్యులై లౌకిక విషయవాంఛలను విడిచి, ఆచార్యులని సేవిస్తూండేవారు. ఒకనాడు వారినిష్ఠని వెల్లడిచేయదలచి రామానుజులు కొందరు స్వాములని పంపి హేమాంగి ఆభరణము లని అపహరించుకొని రమ్మన్నారు. ఆ వైష్ణవస్వాములు వెళ్ళి ఒక ప్రక్కగా తిరిగి నిద్రిస్తున్న ఆమె ఒంటిమీది ఆభరణాలన్ని అపహరించారు. ఇంతలో మెలకువ వచ్చి ఆమె కనులు తెరచింది. ఎదురుగా భాగవతోత్తములైన స్వాములు. వెంటనే ఆమె రెండోవైపు తిరిగి పడుకుంది. అటువైపు ఆభయరణాలు కూడా తీసుకుంటారని కానీ, వారు భయపడి వెళ్ళిపోయారు. ఇంతలో ధనుర్దాసు ఇంటికి తిరిగివచ్చి భార్యద్వారా విషయం విని, చాలాబాధపడి ఆమెనే నిందిస్తారు. నీవు అలా కదలకుండా ఉంటే వారే మిగిలిన ఆభరణాలు కూడా ఎలాగో తీసుకొని ఉండేవారు కదా! భాగవతాపచారం చేసావు. పాపం స్వాములకి ఎంతటి అవసరమైతే వచ్చారో, మిగిలినవి కూడా సమర్పించి వద్దాం! అన్నారు. ఆ సంభాషణంతా విన్న శిష్యులు సిగ్గుతో తలవంచుకున్నారు. భాగవతోత్తములు ఎలాంటి వారైనా వారియందు నిష్ఠకలిగి ఉండటం వల్లనే భగవద్రామానుజులు కావేరిలో స్నానమాచరించి, తిరిగి వచ్చేటపుడు ధనుర్దాసుని కరావలంబంగా గ్రహించి వస్తూండేవారట. ఆ విధంగా రామానుజులనే ఆచార్య స్పర్శవేదితో భగవద్భాగవత ఆచార్యనిష్ఠ కలిగిన బంగారంగా మార్చబడిన ధన్యజీవి ధనుర్దాసు. ఆనాటి నుండి నేటికీ పెరుమాళ్ తిరువీధి ఉత్సవంలో ముందు తాను ధనస్సు కత్తిని ధరించి బయలుదేరు తారట. ధనస్సు పెరుమాళ్ళకి రక్షణ కల్పించటానికి అప్రమత్తంగా ధరించి ఉంటారుట. భగవద్వ్యతిరిక్తమైన మాటలు వినవలసి వస్తే తనని తాను పొడుచుకోవాలని కత్తిని ధరించి ఉంటారుట. అంతటి దాసభావం కలిగిన వారి తిరునక్షత్ర సందర్భంగా మనం అనుసంధించుకోవలసిన తిరునక్షత్ర తనియన్:

**కుంభే చాశ్లేష సంభూతం జ్ఞానాదిగుణసాగరం।**

**రామానుజార్య సచ్ఛిష్యం ధనుర్దాసమహం భజే॥**

**జాగరూకం ధనుష్పాణిం పాణౌ ఖడ్గసమన్వితం**

**రామానుజస్పర్శవేదిం రాద్ధాంతార్థప్రకాశకమ్॥**



భక్తినివేదన ఫిబ్రవరి, 2004



# బదరికాశ్రమంలో పునర్నిర్మించే సత్సంగసదనమునకు విరాళాలు సమర్పించిన దాతలు

**మహారాజ పోషకులు:**

శ్రీమతి చలసాని సుశీల–గుడివాడ

**రాజ పోషకులు** :

**రామానుజ దాసి– విశాఖపట్నం, శ్రీమాన్ మాధవరావు– ఖమ్మం, శ్రీమతి బి. లత–హైదరాబాద్, శ్రీమాన్ మాధవరావు–ఖమ్మం, శ్రీమాన్ కె. మాధవరావు–విశాఖపట్నం, శ్రీమాన్ కె. పాండురంగ–విశాఖపట్నం.**

**పోషకులు** :

**శ్రీమాన్ వేమారెడ్డి శ్యామసుందర్‌రెడ్డి–వరగలి, శ్రీమాన్ వై. కృష్ణారెడ్డి–కరీంనగర్, శ్రీమాన్ వై.వి.ఎస్. భానుమూర్తి–హైదరాబాద్, శ్రీమతి ఎమ్. హైమవతి–తాడేపల్లి గూడెం, శ్రీమతి ఎన్. అచ్చమ్మ–హైదరాబాద్, శ్రీమాన్ ఇ. వేణుగోపాలా చారి–హైదరాబాద్, శ్రీమాన్ ఎన్. పూర్ణచంద్ర రావు–విజయవాడ.**

**జీవిత సభ్యులు**:

శ్రీమాన్ టి. రామారావు, మహాలక్ష్మి–ఒంగోలు, శ్రీమాన్ ఎమ్. రఘుపతిరావు, రమాదేవి–ప్రొద్దుటూరు, శ్రీమాన్ అక్కిరాజు వెంకటేశ్వర్లు, అనసూయ–చెన్నై, శ్రీమాన్ బి. మహదేవుడు, మంగాయమ్మ–హైదరాబాద్, శ్రీమాన్ ఎన్. ఎన్నయ్యశెట్టి, లక్ష్మీదేవమ్మ–డోన్, శ్రీమాన్ కె. నరసింహగుప్తా–డోన్, శ్రీమతి కె. యశోదమ్మ–డోన్, శ్రీమాన్ లక్ష్మణస్వామిశెట్టి, నరసమ్మ–డోన్, శ్రీమాన్ కె. వెంకటసుబ్బయ్య, సుబ్బరత్నం–డోన్, శ్రీమాన్ భూపతి శ్రీనివాసరావు–శ్రీకాకుళం, శ్రీమాన్ వి. వెంకటప్పారావు–దూబచర్ల, శ్రీమాన్ చిన్ని రాధాకృష్ణ–గుంటూరు, శ్రీమాన్ కె. వెంకట్రావు, రమాదేవి–విజయవాడ, శ్రీమాన్ సత్యశ్రీ హనుమంతరావు–విస్సన్నపేట, శ్రీమాన్ వి.ఎస్.వి. సముద్రరావు–హైదరాబాద్, శ్రీమాన్ చిన్నం శ్రీరాములు–జగ్గయ్యపేట, శ్రీమాన్ బి.వెంకట రమణారావు–కొండమంచిలి, శ్రీమాన్ వి.విశ్వేశ్వర రావు, సీతామహలక్ష్మి–హైదరాబాద్, శ్రీమతి జి. భాగ్యలక్ష్మి–కాకినాడ, శ్రీమాన్ కె. సీతారామారావు, లక్ష్మి–హైదరాబాద్, శ్రీమతి ఎమ్. నాగమణి–విజయవాడ, శ్రీమాన్ ఎల్. లక్ష్మీనారాయణ, మంజులాల్–మహబూబ్‌నగర్, శ్రీమాన్ కె. నాగేశ్వరరావు–చీమకుర్తి, శ్రీమతి బి. రమాదేవి–ఒంగోలు, శ్రీమతి ఐ. వెంకటలక్ష్మి– వినుకొండ, శ్రీమాన్ ఎన్. విద్యాసాగర్– సికింద్రాబాద్, శ్రీమాన్ కె.వి. సత్యన్నారాయణ మూర్తి–కాకినాడు, శ్రీమాన్ వై. కోటేశ్వరరావు, హైమవతి–ఖమ్మం, శ్రీమాన్ ఇ. కోటేశ్వరరావు– ఖమ్మం, శ్రీమాన్ పి. సుబ్బరాయుడు, వీరమ్మ– నెల్లూరు.

**అభిమానులు:**

శ్రీమాన్ ఎ. పార్థసారధి, రాధ–విశాఖపట్నం, శ్రీమతి ఆత్మకూరి శ్యామల–విశాఖపట్నం, శ్రీమాన్ కె. పార్థసారధి, కనకవల్లి–విశాఖపట్నం, శ్రీమాన్ జోషి, మంగమ్మ–హైదరాబాద్, శ్రీమాన్ జోషి, శంకరయ్య–హైదరాబాద్, శ్రీమాన్ ముక్తా కిరణ్‌కుమార్–హైదరాబాద్, శ్రీమాన్ రంగరాజు, ఎన్. కృష్ణారావు–హైదరాబాద్, కిలార్ అనుపమ–హైదరాబాద్, శ్రీమతి అపర్ణ, గౌతమ్‌చంద్రుడు–హైదరాబాద్, శ్రీమాన్ టి. భువనేశ్వరరావు, నిర్మలాదేవి–గుంటూరు, శ్రీమాన్ కె. పున్నారావు, విజయలక్ష్మి–విజయవాడ, శ్రీమాన్ రవీంద్రకుమార్, సుధాదేవి–గుంటూరు, శ్రీమాన్ పి. భవనప్రసాద్, కమలాదేవి–కాకినాడు, శ్రీమాన్ కె. ఉదయ్‌కుమార్–విశాఖపట్నం, శ్రీమాన్ కె. శివానందకుమార్–విశాఖపట్నం, శ్రీమాన్ సిహెచ్. వెంకటరామలింగేశ్వరరావు–జగ్గయ్యపేట, శ్రీమతి ఎమ్. సరస్వతి–విశాఖపట్నం, శ్రీమాన్ డి.వి. నరసింహాచారి, జానకి–హైదరాబాద్, శ్రీమాణ బి. శ్రీరామమూర్తి–గుంటూరు, శ్రీమాన్ ఎమ్. వెంకటేశ్వర్లు, సుశీల– గుంటూరు, శ్రీమాన్ పగడాల వెంకటేశ్వరరావు–సికింద్రాబాద్.





**డి. కృష్ణంరాజు (ఖాజీపాలెం)వారి ద్వారా**

**రాజ పోషకులు** :

**శ్రీమాన్ బండారుపల్లి షణ్ముఖేశ్వరరావు–హైదరాబాద్**

**జీవిత సభ్యులు**:

శ్రీమాన్ ఎస్. మహేశ్వరి–హైదరాబాద్, శ్రీమాన్ ఆర్. రాజేంద్రప్రసాద్‌రాజు, ప్రమీల–హైదరాబాద్, శ్రీమాన్ కె. శ్రీనివాస ప్రవీణ, రోజారాణి–హైదరాబాద్, శ్రీమాన్ వి. నాగరాజు,పార్వతి–బుద్దాం, శ్రీమాన్ డా॥ జి. శ్రీనివాసరాజు–గుంటూరు, శ్రీమతి దెందుకూరి సత్యవతి–ఖాజీపాలెం, శ్రీమాన్ దెందుకూరి కృష్ణంరాజు, సరస్వతి–ఖాజీపాలెం, శ్రీమాన్ మంతెన శివరామరాజు, కమల–ఖాజీపాలెం, శ్రీమాన్ మంతెన కృష్ణంరాజు, లీలావతి– ఖాజీపాలెం, శ్రీమాన్ కొత్తపల్లి వెంకటరామరాజు, గోరుట్ల సత్యన్నారాయణరాజు–ఖాజీపాలెం, శ్రీమాన్ రాజంరాజు, పద్మావతి–ఖాజీపాలెం,

**అభిమానులు:**

శ్రీమాన్ కొత్తపల్లి సూర్యనారాయణరాజు–ఖాజీపాలెం, శ్రీమాన్ కొత్తపల్లి ఫృద్విరాజు–ఖాజీ పాలెం, శ్రీమాన్ కొత్తపల్లి నాగవర్ధనరాజు–ఖాజీపాలెం, శ్రీమాన్ దెందుకూరి సత్యనారాయణ రాజు, సరస్వతి–ఖాజీపాలెం, శ్రీమాన్ పెనుమెత్స కోటంరాజు, సుబ్బమ్మ–ఖాజీపాలెం, శ్రీమాన్ దెందుకూరి పెదనాగరాజు–ఖాజీపాలెం, శ్రీమాన్ కె. రామరాజు (ప్రిన్సిపాల్)–ఖాజీపాలెం, శ్రీమతి గోకరాజు జానకమ్మ–ఖాజీపాలెం, శ్రీమతి గోకరాజు ఆదిలక్ష్మి, సుబ్బరాజు–ఖాజీపాలెం, శ్రీమతి మంతెన జయమ్మ వెంకటపతిరాజు–ఖాజీపాలెం, శ్రీమతి కె. ఆండాళ్ళమ్మ జ్ఞాపకార్థం సీతమ్మగారు–ఖాజీపాలెం, శ్రీమతి మంతెన సుబ్బమ్మ జ్ఞాపకార్థం సరస్వతి–ఖాజీపాలెం, శ్రీమాన్ మంతెన లక్ష్మీపతి రాజు జ్ఞాపకార్థం ప్రభావతి–ఖాజీపాలెం, శ్రీమాన్ రుద్రరాజు అల్లూరయ్యరాజు–రామనగరం, శ్రీమాన్ రుద్రరాజు సత్యనారాయణరాజు–రామనగరం, శ్రీమాన్ మంతెన కోటంరాజు–రామనగరం, శ్రీమాన్ మంతెన మదనమోహనరాజు– రామనగరం, శ్రీమాన్ మంతెన వెంకటరామ రాజు– రామ నగరం, శ్రీమాన్ మంతెన కృష్ణంరాజు హరి కుమారి–ఖాజీపాలెం, శ్రీమతి చింతలపాటి కమల–రామనగరం, శ్రీమాన్ దెందుకూరి శ్రీనివాసరాజు–ఖాజీపాలెం, శ్రీమాన్ మంతెన వెంకట్రామరాజు, సీతమ్మ–బుద్దాం, శ్రీమాన్ మంతెన సూర్యసత్యనారాయణరాజు– బుద్దాం, శ్రీమతి పెనుమత్స మాధవి–బుద్దాం, శ్రీమతి దంతులూరి ఆండాళ్ళు–బుద్దాం, శ్రీమతి కూసం పూడి విమల–బుద్దాం, శ్రీమతి గొట్టుముక్కల ఉమ–బుద్దాం, శ్రీమతి లలిత సత్యనారాయణ రాజు–జి.ఎన్.పాలెం, శ్రీమతి సరళ సత్య నారాయణరాజు–అలకాపురం, శ్రీమాన్ పి. సత్యనారాయణరాజు, దివ్యసుందరి–కృత్తివెన్ను, శ్రీమాన్ పి. వెంకట్రామరాజు, శ్రీదేవి–కృత్తివెన్ను, శ్రీమాన్ మంతెన అచ్యుతరామరాజు–పిట్టలవాని పాలెం, శ్రీమాన్ గూడూరు వెంకట్రామయ్య–గణపవరం, శ్రీమతి వి. జానకి శ్రీనివాసరామకృష్ణం రాజు–హైదరాబాద్, శ్రీమాన్ వై. వెంకటేశ్వర రావు– హైదరాబాదు.

న్యూస్

# ప్రచార వార్తలు

**ఖమ్మం ధనుర్మాస మహోత్సవం :** జనవరి ఒకటవ తేదీన నూతన ఆంగ్ల సంవత్సర సందర్భంగా విచ్చేసిన భక్తబృందానికి శ్రీశ్రీశ్రీ స్వామివారు మంగళాశాసనపూర్వక అనుగ్రహభాషణం కావించారు.

2వ తేదీన శ్రీశ్రీశ్రీ స్వామివారు ఇల్లెందు గ్రామంలోను, సింగరేణి కాలరీస్ రామాలయాన్ని సందర్శించి అక్కడివారందరికీ గీతాజ్యోతి లక్ష్యాలను వివరించారు. సాయంత్రం ఖమ్మంలో జరిగిన శ్రీకృష్ణాష్టోత్తర శతనామ పూజలతో వేలాదిమంది భక్తులు శ్రద్ధతో పాల్గొన్నారు. 3వ తేదీ వైకుంఠ ఏకాదశి పర్వదిన సందర్భంగా వైకుంఠ ద్వారదర్శనం, పెరుమాళ్‌కి పల్లకీలో తిరువీధి ఉత్సవం వైభవంగా జరిగాయి. ఆ రోజే శ్రీశ్రీశ్రీ స్వామివారు 2004వ సంవత్సరానికిగాను భక్తినివేదన పంచాంగాన్ని ఆవిష్కరించారు. ఈ పంచాంగాన్ని హైదరాబాద్‌లోని ప్రియదర్శినీ ఎడ్వర్టైజర్స్ శ్రీమాన్ రామిరెడ్డిగారు ఆకర్షణీయంగా డిజైన్ చేయగా, శ్రీమాన్ భీమ్‌రావుగారు చిత్రీకరణ చేస్తే, జనగాం సిద్ధాంతిగా ప్రసిద్ధినొందిన శ్రీమాన్ కృష్ణమాచార్యులుగారు పంచాంగకర్తగా, మహా సిమెంట్స్ అధినేత శ్రీమాన్ జె. రామేశ్వరరావుగారి సౌజన్యంతో, సందేశాత్మకంగా రూపొందించారు.

ఈ కార్యక్రమంలో శ్రీమాన్ రామేశ్వరరావు దంపతులు, శ్రీమాన్ విజయరాఘవాచారిగారు (మానవ వనరుల శాఖ డిప్యూటీ డైరెక్టర్), అడిషనల్ ఎస్.పి. ఆనందరావు ఉబాలె, తదితరులు పాల్గొన్నారు. వైకుంఠ ఏకాదశి సాయంత్రం 37వ ధర్మక్షేత్రాన్ని ఖమ్మంలో నిర్వహిస్తూ శ్రీశ్రీశ్రీస్వామివారు వేలాదిమందిచే జ్యోతులు వెలిగింప చేసి గీతాజ్యోతి ప్రతిజ్ఞను కావించారు.

4వ తేదీ శ్రీశ్రీశ్రీ పెద్దజీయరు స్వామివారి పరమపదోత్సవ సందర్భంగా వారి "తిరువడికి" తిరుమంజనం, అష్టోత్తరపూజ నిర్వహించారు. అనంతరం శ్రీస్వామివారు చింతకాని వేంచేసి అక్కడ "వికాసతరంగిణి శాఖ"ను ప్రారంభించారు. ఆశాఖవారు ప్రారంభ దివసమందే పశువైద్య శిబిరాన్ని నిర్వహించారు. తరువాత ప్రతిరోజూ శ్రీస్వామివారు స్థానిక పాఠశాలలను, ఆలయాలను సందర్శించి గీతాజ్యోతి సందేశాన్నందించారు. కూడారై మహోత్సవం రసవంతంగా జరిగింది.

ఈ ధనుర్మాస మహోత్సవంలో శ్రీశ్రీశ్రీస్వామి వారు రెండుసార్లు మంత్రోపదేశం అనుగ్రహించారు. సుమారు 2,500 మంది ఈ పవిత్ర సమయంలో ఆచార్యులని ఆశ్రయించి మంత్రోపదేశం పొందారు. ఈ ధనుర్మాసారంభంలోనూ, ముగింపులోనూ శ్రీవిల్లిపుత్తూరు ఆండాళ్ తల్లి శేషమాలలు అంది కార్యక్రమానికి పవిత్రతను చేకూర్చాయి. శ్రీమాన్ ఎర్నేని రామారావుగారి (చైర్మన్) నేతృత్వంలో శ్రీమాన్ ఆర్. లక్ష్మణరావుగారు, శ్రీమాన్ ఎన్. మాధవరావుగారు, శ్రీమాన్ పి. మాధవరావుగారు, వైస్ చైర్మన్‌లుగా, శ్రీమాన్ వి. వెంకటేశ్వరరావుగారు కార్యదర్శిగా, శ్రీమాన్ జె. హనుమత్ ప్రసాద్‌గారు కోశాధికారిగా, శ్రీమాన్ పి. వెంకటసుబ్బులు శ్రీమాన్ పి. ప్రసాద్‌గారు, శ్రీమాన్ వై. కృష్ణమూర్తిగార్ల సహకారంతో ఈ ధనుర్మాస మహోత్సవం అత్యంత వైభవంగా నిర్వహించారు. వీరికి తోడుగా మన వి.టి కార్యకర్తలు శ్రీమతి జయప్రద, శ్రీమతి తాయారమ్మ మొ॥ వారంతా నిలచారు. వారికి, కార్యకర్తలందరికి శ్రీశ్రీశ్రీ స్వామివారు 13వ తేదీరాత్రి జ్ఞాపికలందించి మంగళాశాసనాలు కావించారు. భవిష్యత్‌లో ఖమ్మం జిల్లాని వి.టి. పరంగా సమన్వయ పరచాలని శ్రీస్వామివారు నిర్ణయించారు. స్తంభాద్రిగా ప్రసిద్ధి కలిగి, కాలక్రమేణ ఖమ్మంగా మారిన ఈ పట్టణంలోని వేలాది ప్రజలంతా ఈ నెలరోజుల కార్యక్రమంలో శ్రద్ధాసక్తులతో పాల్గొని శ్రీస్వామివారి శ్రీసూక్తి అమృతాన్ని అందుకొని ధన్యులయ్యారు. పత్రికలవారు అందరూ కూడా కార్యక్రమానికి చక్కటి సమీక్షనందిస్తూ ప్రజలందరికీ విశేషాలు తెలియడానికి కృషిచేసారు. దానికి శ్రీమాన్ వక్కలంక వెంకటేశ్వర్లుగారు, శ్రీమాన్ మోహనాచార్యులుగారు, శ్రీమాన్ తిరుమలరావుగార్లు చక్కటి మీడియా ప్రచారాన్ని కావించారు. శ్రీశ్రీశ్రీస్వామివారు వారందరికీ జ్ఞాపికలందించి మంగళాశాసనాలు కావించారు. శ్రీమాన్ దుర్గామోహనరాయ్‌గారు నెలరోజుల శ్రీవారి ప్రవచనాలలోని కొన్ని శ్రీసూక్తులను సంకలనం చేసి పుస్తకరూపంలో శ్రీవారిచే ఆవిష్కరింపచేసి మంగళాశాసనాలు పొందారు.

14వ తేదీ ఉదయం శ్రీగోదా రంగనాథుల కళ్యాణ మహోత్సవం సుమారు 3.30 గంటలపాటు ప్రతిక్రియనీ శ్రీశ్రీశ్రీస్వామివారు వివరిస్తూ నిర్వహింపచేసారు. 250 మంది కొత్తదంపతులు, వేలాదిమంది భక్తులు ఈ మహోత్సవంలో పాల్గొన్నారు. జీవుడు, పరమాత్మకి తనని అర్పించుకోగలగడమే ఈ కళ్యాణమహోత్సవంగా శ్రీస్వామివారందించిన వివరణ భక్తుల హృదయాలను పులకింపచేసింది. ఆ వైభవాన్ని కనులారా దర్శిస్తూ, చెవులారా వినగలిగిన ఖమ్మం భక్తుల భాగ్యమే భాగ్యం!

వేదికపై కల్యాణానంతరం నేరుగా ధనుర్మాస కమిటీ చైర్మన్ శ్రీమాన్ రామారావుగారింటిలో పాదపూజను స్వీకరించి, శ్రీస్వామివారు మంగళాశాసనం కావించారు. నెలరోజులు శ్రీస్వామివారికి, పరివారాన్ని తమ గృహంలోనే నెలకొల్పుకున్న శ్రీమాన్ హరిబాబుగారు ఛార్టెడ్ ఎకౌంటెంట్‌గారికి శ్రీస్వామివారు మంగళాశాసనాలు కావించి హైదరాబాద్ బయలుదేరారు.

మార్గమధ్యంలో నాయకం గూడెంలో ఆలయాన్ని సందర్శించి అక్కడివారికి ఆలయజీర్ణోద్ధరణకి తగిన సూచనలు చేసారు. అనంతరం నల్గొండజిల్లా సూర్యాపేటలో వికాసతరంగిణి గౌరవాధ్యక్షులు శ్రీమాన్ ఎమ్. సత్యనారాయణగారికి, భక్తబృందానికి మంగళాశాసనం చేసి, రాత్రి 7గంటలకి హైదరబాద్‌లోని జెట్‌కి చేరారు.

**హైదరాబాద్‌లో గోదా కల్యాణం :** వెంటనే స్థానిక ఎ.వి. కాలేజ్ ఆవరణలో జెట్ వారు ఏర్పాటు చేసిన శ్రీగోదాకళ్యాణ మహోత్సవానికి వేంచేసారు. అక్కడ నెలరోజులు ధనుర్మాసోపన్యాసములు కావించిన శ్రీమాన్ డా॥ కందాడై రామానుజాచార్యులుగారిని సత్కరించి, భక్తులందరికీ మంగళాశాసనాలు కావించారు. రాత్రి 11గం॥లకి కళ్యాణమహోత్సవం అత్యంత వైభవంగా సంపూర్ణమైంది.

15వ తేదీ ఉదయం తీర్థగోష్ఠి అనంతరం వి.హెచ్.పి. వారి ఆహ్వానంపై అంతర్జాతీయ విశ్వహిందూపరిషత్ కార్యవర్గ సమావేశానికి వేంచేసి సమావేశ ఉద్ఘాటన కావించారు. ముందుగా శ్రీమాన్ అశోక్ సింఘాల్‌గారు శ్రీశ్రీశ్రీ స్వామివారికి స్వాగతం పలుకుతూ... గతంలో రాజాంలో శ్రీస్వామివారిని సందర్శించిన సంగతి గుర్తుచేసుకుంటూ తమయొక్క ధార్మిక

ఉద్యమానికి మార్గదర్శనం చేయమని శ్రీవారిని కోరారు. అనంతరం శ్రీమాన్ వై. పుల్లారెడ్డిగారు శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామి వారితో తమకుండే పరిచయాన్ని జ్ఞాపకం చేసుకుంటూ శ్రీ చిన్నజీయరుస్వామివారి కార్యక్రమాల వైభవాన్ని, ప్రభావాన్ని ప్రశంసించారు. శ్రీవారిని తమ ఇంజనీరింగ్ కాలేజ్‌ని సందర్శించ వలసిందిగా కోరారు.

శ్రీమాన్ ప్రవీణ్‌భాయ్ తొగాడియా (అంతర్జాతీయ V.H.P ప్రధానకార్యదర్శి) శ్రీమాన్ విష్ణుదాల్మియా, ఆచార్యగిరిరాజ్ కిషోర్‌గారు మొదలైనవారంతా శ్రీస్వామి వారిని ఆహ్వానించిన వారిలో ఉన్నారు.

V.H.P అంతర్జాతీయ కార్యవర్గ సమావేశంలో శ్రీస్వామివారు:

అనంతరం శ్రీశ్రీశ్రీస్వామివారు సందేశమిస్తూ వి.హెచ్.పి. కార్యకర్తలలో ఉండే అంకితభావాన్ని, ధర్మరక్షణ శ్రద్ధని ప్రశంసించి మంగళాశాసనాలు కావించారు. కార్యకర్తకి ధర్మరక్షణలో ఉండాల్సిన ప్రామాణికతను తప్పనిసరిగా గుర్తించవలసిన అవసరం ఉందనీ, అదిలేని ఉద్యమం ఎంత ఉధృతంగా సాగినా అల్పప్రయోజనకారి మాత్రమే అవుతుందన్నారు. సుమారు 42 దేశాల వి.హెచ్.పి. ప్రతినిధులు ఈ సభలో శ్రీస్వామివారి సందేశాన్నందుకొన్నారు. అనంతరం శ్రీవారు కొందరు భక్తుల గృహాలను సందర్శించి మంగళాశాసనాలు చేసారు.

**శ్రీస్వామివారిని సందర్శించిన ఎండోమెంట్స్ కమీషనరు :** 15వ తేదీ రాత్రి శ్రీమాన్ రమణాచారిగారు హైదరాబాద్ జెట్‌లో శ్రీస్వామివారిని సందర్శించారు. శ్రీవారు వారికి దేవాలయాల విషయంలో జరుపాల్సిన, చేపట్టాల్సిన తక్షణకర్తవ్యాన్ని నిర్దేశించారు.

16వ తేదీ జెట్‌లోనే వేంచేసి ఉండి జెట్ సభ్యులందరితో సమీక్షా సమావేశాన్ని నిర్వహించారు. 17వ తేదీ తీర్థగోష్ఠి అనంతరం స్థానిక పాఠశాలకు గీతాజ్యోతి సందేశాన్నందించారు. అనంతరం భక్తుల గృహాలను సందర్శించి, మంగళాశాసనాలు కావించారు.

**శ్రీగోపాలోపాయన పురస్కారము:** 18వ తేదీ శ్రీగోపాలోపాయన పురస్సర సమర్పణ మహోత్సవం దిల్‌షుక్‌నగర్ పుష్పాగార్డెన్స్‌లో వైభవంగా జరిగింది. ఈసారి గోపాలోపాయనాన్ని చిన్నప్పటి నుండి శ్రీమాన్ గోపాలాచార్యవారి అనుగ్రహానికి పాత్రమై, రాజమహేంద్రి చుట్టుపక్కల ప్రచారకార్య క్రమాలు నిర్వహించే శ్రీఉ.వే. శ్రీమాన్ S.T.P. వేంకటాచార్యస్వామివారికి సమర్పించడం విశేషం. కోరుకొండ ప్రక్కనే ఉన్న రాఘవాపురంలో శ్రీమాన్ గోపాలాచార్య స్వామివారు నిర్వహించే సంస్కృత పాఠశాలలోనే శ్రీమాన్ వేంకటాచార్య స్వామివారు విద్యాభ్యాసం చేసారు.

సాయంత్రం 5.30గం॥లకు శ్రీవిష్ణుసహస్ర నామస్తోత్ర పారాయణతో ఆరంభమైంది కార్యక్రమము. శ్రీ ఉ.వే. శ్రీమాన్ సముద్రాల రంగరామానుజాచార్య స్వామివారు గోపాలోపాయన పురస్కార కార్యక్రమ పరిచయం కావించారు. శ్రీ ఉ.వే. శ్రీమాన్ గోపాలాచార్యస్వామివారి వైభవాన్ని వారితో తమ అనుభవాలను కొందరు వక్తలు వివరించారు. వారిలో హైదరాబాదుకు చెందిన శ్రీమాన్ సముద్రాల శ్రీనివాసాచార్యస్వామి, శ్రీమాన్ కందాడై రామానుజాచార్యస్వామి, విజయవాడకు చెందిన శ్రీమాన్ ఉడయవర్‌స్వామి, హైదారాబాద్‌కి చెందిన డా॥ సంపత్‌గారు ఉన్నారు. శ్రీ ఉ.వే. శ్రీమాన్ రామచంద్రాచార్యస్వామివారు సమ్మాన గ్రహీత అయిన శ్రీఉ.వే. శ్రీమాన్ వేంకటాచార్య స్వామివారి వైభవాన్ని సభకు పరిచయం కావించారు. శ్రీ వేంకటాచార్య స్వామివారు శ్రీశ్రీశ్రీ





పెద్దజీయరు స్వామివారికి సహాధ్యాయులై శ్రీమాన్ గోపాలాచార్యస్వామి వారివద్ద భగవ ద్విషయం, శ్రీవచనభూషణం అధ్యయనం చేసిన భాగ్యవంతులు. అంతేగాక, గీతాభాష్యం, ఆచార్యహృదయం, తనిశ్లోకి, ఉపనిషత్తులు మరెన్నో వేదాంత గ్రంథాలు వారివద్దనే అధికరించారు. వీరి ప్రవచన పాటవం ద్రావిడ వ్యాఖ్యాన పంక్తులను ధారళంగా ఉదాహరించే ఉపన్యాసశైలి, వీరికి "ఆంధ్ర నంబిళ్ళ"గా పేరు తెచ్చిపెట్టింది. "ఆనందాన్ పిళ్ళై" "ఉపన్యాస శిరోమణి"వంటి బిరుదులెన్నో వీరిని వరించినవి.

చక్కటి సంప్రదాయనిష్ఠులై, ఆచార్యులకు పరమప్రీతిపాత్రులైన శ్రీవేంకటాచార్యస్వామివారిని ''గోపాలోపాయన పురస్కారం''తో శ్రీశ్రీశ్రీ స్వామివారు సత్కరించారు. ముందుగా శ్రీమతివనజా భాస్కరరావు దంపతులు, శ్రీమతి డా॥ శారదా దంపతులు వేదికపై శ్రీమాన్ వేంకటాచార్యస్వామి దంపతులకు మంగళావాయిద్యముల మధ్య చందన పుష్పాదులనర్పించారు. అనంతరం వారిరువురికి వస్త్రాలను సమర్పించుకొన్నారు. శ్రీశ్రీశ్రీస్వామిరే స్వయంగా దుశ్శాలువ మరియు సమ్మానపత్రాన్ని అనుగ్రహించారు. తరువాత సమ్మానగ్రహీతగారికి శ్రీమాన్ బచ్చు జనార్దన్‌గారి ద్వారానగదు బహుమతి సమర్పించారు. శ్రీమాన్ వేంకటాచార్య స్వామివారు గతస్మృతులతో కూడిన సందేశాన్నందించారు.

అదే వేదికపై వెంటనే శ్రీ ఉ.వే. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారి సంస్మరణ మహోత్సవం ఆరంభమైంది. శ్రీమాన్ అప్పలాచార్యస్వామివారు రచించిన దాశరథి శతకవ్యాఖ్యానమును శ్రీశ్రీశ్రీస్వామి వారు తమ దివ్యకరకమలములతో ఆవిష్కరించారు. అనంతరం శ్రీమాన్ అప్పలాచార్యస్వామివారి కుమార్తె శ్రీమతి తిరువెంగళమ్మగారు మాట్లాడుతూ శ్రీమాన్ గోపాలాచార్యస్వామివారికి నాన్నగారిపై అపారమైన వాత్సల్యం ఉందని గత అనుభవాలను గుర్తుచేసుకున్నారు. శ్రీశ్రీశ్రీ చిన్నజీయరుస్వామివారిలోని ఇప్పుడు తమ తండ్రిగారిని చూసుకుంటున్నామని ఆర్తిని వెలిబుచ్చారు. ఆ తరువాత అప్పలాచార్య స్వామివారి సన్నిహితులు శ్రీమాన్ గీతామృతరావుగారు (హైదరాబాద్) మాట్లాడుతూ శ్రీమాన్ అప్పలాచార్యస్వామివారి గ్రంథాలను నేటి పాఠ్యపుస్తకాలుగా ప్రవేశపెట్టి విద్యార్థులకు నైతికబోధన చేయాలన్నారు. శ్రీమాన్ రామకృష్ణారెడ్డిగారు, శ్రీమాన్ నాగేశ్వరరావుగారి అనుభవాలనంతరం శ్రీశ్రీశ్రీ స్వామివారు స్మృత్యంజలినందించారు. తమకి శ్రీశ్రీశ్రీపెద్ద జీయరుస్వామివారు అనుగ్రహించిన జ్ఞానజన్మ శ్రీమాన్ గోపాలచార్యస్వామివారు జ్ఞానాన్నందిస్తే, శ్రీమాన్ అప్పలాచార్య స్వామివారివల్ల మెరుగులుదిద్దుకుందన్నారు. శ్రీమాన్ కల్కి అవతారంగారి కృతజ్ఞతావిష్కరణతో ఆనాటి సాయంసభ సంపూర్ణమైంది.

**జహీరాబాద్ ధర్మక్షేత్రము :-**

శ్రీస్వామివారు 'గీతాజ్యోతి' కార్యక్రమంలో భాగంగా 'జహీరాబాద్'లో 38వ ధర్మక్షేత్రాన్ని నిర్వహించారు. కమిటీ అధ్యక్షులైన అల్లాడి వీరేశం గుప్తగారి నేతృత్వంలో 19వ తేదీన మహేంద్రకాలనీలో 'తీర్థగోష్ఠి'తో కార్యక్రమం మొదలైనది. అనంతరం శ్రీస్వామివారు శ్రీవేంకటేశ్వరస్వామివారి దేవస్థానమునకు వేంచేసి శ్రీవారిని సేవించుకొన్నారు.

అనంతరం శ్రీస్వామివారు 'రంజోలు' గ్రామమునకు వేంచేసారు. శ్రీమాన్ అరుణ్ దేశ్ పాండే అదే గ్రామంలో ఉచితవైద్య శిబిరాన్ని ఏర్పాటు చేయగా శ్రీవారు దాన్ని ప్రారంభించి

వైద్యులకు, భక్తులకు గీతాజ్యోతి సందేశాన్ని అందించారు. పిదప 150 గ్రామాల నుండి విచ్చేసిన ప్రముఖులు, కార్యకర్తలందరితో శ్రీస్వామివారు ధర్మక్షేత్ర సదస్సును ప్రారంభించి జ్యోతి ప్రజ్వలన గావించారు. కార్యకర్తలు 'గీతాజ్యోతి' ప్రచార విశేషాలను, అనుభవాలను శ్రీస్వామివారి సమక్షంలో వెల్లడిచేసారు. వారందరికిని శ్రీవారు 'జ్ఞాపిక'లను అందజేసి మరింత ఉత్సాహవంతంగా కార్యక్రమాలలో పాల్గొనాలని మంగళాశాసనములు అందజేసారు. ఈకార్యక్రమంలో భాగంగా నిర్వహించబడిన అనేక పోటీలలో పాల్గొన్న బాలబాలికలకు శ్రీస్వామివారు బహుమతులను, జ్ఞాపికలను అందజేసి వారందరికి మంగళా శాసనములు కృపచేసారు.

మధ్యాహ్నం ఆటోమోటివ్స్ అధినేత శ్రీమాన్ మోహన్ కామత్‌గారి ఆహ్వానంపై వారి కర్మాగారాన్ని శ్రీస్వామివారు దర్శించారు. ప్రతిరోజు సుమారు 15 బస్సులను తయారుచేసే ఈ సంస్థను, కార్మికవర్గాన్ని శ్రీవారు మంగళాశాసనములు చేసారు.

సాయంత్రం శ్రీమాన్ జి.యస్. నాయుడు, ఇతర పెద్దలందరిచేత నిర్వహించబడిన 'గీతాజ్యోతి' శోభాయాత్ర కార్యక్రమంలో శ్రీస్వామివారు పాల్గొన్నారు. ఈ శోభాయాత్రలో స్వీయు **ఆరాధన-సర్వ ఆదరణ, మాధవసేవగా-సర్వప్రాణిసేవ** అనే సూత్రాల వైశిష్ట్యాన్ని విని అనేక ముస్లిమ్ సోదరులు శోభాయాత్ర కార్యక్రమంలో ఉత్సాహంగా పాల్గొని శ్రీస్వామివారి మంగళాశాసనములు అందుకున్నారు. అనేక యువ అసోసియేషన్ సభ్యులు మంచినీళ్ళ ప్యాకెట్లను భక్తులందరికీ అందించడం వంటి సేవలు చేసారు.

పిదప వేలాది భక్తుల ద్వారా సామూహిక శ్రీకృష్ణ పూజలు జరిపించాక సుమారు ఆరువేలమంది భక్తులచే నేతిదీపాలతో 'గీతాజ్యోతి' ప్రతిజ్ఞా కార్యక్రమాన్ని శ్రీస్వామివారు నిర్వహించారు. అనంతరం శ్రీస్వామివారి దివ్యరథం కామారెడ్డికి పయనమయింది.

## కామారెడ్డి ధర్మక్షేత్రము :

శ్రీస్వామివారు గీతాజ్యోతి కార్యక్రమంలో భాగంగా కామారెడ్డి వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ డా॥ రాజ్ గోపాలరావు, శ్రీమాన్ M. ఆంజనేయులు, శ్రీమాన్ చాట్ల శ్రీ శైలంగార్ల ఆహ్వానంపై 20వ తేదీ మంగళవారం తెల్లవారు ఝామున పట్టణానికి వేంచేసారు.

శ్రీమాన్ విఠల్‌రెడ్డిగారిచే స్పాన్సర్ చేయబడిన 'భూపుత్రమ్మ' కళ్యాణ మండపము కామారెడ్డి ధర్మక్షేత్ర సమ్మేళనానికి వేదికగా ఏర్పాటు చేయ బడింది. శ్రీస్వామివారు 20వ తేదీ ఉదయం 'భూపుత్రమ్మ' కళ్యాణమండపము నకు వేంచేసిన సందర్భంగా భక్తజన సందోహం ఘనస్వాగతం పలికింది. అనంతరం శ్రీస్వామి వారి ఆజ్ఞ మేరకు వికాసతరంగిణి కార్యకర్త ప్రముఖులైన శ్రీమాన్ డా॥ రాజగోపాలరావుగారు ప్రభృతులు తమ తమ అభిప్రాయాలను, అనుభవాలను సభావేదిక ముందు ఉంచారు. ఈ సందర్భంగా ప్రముఖవక్తలు మాట్లాడుతూ గీతాజ్యోతి కార్యక్రమ విశేషాలను కొనియాడుతూ గీతాజ్యోతి జ్ఞానజ్యోతి కావాలని ఆకాంక్షించారు. శ్రీస్వామివారు ధర్మసంస్థాపన కోసం ప్రస్తుత పరిస్థితులలో అవతరించిన భగవత్ప్రతినిధులుగా అభివర్ణించారు.

అనంతరం శ్రీస్వామివారు తమ సందేశంలో గీతాజ్యోతి అంతరార్థాన్ని అందరికీ తెలియజేసారు. ఈ గీతాజ్యోతి మన తలరాతను మార్చగలిగే "దివ్యజ్యోతి" కాగలగాలని ఆకాంక్షించారు. పిదప జరిగిన హారతి, తీర్థగోష్ఠి కార్యక్రమాలలో వేలాదిమంది భక్తులు పాల్గొని శ్రీస్వామి వారి కృపకు పాత్రులు కాగలిగారు. సాయంత్రం 4 గం॥లకు కామారెడ్డి మాయాబజార్ రోడ్డులోని





పొట్టి శ్రీరాముల విగ్రహం నుండి శ్రీస్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో శోభాయాత్ర ప్రారంభమైంది. వేలాది భక్తజనసందోహాల మధ్య 'గీతాజ్యోతి రథం' ముందుకు సాగింది. కార్యకర్తలు, వాలంటీర్లు శ్రీస్వామివారి గీతాజ్యోతి మూల సూత్రాల కరపత్రాలను అందరికీ పంచిపెట్టారు. యువకులు బాణసంచాను కాలుస్తూ తమ ఉత్సాహాన్ని, ఆనందాన్ని ప్రదర్శించారు.

అనంతరం శ్రీస్వామివారి ఆధ్వర్యంలో సామూహిక శ్రీకృష్ణపూజలు నిర్వహించ బడ్డాయి. తదుపరి నేతి దీపాలను వెలిగించి గీతాజ్యోతి ప్రతిజ్ఞా కార్యక్రమాన్ని శ్రీస్వామివారు సుమారు ఐదువేలమంది భక్తులచే నిర్వహింపజేసారు. ఈ సందర్భంగా రాష్ట్ర సాంకేతిక విద్యాశాఖామాత్యులు శ్రీమాన్ నేరెళ్ళ ఆంజనేయులు, మాజీ M.L.A. సయ్యద్ యూసఫ్ అలీ ప్రభృతులు కార్యక్రమానికి హాజరై శ్రీస్వామివారి నుండి మంగళాశాసనములను పొందినారు.

శ్రీవారి అనుగ్రహభాషణంతో ముగిసిన కార్యక్రమానంతరం శ్రీస్వామివారు నిజామాబాద్ ధర్మక్షేత్రానికి పయనమయ్యారు.

## నిజామాబాద్ ధర్మక్షేత్రం:

శ్రీస్వామివారు వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ గంప శ్రీనివాస్‌గారు, కార్యదర్శి శ్రీమాన్ జి. లక్ష్మారెడ్డిగార్ల ఆహ్వానంపై 20వ తేదీ రాత్రి 10.30గం॥లకు నిజామాబాద్ వేంచేసారు. 21వ తేదీ ఉదయం తీర్థగోష్ఠి కార్యక్రమం తరువాత సుభాష్‌నగర్ శ్రీరామాలయాన్ని సందర్శించి శ్రీవారిని సేవించుకున్నారు. పిమ్మట ప్రదీప్ జె. భవానీగారి ఫ్యాక్టరీ అయిన శ్రీగజానన్ ఇండస్ట్రీస్‌ను సందర్శించి అక్కడి కార్మికులకు, భక్తులకు మంగళాశాసనములను కృపచేసారు. పిదప కలెక్టర్ గ్రౌండ్‌లో ఏర్పాటు చేయబడిన ధర్మక్షేత్ర సదస్సుకు శ్రీస్వామివారు వేంచేసారు. అధ్యక్షులు శ్రీమాన్ జి. శ్రీనివాస్‌గారు, వికాసతరంగిణి కార్యకర్తలు, వక్తలు 40వ ధర్మక్షేత్ర కార్యక్రమంపై తమ తమ అభిప్రాయాలను అనుభవాలను వెలిబుచ్చారు.

**అనంతరం శ్రీస్వామివారు మాట్లాడుతూ ఈ సమాజంలో ఎవరెవరు ఏయే రంగాల్లో ఉన్నారో, ఆయా రంగాల్లో వారి వారి వృత్తి ధర్మాలను అనుసరించాలన్నారు. ప్రకృతిని మనం కలుషితం చేస్తున్నామని, దానిని పరిరక్షించుకోవాల్సిన బాధ్యత మన అందరిపైన ఉందని శ్రీస్వామివారు ఉద్బోధించారు. ఆవుకు కోపం వస్తే పాలు ఎట్లాగైతే ఇవ్వడం మానివేస్తుందో అదే విధంగా ప్రకృతిలోని జీవరాసులతోను, వనరులతోను సామరస్యం పాటించనపుడు ప్రకృతి మనకు అనుకూలించదు. ప్రకృతియైన భూమాతతో సమతౌల్యాన్ని పాటించే మహాపురుషులలో పృథుచక్రవర్తి గొప్పవాడని తెలియజేస్తూ శ్రీమద్భాగవతంలో పృథుచక్రవర్తి కథనాన్ని శ్రీస్వామివారు వివరించారు. నేటి సమాజంలో ప్రతి ఒక్కరూ పృథు చక్రవర్తిలాంటి వారు కావాలని ఆశాసించారు.**

సాయంత్రం 4గం॥లకు కలెక్టర్ గ్రౌండ్ నుండి ప్రారంభమైన 'గీతాజ్యోతి' శోభాయాత్ర కార్యక్రమంలో వికాసతరంగిణి కార్యకర్తలు అందించే గీతాజ్యోతి మూలసూత్రాల కరపత్రాలను అనేకమంది ముస్లిమ్ సోదరులు తీసుకొని, శ్రీస్వామివారి గీతాజ్యోతి సందేశాన్ని విని సుముఖతను వ్యక్తం చేసారు. గీతాజ్యోతి ధర్మక్షేత్రాన్ని పురస్కరించుకొని నిజామాబాద్ పట్టణంలో అన్ని వీధులలోను అతి మనోహరంగా నిర్మించిన 108 గీతాజ్యోతి ద్వారాలు శోభాయాత్రకు మరింత వెలుగునిచ్చాయని చెప్పవచ్చు.

అనంతరం శ్రీస్వామివారు వేలాది భక్తులతో సామూహిక శ్రీకృష్ణపూజలు జరిపించి, సుమారు

8వేలమంది భక్తులచే నేతిదీపాలు వెలిగించి నిర్వహించిన గీతాజ్యోతి ప్రతిజ్ఞా కార్యక్రమంలో జాయింట్ కలెక్టర్ శ్రీవెంకట రామారెడ్డిగారుIAS మున్సిపల్ ఛైర్‌పర్సన్ శ్రీమతి పి. భారతిరాణిగారు, SBH లీడ్‌బ్యాంక్ చీఫ్ మేనేజర్ S. ఫణిరాజమూర్తి ప్రభృతులు కూడా పాల్గొన్నారు. అనంతరం మనోహర్‌బాదు కార్యక్రమానికై శ్రీవారు ప్రయాణమయ్యారు.

### గీతాజ్యోతి మనోహరబాదు ఆశ్రమ వార్షికోత్సవం-నివేదిక

నిజామాబాద్ జిల్లా 'జక్రాన్ పల్లి' మండలం 'మనోహరబాద్' గ్రామంలో శ్రీశబరిమాత ఆశ్రమములో నిర్వహింపబడు చున్న శ్రీలక్ష్మీ సహిత మహావిష్ణుయాగము 6వ వార్షికోత్సవము సందర్భంగా ఆశ్రమ ధర్మాధికారి శ్రీమాన్ శివానందభారతిస్వామీజీ ఆహ్వానంపై శ్రీస్వామివారు 21వ తేదీ రాత్రి 'మనోహరబాద్' వేంచేసారు. 22వ తేదీ గురువారం ఉదయం చుట్టుప్రక్కల 60గ్రామాలనుండి విచ్చేసిన వేలమంది భక్తులు శ్రీస్వామివారి తీర్థగోష్ఠి కార్యక్రమంలో పాల్గొన్నారు.

అనంతరం శ్రీస్వామివారితో కలసి ఆశ్రమ సాధుబృందం, భక్తజనులు గోష్ఠిని ఏర్పాటు చేసారు. శ్రీవారి ఆజ్ఞపై ఆశ్రమ ధర్మాధికారి శివానందభారతి స్వామిజీ ''ప్రజలంతా సుఖశాంతులతో ఉండాలని, వర్షాలు కురవాలని, విశ్వశాంతియే ధ్యేయంగా'' ఈ యజ్ఞాన్ని 12 సం॥ల పాటు నిర్వహిస్తున్నట్లుగ వెల్లడించారు. ఇప్పటికి 6 సంవత్సరములు పూర్తయినట్లు తెలియజేసారు.

పిదప శ్రీస్వామివారు అభిభాషిస్తూ యజ్ఞమంటే ఏమిటో, దాని ఉద్దేశ్యమేమిటో వివరించారు. శరీరం మనం చెప్పినమాట విన్నపుడు దానితో చేసే కర్మయే యజ్ఞమవుతుందన్నారు. శరీరంలో ఆత్మ, పరమాత్మలుంటాయని తద్వారా మనం నిర్వర్తించే విధులన్నీ శరీరమనే ఉత్తమ పరికరంలో జరగాలని చెప్పారు. శరీరం భగవంతుడు ప్రసాదించినదని, అందుకు భగవంతుని సేవలోనే దానిని వినియోగించాలని శ్రీస్వామివారు అన్నారు. మనసు, బుద్ధి బాగోలేనపుడు చేసిన పనులన్నీ మంచి ఫలితాలు ఇవ్వవని, దోషాలు వస్తాయని చెప్పారు. అయితే మనం వినియోగించే పదార్థాలు భగవదర్పితం చేసి ఉపయోగించినట్లయితే అది యజ్ఞమవు తుందన్నారు. ఆ పదార్థాలే ప్రసాదమవుతాయన్నారు. అట్టి ప్రసాదాన్ని స్వీకరించినపుడే మనసు కల్మషరహితం అవుతుందన్నారు. మనం దేవుని అట్టి మనసుతో సేవించుకోవాలన్నారు. ఈ విధంగా మనం భగవత్కృపతో 'యజ్ఞం'లాంటి కర్మలు ఆచరించినట్లయితే ప్రకృతిలోని సూర్యునికి శక్తిని చేకూర్చినవారమవుతామన్నారు. తద్వారా సముద్రాలలోని నీరు ఆవిరై, వర్షించే మేఘాలుగా మారి నెలకు 3 వానలు కురిస్తే ఈ భూమంతా సస్యశ్యామలంగా, సుభిక్షంగా సుఖసంతోషాలతో తలతూగు తుందని శ్రీవారు అనుగ్రహభాషణం చేసారు. అప్పుడే నిజమైన విశ్వశాంతి ఏర్పడగలదని సెలవిచ్చారు.

22వ తేదీ మధ్యాహ్నం 12.00గం॥లకు నిజామాబాద్‌జిల్లా ఆర్మూర్ మండలంలోని 'అర్గుల్' గ్రామానికి శ్రీస్వామివారు వేంచేసారు. అక్కడి శ్రీవేంకటేశ్వరస్వామి దేవాలయ ఛైర్మన్ శ్రీమాన్ జి. జగన్నాథరెడ్డిగారి ఆహ్వానంపై శ్రీస్వామివారు దేవాలయ అభివృద్ధికై కొన్ని సూచనలను చేసారు.

### అర్గుల్ గ్రామదేవాలయంలో....

పూర్వం మన పెద్దలు ఆలయాలను సంప్రదాయ బద్ధంగ, ప్రామాణికంగాను నిర్మించడమే కాక, ఆరాధనాది పద్ధతులను గూడ ఏ లోపం లేకుండా నడిపేవారు. అందువల్ల గ్రామ





ప్రజలందరూ ఆలయాలను సమావేశకేంద్రాలుగ మాత్రమే కాకుండా, వ్యక్తిగత లోపాలను సవరించుకోవడం సంస్కరించుకోవడం వంటివి జరిగే స్థానాలుగ కూడ అభిమానించేవారు. ఆలయవ్యవస్థ ప్రభుత్వాల చేతిలోపడి చెడిన వెంటనే గ్రామాలన్నీ ఉగ్రవాద, తీవ్రవాదములకు స్థానాలై అశాంతిమయమములైనాయి. శిష్యులు అక్కడినుండి దూరప్రాంతాలకు వలసలు పోయారు. సమాజశాంతికైనా మనము మన ఆలయాలలో ప్రాచీన సత్సంప్రదాయాలను సవ్యంగ సంస్కరించుకోవాలి. పెద్దల ఆదేశానుసారం ప్రామాణికంగ తీర్చిదిద్దుకోగలిగితేనే తిరిగి గ్రామప్రజలలో ఐక్యత, శాంతి, సౌఖ్యాలూ విలసిల్లుతాయని శ్రీవారు సెలవిచ్చారు.

### అమృతోత్సవంలో.....

రాత్రికి తిరుమల చారిటబుల్‌ట్రస్టు, సమైక్యభారతి వారి ఉమ్మడి ఆధ్వర్యవంలో ఎండోమెంట్స్ కమీషనర్ శ్రీమాన్ కె.వి. రమణాచార్యగారి ఆహ్వానంపై శ్రీస్వామివారు హైదరాబాద్‌లోని 'రవీంద్రభారతి'కి వేంచేసారు. శ్రీవారి సన్నిధిలో కమీషనర్‌గారి పితృపాదులైన శ్రీమాన్‌కె.వి. రాఘవాచార్యులవారి 75వ జన్మదినం సందర్భంగా అమృతోత్సవ కార్యక్రమం జరిగింది. శ్రీవేదాంతదేశికుల పాదుకా సహస్రమనే గ్రంథాన్ని శ్రీమాన్ కె.వి. రాఘవాచార్యులవారు తెనిగించిన 5వ సంపుటిని శ్రీస్వామివారు ఆవిష్కరించారు.

శ్రీస్వామివారు శ్రీమాన్‌కె.వి. రాఘవాచార్యుల వారికి బంగారు కంకణాన్ని తొడిగి మంగళాశాసనం చేసారు. శ్రీస్వామివారు అనుగ్రహభాషణం చేస్తూ శ్రీమాన్ కె.వి. రాఘవాచార్యులవారు వేదాంతదేశికుల పరంపరలోని పండితోత్తములుగ అభివర్ణించారు. శ్రీమాన్ రాఘవాచార్యుల వారి పుత్రులైన శ్రీమాన్ రమణాచార్య తండ్రికి మించిన తనయునిగ కొనియాడారు. గురువు, తండ్రివంటి పెద్దలు చెప్పిన దానిని ఆచరించేదానికన్న, వారి మనసులోనున్న దానిని ముందుగానే పసిగట్టి వారికి అనుకూలంగా అనుసరించేవారు జ్ఞానులలో ఉత్తములని ఉద్ఘాటించారు. అట్టి కోవకు చెందిన వారే శ్రీమాన్ కె.వి. రమణాచార్య అని ప్రశంసిస్తూ 'ఎండోమెంట్స్' కమీషనర్‌గా ప్రస్తుత పదవిలో తమ విధులను భగవత్ భాగవత కైంకర్యానికి ప్రాధాన్యాన్నిస్తూ చిత్తశుద్ధితో కొనసాగించాలని సూచించారు.

'మేడివండు'వంటి ఎండోమెంట్స్ డిపార్ట్‌మెంటును, ఆలయవ్యవస్థను ఎంతో నేర్పరితనంతో సంస్కరించవలసి ఉందన్నారు. తండ్రిగారి ఆశీస్సులతో కమీషనర్‌గారా బాధ్యతను నెరవేర్చగలరనే ఆకాంక్షను తెలియజేసారు. చివరిగ కమీషనర్‌గారు మాట్లాడుతూ మేడివండు వంటి ఎండోమెంట్స్‌ను మేలిమిపండుగ మార్చే ప్రయత్నం చిత్తశుద్ధితో చేస్తానని అందుకు అందరి ఆశీస్సులూ కావాలని ప్రార్థించారు. ఆ రాత్రి శ్రీవారు ఆదిలాబాద్‌జిల్లాలోని 'పొన్కల్' గ్రామానికి బయలుదేరారు.

### 23.1.04 పొన్కల్, వెలమల, పోచంపాడు:

'మామడ' మండలంలోని పొన్కల్ గ్రామానికి శ్రీస్వామివారు 23వ తేదీ శుక్రవారం తెల్లవారు ఝామున 3.30గం॥లకు వేంచేసారు. శ్రీమాన్ సిహెచ్. హరీష్‌కుమార్, శ్రీవేంకటేశ్వర స్వామి దేవాలయ ట్రస్ట్ బోర్డు ఛైర్మన్ శ్రీమాన్ కె. లింగారెడ్డి ప్రభృతులు ఆహ్వానించగా శ్రీస్వామివారు 23వ తేదీ తెల్లవారుఝామున 4.45గం॥లకు ధనుర్లగ్నంలో పెరుమాళ్ళ ఆదేశానుశానరం 'పొన్కల్' గ్రామంలోని శ్రీవేంకటేశ్వర ఆలయ శిఖరాన్ని కదిలించి వెనువెంటనే ఆప్రక్కన ఆలయ పునర్నిర్మాణానికి శంకుస్థాపన చేసారు. పునర్నిర్మాణానికి

పార్లమెంటు సభ్యులు శ్రీమాన్ ఎన్. వేణుగోపాలాచారిగారు కొంతనిధిని సమకూరుస్తున్నట్లు, ఈ ఏర్పాట్లు చేసి శ్రీవారిని తీసుకువచ్చిన తరువాత శ్రీమతి రమాదేవి, శ్రీమాన్ ప్రభాకర్‌రావులు తెలిజేసారు.

ఉదయం తీర్థగోష్ఠి అనంతరం శ్రీస్వామివారు **వికాసతరంగిణి కార్యకర్తలు, వేలాది భక్తజనుల గోష్ఠిలో మాట్లాడుతూ గ్రామం పేరైన 'పొన్కల్'కు 'బంగారుశిల' అనే అర్థాన్ని చెవుతూ మంగళాశాసనం చేసారు. భగవత్ కైంకర్యము వలననే అన్ని సంపదలూ మనకొస్తాయని, దైవం సమాజానికి ప్రాణం కావాలని, దైవభక్తికలిగి ఉంటే సమాజం బాగుంటుందని శ్రీస్వామివారు అనుగ్రహభాషణం చేసారు.** సుమారు 39 లక్షల వ్యయంతో జరిగే ఆలయ పునర్నిర్మాణాన్ని లోపం లేకుండా చేయాలని శ్రీస్వామివారు సూచించారు.

అనంతరం శ్రీమాన్ వేణుగోపాలాచారి సహాయ సహకారాలతో 'వెలమల' గ్రామంలో చేపట్టబడిన రక్షిత మంచినీటి పథకానికి ప్రారంభోత్సవం, శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయ శంకుస్థాపనలు శ్రీస్వామివారిచే జరుపబడ్డాయి.

పిదప పోచంపాడు (శ్రీరామ్‌సాగర్'లోని పెద్దజీయరుస్వామివారిచే 33 ఏళ్ళక్రిందట ప్రతిష్ఠాపన చేయబడిన శ్రీకోదండరామచంద్ర స్వామి ఆలయానికి సంబంధించిన కళ్యాణ మండపాన్ని శ్రీస్వామివారు ప్రారంభించారు. 9 లక్షల వ్యయంతో 12X80 అడుగుల విస్తీర్ణం గల కళ్యాణమండపంలో శాంతి కళ్యాణ మహోత్సవం జరుగుచుండగా శ్రీస్వామివారు అచ్చటకు వేంచేసి భక్తులందరిని ఉద్దేశించి అనుగ్రహభాషణం గావించారు. కళ్యాణమండపంతో పాటు ఒక పాఠశాల, భోజనశాల ఉంటే బాగుంటుందని, అట్టివి భవిష్యత్తులో ఏర్పడాలని మంగళాశాసనం చేసారు. ఆలయ ప్రధాన అర్చకులు శ్రీమాన్ రామప్రభుగారి ఆధ్వర్యంలో కార్యక్రమాలు చక్కగా జరుగుతున్నందుకు శ్రీస్వామివారు సంతృప్తి చెందుతూ మంగళాశాసనం చేసారు. **ఆలయమనేది మన సమస్యలనుండి విడుదల లేదా మోక్షాన్నిచ్చేదని ఊరందరినీ కలిపి ఉంచేది ఆలయమేనని, అట్లాంటి ఆలయాలుండేచోట్ల** మనం నివసించాలని శ్రీస్వామివారు సెలవిచ్చారు. ఆలయకమిటీ అధ్యక్షులు శ్రీమాన్ ఇ. నర్సాగౌడు ప్రభృతుల ఆధ్వర్యంలో కళ్యాణమండపదాతలకు కార్యకర్తలకు శ్రీస్వామివారు జ్ఞాపికలను బహూకరించారు. అనంతరం శ్రీస్వామివారు 41వ ధర్మక్షేత్ర సమ్మేళనంలోని భాగంగా 'నిర్మల' పట్టణానికి బయలుదేరారు.

23వ తేదీ రాత్రి 'నిర్మల' పట్టణాన్ని చేరుకున్న శ్రీస్వామివారిని స్థానిక వికాసతరంగిణి అధ్యక్షులు జనార్దన రెడ్డిగారు, శ్రీమాన్ డా॥ హనుమంతరెడ్డిగారు, కార్యకర్తలతో ఘనస్వాగతం పలికారు. మరునాడు అనగా 24వ తేదీ ఉదయం శ్రీవారి ప్రత్యక్షపర్యవేక్షణలో ప్రభుత్వ జూనియర్ కళాశాలగ్రౌండ్‌లో తీర్థగోష్ఠితో 41వ ధర్మక్షేత్ర ధార్మికసదస్సు కార్యక్రమము ప్రారంభమయింది.

'గీతాజ్యోతి'పై ఆయాగ్రామాలలో ప్రజల స్పందనను గూర్చి, వారు నిర్వహించిన కార్యక్రమాలను గూర్చి శ్రీమతి అలివేలుగారు, శ్రీమాన్ జనార్ధనరెడ్డిగారు, గిరిజనవాడలోని మహిళా కార్యకర్తలు తమ తమ అభిప్రాయాలను, అనుభవాలను వెల్లడించారు.

అనంతరం శ్రీస్వామివారు మాట్లాడుతూ 'గీతాజ్యోతి' మూలసూత్రాలను గూర్చి వివరిస్తూ అనుగ్రహభాషణం చేసారు. **ఈ భూమిప్రాణులన్నిటికి తల్లివంటిదని, అన్నం, నీరు, బట్ట మొదలైన వనరులను సమకూర్చే భూమాతను మనం పూజించాలని, కృతజ్ఞతలు తెలపాలని శ్రీస్వామివారు సెలవిచ్చారు. శ్రీమద్భాగవతం లోని పృథు చక్రవర్తి కథనాన్ని వివరిస్తూ ఈభూమిపై ధర్మం, నీతి, నియమంలేని సమయంలో, వానలులేక, పంటలు పండక దుర్భిక్ష పరిస్థితి నెలకొన్న తరుణంలో పెద్దలైన మహర్షుల అనుగ్రహంతో ఈవృథ్వీపై జన్మించిన వాడే'పృథు'చక్రవర్తని వక్కాణించారు. పెద్దలు అతనికి అన్నిమంచి సంస్కారాలు నేర్పడం వలన ప్రాణులన్నిటిని కాపాడి సుఖపెట్టమని భూమిని ప్రార్థించారు. భూమిపై ఆహారం ఉంది. సకల సంపదలూ ఉన్నాయి. సవ్యంగా ప్రయత్నిస్తేనే అవి మనకు లభ్యమవుతాయని గ్రహించిన పృథుచక్రవర్తి భూమిని ఆవుగాచేసి, మనువును దూడగాచేసి, మనిషికి అతిప్రధాన పరికరమైన మనస్సును పాత్రగాచేసి ఫలితంగా 'పాలు'అనే సకల ఐశ్వర్యాన్ని జనింపచేసిన మహనీయుడని శ్రీస్వామివారు తెలియజెప్పారు.**

అప్పుడప్పుడు ఆవుకు కోపం వస్తే పాలు ఇవ్వదు. ఎగచేపేస్తుంది. అట్లాగే భూమికూడా కష్టం కలిగితే ఆహారపదార్థలను ఇవ్వదు. అంతమాత్రన అవి ఉండవని కాదు. మానవజాతికి సరిపడే అన్ని పదార్థాలు భూమినుండే లభిస్తాయి. భూమిపై సముద్రాలు, నదులు, మనం అనేక ప్రాణులు ఉంటున్నాము. మనందరినీ బ్రతికించే ఈభూమిని 'పృథ్వి' అని అంటారు. 'పృథు'చక్రవర్తి తన సామర్థ్యం చేత భూమిని క్రమబద్ధం చేసి ఒక చక్కటి వ్యవస్థను ఏర్పాటు చేసాడు. సక్రమ వ్యవస్థలోనున్న భూమి అన్నింటినీ సమకూర్చడం ప్రారంభించింది. అదేవిధంగా మనం కూడా ప్రకృతితో సామరస్యాన్ని సానుకూలతను ప్రదర్శిస్తే భూమిపైనున్న మనమంతా సుఖసంతోషాలతో జీవించగలమని 'పృథుచక్రవర్తి' కథనం ద్వారా మనందరికీ శ్రీస్వామివారు ఉద్బోధించారు.

సాయంత్రం 4గం॥లకు ప్రభుత్వ జూనియర్ కళాశాల గ్రౌండ్‌నుండి ప్రారంభమైన గీతాజ్యోతి శోభాయాత్రలో సరస్వతి శిశువిద్యామందిర్ బాలబాలికలు, అనేక స్కూళ్ళ ఎన్.సి.సి మరియు స్కౌట్ బృందాలు ఎంతో ఉత్సాహంతో పాల్గొన్నారు. వేలాది భక్తజన సందోహాలమధ్య, కోలాటములు, మేళతాళముల మధ్య శ్రీవారి గీతాజ్యోతి శోభాయాత్ర అత్యంత శోభాయమానంగా దిగ్విజయంగా నిర్వహించబడింది. అనేకమంది ముస్లిమ్ ఈ శోభాయాత్రలో పాల్గొనడం ఒకవిశేషం గాను, ఒకనూతన ఆధ్యాత్మిక జగత్తుకు నాందిగాను అభివర్ణించవచ్చు.

అనంతరం శ్రీస్వామివారిచే నిర్వహించబడిన శ్రీకృష్ణపూజలు, గీతాజ్యోతిప్రతిజ్ఞ కార్యక్రమాలలో సుమారు 6వేలమంది భక్తులు శ్రద్ధతో పాల్గొనడం జరిగింది. నేతిదీపాలు వెలిగించి 'గీతాజ్యోతి ప్రతిజ్ఞ'ను శ్రీవారితో సహా సల్పిన భక్తులలో నిర్మల్ మున్సిపల్ చైర్‌పర్సన్ శ్రీమాన్ ఈశ్వర్‌గారు డి.ఎస్.పి. శ్రీమాన్ విద్యాసాగర్ రావుగారు మున్నగు ప్రభృతులు పాల్గొన్నారు.

25వ తేదీ ఉదయం తీర్థగోష్ఠి అనంతరం సుమారు 500 మంది భక్తజనులు శ్రీవారి నుండి సమాశ్రయణములు పొంది, వారి దివ్య కృపకు పాత్రులైనారు. పిదప సరస్వతీ శిశు విద్యామందిర్‌కు వేంచేసిన శ్రీస్వామివారు అచ్చటి బాలబాలికలు, ఉపాధ్యాయుల నుద్దేశించి అనుగ్రహభాషణ చేసి మంగళాశాసనములను కృపచేసారు. అనంతరం శ్రీస్వామివారు 'అల్లంపల్లి'గ్రామానికి ప్రయాణ మయ్యారు.

**'అల్లంపల్లి' గ్రామంలో జీయర్‌గురుకుల పాఠశాల' ప్రారంభోత్సవం:**

25వ తేదీన శ్రీస్వామివారు ఆదిలాబాద్‌జిల్లా 'కడెం' మండలంలోని 'అల్లంపల్లి' గ్రామం వేంచేస్తూండగా సుమారు 2కి.మీ.ల దూరం

నుండే గిరిజన నాయక్ పోడ్ భక్తజనబృందం వారు భజనలు చేస్తూ, కీర్తనలు పాడుతూ శ్రీస్వామివారికి స్వాగతం పలికారు. శ్రీస్వామివారు గురుకులంలో పూర్ణకుంభస్వాగతంతో అడుగిడుతూ 25వ తేదీ రాత్రి 8.00గం॥లకు 'రిబ్బన్ కటింగ్' చేసి శుభారంభం చేసారు. ఈ సందర్భంలో శ్రీవారి ఆగమనం కుండపోతవర్షం మధ్య జరిగింది, శ్రీవారు ఈ వాన భగవంతుడు కురిపించిన కృపాజల్లని, పెద్దలు వస్తున్నారు కాబట్టి ఈ స్థలమంతా శుద్ధిచేయాలని వరుణదేవుడు వర్షం కురిపించాడని శ్రీస్వామివారు అనుగ్రహభాషణం చేసారు. గురుకుల నిర్మాణానికి విశేషకృషి చేసిన శ్రీమాన్ రమణాచారి, రవీంద్రసేర్ సర్పంచ్ భల్లూసింగ్ ప్రభృతులకు శ్రీస్వామివారు మంగళాశాసనం చేసారు.

26వ తేదీ తీర్థగోష్ఠి అనంతరం శ్రీస్వామివారు జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్టువారి ఆధ్వర్యవంలో గురుకుల పాఠశాల భవనానికి ప్రారంభోత్సవం చేసారు. శ్రీస్వామివారు పవిత్రజలాన్ని తరగతి గదులలో చల్లి నల్లబల్లపై 'జైశ్రీమన్నారాయణ' అని వ్రాసి శుభారంభం చేసారు. అదేవిధంగా విద్యార్థుల వసతి గృహాన్ని, భోజనశాల తదితర భవన సముదాయములన్నిటిని తమ కరకమలములచే ప్రారంభోత్సవం చేసారు. రిపబ్లిక్‌డే సందర్భంగ శ్రీస్వామివారిచే జాతీయ పతాక ఆవిష్కరణ కూడా స్కూలు ఆవరణలో జరిగింది. అనంతరం శ్రీస్వామివారిచే జ్యోతిప్రజ్వలనతో సభావేదికపై కార్యక్రమం మొదలయింది. సభకు ఆహ్వానించబడిన ప్రభృతులలో జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ అధ్యక్షులు శ్రీమాన్ రామేశ్వరరావుగారు, శ్రీమాన్ పురుషోత్తమ రావుగారు, శ్రీమాన్ రామచంద్రారెడ్డిగారు, జెట్ సొసైటీ సభ్యులైన శ్రీమాన్ విజయ్‌కుమార్‌గారు, శ్రీమాన్ కల్కి అవతారంగారు, శ్రీమాన్ రవీందర్ సేర్, గ్రామసర్పంచ్ శ్రీమాన్ భల్లూసింగ్ మొదలగు వారు ఉన్నారు. చీఫ్ ఇంజనీరు శ్రీమాన్ ప్రభాకర్‌గారు ప్రభృతులు సభకు హాజరైన వారిలో ఉన్నారు. శ్రీమాన్ రమణాచారిగారు పాఠశాల ప్రారంభం కావటంలో చేపట్టిన కార్యక్రమ వివరాలను గూర్చి నివేదిక సమర్పించారు. అనంతరం ఉపాధ్యాయులను పరిచయం చేయడం జరిగింది. అందులో ఎ. రాజుగారు ప్రసంగిస్తూ శ్రీస్వామివారిచ్చిన 1 1/2 సం॥ల శిక్షణ తమలో గుణాలనే సువాసనలు నింపి తావిగల పుష్పాలుగా తయారు చేసిందని కృతజ్ఞతా పూర్వమైన కవితను చదివి వినిపించారు. సభకు విచ్చేసిన పెద్దలంతా తమ తమ అభిప్రాయాలను తెలియజేస్తూ పాఠశాల అభివృద్ధికి తగిన సూచనలను చేసారు.

అనంతరం శ్రీస్వామివారు మాట్లాడుతూ ఈ గురుకుల పాఠశాల ప్రారంభమైన రోజు రిపబ్లిక్‌డేగాను, మాఘమాసపు శుక్లపంచమి-సోమవారంగాను, పెద్దజీయరు స్వామివారి తిరునక్షత్రంగాను ఎన్నో విశిష్టతలను, శుభాలను సంతరించుకున్న రోజని తెలిపారు. "జ్ఞానానందమయం దేవం......" అన్న శ్లోకాన్ని విద్యార్థులచే పఠింపచేసి విద్యతోపాటు కంప్యూటర్ విజ్ఞానం కూడా మనకు కావాలని శ్రీస్వామివారు అన్నారు. మాతృభూమిలోనే మన విద్య, విజ్ఞానాలు ఉపయోగపడేటట్లుగా మన విద్యావిధానం కొనసాగాలని శ్రీస్వామివారు వక్కాణించారు. ఈ సందర్భంలో శ్రీస్వామివారు "ఆజ్ జంగిల్ మే మంగల్ బన్‌గయా" అంటూ అందరికీ మంగళాశాసనం చేసారు. ఈ పాఠశాల నిర్మాణానికి కాలిఫోర్నియాలో జెట్-యు.ఎస్.ఎ. సభ్యులు 40 లక్షల రూపాయలు పంపించారని సభాముఖంగా తెలియజేస్తూ వారికి అనేక మంగళాశాసనములను కృపచేసారు. అదిలాబాద్ పార్లమెంటు సభ్యులు శ్రీమాన్ ఎస్.వేణు గోపాలాచారిగారు 10 లక్షల రూ॥లు పంపిస్తామని వాగ్దానం చేసి ఇప్పటికి 7 లక్షల రూపాయిల





చెక్‌ను శ్రీమాన్ రామేశ్వరరెడ్డిగారి ద్వారా పంపగా శ్రీస్వామివారు వారికి మంగళాశాసనం చేసారు. నేటినుండి రానున్న జూన్ మాసం వరకు సుమారు 5 నెలలపాటు పాఠశాలలో విద్యాబోధన ప్రయోగాత్మకంగా జరుగుతుందని శ్రీస్వామివారు సెలవిచ్చారు. ఆ తరువాత మొదటి విద్యా సంవత్సరంతో ప్రారంభమై పాఠశాల నడుస్తుందని శ్రీస్వామివారు చెప్పారు. కంప్యూటర్ విద్యకూడ ప్రవేశపెడుతున్నట్లు శ్రీస్వామివారు తెలియజేసారు. దీనికి సంబంధించిన కంప్యూటర్లు మరియు ఇతర బోధనా పరికరాలను అమెరికానుండి జెట్-యు.ఎస్.ఎ. తరఫున తీసుకొని వచ్చిన శ్రీమాన్ వంశి ముడుంబైగారిని శ్రీస్వామి వారు అభినందిస్తూ మంగళాశాసనములను అందజేసారు.

అనంతరం గిరిజన బాలబాలికలు, యువతీ యువకులు నిర్వహించిన నృత్యాలు, సాంస్కృతిక కార్యక్రమాలను శ్రీస్వామివారు దర్శించి వారందరికీ మంగళాశాసనములు చేసారు. సాయంత్రం 5.00గం॥లకు అల్లంపల్లి నుండి 'అదిలాబాద్'కు ప్రయాణమయ్యారు.

## ధనుర్మాస మహోత్సవాలు

**మంచిర్యాల :** జన్మభూమి నగర్ వికాసతరంగిణికి చెందిన శ్రీమతి ఉమాదేవిగారి నేతృత్వంలో తత్త్వశాస్త్రం 2వ బ్యాచ్ విద్యార్థి శ్రీమాన్ కుమార్‌రాజాగారు ధనుర్మాస మహోత్సవాన్ని విశేష కార్యక్రమాలతోపాటు వైభవంగా నిర్వహించారు. ప్రతిరోజూ ఉదయం సేవాలకానంతరం ఈశావాస్య ఉపనిషత్ ప్రవచనము, సాయంత్రం తిరుప్పావై ప్రవచనములు జరిగినవి. చుట్టుప్రక్కల చెన్నూర్, చందారం, కాగజ్‌నగర్ వంటి ప్రాంతాలలో కూడా వి.టి ఆశయాలను, ధనుర్మాస ప్రాభవాన్ని గురించి శ్రీమాన్ కుమార్‌రాజాగారు ప్రచారం కావించారు.

మంచిర్యాలలోనే మరొక వికాసతరంగిణి ఆధ్వర్యంలో శ్రీమాన్ భాస్కర ఫణికుమార్‌గారు ధనుర్మాస కార్యక్రమాలను వైభవంగా నిర్వహించారు.

**మదనపల్లిలో :** శ్రీస్వామివారి దివ్య మంగళాశాసనములతో తత్త్వప్రచారకులు శ్రీమాన్ శాంతారామ్‌గారు చిత్తూరు జిల్లాలోని మదనపల్లి పట్టణంలో అత్యంత వైభవంగా ధనుర్మాస మహోత్సవాన్ని నిర్వహించారు. శ్రీసాయినాథమందిర ప్రాంగణంలోని కళ్యాణ మంటపంలో ఉదయం శ్రీవిష్ణు సహస్ర నామవైభవం, సాయంకాలం తిరుప్పావై వైభవాన్ని ప్రవచించారు. రోజూ సాయంకాలం సొసైటీ కాలనీ రామాలయంలో కూడా తిరుప్పావై ప్రవచనాలను నిర్వహించారు. పరిసర ప్రాంతాలైన కలికిరి, గుర్రంకొండ, కురబలకోటకు కూడా వెళ్ళి తిరుప్పావై వ్రత వైభవాన్ని సంక్షిప్త మనోహరంగా వివరించడం చేశారు. ఈ ప్రాంతాల్లో గోదారంగనాథ కళ్యాణ మహోత్సవాలు వైభవంగా నిర్వహించారు.

**గన్నవరం :** శ్రీమతి హైమవతి (తత్త్వశాస్త్ర ప్రచారిక)గారు గన్నవరం వి.టి. ఆధ్వర్యవంలో దావాజీగూడెం శ్రీ కోదండరామాలయ ఆలయంలో ధనుర్మాస మహోత్సవాన్ని విశేష కార్యక్రమాలతో విశేషంగా ఆచరింపచేసారు. ఈ కార్యక్రమంలో గన్నవరం, దావాజీగూడెం, అల్లాపురం గ్రామాల భక్తులు అంతా పాల్గొన్నారు. ప్రతిరోజూ ఉదయం 5.30 గం.లకి నగర సంకీర్తన, సేవాకాలానంతరం, ఆళ్వారుల దివ్యచరిత్ర సాయంత్రం ఆండాళ్ శ్రీతిరుప్పావై వైభవము భక్తులకు శ్రీమతి హైమవతిగారు అందించారు. ఈ దావాజీగూడెం శ్రీకోదండ రామాలయం శ్రీస్వామివారి మంగళా శాసనములతో పునరుద్ధరింప బడుతున్నది. క్రొత్తరూపు సంతరించుకోనున్నది.

**కామారెడ్డి:** నిజామాబాద్ జిల్లాలో పాతకామారెడ్డిలో ఉన్న అత్యంత పురాతనమైన శ్రీకృష్ణదేవాలయంలో తత్త్వప్రచారకురాలు కుమారి సూర్యకుమారి గారు ధనుర్మాస కార్యక్రమం నిర్వహించారు. ఆలయంలో నిత్యం సేవాకాలం, ప్రవచనాలతోపాటు మధ్యాహ్నం ఊరిలోని ఒక్కొక్క ప్రాంతంలో గోష్ఠి జరిపిఆ ప్రాంతం వారందరికీ ఆండాళ్ తల్లి, ధనుర్మాసవైభవాన్ని గురించి వివరించారు.

**NTPC :** తత్త్వప్రచారకులు శ్రీమాన్ గంగాధర్‌గారు గోదావరి ఖని NTPC(లో ధనుర్మాసం నిర్వహించారు. ప్రతిరోజూ ఒక్కొక్క ప్రాంతంలో మధ్యాహ్నం పూట కూడా ధనుర్మాస గోష్ఠిలో నిర్వహించడం జరిగింది.

**జూలపల్లి:** ఈ గ్రామస్తులు కుమారి కల్పన (తత్త్వప్రచారిక)గారిని 2వసారి తమగ్రామానికి ఆహ్వానించుకొని ధనుర్మాసోత్సవం నిర్వహించుకున్నారు. విద్యార్థులలో ఆసక్తి కలిగించటానికై "తిరుప్పావై" క్విజ్ కార్యక్రమాలని కూడా కుమారి కల్పనగారు నిర్వహించారు.

**వారిజ:** నూతనంగా విశాఖ సముద్ర తీరాన నిర్మించబడిన "వారిజ" ఆశ్రమంలో కూడా ఈ సంవత్సరం ధనుర్మాసం శాస్త్రోక్తంగా శ్రద్ధతో వేదాధ్యాపకులు శ్రీమాన్ శ్రీకాంతాచార్య, శ్రీమాన్ యాదగిరి ఆచార్యులు నిర్వహించారు. సాయంత్రం తిరుప్పావై ప్రవచనాలని కూడా మొదటిసారిగా మన వేదాధ్యాపకులు అందించడం విశేషం. విశాఖ, విజయనగర భక్తులు ఆసక్తితో ఈ కార్యక్రమంలో భాగస్వాములైనారు.

**తెనాలిలో:** వికాసతరంగిణివారు శ్రీమాన్ జి. బదరీస్వామివారి ఆధ్వర్యవములో స్థానిక బుర్రిపాలెం రోడ్డునందు నూతనంగా నిర్మించిన T.Y.K. కళ్యాణమండపమునందు 9వ ధనుర్మాస మహోత్సవము వైభవంగా నిర్వహించిరి. శ్రీమాన్ వై. కూర్మనాథస్వామి ప్రతిరోజూ సాయంత్రం తిరుప్పావై పాశురార్థాలను అందించారు.

**నిర్మల్‌లో:** వి.టి.వారు గీతాజ్యోతిలో భాగంగా ధనుర్మాస మహోత్సవాన్ని నిర్వహించుకున్నారు. ఉదయం వాల్మీకినగర్‌లోని రామాలయంలోనూ, సాయంత్రం దేవరకోట శ్రీ వేంకటేశ్వరస్వామి సన్నిధిలోను తిరుప్పావై గోష్ఠి, ప్రవచన కార్యక్రమాలను కుమారి శారదగారి ద్వారా నిర్వహింపచేసారు. మధ్యాహ్న సమయాలలో ధర్మక్షేత్ర నిర్వహణలో భాగంగా చుట్టుప్రక్కల సుమారు 40 గ్రామాలలో గీతాజ్యోతి ప్రచారం కావించారు.

**జీయర్ హ్యూమానిటీస్...**

తెనాలిలోని జీయర్ హ్యూమానిటీస్ ప్రతినెలా 3వ ఆదివారం నిర్వహించుచున్న జీయర్ ఉచితవైద్య శిబిరం డిసెంబరు నెలలో పెరవలి గ్రామమందు మార్కెట్‌యార్డ్‌వారి సహకారంతో నిర్వహించడమైనది.

జనవరి నెలలో 18.1.04న మాజీ శాసనసభ్యులు ఆలపాటి రాజేంద్రప్రసాద్‌గారి సహకారంతో వారి స్వగ్రామమైన యడ్లపల్లినందు నిర్వహించడమైనది. ప్రతి క్యాంప్‌నందు 900మంది పైగా రోగులు ఉచితవైద్య సేవలు పొందారు. సుమారు 86వేలకు పైగా మందులను ఆరోగ్యార్థులకు అందించడం జరిగింది. శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములతో ఈ క్యాంపులను డా॥ ఎన్.వి. సుబ్బారావుగారు, శ్రీమాన్ బి. లవకుశలు, శ్రీమాన్ కె.వెంకటరమణ, శ్రీమాన్ కె. మోహన్‌దాస్, శ్రీమాన్ పి.విశ్వేశ్వరరావు, శ్రీమాన్ జె.వి. సుబ్బారావు, శ్రీమతి శారద, డా॥ రాధకృష్ణమూర్తి, తదితర వైద్యులు తమ సేవలందించి నిర్వహించారు. హ్యూమానిటీస్ కార్యకర్తలు శ్రీమాన్ ఎస్.కిషోర్, శ్రీమాన్ వి. సత్యన్నారాయణ, శ్రీమాన్ కె.ఖగేంద్రప్రసాద్, శ్రీమాన్ బదరీనాథ్ తదితరులు పాల్గొన్నారు.

జై శ్రీమన్నారాయణ!

ఓం అస్మత్ గురుభ్యో నమః

# పదాలవిందు-5 పూరించండి:

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | ■ | 2 | | 3 | | 4 |
| | ■ | | ■ | 5 | ■ | ■ | | ■ | |
| 3 | | | ■ | 5 | | 6 | | ■ | |
| | ■ | ■ | 7 | | ■ | | ■ | 4 | |
| ■ | 8 | 17 | | ■ | ■ | ■ | 9 | ■ | |
| ■ | 9 | | | ■ | 10 | 11 | | | ■ |
| 12 | | | ■ | ■ | 11 | | ■ | ■ | 15 |
| | ■ | ■ | 14 | | | ■ | 13 | | |
| 6 | | ■ | | ■ | ■ | 16 | | ■ | |
| 17 | 18 | | ■ | 18 | | | ■ | 15 | |

**అడ్డము:-**

1. శఠగోపుల శిష్యులు, ద్రావిడవేదాంత ప్రవర్తకులు (4)
2. 15వఅధ్యాయం పెట్టిన ఉత్తమ నామం (4)
3. నీడను పట్టుకు నిలిపింది (3)
4. వక్షస్థలమే అచ్చతెనుగులో (2)
5. కేశము కలవాడే ఇంద్రియాలకి అధిపతి (4)
6. విరాగం 'వి'గతమైతే (2)
7. భేదంలా అన్పించే దుఃఖం (2)
8. మంచిపిల్ల కనుకే, ఉపనిషత్ పేరయ్యింది (3)
9. ఉపాసనకు మరోపేరు (3)
10. అలకనందకే కాస్తదిగివస్తే, మరోపేరు (4)
11. కొద్దిగ (2)
12. అష్టాక్షరీ ఆవిర్భావస్థానం (3)
13. యమునలా నల్లనిదే రాత్రి (3)
14. శ్రీకృష్ణజన్మస్థానమే జైలు కాదు (3)
15. నాస్తికధర్మం కానీ, శాంతికిరూపం (2)
16. త్రాగుట (2)
17. మనఃఫలకంమీద భావాలను ఇలా వ్రాయాలి (3)
18. భగవంతునికి పెట్టేది (3)

9

\30 /
Mydocuments\
Bn Feb. o4.p65



**నిలువు:-**

1. ప్రహ్లాదవరదుడే ముందు కొంచెం సాగాడు (4)
2. ముద్రవేసేది (3)
3. .......కళానిధికి......ఉపచారములు(3)
4. మధువుని నశింపచేసినవాడు (5)
5. వయోభేదం తెలియని స్నేహితుడిని(3)
6. ప్రశ్నతో మొదలయ్యే ఉపనిషత్ (2)
7. సంస్కృతంలో ఆడుకొనుట (3)
8. బాగా తెలుసుననుకొనుట (3)
9. శుకుని తల్లి (4)
10. గిరే కవ్వమైపోయింది (3)
11. భార్య (2)
12. శేషుడే సేవ చేయించుకోవాలని ముందు పుట్టాడు (4)
13. ప్రయాణము (2)
14. ప్రళయంలోనూ రక్షకమై నిలిచే అవతారం (2)
15. అవతారాలకు మూల వ్యూహం (4)
16. కాళ్ళు కడిగే నీరు (2)
17. బదరి సంబంధం కలవాడే. బాదరాయణుడు కాదు (4)
18. కదలలేదు కానీ తిరగబడింది (2)

సరియైన సమాధానాలు వ్రాసి పంపినవారి పేర్లు ప్రచురించుతాం.
మీరు చేయవలసిన పని సంచికలోని పదాలవిందు కత్తిరించి, శీర్షికను పూరించి 20వ తారీఖులోగా పంపండి.

## పదాలవిందు-4: సమాధానాలు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ప | ద్మి | 2 నీ | ■ | 3 దా | మో | 4 ద | ర | ■ | 5 సం |
| ద్మ | ■ | 2 ర | హ | స్యం | ■ | 4 శ | మ | ■ | క |
| 6 నా | 6 ర | ద | ■ | ■ | 7 భ | ర | ణి | ■ | ర్ష |
| 8 భ | క్తి | ■ | 9 భ | గీ | ర | థ | ■ | 5 ఋ | ణ |
| ■ | ■ | 10 ము | క్తి | ■ | త | ■ | 11 పే | ■ | ■ |
| ■ | 13 కా | ■ | 12 | | ■ | 11 పా | య్ | గై | ■ |
| 13 ప్ర | త్యా | హా | ర | ■ | 8 స | ■ | ■ | 14 మం | 15 త్రి |
| ■ | 17 య | ■ | ■ | వ | ర | వ | ర | ■ | వి |
| 18 పా | నీ | యం | ■ | 17 ద | మ | యం | తి | ■ | క్ర |
| హి | ■ | 20 వ్య | జ | నం | ■ | ■ | ■ | య | మ |

గతనెల విజేతలు

శ్రీమతి వేముల బాలత్రిపురసుందరిగారు, అవనిగడ్డ.

## విషయ సూచిక.....



## పంచాంగ వివరాలు

### ఏప్రిల్

- **1** సర్వేషామేకాదశి
- **2** వామన ద్వాదశి
- **3** శని త్రయోదశి శనిపూజ
- **4** శ్రీరంగనాచ్చియార్ తిరు॥
- **5** హనుమత్ దీక్షారంభం, తిరువరంగత్తముదనార్ తిరు॥
- **8** సంకష్టహర చతుర్థి
- **13** అశ్వినీ కార్తె, మేష సంక్రమణం రా.7-08
- **14** తమిళ వత్సరాది, సౌరవత్సరాది
- **15** సర్వేషామేకాదశి
- **17** మాసశివరాత్రి
- **19** అమాసోమవారవ్రతం
- **22** పరశురామజయంతి, అక్షతదియ, సింహాచల లక్ష్మీనృసింహస్వామివారి చందనోత్సవం
- **24** జగద్గురు శ్రీశంకరాచార్య జయంతి
- **25** జగద్గురు శ్రీమద్రామానుజాచార్య జయంతి, (ఉడయవర్, ఎంబెరుమానార్ తిరు॥)
- **27** భరణికార్తె, త్రిద్యుస్పృక్

### మే

- **1** సర్వేషామేకాదశి, ప్రపంచ కార్మికదినం
- **2** పరశురామ ద్వాదశి, కిడాంబియాచ్చాన్ తిరు॥
- **3** స్మార్త శ్రీనృసింహజయంతి మధురకవియాళ్వార్ తిరు ॥
- **4** వైష్ణవానాం శ్రీనృసింహజయంతి సంపూర్ణ చంద్రగ్రహణం, వాస్తుకర్తరీ ప్రారంభం,
- **9** తిథి ద్వయం


మీ సేవలో....

**భక్తినివేదన**, సీతానగరం-522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, & (08645) 272929,

**చందావివరాలు** :- సంవత్సరచందా రూ. 50/-, జీవితచందా రూ. 500/-,
విదేశాలకు సంవత్సరచందా $ 25,

E-mail : jetsitanagaram@yahoo.com Internet : www.chinnajeeyar.org

D.T.P. & Design by : పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం,


శ్రీమతే రామానుజాయ నమః

# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాస పత్రిక




శ్రీతారణ నామ సంవత్సరం చైత్రమాసం

సంపుటి 57 2004 ఏప్రిల్ సంచిక 1

వ్యవస్థాపకులు

శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యులు

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు :

శ్రీ ఉ. వే. శ్రీమాన్ T.P. **శ్రీరామచంద్రాచార్యులు**





సంపాదకీయం

# నిర్వేదాన్ని నిర్జించాలి

మనిషి ఎంత బుద్ధిమంతుడయినా, ఎంత శాస్త్రజ్ఞానం, లోకానుభవం కలవాడయినా జీవితంలో తప్పటడుగులు వేస్తూనే ఉంటాడు. ఉన్నతిని సాధించటంలో పరమార్థాన్ని పొందటంలో గమ్యాన్ని చేరుకోవటంలో తికమకలు పడుతూనే ఉంటాడు.

మిగిలిన ప్రాణులకంటె మనిషికున్న బుద్ధి విలక్షణమయినది. దానికి తోడు వీడికున్న ఆశ మరొకచోట కనరానిది. సృష్టిలో మానవులకున్నంత ఆశ మరే ప్రాణికీ ఉన్నట్లు కనపడదు. హిమాలయాలంత ఎత్తులకు ఎదగాలని దిగంతాలు చుట్టిరావాలని సముద్రపు లోతులు తాకి ఆకాశపుటంచులు పట్టుకోవాలని కలలు కనటమే కాదు, అందుకు సిద్ధమూ అవుతాడు తాను.

కోరికలు తప్పుకాదు. వాటిని పొందటానికి పూనుకోవటమూ చెడ్డేమీ కాదు. మనిషన్నాక ఎత్తులకెదగాలి. కేవలం ఆహారనిద్రాదులే కాదు జీవితమంటే. భౌతికంగా అభివృద్ధి సాధించాలి. ఆధ్యాత్మికంగా ఆనందాన్ని పొందాలి.

నిస్సారంగా, నిస్తేజంగా గతానుగతికంగా బతకటం మాత్రమే కాక 'సమానులలో ఉత్తమశ్లోకుడు'గా పరిగణింపబడేట్టు మనుగడ సాగించాలి.

ఇందుకు మనిషికి కావలసినది 'ఉత్సాహం'. లోకోత్తరకార్యాలను సాధించాలన్న గట్టి పూనిక ఉత్సాహం. ఆలోచనం విలక్షణం కావాలి. అది నిరుపద్రవం కావాలి. తనకు ప్రేయస్సు, శ్రేయస్సును, చేకూర్చేది కావాలి. ఒరులకు చేటు కలిగించేది కాకుండా ఉండాలి. ఆ ఆలోచనం ఆచరణానికి రావాలి. ఫలప్రదం కావాలి.

అయితే ఎంత ఉత్సాహం ఉన్నా మనిషిని కుంగదీసి అడుగుముందుకు వేయనివ్వకుండా, ఆలోచననుకూడా సాగనివ్వకుండా చేసేది మరొకటి ఉంది-అదే నిర్వేదం-దిగులు.

ఏదో రావాలని, వస్తుందని ప్రయత్నిస్తాడు. చేతికందుతుంది, ఒళ్ళో పడుతుంది. అనుకొన్న ఫలంకాస్తా అందకుండా పోతుంది.

అట్లా అది దూరంగా కాగానే వీడి బుద్ధిని, సంస్కారాన్ని అనుభవాన్ని, పాండిత్యాన్ని, అంగ బలాన్ని, అర్థబలాన్ని అన్నిటినీ అణచేసి నిర్వేదం కమ్మేస్తుంది. నిలువునా మనిషి కుంగిపోతాడు. బతుకంతా చీకటే తప్ప వెలుగు కనబడకుండా పోతుంది. ఆశ అడుగంటి పోతుంది. వివేకం సన్నగిల్లిపోతుంది. బుద్ధి మందగిస్తుంది. పాండిత్యం ప్రభ తరిగిపోతుంది. ఎన్ని బలాలూ గుర్తుకేరావు. దిగులు! దిగులు!! దిగులు!!!

ఇక సరి అనుకొంటాడు!

జీవితంలో అన్నీ అనుభవించి అన్ని కర్తవ్యాలనూ నిర్వర్తించి 'కృతకృత్యుడై' అనుభవాలు ఉత్కటాలు కాగా కూడా మనిషికి నిర్వేదం కలుగుతుంది. అది కలగవలసిన నిర్వేదం. స్వాగతించవలసిన నిర్వేదం.

ఆ నిర్వేదం కూడా నిర్భయత్వానికి దారి తీసేది కాకూడదు. పశుపక్ష్యాదుల వలెనే కేవల భౌతిక జీవనాన్నే పరమార్థంగా భావించి

పరుగులుపెట్టి అలసిపోయేనే! వాస్తవంగా పొందవలసినదాన్ని పొందటానికి సుంతయినా ప్రయత్నించకపోయేనే, అయ్యో అనే దిగులు. ఆ దిగులు పరమార్థసాధనం వైపు మనిషిని నడిపించేందుకు తోడ్పడాలి. అందుచేతనే ఆ నిర్వేదం స్పృహణీయం.

లౌకికమయిన నిర్వేదం మంచిదికాదు. ఇది మనిషిని లొంగదీసుకుంటే కుంగదీస్తుంది. దీనికి మనిషి లొంగకూడదు.

ఒకమారు ప్రయత్నించేదు. ఫలితం దక్కలేదు. దిగులుచెందక కుంగక ప్రయత్నాన్ని దృఢతరం కావించి ఫలప్రాప్తి పర్యంతం కొనసాగించాలి.

సంస్కారాన్ని మేల్కొలపాలి. బుద్ధిని పరామర్శించాలి. లోకానుభవాన్ని స్మరించుకోవాలి. నేనేమిటి ఇంత డీలాపడిపోయేను అని తనను తాను హెచ్చరించుకోవాలి. ప్రయత్న పరుడు కావాలి. అనుకున్నదాన్ని సాధించాలి అన్న విశ్వాసాన్ని పెంపొందించుకోవాలి. పరిస్థితులను అనుకూలంగా మలచు కోవాలి.

నిర్వేదం వల్ల మనిషి ఎంతో నష్టపోతున్నాడు. పిల్లలలో యువతలో పెద్దలలో ఎక్కడ చూసినా నిర్వేదమే.

ఏదో పొందాలని తపన. కేవలం ఆశతో కొందరు ఎంతో కొంత ప్రయత్నంతో కొందరు ఫలితం కోసం ఎదురుచూడటం అది కాస్తా లభించకపోయేటప్పటికి నిర్వేదానికి లోనుకావటం!.

ఆశలున్నంతమాత్రాన ఫలితాలు రావు. అరకొర ప్రయత్నాలవల్లా రావు. చెయ్యవలసినదెంత చేసినా ఒకప్పుడు ఫలితం రాకపోవచ్చు. ఏదో కారణం ఉంటుంది. అది మనకు తెలియకపోవచ్చు. అంతమాత్రాన నిర్వేదంతో నీరసించిపోయి 'అస్త్రసన్యాసం' చేసేయకూడదు.

బుద్ధిమంతులలో వరిష్ఠుడుగా పేరు పొందినవాడు ఆంజనేయస్వామి. ఆయన పౌరుషానికి లోటులేదు. విక్రమానికి దీటు లేదు. బుద్ధికి చేటులేదు.

సీతమ్మ జాడలు తీయటానికి లంకలో ప్రవేశించేడు. లంకంతా గాలించేడు. సీత కనరాలేదు. ఒక్కసారి మనసంతా దిగులు కమ్మేసింది.

కాని ఆయన 'బుద్ధిమతాం వరిష్ఠుడు' కదా!

ఒక్కసారి తేరుకున్నాడు. మనసు కూడదీసుకున్నాడు.

అబ్బా! నిర్వేదం ఎంత చెడ్డది!! నిర్వేదం వదిలితే అభ్యుదయం చేకూరుతుంది. నిఃశ్రేయసమూ సిద్ధిస్తుంది. అసలు మనిషి ప్రవృత్తికి ప్రతిబంధకం నిర్వేదం. కనక దీన్ని పారదోలాలి.

**అనిర్వేదః శ్రియో మూలం**
**అనిర్వేదః పరం సుఖః**
**అనిర్వేదో హి సతతం**
**సర్వార్థేషు ప్రవర్తకః**

అని నిర్ధారణ కావించుకొని దైవ స్మరణం వల్ల అచంచలమైన మనోబలాన్ని పుంజుకొని సీతాన్వేషణకు పూనుకున్నాడు. ఆమెను సందర్శించినాడు.

ఇవేళ సమాజంలో హింస, సంఘర్షణలు, హత్యలు, ఆత్మహత్యలు అభద్రత మొదలయిన ఎన్నో సామాజిక రుగ్మతల వల్ల మనిషి కుంగిపోతున్నాడు. వాటిని తట్టుకోవటానికి నిర్వేదాన్ని నిర్జించాలి.

దీనివల్ల మానసికంగా మనిషికి దార్ఢ్యం ఏర్పడుతుంది. దృఢచిత్తుడైననాడే ఉత్సాహం ఉపకరిస్తుంది. ఉత్సాహంతోనే మనిషి లోకోత్తరుడౌతాడు

*- శ్రీరామచంద్రాచార్య*



# మహర్షుల చరిత్ర

తమిళమూలం :
వై.వా. నావల్‌పాకం దేవనాథ తాతాచార్యస్వామి

తెలుగు సేత :
శ్రీ.ఉ.వే.ప్ర శ్రీమాన్ తూపురాణి ఉడయవర్‌స్వామి, విజయవాడ

**మం॥ తేనేదం పూర్ణం పురుషేణ సర్వమ్**

(తైత్తిరీయారణ్యకం–10.10.20)

**మం॥ అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః**

(తైత్తిరీయారణ్యకం–10.11.15)

**మం॥ సయశ్చాయం పురుషే యశ్చాసావాదిత్యే స ఏకః॥**

(తైత్తిరీయోపనిషత్–2.83.10)

పైన ఉదహరించినవాటిని పోలిన ఉపనిషత్ వాక్యముల తాత్పర్యమును (జగత్తు అంతయు బ్రహ్మాత్మకము) వామదేవుడు అనుభవించి చెప్పిన బ్రహ్మనిష్ఠను పోలినదానినే త్రసదస్యు కూడ చెప్పినాడని అనవచ్చును. నమ్మాళ్వార్లు కూడ ఇదే భావనతో చెప్పిన ఈ క్రింది పాశుర ఖండాన్ని గమనించండి.

**పా॥ "కడల్ ఞాలమ్ శెయ్‌దేనుమ్ యానే"**

("సముద్రముచే చుట్టుకొనబడి ఉన్న లోకమును సృష్టించినవానిని నేనే" అనును.) తిరువాయ్‌మొజి 5.6.1

ఇదే భావమును శ్రీమద్వేదాన్త దేశికులు కూడ ఈ క్రింది పాశుర ఖండములో తెలిపిరి.

**పా॥ "యానుంనీయే, ఎన్నుళ్ళత్తెదలిన్..."**

పై విషయములను గమనించిన మనకు వామదేవుడు, త్రసదస్యు ఒకే విధమైన బ్రహ్మనిష్ఠకల వారని తెలియుచున్నది కదా! సర్వజ్ఞుడైన వేదవ్యాస మహర్షికి ఈ విషయం తెలియదని అనలేము కదా! తన బ్రహ్మసూత్రమున **"శాస్త్రదృష్ట్యా తూపదేశస్త్రసదస్యువత్"** అని ఉపమానముగా త్రసదస్యునే గ్రహించి ఉండవచ్చునే! అట్లు చేయక వామదేవుని గ్రహించుటకు కారణము ఏమై ఉండవచ్చును? అను ప్రశ్న ఉదయించుటకు అవకాశమున్నది. దానికి పెద్దల సమాధానము ఈ విధముగానున్నది. త్రసదస్యు ప్రసంగము కర్మకాండలోనిది. వామదేవుని ప్రసక్తి బ్రహ్మకాండలోనిది. వేదవ్యాసుడు, బ్రహ్మకాండననుసరించియే బ్రహ్మ సూత్రములను వ్రాసి ఉండుటచే ఆ కాండతో సంబంధముగల వామదేవునే ఉదాహరణముగా గ్రహించి తన సూత్రమును "శాస్త్రదృష్ట్యా తూపదేశో వామదేవవత్ అని వ్రాయుట జరిగినది. ఇంత మాత్రమే తప్ప వారి బ్రహ్మనిష్ఠ విషయంలో భేదమేమీ లేదని గ్రహించవచ్చును.

**దేవతల అభిమానం :**

పురుకుత్సుడు, త్రసదస్యువు ఇద్దరూ కూడ దేవతల అభిమానమునకు పాత్రులైనవారే. వీరికోసమే ఇంద్రుడు, అశ్వినీ దేవతలు యుద్ధంలో పోగొట్టుకున్న పట్టణాలను తిరిగి ఇచ్చివేసినాడట.

ఈ క్రింది ఋగ్వేద మంత్రాలు ఇదే విషయాన్ని తెలియజేస్తున్నాయి:

మం. **త్వం హ త్యదిన్ద్ర సప్త యుధ్యన్పురో వజ్రిన్ పురుకుత్సాయ దర్దః ॥** (ఋగ్వేదం 1.63.7)

మం. **ఋణోరపో అనవద్యార్ణా యూనే వృత్రం పురుకుత్సాయ రంధీః** (ఋగ్వేదం 1.174.2)

మం. **యాభిః పృశ్నిగ్ంం పురుకుత్సమావత తాభిరూషు ఊతిభిరశ్వినాగతమ్**

(ఋగ్వేదం 1.112.7)

**మంత్రద్రష్ట :**

ఋగ్వేదం 9వ మండలం 10వ సూక్తమును దర్శించిన మహర్షులు 'త్రసదస్యు' 'త్ర్యరుణ' అను ఇద్దరు ఋషులు.

**మం. యామృషయో మంత్రకృతో మనీషిణః**

**అన్వైచ్ఛన్దేవా స్తపసా శ్రమేణ"** అను వేద మంత్రము మంత్రద్రష్టలైన మహర్షుల మహిమను చెప్పుచున్నది.

**మం. గురుశ్రవణమావృణి రాజానం త్రాసదస్యవమ్। మహిష్ఠం వాఘ తామృషిః యస్య మా హరితో రథే త్రిస్రో వహన్తి సాధు యా । స్తవై సహస్రదక్షిణే ॥**

(ఋగ్వేదం 10.33.45)

'గవష' మహర్షి తన యాగశాలలో ఈ విధముగా చెప్పినాడట. నేను త్రసదస్యుని కుమారుడైన గురుశ్రవణుని సమీపించి యాగమునకు సహకరించవలసినదిగా కోరగా, ద్రవ్యమును ఇవ్వడంతోబాటు ఆ ద్రవ్యములను వాహనములపై నా యాగశాలకు చేర్చి ఉపకరించినాడు.

నేను యాగశాలను చేరుటకై మూడు గుఱ్ఱములతో కూర్చిన రథమును సిద్ధపరచినాడు. నేను ఆ రథంలో సుఖముగా నా యాగశాలను చేరినాను. ఆయన ఔదార్యము వర్ణింపనలవికానిది' అని తెగ పొగిడినాడట.

ఇంకొక మంత్రం కూడ ఈ విషయాన్ని ధృవీకరిస్తోంది.

**మం. అదాన్మే పౌరుకుత్స్యః పంచాశతం త్రసదస్యుర్వధూనాం । మహిష్ఠో అర్యస్సత్పతిః ॥**

(ఋగ్వేదం 8.19.36)

'పురుకుత్సుని కుమారుడైన త్రసదస్యు, నాకు 50 మంది కన్యలను ఇచ్చినాడు. అతని ఔదార్యమునకు హద్దులేదు. మంచివారిచే ఆశ్రయింపతగినవాడు. మంచివారిని అన్నివిధాలా కాపాడువాడు" అని దీని భావము.

బ్రహ్మచారులను గుర్తించి వారికి కన్యాదానము చేయుట పుణ్యప్రదమైన కార్యము. ఆ దంపతులు తాము యాగములను అనుష్ఠించుటయే కాక తమ తరువాతి తరములవారిచే కూడ యాగములను చేయించుటచే లోకము ఉజ్జీవించగలదు. ఈ ఉద్దేశంతోనే 'త్రసదస్యు' అనేక కన్యాదానములను చేసినాడు.

కాంచీపురములోని ఈ వంశము వారు ఈనాటికీ "కోటి కన్యాదానం" అనే పదాన్ని తమ పేరుకు ముందు వ్రాసుకొని తమకు కన్యాదాన మందున్న ఆసక్తిని తెలుపుచున్నారు.

**గొప్పదాతలు:**

ఈ త్రసదస్యు మహర్షి వంశము వారు జీవితాంతము విచ్ఛేదములేక యాగములను నిర్వహించిన మహనీయులు. యాగకార్యక్రమాలలో యజమానికి సహాయం చేసేవారిని "ఋత్విక్" అని అంటారు. ప్రతియాగం లోను అటువంటి ఋత్విక్‌లకు దక్షిణ ఇవ్వబడు తుంది. అటువంటి దక్షిణలను ధారాళముగా ఇవ్వడంతో ప్రసిద్ధులు ఈ వంశం వారు. ఋగ్వేద మంత్రాలే ఈ విషయాన్ని తెలియజేస్తున్నాయి.

యాగదక్షిణలు ఇవ్వడంలో ఈ వంశం వారికి ఒక ప్రత్యేకత ఉన్నది. త్రసదస్యుని కుమారుని పేరు "గురుశ్రవణుడు". ఇది ఒక కారణం చేత ఏర్పడిన పేరే (యౌగికం). గురు-శ్రవణ అను రెండు పదాలతో కూడినది ఈ పేరు. గురు అను పదానికి యాగ కార్యములను నిర్వహించు ఋత్విక్‌లు అని అర్థము. శ్రవణ అను పదానికి 'వినుట' అని అర్థము. ఈ రెంటినీ చేర్చిన "గురుశ్రవణ" అనుదానికి అర్థమేమనగా ఈయన యాగములలో ఋత్విక్‌లకు అపరిమితంగా దక్షిణలు ఇస్తూ ఉండేవాడు. ఆ దక్షిణలు స్వీకరించినవారు ఈ మహర్షిని నోరార స్తుతిస్తూ ఉండేవారు. వారి పొగడ్తలను ఎప్పుడూ వింటూఉండేవాడట ఈయన. ఇందుచేతనే ఈయనకు గురుశ్రవణ అనే పేరు ఏర్పడిందట.

తన యాగాలలో దక్షిణలను ధారాళంగా ఇవ్వడమే కాక ఇతరులు చేసే యాగాలకు కూడ అన్నివిధాల సహకరించడం వీరికి అలవాటు. 'గవష' అను ఋత్విక్‌కి వీరు చేసిన ఉపకారము ఋగ్వేదములోని రెండు మంత్రాలలో వారే చెప్పియున్నారు.

⟹⟹⟹





# రామాయణంలో రమ్య గాథలు

## వాయుసుతుని సాగరలంఘనం

-చెవుటూరి కుసుమకుమారి, విజయవాడ.

ఇంతలో వారికి ఆకసమునుండి ఋషివాణి ఇలా వినిపించినది.

**"ఏష పర్వత సంకాశో హనుమాన్ మారుతాత్మజః**
**తితీర్షతి మహావేగః సముద్రం మకరాలయమ్"**

పర్వతసమానదేహుడూ, మహావేగశాలి, వాయుపుత్రుడూ అయిన హనుమంతుడు మకరాలయమైన సాగరాన్ని దాటుటకొరకై చేయు ప్రయత్నమిది.

**"రామార్థం వానరార్థం చ చికీర్షన్ కర్మ దుష్కరమ్,**
**సముద్రస్య పరం పారం దుష్ప్రాపం ప్రాప్తుమిచ్ఛతి"**

రామకార్యార్థం, వానర రక్షణార్థం అనన్య సాధ్యమైన కార్యమును సంకల్పించి ఆవలి ఒడ్డును చేరకోరుచున్నాడు. ఆ మాటలు విన్నవారందరూ సాటిలేని ఆకారము దాల్చిన ఆ కపిశ్రేష్ఠుని చూచినారు.

పర్వతాకారుడై హనుమ ఒక్కమారుగా రోమములను విదల్చుకొనినాడు. మహామేఘంలా గర్జించినాడు. మొదట లావుగానూ, పోను పోను చివర సన్నముగాను వుండి దట్టమైన రోమములచేత నిండిన వాలమును గరుడుడు సర్పమును పట్టి జాడించినట్లు దులిపినాడు. ఒక్కసారిగా నీలాకాశమునకెగిరినాడు. వేగము పుంజుకున్న హనుమ వీపుమీదితోక **"దదృశే గరుడేనేవ హ్రియమాణో మహోరగః"** గరుడుడు పట్టి తీసుకొని వెళ్ళుచున్న సర్పంలా కనుపించినది. ఆ హనుమ కోటవాకిళ్ళ గడియల్లా వున్న గొప్ప బాహువులను బిగియబట్టినాడు. గాలిని లోనికి పీల్చి నడుమును సన్నముగా చేసి పాదములు ముడుచు కొని భుజములను, మెడను వంచి తేజస్సును, బలమును ఆవిర్భవింపజేసుకొనినాడు. కనులు పైకెత్తి తాను వెళ్ళవలసిన ఆకాశమార్గమును చూచినాడు. వానరుల మధ్యన గజంలావున్న హనుమ, పైకి ఎగురుటకు సిద్ధముగా వున్న తననే చూచుచున్న వానరులతో

**యథా రాఘవ నిర్ముక్తః శరః శ్వసనవిక్రమః**
**గచ్ఛేత్త ద్వద్గమిష్యామి లంకాం రావణపాలితామ్**

రామచంద్రుడు విడిచిన బాణంలా వాయువేగంతో రావణ పాలితమైన లంకకు వెళ్ళెదను.

**న హి ద్రక్ష్యామి యది తాం లంకాయాం జనకాత్మజామ్,**
**అనేనైవ హి వేగేన గమిష్యామి సురాలయమ్**

"లంకానగరంలో సీతను దర్శించలేకపోయితినేని ఇదే వేగమున స్వర్గమునకు కూడా వెళ్ళెదను.

**యది వా త్రిదివే సీతాం న ద్రక్ష్యామ్య కృతశ్రమః,**
**బద్ధ్వా రాక్షసరాజాన మానయిష్యామి రావణమ్".**

వానర సఖులారా! ఆ నాకమున కూడా సీతను కానకపోతినేని ఇంచుకైననూ శ్రమతలచక ఆ దానవుని రావణుని బంధించి రామసముఖమునకు తేగలను.

**సర్వథా కృతకార్యోహమేష్యామి సహ సీతయా**
**ఆనయిష్యామి వా లంకాం సముత్పాట్య సరావణమ్**

హరిపుంగవులారా! నేను ఎటులైననూ కార్యమును సాధించి సీతతో సహా వచ్చెదను. అట్లు కాకున్న లంకను పెళ్ళగించి తీసుకొనివచ్చెదను".

**ఏవ ముక్త్వా తు హనుమాన్వానరాన్వానరోత్తమః,**
**ఉత్పపాతాథ వేగేన వేగవానవిచారయన్,**
**సువర్ణమివ చాత్మానం మేనే స కపికుంజరః**

వానరశ్రేష్ఠుడూ, మహావేగశాలి అయిన హనుమ ఆ వానరయోధులతో పలికి, మనస్సును ఏకాగ్రం చేసి అమితవేగంగా పైకెగిరి, రామకార్యమగ్నుడనై, రామబాణంలా వేగంగా దూసుకుపోతున్న నేను సాక్షాత్తూ శ్రీమహావిష్ణువు వాహనమైన గరుత్మంతుడనని భావించినాడు. (ఇంతటి మహావీరుడు తనను రామబాణంగా భావించినాడు. రామసేవకుడిలా భావించుకొనినాడు. అసలు వాయుపుత్రుడైన హనుమ కన్నా వేగవంతులెవరున్నారు? నేను రామబాణంలా వెళ్ళి లంకను పెళ్ళగించుకొని వస్తాను అన్నాడు. బాణంలో ఏముంది? అది ఒక చువ్వ. ఒక పుల్ల. పోనీ ఒక బంగారు మొన కలిగివుండవచ్చు. ఆ బాణవేగం దానిని విడిచిన వాని శక్తిని బట్టి వుంటుంది. అది మంత్రశక్తి అయినా కావచ్చు, దేహదార్ఢ్యం అయినా కావచ్చు. మామూలు బాణం అయితే కొట్టవలసినదానిని కొట్టి క్రింద పడుతుంది. దానికొక లక్ష్యం ఉంటుంది. దాన్ని మాత్రమే భేదిస్తుంది.

కానీ, రామబాణత్రాణ వేరు. ఏడేడు పధ్నాలుగు లోకాలలో దాగినా, లక్ష్యం నుండి తప్పించుకొనే దారి కనిపించదు. అలా తప్పించుకోవాలంటే 'రామా శరణు శరణు' అనటమే దారి. అంటే శక్తి రామునిదన్నమాట. రామచంద్రుడు గడ్డిపోచను ప్రయోగించినా అర్థసిద్ధిని పొందుతుంది. అందుచేత నేను నేనుగా సాగరలంఘనం చేయుటలేదు. నేను అనే శరాన్ని రావణుడు అనే లక్ష్యానికి గురిపెట్టి శ్రీరాముడు వదలిపెట్టాడు. ఆ బాణం లంకకు వెళ్ళి సీతను చూచి, ముద్రికనిచ్చి, రావణవధకు నాందీప్రస్తావన చేస్తుంది. తిరిగి శ్రీరామ శరాసనాన్ని చేరుతుంది. అందుకనే నేను రామబాణంలా వెళ్ళివస్తానన్నాడు హనుమ. శక్తి అంతా రామునిదే. నేను కేవలము రామదూతను. అని లంకకు బయలుదేరిన వాయుపుత్రునిమీద పుష్పవృష్టి కురిసింది). (శక్తి అంతా పరమాత్మదే. మనం కేవలం నిమిత్తమాత్రులం).

వాయుపుత్రుడు గిరిని తొక్కిపెట్టి, తన ఊరు వేగంతో పెకలివచ్చిన అనేక పెద్దపెద్ద తరువులు తనతోపాటు ఎగురునట్లు చేసినాడు. ఆ తరువులు దూరదూరాలకు వెళ్ళు బంధువును సాగనంపునట్లు హనుమతోపాటు, కొంత ఎత్తునకు ఎగిరి, రాజు వెనుక వెళ్ళిన సైన్యంలా వెంటనంటి వెళ్ళినవి. హనుమ వేగం హెచ్చగానే వెంట ఎగిరిన చెట్లు, పూర్వము రెక్కల పర్వతములు దేవేంద్రునకు భయపడి లవణసాగరంలో పడి మునిగిపోయినట్లుగా పడి మునిగిపోయినవి.

**"తారాభిరభి రామాభిరుదితాభి రివామ్బరమ్"**

హనుమంతుని వేగముచేత ఎగిరిపడిన పుష్పములతో, తేజోవంతమైన, అందాల తారలతో ప్రకాశించే ఆకాశంలా ఆ సముద్రజలాలు తళతళలాడినవి. నింగివైపు జాపిన హనుమ బాహువులు పర్వతాగ్రంనుండి వెలికివస్తున్న పంచ శిరస్సుల సర్పంలా వున్నవి. ఆ కపివరుని పచ్చని, గుండ్రని నేత్రాలు ఉదయించిన సూర్యచంద్రుల్లా, ఎర్రని నాసిక కల ముఖము సూర్యబింబ సంధ్యారాగంలా, పైకెత్తబడిన తోక ఇంద్రధ్వజంలా, పృష్ఠం గైరికాది ధాతుమండిత పర్వతంలా, హనుమ దూసుకుపోతున్న గాలిధ్వని, మేఘగర్జనలాగావున్నది.

ఉత్తరదిక్కునుండి మహావేగంతో, దక్షిణదిశగా వెళ్ళుచున్న మహాదీర్ఘమైన ఉల్క ఆకాశముమీద నిలచివున్నట్లు, ఏదో మహాతేజఃపిండము మహావేగంగా నింగిని పోవుచుండగా ఒక అగ్ని చక్రము గుండ్రముగా త్రిప్పగా అది మహాతేజఃపుంజంలా కనుపించినట్లు ఆ మహాకపి ప్రకాశమానం అయినాడు. నడుముకు బంగారు గొలుసుతో కట్టిన పొడవైన మహాగజంలా కనిపించినాడు.

**ఉపరిష్టాచ్ఛరీరేణ ఛాయయా చావగాఢయా,**
**సాగరే మారుతావిష్టా నౌరి వాసీత్తదా కపిః**

ఆకసాన ఎగురుచున్న హనుమ శరీరఛాయ క్రింద సముద్రజలాలమీద పడగా హనుమ, గాలికి నీటనడిచే ఓడలా కనపడుచున్నాడు. ⇒⇒⇒



# శ్రీవిష్ణు మహాపురాణం

## 9వ అధ్యాయం

శ్రీ ఉ.వే. శ్రీమాన్ S.V. రంగరామానుజాచార్యస్వామి, రాజమండ్రి

⇒⇒⇒

### లక్ష్మీదేవి వెడలిపోయినందున ఏర్పడిన త్రిలోకీగ్లాని

ఓషధులు–యజ్ఞాదిక్రతువులు లేకపోవడంవల్ల–తాపసుల తపస్సులేకాక–దానధర్మాదులు కూడా నశించాయి. ప్రాణులు సత్త్వాన్ని కోల్పోయి లోభావిష్టాలైనాయి. ఏ లేశమాత్రం లభించినా దానికొరకు లోభపడే దుర్దశ, ఇంద్రియహాని, ప్రాణులకు ఏర్పడ్డాయి. దీనికి కారణాన్ని చెబుతున్నాడు పరాశరుడు.

**యతో లక్ష్మీస్తతస్సత్త్వం,**
**సత్త్వం భృత్యనుసారిచ**
**నిఃశ్రీకాణాం కుతస్సత్త్వం**
**వినాతేన గుణాః కుతః॥**

లక్ష్మి ఉంటేనే 'సత్త్వం' (బలం) ఉంటుంది. బలాన్నిబట్టే భృత్యులుంటారు. ఐశ్వర్యం లేని వారికి సత్త్వము, భృత్యులు ఎక్కడినుండి వస్తారు? ఇవేవీ లేనప్పుడు గుణాలు ఎలా చేరి ఉంటాయి. గుణాలు లేనిచోట పురుషులకు బలశౌర్యాదులుండవు. బలశౌర్యాదులు లేని వానికి ఇతరులచే తిరస్కరింపబడినప్పుడు ఆతని 'మతి' (ఆలోచన) పాడవుతుంది.

ఇలా త్రిలోకి–నిఃశ్రీకము, నిఃసత్త్వమూ అయినప్పుడు, దానవులు దేవతలు ఇరువురూ నిఃశ్రీకులు, నిఃసత్త్వులూ అయి, లోభావిష్టులైన దానవులచే దేవతలు పీడింపబడ్డారు. సహ జంగా దేవతలకంటే దేహదార్ఢ్యం కల దైత్యులు తామూ, నిఃశ్రీకులు నిఃసత్త్వులూ అయినా, తమకంటే బలహీనపడిన దేవతలపై దండెత్తి అనాయాసంగా దేవరాజ్యాన్ని జయించాడు. ఇలా దైత్యపీడితులైన దేవతలు బ్రహ్మను ఆశ్రయించారు. దేవతలగోడు విని, బ్రహ్మ వారితో ఇలా అన్నాడు.

**పరావరేశం శరణం**
**వ్రజధ్వమసురార్దనమ్।**
**ఉత్పత్తిస్థితినాశానాం**
**అహేతుం హేతుమీశ్వరమ్॥**

**ప్రజాపతి పతిం విష్ణు**
**మనన్త మపరాజితమ్ ।**
**ప్రధానపుంసో రజయోః**
**కారణం కార్యభూతయో।**
**ప్రణతార్తి హరం విష్ణుం**
**సవః శ్రేయో విధాస్యతి॥** అని.

ఇంతవరకూ, ఇంకా కావాలి కొన్ని శ్లోకాల్లో పరాశరుడు, బ్రహ్మస్తుతిముఖంగా పరతత్త్వ నిరూపణం చేస్తున్నాడు.

ఇలా అంటూ చతుర్ముఖబ్రహ్మ, దేవతలను వెంటబెట్టుకొని క్షీరసాగరపుటుత్తరతీరానికి చేరాడు. అక్కడ స్వామిని దర్శించి స్తుతించ సాగాడు.

ఇంతవరకు, (క్షీరోదానికి చేరకముందు బ్రహ్మ పలికిన మాటలలోని తత్త్వరహస్యాన్ని ముందుగా మననం చేసి, ఆ తరువాత బ్రహ్మస్తుతి ఎలాంటిదో అనుసంధానం చేద్దాం.

స్వామి పరములు, అవరములు (పెద్దవి-చిన్నవి అయిన) సమస్త వస్తువులకు 'ఈశుడు'. నియామకుడు అసురులను ఆక్రోశింపజేసేవాడు ఆయనే కనుక ఆయననే శరణువేడమని చెబుతున్నాడు బ్రహ్మ. స్వామికి, తనకంటూ ఏ కారణమూ లేకపోయినా ఈ సమస్త జగత్తు యొక్క ఉత్పత్తికి, స్థితికి లయానికి తాను కారణమై ఉన్నాడు. (ఇక్కడ ఈ మాటచే **'జన్మాద్యస్యయతః'** అనే బ్రహ్మసూత్రంలో నిరూపింపబడిన సకల జగత్కారణత్వం సూచింపబడింది. దీనివల్ల పరమాణువులు కారణమని, మూలప్రకృతి కారణమని, ఇలా చెప్పబడే విభిన్న వాదాలన్నీ నిరాకరింప బడ్డాయి విష్ణుపురాణంచే.) ఈతడు ప్రజాపాలకులై ప్రజాపతులుగా కీర్తింపబడే దక్ష మరీచ్యాదు లకు కూడా 'పతి'. అంటే నియామకుడు, పాలకుడు. సర్వవ్యాపకుడు కనుక విష్ణువు. దేశకాల వస్తు పరిచ్ఛేదం (పరిమితి లేనివాడు) కనుక అనంతుడు. ఎక్కడా పరాజయం లేనివాడు. ప్రధానమని చెప్పబడే మూల ప్రకృతికి పురుషుడని చెప్పబడే పురుషునకు కారణమైనవాడు. మరి, ఈ రెండు 'అజ' తత్త్వాలు కదా! అంటే అసలు పుట్టలేదు కదా! అంటే వాటిని పుట్టించకపోయినా, వీటిని కలిపి వివిధ దేహసృష్టికి స్వామి తాను కారణం అవుతున్నాడు.

ప్రకృతి పరిణామమే కార్యదశ. ప్రకృతి పరిణామమైన దేహాన్ని స్వీకరించడమే పురుషునికి (జీవునికి) కార్యదశ. ఇలాంటి సకల జగత్కారణమైన స్వామి, అనన్య భావనతో ఆశ్రయించినవారి (ప్రణతులు అయినవారి) ఆర్తిని పారద్రోలేవాడు. కనుక ఆయనే సర్వులకూ శ్రేయస్సును కలుగజేస్తాడని విశ్వాసం కలిగింపచేస్తూ ఊరడిస్తున్నాడు బ్రహ్మ.



## పరమపదోత్సవము

శ్రీమాన్ **ముత్తంగి శ్రీకృష్ణ**గారి పదమపదోత్సవం డిసెంబర్ 17వ తేదీన జరిగింది. వారిభార్య అయిన శ్రీమతి **ముత్తంగి వేంకట మహాలక్ష్మి**గారు శ్రీస్వామివారి కార్యక్రమాలలో విశేష సేవలందిస్తూ ఉంటారు. వారికి శ్రీస్వామివారి మంగళాశాసనాలు అందజేస్తున్నాము - భక్తినివేదన



# శ్రీమద్భగవచ్ఛాస్త్రమ్

శ్రీమాన్‌రమాకాంతాచార్యస్వామి, హైదరాబాదు

శ్రీపాంచరాత్రాగమము నాలుగు సిద్ధాంతములతో నొప్పుచున్నను **"సర్వే సర్వ ఫలప్రదాః"** అని అన్ని సిద్ధాంతములు మోక్షముతో పాటు- ఐహికములైన ధర్మార్థ కామములను ప్రసాదించ గలవు అని ఫలప్రాప్తిలో నించుకయు భేదముండ బోదని స్పష్టపరచి శాస్త్రావతార ప్రయోజనము తెలియజేయుచున్నది.

ఆగమ సంహితలలో జ్ఞాన, యోగ, క్రియా, చర్యాత్మకముగానుపదేశింపబడుచున్నది. జ్ఞానపాదమున భగవానుని సర్వేశ్వరత్వమును-సృష్టిక్రమమును తెలుపుతూ **"విజ్ఞానం భగవద్ జ్ఞానం తత్ జ్ఞానాత్ ముక్తిరుచ్యతే"** అని పరవాసుదేవుని నుండి వ్యూహములుగా వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధమూర్తులను మళ్ళీ వాసుదేవుని నుండి 1. కేశవ, 2. నారాయణ, 3. మాధవ స్వరూపములు. సఙ్కర్షణమూర్తినుండి 4. గోవింద, 5. విష్ణు, 6. మధుసూదన స్వరూపములు. ప్రద్యుమ్నునినుండి 7. త్రివిక్రమ, 8. వామన, 9. శ్రీధర స్వరూపములు. అనిరుద్ధుని నుండి 10.హృషీకేశ, 11. పద్మనాభ, 12. దామోదర స్వరూపములు ఏర్పడినట్లు ఈ ద్వాదశ మూర్తులు నిత్యారాధనలో ప్రత్యేకతను సంతరించుకొనుట మనమెరిగినదే.

ఇట్లు వాసుదేవుని నుండి సఙ్కర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధమూర్తులు సృష్టి, స్థితి, లయములకు మూలమగుచున్నారు. బ్రహ్మాండ సృష్టిలో భూరాదిలోకములువాటి పరిమాణములు వివరింపబడును. జ్ఞానపాదము పూర్తియగు వఱకు సంశయములు తొలగి-భగవత్ స్వరూపము ఆవిష్కృతమగును.

ఇక యోగపాదమున సాధకుని ఉపాసనా క్రమమును 1. యమ, 2. నియమ, 3. ఆసన, 4. ప్రాణాయామ, 5.ప్రత్యాహార, 6. ధ్యాన, 7. ధారణ, 8. సమాధియను అష్టాంగములను వివరించును. అందులకే ఇది యోగశాస్త్రము. ఇవియన్నియు అధ్యాయ క్రమమున వివరింపబడగలవు.

క్రియాపాదమున అర్చామూర్తి వైభవమునకు మూలమైన ఆలయ భూపరీక్షాది-మూర్తి నిర్మాణ ప్రతిష్ఠాంత విధులు పేర్కొనబడును.

చర్యాపాదమున అర్చామూర్తిని ఆరాధించు విధానము. అందుకు కావలసిన మంత్రములు. ఉద్ధారములు, ఉత్సవములు-ప్రాయశ్చిత్తవిధులు తెలుపును. ఉపనిషత్ జ్ఞానము (వేదాంతము) జ్ఞానాధికులకు శాస్త్రపరిశ్రమ చేయువారలకే ప్రయోజనకారికాగా ఆగమశాస్త్రమున అర్చామూర్తి ఆరాధన పామరులకు కూడా మోక్ష ఫలమీయదగి యున్నది. శ్రీపాంచరాత్రాగమము అష్టోత్తరశత సంహితాకారమని సంహితల వలన తెలియుచున్నను ఇప్పటి పరిశోధనల వలన (250) రెండు వందల యేబదికిపైన సంహితలున్నట్లు తెలియుచున్నది. భగవంతుని ఉపదేశ మూలకమైన-సాత్వత, పౌష్కర, జయాఖ్య సంహితలను ఆగమజ్ఞులు మూల సంహితలుగా రత్నత్రయముగా పేర్కొనుచున్నారు. వీటినుండి ఈశ్వర, పారమేశ్వర, పాద్మసంహితలేర్పడినట్లు అన్ని విషయములను విస్తారముగానుపదేశించు వీటిలోను సమగ్రమైన సంహితగా శ్రీపాద్మసంహితను ప్రాచీనుల నుండి అర్వాచీనుల వరకు

ఆదరించుట లోకవిదితమే కావున మొదట పాద్మ సంహితను ఆధారముగా చేసుకొని చర్చించబడును.

జ్ఞాన పాదముననుపదేశింపబడిన రీతి–తన స్వరూపమును అశక్తతను–పరమాత్మ స్వరూపమును–సర్వశక్తిమత్వమును. ఆశ్రయించుటకాతని కన్న వేరొక దిక్కులేదని తెలిపి ఆశ్రయించకుండా ఉండలేని స్థితిని కలిగించు ఈ ప్రేరణద్వారా ఆశ్రయించవలసిన ఉపాయ రూపమును యోగ పాదము ద్వారా ఏర్పడగలదు. యోగము ద్వారా స్థిరచిత్తమును ధ్యానము, ధారణ, సమాధిస్థితికి చేరవచ్చును. కాని ఇది కేవలము ఒక వ్యక్తికే పరిమితమగుచున్నది. అట్లుగాక క్రియాపాదము వలన భగవంతుని దివ్యమంగళ విగ్రహమును అందరూ దర్శించు విధముగా ఆలయ ప్రాకార మండపముల నిర్మాణము, అందుకు కావలసిన ఉపకరణములను ద్రవ్యములను సాధనసంపత్తిని కలుగజేసి అప్రయత్నముగనే భగవానునియందు రుచి కలిగించును. చర్యాపాదమువలన ఇతర విషయములందు ఆసక్తి కలుగకుండ ఉదయము లేచినది మొదలు రాత్రి వరకు భగవత్కైంకర్యము నందభిలాషను పెంచి వివిధ రూపములుగా సేవించుటకు వీలైన ఆరాధనాపద్ధతులను అందు జరిగిన లోపములకు సమాధానములను తెలిపి శ్రీమద్భగవద్గీతయందు పరమాత్మనాశ్రయించుటకు కావలసిన మార్గములన్నియు అనగా జ్ఞానం– "సర్వం జ్ఞాన ప్లవేనైవ వృజినం సంతరిష్యసి" జ్ఞానమాత్ర ఫలమును "స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధింవిందతి మానవః'' అని తన యనుష్ఠానముచే–ఆరాధనాదులచే మోక్షప్రాప్తిని, వివిధములైన భగవన్మూర్తులను ఆరాధించుటచే "జన్మకర్మ చ మే దివ్యం ఏవం యోవేత్తి తత్త్వతః త్యక్త్వా దేహం పునర్జన్మనైతి, మాం ఏతి" అన్నట్టి అవతార రహస్య జ్ఞానముచే మోక్షప్రాప్తి కలదనియు జ్ఞాన, యోగములవలన సాధకుని కొక్కనికే లభించు పరమపురుషార్థము–ఆలయ నిర్మాణాదులు గావించిన యజమానుల కును అందున కుపకరించిన సేవక బృందమున కును– ఉత్సవాదులు సేవించు సాధారణ జనులకును మోక్షము కరతలామలకమనియు ఆలయ నిర్మాణాదులు జరిపించి అర్చక, పాచక, పరిచారకులను పోషించు యజమానుని పూర్వ తరములవారును తరువాతతరము వారును నిస్సందేహముగా మోక్షమునొంద గలరని మోక్షమొక్కటియేగాక ఆనుషంగికముగా ఐహిక పుత్ర, పౌత్రాది, సౌభాగ్య, సంపదల పొందుదురని శాస్త్రప్రయోజనము సర్వలోక హితమునకై ఉపదేశింపబడినది.

ఇక సంహితాధారముగా వివిధ ఉపదేశము లను ఆచారములను తెలుసుకొనగలము.



## అభినందనలు

భక్తినివేదన పాఠక కుటుంబాన్ని మరింత పెంచేందుకు కృషి చేస్తున్నవారిలో **శ్రీమాన్ సురభి తిరుపతిరావు**గారు ఒకరు. వీరు కామారెడ్డి వికాసతరంగిణిశాఖ సభ్యులు. వీరికి శ్రీశ్రీశ్రీస్వామి వారు అనేక మంగళాశాసనములు కృపచేయు చున్నారు.



# ఇతిహాసబోధ -20(4)

శ్రీస్వామివారు 'వికాసతరంగిణి'ని ఏర్పరచి పుష్కరకాలం గడిచింది. వారి మహోన్నతవ్యక్తిత్వానికి ఆకర్షితులవ్వై వేలాది మందిమి వికాసతరంగిణి ఛత్రం క్రిందికి చేరి కార్యక్రమాలను చేస్తున్నాము. స్వామి లోకహితాన్నికోరి కార్యక్రమాలందిస్తున్నారు. వారిపట్ల భక్తివిశ్వాసాలతో వాటిని ఆచరించే ప్రయత్నం చేస్తున్నాము. తత్ఫలితంగా 'గీతాజ్యోతి' సందేశం పన్నెండువేల గ్రామాలకు పైగా చేరింది.

మన ప్రయత్నాలు మరింతగా ఫలవంతం కావాలంటే కార్యకర్తలుగా మనల్ని మనం సవరించుకోవాలి. మనకు శ్రీస్వామివారి పట్ల, దైవంపట్ల భక్తిశ్రద్ధలుండటం సత్యమే అయినప్పటికీ, మన సంకల్పాలు ఆలోచనలు, ప్రయత్నాలు మన 'పరమలక్ష్యం' దిశగా దృఢతరం కావాల్సిన అవసరం ఎంతో ఉంది.

మనలో మాధవుని పట్ల సమర్పణ భావం, సేవకభావం సక్రమంగా వికసించడానికి వీలైన పద్ధతులను గుర్తించి, వాటిని అభ్యసించాల్సి ఉంది. అలాగే మన సాధనను బలహీనపరిచే, భ్రమలకు, ప్రలోభాలకు గురిచేసే తప్పుడు భావనలను గుర్తించి వాటిని తొలగించుకోవాల్సి ఉంది. కార్యకర్తలుగా మనం అంతర్గతంగా ఈ రెండురకాల ప్రయత్నాలను నిరంతరం కొనసాగించగలిగినప్పుడే మన అడుగులు "మాధవసేవగా–సర్వప్రాణి సేవ" దిశగా ముందుకు వెళతాయి.

మనవల్ల ఇతరులుగాని, ఇతరులవల్ల మనం కాని ''క్షోభ'' చెందని విధంగా 'మనోవాక్కాయ కర్మల'ను సంయమన పరచి "క్షాంతి"ని అభ్యసించడం మన వికాసానికి అత్యంత అవసరం.

మన మనస్సుకు సంబంధించిన భావోద్వేగాలు ప్రధానంగా మూడు రకాలుగా ఉంటాయి. మొదటిది ఇష్టతకు సంబంధించిన రాగభావనలైతే రెండవది అయిష్టతకు సంబంధించిన ద్వేషభావనలు. మూడవది తటస్థ భావనలు. ప్రాపంచిక దృశ్యాలు, సంఘటనలు మన మనస్సులపై 'త్రివిధం'గా తమ ప్రభావాన్ని చూపిస్తూ ఉంటాయి. మానసిక భావోద్వేగాలు వాక్కుపైన, కర్మలపైన తమ ప్రతాపం చూపుతాయి.

సమాజాన్ని భగవత్స్వరూపంగా సేవించి, ప్రేమించి, ఆరాధించాలనుకునే వారెవ్వరికైనా 'ఏకాగ్రదృష్టి' ఉండాలి. కనిపించే దృశ్యాలు, వినిపించే శబ్దాలు, తనకు ఖేదాన్నో, మోదాన్నో కల్గించేవే అయినా, అతడు మాధవుని వైపే తన అంతఃకరణాలను స్థిరంగా ఉంచాలే తప్ప రాగద్వేషాల ప్రవాహానికి కొట్టుకుపోకూడదు.

ఈ దిశగా మనం మన సాధనను ముందుగా 'వాక్ సంయమనం'తో ప్రారంభించాల్సి ఉంటుంది. లోక హితాన్ని కోరి దైవసేవకునిగా సమాజ కార్యాన్ని చేపట్టే వ్యక్తి తన వాక్కును సంబాళించుకోలేకపోతే అది అనర్థాలకే దారి తీస్తుంది. మనం శబ్దాలను యథేచ్ఛగా వినియోగిస్తుంటాము. అసత్యాలు, అతిశయోక్తులు, తెలివితక్కువ పలుకులు,

మూర్ఖ ప్రలాపాలు, గొప్పలు చెప్పుకోవడాలు, పరుష వాక్యాలు, నిందావాక్యాలు.... ఇలా ఎన్నో దోషాలతో మన వాక్ప్రవాహం వృధాగా సాగుతుంది. ఎలా పడితే అలా మాట్లాడటానికి అలవాటు పడ్డ మనకు "వాక్సంయమనాన్ని" అభ్యసించడమంటే కాస్త ఇబ్బందే అయినప్పటికీ మన వికాస అవసరాల దృష్ట్యా 'తప్పనిసరి' అని మనం గ్రహించాల్సి ఉంది.

దూషించడానికి తగిన పరిస్థితులు ఉన్నాయని నిర్ధారణ అయినప్పటికీ తొందరపడకుండా భావోద్వేగాన్ని నిగ్రహించుకుని వాక్పారుష్యాన్ని నివారించుకోగలిగినప్పుడు మన వాక్కుకు "లోక హితకర శక్తి" లభిస్తుంది.

ఇతరుల లోపాలను, దోషాలను గుర్తించి, సంస్కరించడం కోసం "వాక్పారుష్యమే" సరైన మార్గమని నమ్మే వారెన్నడూ మాధవుని సేవకులుగా నిలువలేరు. మాధవుడిని మనస్సులో నిలుపుకున్న వారి మాట సదా మాధుర్యంతోనూ, ప్రసన్నత్వంతోనూ తొణికిసలాడుతుంటుంది. నన్ను అవమానించడంకోసం కాక నా హితం కోసం ఇతడు మాట్లాడుతున్నాడ"నే విశ్వాసాన్ని తన ప్రేమ పూరితమైన పలుకుల ద్వారా ఎదుటి వ్యక్తిలో కలిగించి హృదయ పరివర్తనాన్ని, సదవగాహనను నిర్మాణం చేయగలశక్తిని మాధవసేవకుడు తన వాక్కుకు సంప్రాప్తింపచేసుకోగలగాలి.

అలా 'వాక్కు'ను జాగ్రత్తగా వినియోగించుకోలేనినాడు వశిష్ఠుడంతటి బ్రహ్మర్షికూడా ఎంతటి ఇక్కట్లకు గురికావలసి వచ్చిందో ఈ "ఇతిహాసబోధ"లో తెలుసుకుందాం!

కోసలరాజ్యాధిపతి మిత్రసహుడు భగీరథునికి ఆరవతరం వాడు. నిషధదేశాధిపతి నలచక్రవర్తి రాజ్యాన్ని కోల్పోయిన సమయంలో అతనికి 'అక్షహృదయ విద్య'ను బోధించి ఆదుకున్న ఋతుపర్ణమహారాజుకు ప్రపౌత్రుడు. సుదాసునికి పుత్రుడు కావడంచేత 'సౌదాసుని'గా లోకప్రసిద్ధి గాంచాడు. ఇక్ష్వాకు వంశపు రాజుల ప్రతిష్ఠను ఇనుమడింపచేసే విధంగా పెద్దల ఎడల వినయ విధేయతలతో, బలపరాక్రమాలతో ధర్మం తప్పక రాజ్యపాలన చేస్తూ అందరి మన్ననలను పొందాడు మిత్రసహుడు.

ఒకనాడు రాజు మృగయా వినోదార్థం వేటకు వెళ్ళాడు. కామరూపధారులైన రాక్షసులు ఇరువురు ఆ అడవిలో పులుల రూపంలో సంచరిస్తూ మిత్రసహునికి ఎదురుపడ్డారు. మిత్రసహుడు శరాన్ని సంధించి ఒక పులిని కూల్చాడు. రెండవపులి రాక్షసరూపం దాల్చి రాజుపై ప్రతీకారాన్ని తీర్చుకుంటానని హెచ్చరించి మాయమైంది.

అడవినుండి వచ్చాక రాజు ఆ సంఘటనను విస్మరించి యధాప్రకారం రాచకార్యాలలో మునిగి పోయాడు. సహచరుడిని కోల్పోయిన రాక్షసుడు రాజును వంచనతో తగిన విధంగా దెబ్బతీయడానికై సమయం కోసం ఎదురుచూస్తున్నాడు.

సౌదాసుడు తన పూర్వీకులవలె మహా వైభవంగా యజ్ఞాన్ని నిర్వహించాలని సంకల్పించి కులగురువైన వశిష్ఠుడిని ఆహ్వానించాడు వశిష్ఠుడు శిష్యునిపై ఆదరంతో శాస్త్రీయంగా యాగాన్ని అందరూ ఆనందించే విధంగా నిర్వహించసాగాడు. అది యాగ పరిసమాప్తికావడానికి చివరిరోజు.



వశిష్ఠుడు ఎప్పటిలాగానే అనుష్ఠానానికి వెళ్ళిన సమయం కనిపెట్టి శార్దూల రాక్షసుడు వశిష్ఠుని వేషం ధరించి, రాజును తనకు మాంస భోజనాన్ని సిద్ధంచేయవలసిందిగా ఆజ్ఞాపించాడు. ఆచార్యుని ఆజ్ఞను స్వీకరించిన సౌదాసుడు వంటవారిని మాంసభోజనాన్ని సిద్ధం చేయమన్నాడు. ఈలోపు రాక్షసుడు వంటవాని వేషం ధరించి వధ్యస్థానంలో లభించిన నరదేహంనుండి మాంసాన్ని గ్రహించి భక్ష్యం తయారుచేసి స్వర్ణపాత్రలో భద్రంచేసి వద్దనకు సిద్ధంచేసాడు.

యధాప్రకారం నిజ వశిష్ఠుడు అనుష్ఠానానంతరం భోజనానికి సిద్ధమయ్యాడు. రాజదంపతులు స్వయంగా గురువుగారికి వడ్డించడానికి సిద్ధమయ్యారు. భోజనం ముందు కూర్చున్న వశిష్ఠునికి నంజుడుకై నరమాంసం వడ్డించబడడంతో మతిపోయింది.

అతనికి సౌదాసునిపై విపరీతమైన ఆగ్రహం వేసింది. క్రోధంతో మండిపడుతూ. "ఓరీ! దురాత్మా' రాజుననే దురహంకారంతో ఎంతటి నీచానికి ఒడికట్టావో అర్థమౌతున్నదా? కేవలం పండ్లు, పాలూ స్వీకరిస్తున్న నాకు నిషిద్ధాహారాన్ని, అందులోనూ నరమాంసాన్ని వడ్డిస్తావా? నీ పాపానికి తగిన ప్రతిఫలాన్ని అనుభవించెదవుగాక! రాక్షసుడివై నరమాంస భక్షకునిగా మారి నికృష్ట జీవనం గడిపెదవు గాక"! అంటూ సౌదాసునిపై శాపజలాలను చల్లాడు వశిష్ఠుడు.

సౌదాసుడు తెల్లబోయాడు. "గురువర్యా! తమరు కోరిన విధంగా మాంస భోజనాన్ని సిద్ధంచేసిన నాకు ఈ నిష్ఠుర శాపం తగునా? నిరపరాధినైన నన్ను శపించడం న్యాయమా"? అంటూ ఆచార్యుడిని నిలదీసాడు.

రాజు సమాధానం విన్న వశిష్ఠుడు సమాధి నిష్ఠుడై యోగదృష్టితో సత్యం తెలుసుకొన్నాడు. జరిగిన కార్యంలో రాజుదోషం ఏమాత్రమూ లేదని అతనికి అర్థమైంది. తొందరపాటుతనంతో కంటికి కనిపించిన దానినే సత్యంగా విశ్వసించి, వాక్పారుష్యాన్ని ప్రదర్శించి నందుకు వశిష్ఠుడు లోలోపల చింతించాడు.

"నాయనా! సౌదాసా! నీవన్నదే సత్యం! దోషం నీదికాదు. శాపాన్ని వెనక్కి తీసుకోలేను. రాక్షసత్వం, నరమాంస భక్షణం పన్నెండు సంవత్సరాలపాటు తప్పదు. ఆ తర్వాతే శాపవిమోచనం" అన్నాడు వశిష్ఠుడు.

గురువుగారు అనాలోచితంగా ఆగ్రహించి, నిరపరాధినైన తనను నరమాంస భక్షకుడైన రాక్షసుడివి కమ్మనమని శపించడం, ఆ శాపాన్ని ఉపసంహరించుకోలేక పన్నెండు సంవత్సరాల కాలపరిమితిని విధించడం మిత్రసహునికి ఆవేదన కల్గించింది.

నిష్కారణంగా తనను ఇక్కట్ల పాలుచేసిన వశిష్ఠుడు కూడా తగిన ఫలాన్ని అనుభవించాలని నిశ్చయించి మిత్రసహుడు నీటిని చేతిలోనికి తీసుకొని గురువును శపించడానికి సిద్ధమయ్యాడు.

పట్టమహిషి మదయంతి భర్త మనోగతాన్ని గ్రహించి వారించింది. "మహారాజా! వశిష్ఠుడు మనకు దైవంతో సమానం. వారు తొందరపడ్డారని తమరూ తొందరపడడం తగదు. కులగురువులను తూలనాడిన అపకీర్తిని తాము మూటకట్టుకోకండి" అంటూ మిత్రసహునికి నచ్చచెప్పింది. మనస్సులో చెలరేగుతున్న ప్రతీకారేచ్ఛతో కూడిన భావో

ద్వేగాన్ని విజ్ఞతతో అణచివేసాడు మిత్రసహుడు. చేతిలోకి తీసుకొన్న శాపజలాలను ఎక్కడ విడిచినా లోకానికి అపకారం జరుగుతుంది కనుక ఆ శాపజలాలను తన పాదాలపైనే పోసుకున్నాడు. శాపజలాల తీవ్రతకు అతని పాదాలు కమిలిపోయాయి. ఆ క్షణం నుండి అతడు "కల్మషపాదుడ"య్యాడు.

గురువుకి తన తొందరపాటుతనం, శిష్యుని సంయమనం రెండూ స్పష్టంగా తెలిసి వచ్చాయి. విశ్వామిత్రుడు కల్మషపాదుని ఉదంతాన్ని వశిష్ఠునిపై ప్రతీకారాన్ని తీర్చు కోవడానికి వీలుగా మలచుకోవాలని నిశ్చయించుకొన్నాడు.

వశిష్ఠుని శాపం ఫలరూపంలో సిద్ధించడానికి, అది వశిష్ఠునికే కష్టాన్ని తెచ్చిపెట్టే విధంగా మలచడానికి విశ్వామిత్రుడు తన ప్రజ్ఞను ప్రదర్శించాడు.

కల్మషపాదుడుగా మారిన మిత్రసహుడు యధాప్రకారం ఒకరోజు వేటకు వెళ్ళి అలసి తిరుగు ప్రయాణంలో ఉండగా ఓ ఇరుకుదారిన అతడికి "శక్తి" ఎదురు పడ్డాడు. శక్తి వశిష్ఠుని నూర్గురు పుత్రులలో పెద్దవాడు. తపశ్శక్తి సంపన్నుడు. "బ్రాహ్మణుడిని కాబట్టి దారి విడవమంటాడు శక్తి. "నేను ఈ మార్గంలోకి ముందుగా వచ్చాను. కాబట్టి నాకు దారి విడిచి వెనుకకు మరలమంటాడు" రాజు.

వాగ్వివాదం ముదురుపాకాన పడింది. అక్కడే అదృశ్యరూపంలో ఉన్న విశ్వామిత్రుడు కల్మషపాదుడిని ఆవహించాల్సిందిగా కింకరుడనే రాక్షసుడిని ఆదేశించాడు. అసలే ఆకలి దప్పులతో, బడలికగా అసహనంగా ఉన్న రాజుకు, ఒకప్రక్క వశిష్ఠుని శాపఫలం, మరొక ప్రక్క విశ్వామిత్రుని కృషివల్ల మతిస్థిరం తప్పింది. దారికి అడ్డుగా ఉన్న మునిని తప్పుకోవలసిందిగా కొరడాతో మోదాడు.

"ఓరీ నరాధమా! రాక్షసునివలే నన్ను హింసించి, అవమానించిన కారణంగా నీవు రాక్షసుడివికా" అని శక్తి కల్మషపాదుడిని శపించాడు.

తనను శపించిన వాడు వశిష్ఠ పుత్రుడు శక్తి అని తెలుసుకోగలిగినప్పటికీ తెలివితెచ్చు కొని మిత్రసహుడు తప్పుమన్నించమని శక్తిని వేడుకున్నప్పటికీ ఫలితం లేకపోయింది.

వశిష్ఠ, శక్తుల శాపాలు, విశ్వామిత్రుని సంకల్పం అన్నీ కలసి మిత్రసహుడిని వివశుడిని చేసాయి. ఎప్పుడు అతనిలో రాక్షసుడు ఆవహిస్తాడో అతనికే తెలియని స్థితి.

రాక్షసావేశంతో అతడు అడవిలో వశిష్ఠుని ఆశ్రమానికి వెళ్ళి శక్తితో సహా వశిష్ఠుని నూర్గురు పుత్రులను భక్షించాడు. రాజుకు తన శాపం వల్ల ఏర్పడిన దుర్గతి, తనపుత్రవియోగానికే కారణమైంది.

వశిష్ఠునికి ఏం చేయాలో తోచలేదు. రాజు ధర్మాత్ముడు. తన తొందరపాటుతనం వల్ల నరమాంసభక్షకుడైన రాక్షసునిగా మారి అడవుల పాలయ్యాడు. అడవిలో ఉన్న తన పుత్రులు యముని పాలయ్యారు. నూర్గురు పుత్రులతో కళకళలాడుతున్న ఆశ్రమం ఈ రోజున స్మశాన సదృశమైంది. వశిష్ఠుని చిత్తం క్షోభకు గురైంది.

పుత్రుల జ్ఞాపకాలు అతని మనస్సును వికలం చేశాయి. అంతటి బ్రహ్మర్షికూడా సంయమనాన్ని, స్థిరత్వాన్ని కోల్పోయాడు. పోయిన పుత్రులకోసం అతడు పామరుడివలె



దుఃఖానికి వశుడయ్యాడు. పుత్రవియోగ చింతకార్చిచ్చులా అతడిని దహించి వేసింది. హృదయదౌర్బల్యంతో అతడు ఆత్మహత్యకు సిద్ధపడ్డాడు.

భయంకరమైన దావాగ్నిలో దూకి దేహాన్ని త్యజించే ప్రయత్నం చేశాడు. అయితే తపశ్శక్తి సంపన్నుడైన వశిష్ఠుడి దేహాన్ని మాడ్చివేసే శక్తి లేని అగ్నిదేవుడు అతనికి చల్లదనాన్నే అందించాడు. ఇలా లాభంలేదని మెడకో పెద్ద బండరాయి కట్టుకుని సముద్రంలోకి దూకాడు వశిష్ఠుడు. ఇంతటి ఋషిని ఇముడ్చుకునే శక్తి నాకు లేదని సముద్రుడు వశిష్ఠుడిని ఒడ్డుకు ఈడ్చివేసాడు.

మృత్యువు ఒడిలోకి చేరడానికి నిశ్చయించుకున్న వశిష్ఠుడు మేరుపర్వత శిఖరంనుండి క్రిందకి దూకాడు. అయినా అతని దేహానికి ఈషణ్మాత్రపు గాయం కూడా కాలేదు. ఇలా కాదనుకుని ఈసారి భయంకరమైన మొసళ్ళతో ప్రవహిస్తున్న నదిలోకి దూకటంతో ఆ నది భయపడి శతవిధాల పరుగెట్టి "శతద్రు" వని పేరు తెచ్చుకుంది. ఈ ప్రయత్నం కూడా విఫలం కావడంతో వశిష్ఠుడు పట్టుదలతో గట్టిగా తన దేహాన్ని త్రాళ్ళతో బంధించు కొని దూకాడు. ఆ నది వశిష్ఠుని పాశాలను త్రెంచి వొడ్డుకు చేర్చింది. తాను "విపాశ"గా ప్రసిద్ధికెక్కింది.

ఇలా పలుమార్లు దేహ పరిత్యాగానికై వశిష్ఠుడు విఫలప్రయత్నం చేసాడు. 12 ఏళ్ళ సుదీర్ఘ కాలం అటు వశిష్ఠునికీ, ఇటు మిత్ర సహునికీ బాధాకరంగా గడిచింది. విషాదంతో చేసేది లేక ఆశ్రమానికి చేరిన వశిష్ఠునికి శక్తి భార్య తనకు కోడలు అయిన అదృశ్యంతి గర్భం నుండి వేదనాదం సుస్వరంతో మధురంగా వినిపించడంతో ఆశ్చర్యచకితుడయ్యాడు.

పన్నెండేండ్లు తల్లి గర్భంలో నిలచి, సకల వేదాలను శ్రవణం ద్వారా మననం చేసి అభ్యసించిన తన మనుమడి విషయం తెలియగానే వశిష్ఠునికి బ్రతుకుపై ఆశ కలిగింది. గర్భవతియైన కోడలిని రక్షించడానికై నిశ్చయించుకొని మరణ ప్రయత్నం మాని ఆశ్రమవాసి అయ్యాడు. కల్మషపాదుడు యధా ప్రకారం రాక్షసావేశంతో వశిష్ఠుని ఆశ్రమానికి విచ్చేసాడు. అదృశ్యంతి భయపడి వశిష్ఠుని చాటుకు చేరింది.

వశిష్ఠుడు తన తపోజలాలతో కల్మష పాదుడిని శాపవిముక్తుడిని చేసి కోసలకు పాలకుడిని కావించాడు. అదృశ్యంతి ఆ తర్వాత మగశిశువకు జన్మనిచ్చింది. పరాసువు (మరణిండానికి సిద్ధంగా ఉన్న) వశిష్ఠునికి జీవితాశను కల్పించిన శిశువు కనుక ఈ బిడ్డ "పరాశరుడి"గా లోక ప్రసిద్ధిగాంచాడు. మహాభారతాన్ని, బ్రహ్మసూత్రాలను, అష్టాదశ మహాపురాణాలను రచించిన వేదవ్యాసుడు ఈ పరాశరుని సంతానమే.

తొందరపాటుతనంతో, సంయమనాన్ని కోల్పోయి వాక్పారుష్యంతో వ్యవహరించడం వల్ల వశిష్ఠుడంతటి వాడు ఎన్ని ఇబ్బందులకు గురి అయ్యాడో ఈ "ఇతిహాసబోధ"లో మనం గమనించాం.

వాక్పారుష్యం వల్ల జరిగిన దుష్పరిణామాలు వశిష్ఠునికి పుత్రశోకాన్ని, పర్యవసానంగా ఆత్మహత్య దశకు కూడా ఈడ్చుకు వెళ్ళాయి. బ్రహ్మర్షికి పట్టిన ఈ గతిని తెలియజేస్తూ మన మాటతీరును మార్చు కోవాల్సిందిగ బోధిస్తూ ఇతిహాసం మనల్ని హెచ్చరిస్తుంది.

# BHAKTHI NIVEDANA

PHILOSOPHICAL MONTHLY

C/o. JET, Sitanagaram, Guntur Dt., Andhra Pradesh - 522 501.

**Hon. Editor H.H. Sri Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamy**

## *FORM IV*

(See rule 8)

| | | | |
|---|---|---|---|
| 1. | Place of publication | : | Sitanagaram, Guntur Dist.,Andhra Pradesh. |
| 2. | Periodicity | : | Monthly |
| 3. | Printed by | : | T.P. Sreeramachandracharyulu<br>S/o. Sitaramacharyulu, 7-48, Brindavani<br>Visakhapatnam-530 028. |
| 4. | Published by | : | T.P. Sreeramachandracharyulu |
| | Nationality | : | Indian |
| | Address | : | S/o. Sitaramacharyulu, 7-48, Brindavani,<br>Visakhapatnam-530 028. |
| 5. | Owned by | : | H.H. Sri Sri Sri Tridandi Chinna<br>Srimannarayana Ramanuja Jeeyar<br>Swamiji |
| 6. | Printed at | : | Sriman Printers & Processers, Sitanagaram,<br>Tadepalli (Mdl), Guntur Dist.,<br>Andhra Pradesh - 522 501 |
| 7. | Published at | : | Sitanagaram, Guntur Dist.,<br>Andhra Pradesh. |
| 8. | Editor | : | T.P. Sreeramachandracharyulu |
| | Nationality | : | Indian |
| | Address | : | S/o. Sitaramacharyulu, 7-48, Brindavani<br>Visakhapatnam-530 028. |
| 9. | R.N.I.No. | : | 52762/91 |

I T.P. Sreeramachandracharyulu, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Sd/-

***T. P. SREERAMACHANDRACHARYULU***






# బదరికాశ్రమంలో పునర్నిర్మించే సత్సంగసదనమునకు విరాళాలు సమర్పించిన దాతలు

**మహారాజ పోషకులు:**

**శ్రీమతి చలసాని సుశీల–గుడివాడ**

**రాజ పోషకులు**:

**రామానుజ దాసి–విశాఖపట్నం, శ్రీమాన్ మాధవరావు– ఖమ్మం, శ్రీమతి బి. లత–హైదరాబాద్, శ్రీమాన్ మాధవరావు–ఖమ్మం, శ్రీమాన్ కె. మాధవరావు–విశాఖపట్నం, శ్రీమాన్ కె. పాండురంగ–విశాఖపట్నం.**

**పోషకులు**:

**శ్రీమాన్ వేమారెడ్డి శ్యామసుందర్‌రెడ్డి–వరగలి, శ్రీమాన్ వై. కృష్ణారెడ్డి–కరీంనగర్, శ్రీమాన్ వై.వి.ఎస్. భానుమూర్తి–హైదరాబాద్, శ్రీమతి ఎమ్. హైమవతి–తాడేపల్లి గూడెం, శ్రీమతి ఎస్. అచ్చుమ్మ–హైదరాబాద్, శ్రీమాన్ ఇ. వేణుగోపాలా చారి–హైదరాబాద్, శ్రీమాన్ ఎన్. పూర్ణచంద్ర రావు–విజయవాడ.**

**జీవిత సభ్యులు**:

శ్రీమాన్ టి. రామారావు, మహాలక్ష్మి–ఒంగోలు, శ్రీమాన్ ఎమ్.రఘుపతిరావు, రమాదేవి–ప్రొద్దుటూరు, శ్రీమాన్ అక్కిరాజు వెంకటేశ్వర్లు, అనసూయ–చెన్నై, శ్రీమాన్ బి.మహదేవుడు, మంగాయమ్మ–హైదరాబాద్, శ్రీమాన్ ఎస్. ఎన్నయ్య శెట్టి, లక్ష్మీదేవమ్మ–డోన్, శ్రీమాన్ కె.నరసింహ గుప్తా–డోన్, శ్రీమతి కె. యశోదమ్మ–డోన్, శ్రీమాన్ లక్ష్మణస్వామిశెట్టి, నరసమ్మ–డోన్, శ్రీమాన్ కె. వెంకట సుబ్బయ్య, సుబ్బరత్నం–డోన్, శ్రీమాన్ భూపతి శ్రీనివాసరావు–శ్రీకాకుళం, శ్రీమాన్ వి.వెంకటప్పారావు–దూబచర్ల, శ్రీమాన్ చిన్ని రాధా కృష్ణ–గుంటూరు, శ్రీమాన్ కె. వెంకట్రావు, రమాదేవి–విజయవాడ, శ్రీమాన్ సత్యశ్రీ హనుమంతరావు–విస్సన్నపేట, శ్రీమాన్ వి.ఎస్.వి. సముద్రరావు–హైదరాబాద్, శ్రీమాన్ చిన్నం శ్రీరాములు–జగ్గయ్యపేట, శ్రీమాన్ బి.వెంకట రమణారావు–కొండమంచిలి, శ్రీమాన్ వి.విశ్వేశ్వర రావు, సీతామహలక్ష్మి–హైదరాబాద్, శ్రీమతి జి. భాగ్యలక్ష్మి–కాకినాడ, శ్రీమాన్ కె. సీతారామారావు, లక్ష్మి–హైదరాబాద్, శ్రీమతి ఎమ్. నాగమణి–విజయవాడ, శ్రీమాన్ ఎల్. లక్ష్మినారాయణ, మంజులాల్–మహబూబ్‌నగర్, శ్రీమాన్ కె. నాగేశ్వరరావు–చీమకుర్తి, శ్రీమతి బి. రమాదేవి–ఒంగోలు, శ్రీమతి ఐ. వెంకటలక్ష్మి– వినుకొండ, శ్రీమాన్ ఎన్. విద్యాసాగర్– సికింద్రాబాద్, శ్రీమాన్ కె.వి. సత్యన్నారాయణ మూర్తి–కాకినాడు, శ్రీమాన్ వై. కోటేశ్వరరావు, హైమవతి–ఖమ్మం, శ్రీమాన్ ఇ. కోటేశ్వరరావు–ఖమ్మం, శ్రీమాన్ పి. సుబ్బ రాయుడు, వీరమ్మ– నెల్లూరు.

**అభిమానులు:**

శ్రీమాన్ ఎ.పార్థసారధి, రాధ–విశాఖపట్నం, శ్రీమతి ఆత్మకూరి శ్యామల–విశాఖపట్నం, శ్రీమాన్ కె. పార్థసారధి, కనకవల్లి–విశాఖపట్నం, శ్రీమాన్ జోషి, మంగమ్మ–హైదరాబాద్, శ్రీమాన్ జోషి, శంకరయ్య–హైదరాబాద్, శ్రీమాన్ ముక్తా కిరణ్‌కుమార్–హైదరాబాద్, శ్రీమాన్ రంగరాజు, శ్రీమాన్ ఎస్. కృష్ణారావు–హైదరాబాద్, కిలార్ అనుపమ–హైదరాబాద్, శ్రీమతి అపర్ణ, గౌతమ్ చంద్రుడు–హైదరాబాద్, శ్రీమాన్ టి. భువనేశ్వర రావు, నిర్మలాదేవి–గుంటూరు, శ్రీమాన్ కె.

పున్నారావు, విజయలక్ష్మి–విజయవాడ, శ్రీమాన్ రవీంద్రకుమార్, సుధాదేవి–గుంటూరు, శ్రీమాన్ పి. భవనప్రసాద్, కమలాదేవి–కాకినాడు, శ్రీమాన్ కె. ఉదయ్‌కుమార్–విశాఖపట్నం, శ్రీమాన్ కె. శివానందకుమార్–విశాఖపట్నం, శ్రీమాన్ సిహెచ్. వెంకటరామలింగేశ్వరరావు–జగ్గయ్యపేట, శ్రీమతి ఎమ్. సరస్వతి–విశాఖపట్నం, శ్రీమాన్ డి.వి. నరసింహాచారి, జానకి–హైదరాబాద్, శ్రీమాన్ బి. శ్రీరామమూర్తి–గుంటూరు, శ్రీమాన్ ఎమ్. వెంకటేశ్వర్లు, సుశీల– గుంటూరు, శ్రీమాన్ పగడాల వెంకటేశ్వరరావు–సికింద్రాబాద్.

**డి. కృష్ణంరాజు (ఖాజీపాలెం)వారి ద్వారా**

**రాజ పోషకులు** :

**శ్రీమాన్ బండారుపల్లి షణ్ముఖేశ్వరరావు–**
**హైదరాబాద్**

**జీవిత సభ్యులు**:

శ్రీమాన్ ఎస్. మహేశ్వరి–హైదరాబాద్, శ్రీమాన్ ఆర్. రాజేంద్రప్రసాద్‌రాజు, ప్రమీల–హైదరాబాద్, శ్రీమాన్ కె. శ్రీనివాస ప్రవీణ, రోజారాణి–హైదరాబాద్, శ్రీమాన్ పి. నాగరాజు,పార్వతి–బుద్దాం, శ్రీమాన్ డా॥ జి. శ్రీనివాసరాజు–గుంటూరు, శ్రీమతి దెందుకూరి సత్యవతి–ఖాజీపాలెం, శ్రీమాన్ దెందుకూరి కృష్ణంరాజు, సరస్వతి–ఖాజీపాలెం, శ్రీమాన్ మంతెన శివరామరాజు, కమల–ఖాజీపాలెం, శ్రీమాన్ మంతెన కృష్ణంరాజు, లీలావతి– ఖాజీపాలెం, శ్రీమాన్ కొత్తపల్లి వెంకటరామరాజు, గోరుట్ల సత్యన్నారాయణరాజు–ఖాజీపాలెం, శ్రీమాన్ రాజంరాజు, పద్మావతి–ఖాజీపాలెం,

**అభిమానులు:**

శ్రీమాన్ కొత్తపల్లి సూర్యనారాయణరాజు–ఖాజీపాలెం, శ్రీమాన్ కొత్తపల్లి పృద్విరాజు–ఖాజీపాలెం, శ్రీమాన్ కొత్తపల్లి నాగవర్ధనరాజు–ఖాజీపాలెం, శ్రీమాన్ దెందుకూరి సత్యనారాయణ రాజు, సరస్వతి–ఖాజీపాలెం, శ్రీమాన్ పెనుమెత్స కోటంరాజు, సుబ్బమ్మ–ఖాజీపాలెం, శ్రీమాన్ దెందుకూరి పెదనాగరాజు–ఖాజీపాలెం, శ్రీమాన్ కె. రామరాజు (ప్రిన్సిపాల్)–ఖాజీపాలెం, శ్రీమతి గోకరాజు జానకమ్మ–ఖాజీపాలెం, శ్రీమతి గోకరాజు ఆదిలక్ష్మి, సుబ్బరాజు–ఖాజీపాలెం, శ్రీమతి మంతెన జయమ్మ వెంకటపతిరాజు–ఖాజీపాలెం, శ్రీమతి కె. ఆండాళ్ళమ్మ జ్ఞాపకార్థం సీతమ్మగారు–ఖాజీపాలెం, శ్రీమతి మంతెన సుబ్బమ్మ జ్ఞాపకార్థం సరస్వతి–ఖాజీపాలెం, శ్రీమాన్ మంతెన లక్ష్మీపతి రాజు జ్ఞాపకార్థం ప్రభావతి–ఖాజీపాలెం, శ్రీమాన్ రుద్రరాజు అల్లూరయ్యరాజు–రామనగరం, శ్రీమాన్ రుద్రరాజు సత్యనారాయణరాజు–రామనగరం, శ్రీమాన్ మంతెన కోటంరాజు–రామనగరం, శ్రీమాన్ మంతెన మదనమోహనరాజు– రామనగరం, శ్రీమాన్ మంతెన వెంకటరామ రాజు– రామ నగరం, శ్రీమాన్ మంతెన కృష్ణంరాజు హరి కుమారి–ఖాజీపాలెం, శ్రీమతి చింతలపాటి కమల–రామనగరం, శ్రీమాన్ దెందుకూరి శ్రీనివాసరాజు–ఖాజీపాలెం, శ్రీమాన్ మంతెన వెంకట్రామరాజు, సీతమ్మ–బుద్దాం, శ్రీమాన్ మంతెన సూర్యసత్యనారాయణరాజు– బుద్దాం, శ్రీమతి పెనుమత్స మాధవి–బుద్దాం, శ్రీమతి దంతులూరి ఆండాళ్ళు–బుద్దాం, శ్రీమతి కూసం పూడి విమల–బుద్దాం, శ్రీమతి గొట్టుముక్కల ఉమ–బుద్దాం, శ్రీమతి లలిత సత్యనారాయణ రాజు–జి.ఎన్.పాలెం, శ్రీమతి సరళ సత్య నారాయణరాజు–అలకాపురం, శ్రీమాన్ పి. సత్యనారాయణరాజు, దివ్యసుందరి–కృత్తివెన్ను, శ్రీమాన్ పి. వెంకట్రామరాజు, శ్రీదేవి–కృత్తివెన్ను, శ్రీమాన్ మంతెన అచ్యుతరామరాజు–పిట్టలవాని పాలెం, శ్రీమాన్ గూడూరు వెంకట్రామయ్య–గణపవరం, శ్రీమతి వి. జానకి శ్రీనివాసరామకృష్ణం రాజు–హైదరాబాద్, శ్రీమాన్ వై. వెంకటేశ్వర రావు– హైదరాబాదు.



# శ్రీవైకుంఠ స్తవము

డా॥ పి.టి.జి. యతిరాజ సంపత్కుమారాచార్యులు, తిరుపతి

శ్రీరంగరాజస్తవ ప్రారంభమునందు పరాశర భట్టరువారు తమ తండ్రిగారయిన కూరేశులను ప్రణమిల్లుచు స్తుతించిన శ్లోకమిది. ఎవరి శ్రీసూక్తులు వేదకన్యయొక్క కంఠమునందు మంగళసూత్రము వంటివో, అటువంటి శ్రీవత్సచిహ్నమిశ్రులకు నమస్కరించుచున్నాను.

శ్రీభగవద్రామానుజులయందు, నిరంతర సేవా సహవాసము వలన, సకల శాస్త్రార్థముల సారమును లభించినట్టి శ్రీవత్సాంకమిశ్రులు మిక్కిలి దయగల వారై జీవలోకమును ఉజ్జీవింపజేయుటకు ముముక్షువులు తప్పక తెలుసుకొనవలసిన అర్థపంచకమును పంచస్తవమనెడి నెపముతో వివరించినారు. అర్థపంచకమనగా అయిదు విషయములు.

**ప్రాప్యస్య బ్రహ్మణో రూపం**
**ప్రాప్తుశ్చ ప్రత్యగాత్మనః।**
**ప్రాప్త్యుపాయం ఫలం ప్రాప్తేః**
**తథా ప్రాప్తివిరోధి చ ॥**

అని హారీతసంహితయనబడు పాంచరాత్ర గ్రంథమున చెప్పబడినట్లుగా, పొందబడునట్టి పరబ్రహ్మముయొక్క స్వరూపము, పొందెడి జీవుని యొక్క స్వరూపము, బ్రహ్మప్రాప్తికి తగిన ఉపాయము, బ్రహ్మప్రాప్తికి గల ఫలము, బ్రహ్మప్రాప్తికి గల అడ్డంకులు అను ఈ అయిదు విషయములయొక్క జ్ఞానమునే అర్థపంచక మందురు. దానిని కూరనాథులు శ్రీవైకుంఠస్తవము, సుందరబాహు స్తవము, వరదరాజ స్తవము, శ్రీస్తవము అనబడు పంచస్తవియందు వివరించియున్నారు. దీనిని ఆరంభించుచు సదాచార్యులయిన భగవద్రామానుజులకు నమస్కరించుచున్నారు. అదియే భగవద్రామానుజుల ప్రార్థనాశ్లోకముగా ప్రపన్నులందరికి తారక మంత్రమయినది.

**యోనిత్యమచ్యుత పదాంబుజ యుగ్మరుక్మ**
**వ్యామోహితస్తదితరాణి తృణాయమేనే ।**
**అస్మద్గురోర్భగవతోస్య దయైకసింధోః**
**రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥**

ఎల్లప్పుడు అచ్యుతుని చరణకమలములనెడి సంపదయందలి వ్యామోహముచే తదితరములయిన బాహ్య ప్రయోజనములన్నిటిని తృణీకరించినవారు. కృపామాత్ర ప్రసన్నాచార్యులు, దయాసముద్రులును అగు భగవద్రామానుజుల పాదములను అనిష్ఠములను తొలగించి అభీష్టములను సమకూరునట్టి ఉపాయముగా ఆశ్రయించుచున్నారు.

**త్రైవిద్యవృద్ధజనమూర్ధవిభూషణం యత్**
**సంపచ్చ సాత్త్వికజనస్య యదేవ నిత్యమ్।**
**యద్వా శరణ్యమశరణ్య జనస్య పుణ్యం**
**తత్ సంశ్రయేమ వకుళాభరణాంఘ్రియుగ్మమ్॥**

వేదవేత్తలయినవారికి శిరోమణివంటివాడును, సాత్త్వికులగు భక్తులకు ఇహలోకములోని సంపద వంటివాడును, అకించనులగు ప్రపన్నులకు రక్షకుడును, ఇష్టఫలములను అనుగ్రహించునట్టి పరమాచార్యులగు వకుళాభరణులను పేరుగల శఠకోపసూరులయొక్క దివ్యపాదారవిందములను సాధనముగా ఆశ్రయించెదను.

పరమాచార్యులగు పరాంకుశులయొక్క భక్తియే ప్రపన్నులగు శ్రీవైష్ణవులనందరిని తరింపజేయుచున్నదని శఠకోపులను స్తుతించుచున్నారు. ఇందు పరాంకుశులను పాలసముద్రముతో పోల్చి

వర్ణించుచున్నారు. సముద్రము అనేక నదుల ప్రవాహముతో నింపబడునట్లు పరాంకుశులును పరభక్తి–పరజ్ఞాన–పరమభక్తులను నదుల ప్రవాహములచే నిండియున్నారు. సముద్రము రత్నములకు నిధియయినట్లు పరాంకుశులు వేదార్థములను రత్నములకు ఆకరమైయున్నారు. క్షీరాబ్ధి శ్రీమన్నారాయణునికి నివాసస్థానమయినట్లు పరాంకుశులు నిరంతరభగవచ్చింతనచే తమ మనసున భగవంతుని నిల్పుకున్నారు. సముద్రునికి అవధిలేనట్లు పరాంకుశులును మహిమవిషయమున అవధిలేనివారయిరని శఠకోపులకు క్షీరాబ్ధిసామ్యమును తెలుపుచు వారు వర్ధిల్లవలెనని మంగళాశాసనము చేయుచున్నారు.

అనంతరము నాలుగు శ్లోకములచే భగవంతుని దివ్యమంగళవిగ్రహమును కీర్తించుచున్నారు. తత్త్వజ్ఞులయినవారు ఎవరిని లోకకళ్యాణకరునిగా వర్ణింతురో, స్వర్గాది చతుర్దశభువనములు ఎవరివలన కలుగుచున్నవో, తనతో సమమయినవాడు అన్యుడు లేనివాడెవడో అతనిని కీర్తింతును. పద్మపత్రముల వంటి నేత్రములుకలవాడు కాలముచే కొలవబడనివాడు, ఉపనిషత్తులచే ప్రతిపాదింపబడువాడు, పీతాంబరుడు, అందరికీ వరములనిచ్చువాడు, చల్లనిచూపులు కలవాడు, ఆజానుబాహుడు, విశాలములయిన కర్ణములు కలవాడు, నీలమేఘవర్ణుడు, ఉన్నతమగు ఛాతికలవాడు, వర్ణనాతీతుడు అగు లక్ష్మీపతి నాకు సాక్షాత్కరించుగాక!

సత్యమయినవాడు, నాశములేనివాడు, ఇంద్రియములకు గోచరించనివాడు, ఊహకందనివాడు, వర్ణనాతీతుడు, నామరూప విభాగములు లేనివాడు, తరగని కళ్యాణ గుణములు కలవాడు, అందరికంటె అధికుడు, ఈ లోకముల కన్నిటికి ప్రభువు, నిరవకాశమగు అణువునందున ప్రవేశింప శక్తిగలవాడు, విశ్వమంతట నిండియుండ గలవాడునగు విష్ణువును స్తుతింతము.

వేదశీర్షములయందు పూర్వాచార్యుల శిరములయందును ప్రకాశించువాడునగు భగవంతుడు జ్ఞానపూర్తిలేని తనవంటివాని మాటలకు గోచరించుటయనునది భగవంతునియొక్క ఆశ్రితవాత్సల్యమని తలచెదను అని కూరనాథులు తమ యశక్తిని, అజ్ఞానమును తలంచి నైచ్యానుసంధానము జేయుచున్నారు.

నన్ను నేను భగవంతుని వర్ణించు శక్తిలేనివానిని గాను, జ్ఞానములేనివానినిగాను ఎఱిగియును, భగవంతుని నిరవధికమగు మహిమను కొనియాడ ప్రయత్నించుటను గూర్చి సిగ్గుపడుటలేదు. అజ్ఞుడనగు నాచే అసమంజసముగ కీర్తింపబడినను సర్వజ్ఞుడగు భగవంతునకు ఏమీ కొరతయుండదు. తీర్థజలమని ఎరుగని శునకము దప్పికదీర్చుకొనుటకుగాను గంగలో నీరుత్రాగినంతమాత్రమున దానిని గంగాజలముకాదందురా? పిపాసువగు శునకము అందు సిగ్గుపడవలసినదేమి కలదు? అని తమ తక్కువతనమును తలచుచున్నారు. ఇంకనూ దైత్యారియగు దేవునియొక్క గుణములు ఇన్ని, ఇంతటివియని ఎంచుట మాటలకు మనసునకు అందనిది. అసంఖ్యాకములయిన భగవద్గుణములలో ఏ ఒక్కటియయిననూ నావంటివాని దుఃఖమును మాపజాలును. దప్పికగొన్న ఈగవంటి అల్పజీవికి సముద్రమునందలి ఏ ఒక్క జలబిందువయిననూ దప్పిక తీర్చగలదుగదా!

భక్తిపరవశులైన పూర్వాచార్యులెందరో భగవంతుని స్తుతించిరి. స్తుతించుటకు చేతకాని నేను నా పేలవములగు మాటలతో కీర్తించుట ప్రలాపమే యగును. కానీ ఈ నా స్తుతి భగవంతుని క్షమకు విషయము కాగలదు. యధాతథముగ కీర్తించలేకపోవుటయను ఈ నాయపరాధమును దండింపకుండుటయనునది భగవంతుని క్షమాగుణమనబడును అని వర్ణించిరి.



# ? సందేహాలు - సమాధానాలు 3

శ్రీమాన్ లక్ష్మీనారాయణ, వెంకట్రావుపల్లి, కరీంనగర్

ప్ర **చాతుర్వర్ణాలలో (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర) పద్మశాలి కులస్థులు ఏ వర్ణానికి చెందినవారు?**

జ. బహుశః వైశ్యవర్గంలోనికి చెందవచ్చు. వస్త్రాలు తయారీ, విక్రయాలు వీరి కార్యక్రమం గద!

ప్ర **చాత్తాద, గౌడీయ ఇలా శ్రీవైష్ణవంలో ఎన్ని శాఖలు ఉన్నాయి? వివరించ ప్రార్థన.**

జ శ్రీమహావిష్ణువును పరతత్త్వంగ విశ్వసించేవారంతా శ్రీవైష్ణవులే. చాలమంది శ్రీమహావిష్ణువును విశ్వసించినా ఆరాధించి, ఆశ్రయించే తత్త్వంగ వేరు వేరు వ్యక్తులను ఆశ్రయించారు. ఉదాహరణకు 'గౌడీయ' అనే వారంతా 5 శతాబ్దాల క్రితం అవతరించిన చైతన్య మహాప్రభువును భగవదవతారంగ ఆశ్రయించి, ఆపై వాటిని పట్టించుకోరు. అలానే స్వామినారాయణీయులు 3 శతాబ్దాల క్రిందట అవతరించిన శ్రీస్వామినారాయణుని భగవదవతారమని ఆపై వాటి జోలికి వారూపోరు. ఇలాంటి వర్గాలు చాలానే ఉన్నాయి. అవన్నీ వైష్ణవములే అని వారంటారు.

మనమూ రామానుజులవంటివారిని అవతార పురుషులనే అంటాం. అయితే వారినాశ్రయించి ఆపై వారిని వదిలివేయలేదు. పైగా వారే మనకు పరమాత్మకారు. పరమాత్మను పొందించు ఉత్తమసాధనము వారు. ఆచార్యపరంపరలో చేరిన వారు అవుతారన్నమాట. శ్రీకృష్ణుడు భగవదవతారమే. కొందరు ఈ అవతారాన్నే ఆశ్రయించి ఇక "మిగిలినవన్నీ ఇందులోంచే వచ్చాయి. ఇదే పరతత్త్వం" అంటారు. శ్రీకృష్ణుడు పరతత్త్వమే. కానీ ఆతడు నారాయణుని అనంతావతారాలలో ఒక అవతారం మాత్రమే. అయితే ఇది పరిపూర్ణావతారం". శ్రీమాన్ నారాయణుడనే మహానదిలోనికి దిగే అనేక రేవులలో కృష్ణావతారమనేది చాల ఉత్తమమైన రేవు" అని మన పెద్దలంటారు. ఆ నారాయణుడే మనకు గమ్యం. ఆతడే విష్ణువు. అవతారాలు రేవుల్లా మనకు సహకరిస్తాయి అందులో దిగి స్నానమాడటానికి. రేవే ప్రధానం కాదు. అలాగని రేవులేకుండా నదిలో దిగలేం కద! ఇది గుర్తించారు మన పెద్దలు. మొత్తానికందరూ వైష్ణవులే.

శ్రీమన్నారాయణ రామానుజ వేంకటదాసుగారు, గార్లబాయిగూడెం, నల్గొండ

ప్ర **లక్ష్మీ అష్టోత్తర స్తోత్రంలో నవదుర్గాం మహాకాళిం బ్రహ్మ విష్ణు శివాత్మికాం అని ఉంది. దుర్గా, కాళీ అంటే శైవదేవి కదా! లక్ష్మీ అమ్మకాపేర్లు ఎలా వచ్చినవి. ఈ శ్లోకార్థం తెలుపగలరు?**

జ 'దుర్గా' అంటే దుర్గమువలె భక్తులకు రక్షకురాలై ఉండేది. 'కాళీ' అంటే దుష్టులపాలిట భయంకరురాలై ఉండేది. పార్వతీదేవి ఆ పేర్లు పెట్టుకున్నా, లక్ష్మీదేవి తననాశ్రయించిన వారి పట్ల రక్షకురాలై ఉండి, భక్తులను హింసించేవారిని దండించేదై ఉంటుంది. బ్రహ్మ విష్ణుశివులనేసరికి మీకు సంశయమొచ్చి ఉంటుంది. కొందరు దీనిని మార్చి "నవ దుర్గాం మహాలక్ష్మీం బ్రహ్మారుద్రేంద్ర సేవితాం" అని పఠిస్తారు. అది మంచిదే. కానీ, ఈ పై పాఠం కూడా మార్చేయవలసిన అవసరమేమీలేదు. లక్ష్మీదేవికి దుర్గా, కాళీపేర్లు లేకపోలేదు. బ్రహ్మ, శివులమధ్య చేరి ఉండే విష్ణు శబ్దానికి 'ఇంద్రుడు' అనే అర్థము. ఇంద్రునికుండే పేర్లలో విష్ణుగూడ ఒకటి. వేదంలో చాలచోట్ల వాడే విష్ణు శబ్దానికి ఇంద్రుడనే అర్థాన్నే వైదిక మంత్రాలు తెలుపుతున్నాయి. అలానే విష్ణు శబ్దానికి సూర్యుడనిగూడ అర్థం. అంచేత బ్రహ్మ, రుద్ర, ఇంద్రుడు లేక సూర్యాది దేవతలకు ఉపాస్యురాలై ఉండునది అనే పై పదానికి కూడా అర్థం. శ్రీవిష్ణు సహస్రనామస్తోత్రంలో ఎన్నో పేర్లు శివునకు చెందినట్లుంటాయి. అసలు వాటి

అర్థము బట్టి చూస్తే అవి విష్ణువునకే వర్తించి ఆతనికి పేర్లైనాయి. తర్వాత రుద్రుడు ఆ పేర్లు ధరించాడు. రూఢిగ శివునికి వాడే సరికి, అసలర్థం తెలియక మనం కంగారు పడటం ప్రారంభించాం. ఈమధ్య కాలంలో చూడండి "ఇంద్ర" అనగానే సినిమా గుర్తొస్తోందే తప్ప పాపం! స్వర్గాధిపతి అనేది మరచారు. అలా!!

**ప్ర. మృత్యుంజయుడంటే శివుడేనని చాలమంది అంటున్నారు. అసలు భగంతుడు శ్రీమన్నారాయణుడుగదా మరి ఆయనను ఎందుకు మృత్యుంజయుడు అనరు?**

జ మృత్యువును జయించినవాడు 'మృత్యుంజయుడు'. భగవంతుడికి మృత్యువెదురయ్యే ప్రశ్నయే లేదు కనుక ఆయనకు దానిని జయించ వలసిన అవసరమూలేదు. ఆయనకంటే వేరైన వారంతా జీవులే. శివుడుగూడ పుణ్యాతిశయముగల ఒక జీవుడే తప్పవేరుగాదు. భగవదాజ్ఞాబద్ధుడై తన విధినిర్వహిస్తూంటాడు. అందుకే ఆయన 'పరమభాగవతోత్తముడు'గ కీర్తినందుకున్నాడు. భగవంతుని లీలలను సదాస్మరించుకుంటూ ఉంటాడట. భగవంతుని అనుగ్రహంతో ఒక బ్రహ్మకాలంలోని పూర్తిగ మన్వంతరమంతా ఆతడు జీవించి ఉంటాడు. అందుకే, తనకంటే అల్పకాలముండే మనుష్య, దేవతాదుల దృష్ట్యా ఆయన దీర్ఘకాలం మృత్యువునకు వశం కాకుండా ఉంటాడు గనుక, వారి అపేక్షయా మృత్యుంజయుడే తప్ప పూర్తిగ కాదు. మహాప్రళయంలో ఆ శివుడు గూడ వెళ్ళిపోవడం మార్కండేయముని చూచినట్లు శ్రీమద్భారతం చెప్తోంది. అలాంటి మృత్యుంజయులూ, చిరంజీవులూ ఇంకా చాలమందే ఉన్నారు మరి.

ఎమ్. విశ్వనాథం, హన్మకొండ.

**ప్ర "మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః "సర్వభూతములు నాయందున్నవి, నేను వాటియందులేను" అని భగవద్గీత 9వ అధ్యాయంలో ఉంటే ప్రహ్లాద చరిత్ర స్వామి సర్వాంతర్యామియని తెలుపుతోంది. వివరించ ప్రార్థన.**

జ గ్రంథం ముందు వెనుకలు చదువకుండా మధ్యలో ఒక్క పంక్తిమాత్రం చదివితే ఎలాగండీ! అదే ప్రహ్లాదచరితలో "భగవంతుడు లేడు" అనీ ఉంది. కానీ, అది హిరణ్యకశిపుని పలుకు. ముందు వెనుకలు గూడ చూడవద్దూ! ? 'అహమాత్మాగూడకేశ! సర్వభూతాశయస్థితః" సకల భూతముల మూలస్థానంలోపల నేనే ఉన్నాను'. 'మయిసర్వమిదం ప్రోతం' ఈ కన్పించు పదార్థాలన్ని లోపలనున్న నాయందే కూర్చబడి యున్నవి. రసోహమప్సుకౌన్తేయ.....! 'ప్రతీద్రవ్యములోనూ ఉండే ఆయా ద్రవ్యపు గుణములలో గూడ నేనే ఉండి, వాటికి ఆధారమౌతున్నాను. పదవ అధ్యాయమంతా, లోపల దేనిదేనిలో ఎలా ఉంటాడో వివరించుచున్నదే. "సర్వస్యచాహం హృది సన్నివిష్టః" అంటూ 15వ అధ్యాయమంతా, అందరి హృదయాలలో నేనుండటం వల్లనే తెలివంతా తెల్లవారుతోందని స్పష్టం చేసాడు గూడ. 'అహం వైశ్వానరో భూత్వా' 'నేనే ఆకలిగ ఉన్నాను కనుకనే ఇంత తిండి తినగలుగుతున్నారని' చెప్పిన వాక్యాలు ఒక్కసారి చదువుకోండి మరి!

కొన్ని పదార్థాలు లోపల ఉండేటపుడు బయట ఉండవు. బయట ఉండేవి లోపల ఉండవు. దేనిస్థానం దాని దానికి నియమితమై ఉంటుంది. కానీ నాకు అలాక్కాదు. నేను లోపలా బయటా గూడ ఒక్కేసారిగ ఉండగలను. అలా లోపలా బయటా కూడా ఉండే గాలీ, ఆకాశంలాంటివి తెలివిలేనివి, ఆజ్ఞాపించలేనివీను. కానీ నేను వాటికంటే విలక్షణంగ నియంత్రించగలను. అక్కడుంటూనే జగమంతా ఆజ్ఞాపించగలనుకూడా. అందుచేతనే వాటిలోపల నేనున్నా వాటి ఆధీనంలో వాటి పరిమితికి లోబడిపోయి నేనుండను సుమా! అని చెప్పడమే పై9వ అధ్యాయంలోని శ్లోక తాత్పర్యం.










# శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామనుజ జీయరు స్వామివారి పర్యటన వివరములు

| | |
|---|---|
| 1.4.04 | రాత్రికి తిరుమల ప్రయాణం |
| 2.4.04 | తిరుమల మకాం, శ్రీశ్రీవారి దర్శనం |
| 3.4.04 | తిరుమల |
| 4.4.04 | వరగలి (గూడూరువద్ద) బ్రహ్మోత్సవాల్లో పాల్గొనుట |
| 5.4.04 | వరగలి, రాత్రికి సోమశిల మకాం |
| 6.4.04 | సోమశిలలో ఆరాధన, తీర్థగోష్ఠి, రాత్రికి నెల్లూరు శ్రీమాన్ నిరంజన్‌గారి గృహంలో మకాం |
| 7.4.04 | నెల్లూరు చినబజారులో లక్ష్మీదేవాలయం ప్రతిష్ఠ ఉదయం గం.7.45ని॥లకు తదుపరి బుచ్చిరెడ్డిపాలెంలో శ్రీరామాలయ దర్శనం, గం. 11.45ని.లకు వృద్ధ ఆశ్రమం ప్రారంభోత్సవం. |
| 8.4.04 } 20.4.04 | కాకతీయ ఆగమపాఠశాల జగ్గయ్యపేట క్యాంప్ |
| 21.4.04 | సీతానగరం |
| 22.4.04 | ఉదయం సింహాచలం శ్రీవరాహలక్ష్మీనరసింహస్వామి చందనయాత్రకు ప్రయాణం |
| 23.4.04 | ఉదయం 12గంటల తరువాత బయలుదేరి నిమ్మకూరులో శ్రీమాన్ ప్రసాదు గారింట్లో గృహప్రవేశం. |
| 28.4.04 | రాత్రికి హైదరాబాదులో వెంగళరావు నగర్‌లో క్యాంప్. |
| 29.4.04 | శ్రీలక్ష్మీథియేటర్ ప్రారంభోత్సవం. శ్రీబాల్‌రెడ్డిగారు కర్మన్ ఘాట్, హైదరాబాదు. |
| 30.4.04 | సాయంత్రం ఉజ్జయినీ ప్రయాణం రాత్రికి ఇందూర్ క్యాంప్. |
| 1.5.04 | ఇందూర్ |
| 2.5.04 | ఇందూర్ నుండి ఉజ్జయినీ |
| 3.5.04 | ఉజ్జయినీ కుంభమేళాలో శ్రీవైష్ణవ సమ్మేళనంలో పాల్గొనుట. రాత్రికి ఇందూర్ చేరుట. |
| 4.5.04 | ఇందూరు నుండి ఉదయం 8గంటలకు ప్రయాణం న్యూఢిల్లి మార్గముగా ఋషీకేశ్ చేరుట. |
| 5.5.04 | ఋషీకేశ్ క్యాంప్ |
| 6.5.04 | బదరీప్రయాణం |
| 7.5.04 | బదరీ |
| 10.5.04 | బదరీ నుంచి సాయంత్రం ఋషీకేశ్ ప్రయాణం |
| 11.5.04 | ఋషీకేశ్ |
| 12.5.04 | ఋషీకేశ్ నుంచి న్యూఢిల్లీ మార్గముగా హైదారాబాద్ చేరుట. |

# గీతాజ్యోతి ధర్మక్షేత్రాల సమాచారం

## శ్రీవారు మార్చి మాసంలో దర్శించిన ధర్మక్షేత్రాలు, జరిగిన సేవలు

| | | |
|---|---|---|
| 1. | మొత్తం ధర్మక్షేత్రాలు | 4 |
| 2. | గ్రామాలు | 434 |
| 3. | మొత్తం పశువైద్య శిబిరములు | 5 |
| | చికిత్సపొందిన పశువుల సంఖ్య | 3,232 |
| 4. | పశువైద్య శిబిరముల మొత్తం ఖర్చు | 63,000 |
| 5. | మొత్తం దంతవైద్య శిబిరములు | 1 |
| | చికిత్స పొందినవారు | 120 |
| 6. | దంత వైద్య శిబిరముల మొత్తం ఖర్చు | 20,000 |
| 7. | నేత్రవైద్య శిబిరముల సంఖ్య | 6 |
| | చికిత్స పొందినవారు | 2,200 |
| 8. | నేత్రవైద్య శిబిరముల ఖర్చు | 67,000 |
| 9. | సాధారణ వైద్య శిబిరముల సంఖ్య | 20 |
| | చికిత్స పొందినవారు | 9,000 |
| 10. | సాధారణ వైద్య శిబిరముల ఖర్చు | 69,000 |
| 11. | మొత్తం వాలంటీర్ల సంఖ్య | 2,470 |
| 12. | మొత్తం పని గంటలు | 3,37,700 |
| 13. | కార్యక్రమానికి అయిన ఖర్చు | 16,98,500 |
| 14. | గీతాజ్యోతి ప్రతిజ్ఞచేసినవారు | 52,000 |
| 15. | గీతాజ్యోతి సందేశం అందుకున్న భక్తులు | 3,70,000 |

## శ్రీస్వామివారు దర్శించిన మొత్తం ధర్మక్షేత్రాల వివరములు

| | | |
|---|---|---|
| 1 | ధర్మక్షేత్రాల సంఖ్య | 55 |
| 2 | గ్రామాల సంఖ్య | 6,904 |
| | (కాలనీలు, వార్డులు, మారుమూల గిరిజనప్రాంతాలు) | |
| 3 | పశువైద్య శిబిరములు | 91 |
| | చికిత్స పొందిన పశువుల సంఖ్య | 54,249 |
| 4 | పశువైద్య శిబిరముల ఖర్చు | 12,59,100 |
| 5 | దంత వైద్య శిబిరములు | 89 |
| | చికిత్స పొందినవారు | 28,354 |
| 6 | దంతవైద్య శిబిరముల ఖర్చు | 3,03,335 |
| 7 | నేత్రవైద్య శిబిరముల సంఖ్య | 65 |
| | చికిత్స పొందినవారు | 20,832 |
| 8 | నేత్రవైద్య శిబిరముల ఖర్చు | 4,20,190 |
| 9 | సాధారణ వైద్య శిబిరములు | 125 |
| | చికిత్స పొందినవారు | 46,400 |
| 10 | సాధారణ వైద్య శిబిరముల ఖర్చు | 12,60,566 |
| 11 | వాలంటీర్ల సంఖ్య | 48,276 |
| 12 | పనిచేసిన గంటలు | 1,31,06,167 |
| 13 | కార్యక్రమమునకు అయిన మొత్తం ఖర్చు (మెడికల్ కాంపుల ఖర్చుతో సహా) | 4,73,16,078 |
| 14 | ప్రతిజ్ఞ చేసినవారు | 10,78,500 |
| 15 | గీతాజ్యోతి సందేశం అందుకున్న భక్తులు | 78,89,100 |

## శ్రీ స్వామివారు దర్శించాల్సిన ధర్మక్షేత్రాలలో కూడ జరిగిన కార్యక్రమ వివరములు

| | | |
|---|---|---|
| 1. | ధర్మక్షేత్రాల సంఖ్య | 53 |
| 2. | గ్రామాల సంఖ్య | 5,174 |
| 3. | పశువైద్య శిబిరములు | 49 |
| | చికిత్స పొందిన పశువుల సంఖ్య | 28,655 |
| 4. | పశువైద్య శిబిరముల ఖర్చు | 1,53,747 |
| 5. | దంతవైద్య శిబిరములు | 65 |
| | చికిత్సపొందినవారు | 34,151 |
| 6. | దంతవైద్య శిబిరముల ఖర్చు | 6,47,820 |
| 7. | నేత్రవైద్య శిబిరములు | 32 |
| | చికిత్స పొందినవారు | 13,176 |
| 8. | నేత్రవైద్య శిబిరముల ఖర్చు | 4,66,600 |
| 9. | సాధారణ వైద్య శిబిరములు | 124 |
| | చికిత్స పొందినవారు | 48,450 |
| 10. | సాధారణ వైద్య శిబిరముల ఖర్చు | 19,58,490 |



# గీతాజ్యోతి ధర్మక్షేత్రాల సమాచారం

## మొత్తం ధర్మక్షేత్రాలలో ఇంతవరకు జరిగిన కార్యక్రమాల వివరాలు

| | | |
|---|---|---|
| 1. | మొత్తం ధర్మక్షేత్రాలు | 110 |
| 2. | జిల్లాలు | 23 |
| 3. | పాల్గొన్న గ్రామాలు (కాలనీలు, వార్డులు, మారుమూల గిరిజన ప్రాంతాలు 318) | 12,078 |
| 4. | మొత్తం పశువైద్య శిబిరములు | 140 |
| | చికిత్సపొందిన పశువుల సంఖ్య | 82,904 |
| 5. | పశువైద్య శిబిరముల మొత్తంఖర్చు | 14,12,847 |
| 6. | మొత్తం దంతవైద్య శిబిరములు | 154 |
| | చికిత్స పొందినవారు | 62,505 |
| 7. | దంత వైద్యశిబిరముల మొత్తంఖర్చు | 9,51,155 |
| 8. | నేత్రవైద్య శిబిరముల సంఖ్య | 97 |
| | చికిత్స పొందినవారు | 34,008 |
| 9. | నేత్రవైద్య శిబిరముల ఖర్చు | 8,86,790 |
| 10. | సాధారణ వైద్య శిబిరముల సంఖ్య | 249 |
| | చికిత్స పొందినవారు | 94,850 |
| 11. | సాధారణ వైద్య శిబిరముల ఖర్చు | 32,19,056 |
| 12. | మొత్తం వాలంటీర్ల సంఖ్య | 75,440 |
| 13. | మొత్తం పనిగంటలు | 2,50,00,000 |
| 14. | మొత్తం పాఠశాలల సంఖ్య | 5,628 |
| 15. | విద్యార్థుల సంఖ్య | 8,06,464 |
| 16. | వాహనాల నిమిత్తము ఖర్చు | 40,82,878 |
| 17. | కరపత్రములు, ప్రతిమలు ఖర్చు | 37,77,013 |
| 19. | మొత్తం ఖర్చు | 5,84,02,626 |
| 20. | సందేశం అందుకున్నవారు | **5,00,00,000** |

## బదరీ జ్యోతిదర్శనము

**ఈ నెల 26వ తేదీన బదరీ విశాల్ పెరుమాళ్ ఆలయం తెరువబడుతుంది. ఆ రోజే జ్యోతి దర్శనం. జ్యోతి దర్శనానికి విచ్చేసే భక్తులందరికీ మన అష్టాక్షరీ క్షేత్రం స్వాగతం పలుకుతోంది.**

## పరమపద వార్త



శ్రీమాన్ **పాతాళం వేంకటేశ్వరరావు**గారు ది. **17.03.04**న పరమపదించారు. వీరు శ్రీస్వామివారి దగ్గర సమాశ్రితులు. వీరి కుమారులు శ్రీమాన్ పాతాళం సుబ్బారావుగారు బదరీ ట్రస్ట్ మెంబర్. వీరి గీతాజ్యోతిరథం కృష్ణావసంతోత్సవమునకు విశేషసేవలంది స్తోంది. ఈ రథసారధిగా అబ్దుల్‌కలామ్ తమ వంతు సహకారాన్ని అందిస్తున్నారు.

# శతక సాహిత్య-ఆవశ్యకత

డా॥ ఎ. లతాకుమారి, విజయనగరం

మానవుడు సంఘజీవి. తన వ్యక్తిగత ప్రవర్తనను, ప్రయోజనాలను సామాజిక పరిమితులకు అనుగుణంగా మలచుకోవడం నీతి. నీతులలో నిజాలే ఉంటాయి కాని, కల్పనలకు తావులేదు. అందుచే అన్ని దేశ, కాల, పరిస్థితులకు అనుసరణీయమైన రీతిలో కొరత ఎప్పుడూ ఉంటూనే ఉంటుంది. ఆధునిక కాలంలో నీతి, నిజాయితీలు జనజీవన ప్రవంతిలోనుండి అంతరించి పోయే సూచనలు కన్పిస్తున్నాయి. ఆందోళనకరంగా ఉన్న ఈ పరిస్థితులలో శతకాలను గుర్తుచేసుకోవడం ఎంతైనా అవసరం. పూర్వపు రోజులలో తాతగారో, మామ్మగారో మనుమలను ప్రక్కలో పడుకోపెట్టుకొని మెల్లమెల్లగా శతకాలలోని పద్యాలను వల్లె వేయిస్తూ, పిల్లల నరనరాలలో నీతినియమాలను జీర్ణించుకొనేలా చేసేవారు. ప్రస్తుతకాలంలో ఈ పరిస్థితులే లేవు. చిరుతప్రాయం నుండి పిల్లలకు పుస్తకాల మోతతో సరిపోతూ ఉంటే, పాపం వాళ్ళకి నాయనమ్మలతో, తాతయ్యలతో గడపడానికి సమయం ఏది? కొందరి ఇళ్ళలో అయితే నాన్నమ్మ, తాతయ్యలతో కలిసి ఉండే పరిస్థితే లేదు. ఆధునిక యుగంలో యువతకు నీతులు నేర్చుకొనే అవకాశమే ఎండమావి అయితే, ఇక ఆచరణ ప్రశ్న ఎదురయ్యే అవకాశమే లేదు.

ఇంగ్లీషు మీడియమ్ చదువులు వచ్చాక తెలుగువాడు తెలుగురాయలేని, చదవలేని స్థితికి వచ్చాడు. పెద్దలే నీతిసారపు వెన్న ముద్దలైన శతకాలను ఆదరించక పోవడం వల్ల పిల్లల మనస్సులు కూడా అనైతిక భావాలతో నిండుతున్నాయి. నీతుల విలువలను ధార్మిక దృష్టిని పెంపొందించాలన్నా భావితరాల వారిలో వాటిని ప్రకాశింప చేయాలన్నా సుమతీ శతకం, కృష్ణశతకం, దాశరథీ శతకం, భాస్కర శతకం వంటి శతకాలను పాఠ్యాంశాలలో ప్రవేశపెట్టాలి.

ఎన్ని శతాబ్దాలు మారినా, ఎంతకాలం గతించినా దేశకాలాల మార్పులకు అతీతంగా నేటి సమాజపరిస్థితులకు కూడా అనువర్తించే విధంగా ఉంటుంది శతక సాహిత్యం. ఉదాహరణకు సుమతీ శతకకర్త శ్రీ బద్దెన కవిగారు చెప్పిన ఒకనీతి పద్యాన్ని పరిశీలిద్దాం.

**కమలములు నీటఁబాసినఁ**
**గమలాప్తుని రశ్మి సోఁకి కమలిన భంగిన్**
**దమ తమ నెలవులు దప్పినఁ**
**దమ మిత్రులు శత్రులగుట తథ్యము సుమతీ!**

సుమతీ! అని సంబోధనలోనే మన మతులు ఎంతమంచిగా ఉండాలో తెలియ చెప్తోంది. నిజానికి కమలాలు నీటిలో పుట్టి, నీటిలో పెరుగుతాయి. నీళ్ళు వాటికి ఆవాసం. కమలాలు వికసించడానికి నీటితో చెలిమి, సూర్యరశ్మి సంపర్కం-రెండూ అవసరమే. కమలాప్తుడు అంటే సూర్యుడు అని అర్థం.



సూర్యుడు కమలాలకు ఆప్తుడు ఎప్పుడూ? అవి నీటిలో ఉన్నంత వరకే నీటిని వదిలి బయటపడితే ఆప్తుడైన సూర్యుడే వాటిని వడిలిపోయేలా చేస్తాడు. పద్మాలు వికసించడం అంటే సంతోషించడం. అవి వడలిపోవడం అంటే దుఃఖించడం. మిత్రునితో ఉండడం ఆనందం. శత్రువుతో గడపటం దుఃఖకరం. తమ స్థానమైన నీటి నుండి బయటపడేసరికి ఆప్తమిత్రుడైన సూర్యుడే కమలములను కమిలిపోయేట్టు చేస్తాడు. ఇది ఎవరి దోషమూ కాదు. కారణం కమలం తన స్థానాన్ని కోల్పోవటమే.

లౌకికంగా ప్రస్తుత పరిస్థితుల్లో చూస్తే రాజకీయాలలో వ్యక్తులు ఏ పక్షంలోనూ స్థిరంగా ఉండరు. ఒక రాజకీయపక్షం నాయకుడిగా ఉన్నంతసేపు, ఆతనికి వత్తాసు పలుకుతూ, సన్మాలతో ముంచెత్తిన వ్యక్తులే, ఆ నాయకుడు పదవీచ్యుతుడైనా, వేరొక పక్షంలోకి మారినా ఆ వ్యక్తిలో పూర్వం నుండి చూచిన లోపాలన్నీ ఎత్తిపెట్టి, దుయ్యబట్టి దుమ్మెత్తి పోస్తారు. నీతికారుడు "నెలవులు తప్పితే మిత్రులే శత్రువులౌతార"ని చెప్పినది, ప్రస్తుత కాలమాన పరిస్థితులకు కూడా ఎంత చక్కగా పట్టిందో గమనిస్తే, నీతి శతక అధ్యయన-ఆవశ్యకత అర్థమౌతుంది.

ఆధ్యాత్మికంగా పరిశీలిద్దాం. జీవాత్మ అసలైన స్థానం పరమాత్మ ఉండే పరమ పదమే. తన నెలవులో తానున్నపుడు జీవాత్మ పరమాత్మతో సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యాలను పొంది నిత్యానందాన్ని అనుభవిస్తూ ఉంటాడు. కాని జీవుడు కర్మవశ్యుడై భగవంతుని వీడి జనన మరణ వలయాల్లో పరిభ్రమిస్తూ ఇక్కట్ల పాలవుతున్నాడు.

రామాయణంలో సీతమ్మ జీవునికి ప్రతీక. రాముడు పరమాత్మ స్వరూపం. సీతకూడా మాయలేడి వ్యామోహంలో పడి, క్షణం కూడా వీడి ఉండలేని శ్రీరామచంద్రునికి దూరమై, రావణాసురుడు పెట్టే కష్టాలకు కృంగి, కృశించి, కుమిలి, శల్యమైంది. రావణుని క్షోభలకు గురికాక తప్పలేదు.

స్థితిగతి తప్పితే మానవులకు మతి తప్పే అవకాశం ఉంది అనే విషయాన్ని ఆధ్యాత్మికపరంగా కూడా నిరూపించేడు నీతికారుడు శ్రీ బద్దెన కవి. నైతిక-ఆధ్యాత్మిక భావబీజాలను చక్కగా పిల్లల హృదయాలలో నాటుకొనేట్టు చేసే శతకాలను పెద్దలాదరించి పిల్లలతోనూ వాటిని చదవించటం ఎంతైనావసరం.

ఇంత అర్థాలను ఇమిడ్చి ఇచ్చిన నీతిశతకాలను మనమూ నేర్చుకుందాం. మన పిల్లలకీ నేర్పిద్దాం. పిల్లల భవిష్యత్తుకు పూలబాటలు వేద్దాం.

# ఇది తెలుసుకుందాం !!

## శ్రీవారి తిరుమల సందర్శనం - నివేదిక

శ్రీవారు 28వ తేదీ మధ్యాహ్నం గం.2.00లకు తిరుమల జీయరు మఠానికి వేంచేసారు. గం.3.00లకు **T.T.D.** అధికారులు, పాలకమండలితో శ్రీవారు సమావేశమయ్యారు. శ్రీవారితో T.T.D. E.O. శ్రీమాన్ అజయ్‌కల్లాంగారు, J.E.O. శ్రీమాన్ బాలసుబ్రహ్మణ్యంగారు, C.E. శ్రీమాన్ సత్యనారాయణరాజుగారు, 'ఎండోమెంట్స్' ప్రభుత్వకార్యదర్శి శ్రీమాన్ J.B. మూర్తిగారు, T.T.D. ఛైర్మన్ శ్రీమాన్ ఆదికేశవులునాయుడుగారు శ్రీవారితో T.T.D. విషయాలను చర్చించారు.

ఈ సమావేశంలో JET కోశాధికారి శ్రీమాన్ రామేశ్వరరావుగారు, BJP నేత శ్రీమాన్ Ch. రామాచంద్రారెడ్డిగారు, శ్రీమాన్ భవానీప్రసాద్‌గారు, శ్రీమాన్ నంబి వేణుగోపాలస్వామిగారు, శ్రీమాన్ N. రమణాచార్యులుగారు కూడా పాల్గొన్నారు.

శ్రీవారు సమావేశం ప్రారంభిస్తూ పేరుకోసమో, స్వార్థం కోసమో, లాభాపేక్షతోనో తాము రాలేదన్నారు. తిరుమల చరిత్రకీ, సంప్రదాయానికీ నష్టం వాటిల్లరాదనే ఈ తపన అంతానన్నారు. **'తిరుమలలో పరిష్కరించవలసిన విషయాలు'** అనే శీర్షికతో 3పేజీల పత్రాన్ని శ్రీవారు చర్చనీయాంశంగా ఉంచారు. మూడు ముఖ్య విషయాలను దృష్టిలో పెట్టుకొని తాము ఈ సూచనలను చేస్తున్నట్లు T.T.D. పాలకవర్గంతో శ్రీవారు అన్నారు. దేవస్థానం గౌరవానికి, పవిత్రతకూ భంగం కలుగకూడదని, పరంపరగా వచ్చిన ప్రాచీన సత్సంప్రదాయం చెడకూడదనీ, దీనిని అమలు పరచవలసిన సాంప్రదాయిక స్థానికవ్యవస్థ అసమర్థము, నిర్వీర్యమూ అయినందున దానిని "సవ్యంగ" బలపరచడమే తక్షణ కర్తవ్యమన్నారు.

T.T.D. అధికారులంతా శ్రీవారి సూచనలకు ఆమోదం తెలుపుతూ Master planలో భాగంగా జరిగే పనులను సందర్శించవలసినదిగా కోరారు. పిదప శ్రీవారు, అధికారులు, సలహాదారులు అంతా కలిసి ఆలయముఖద్వారం ముందు పేల్చివేసి పల్లం చేసిన ఆయా ప్రాంతాలను సందర్శించారు. మరలి రాగానే తిరిగి చర్చలు కొనసాగించారు. శ్రీవారు ఆలయం లోపల జరుగుతున్న అనాచారాలను ఛైర్మన్‌గారికి ప్రత్యక్షంగా చూపించగ, అంగీకరించి సరిచేస్తామని శ్రీవారితో చెప్పారు. అనంతరం అనంతాళ్వాన్ తోటను శ్రీవారు సందర్శించారు. మళ్ళీ చర్చలు కొనసాగాయి.

28వ తేదీనాడు 16 అంశాలతో కూడిన పత్రాన్ని శ్రీవారు అందించారు. ప్రతీ అంశాన్ని సూక్ష్మంగ చర్చించారు. శ్రీవారు తమ నిర్ణయాలు స్పష్టం చేసారు. దానికి అధికారులు చాలవరకు అనుకూలంగానే స్పందించినా, కొన్నింటిలో సమయం కోరారు. ఆ అంశాలూ, ఫలితాలూ ఈ క్రింద పొందుపరుస్తున్నాం.



**1. నిత్యారాధనకై కేటాయించిన సమయాలు ఆలయ పట్టికలో బాగానే ఉన్నట్లున్నా ఆచరణలో అంతా అతివేగంగ ముగిసి, చేసే సేవలన్ని చేస్తున్నామన్న పేరుకే, తప్ప సంప్రదాయబద్ధంగ విశ్వాసంతో జరగడం లేదు. పట్టికలో వేసినంత సమయమూ ఆ సేవలు జరగనీయాలి. ఉదయ, సాయంకాల సమయాలలో జరిగే తోమాల సేవలో చేసే దివ్యప్రబంధ పారాయణలో ఆద్యంతాలు మాత్రం విన్నవిస్తారు, సమయం చాలదని. అలా కాకుండా ఆ పాశురాలు పూర్తిగ భగవంతునికి విన్నవించాలి. దీనికై పూజలో ఓ 15ని॥లు ఉదయం, సాయంకాలమూ పొడిగించాలి. అలానే అర్చనానంతరసేవకు మిగిలిన సేవలవలెనే లోపలపట్టేటన్ని టిక్కట్లే యివ్వాలి. మిగిలినవారికి కావాలంటే ఆరగింపు, శాత్తుముఱై పూర్తయ్యాక ముందుగ దర్శనాలు చేయించాలి. మొదటి ఆరగింపు గం.6-15ని, రెండవ ఆరగింపు గం.10-00కీ, సాయంకాలం తోమాల ప్రారంభం గం.7-30కి ఖచ్చితంగ జరగాలి. శయనోత్సవం పూర్తైనాక తాళాలు రాత్రి గం.1-00 వేసితీరాలి. కనీసం రెండు గంటలు విశ్రాంతినివ్వాలి. తిరిగి ఉదయం గం.3-00కు సుప్రభాతం జరుపవచ్చు. ఎంత పెద్ద వి.ఐ.పి. వచ్చినా సమయాలను మార్చడానికి వీలులేకుండా చేయాలి.**

స్పందన: *శయనోత్సవం నిస్సందేహంగ సమయానికే అమలు పరుస్తామన్నారు. అర్చనానంతరసేవను మార్చడంపై కొంత సమయమివ్వమని అడిగారు. మిగిలిన సమయాలు ఎప్పడైనా అత్యవసర పరిస్థితులలో తప్ప అతిక్రమించడం లేదని, ఇకపై మరింత శ్రద్ధగ గమనిస్తామని హామీనిచ్చారు.*

**2. ఆరాధనలో పైపునీటిని వాడుతున్నారు. తిరుమలనంబివంశస్థులు 3బిందెల నీరు తేవాలి కనుక తెస్తున్నారు. ఆరాధన అయిపోయాక ఆ తీర్థం తెస్తారు. శుక్రవారం అభిషేకానికి కూడా పైపునీరే. సుమారు 1000 లీటర్ల జలం పడుతుంది. గతంలో బంగారుబావినీరుతోడి వాడేవారు. ఇప్పడది పాడైంది. బాగు చేసేటంతవరకూ ఎక్కువమంది స్వాములను ఏర్పాటుచేసి, లాగుడుబండ్లను, వాటిపై రాగిపాత్రలను తయారుచేసి వాటితో తెచ్చిన తీర్థంతో అభిషేకించాలి. పవిత్రతా, ఆచారమూ కాపాడినట్లవుతుంది దీనివల్ల.**

స్పందన : *జరుగుతున్న దాంట్లో లోపం ఉంది. బండి, పాత్రలు తయారుచేసి త్వరలో అంటే మార్చి నెలాఖరులోపులో దీన్ని సవరిస్తామన్నారు.*

**3. శ్రీనివాసునికి చుట్టూ ఉన్న యోగనరసింహస్వామిసన్నిధిలో, వరదరాజసస్వామి సన్నిధిలో, విష్వక్సేనుల సన్నిధిలో, భాష్యకార్ల సన్నిధిలోనూ చాలకాలంగ ఆరాధనే లేదు. కేవలం శ్రీనివాసునికి కాగానే ఆ ప్రసాదం తెచ్చి ఆరగింపు మాత్రం చేసి వదిలేస్తారు. చివరికి ఆ క్షేత్రనాథుడైన వరాహస్వామికీ ఇదేగతి. గ్రంథాలలో మూడుపూట్లా ఆరాధన ఆ సన్నిధులలో గూడ జరగాలనే ఉంది. వెంటనే జరుపడం ప్రారంభించాలి.**

స్పందన: *ఆరాధన జరగడంలేదన్నది నిజమే. ఎప్పడు లోపించిందో తెలియదు. ఇప్పడున్న వారంతా వాటిల్లో ఆరాధనే లేదు అంటున్నారు.*

***దీనిపై శ్రీవారి సవరణ:- ఆరాధనను పునరుద్ధరించాలి. దీనికి ఒక ఆధికారిక సమితి ఏదైనా ఉండి, ఆయా సమయాలలో జరిగే లోపాలు, లోటుపాట్లు సరిచేస్తూండాలి. ఆ సమితికి అలా సవరించే***

***అధికారాలను గూడ ఏర్పరచాలి. దానిని* T.T.D.*లో అంతర్భాగంగ చేయాలి.***

**స్పందన:** *దీనికి అందరూ అంగీకరించారు. అలా దానినేర్పరచుకొని పై సన్నిధులలో ఆరాధన పునరుద్ధరించుకోవాలి. పేర్లను సూచించమని శ్రీవారిని కోరారు. శ్రీవారు ఆ సమితిలో ఎవరెవరు ఉండాలో సూచించారు.*

4. **గతంలో కులశేఖరప్పడిదాక భక్తులు వెళ్ళి దర్శించేవారు. మందెక్కువయ్యారనే పేరుతో సెక్యూరిటీ అనే వంకతో వి.ఐ.పిలకూ, వారికైనా, కొన్ని సమయాలతో తప్పిస్తే, మిగిలిన సామాన్యభక్తులందరికీ 'లఘుదర్శనం' పేరుతో బయటి ద్వారం దగ్గరనే వెనుకకు మరల్చివేస్తున్నారు. లోపలిదాకా వెళ్ళనిస్తే, మరలి రావడానికి ఎక్కువ స్థలముంటుంది.**

**స్పందన:** *దీని విషయంలో కొంతసమయం కావాలని, లోపలిదాక వెడితే దర్శించే జనాలసంఖ్య తగ్గిపోతుందనీ త్వరగా కదలరని, గంటకీ మామూలుగనైతే లఘుదర్శనంలో 3500మంది సేవిస్తే, లోపలిదాక పంపితే 2000లోపే దర్శించ వీలవుతుందని, దీనిని మరో సమావేశంలో చర్చిద్దామనీ కోరారు.*

5. **బంగారు బావిని బాగుచేయాలి. దీన్ని పాడుచేసిన డ్రైనేజీవ్యవస్థను క్రమబద్ధం చేయాలి.**

***స్పందన :*** మిగిలిన ప్లానుతో సంబంధం లేకుండా డ్రైనేజీ మాత్రమే బాగు చేసే రీతిలో డ్రాయింగు వేయమని ఇంజనీర్లను వెంటనే ఆదేశించారు ఛైర్మన్‌గారు. 10 దినాలలో అది తయారవుతుంది.

6. **బంగారుబావివద్ద వంటశాలను ఆచారవంతం చేయాలి.**

**స్పందన:** *గతంలో చెప్పినట్లు గాడిపొయ్యిలు నిర్మించారు. వంటపాత్రలు అవసరానికి తగ్గట్టు చేయమని టెండర్లు పిలిచామని గత నవంబరులో చెప్పారు. ఇపుడూ తిరిగి అదేమాట చెప్పారు అధికారులు. అయితే ఛైర్మన్‌గారు కావలసిన పాత్రల లిస్టు యిమ్మని, తానే వాటిని నెలాఖరులోపు తయారు చేయించేస్తానని చెప్పారు. వంటశాలలో స్వామికి ఆరగింపుచేసే ప్రసాదాలు మాత్రమే చేయాలి. కళ్యాణాలవారి కోసం, అమ్మకానికీ చేసే అధిక ప్రసాదాలు ఆరగింపు కావు కనుక వాటిని బయటి వంటశాల (పోటు)లో చేసుకోవాలి. స్టీము పాత్రలు, పొయ్యి మార్చి నెలాఖరుకి తీసేయాలి పూర్తిగ. వంటచేసేవారు శ్రీవైష్ణవులు, శిఖాదారులుగనూ ఉండాలి. అనాచారంగ చేయరాదు. దీనికి అంగీకరించారు.*

7. **మాడవీధిలో జరుపవలసిన నిర్మాణాల గురించి-మాడవీధికి లోపలివైపు గృహాలేమీ ఉండవు. కళ్యాణమండపం పెద్దదొకటి. లడ్డూల తయారీకి పెద్దవంటశాల ఒకటి నిర్మించి, వాటికి బయట ప్రాకారం కట్టవచ్చు. వీధికి బయటివైపు మెట్లు కట్టి భక్తులు కూర్చొని, తిరువీధిలోకి వచ్చిన స్వామిని దర్శించేట్లు చేయాలి. ఆ మెట్లవెనుక మఠాలూ, గృహాలు నిర్మించాలని TTD వారి నిర్ణయం. కానీ అది తగదు. వీధికి లోపలివైపే మఠాలూ, గృహాలూ ఉండాలి. బయటకారాదు. అవే నిజానికి ఆలయానికి రక్షణ. కళ్యాణమండపం క్రొత్తది అనవసరం. అలానే లడ్డూ తయారీకి కూడ క్రొత్త పోటు నిర్మించి చేయుతగదు. అలా నిర్మించే ప్రాకారం వల్ల స్వామిపుష్కరిణిని కొంత**



**మూసివేయవలసి వస్తుంది. ఇది సమ్మతం కానేకాదు. కళ్యాణాలు, గతంలో నిర్మించిన మరో మండపంలో కానీ వేరేచోటైనా జరుపవచ్చు. లడ్డూలు గూడ వేరే చోటచేసుకోవచ్చు.**

**స్పందన:** మాడవీధికి లోపలివైపు మఠాలూ, గృహాలూ వచ్చేట్లు ప్లాన్ సిద్ధంచేసి 15 దినాలలో చూపాలని అపుడు దానిపై ఒక నిర్ణయం తీసుకుందామని అధికారులు అన్నారు. మహాప్రాకారము మరొకటి నిర్మించరు.

8. **వేయికాళ్ళమండపం ఆగ్నేయదిశలోనే, గతంలో ఉన్నచోటనే పునర్నిర్మించాలి.**

***స్పందన:*** వేయిస్తంభాలు కట్టే చోటక్కడలేదే . పైగా అలా వేయీ నిర్మిస్తే అందులో స్తంభాలు తప్ప ఇక స్థలమేమీ ఉండదు. దేనికీ అది ఉపయోగపడదు అన్నారు అధికారులు. దానికి శ్రీస్వామివారు విశాలమైన మండపం వచ్చేటట్లు, అందులో వేయి స్తంభాలూ పట్టేట్లు ఎలా నిర్మించవచ్చో వివరించారు. మధ్య ఒక పెద్ద స్తంభం, దానిచుట్టూ 8 చిన్న స్తంభాలూ, ఇలాంటివి నిర్మిస్తే అందంగా కూడా ఉంటుంది. పైగా కొండపై ఆలయంలో డబ్బులెక్కపెట్టేచోట ఉన్న ఒకమండపంలో అలాంటి స్తంభాలున్నాయి గూడ. ఇవి శ్రీస్వామివారు అధికారులకు చూపారు. దానికి తగ్గట్టుగ ప్లాను తయారు చేసి, దక్షిణదేశంలో వేయికాళ్ళమండపాల డిజైన్లు గూడ పరిశీలించి నెలాఖరులోపులో తిరిగి దానిని శ్రీస్వామివారికి చూపాలని నిర్ణయించారు.

9. **గొల్లదాని మండపం కదపరాదు. దాని చరిత్ర తెలిపే శిలాశాసనం వేయించాలి.**

**స్పందన:** మండపాన్ని మధ్య అందంగ ఉండేలా అలంకృతం కావించి దానికి ఆలయద్వారం వైపు 49 అడుగుల దూరమున్నట్లే తూర్పువైపు గూడ 49 అడుగుల దూరం రోడ్డునేర్పరచి మధ్యలో గొల్లదాని మండపం ఉండేట్లు, దానికి తూర్పున తిరిగి పూర్వంలానే ఎత్తుగ మెట్లు నిర్మించాలి. దీనికంగీకరించారు.

10. **అనంతాళ్వాన్ తోట, గృహం అక్కడనే పునర్నిర్మించి, చరిత్ర తెలిపేట్టు శిలాశాసనం చేయాలి.**

**స్పందన:** తోటను బాగు చేయడానికి అంగీకరించారు. గృహనిర్మాణానికే ఇంకా కొంత సందేహిస్తున్నట్లున్నది. అయినా అది నిర్మించి తీరాలని శ్రీవారు సూచించారు.

11. **తిరుమలనంబి గృహం, పునర్నిర్మించి, చరిత్రను తెలిపేట్టు చేయాలి శిలాశాసనంలో.**

**స్పందన:** అక్కడ ఆ వంశంవారికో ట్రస్టు ఏర్పడి, గుడిలా నిర్మించేసుకున్నారు. చరిత్రను తెలిపే శాసనాలు ఉంచవచ్చునని అంగీకరించారు.

12. **బేడీఆంజనేయుని, పెరియజీయరుమఠాన్ని సరిచేసి, వాటి చరిత్రను శిలాశాసనం చేయాలి.**

**స్పందన:** అంగీకరించారు.

13. **శ్రీవేంకటేశుని కంటే ఇతరమైన సంప్రదాయాల మందిరాలు కొండపై నుండి క్రిందికి మార్చాలి. ప్రైవేటు ఆస్తూలూ అంతే.**

**స్పందన:** చక్రతీర్థం వద్ద, జాపాలి తీర్థం వద్ద నిర్మాణ దశలో ఉన్న ఆలయాలు

నిర్మింపచేసిన వారితోనే తొలగింపచేయాలని నిర్ణయించారు. స్వామి పుష్కరిణి చుట్టూ అలాంటివి ఉన్నట్లయితే వాటినీ సంస్కరించాలని నిర్ణయించారు. తిరుచానూరులో అమ్మవారి సన్నిధికి వెనుకనున్న శేషుని పడగలపై కొత్తగ నిర్మిస్తున్న మండపాన్ని గురించి శ్రీవారు ప్రస్తావించగ, దానిని నిలిపివేస్తామని చెప్పారు.

**14. శ్రీవేంకటాచల ఇతిహాసమాలను ఖచ్చితంగా పాటించే కట్టుబాటు శాసనం ద్వారా జరగాలి.**

**స్పందన:** సంప్రదాయ రక్షణకై ఒక సమితి ఏర్పడితే, వారి ద్వారా ఇది జరగడం క్రమబద్ధమౌతుంది. శ్రీవారు దానికంగీకరించారు.

**15. 'సంప్రదాయ పరిరక్షణ సమితి'నేర్పరచి అందులో ఉండేవారు సాంప్రదాయిక, పారంపరికమైన ఆచారవ్యవహారములలో కట్టుబాట్లలో లోపాలురాకుండా తిరుమల సంప్రదాయాన్ని గుర్తించి, గౌరవించి, శాసించగలవారై ఉండాలి.**

**సంప్రదాయ పరిరక్షణ సమితి :**

ఈ క్రింది సభ్యులతో **TTD** కి సంబంధించన ఆచార వ్యవహార సంప్రదాయ, సిద్ధాన్త వ్యవహారములకు సంబంధించిన నిర్ణాయక సమితిగ ఉండదగును.

1. ప.ప. శ్రీవానమామలై జీయర్‌స్వామి, తోతాద్రి.
2. ప.ప. శ్రీ తిరుమలైలో నేరుగసేవలర్పించు ఇరువురు జీయర్లలో ఒకరు.
3. ఆలయానికి చెందిన ఆచార్యపురుష పరంపరలో ఒకరు.
4. వైఖానసాగమమూ, సంప్రదాయమూ కల ప్రసిద్ధ ప్రామాణిక ప్రాచీన ఆలయాలకు చెందిన పంరపరార్చకులు దక్షిణభారతం నుండి ఒకరు.
5. తిరుమల ఆలయ పరంపరకు చెందిన అర్చకులొకరు.
6. శ్రీ భగవద్భాష్యకార్ల సిద్ధాన్త విద్వాంసులిరువురు ఇందులో సభ్యులుగ ఉంటారు.

**స్పందన:** మన శ్రీస్వామివారి సూచనలనుబట్టి అలాంటి వారితో ఓ సమితినేర్పరచడానికి అంగీకరిచారు. ఆధికారిక గుర్తింపుకు తగినట్లు లేఖ తయారు చేస్తామన్నారు.

**16. 'ధర్మప్రచార పరిషత్' కానీ, దేవస్థానపు పత్రిక 'సప్తగిరి' కానీ శ్రీవేంకటేశునికి వ్యతిరేకమైన ప్రచార ప్రసారసాధనాలు కారాదు.**

**స్పందన:** వాటిలో సప్తగిరి పత్రికను బాగు చేయిస్తాం. **DPP** కి ఉండే కొన్ని సాంకేతిక ఇబ్బందులవల్ల వీలయినంత త్వరలో ఈ విషయాన్ని గూడ పరిశీలిస్తామని హామీ ఇచ్చారు.

**17. ఇవిగాక, ఉత్సవపెరుమాళ్ మలైయప్పస్వామి నియమితమైన చోట్లకే పోవాలి తప్ప క్రొత్తచోటుకి పోరాదు. పైగా కొందరు వ్యక్తుల వర్థంతులకస్సలు వెళ్ళకూడదు. గత 2,3 సం॥పైగా అన్నమాచార్య వర్థంతికి తీసుకుని వెళ్ళే అలవాటు చేస్తున్నారని సప్తగిరి పత్రికలోనే విషయం ప్రకటించారు. ఇది సంప్రదాయాన్ని, దేముణ్ణి అవమానించడమే అని అది తగదని శ్రీస్వామివారు స్పష్టంచేసారు.**



**18. తిరుమల జీయరువారు, ఏకాంగులచే చేయించే సేవలలోనే తెన్నాచార్య సంప్రదాయాన్ని కాలరాచిన సన్నివేశాలున్నాయని, నిరూపించి చూపి, ఆ విధంగ జరుపనీయరాదని హెచ్చరించారు. సంప్రదాయ పరిరక్షణసమితి ఏర్పడి, దానిని గూడ సరిచేయదగునని నిర్ణయించారు.**

ఈ విషయాలను 28,29 తేదీలలో చర్చించారు. తిరిగి మార్చి మూడవ వారంలో విజయవాడలో శ్రీస్వామివారున్న సమయంలో, మార్చిన ప్లాన్లతో అధికారులు కలుస్తామని, అమలు చేయదగిన వెంటనే ప్రారంభిస్తామని తెలిపారు. 29వ తేదీనాటికి విలేఖరుల సమావేశం జరిగింది. శ్రీస్వామివారి సూచనలను చాలవరకు అమలు పరుస్తామని చైర్మన్ శ్రీ ఆదికేశవులు నాయుడుగారన్నారు. శ్రీస్వామివారీ విషయమై మాటలాడుతూ **"లోపాలు జరుగుతున్న మాట వాస్తవమని అవి సవరించుకొమ్మని, సక్రమంగ జరుపమనడమే మా అభిప్రాయం తప్ప, ఇతర ఆగమాలను తిరుమలలో ప్రవేశపెట్టడం అనేది లేనేలేదని, తెలియనితనంతో, మిడిమిడిజ్ఞానం కల ఎందరో సాధువులనుకున్న వాళ్ళు తమపై తీవ్రంగ ధ్వజమెత్తడాన్ని చూచి జాలిపడుతున్నామని"** శ్రీవారు సెలవిచ్చారు.

TTD వారు రూ. 2.5కోట్లు మీరిమ్మంటే యిస్తారట తీసుకుంటున్నారా? అని విలేఖరులడిగారు. అంతేకాక మీకిస్తే తమకూ డబ్బివ్వాలని ఎందరో పీఠాధిపతులడుగుతున్నారు కదా! అని ప్రశ్నించారు. "TTD **ని మా మఠం నిర్మాణానికో నిర్వహణకో మరో స్వంతవ్యవహారానికో తామెప్పడూ ధనం అడగలేదు. ధర్మప్రచారపరిషత్ ద్వార జరుపవలసిన పనినే, సమర్థవంతంగ ఎలా జరుపవచ్చో ఓ స్కీము యిచ్చాం. అదే 'గీతాజ్యోతి'. అందులో 23 జిల్లాలకు 23 వాహనాలు** TTD **ఏర్పాటు చేసుకోవాలి. అందులో ప్రచారకులుండాలి. వారికి కొంత ప్రచారసామగ్రినివ్వాలి. మన వికాసతరంగిణి ఇందులో పూర్తిగ తోడుంటుంది. వాహనాలకుగాను అప్పట్లో అంటే 2 సం॥ల క్రితం, రూ. 2కోట్ల 60 లక్షలు. ఏడాదిపాటు ప్రచారం చేసే డ్రైవర్లు, ప్రచారకులు, భజనవారికి 23 జిల్లాలలోనే చేస్తే అయ్యేఖర్చు సుమారు రూ. ఒక కోటి. ఇంతవరకు 3.6కోట్లు అవుతుంది. ప్రచారసామగ్రికి రూ.1.4కోట్లు ప్రారంభంలో** TTD **ఖర్చుచేసి సామగ్రి తయారుచేస్తే ఆపై అవసరమైనదంతా భక్తులు చేస్తారు. అలా భక్తులు పెట్టేఖర్చు సుమారు రూ. 25 కోట్లు అయితే, దానికి కావలసిన ప్రాథమిక వాహనాలు, పుస్తకాలు, ప్రతిమలువంటి వస్తుసంభారాలను సమకూర్చడానికి రూ. 5కోట్లు ఖర్చుచేయమని దేవస్థానాన్ని కోరాం. ఏడాదిపాటూ ఆ మొత్తం కార్యక్రమాన్ని సమర్థవంతంగ జరుపడం తమ బాధ్యతగ స్వీకరిస్తామని మేం చెప్పాం. అప్పట్లో వారు అదేదో మాకోసం అన్నట్లు రూ. 2.5 కోట్లు ఈ ప్రాజెక్టుకు కేటాయిస్తామన్నారు.**

**రూ.2.5 కోట్లు అటు వాహనాలకీ చాలదు. ఒకవేళ వాహనాలు కొన్నా, అందులో మనుషులను ఏడాదిపాటు పోషించాలి. ఇది ఉన్నా, ప్రచార సామగ్రిలేనిదే గ్రామాలలోనికి పోయి ఏం లాభం? పోనీ, వాహనాలు కొనకుండా ఈ డబ్బుతో ప్రచార సామగ్రినే తయారుచేద్దామని వారు అన్నారు. అలా అంత సామగ్రి తయారై ఉన్నపుడు, దానిని పంచే వ్యక్తులకి, తిరిగే సాధనాలు లేకుండా ప్రచారం కష్టం. అందుకే రూ. 2.5కోట్లు ఏ రకంగానూ కార్యోపయోగి కాదు. ఇక బాధ్యతను తీసుకున్నప్పటి నుండీ అధికారులను తృప్తిపరచడం ఓ పెద్ద సమస్య.**

**ఇన్ని చికాకులూ పడి పరాధీనంగ "గీతాజ్యోతి" ధర్మప్రచార కార్యక్రమాన్ని పాడుచేయడం యిష్టంలేక ఆ పథకాన్ని TTD తో కలిసి జరిపే బాధ్యత మేము తీసుకోలేదు. అయితే ధర్మప్రచారం సమాజానికి చాల చాల అవసరం కనుక గత రెండేండ్లుగ 'గీతాజ్యోతి'ని వికాసతరంగిణులు ప్రారంభించి చాల బాగ చేస్తున్నాయి. ప్రతీనెలా ఆ రిపోర్టు మా భక్తినివేదన పత్రికా అందిస్తోంది. ఇన్నీ జరిగాయి కొన్ని వాహనాలున్నాయి, ధర్మక్షేత్రాలు ఏర్పడ్డాయి.**

చాల ప్రచారమూ జరిగింది. కనుక ఇప్పడైనా ఆ ప్రచారాన్ని బాగ జరపాలని, గతంలో అంగీకరించిన ధనం విలువ చేసే వస్తు సామగ్రిని యివ్వవలెనని అధికారులు భావించారు. ఇదేదో రాత్రికి రాత్రి పుట్టినబుద్ధికాదు. *ఎవరో పలుకుబడితో చేసుకొన్నదికాదు. ఓట్లకోసం పాలకులు ఎఱపెట్టినది అంతకంటే కాదు.* ఎప్పడో జరుగవలసినది, దాని కర్మపండి ఈ సమయంలోనే అదీ యివ్వాలని నిర్ణయించడం కాకతాళీయం. ఆ రూ. 2.5 కోట్లతో యిచ్చే సామగ్రివల్లనే మా కార్యక్రమాలు జరుగలేదు. అదిలేకపోతే ఈ గీతాజ్యోతి కార్యక్రామాలు ఆగిపోవు. దానితోటే అంతా అయిపోదు. వికాసతరంగిణి భక్తులూ, కార్యకర్తలూ యింతవరకూ సుమారు రూ. 10కోట్ల విలువ చేసే సేవలు, ధనరూపంలో, సేవారూపంలోనూ అందించారు. ఇంకా ఎంతెంతో చేస్తున్నారు. భవిష్యత్తులో చేస్తారు గూడ. ఈ మంచికార్యానికి తమ తోడ్పాటు, ప్రోత్సాహనమూ ఉండాలా వద్దా? ఇలాంటివి చేసే బాధ్యత తమకి ఉందా? లేదా? ఇది మంచిపనా? కాదా? తమ ప్రచారపరిషత్ కోసం పెట్టే కోట్లాదిరూపాయలు సద్వినియోగం అవుతున్నాయా? లేదా? 2 సం॥లలో గీతాజ్యోతి ద్వారా వికాసతరంగిణి చేసిన కార్యక్రమంలో వందవవంతైనా ఇన్ని సంవత్సరాలుగ ప్రచారం చేస్తున్నామంటూ కోట్లు ఖర్చు చూపించేస్తుండే TTD చేయగలిగిందా? వంటి ప్రశ్నలకు TTD అధికారులే సమాధానాలు చెప్పకోవాలి. ఆ నిర్ణయం వారికే వదలివేస్తున్నాం" అన్నారు పత్రికా విలేఖరులతో శ్రీస్వామివారు.

ఇక చిన్నజీయరుస్వామివారికిచ్చారు కనుక తమకెందుకివ్వరూ? అంటూ ఎందరో "మహాస్వాములు" వరుసకట్టడం జాలిగొలిపే సన్నివేశమే. వారికిచ్చారు కనుక మాకూ యివ్వండి అనేది ఉడుకుమోత్తనమంటారు. పసిబాలునితనం. పనిచేసి చూపాలి. అవతలివాడు బుద్ధిపుడితే యిస్తాడు లేకపోతేలేదు. అది వేరే విషయం. డిమాండ్ చేయడమేమిటి? దానికి? పైగా దేవస్థానపు లోపాలు చెప్పకుండా ఉంచడానికి ఇదేదో స్వామివారికి యిచ్చే "కానుక" అన్నట్లు ఈ "మహాస్వాముల" ఉవాచ. నిజానికి 'అలా' డబ్బు తీసుకొనేటట్లయితే 'అంతా బాగుంది' 'ఏం లోటులేదు'? అంటూ శాంతివచనాలు పలికి మేముకూడా మర్యాదలు పొందిపోతూ ఉండవలసింది. మరి మేము అలా లేము గద! తప్పలను ఎత్తిచూపిస్తున్నాం. లేక TTD మాకేమైన స్వంతప్రయోజనానికి ధనమివ్వజూస్తోందా? పోటీగ అడిగే 'సన్యాసులు' ఆలోచించేమాటలాడుతున్నారా? వారు చేసే విమర్శలకు అర్థమున్నదా?

ఇదిలా ఉండగ, మావద్దకొచ్చి తిరుమల గురించి నేర్చుకోండి అంటూ ఉచిత సలహా పారేసిన ఓ 'మహాస్వామి', అందుకు 'సిద్ధం'కమ్మనగానే, ఎవరో ఏదో చెపితే నిజం కాబోలనుకున్నాను. అదికాదంటున్నారు కనుక ఇక చెప్పేదేమీ లేదు. అంటూ తప్పించుకుంటూ ఓ ప్రకటన చేసేసి చేతులు దులిపేసుకున్నారు.

**వీరా సమాజానికి ధర్మాన్ని ప్రబోధించే మార్గదర్శకులు? వారినాశ్రయించి తరించడమంటే ఓ గ్రుడ్డివాడిననుసరించి గోతిలో పడిపోయే వందమంది అంధులవలె కాక తప్పదు"** అంటూ ముగించారు.

దీని కొనసాగింపుగ, అనుకున్న ప్రకారం కాస్త ఆలస్యమైనా మార్చి 31వ తేదీని ఛీఫ్ ఇంజినీర్ శ్రీమాన్ సత్యనారాయణరాజుగారూ, పెరుమాళ్ స్థపతి, సలహాదారు శ్రీమాన్ సురేష్ మరి కొందరు సిబ్బందితో ఉదయం గం.11.00ల నుండి మధ్యాహ్నం గం.2.00ల దాక శ్రీవారిని సేవించారు. చర్చల తర్వాత ఈ నెలరోజులలో జరిగిన అభివృద్ధి చర్యలు శ్రీవారికి వివరించారు.

ప్రధానంగ :

1. కట్టెల మీదే స్వామివారికి నైవేద్య ప్రసాదం చేస్తున్నామని, పొయ్యిలను పెంచి నిర్మించాము. 2. వంట పాత్రలు 40 చేయించాము. ఇక 4,5 రోజులలో ఆలయానికి చేరుతాయి.



3. ఆకాశగంగ నుండి ఆరాధనకి తీర్థం తేవడానికి బండి తయారౌతోంది. దానిపై ఇత్తడి పాత్రలు తయారు చేయిస్తున్నాం.
4. గొల్లదాని మండపం అలానే ఉంచి, ద్వారం నుండి 120 అడుగుల దాక గతంలో అంగీకరించినట్లు రోడ్డును శుభ్రపరిచాం. మండపాన్ని దృఢంగ ఉంచేట్టు చేస్తున్నాం.
5. డ్రైనేజి బాగ నిర్మించే ఏర్పాటు విడిగానే ప్రారంభిస్తున్నాం.
6. మాడవీధి లోపలివైపే నిర్మించాలన్నా, 7,8 రకాల ప్లానులు తయారు చేసారు. వాటితో స్వామివారు తృప్తిపడలేదు.

మఠాలు, గృహాలూ వీధికి బయటి వైపే నిర్మించాలనే, అలా స్వామివారిని ఒప్పించాలనే పట్టుదలతోనే తాము వచ్చామని చెప్పారు. వ్యక్తుల పట్టుదలలూ, ప్రతిష్ఠలూ ప్రధానం కారాదని, శ్రీవేంకటేశ్వరుని మర్యాద, సంప్రదాయమూ ప్రధానం కావాలని, అవి దృష్టిలో పెట్టుకొనే ఏ ప్లానైనా తయారు చేయాలే తప్ప, చూడటానికి అందంగ ఉండేటట్టు తయారు చేయడము మాత్రమే లక్ష్యం కారాదని గుర్తించాలన్నారు. తామా విషయాన్ని దృష్టిలో పెట్టుకోలేదని అది ఉంటే పవిత్రతా రక్షణకి తప్పక మార్గాలుంటాయని అధికారులూ అంగీకరించారు. మాడవీధికి లోపలి వైపే మఠాలూ, గృహాలూ మొదలైనవి నిర్మించాలని, దానికి తగినట్లు ప్లాను తిరిగి తయారు చేయమని శ్రీవారు ఆదేశించారు.

7. కంచి, శ్రీరంగం, తిరువాణిక్కోవల్, మదురై, తిరువణ్ణామలై, పెరంబుదూర్ క్షేత్రాలు సందర్శించి, అక్కడి వేయికాళ్ల మండపాలు పరిశీలించి వచ్చారు. అందులో శ్రీరంగం మదురై క్షేత్రాలలో క్రమంగ 970, 984 స్తంభాలున్నాయి. మిగిలిన చోట్ల చాల తక్కువ స్తంభాలే ఉన్నాయి. వేయి ఎక్కడాలేవు. పైరెండు చోట్లా కొన్ని స్తంభాలు పోయి నట్లున్నాయి. వాటిని పూరించడానికి కొబ్బరిచెట్లు పెడతారు. శ్రీస్వామివారు సూచించిన రీతిలో 1000 స్తంభాలూ వచ్చేట్లు, అన్ని సేవలూ అందులో జరిగే అవకాశముండేట్లు ప్లాన్ 2.4.04న చూపిస్తామన్నారు.
8. తిరుమల కొండపై నిర్మించిన అనధికారిక, సంప్రదాయవిరుద్ధ ఆలయ కట్టడాలు 70శాతం తొలగించేసామని. మిగలిన 30శాతం గురించి గూడ చర్యలు చేపడతామన్నారు.
9. శ్రీస్వామివారు సూచించిన ఆరాధన సమయాల మార్పును అమలు పరుస్తున్నామన్నారు.
10. అనంతాళ్వాన్ గృహాన్ని అదేచోట నిర్మించడానికి, తోటను బాగ తయారు చేయడానికి అంగీకరించారన్నారు.
11. మాడవీధికి చెందిన మరో ప్లాను తయారు చేస్తామన్నారు.

ఈ విషయాలను స్థూలంగ శ్రీస్వామివారికి వివరించడానికి **TTD** అధికారులు వచ్చారు. మిగిలిన విషయాలను, వివరాలను పరిశీలించడానికి తాము 2.4.04న తిరిగి తిరుమలకు వస్తున్నామని, అప్పుడు మాటలాడతామని శ్రీచిన్న జీయరుస్వామివారు తెలిపారు.

న్యూస్

# ప్రచార వార్తలు

## అప్పరాజుపల్లి 52వ ధర్మక్షేత్రం

2వ తేదీ తెల్లవారుఝూమున గం.4.00లకు శ్రీవారు తిరుమల నుండి మహబూబాబాద్ పట్టణానికి వేంచేసారు. ఉదయం శ్రీమాన్ ఓం నారాయణలోయగారి ఇంట్లో తీర్థగోష్ఠి జరిగిన అనంతరం శ్రీస్వామివారు స్థానిక ఆర్యసమాజ్ మందిరంలో పిల్లలకు మరియు స్త్రీలకు సంబంధించిన ఉచిత ఆరోగ్య శిబిరాన్ని ప్రారంభించారు. అనంతరం రుక్మిణీ సత్యభామా సమేత శ్రీవేణు గోపాలస్వామివారి దేవాలయాన్ని శ్రీవారు సందర్శించారు. వికాసతరంగిణి కన్వీనర్లైన శ్రీమాన్ రామకృష్ణారెడ్డి గారు, శ్రీమాన్ వెంకన్నగార్ల ఆహ్వానంపై శ్రీస్వామి వారు 'అప్పరాజుపల్లి' వేంచేసారు. 'మెయిన్ రోడ్డు' నుండి ధర్మక్షేత్ర వేదిక వరకు శ్రీవారి ప్రత్యక్ష పర్య వేక్షణలో శోభాయాత్ర వైభవోపేతంగా జరిగింది.

అనంతరం గోపాలమిత్ర పశువైద్య కేంద్ర భవనాన్ని శ్రీవారు ప్రారంభోత్సవం చేసారు. చుట్టుప్రక్కల పలుగ్రామాలు ఇచ్చట పశువైద్య సేవలను వినియోగించుకుంటున్నట్లు పశువైద్యశాఖ J.D. శ్రీమాన్ రామారావుగారు, D.D శ్రీమాన్ సురేష్‌కుమార్, A.D.శ్రీమాన్ వెంకటేశ్వర రావుగార్లు తెలియజేస్తూ శ్రీవారు చేపడుతున్న గీతాజ్యోతి సేవాకార్యక్రమాలు తమకెంతో స్ఫూర్తినిచ్చాయని హర్షం వెలిబుచ్చారు.

వరంగల్ వికాసతరంగిణి అధ్యక్షురాలు శ్రీమతి జ్యోతిగారు, ఉపాధ్యక్షులు శ్రీమాన్ మహేందర్‌రెడ్డి గారు 'గీతాజ్యోతి' ఉద్దేశ్యాలను, చేపట్టిన సేవాకార్యక్రమాల వివరాలను సభలో వెల్లడించారు. అనంతరం శ్రీవారు అనుగ్రహ భాషణం కావిస్తూ.... **''ఈనాడు సమాజంలో పెరిగిపోయిన స్వేచ్ఛావాతావరణం, విశృంఖలతగాను, వికారంగాను మారుతుందన్నారు. సంఘీభావం, క్రమశిక్షణ ఉద్దేశ్యంగా ఈ ధర్మక్షేత్రం నిర్వహించాలన్నారు. అందుకే 'గీతాజ్యోతి' కార్యక్రమమని వక్కాణించారు. భూమిపై నీటివసతులు కరువయ్యాయని, ఎండ వేడిమి బాగాపెరిగిపోతోందని, ఇట్టి 'గ్లోబల్ వార్మింగ్'కు కారణం ప్రకృతివైపరీత్యమేనని''** శ్రీవారు అన్నారు.

అనంతరం సుమారు 2000 మంది భక్తులచే నేతిదీపాలు వెలిగించి 'గీతాజ్యోతి' ప్రతిజ్ఞను చేయించారు. రామప్ప ఇంజనీరింగు కళాశాల ఛైర్మన్ శ్రీమాన్ రాజబాబుగారు, ప్రిన్సిపాల్ శ్రీమాన్ రమేష్‌బాబుగార్ల ఆహ్వానంపై ఆ కళాశాలను శ్రీవారు సందర్శించి అనుగ్రహభాషణం చేస్తూ **"విద్యకు, అక్షరాస్యతకు మధ్యతేడాను వివరించి, ప్రతీ విద్యార్థీ దీనిని గుర్తించడం అవసరమని తెలియజేసారు. జీవితానికి గమ్యం కేవలం కొంతడబ్బు, సౌకర్యాలు సంపాదించడం కాదన్నారు. జీవితమంటే దేహమనే రథంలో ఆత్మయొక్క ప్రయాణంగా వర్ణించారు. ఇటువంటి ప్రతీ ప్రయాణం ఒక గమ్యమేనని శ్రీవారు ఉద్బోధించారు. దేశీయవనరులను చక్కగా వాడుకోవడానికి పనికి రాగలిగే సామర్థ్యాన్ని పెంచగలగడమే నిజమైన జ్ఞానమన్నారు. అట్టి జ్ఞానాన్ని పొందగలిగే విద్య నేడు అవసరమని"** శ్రీవారు సెలవిచ్చారు. అనంతరం మానుకోటకు ప్రయాణమయ్యారు.

## మానుకోట 53వ ధర్మక్షేత్రం

శ్రీమాన్ నూకల నరేష్‌రెడ్డిగారు, శ్రీమాన్ ఓం నారాయణలోయగారు, శ్రీమతి నాయని అరుణా దేవిగారు ప్రభృతులతో సాయంత్రం పట్టణంలోగల వివేకానంద విగ్రహం నుండి బయలుదేరిన



శోభాయాత్ర వైభవోపేతంగా గాంధీపార్కు వరకు శ్రీవారి ప్రత్యక్ష పర్యవేక్షణలో జరిగింది.

సాయంత్రం గం.6.00 లకు ప్రారంభమైన ధర్మక్షేత్ర సదస్సు నృత్య, సాంస్కృతిక కార్యక్రమాలతో కన్నుల పండువయింది. కార్యక్రమంలో పాల్గొన్న బాలబాలికలకు శ్రీవారు మంగళాశాసనములు కృపచేసారు. ధర్మక్షేత్ర సదస్సులో జిల్లా వికాస తరంగిణి అధ్యక్షురాలు శ్రీమతి జ్యోతిగారు గీతాజ్యోతి లక్ష్యాలను వివరించారు.

అనంతరం శ్రీవారు అనుగ్రహభాషణం గావిస్తూ **పరమభక్త శిఖామణులైన 'శ్రీకులశేఖరాళ్వారులు' ఆవిర్భవించిన రోజున 53వ ధర్మక్షేత్ర సదస్సు ప్రారంభించుకోవడం గొప్ప అదృష్టమన్నారు. భగవదనుభవంలో మునిగి అనుభవించి మనకు కూడ అనుభవించుట నేర్పే వారిని ఆళ్వారులంటారన్నారు. అట్టి మహనీయులైన శ్రీకులశేఖరాళ్వారు సూర్యుడు కుంభరాశిలో ఉన్నప్పుడు వచ్చే 'పునర్వసు' నక్షత్రంలో జన్మించారన్నారు. ప్రతిఒక్కరూ మహాత్ములను స్మరించుకొంటూ భగవత్, భాగవత కైంకర్యం చేసుకోవాలన్నారు. భూమిని పరిశుభ్రంగా ఉంచడం, భూమిపై ప్రవహించే నీళ్ళలో మురికిని పంపించకుండా ఉంచేటట్లు చేయడం వంటి పనులన్నీ భాగవత సేవగా భావించాలన్నారు. భగవంతుడు ప్రతి అణువణువులోనూ ఉంటాడు కాబట్టి వస్తువులను వాటివాటి నియమాలను బట్టి చూచినట్లయితే భగవంతుణ్ణి చూచినట్లేనని అన్నారు. శ్రీకృష్ణుని కులశేఖరులు సేవించినట్లు మనం కూడా భగవంతుని సేవించుకోవాలన్నారు. కులశేఖర విరచిత ముకుందమాల స్తోత్రాన్ని మనం పఠించాలన్నారు. "కృష్ణత్వదీయ పదపంకజ పంజరాంతః....."** అను ముకుందమాల శ్లోకాన్ని వివరించి చెప్పారు.

**మన శరీరంలోని ప్రతిభాగం ఎంత ముఖ్యమో, ప్రపంచంలోని ప్రతిజీవరాశిని కాపాడుకోవడం మనకు అవసరమన్నారు. సమాజంలోని అన్ని కులాలను, మతాలను గౌరవించాలన్నారు. దైవం ఒక్కటేకాని, అవి ధరించే రూపాలు అనేకం అని మనం గుర్తించాలన్నారు. కాని పీఠాధిపతులు, వేదాంతులు అని చెప్పుకొనే వారు కొందరు అంతా ఒక్కటేనని భావించడం, ఇతరులను ఆక్షేపించడం దురదృష్టకరవిషయమన్నారు. గీతాజ్యోతి కార్యక్రమాలను నిర్వహించుకొంటున్న వాళ్ళలో పూటకు తిండిలేనివారు కూడా తమవంతు కృషి సలుపుతూ ఈ కార్యక్రమంలో పాల్గొంటున్నారని** శ్రీవారు తెలియజెప్పారు.

అనంతరం శ్రీకృష్ణపూజలు నిర్వహించి, సుమారు 10వేలమందిచే నేతిదీపాలు వెలిగించి 'గీతాజ్యోతి' ప్రతిజ్ఞను చేయించారు. అనంతరం ఖమ్మంజిల్లాలోని నాగులవంచ గ్రామానికి ప్రయాణమయ్యారు.

## నాగులవంచలో.....

2వ తేదీరాత్రి ఖమ్మంజిల్లాచింతకాని మండలం 'శీతంపేట' గ్రామానికి శ్రీమాన్ గడ్డం ఉపేందర్‌రెడ్డి, శ్రీమాన్ సురేందర్‌రెడ్డి, శ్రీమాన్ కృష్ణారెడ్డి, శ్రీమాన్ నరేందర్‌రెడ్డిగార్ల ఆహ్వానంపై శ్రీవారు వేంచేసారు.

ఉదయం గం.8.05లకు శీతంపేట శివార్లలో ఉన్న నాగులవంచగ్రామంలో వెలసిఉన్న శ్రీగజగిరి లక్ష్మీనరసింహస్వామివారి దేవాలయంలో నూతన ధ్వజస్తంభప్రతిష్ఠ, ఉత్సవ విగ్రహ ప్రతిష్ఠలు శ్రీవారి కరకమలములమీదుగా జరిగాయి. శ్రీమాన్ డా॥ పి.సి.రెడ్డిగారి దంపతులు ఉత్సవ విగ్రహ ప్రదాతలుగా ఈ మహోత్సవంలో పాల్గొన్నారు. అనంతరం శ్రీవారు అచ్చటకు విచ్చేసిన సుమారు 10,000 మంది భక్తులనుద్దేశించి అనుగ్రహభాషణం చేసారు.

స్థానాచార్యులు శ్రీమాన్ లోకాచార్యస్వామి వారి యాజ్ఞికంలో శ్రీపాంచరాత్ర ఆగమ పద్ధతిలో, తెన్నాచార్య సత్సంప్రదాయంలో శ్రీగజగిరి లక్ష్మీనరసింహస్వామి ధ్వజ, ఉత్సవ విగ్రహ ప్రతిష్ఠలు జరిగినట్లు శ్రీవారు సెలవిచ్చారు. **ఆలయాలు సమాజంలోని లోపాలు తొలగించి సమాజాన్ని ఒకచోటుకి తెచ్చే కేంద్రాలని పలికారు.**

**నమ్మినవారందరికీ దేముడు సొంతమేనని, అతడు అందరి వాడూనని అన్నారు. ఆ దేముడుండేచోటు అందరిలోనూ అని సెలవిచ్చారు. దేవుడు మనవాడని, దేవుడు దగ్గర జరిగే కార్యక్రమం మనదని, దానికి మనందరం రావాలని శ్రీవారు ఉద్బోధించారు. కులమత తేడాలు లేకుండా, ఆస్తి, అంతస్తు తారతమ్యాలు లేకుండా అందరినీ ఒకచోట కలుపగలిగే ప్రదేశమే ఆలయమన్నారు. మనిషి స్వార్థాన్ని మంచిమార్గంలో పెట్టి పదిమందితో పంచుకునేటట్లు చేసేచోటు ఆలయమేనని శ్రీవారు అన్నారు. సమాజానికి మేలు కలిగే చోటు 'ఆలయం' కనుక మనందరికి ఒక ఆలయం ఉండాలన్నారు. మనిషిలో ఒకరకమైన శ్రద్ధ, వినయం, నిరాడంబరత లను కలిగించే స్థానం ఆలయమేనని అన్నారు. ఆలయం బాగుంటే ఆ చుట్టుప్రక్కలుండే ప్రాంతాలు పునీతమై సస్యశ్యామలంగా, సుభిక్షంగా ఉంటాయన్నారు. మనకి క్షేమాన్ని, స్వామికి ఆనందాన్ని చేకూర్చే అట్టి ఆలయాలను పరిరక్షించుకోవడం మనందరి కర్తవ్యమని, శ్రీవారు ఉద్బోధించారు.**

అనంతరం శ్రీవారు సీతానగరానికి ప్రయాణమై 3వతేదీ మధ్యాహ్నం గం.2.00లకు చేరుకున్నారు. సాయంత్రం గం.7.30లకు శ్రీవారితోపాటు నిర్వాహకులు, కార్యకర్తలు, 'కృష్ణావసంతోత్సవం' గూర్చి చర్చించుటకై వికాసతరంగిణి సమావేశంలో పాల్గొన్నారు. సమావేశానికి శ్రీమాన్ గంగరాజుగారు అధ్యక్షత వహించగా, శ్రీస్వామివారు, శ్రీ అష్టాక్షరీ రామనుజ జీయరు స్వామివారు, గ్రంధి సుబ్రహ్మణ్యం గారు, గుంటూరు జిల్లా జెడ్.పి. ఛైర్మన్ పి. నాగభూషణంగారు, శ్రీమాన్ కల్యాణ్యవతారం గారు, శ్రీమాన్ ఏలూరు రాజాగారు ప్రభృతులు సమావేశంలో పాల్గొన్నారు. శ్రీవారి కార్యక్రమ నిర్వహణకి తగు సూచనలందించారు. అష్టాక్షరీ జీయరుస్వామివారి మంగళాశాసనములతో సమావేశం ముగిసింది.

4వ తేదీ ఉదయం తీర్థగోష్ఠి అనంతరం సీతానగరం నుండి బయలుదేరి కృష్ణానదిలోని ప్రకాశం బ్యారేజి, రైల్వే బ్రిడ్జి మధ్యలోగల ప్రదేశానికి శ్రీవారు వేంచేసారు. భూకర్షణ (భూమి పూజ) కార్యక్రమము, యాగశాలలో గల ప్రధాన వేదికకు ఈశాన్య దిశయందు శిలాన్యాస కార్యక్రమములు శ్రీవారి శ్రీహస్తములచే జరిగినది. ఆగమ కళాశాల అధ్యాపకులు శ్రీమాన్ మధుసూదనాచార్యులు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు. అలాగే కాకతీయ సిమెంట్స్ & షుగర్స్ ఎమ్.డి. శ్రీమాన్ వీరయ్య గారు, శ్రీమాన్ ఎమ్.సి దాసుగారు, శ్రీమాన్ ఏలూరు రాజాగారు, శ్రీమాన్ పాపారెడ్డిగారు, వికాసతరంగిణి కార్యదర్శి శ్రీమాన్ భవానీప్రసాద్ గారు ప్రభృతులు ఈ కార్యక్రమానికి హాజరై 'కృష్ణావసంతోత్స'వానికై వివిధ పనులు చేపట్టుటకు అనేక విషయాలను శ్రీవారితో చర్చించారు. గుంటూరు ఆర్&బి అధికారులు ఇంజనీర్లు శ్రీవారితో కలసి ప్లాన్ చూపించి కార్యక్రమ నిర్వహణకు తగిన రోడ్లను, ఇతర సదుపాయము లను కలిగించు నిమిత్తం శ్రీవారితో చర్చించారు.

అనంతరం శ్రీవారు మాట్లాడుతూ పూర్వ రంగం చాలా వరకు సిద్ధమైందని, మిగిలినదంతా శ్రద్ధ, ఉత్సాహంకల కార్యకర్తలను ఎంపిక చేసుకొని, నిర్వాహకులు, కార్యకర్తలు, అంతా కలసి ఈ కార్యక్రమాన్ని ముందుకు నడిపించడానికి తమవంతు కృషిని చిత్తశుద్ధితో సల్పాలని సెలవిచ్చారు. అనంతరం మధ్యాహ్నం గం.1.00కు సీతానగరం నుండి 'వారిజ' ఆశ్రమానికి ప్రయాణమయ్యారు.

## వారిజ, విజయనగరం కార్యక్రమాలు

శ్రీవారు సీతానగరం నుండి బయలుదేరి విశాఖలోని 'వారిజ' ఆశ్రమానికి 4వ తేదీ రాత్రి గం.9.00లకు చేరుకున్నారు. 5వ తేదీ ఉదయం తీర్థగోష్ఠి అనంతరం గం.12.00లకు వారిజ ఆశ్రమ బిల్డింగు నిర్మాణముల గూర్చి సమావేశం ఏర్పాటైంది. సమావేశంలో వారిజ కమిటీ సభ్యులు శ్రీమాన్ ఎస్. రామానుజంగారు, శ్రీమాన్ కాశీరాజుగారు, శ్రీమాన్ జి.వి.వి. సత్యనారాయణ గారు, శ్రీమాన్ ఎమ్.ఆర్.కె. రాజుగారు, శ్రీమాన్



నాయుడుగారు, ఎన్విరాన్ మెంటల్ ఇంజనీరు శ్రీమాన్ నిర్మల్ కుమార్, ఆర్కిటెక్ట్ షబనమ్ పటేల్ మున్నగువారు శ్రీవారితో నిర్మాణపు పనులను గూర్చి చర్చించారు.

5వ తేదీ సాయంత్రం గం.5.00లకు ఎన్.ఎస్.టి.ఎల్. ను సందర్శించారు. అక్కడి ఎమ్.డి. మరియు సీనియర్ అధికారులు శ్రీవారికి ఘనస్వాగతం పలుకుతూ డిఫెన్స్ టెక్నాలజీలోని పలువిశేషాలను ప్రదర్శించి చూపారు. అనంతరం సింహపురి కాలనీలోని శ్రీరామాలయాన్ని సందర్శించి అచ్చటకు విచ్చేసిన భక్తులనుద్దేశించి అనుగ్రహ భాషణం గావించి మంగళాశాసనములు కృపచేసారు. పిదప సింహాచలేశ్వరుడైన శ్రీవరాహలక్ష్మీ నరసింహస్వామివారిని సేవించుకున్నారు.

6వ తేదీ ఉదయం తీర్థగోష్ఠి అనంతరం బయలుదేరిన శ్రీవారు విజయనగరం చేరుకొని మహారాజా కాలేజికి సమీపంలో ప్రారంభించబడిన వికాసతరంగిణి జోనల్ కార్యాలయానికి ప్రారంభోత్సవం చేసారు. పిదప జెట్ విజయనగరం శాఖ వారి ఆధ్వర్యవంలో నిర్మించబడిన నేత్ర విద్యాలయ వసతిభవన ప్రారంభోత్సవం శ్రీవారి కరకమలములచే జరిగింది. విజయనగరం పూల్‌బాగ్ రోడ్డులో ప్రేమసమాజం ఆవరణలో ఏర్పాటైన కార్యక్రమంలో శ్రీవారు పాల్గొని అనుగ్రహభాషణం చేసారు. నేత్రవిద్యాలయ అధ్యక్షులు శ్రీమాన్ బుచ్చిబాబుగారు అధ్యక్షత వహించగా గౌరవ అతిథులుగా విచ్చేసిన వివిధ ప్రముఖులు కార్యక్రమము లో ప్రసంగించారు. ఆంధ్రప్రదేశ్ రెవిన్యూశాఖా మాత్యులు శ్రీమాన్ పి. అశోక్ గజపతిరాజుగారు, జిల్లా కలెక్టర్ డా॥ రజత్‌కుమార్‌గారు వికలాంగుల అభివృద్ధిశాఖ, ఎ.డి. శ్రీమాన్ అబ్రహాంగారు. ప్రభుత్వపాలిటెక్నిక్ కళాశాల ప్రిన్సిపాల్ శ్రీమాన్ ఎస్. సుబ్బారావుగారు, ఇంటర్నేషనల్ వాటర్స్‌క్లబ్ అధ్యక్షులు శ్రీమాన్ జె.ఎల్. తోష్ని వాలాగారు, ప్రేమసమాజం కార్యదర్శి శ్రీమాన్ కృష్ణారావుగారు, జెట్ హైదరాబాద్ సాంస్కృతిక సంఘకార్యదర్శి శ్రీమతి పి. కృష్ణకుమారిగారు ప్రభృతులు సమావేశంలో శ్రీవారితో పాటు పాల్గొన్నారు.

అనంతరం శ్రీవారు మాట్లాడుతూ హోలీ పూర్ణిమ సందర్భంగా అనేక మంగళాశాసనములు చేసారు. **సమాజం చాలా విశాలమైనదని, ప్రతి ఒక్కరికి భౌతిక, మానసిక అవసరాలుంటాయని, ఈ రెండింటిని సమన్వయించి వారి అభివృద్ధికి తోడ్పడం గొప్పదని అన్నారు. ఈ పిల్లలు సమాజానికి ఉపయోగపడేటట్లు దేశీయ విద్యను నేర్చుకొంటున్నారు. గనుక అట్టివారి మానసిక అభివృద్ధికి తోడ్పడటం అవసరమని అన్నారు. ఈనాడు మనం రూపాయిలలో ఖర్చుపెట్టిన వస్తువు లను డాలర్లతో కొనుక్కొనే సంస్కృతిని అనుసరిస్తున్నా మన్నారు. ఇది సరికాదని, నేను, నాదేశం, నాజాతి అనే స్వాభిమానం మనలో కలగడానికి కృషి చేయాలని ఉద్బోధించారు.** అనంతరం శ్రీకాకుళానికి ప్రయాణమయ్యారు.

## శ్రీకాకుళం 54వ ధర్మక్షేత్రం

శ్రీవారు 6వ తేదీ రాత్రి గం.8.00లకు శ్రీకాకుళంలోని నారాయణ తిరుమలలోని శ్రీవేంకటేశ్వర దేవస్థానానికి శ్రీమాన్ జస్టిస్ జి.యతిరాజులుగారు, శ్రీమాన్ శ్రీనివాసులుగారు, జిల్లా వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ విశాల్‌గుప్తగార్ల ఆహ్వానంపై వేంచేసారు.

7వ తేదీ ఉదయం తీర్థగోష్ఠి అనంతరం సుమారు 300 మందికి శ్రీవారు సమాశ్రయణములు గావించి మంగళాశాసనములు చేసారు. మధ్యాహ్నం గం.4.00లకు నారాయణతిరుమల శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయం నుండి 7రోడ్ల జంక్షనులోగల మున్సిపల్ హైస్కూలు గ్రౌండులో గల ధర్మక్షేత్ర సభావేదిక వరకు శ్రీవారి ప్రత్యక్ష పర్యవేక్షణలో వైభవోపేతంగా జరిగిన శోభాయాత్రలో వేలాది భక్తులు పాల్గొన్నారు. పిదప సాయంత్రం గం.6.00లకు సభావేదికపై జరిగిన నృత్య, సాంస్కృతిక కార్యక్రమాలను శ్రీవారు సందర్శించి, పాల్గొన్నవారికి అనేక మంగళా

శాసనములు చేసారు.

తరువాత స్థానిక సంస్కృతిక కళాశాల అధ్యాపకులు శ్రీమాన్ శ్రీనివాస రామానుజంగారు శ్రీవారిని, ఇతర ముఖ్య అతిథులను సభకు ఆహ్వానించారు. వీరిలో హైకోర్టుజడ్జి శ్రీమాన్ జస్టిస్ యతి రాజులుగారు, రాష్ట్ర ఎక్సైజ్ మంత్రివర్యులు, శ్రీమాన్ టి. సీతారామ్‌గారు, మున్సిపల్ ఛైర్‌పర్సన్ శ్రీమతి పైడిశ్రీజయంతిగారు. జిల్లా కలెక్టర్ శ్రీమాన్ కె. విజయానంద్‌గారు, ఎండోమెంట్స్ ఆర్.టి.సి. శ్రీమాన్ జి.వి.నరసింహామూర్తిగారు, ఎమ్.ఎల్.ఎ.జి. అప్పల సూర్యనారాయణగారు, శ్రీవేంకటేశ్వర దేవస్థానం ప్రధానార్చకులు శ్రీమాన్ జి. శ్రీనివాస్‌గారు ప్రభృతులు ఉన్నారు.

తదుపరి ఉపనిషద్ మందిరం నుండి ఆరవిల్లి లక్ష్మీనారాయణాచార్యులు శ్రీవారికి శేషవస్త్రం, పూలమాలను సమర్పించారు. అనంతరం శ్రీకృష్ణ ప్రతిమముందు శ్రీవారు జ్యోతి ప్రజ్వలన గావించి ధర్మక్షేత్ర సదస్సును ప్రారంభించారు. సభావేదికపై నున్న ప్రముఖుల ప్రసంగాల తర్వాత శ్రీవారి అనుగ్రహభాషణం జరిగింది. "శ్రీకాకుళ పట్టణానికి అధినాథుడైన శ్రీకూర్మనాథస్వామిని ముందుగ సేవించుకొంటూ, జాతికి ఆరోగ్యాన్ని ప్రసాదించే శ్రీసూర్యనారాయణస్వామిని మనసారా సేవిస్తూ అందరికీ మంగళాశాసనములు చేస్తున్నామని అన్నారు. ఎవరు ఏరకమైన జీవితాన్ని, మార్గాన్ని ఎన్నుకున్నా మనందరికి అన్నం పెట్టేది భూమాతేనని గుర్తించాలన్నారు. జంతువులకూ, చెట్లకూ సకల ప్రాణులకూ మూలాధారమైనది ఈ భూమాతే. శ్రీమద్భాగవతంలో సృష్టి జరిగిన విధానాన్ని వివరించారు. మానవమనుగడకు అవసరమైన వన్నింటి యొక్క సృష్టి జరిగింది కనుకనే మనిషి సుఖసంతోషాలతో ఉండగలడని సెలవిచ్చారు. మనిషి మనిషి కలసి బ్రతకడం నేర్చుకోవాలని, సమాజాన్ని పూజిస్తూ సామాజిక ధర్మాన్ని పాటించాలని శ్రీవారు ఉద్బోధించారు. గీతాజ్యోతి ధర్మక్షేత్రంలో భాగంగా ప్రతీగ్రామంలో కోటి విష్ణుసహస్రనామ పారాయణం జరగడాన్ని శ్రీవారు కొనియాడుతూ ఇది విలక్షణమైన కార్యక్రమమని అంటూ మంగళాశాసనములు చేసారు.

అనంతరం శ్రీవారు శ్రీకృష్ణపూజలను నిర్వహించి సుమారు 5,000మంది భక్తులచే నేతిదీపాలు వెలిగించి 'గీతాజ్యోతి' ప్రతిజ్ఞను చేయించారు.

8వ తేదీ ఉదయం తీర్థగోష్ఠి అనంతరం పాంచరాత్రాగమముగా శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆలయ మహాసంప్రోక్షణ–శ్రీపద్మావతి అమ్మవారు, శ్రీ ఆళ్వార్ల విగ్రహ ప్రతిష్ఠ శ్రీవారి కరకమలములచే జరిగినవి. పిదప 47 అడుగుల ఎత్తైన గరుడ విగ్రహ ఆవిష్కరణ శ్రీవారి కరకమలములచే జరిగినది. అనంతరం ఆలయప్రాంగణములో ఏర్పాటు చేసిన సభావేదికపైకి శ్రీవారు వేంచేసారు. ఈ సందర్భంగా ఎండోమెంట్స్ ఆర్.టి.సి. శ్రీమాన్ నరసింహారావుగారు మాట్లాడుతూ ఈ కార్యక్రమానికి 4.5 లక్షలు ఖర్చయిందని, ఇట్టి కార్యక్రమములు నిర్వహించుటకు 'డిపార్టమెంటు'వారు అద్భుతగుల కూడదని, భక్తులను ముందుంచి కార్యక్రమములను నడిపించాలని, తెలియజేసారు.

అనంతరం శ్రీవారు అనుగ్రహభాషణం చేసారు. **"ఆలయంలో నిత్యసేవ చేసే అర్చకుడు చాలా ప్రధానమన్నారు. అలాగే భగవంతునిలో భాగంగా దర్శించే భక్తులు, అర్చకులు, ఆలయ నిర్వాహకులు, అధికారులు, అందరూ ప్రధానమే నని అన్నారు. ఆలయానికి వెళుతున్నామంటే, అది మన సంస్కృతికీ, సంప్రదాయానికీ, ధర్మరక్షణకూ, సమాజ శ్రేయస్సుకూ దోహదపడేస్ఫూర్తిని, మానసిక బలాన్ని కలిగించేదిగా ఉండాలన్నారు. అప్పుడే అది ఆలయమని పిలువబడుతుందని"** అన్నారు. పిదప కాకినాడకు ప్రయాణమయ్యారు.

## కాకినాడ 55వ ధర్మక్షేత్రం

8వ తేదీ రాత్రి గం.8.00లకు శ్రీవారు కాకినాడ పట్టణానికి వేంచేసారు. 9వ తేదీ ఉదయం కాకినాడలోని కలెక్టర్ ఆఫీసు ప్రక్కన లేడీస్



క్లబ్‌లో గం.9.30లకు ధార్మిక సదస్సు ప్రారంభమైంది. గీతాజ్యోతి ధర్మక్షేత్ర సదస్సు కన్వీనరు శ్రీమాన్ కణ్ణన్‌కుమార్ శ్రీవారిని వేదికపైకి ఆహ్వానించారు. పిదప ధర్మక్షేత్ర సదస్సుకు అధ్యక్షులు శ్రీమాన్ డా॥ బి. సురేంద్రరెడ్డిగారు గౌరవ అధ్యక్షులు శ్రీమాన్ పెద్దబాబుగారు, వికాసతరంగిణి జిల్లా అధ్యక్షులు శ్రీమాన్ కె. పాపారాయుడుగారు, శ్రీమాన్ సి.హెచ్. ప్రసాదరెడ్డిగారు, ప్రభృతులు గీతాజ్యోతి ధర్మక్షేత్రము గూర్చి తమతమ అభిప్రాయాలను, అనుభవాలను సభలో వెల్లడించారు. తత్త్వప్రచారకులు శ్రీమాన్ కుమార్‌రాజాగారి మార్గదర్శకత్వంలో జరిగిన ప్రచార కార్యక్రమాలలో విశేషంగా పాల్గొన్న కొందరు కార్యకర్తలు 'గీతాజ్యోతి'ని గూర్చి తమతమ అభిప్రాయాలను వెల్లడించారు. కాకినాడ చుట్టుప్రక్కల 15 మండలాలలో గల 110 గ్రామాలలో గీతాజ్యోతి ధర్మక్షేత్ర ప్రచారం జరిగిందని చెప్పారు.

అనంతరం శ్రీవారు అనుగ్రహ భాషణం చేసారు. గీతాజ్యోతి ప్రారంభానికి కారణాన్ని విశదపరచారు. **"ఈనాడు అనేక అరిష్టాలు కలుగుతున్నాయన్నారు. ప్రకృతి వైపరీత్యాల వలన అనేకమంది ప్రాణాలు కోల్పోతున్నారని, దీనికి కారణం అవమానించబడిన భూమియొక్క స్పందనగా గుర్తించి, మనలో, మన జీవనవిధానంలో మార్పు రావాలనే ఉద్దేశ్యంతో ప్రారంభించబడిన కార్యక్రమమే ఈ 'గీతాజ్యోతి' అన్నారు. మనిషికి మానసికమైన ధైర్యం కావాలంటే భగవంతుడిని ప్రార్థించాలన్నారు. అందుకు 'గీతాజ్యోతి' తోడ్పడుతుందన్నారు.**

**"సమాజమంతా ఒక శరీరమైతే, మనిషి పశుపక్ష్యాదులు, మట్టి, నీరు విభిన్న అంగాలు. కాని అన్ని ప్రాణులలోను బలహీనమైన ప్రాణి మనిషి. ప్రకృతికి విరుద్ధంగా నడవడానికి ప్రయత్నిస్తాడు. దీనినే నాగరికత అంటూ పేరు పెట్టుకున్నాడు. కాని మనిషిలా ఆలోచించగలిగినంత శక్తి ఇతర ఏ ప్రాణికీ లేదు. కాని ఆ ఆలోచన సమర్థవంతంగా, ప్రయోజనకరంగా కాకుండా వినాశకరంగా ఆలోచిస్తున్నాడు అలాంటి మనిషిలో మానసిక పరివర్తనానికే గీతాజ్యోతి"** అంటూ సెలవిచ్చారు శ్రీస్వామివారు.

**భగవంతుడు ఈ ప్రపంచాన్నంతటినీ శరీరంగా చేసుకొని అందులో ఉన్నాడన్నారు. ఈ ప్రపంచంలో మానవులతో సహా సకల చరాచరాలన్నీ ఆ శరీరంలోని భాగాలేనని అన్నారు. ప్రకృతికి ఎంత దగ్గరగా బ్రతకగలిగితే అంత మానవత్వం ఉన్నట్లు లెక్క. ప్రకృతిలో దేనిని జాగ్రత్తపెట్టినా అది భగవం తుని ప్రేమించినట్లే. దేనిని పాడుచేసినా అది భగవం తునిపై మురికి జల్లినట్లేనని అన్నారు. "న తదస్తి వినా యత్స్యాత్ మయా భూతం చరాచరః" అని భగవంతుడు భగవద్గీతలో చెప్పాడు. కొత్తగా భగవత్తత్వాన్ని సృష్టించినక్కరలేదు. ఉన్నదానిని గుర్తించిన చాలు. దానికోసమే సర్వప్రాణిసేవ మాధవసేవగా చేయాలనేది నినాదమని అన్నారు.**

**కృష్ణుడు భగవద్గీతను ఆస్తికులకు, నాస్తికులకు అందరికోసం చెప్పాడన్నారు. "పరస్పరం భావయంతః....." అని భగవద్గీత 3వ అధ్యాయంలో భగవంతుడు చెప్పాడు. మానవు లంతా కలసి జీవించాలి. ఇతర ప్రాణులతో కూడ సామరస్యాన్ని కలిగి ఉండాలనేది భగవద్గీత సందేశం. కావున మనమంతా ''గీతాజ్యోతి'' కార్యక్రమాలు చేసుకొంటున్నామన్నారు. మననోటిలోని పళ్ళు గట్టిగా, దృఢంగా ఉన్నా, వాటి మధ్యమృదువైన నాలుక ఎంత చక్కగాతన పనులు తాను చేసుకుంటుందో, అదే విధంగా ఈ సమాజంలో ఎన్ని భిన్న సంప్రదాయాలు, ఆరాధనలు ఉన్నా, మనమంతా కలసిమెలసి ప్రకృతితో సహజీవనం గడుపుకోగల గాలని ఉద్బోధించారు.**

అనంతరం శ్రీవారి ప్రత్యక్ష పర్యవేక్షణలో తీర్థగోష్ఠి జరిగింది. పిదప సాయంత్రం గం.5.00లకు బాలత్రిపురసుందరి దేవాలయం నుండి అత్యంత వైభవంగా శోభాయాత్ర ప్రారంభమై లేడీస్‌క్లబ్ గ్రౌండ్ వరకు సాగింది. వేలాదిమంది భక్తులు ఆనంద, భక్తి, ఉత్సాహాలతో శ్రీవారితో సహా

పాల్గొన్నారు. శ్రీవారు శ్రీకృష్ణపూజల ఉద్దేశ్యాన్ని వివరించి, సుమారు 10వేల మంది భక్తులచే నేతిదీపాలు వెలిగించి 'గీతాజ్యోతి' ప్రతిజ్ఞను చేయించారు. అనంతరం మండపేటకు ప్రయాణమయ్యారు.

## మండపేటలో....

9వ తేదీ రాత్రి గం.11.00లకు మండపేటలోని శ్రీమాన్ కర్రిపాపారాయుడుగారి గృహానికి వేంచేసారు. 10వ తేదీ ఉదయం తీర్థగోష్ఠి అనంతరం సుమారు 100మంది పిల్లలకు శ్రీవారు అక్షరాభ్యాసం చేయించారు. సాధారణంగా అక్షరాభ్యాసం చేసినపుడు "ఓం నమః శివాయ సిద్ధం నమః" అని వ్రాస్తారు. కాని "ఓం అస్మద్గురుభ్యో నమః" అని వ్రాసి శ్రీవారు పిల్లలందరికి అనేక మంగళాశాసనములు కృపచేసారు. **భగవంతుని గూర్చి తెలిపేది గురువని, జీవితంలో ఏ సమస్యనైనా పరిష్కరించుకునే తెలివిని ప్రసాదించే వాడు కూడా ఉత్తముడైన గురువేనని శ్రీవారు ఉద్బోధించారు. అట్టి గురువుయెడల భక్తికలిగి ఉండడం ఆవశ్యకమన్నారు. అట్టి గురుభక్తిని కలిగించడానికి పునాదిగా అక్షరాభ్యాస కార్యక్రమాలు మనం నిర్వహిస్తామన్నారు.**

**"విద్యా దద్గాతి వినయం, వినయాద్యాతి పాత్రతా...." అనే శ్లోకాన్ని శ్రీవారు సభలో పిల్లలు, వారి తల్లిదండ్రులు, భక్తులందరికీ వినిపించి గురువుయొక్క ప్రాముఖ్యతను వివరించారు. మంచివిద్య వలన వినయం కలుగుతుందన్నారు.** అట్టి విద్యా ధనాన్ని ప్రసాదించేవాడు సద్గురువేనని శ్రీవారు సెలవిచ్చారు. మనిషి మంచిగా ఉండడం, చేతనైనంతలో పదిమందికి ఉపకారం చేయడం వంటి జీవనాన్ని ధార్మిక జీవనమంటారని అన్నారు. జీవితంలో మొదటినుండి చిట్టచివరిదాకా ప్రత్యక్షంగా నడిపించగలిగేవాడు గురువేనని అన్నారు. అట్టి గురువు మార్గదర్శకత్వంలో పయనించేవాడు మంచిమనిషిగా జీవితంలో చెల్లుబాటు కాగలుగుతాడన్నారు.

అనంతరం ఉదయం గం.11.00లకు జిల్లావికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ పాపారాయుడుగారు, జోనల్ కార్యదర్శి శ్రీమాన్ ఏలూరి రాజాగారు, శ్రీమాన్ దొరబాబుగారు ప్రభృతుల ఆధ్వర్యవంలో వికాసతరంగిణి జిల్లా కార్యాలయాన్ని శ్రీవారు ప్రారంభించారు. రాజమండ్రి, విజయవాడల మీదుగా నడిగడ్డ పాలెంకు ప్రయాణమయ్యారు.

## నడిగడ్డపాలెంలో, తెనాలిలో....

10వ తేదీ రాత్రి గం.9.30లకు శ్రీవారు 'నడిగడ్డపాలెం' జీయరు మఠానికి వేంచేసారు. 11వ తేదీ ఉదయం తీర్థగోష్ఠి అనంతరం గం.11.00లకు ఆశ్రమంలోని యాగశాల నిర్మాణానికి శంకుస్థాపన చేసారు. పిదప శ్రీమతి కొల్లిపాక భ్రమరాంబగారి పరమపదోత్సవంలో శ్రీవారు పాల్గొని మంగళా శాసనములు చేసారు. అనంతరం గం.2.00లకు 'నడిగడ్డపాలెం' నుండి బయలుదేరిన శ్రీస్వామివారు వివేక విద్యాసంస్థల అధ్యక్షులైన శ్రీమాన్ ఆర్. వీరనారాయణ్‌గారి ఆహ్వానంపై తెనాలిలోని వివేకనగర్‌లో గల శ్రీవివేకానంద జూనియర్ కళాశాల16వ వార్షికోత్సవ సభలో పాల్గొన్నారు. వేదస్వస్తి వచనముల తరువాత శ్రీస్వామివారు 'జ్యోతిప్రజ్వలన'గావించి సభను ప్రారంభించారు. సభకు గౌరవ అధ్యక్షులుగా విచ్చేసిన మాజీ శాసనసభ్యులు శ్రీమతి డా॥ గోగినేని ఉమ, తెనాలి మున్సిపల్ చైర్మన్ శ్రీమాన్ యడ్ల గంగాధరరావు గార్లకు శ్రీవారు జ్ఞాపికలందజేసి, మంగళాశాసన ములు చేసారు. పిదప కళాశాల డైరెక్టర్ శ్రీమాన్ వీరనారాయణ్‌గారు వార్షికోత్సవ నివేదికను చదివి వినిపించారు. వివిధ శాఖలకు చెందిన విశిష్ట సేవాపతక గ్రహీతలకు శ్రీవారు జ్ఞాపికలందజేసి, మంగళాశాసనములు కృపచేసారు. అనంతరం శ్రీమాన్ 'హరికిషన్'గారి మిమిక్రీ కార్యక్రమం ప్రేక్షకులను ఆకట్టుకొంది. తదుపరి శ్రీవారు కళాశాల విద్యార్థులు, అధ్యాపకులు, ఆహూతులైన పెద్దలు, భక్తులందరినుద్దేశించి అనుగ్రహభాషణం చేసారు.



**"సా విద్య యా విముక్తయే........" అను శ్రీపరాశర మహర్షివేలసంవత్సరాలకు పూర్వం చెప్పాడన్నారు. సమస్యల నుండి బయటపడగలిగే తెలివినే 'విద్య' అంటారన్నారు. సమస్యలనుండి బయటపడడం మనుష్యులకన్నా పక్షులకు, జంతువులకు బాగా తెలుసునని అన్నారు. వాటిని మనం విద్యావంతులనవచ్చు. అయితే జంతువులకు, మనుష్యులకు భేదమేమి? మనం విద్యను ఇతరులకు తెలియజేయటానికి అక్షరాలను నేర్చుకుంటామని అన్నారు. మన తెలివిని, అనుభవాన్ని ఎదుటివారికి అందివ్వడానికి అక్షరాలు కావాలన్నారు. అట్టి సద్విద్యను సమర్థవంతంగా పిల్లలకు అందించేవి స్కూళ్ళని అన్నారు. మనం సరియైన సద్విద్యను పొందినట్లయితే అందరు దేవతలూ మన చుట్టూ ఉండి మనకు సహకరిస్తారని, మన అవసరాలు తీర్చు కునే విధంగా తోడ్పడతారని శ్రీవారు ఉద్బోధించారు".** అనంతరం సీతానగరానికి ప్రయాణమయ్యారు.

## సీతానగరం, కోదాడలలో...

11వ తేదీ సాయంత్రం గం.5.00లకు చేరుకున్నారు. 12వ తేదీ ఉదయం తీర్థగోష్ఠి అనంతరం మధ్యాహ్నం గం.2.00లకు **'కృష్ణా వసంతపురి'**లో కార్యకర్తల సమావేశంలో శ్రీవారు పాల్గొన్నారు. శ్రీమాన్ గోకరాజు గంగరాజుగారి అధ్యక్షతలో, కృష్ణావసంతపురి నిర్వాహకులు శ్రీమాన్ చక్రధర్‌గారు, కృష్ణా, గోదావరి జిల్లాల గీతాజ్యోతి సమన్వయకర్త శ్రీమాన్ రాజాగారు, వికాసతరంగిణి సెంట్రల్ కమిటీ కార్యదర్శి శ్రీమాన్ భవానీ ప్రసాద్‌గారు ప్రభృతుల ఆధ్వర్యవంలో సుమారు 300మంది వాలంటీర్లనుద్దేశించి శ్రీవారు సేవాకార్యక్రమాల వివరాలను తెలియజేసి అనుగ్రహభాషణం చేసారు. కృష్ణావసంతోత్సవ వేడుకలు సక్రమంగా నిర్వహించుటకు అవసరమైన 24 విభాగాలను శ్రీవారు కార్యకర్తలకు వివరించి స్వయంక్రమశిక్షణతో సేవలందించాలని సెలవిచ్చి అందరికీ మంగళాశాసనములు కృపచేసారు. 13వ తేదీ తీర్థగోష్ఠి సీతానగరం ఆశ్రమంలో జరిగింది. సాయంత్రం గం.6.00లకు సీతానగరం నుండి బయలుదేరి కోదాడ చేరుకున్నారు. 'ఇండియన్ టెంపుల్ డివోషన్' ధర్మ సంప్రదాయ వార పత్రిక పబ్లిషర్&ఎడిటర్ అయిన శ్రీమాన్ రమేశ్‌బైరుగారి ఆహ్వానంపై కోదాడలోని ఇ.వి. రెడ్డి డిగ్రీకళాశాల ఆవరణలో ఏర్పాటు చేయబడిన సభావేదికకు శ్రీవారు రాత్రి గం.9.30లకు చేరుకున్నారు. సభలో పత్రిక ఎడిటర్ శ్రీమాన్ రమేష్‌గారితో పాటు కోదాడ ఎం.పి.పి. శ్రీవంగవీటి రామారావుగారు, మాజీ శాసనసభ్యులు శ్రీమాన్ ఎన్. ఉత్తమ్ కుమార్‌రెడ్డిగారు, జిల్లా తెలుగు మహిళా అధ్యక్షురాలు శ్రీమతి దంతాల దమయంతిగారు, జూబ్లీ హిల్స్ బ్యాంక్ లిమిటెడ్ సి.ఇ.ఓ. శ్రీమాన్ జి. అమృతారెడ్డిగారు, యు.ఎస్.ఎన్.ఎల్. హైదరాబాద్ బ్రాంచ్ మేనేజర్ శ్రీమాన్ అనిల్ కుమార్ మిశ్రా ప్రభృతులు పాల్గొన్నారు. అనంతరం శ్రీవారి కరకమలములచే 'పత్రిక' ఆవిష్కరణ అందజేసారు. ఈ సందర్భంగా శ్రీవారు అనుగ్రహ భాషణం చేస్తూ **ఆలయాలు సమాజానికి స్ఫూర్తి కేంద్రకాలవంటివన్నారు. సమాజానికి అవసరమైన అట్టి ఆలయాలలో అర్చామూర్తి రూపంలో దేము డుంటాడని, దైవానికి, మనకి సంబంధం ఏమిటో తెలిస్తే అప్పుడు మన జీవన విధానం దానికను గుణంగా మార్చుకోగల సమర్థులం కాగలుగుతామని** శ్రీవారు సెలవిచ్చారు.

**మనిషి జీవించడమనేది ఒక లక్ష్యం కోసం కాదు. ఉన్నత విలువలతో జీవించి మళ్ళీ జన్మ లేకుండా చేసుకోవడం. భారతీయ ధార్మిక జీవనమనేది సమాజానికి ఉపయోగడేటట్లుండా లన్నారు. నేడు మనం దురదృష్టవశాత్తు వేర్లను కోసేసుకొని మొక్కను కాపాడుకోవాలనుకొంటున్నాం. వేర్లవంటి ఆలయాలను పరిరక్షించుకోగలిగితేనే సమాజమనే మొక్కకు నిజమైన రక్షణ చేకూరుతుందని అన్నారు. ఈ మార్గంలో ధార్మిక సంప్రదాయ విషయాల విజ్ఞానాన్ని ప్రజలకు అందించడానికి**

**ఉపయోగపడే 'ఇండియన్ టెంపుల్ డివోషన్' వంటి పత్రికల బాధ్యత ఎంతైనా ఉందని అంటూ పత్రికపురోభివృద్ధితో పాటు మంచి మార్గదర్శకత్వానికై అనేక మంగళాశాసనములు కృపచేసారు.** పిదప 'మేళ్ళచెరువు'కు బయలుదేరారు.

**మేళ్ళ చెరువులోని శ్రీకళ్యాణ వేంకటేశ్వరస్వామివారి బ్రహ్మోత్సవాలలో....**

13వ తేదీ రాత్రి గం.10.30లకు నల్గొండ జిల్లాలోని 'మేళ్ళచెరువు'లో గల శ్రీనగర్ కాలనీలోని శ్రీ కళ్యాణవేంకటేశ్వరస్వామివారి దేవస్థానమునకు శ్రీవారు వేంచేసారు. "మై హోమ్ సిమెంట్స్ ఇండస్ట్రీస్ లిమిటెడ్" చైర్మన్ శ్రీమాన్ రామేశ్వరరావుగారు, మహాసిమెంట్ ఫ్యాక్టరీ సిబ్బంది, భక్తులంతా కలసి శ్రీవారికి పూర్ణకుంభస్వాగతం పలికారు.

17.03.04 వరకు జరిగే బ్రహ్మోత్సవాల కార్యక్రమాలలో భాగంగా 13వ తేదీరాత్రి పెరుమాళ్ళ తిరువీధిఉత్సవంలోను, ఎదురుకోలోత్సవంలోను శ్రీవారుపాల్గొని అనుగ్రహభాషణం గావించి మంగళాశాసనములు చేసారు. 14వ తేదీ ఉదయం తీర్థగోష్ఠి అనంతరం పద్మావతీ శ్రీనివాసుల కళ్యాణ మహోత్సవంలోను, సాయంత్రం జరిగిన డోలోత్సవంలో పాల్గొని శ్రీరామేశ్వరరావు దంపతులతో సహా విచ్చేసిన భక్తజనులందరికీ అనేక మంగళాశాసనములు కృపచేసారు. **భగవంతుని నిశ్చలంగా, నిండుగా, భక్తితో మన హృదయంలో నింపుకొని స్ఫూర్తిని పొందడానికి చిహ్నంగా ఈడోలోత్సవం జరుపుకొంటామన్నారు.**

15వ తేదీ తీర్థగోష్ఠి అనంతరం 'మై హోమ్ సిమెంట్ లిమిటెడ్' చైర్మన్ శ్రీమాన్ జె. రామేశ్వరరావుగారి ఆహ్వానంపై ఫ్యాక్టరీని సందర్శించి, ఇంజనీర్లు, ఇతర ఉద్యోగులనుద్దేశించి శ్రీవారు అనుగ్రహభాషణం చేసారు. బ్రహ్మోత్సవాల సందర్భంగా 'మహాసిమెంట్స్' అధినేత శ్రీమాన్ జె. రామేశ్వరరావు గారు శ్రీస్వామివారిచే ఉద్యోగులకు 1నెల బోనస్ జీతమును ప్రకటించగా అందరూ ఆనందోత్సాహాలను వెల్లడించారు. ఈబ్రహ్మోత్సవాలలోని భాగంగా 4వ రోజు సాయంత్రం ప్రణయకలహోత్స వం, గరుడసేవామహోత్సవం ఘనంగా జరిగాయి.

దేవేర్లను, శ్రీస్వామివారిని పట్టుబట్టలతో పలురకాల పూలతో అలంకరించి గరుడవాహనంపై కూర్చుండబెట్టి మేళతాళాలతో 'తిరువీధి ఉత్సవం, ఊరేగింపు' ఆనందోత్సాహాల మధ్య సాగింది. గరుడవాహనంపై బయలుదేరిన స్వామివారి దంపతులను తిరుమంగై ఆళ్వార్ దోపిడిదొంగల ముఠాదోచుకోవడం, పట్టుబడడం, దోచుకున్న వజ్ర వైఢూర్య ఆభరణాలన్నింటిని మరల అప్పగించటం వంటి దృశ్యాలు ఎంతో కన్నుల పండువుగా వేదవిద్యార్థులు జరిపించి చూపించారు. పిదపవారు శ్రీస్వామికి శాశ్వతదాసులుగా మారిన ఘట్టాన్ని పూర్వం ఎలా జరిగిందో అదేవిధంగా జరిపించి ప్రదర్శించడం భక్తులను ఎంతగానో ఆకట్టుకొంది. ఈ కార్యక్రమాల్లో శ్రీరంగం నుండి వేంచేసిన పెరుమాళ్ళ వాహకబృందం గరుడవాహనాన్ని అనేక రీతులలో బ్రహ్మోత్సవ వేడుకలలోని యజ్ఞయాగాది అర్చకకార్యక్రమాలు ఆగమవేదపండితులు శ్రీమాన్ ముడుంబై రామానుజాచార్యులు, శ్రీమాన్ ప్రణిత్‌కుమార్ ఆచార్యులు, శ్రీమాన్ యుగంధరాచార్యులు మున్నగువారి మార్గదర్శకత్వంలో నిర్వహించబడ్డాయి. శ్రీవారు అనుగ్రహభాషణం కావిస్తూ గరుడుడు వేదాలకు ప్రతీక అని, గరుడునిపైనున్న స్వామి వేదాలలో నిగూఢంగానున్న తత్త్వానికి చిహ్నమని తెలియజేసారు. భక్తులను కాపాడటం కోసం త్వరితగతిలో గరుడారూఢుడై స్వామి ఈ భూమిపైకి వేంచేస్తాడని శ్రీవారు సెలవిచ్చారు. అనంతరం భజనలు, తీర్థప్రసాదాల వినియోగంతో నాటిదినం ఉత్సవం ముగిసింది.

మరునాడు 16వ తేదీ ఉదయం తీర్థగోష్ఠి అనంతరం పాఞ్చాహ్నిక యజ్ఞ మహాపూర్ణాహుతి జరిగింది. శ్రీసుదర్శన పెరుమాళ్ళకు అభిషేకం చక్రవారి జరిగింది. పిదప పుష్కరిణిలో శ్రీవారితో సహా భక్తులంతా చక్రస్నానమాచరించారు. సాయంత్రం ఈ ఉత్సవంలో జరిగినటువంటి సమస్త



దోషాలకు ప్రాయశ్చిత్తంగా ద్వాదశారాధన, శ్రీపుష్పయాగం జరిగాయి. అనంతరం దేవతోద్వాసనం ధ్వజపట అవరోహణం-శయ్యంత పూజ (ఊంజల్‌సేవ) కనుల పండువుగా జరిగాయి.

మరునాడు 17వ తేదీ శ్రవణానక్షత్రం, ఏకాదశి, బుద్ధవారం, ఉదయం తీర్థగోష్ఠి అనంతరం పెరుమాళ్ళకు విశేషంగా 108 కలశాలతో తిరుమంజన కార్యక్రమము శ్రీవారి పర్యవేక్షణలో నిర్వహించబడినది.

17వ తేదీ మధ్యాహ్నం గం.2.30లకు నల్గొండజిల్లాలోని నకిరేకల్లు మండలంలోని 'పాలెం' గ్రామానికి శ్రీవారు వేంచేసారు. పాలెంలోని శ్రీలక్ష్మీ నరసింహస్వామి దేవస్థానం నూతన ధ్వజస్తంభ ప్రతిష్ఠా మహోత్సవాలలో శ్రీవారు పాల్గొనగా ఆలయ ధర్మకర్తలుశ్రీమాన్ డా॥ జి. కిషన్‌రావుగారు, శ్రీమాన్ ఎమ్.దశరథరెడ్డిగారు, శ్రీమాన్ జి. కళ్యాణ్‌కుమార్ గారు, ప్రధానార్చకులు శ్రీమాన్ రామగోపాలాచార్యులు, భక్తులు అంతా కలసి శ్రీవారికి ఘనస్వాగతం పలికారు. అనంతరం ధ్వజస్తంభ ప్రతిష్ఠా మహోత్స వము, దృష్టి కుంభం, నేత్రోన్మీలనం, మూర్తి కుంభాభిషేకం మున్నగు కార్యక్రమాలు శ్రీవారి ప్రత్యక్షపర్యవేక్షణలో జరిగాయి. శాంతి కళ్యాణా నంతరం శ్రీవారి అనుగ్రహభాషణం జరిగింది. ఏకాదశి, శ్రవణానక్షత్రం గల ఈ రోజున శ్రీసుందరనరసింహస్వామివారి సన్నిధానంలో ధ్వజస్తంభ ప్రతిష్ఠాపన కార్యక్రమము జరగడం శుభదాయకమని మంగళాశాసనములు చేసారు.

**"భగవంతుడు అపారదయాసముద్రుడు. ఎన్నో అవతారాలు ఎత్తినది భక్తులకోసమే. అతన్ని పూజించినా, పూజింపకపోయినా, ప్రేమించినా, ప్రేమించకపోయినా అతను మనందరిపై దయ చూపిస్తాడన్నారు. విశ్వసించిన వాళ్ళకి భగవంతుడు అంతటా ఉంటాడని, శక్తినిస్తుంటాడని అన్నారు. శరీరానికి ఏర్పడే స్పర్శవల్ల మనసు ప్రభావితమవకూడదని ప్రహ్లాదుని ఉదాహరణగా చెప్పారు. సుఖాన్ని దుఃఖాన్ని తట్టుకోగలిగే మానసిక శక్తికావాలి. అతడు మనకు మనోబలాన్ని ఇవ్వాలి. అట్టి సన్నిధి మనకు కావాలి. దానికి ప్రతీకే నరసింహ స్వామి ఆలయమన్నారు.**

## హైదరాబాద్‌లో....

శ్రీవారు జెట్ హైదరాబాద్‌కు సాయంత్రం గం.6.00లకు వేంచేసారు. 18వ తేదీ తీర్థగోష్ఠి అనంతరం శ్రీవారి ప్రత్యక్ష పర్యవేక్షణలో జంటనగరాల వికాసతరంగిణి సమన్వయ కమిటీ ద్వితీయ వార్షికోత్సవం జరిగింది. జంటనగరాల వికాసతరంగిణి సెక్రటరీ శ్రీమతి కృష్ణకుమారిగారు పద్యకవితలలో శ్రీవారిని, అతిథులను వేదికపైకి ఆహ్వానించారు. వికాసతరంగిణి జంటనగరాల అధ్యక్షులు కల్కి అవతారంగారు, ఉపాధ్యక్షులు శ్రీమాన్ వరకుమార్‌గుప్తాగారు, జోనల్ సెక్రటరీ పద్మనాభరావుగారు మరియు వనజాచలపతిరావు గార్లు పాల్గొన్నారు. విశిష్ట అతిథులు సెంట్రల్ జెట్ కోశాధికారి శ్రీమాన్ జె. రామేశ్వరరావుగారు, హైదరాబాద్, జెట్ చైర్ పర్సన్ శ్రీమతి శ్రీకుమారి గారు. హైదరాబాద్ జెట్ సెక్రటరీ శ్రీమాన్ పురుషోత్తమరావుగార్లు కార్యక్రమంలో పాల్గొన్నారు. శ్రీస్వామివారు అనుగ్రహభాషణం చేసారు. కృప చేస్తూ జంటనగరాల సమన్వయ కమిటీ ఆధ్వర్యవంలో మంచి కార్యక్రమాలు జరుగుతున్నా యని, ఇంకా మంచి కార్యక్రమాలు జరపటానికి ప్రోత్సాహాన్నిస్తూ అనేక మంగళాశాసనములు చేసారు. వందనసమర్పణ, శాంతిమంత్రాలతో కార్యక్రమం ముగిసింది.

అనంతరం శ్రీస్వామివారు బషీర్‌బాగ్‌లోని ప్రెస్‌క్లబ్‌లో నిర్వహించబడిన ప్రెస్‌మీట్‌లో పాల్గొన్నారు. **TTD కార్యక్రమం జోక్యం గురించి పూర్వరంగమంతా వివరించారు. రెండున్నర కోట్ల నిధుల మంజూరును గూర్చిన సరియైన అవగాహన కలిగించారు. రామాయణంలో హనుమంతుడు చాలా గొప్పజర్నలిస్టని, చాల తక్కువ మాటలతో ఎక్కువ సూచనలనివ్వగలడని శ్రీవారు చెపుతూ "దృష్టా సీతా!" అంటూ రామునికి ఊరటను**

**కలిగించాడని సెలవిచ్చారు. అదే విధంగా ప్రతి జర్నలిస్టు గూడ సరియైన సమాచారాన్ని ప్రజలకు అందివ్వగలగాలని** సూచిస్తూ మంగళాశాసనములు చేసారు.

18వ తేదీ సాయంత్రం, గం.6.00లకు హైదరాబాద్‌లోని శిల్పారామం వద్ద అన్నమయ్య పురంలో అన్నమాచార్య భావనావాహిని వారు నిర్వహించే కార్యక్రమానికి శ్రీవారు వేంచేసారు. శ్రీమతి డా॥ శోభారాజ్‌గారు, శ్రీమాన్ డా॥ ఎస్. నందకుమార్‌గార్ల ఆధ్వర్యవంలో హై-టెక్ సిటీ నాలుగు రోడ్ల కూడలిలో అన్నమాచార్యమూర్తి ఆవిష్కరణ శ్రీవారి కరకమలముల మీదుగా, జరిగింది. అనంతరం సాయంత్రపు సభకు ఆహ్వానించబడిన ప్రముఖులలో శ్రీవారితోపాటు టిటిడి ఛైర్మన్ శ్రీమాన్ డి.కె. ఆదికేశవులు నాయుడుగారు, ఆంధ్రప్రదేశ్ "ఛీఫ్ పోస్ట్ మాస్టర్ జనరల్" శ్రీమాన్ టి.ఎస్. గోవిందరాజన్‌గారు ఉన్నారు. తిరుమల తిరుపతి దేవస్థానం శ్రీ కార్యనిర్వహణాధికారి శ్రీమాన్ ఎన్. రమేష్ సమాపనోత్సవంలో ఆంధ్రప్రదేశ్ చీఫ్ పోస్ట్‌మాస్టర్ జనరల్ టి.ఎస్. గోవిందరాజన్‌గారు అన్నమాచార్య తపాలాబిళ్ళను విడుదల చేయగా శ్రీవారు తమ కరకమలములచే స్పృశించి మంగళాశాసనములు చేసారు. ముఖ్య అతిథులైన శ్రీమాన్ డా॥ కె. ఆదికేశవులు నాయుడుగారు మాట్లాడుతూ అన్నమాచార్య ప్రాజెక్టు శ్రీనివాసట్రస్టు తరపున ఒక ప్రచారరథాన్ని శ్రీవారి ధర్మప్రచార కార్యక్రమాలకు అందజేస్తున్నట్లుగా సభలో ప్రకటించారు. డా॥ శోభారాజుగారితో కలసి రివాల్వింగ్ ఫండ్ ఏర్పాటు చేసి ధర్మప్రచార కార్యక్రమాలలో వినియోగింప చూస్తామని ఆయన ప్రకటించారు. అనంతరం తపాలబిళ్ల ఆవిష్కరణలో విశేష కృష సల్పిన వారందరినీ శ్రీవారి శ్రీహస్తములతో సన్మానింప జేసారు శ్రీమతి శోభారాజ్‌గారు. శ్రీవారు అనుగ్రహభాషణం చేసి శ్రీమతి శోభారాజ్ దంపతులకు ఈ సందర్భంగా అనేక మంగళాశాసనములు చేసారు. అనంతరం రాత్రి గం.12.00లకు జెట్ నుండి సీతానగరం బయలుదేరారు.

## కృష్ణావసంతోత్సవం

19వ తేదీ తెల్లవారుఝామున గం.6.00లకు హైదరాబాద్‌నుండి సీతానగరానికి శ్రీవారు వేంచేసారు. ఉదయం తీర్థగోష్ఠి అనంతరం కృష్ణా వసంతపురిలో జరుగుతున్న వసంతోత్సవ ఏర్పాట్లను పరిశీలించారు. అనంతరం శ్రీవారు 1200మంది వాలంటీర్లతో సమావేశం జరిపి వివిధ సేవలలో వారి బాధ్యతలను వివరించి విజయవంతంగా సేవ లందించడానికి వారికనేక మంగళాశాసనములు చేసారు. 20వ తేదీ తీర్థగోష్ఠి అనంతరం మరల కృష్ణావసంతపురినొకసారి సందర్శించి సాయంత్రం 5.00లకు జెట్ సీతానగరంలోని తీర్థసదనంలో పాత్రికేయులతో సమావేశమయ్యారు. కృష్ణా వసంతోత్సవ వేడుకల ఉద్దేశ్యాలను ప్రయోజనాలను పత్రికల వారికి వివరించారు.

21వ తేదీ ఉదయం గం.6.00లకే శ్రీవారు సీతానగరం నుండి 'కృష్ణావసంతపురి' సభాస్థలికి వేంచేసారు. నడిగడ్డపాలెం నుండి శ్రీకోదండరామ స్వామి పెరుమాళ్ళను సభావేదికపైకి వేంచేపు చేసిన అనంతరం శ్రీవారు 'శ్రీరామ' నామాన్ని 108సార్లు భక్తులందరిచే పఠింపచేస్తూ వ్రాయించారు. అనంతరం శ్రీరామాయణంలోని బాలకాండ పారాయణం ప్రారంభమైంది. గం.9.18లకు యజ్ఞాచార్యులు శ్రీమాన్ రమాకాంతాచార్య స్వామివారు ఉగాది సందర్భంగా తారణనామ సంవత్సర పంచాంగ ఫలితాలను వివరించగా భక్తులంతా శ్రద్ధాభక్తులతో శ్రవణం చేసారు. పిదప శ్రీకృష్ణానదీమ తల్లికి పసుపు, కుంకుమార్చన, 108 గోవులకు పూజలు శ్రీవారి ప్రత్యక్ష పర్యవేక్షణలో నిర్వహించబడ్డాయి. అనంతరం తీర్థగోష్ఠి, ఉగాది పచ్చడి వితరణ జరిగింది. పిదప శ్రీబాలకాండ పారాయణం మధ్యాహ్నం వరకు కొనసాగింది. ఉత్తరపీఠిక పఠనానంతరం భక్తులంతా



తదీయారాధనకు వెళ్లడం జరిగింది. మధ్యాహ్నం గం.2.00లకు వివిధ సంగీత, నృత్య, భజన కార్య క్రమాలతో సాంస్కృతిక కార్యక్రమాలు గం.5.00లకు వరకు జరిగాయి. అనంతరం గం.5.30లకు శ్రీవారు తమ శిష్యులు, విద్యార్థులు, భక్తులందరితో కలసి శ్రీవిష్ణు సహస్రనామ పారాయణ చేసారు.

అనంతరం ఏర్పాటు చేయబడిన సాయంకాల సభలో పాల్గొన్న విశిష్ట అతిథులకు, సాంస్కృతిక కార్యక్రమాలలో పాల్గొన్న వారికి, వసంతోత్సవ నిర్వహణలో తమ ధనాన్ని హెచ్చించిన ఉభయ దారులకు శ్రీవారు జ్ఞాపికలనందజేసి అనేక మంగళా శాసనములు కృపచేసారు. పిదప శ్రీకోదండ రామస్వామి పెరుమాళ్ళను శేషవాహనంపై వేంచేపు చేసి తిరువీధి ఉత్సవం జరిపారు. శ్రీవారి ప్రత్యక్షపర్యవేక్షణలో వేలాదిమంది భక్తులు తిరువీధి ఉత్సవంలో పాల్గొని పెరుమాళ్ళను సేవించుకొని ఆచార్యుల, పెరుమాళ్ళ కృపకు పాత్రులయ్యారు. అఖండ విష్ణు సహస్రనామ పారాయణం, అఖండ హరేరామ.... నామ సంకీర్తన శిబిరాలను శ్రీవారు ప్రారంభించగా భక్తులు భక్తి, శ్రద్ధ, ఉత్సాహాలతో పారాయణలు, కీర్తనలు జరిపారు. తదీయారాధనా కార్యక్రమంలో మొదటి రోజు, 10వేలమంది భక్తులకు అన్నశాంతి జరిగింది.

రెండవరోజు నుండి ప్రతీరోజూ ఉదయం గం.6.30లకు సేవాకాలం, శ్రీరామనామ లేఖనం, బాలకాండ పారాయణలతో కార్యక్రమాలు ప్రారంభమయ్యాయి. సుమారు 500మంది పారాయణలో పాల్గొనడం జరిగింది. శ్రీవారి ప్రత్యక్ష పర్యవేక్షణలో జరిగే ఈ పారాయణంలో పాల్గొనే వారే కాకుండా వేలాదిమంది భక్తులు (దర్శించు కొంటూ సేవించుకునే వారు) పారాయణ మధ్యలో ఉదయం 9.30ని.గం.కి శ్రీశ్రీశ్రీ స్వామివారు ప్రకృతిమాద అనుగ్రహానికై నదీపూజ, గోపూజలు నిర్వహించారు. వేలాది భక్తులు ఈ పూజలలో పాల్గొని నదీమతల్లికి, భూస్వరూపిణియైన గోమాతకి క్షమా ప్రార్థన చేసారు. తీర్థగోష్ఠి జరిగిన వెంటనే మొదలై ప్రతిరోజూ గం.1.30లకు వరకూ శ్రీరామాయణం పారాయణ కొనసాగు తూండేది. పారాయణంలో శ్రీవారితో పాటు శ్రీ.వే. శ్రీమాన్ రామచంద్రాచార్య స్వామి, శ్రీ ఉ.వే. శ్రీమాన్ ఉడయవర్లస్వామి, శ్రీమాన్ రమాకాంతాచార్యస్వామి, ప్రభృతులు పాల్గొంటూ 10 రోజులలో శ్రీరామా యణంలోని 24,000 శ్లోకాలను పూర్తిగ పారాయణం చేసి, భక్తులందరిచేత చేయించి అందరినీ శ్రీసీతారామ లక్ష్మణ హనుమత్స్వాముల కృపకు పాత్రులను చేసారు. ప్రతిరోజూ మధ్యాహ్నం గం.2.00లనుండి గం.5.00లకు వివిధ ప్రాంతాల నుండి వేంచేసిన సంగీత, నృత్య, కళాకారులతో ఎన్నో సాంస్కృతిక కార్యక్రమాలు శ్రీమతి రామలక్ష్మి, హైదరాబాద్ వారి నేతృత్వంలో జరుగు తూండేవి. భక్తులు మధ్యాహ్నం తదీయారాధన అనంతరం సభావేదికకు విచ్చేసి సంగీత, నృత్య రూపాలలో ప్రదర్శించే కార్యక్రమాలలో పాల్గొని ఆనంద, భక్తి, ఉత్సాహాలలో ఓలలాడుతూండేవారు.

సాయంత్రం గం.5.30లకు శ్రీవారి ప్రత్యక్ష పర్యవేక్షణలో వేలాది భక్తులు సభామండపంలోనే శ్రీవిష్ణుసహస్రనామ పారాయణాన్ని ప్రతిరోజూ జరిపారు.

అనంతరం తత్త్వ ప్రచారకురాలైన కుమారి శారద శ్రీవారిని, నాటి సభకు విచ్చేసిన విశేష అతిథులను సభావేదికపైకి ఆహ్వానించడం జరిగింది. విశేష అతిథులుగ కృష్ణా వసంతోత్సవ కన్వీనర్‌గారైన శ్రీమాన్ గోకరాజు గంగరాజుగారితో పాటు కృష్ణాజిల్లా కలెక్టరు శ్రీమాన్ ప్రభాకర్‌రెడ్డిగారు, గుంటూరు జిల్లా కలెక్టర్ శ్రీమాన్ రామకృష్ణరావు గారు, ఉడా వైస్ చైర్మన్ శ్రీమాన్ విష్ణుగారు, జిల్లా పరిషత్ చైర్‌పర్సన్ శ్రీమాన్ పాతూరి నాగభూషణంగారు, విజయవాడ మున్సిపల్ కమీషనర్ శ్రీమతి ఉషారాణిగారు ప్రభృతులు కార్యక్రమానికి వచ్చారు. శ్రీవారు వీరందరికి కృష్ణావసంతోత్సవ కమిటీ భక్తుల తరఫున అనేక మంగళాశాసనములను కృపచేసారు. అంతేకాక సాంస్కృతిక కార్యక్రమాలలో పాల్గొన్న కళాకారులకు, కార్యక్రమాలలో తమ ధనాన్ని వినియోగించిన

ఉభయ దారులకు జ్ఞాపికలనందజేసి మంగళా శాసనములు కృపచేసారు. కృష్ణావసంతోత్సవ వేడుకలలో అన్ని రంగాలలో, అన్నిరకాల సేవలనందించే వాలంటీర్లు ఎవరివంతు బాధ్యత వారు శ్రద్ధగా నిర్వర్తించడం వలననే ఇంతటి పెద్ద కార్యక్రమాన్ని విజయవంతంగా చేయగలిగామని శ్రీవారు ప్రశంసాపూర్వక అనేకానేక మంగళా శాసనములు చేసారు.

ప్రతిరోజూ సాయంత్రం గం.6.30లకు శ్రీవారు శ్రీరామాయణంలో ఆరోజు పారాయణ చేసిన ఘట్టాలలోని రత్నాలను అనుగ్రహించి శ్రీసూక్తులను కృపచేసారు. **ఈ శరీరమే లంకయని పది ఇంద్రియాలతో కూడిన మనస్సు రావణాసురుడని, ఆత్మ సీతమ్మకు ప్రతీకయని, శ్రీరాముడు పరమాత్మగాను, హనుమంతుడు ఆచార్యుడుగాను శ్రీరామాయణంలోని ముఖ్యపాత్రలని గూఢ తత్త్వాన్ని మధుర మనోహరంగా వర్ణిస్తూ ఉద్బోధించారు.** శ్రీవారి అనుగ్రహభాషణానంతరం ప్రతిరోజూ శ్రీరంగంనుండి వేంచేసిన శ్రీపాత్తాంగులు వయ్యారి నడకలతో శ్రీకోదండరామస్వామి పెరుమాళ్ళ దివ్య తిరువీధి ఉత్సవాలు వేలాది భక్తజనుల ఆనంద, భక్తి ఉత్సాహాల మధ్య జరుగుతూండేవి. ప్రతిరోజూ జరిగే శేష, హంస, అశ్వ, గజ, హనుమత్, గరుడ వాహనా రూఢుడైన శ్రీకోదండరామస్వామి పెరుమాళ్ళ దివ్య తిరువీధి ఉత్సవాలలో త్రిదండధారియైన శ్రీస్వామివారు ముందునడుస్తూ భక్తులలో ఎంతో భక్తి, శ్రద్ధలను, ఆనందాన్ని కటాక్షించారు.

పదిరోజుల శ్రీకృష్ణావసంతోత్సవ వేడుకలలో విశేషంగా 25వ తేదీ సాయంత్రం 'బ్రహ్మయజ్ఞ' కార్యక్రమానికి శ్రీవారి ప్రత్యక్షపర్యవేక్షణలో అంకురార్పణ జరిగింది. 26వ తేదీ ఉదయం గం.7.15లకు 'అగ్నిమథన' కార్యక్రమం జరిగింది. వేదపండితుల వేద ఘోషమధ్య అగ్నిహోత్ర భగవానుని యాగశాలలో ప్రతిష్ఠాపన చేసారు. యాగశాలలో శ్రీవారి దివ్యకరకమలములచే ధ్వజస్తంభ ప్రతిష్ఠాపన జరిగిన తరువాత వేద, పురాణ, ఇతిహాస, స్తోత్ర, దివ్యప్రబంధాల పఠనాలతో 5కుండాలలో "బ్రహ్మయజ్ఞము" ప్రారంభమైనది. ఈ కార్యక్రమంలో ఎండోమెంట్ కమీషనర్ శ్రీమాన్ కె.వి. రమణాచార్య పాల్గొని శ్రీవారిని, పెరుమాళ్ళను సేవించుకున్నారు. 26వ తేదీన విచ్చేసిన విశేష అతిథి విశ్వహిందూ పరిషత్ అంతార్జతీయ అధ్యక్షులు శ్రీమాన్ అశోక్ సింఘాల్‌గారు నదీ, గోపూజలలో పాల్గొని అదేరోజు సాయంకాలపు సభలో మాట్లాడుతూ గీతాజ్యోతి పేరుతో ఆధ్యాత్మిక, సంఘసంక్షేమ కార్యక్రమాలలో విశేష ధర్మప్రచారాన్ని గావిస్తున్న ఏకైకస్వామి మన శ్రీజీయరుస్వామివారేనని సభాముఖంగా వెల్లడిచేసారు. మన రాష్ట్రంలోని TTD ఆదాయం సంవత్సరానికి 600 కోట్లరూపాయలైతే నేటి ప్రభుత్వాలు సెక్యులర్ పేరుతో మతమార్పిడి విధానాలు ప్రోత్సహించే వ్యక్తుల పురోభివృద్ధికి ఖర్చు పెడుతున్నారే కాని, ధర్మసంరక్షణకోసం ఒక్కపైసా కూడా ఖర్చు పెట్టకపోవడం విచారకరమైన విషయమని ఆవేదన వ్యక్తం చేసారు. నిస్వార్థంగా సమాజశ్రేయస్సే తమ శ్రేయస్సుగా భావించి ధర్మప్రచారం గావించే శ్రీస్వామివారివంటి సాధుపుంగవుల మార్గదర్శకత్వాన్ని ప్రభుత్వాలు అనుసరించి ధర్మప్రచారాలలో సహాయ సహకారాలందించాలని కోరారు.

ప్రతిరోజూ ఉదయం పూట శ్రీరామాయణ పారాయణ సమయాలలో విశేషంగా 24వ తేదీన శ్రీవారి ప్రత్యక్ష పర్యవేక్షణలో 'శ్రీరామ పాదుకా పట్టాభిషేక మహోత్సవం', 27వ తేదీన శ్రీ అంగుళీయక ప్రదాన మహోత్సం-పూజలు నిర్వహించబడ్డాయి. 28వ తేదీన సాయంత్రం గం.5.30లకు శ్రీవారి ప్రత్యక్షపర్యవేక్షణలో దుర్గాఘాట్‌నుండి కృష్ణానదిలో శ్రీకోదరండరామునికి హంసవాహనంపై వేంచేపు చేసి 'తెప్పోత్సవ' వేడుకలను సుమారు 3 గంటల సేపు జరిపారు. వేలాది భక్తులు ఈ కార్యక్రమంలో భక్తి, ఆనంద, ఉత్సాహాలతో పెరుమాళ్ళను సేవించుకుని స్వామివారి కృపకు పాత్రులయ్యారు. 29వ తేదీ యుద్ధకాండ పారాయణ జరుగుతూండగా శ్రీసింహాచలేశ్వరుని, తిరుమల వెంకటనాథుని దివ్య



అనుగ్రహ ప్రసాదాన్ని అర్చకస్వాములు తీసుకొని రాగా శ్రీస్వామివారు భక్తులందరి తరఫున స్వీకరించారు. శ్రీమాన్ ఉ.వే. రంగరామానుజాచార్య స్వామి, శ్రీ ఉ.వే. శ్రీమాన్ సొంతులూరు గోపాలకృష్ణ మాచార్యులు, శ్రీవారి ఆహ్వానంపై అనుగ్రహభాషణం చేసి 'ఆచార్యవిశిష్టత'ను తెలుసుకోగలిగే ఉపాయాన్ని భక్తులకు అనుగ్రహించారు.

29వ తేదీ రాత్రికి వసంతోత్సవంలో విశేష సేవలందించిన కార్యకర్తలు సుమారు 2,000మందికి శ్రీస్వామివారు జ్ఞాపికలనందించారు. కార్యకర్తలందరికీ నాయకత్వం వహించి, తదీయారాధన సక్రమంగా జరిగే బాధ్యత తీసుకున్న విజయనగరం శ్రీమతి బేబిగారు, శ్రీమతి అరుణగార్లకి మంగళాశాసనాలనుగ్రహించారు.

30వ తేదీన ఉదయం గం.6.30లకు సేవాకాలం, శాత్తుముఱై ప్రారంభమై అనంతరం తీర్థగోష్ఠి జరిగింది. వెంటనే శ్రీవారి ప్రత్యక్షపర్యవేక్షణలో నదీ, గోపూజలనంతరం బ్రహ్మయజ్ఞ పూర్ణాహుతి యాగశాలలో నిర్వహించబడింది. వెంటనే శ్రీవారు సభాస్థలికి వేంచేసి, వేదపండితులు, ఋత్విక్కులు, వేలాది భక్తజనులు వీక్షిస్తుండగా శ్రీసీతారామకళ్యాణ మహోత్సవాన్ని ఎంతో కన్నుల పండువుగా జరిపారు. అనంతరం శ్రీరామ పట్టాభిషేక మహోత్సవాన్ని కూడా శ్రీవారు నిర్వహించగా వేలాది భక్తులు అనుగ్రహ పాత్రులయ్యారు. అనంతరం శ్రీవారు, వేదపండితులు, భక్తులు అంతా కలసి శ్రీకృష్ణవేణీ నదీమ తల్లి ఒడిలో అవబృధస్నానాలు చేసారు. శ్రీవారు పవిత్రజలం భక్తులపై జల్లి అవబృధ స్నానఫలాన్ని అందరికీ కలిగించారు.

కృష్ణా వసంతోత్సవానికి గ్రామాలలో ప్రచారబాధ్యత వహించిన తత్త్వ ప్రచారకులు శ్రీమతి హైమవతి, సూర్యకుమారి, కల్పనగార్లకి, మొదటి నుండి కార్యభారం వహించిన శ్రీమాన్ చక్రధర్‌గారు, శ్రీమాన్ ముకుందరావు కుటుంబానికి, శ్రీమాన్ రాజాగారు, శ్రీమాన్ పార్థసారధిగారు ప్రభృతులకి శ్రీవారు మంగళాశాసనాలందించారు.

ఈ కృష్ణా వసంతోత్సవ వేడుకలలో ప్రతిరోజూ ఉదయంనుండి రాత్రి వరకూ వివిధ కార్యక్రమాలలో పాల్గొన్న సుమారు 20 నుండి 30 వేలమంది భక్తులకు తదీయారాధన ద్వారా 'అన్నశాంతి' కలిగించడం ఒక గొప్ప విశేషం.

అనంతరం శ్రీవారు 30వ తేదీ రాత్రి సీతానగరం ఆశ్రమానికి చేరుకున్నారు. 31వ తేదీ ఉదయం తీర్థగోష్ఠి అనంతరం తిరుమలనుండి విచ్చేసిన చీఫ్ ఇంజనీరు మరియు టి.టి.డి. సలహాదార్ల బృందంతో ప్రాకారాల నిర్మాణం, జరుగుతున్న మరియు జరగబోయే నిర్మాణాల పనులను గూర్చి విస్తృతంగా చర్చలు జరిపారు. అనంతరం మధ్యాహ్నం గం.2.00లకు సుమారు 500మంది భక్తులకు సమాశ్రయణములను అనుగ్రహించి వారిని శ్రీవారి దివ్యకృపకు పాత్రులను చేసారు.

శ్రీశ్రీశ్రీ స్వామివారి అనుగ్రహంతో గీతాజ్యోతి, కృష్ణావసంతోత్సవాల సందర్భంగా నిర్వహించబడిన తొమ్మిది పశువైద్య శిబిరాలలో ముందుగా గోపూజ జరిగింది. ఈ ఉచిత పశువైద్య శిబిరాలలో డా॥ టి.వి రామారావు గారు (జె.డి.), డా॥ చాద సుభాష్ రెడ్డిగారు (ఎ.డి) పి. సురేష్‌కుమార్ గారు (ఎ.డి), డా॥ పి. శంకరరెడ్డిగారు (ఎ.డి), డా॥ కృష్ణమాచారి గారు (ఎ.డి), డా॥ వేంకట రమణారెడ్డిగారు, స్థానిక మండల పశువైద్యాధి కారులు మొత్తం 45 మంది పారామెడికల్ సిబ్బంది పాల్గొన్నారు. 40గ్రామాలలోని 8,000 మంది రైతులు ఈ శిబిరాలవల్ల లబ్ధిపొందారు. సాధారణ చికిత్సలు, శస్త్రచికిత్సలు గాలికుంటువ్యాధి, గుండెవాపు, జబ్బవాపు, కొమ్ముకేన్సర్, గర్భకోశవ్యాధులకు, ఎలికపాములకు సంబంధించిన చికిత్సలు నిర్వహింపబడి ఉచితమందుల పంపిణీ జరిగింది. శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనాలతో ఈ శిబిరాన్ని విజయవంతంగా సామాన్య రైతులు ఉపయోగించుకునే విధంగా నిర్వహించారు.

జై శ్రీమన్నారాయణ!

ఓం అస్మత్ గురుభ్యో నమః

# పదాలవిందు-5 పూరించండి:

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | ■ | 2 | | 3 | | 4 |
| | ■ | | ■ | 5 | ■ | ■ | | ■ | |
| 3 | | | ■ | 5 | | 6 | | ■ | |
| | ■ | ■ | 7 | | ■ | | ■ | 4 | |
| ■ | 8 | 17 | | ■ | ■ | ■ | 9 | ■ | |
| ■ | 9 | | | ■ | 10 | 11 | | | ■ |
| 12 | | | ■ | ■ | 11 | | ■ | ■ | 15 |
| | ■ | ■ | 14 | | | ■ | 13 | | |
| 6 | | ■ | | ■ | ■ | 16 | | ■ | |
| 17 | 18 | | ■ | 18 | | | ■ | 15 | |

**అడ్డము:-**

1. శఠగోపుల శిష్యులు, ద్రావిడవేదాంత ప్రవర్తకులు (4)
2. 15వఅధ్యాయం పెట్టిన ఉత్తమ నామం (4)
3. నీడను పట్టుకు నిలిపింది (3)
4. వక్షస్థలమే అచ్చతెనుగులో (2)
5. కేశము కలవాడే ఇంద్రియాలకి అధిపతి (4)
6. విరాగం 'వి'గతమైతే (2)
7. భేదంలా అన్పించే దుఃఖం (2)
8. మంచిపిల్ల కనుకే, ఉపనిషత్ పేరయ్యింది (3)
9. ఉపాసనకు మరోపేరు (3)
10. అలకనందకే కాస్తదిగివస్తే, మరోపేరు (4)
11. కొద్దిగ (2)
12. అష్టాక్షరీ ఆవిర్భావస్థానం (3)
13. యమునలా నల్లనిదే రాత్రి (3)
14. శ్రీకృష్ణజన్మస్థానమే జైలు కాదు (3)
15. నాస్తికధర్మం కానీ, శాంతికిరూపం (2)
16. త్రాగుట (2)
17. మనఃఫలకంమీద భావాలను ఇలా వ్రాయాలి (3)
18. భగవంతునికి పెట్టేది (3)





**నిలువు:-**

1. ప్రహ్లాదవరదుడే ముందు కొంచెం సాగాడు (4)
2. ముద్రవేసేది (3)
3. .......కళానిధికి......ఉపచారములు(3)
4. మధువుని నశింపచేసినవాడు (5)
5. వయోభేదం తెలియని స్నేహితుడిని(3)
6. ప్రశ్నతో మొదలయ్యే ఉపనిషత్ (2)
7. సంస్కృతంలో ఆడుకొనుట (3)
8. బాగా తెలుసుననుకొనుట (3)
9. శుకుని తల్లి (4)
10. గిరే కవ్వమైపోయింది (3)
11. భార్య (2)
12. శేషుడే సేవ చేయించుకోవాలని ముందు పుట్టాడు (4)
13. ప్రయాణము (2)
14. ప్రళయంలోనూ రక్షకమై నిలిచే అవతారం (2)
15. అవతారాలకు మూల వ్యూహం (4)
16. కాళ్ళు కడిగే నీరు (2)
17. బదరి సంబంధం కలవాడే. బాదరాయణుడు కాదు (4)
18. కదలలేదు కానీ తిరగబడింది (2)

సరియైన సమాధానాలు వ్రాసి పంపినవారి పేర్లు ప్రచురించుతాం.
మీరు చేయవలసిన పని సంచికలోని పదాలవిందు కత్తిరించి, శీర్షికను పూరించి 20వ తారీఖులోగా పంపండి.

## పదాలవిందు-4: సమాధానాలు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 నా | థ | 2 ము | ని | ■ | 2 పు | రు | 3 షో | త్త | 4 మ |
| ర | ■ | ద్రి | ■ | 5 సు | ■ | ■ | డ | ■ | ధు |
| 3 సిం | హి | క | ■ | 5 హృ | షీ | 6 కే | శ | ■ | సూ |
| హ | ■ | ■ | 7 ఖే | దం | ■ | న | ■ | 4 ఎ | ద |
| ■ | 8 సు | 17 బా | ల | ■ | ■ | ■ | 9 శు | ■ | న |
| ■ | 9 వే | ద | నం | ■ | 10 మం | 11 దా | కి | ని | ■ |
| 12 బ | | | ■ | ■ | 11 ద | ర | ■ | ■ | 15 అ |
| ల | ■ | ■ | 14 మ | ధు | రం | ■ | 13 యా | మి | ని |
| 6 రా | గం | ■ | త్స్య | ■ | ■ | 16 పా | నం | ■ | రు |
| 17 మ | 18 న | నం | ■ | 18 నై | వే | ద్యం | ■ | 15 బు | ద్ధ |

గతనెల విజేతలు

శ్రీమతి వేమూల బాలత్రిపురసుందరిగారు, అవనిగడ్డ.

# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాసపత్రిక జూలై - 2004

సర్వవైష్ణవ సంగోష్ఠి

జూన్ - 12, 13, హైదరాబాద్





శ్రీమతే రామానుజాయ నమః

# భక్తనివేదన

ఆధ్యాత్మిక మాస పత్రిక



శ్రీతారణ నామ సంవత్సరం ఆషాఢమాసం

సంపుటి 57 2004 జూలై సంచిక 4

వ్యవస్థాపకులు

శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యులు

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు

సంపాదకులు :

శ్రీ ఉ. వే. శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు

# విషయ సూచిక.....



## పంచాంగ వివరాలు

### జూలై

2 వ్యాసపూర్ణిమ, తిరుయాళ్వార్ తిరు॥, యతీనాం చాతుర్మాస్య:

3 తిథిద్వయం

4 తదియ తిథి

6 పునర్వసుకార్తె

11 త్రిద్యుస్పృక్

13 సర్వేషామేకాదశి

15 చతుర్దశి తిథి, మాసశివరాత్రి

16 కర్కాటక సంక్రమణం ఉ.గం.11. దక్షిణాయన పుణ్యకాలం

17 చుక్కల అమావాస్య

18 పాడ్యమి తిథి

20 పుష్యమి కార్తె

21 శ్రీ ఆండాళ్ తిరు॥ చూడికుడుత్తానాచ్చియార్ తిరు॥

23 బదరీనారాయణ పెరుమాళ్ తిరు॥

26 తిథి ద్వయం

27 ఏకాదశి తిథి

28 సర్వేషాం ఏకాదశి

29 అవమ తిథి

31 ఆళవందార్ తిరు॥, పుండరీకాక్షుని తిరు॥

### ఆగస్టు

1\. తేర్కాళ్వార్ తిరు॥

3\. ఆశ్లేషాకార్తె, సంకష్టహర చతుర్థి

11 సర్వేషామేకాదశి


Printed and published by Sri **T.P. Sriramachandracharyulu** owned by **H.H. Sri Sri Sri Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji** and Printed at **Sriman Printers&Processors** Sitanagaram and published at **Sitanagaram,** Editor Sri **T.P. Sriramachandracharyulu 7-48,Brindavani, Visakhapatnam-530 028.**

మీ సేవలో....

**భక్తినివేదన,** సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, ✆ (08645) 272929,

**చందావివరాలు** :- సంవత్సరచందా రూ. 50/-, జీవితచందా రూ. 500/-,

విదేశాలకు సంవత్సరచందా $ 25,

E-mail : jetsitanagaram@yahoo.com   Internet : www.chinnajeeyar.org

D.T.P. & Design by : పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రాసెసర్స్, సీతానగరం.

# శ్రీస్వామివారి సందేశం

ప్రియ భగవద్ బంధువులారా!

శ్రీమతే నారాయణాయ నమః!

అనేక మంగళాశాసనములు!

మన ఆచార్యులు, అచ్యుతుడు తన ఛాయలో మనలను సదా కాపాడుగాక! తమ సేవలో కొంతైనా సమయం గడపగలిగే అదృష్టాన్ని ప్రసాదించుగాక!

మనకాలంలో మొదటిసారి 16మంది జీయరుస్వాములు ఒకచోట దర్శనం ప్రసాదించారు జూన్ 12,13 తేదీలలో. ఉత్తర భారతావనిలో వివిధ రాష్ట్రాలనుంచి 40మంది పైగా జగద్గురు రామానుజాచార్య పీఠాధిపతులైన మహంతులు విచ్చేసారు.

విశిష్టాద్వైత సిద్ధాంత విశేషాలను, ఆళ్వారాచార్యుల శ్రీసూక్తి వైభవాన్ని లోకానికి వివరించి ఉజ్జీవింప చేసే శ్రీవైష్ణవ సత్సంప్రదాయాచార్యపురుషులు, పండిత ప్రకాండులు విచ్చేసారు. శ్రీవైష్ణవాగమాలను అనుష్ఠిస్తూ భగవంతుని సాన్నిధ్యాన్నిచ్చే దివ్యాలయాల సంరక్షణ చేసుకొంటూ ఉండే అర్చకస్వాములు విచ్చేసారు. మరెందరో శ్రీవైష్ణవస్వాములూ, భక్తశిఖామణులు ఒకచోట, ఒకే ఆశయంతో రెండు రోజులు చేరి ఉండటం ఇంతవరకూ జరుగలేదు, ఇలా. భాగ్యనగరానికే ఆ అదృష్టం దక్కింది.

అప్పుడప్పుడు వివిధ సంస్థలు సాధుసంతుల సమ్మేళనాలు జరుపుతూ ఉంటాయి. కానీ వాటిలో నిర్దుష్ట సంప్రదాయమని కాక, సామాన్యేన దేశీయ సమస్యలను చర్చించడానికో, ధర్మసంరక్షణ కోసమనో జరుగుతూంటాయి. నిష్కృష్టంగ ఒక సంప్రదాయాన్ని అందునా తిరుమల ఆలయాన్ని ప్రధానంగ చేసుకొని సమావేశం కావడం మాత్రం చరిత్రలో మొదటిసారే! వైష్ణవ సంప్రదాయరక్షణదీక్షతో చేరడం మొదటిసారే! ముగ్గురు జీయర్ల దర్శనమే పరమపద దర్శనమంత గొప్పదని అంటారు. 16మంది పరమహంస

పరివ్రాజకాచార్యులను ఒకచోట దర్శించ గలగడం ఈ మధ్యకాలంలో అభూత పూర్వమే.

ఆదిశేషుని అవతారవతారమని తిరుమల కొండను పురాణాలు కీర్తించాయి. ఆ కొండపై తన పాదం మోపడం దోషమని 1000 సం॥క్రితం, భగవద్ రామానుజాచార్యస్వామి, తన మోకాళ్ళతో ఎక్కారని చరిత్రలో ఉంది. అంత పవిత్రంగ పూర్వాచార్యులు పూజించిన పావన పర్వతాన్ని ప్రస్తుత అధికార ప్రబుద్ధులు ముక్కలుగ బాంబులు పెట్టి పగులకొట్టివేసారు. నవాబులు నిర్మించుకొని నివసించిపోయిన శిథిలాలను, కుడ్యాలను, ఇతరేతర మతస్థులు నిర్మించిన దర్గాలవంటి సామాన్య కట్టడాలను లక్షలు, కోట్లూ రూపాయలు ఖర్చుచేసి వారే కాకుండా, మన ప్రభుత్వాలుగూడ కాపాడుతున్నాయి. కానీ వైదికమైన మన ఆలయాల విషయానికొచ్చేసరికి అందరికీ నిర్లక్ష్యధోరణే.... అందునా వైష్ణవ సంప్రదాయానికి చెందిన ఆలయాల విషయానికొస్తే ఈ నిర్లక్ష్యధోరణి మరికాస్త ముదిరి అసహనంగా గూడ మారింది. పరిశుద్ధంగ ఉండే ఆలయాలలో సంప్రదాయ విరుద్ధ విగ్రహాలను ప్రవేశపెట్టడం, ఉన్న సంప్రదాయ పద్ధతులను, గురుతులను మార్చివేయడం, లేదా, నాశనం చేసేయడం ఒక ఉద్యమమైపోయింది. ఇదెవరో చిన్న వ్యక్తులూ, తెలియకా చేసే అమాయక చర్య కానేకాదు.

జగద్గురువులుగా ప్రచారం చేస్కొనే, ధర్మానికి పెద్దకాపులుగ ప్రచారం చేస్కొనే వ్యక్తులూ, సంస్థలనుండే ఈ వినాశకర ప్రవృత్తి సాగుతోంది. "వైష్ణవం" పేరు చెపితే చాలు వారికందరికీ శరీరం అసూయతో కంపిస్తోంది. ప్రహ్లాదుణ్ణి చూచిన హిరణ్యకశిపునిలా, విభీషణుణ్ణి చూచిన రావణునిలా మారిపోయారు.

వైష్ణవాలయాల సంపదలూ, స్థలాలూ ఇచ్చవచ్చినట్లు ఖర్చుచేసి, స్వంతలాభాలకోసం భూదిదానాలు చేసేసారు. మిగిలిన కాసిని సంపదలనూ అధికారులు హస్తగతం చేస్కొని వైష్ణవేతర లక్ష్యాలకై మాత్రమే

ఖర్చుచేస్తున్నారు. అడిగే వారు లేరు. అడిగినా నోరు తెరచి జవాబిచ్చే నాథుడు లేడు.

ఇతరేతరాలయాలను ఈ విధంగా పెంచేస్తారు. వైష్ణవసంప్రదాయపు మాటొచ్చేసరికి 'అలా వైష్ణవాన్ని విడదీయరాదు. అన్నీ సమానమే. పక్షపాతాలు పనికిరావు. శైవ వైష్ణవద్వేషాలు పెంచరాదు. అన్నిటినీ ఆదరించాలి. సమాజాన్ని విడదీయకూడదు 'ఇలా... ఇలా... అసంబద్ధ ప్రలాపనలు చేర్పిస్తూ ఉంటారు.

ఇతరులు చేసేవన్నీ చేసి, దోచగలిగినవి దోచి, వైష్ణవులను బికారులను చేసి, అక్కడికీ, ఈ వైష్ణవస్వాములు తమ పాట్లేవో తాము పడుతూ బ్రతుకుతూంటే, అదీ సహించలేక "మేం వనరులు ఇవ్వం. మీరు చేసే పనులు మాత్రం మానరాదు. వసతి చూపం కానీ అన్నీ సవ్యంగ చేయాలి"నంటి నిర్బంధాలు పెడుతూ బ్రతుకు తెరువు బాటలో విద్యార్జనకు సమయంలేక సామాన్యులుగ బ్రతుకుతూంటే "వీరికి ఏమీ చేతకాదు. ధనానికి కక్కుర్తిపడతారు" ఆరోపణ చేస్తూ అవమానించడం ఈ రోజులలో బహుళంగ చూస్తున్నాం.

అంటే, వైష్ణవాలయాలు, వ్యక్తులను చూసి, ధనాన్ని సాధించి, వీరిని నాశనం చేయడానికే అవి వాడటం దురదృష్టకరం కదూ!

తిరుమలలో ప్రతిభక్తుడూ ప్రేమతో ప్రతిపైసా అర్పిస్తాడు. అలా వచ్చే కోట్ల ధనాన్ని ఆ స్వామి కొండనే కూల్చివేయడానికీ, ఆ స్వామివైభవానికి కారకులైన భగవద్రామానుజుల సంబంధాన్ని తెలిపే గుర్తులను, నిర్మాణాలను కూల్చివేయడానికీ వాడుతున్నారీనాడు. భగవద్రామానుజస్వామిని అంగీకరించం, వారి సిద్ధాంతాన్ని మేము ఏ మాత్రమూ అంగీకరించమనే వ్యక్తుల సలహాలే శిరోధార్యమని తిరుమలకొండను అక్కడి ఆరాధనా సమయాలను విశృంఖలంగ వినాశం కావిస్తున్నారు. వేలమంది ప్రతిరోజూ దర్శిస్తున్నారాలయాన్ని. ఎవ్వరికీ విషయం అర్థం కానివ్వడం లేదు TTD, కనుక, ఏదో జరుగుతోందనుకుంటున్నారే తప్ప,

ఈ దుష్టసమూహాలు బంగారుగుడ్ల మీద ఆశతో బంగారుబాతునే చంపివేస్తున్నారనే విషయాన్ని గుర్తించడమేలేదు.

మూడవ ప్రాకారం కడుతున్నామనే అసత్య ప్రచారంతో శాస్త్ర విరుద్ధంగ, దేశవినాశకరంగ "4"వ ప్రాకార నిర్మాణం చేపట్టారు. అది ఒక వంకే. 3వ ప్రాకారం బయట ఉన్న రామానుజ సంబంధం తెలిపే చిహ్నాలన్నీ ముక్కలు చేసి, మలమూత్రాల పాలైయ్యేట్లు పారవేశారు.

ఇదే ముస్లిం మతానికి చెందిన వాటిని చేసి ఉంటే, ఈపాటికి లక్షల తలలు నేలరాలి, రుధిరప్రవాహాలు ఏరులైపారి ఉండేవి.

బయటి విషయాలిలా ఉంటే, భగవంతుడూ, వేదతాత్పర్యమూ అయిన శ్రియఃపతినే ఆరాధించే ప్రక్రియ తెలిపే శ్రీపాంచరాత్రం, శ్రీవైఖానసం అనే రెండూ వైదిక ఆగమాలే అయినా, దుష్టబుద్ధులూ, కుత్సితప్రవృత్తులూ అయిన కొందరి ప్రేరణకు లోనై ఆంధ్రప్రాంతీయ వైఖానసులమనుకొనే వారందరూ తామే వైదికులం, శ్రీపాంచరాత్రం అవైదికమనే భ్రాంతిలో మునిగారు. ఒక చేతిని నరికితే, రెండవ చేయి అవిటిదే అవుతుందనే ఇంగితం లోపించి, శ్రీపాంచరాత్రాన్ని నిందించడం, తాము ఉగ్రవాదుల్లా ముఠాలు కట్టడం, వ్యతిరేక ప్రచారం ప్రారంభించడం దుఃఖకరం. "విడదీయి-లాభం పొందు" అనే పాశ్చాత్యుల సిద్ధాంతాలే నరనరాల జీర్ణించుకొన్న ఆధికారిక ప్రబుద్ధులు, స్వార్థరాజకీయ నేతలూ, ఈ అవకాశాన్ని తెలివిగా వాడుకొంటూ తమ పబ్బం గడుపుకొంటున్నారు.

పంతాలూ.... పట్టింపులూ... మూర్ఖపు పోకడలూ పట్టుకుని వీరంతా ప్రాకులాడుతూ పరాయి పంచచేరి, తాత్కాలిక లాభం పొందుతూ పొంగిపోతున్నారే తప్ప పదికాలాల పాటు పదిలంగ పరిరక్షించాల్సిన పవిత్ర సంప్రదాయాలను పాడుచేస్తున్నామనిగానీ, పవిత్ర చిహ్నాలను నిర్మూలింపచేయడం ద్వారా భగవన్మతానికే మూలచ్ఛేదం చేస్తున్నామని గాని ఆలోచించలేక పోవడం విచారకరం. వీరు భవిష్యత్తును తప్పదారి పట్టిస్తున్నట్లే గద!

రెండు దినాలు "సర్వ వైష్ణవ సంగోష్ఠి" ఈ విషయాలన్నింటినీ కూలంకషంగా చర్చించింది. దక్షిణదేశం నుండి వచ్చిన వైఖానసాగమ పండితులు, తమ వేల సంవత్సరాల సంప్రదాయానికి వంశ గౌరవానికి, వన్నె తెచ్చే సూచనలిచ్చారు.

తిరుమలలో జరిగే వినాశం, శాస్త్రవిరుద్ధ నిర్మాణాలు తప్పని ముక్తకంఠంతో ఖండించారు. ఆంధ్రప్రాంతీయ వైఖానసుల అమాయకపు ప్రవృత్తిని, సంప్రదాయాలపై పెంచుకున్న అకారణ ద్వేషాన్ని తప్పని ఎత్తిచూపారు. ఆళ్వారాచార్యుల వైభవాన్ని చాటిచెప్పారు. ఆంధ్రప్రాంతీయ వైఖానసులకు సన్మార్గ ప్రదాయి కావాలి.

సంగోష్ఠిలో పాల్గొన్న సుమారు 400మంది పెద్దలేకాక, 13వ తేదీ నాటి సాయంకాలం నిజాం కాలేజీగ్రౌండులో జరిగిన బహిరంగ సభలో పాల్గొన్న వేలాది మంది భక్తబంధువులు గూడ, సంప్రదాయాల సంరక్షణకోసం ఏమైనా చేయడానికి తమ సంసిద్ధత వ్యక్తం చేయడం గర్వించదగినది.

★ సంప్రదాయాలను సజీవ సమాధిచేసి, సర్వేశ్వరుడి సన్నిధిని కోల్పోయాక మన బ్రతుకుకు సార్థకతే కాదు అసలు అర్థమే ఉండదనేది మరువరాదు. TTD యిప్పటికీ తన వినాశధోరణి మానలేదు. మన జీవితాన్ని సార్థకం చేస్కోడాన్కి సదా కృషిచేయాలి. సర్వవిధాల సంప్రదాయం కాపాడుకోవాలి. ముందుగా, జరిగే నాశం ఆపమని అడగాలి. ఆపై అవసరమైన ఉద్యమానికి సిద్ధం కావాలి, "సంగోష్ఠి"లోని సాధుసంతులంతా సిద్ధపడుతున్నారు తమ పరివారాలతో..... మరి మనమో....?!

జై శ్రీమన్నారాయణ!

# శుభోదయం

న హ్యమ్మయాని తీర్థాని
న దేవామృచ్ఛిలా మయాః
తే పునంత్యురు కాలేన
దర్శనాదేవ సాధవః

తీర్థాభిగమనాలు, దేవతాసందర్శనాలూ చేయవలసినదే. వాటివల్ల మనిషి అనిష్టాలు పోగొట్టుకొని ఇష్టాలను పొందుతాడు. అందుకు సందేహం లేదు. కాని ఎన్నాళ్ళకు వీడి పాపాలు శమిస్తాయి. పుణ్యాలు పండుతాయి. అన్నది మాత్రం చెప్పలేం.

ఆ అఘమర్షణ స్నానాలయినా, ఈదేవతా దర్శనాలయినా క్షణాలమీద వీణ్ణి పరిశుద్ధుణ్ణి చెసేయ్యవు. వీడి కర్మ పరిపాకానికి రావాలి. అందుకు కొంతకాలం పట్టవచ్చు. కాలక్రమాన మెల్లగా అవి ఫలితాలనిస్తాయి. కాదనం. 'తే.... పునంతి'. నిజమే. కాని ఎప్పుడు? "ఉరుకాలేన' ఎన్నాళ్ళకో, ఎన్నేళ్ళకో!

మఱి సద్యః ఫలదాలులేవా?

ఎందుకు లేవూ? సాధు సందర్శనం సద్యః ఫలదం.

ఆలుబిడ్డలను కాదని, ఆత్మసుఖాలు వదులు కొని భగవదాజ్ఞగా భగవత్ ప్రీతికోసం భగవత్ కైంకర్యనిష్ఠులై భాగవతసేవావ్రతులుగా మను గడలు సాగిస్తున్న మహానుభావుల్ని మనం సాధువులుగా భావిస్తాం.

అట్లాగని త్యక్త సంసారులే సాధువులుకాని గృహమేధులు కారని అనలేం. సంసారంలో ఉంటూనే తమ సంగానికి పగ్గాలువేసి నియత జీవనులై విశ్వహితప్రవణులయిన వారు అనేకులున్నారు. స్థూలమయినది యీ విభాగం.

అట్లాంటి సాధు పురుషుల్ని సేవించటం సద్యఃఫలదం సుమా అంటోంది పెద్దల యీ శ్రీసూక్తి.

సత్యసంకల్పులు, విశ్వహిత చింతకులు, జగత్కల్యాణ జీవనులు, అయిన సాధు పురుషుల నొకరిని, ఇద్దరికి కాదు, శతాధికుల యిన వారిని ఒక దగ్గర ఒకమారు సేవించు కొనే మహాభాగ్యం మొన్న జూన్ 13న మన భాగ్యనగరంలో ఏర్పడింది.

గంగాది పుణ్యనదీ జలాలు తలలపై జల జల కుమ్మరిలినట్టు, ఇలలో వెలసిన వేలుపు లందరూ కనులముందు నిలిచి కామితాలు కురిసినట్టు అయింది.

ఆంధ్రదేశంలోని ఐదుగురు జీయరులతో పాటు వానమామల, కంచి, శ్రీరంగం, తిరుమల, శ్రీపెరుంబూదూరు బెంగుళూరు మొదలయిన స్థలాలనుండి శ్రీరామానుజ సంప్రదాయానికి చెందిన పదహారుమంది జీయరులు వేంచేసినారు.

శ్రీస్వామినారాయణ సంప్రదాయానికి చెందిన పరమహంసలు, శ్రీచైతన్య సంప్రదా యానికి త్రిదండి మహారాజులు, శ్రీమదానంద తీర్థ సంప్రదాయానికి చెందిన పెజావరు మఠాధిపతులు, శ్రీ విశ్వేశ్వర తీర్థపాదులు విజయం చేసినారు.

ఉత్తర భారతంనుంచి, నేపాలుదేశం నుంచి శ్రీరామానుజ సంప్రదాయానికి చెందిన జీయరులు, మహంతులు వలువురు వేంచేసినారు.

మహంతులు పెక్కుమందికి ఆచార్య స్థానమైన జగదాచార్య సింహాసనాధిపతులు శ్రీగాధి స్వామివారు విచ్చేసినారు. సంప్రదాయ పరిరక్షణానికి బద్ధకంకణులయిన ఆచార్య పురుష కుటుంబాలకు చెందిన స్వాములు విచ్చేసినారు.

ఏడేడు భాగాల ఏలికను ఒడి బిడ్డడుగా భావించి, లాలించి, పాలించి, ప్రీతితో భీతితో, గల ముద్దుగా మురిపెంగా, ముచ్చటగా మోహనంగా, శాస్త్రోక్తంగా సంప్రదాయానుగుణంగా సకలోపచారాలూ కల్పిస్తూ ఆయనను సకలాభీష్టప్రదుడుగా జనావళికి ప్రసాదిస్తున్న వైఖానస-పాంచరాత్ర-ఆగమాలకు చెందిన అర్చక స్వాములు, భట్టాచార్యవర్యులు విజయం చేసినారు.

ఋషులు, ఆళువారులు, ఆచార్యులు ప్రోదిచేసి యిచ్చిన సనాతన సంప్రదాయాన్ని సామాన్య జనావళికి తమ ప్రవచనాల ద్వారా, రచనల ద్వారా, అనుష్ఠానం ద్వారా ప్రబోధిస్తున్న ఉభయవేదాన్త సిద్ధాన్త ప్రవర్తక విద్వదాచార్య శిరోమణులు వేంచేసినారు.

అదిసరే, ఎందుకు వచ్చినారు వీరంతా?

వచ్చిన వారంతా వైష్ణవసంప్రదాయానికి చెందినవారు. శ్రుతి స్మృతీతిహాస పురాణాంగ మాలాధారంగా శ్రీశంకర భగవత్పాదులు, భగవద్రామానుజులు, శ్రీమదానంద తీర్థులు-ముప్పురిచేతా సుప్రతిష్ఠాపితం విష్ణుపరత్వం. ఔత్తరాహ వైష్ణవశాఖలన్నీ రామానుజులనాచార్యులుగా అంగీకరించి అవాంతర భేదాలతో అవతరించినవే.

వైష్ణవధర్మం సనాతనం సాత్త్వికమూను. వైదికం. విశ్వజనీనమూను. ఈధర్మపరి వ్యాపనము, పరిరక్షణం ద్విముఖంగా-వాఙ్మయం ద్వారా ఆలయాలద్వారా జరుగుతుంది.

ఈ ద్విముఖమైననిర్వహణాన్ని ఆచార్యాజ్ఞగా తలకెత్తుకున్నవారు ఈ వచ్చిన వారంతా. జన్మలో సంక్రమించిన ఋణత్రయంలో భాగమే ఈ సంప్రదాయ పరిరక్షణ-పరివ్యాపన మహోద్యమమూను.

వైష్ణవం విశ్వజనీనం, విశ్వశ్రేయోదాయకం అని వీరనటం మాత్రమే కాదు. నిర్మత్సరులయిన తత్త్వాన్వేషకులు నిగ్గుదేల్చిన పరమ వాస్తవం ఇది.

ఏ మతానికి, సంప్రదాయానికి పీఠానికి పెనవేసుకు పోకుండా ఒక భారతీయుడుగా, సనాతన ధర్మాభిరతుడుగా మనుగడ సాగించిన మన తెలుగునాటి ఒకనాటి ఒక రాజకీయవేత్త కుతూహలంతో చరిత్ర పరిశోధనం చేసి తత్త్వాన్వేషణ దృష్టిలో తాను తవ్వితలకెత్తుకొన్న వాస్తవాలతో రామానుజచరిత్రను వ్రాస్తూ దాని ముందుమాటలో భారతదేశంలో సమసమాజం అంటూ ఏర్పడితే, అది శ్రీరామానుజ సంప్రదాయానుసరణం వల్లనే. అని వ్రాసినాడు. నాలుగైదు దశాబ్దాలవాడు ఆయన హార్దమైన అభిసంధితో ఎవరి ప్రమేయం లేకుండా వ్రాసిన మాటలివి.

ఇదిగో ఈ భావనం అంతర్లీనంగా అనుస్యూతంగా కలవారు వీరంతా.

ఈ వైష్ణవభావనం. అనుష్ఠానం ద్విముఖం

అని ముందే విన్నవించేం. వాఙ్మయం తదధ్యయన-అనుష్ఠానాలు ఒకటి. ఆలయాలు-ఆరాధనాపద్ధతులు ఒకటి. అన్నిటా అంత ర్వాహిని విష్ణుపరత్వం. రామానుజ సంప్రదా యానుసరణం.

తత్తదాగమోక్తమయిన ఆరాధనా విధా నాన్ని పరిరక్షించాలి. ఆరాధనావిధానానికి పరిష్కా రాన్ని ఘటిస్తున్న సంప్రదాయాన్ని పరిరక్షించాలి.

ఇదే ప్రధానాశయం ఇంత మంది ఇక్కడ చేరటానికి.

**ఆలయాల** నిర్వహణాన్ని చేవట్టిన **ప్రభుత్వాధికారులు** సంప్రదాయ ప్రవణులు **కంటె అర్థసాధన** పరతంత్ర కోవిదులు కావటం **వల్ల ఆలయాలు** వాటి వైలక్షణ్యాన్ని వైభవాన్ని **కోల్పోయి కేవలం** లాభార్జన లక్ష్యంగా ఏర్పడిన వ్యాపార కేంద్రాలుగా వాటిని మలచటం జరుగుతోంది.

లోపాలు ఎక్కడున్నా, పొరపాట్లు ఎక్కడ జరిగినా సరి చెయ్యవలసిందే. అయితే ఏడుకొండల ఎత్తున నెలకొన్నస్వామి నెలవు పలువురి దృష్టినాకర్షించింది. వడ్డికాసుల వాడికి శాసకుల పోటు ఎక్కువయింది. యాత్రికుల సౌకర్యం పేదవారు చేసే ఆలోచనలు ఏడు కొండల ఎత్తును దాటిపోతున్నాయి.

ఈ వివరాలలోకి ప్రస్తుతం మేం పోవటం లేదు. ఏదైనా ఒక పెద్దమార్పు జరుప వలసినవేళ ఆదరాబాదరగా కాకుండా ఆచి తూచినట్లు వ్యవహరిస్తే సకల మోదకరంగా సమస్యలు పరిష్కృతా లవుతాయి.

అట్లా నిదానంగా సంప్రదాయోల్లంఘనం జరగకుండా అటు ఆగమాన్ని ఇటు ఆచారాన్ని తుల్యప్రమాణంగా గౌరవిస్తూ సర్వమూ సుసంపన్నం అయేట్టు చూడడానికి ఈ కలిసిన పెద్దలంతా 'సర్వ 'వైష్ణవ ప్రతిష్ఠానం'గా ఏర్పడినారని విని వారిని అభినందిస్తున్నాం.

ఒక ఆంధ్రప్రదేశ్‌లోనే కాక భారతదేశం అంతటా ఉన్న ఆలయాలన్నీ సక్రమంగా విష్ణు సంప్రదాయబద్ధంగా తత్తదాగమానుసారంగా నిర్వహింప బడేట్లు ఈ ప్రతిష్ఠానం తోడ్పడా లని సూచిస్తున్నాం.

అర్చకస్వాములు, ఆగమభట్టాచార్యులు, ఆచార్య పురుషులు జీయరులు, మహంతులు, అధికారివర్గాలు, దేశంలోని సుప్రతిష్ఠితులు ప్రామాణికులూ అయిన ఆస్తిక ప్రవణులు అందర్నీ కలుపుకొని ఆర్జవంతో ఆలయాలు సర్వతోముఖాభివృద్ధికి సంప్రదాయ పరిరక్షణానికి ఈ 'ప్రతిష్ఠానం' ఉద్యమించి విజయం సాధించాలని కాంక్షిస్తున్నాం.

> **"ప్రమాణంచ ప్రమేయంచ**
> **ప్రమాతారశ్చ సాత్త్వికాః**
> **జయన్తు క్షపితారిష్టం**
> **సహి సర్వత్ర సర్వదా".**

– **శ్రీ రామచంద్రాచార్య**



# అభినందనలు

భక్తినివేదన పాఠక కుటుంబాన్ని మరింత పెంచేందుకు కృషిచేస్తున్నావారిలో **శ్రీమాన్ ఎ.వి. మల్లిఖార్జునరావుగారు** ఒకరు. వీరు గుంటూరు వికాసతరంగిణి సభ్యులు. వీరికి **శ్రీశ్రీశ్రీ స్వామివారి** మంగళాశాసనములు తెలియజేస్తున్నాం.

# అత్రిమహర్షి

## మహర్షుల చరిత్ర

తమిళమూలం :
వైై.వా. నావల్‌పాకం దేవనాథ
తాతాచార్యస్వామి



తెలుగు సేత :
శ్రీ.ఉ.వే.ప్ర శ్రీమాన్ తూప్పరాణి
ఉడయవర్‌స్వామి, విజయవాడ

లోకానికంతటికీ గొప్పకాంతిని ప్రసాదించే జ్యోతిస్వరూపుడు, సూర్యుడు. అటువంటి సూర్యుని ఒక రాక్షసుడు మింగివేస్తే లోకమంతా చీకటి అయిపోతుంది. ఎవరికీ ఏం చేయాలో తోచలేదు. అంతములేని చీకటిలో చిక్కుకుని లోకం తహ తహలాడింది. ఆకాశంలో జరిగిన ఈ అద్భుత సంఘటనను అల్పుడైన మానవుడు ఎలా సరిచేయ గలడు! అత్రిమహర్షి ఒక్కడే సమర్ధవంతంగా దానిని నిర్వహించాడు. ఆయన ప్రయత్నంతో సూర్యుడికి ప్రకాశం మళ్ళీ వచ్చింది. లోకంలో ప్రాణులన్నీ బ్రతికాం రా జీవుడా! అనుకున్నాయి. ఇదీ అత్రిమహర్షి గొప్పతనం:

సూర్యుని వెలుతురు, పగలే కదా ప్రకాశిస్తుంది. మరి రాత్రి కూడా కాంతి కావాలి కదా! అందుకోసమే 'చంద్రుడు' ఏర్పడ్డాడు. ఆ చంద్రుణ్ణి సృష్టించింది ఎవరో తెలుసా? అత్రిమహర్షే. చంద్రుడు పుట్టటానికి ముందు జరిగిన ఈ కథ చాల ప్రసిద్ధమైనది. ఆ కథ చూద్దాం.

బ్రహ్మమానస పుత్రులు ఆరుగురు–వారు మరీచి, అంగిరసుడు, అత్రి, పులస్త్యుడు, పులహరుడు, క్రతువు అనువారు. వారందరూ వేదాన్ని అభ్యసించినవారే. పరమ పరిశుద్ధులు. శాంత స్వభావులు. వారందరూ మహర్షులే. ఈ విధంగా అనేక కోట్ల సంతానాన్ని పొందడానికి అత్రిమహర్షి తపస్సు చేశాడు. ఎన్నాళ్ళో తెలుసా? మూడువేల సంవత్సరాలు. అవి మానవ సంవత్సరాలు కాదు. దేవతా సంవత్సరాలు. లోతైన సముద్రంలో అడుగు భాగంలో ఈ విధంగా తపస్సు చేశాడు.

ఆ సమయంలో అత్రిమహర్షి కంటి నుండి బ్రహ్మాండమైన జ్యోతి బయలుదేరింది. సముద్రంలో నుండి బయటకు వచ్చింది. భూమిని దాటి పైపైకి ఎంతోవేగంగా ప్రయాణించింది. దాని వేగాన్ని నిరో ధించమని పది దిక్కులలోని వారిని ఆజ్ఞాపించాడు బ్రహ్మ. ప్రయత్నించినా ఆ వేగాన్ని ఆపటానికి ఎవరికీ సాధ్యం కాలేదు. ఆ జ్యోతియే "చంద్రుడు". అది చాల దూరం ప్రయాణించి వెనుదిరిగి అదే వేగంతో భూమిని ఢీకొట్టేటట్లు రాసాగింది. బ్రహ్మ ఈ విషయాన్ని గమనించాడు. స్వయంగా తానే బయలు దేరి ఆ జ్యోతిని తన రథంలో ఉంచుకుని, అది ప్రయాణించే దిశను మార్చాడు. దానితో అది భూమి చుట్టూ తిరగడం ఆరంభించింది. ఆ విధంగా ఇరవై ఒక్కసార్లు భూమిచుట్టూ త్రిప్పి దానిని ఒంటరిగా విడచిపెట్టాడు బ్రహ్మ.

అయినా తనకంటూ ఒక మార్గం ఏర్పరచ బడి ఉండటంతో ఆ జ్యోతి ఈనాటికీ అదేమార్గంలో అదే వేగంతో తిరుగుతూనే ఉంది. దాని ప్రకాశం నానాటికీ పెరుగుతూనే ఉంది. దాని వలననే భూమిలో సారవంతమైన ఓషధులు బయలుదేరాయి. చంద్రుని వల్ల ఆవిర్భవించే ఈ ఓషధులే భూమిపైనున్న జీవకోటికి జీవనాధారాలు. చంద్రుని వల్లనే ఈ ఓషధులు అభివృద్ధి చెందు తున్నాయని పురాణాలు కూడ తెలియజేస్తున్నాయి. అందుకే చంద్రునికి 'ఓషధీశుడు' అనే పేరు ఏర్పడింది. ఈ విధంగా చంద్రుని ఆవిర్భవింపజేసి, రాత్రి చీకటు లను తొలగింపచేసిన ఘనత అత్రి మహర్షిదే.

**అత్రి చతురహమ్ :**

అత్రి చతురహం అనేది ఒక యాగానికి పేరు. ఈ యాగాన్ని మొట్టమొదట అత్రిమహర్షి ఆచరించాడట. దానితో ఆయనకు కావాలసిన ఫలం కూడా లభించింది. ఆ ఫలాన్ని ఎవరు కోరుకుంటారో వారు ఈ "అత్రి చతురహమ్" అనే యాగాన్ని చేసి ఆ ఫలం పొందవచ్చు, అని వేదం చెబుతోంది.

మం. **అత్రిరదదాదౌర్వాయ**
**ప్రజాం పుత్ర కామాయ**
**సరి రిచానోఽ మన్యత నిర్వీర్యః**
**శిథిలో యాత యామా స ఏతం**
**చతూరాత్రమపశ్యత్**
**తమాహరత్ తేనాయజత ।**

తైత్తిరీయ సగంహిత 7-1-8.1

అని ఆరంభించే వేదభాగంలో ఈ చరిత్ర స్పష్టంగా చెప్పబడి ఉన్నది. అత్రిమహర్షి అనుష్ఠించిన యాగం అని, ఇతరులు అనుసరించుటకు తగినదిగా ఎత్తిచూపి, వేదం, ఈ యాగాన్ని అనుష్ఠించిన వారు కూడ ఫలాన్ని తప్పకుండగ పొందగలరు అని దృఢపరచుచున్నది. ఆ మహర్షి పేరుకు అంత గొప్పతనం ఉంది. ఆయన చేష్టలు నిష్ప్రయోజనమైన విగా ఎన్నడూ కాలేదు.

**హిరణ్య దానం :**

లోహాలన్నిటిలోకి బంగారం శ్రేష్ఠమైనది. చూచేవారి మనస్సును హరించే స్వభావం దీనికి ఉండడం చేత "హిరణ్యం" అనే పేరు ఏర్పడింది.

వెండి కూడ బంగారంవలే చూచేవారి మనస్సును హరించే స్వభావం కలిగింది కావడం చేత, దానికి వెండి కూడ హిరణ్యం అనే పేరు కలిగింది. వేదాలలో 'రజతం హిరణ్యం' అని వెండిని, 'సువర్ణం హిరణ్యం' అని బంగారాన్ని పేర్కొన్నట్లు కనపడుతుంది. రజతం అనో సువర్ణం అనో ఇంకొక పదాన్ని చేర్చకుండ 'హిరణ్యం' అని మాత్రం ప్రయోగిస్తే బంగారాన్నే తెలుపుతుంది. "హిరణ్యం ఆత్రే(యా)య దదాతి" అను చోట, 'ఆత్రేయ గోత్రంలో జన్మించిన బ్రాహ్మణునకు బంగారమును ఈయవలెను' అని అర్థముగా గ్రహించవలెను. బ్రాహ్మణులలో శ్రేష్ఠుడు 'ఆత్రేయ' బ్రాహ్మణుడు. లోహాలలో శ్రేష్ఠమైన బంగారము పై వాక్యమునకు తాత్పర్యము. ఈ విధంగా అత్రిమహర్షి వంశంలో జన్మించిన బ్రాహ్మణుడు మిగత బ్రాహ్మణులందరి కంటే శ్రేష్ఠుడని వేదమే చెప్పుచున్నది.

సోమయాగం ఎలా ప్రసిద్ధిమైనది. అందులో ఋత్విక్కులకు దక్షిణ ఇచ్చే సందర్భంలో

మం. **బ్రాహ్మణమద్య రాధ్యాసం ఋషి మార్షేయం**
**పితృమన్తం పైతృమత్యం సుధాతు దక్షిణమే"**

1.4.43.2

అనుమంత్రము అనుసంధింపబడుచున్నది. దీనికి వివరణమైన బ్రాహ్మణ వాక్యము ఈ రీతిగానున్నది.

మం. **"బ్రాహ్మణ మద్య రాధ్యాసం ఋషిం ఆర్షేయ**
**మిత్యా హైష వై బ్రాహ్మణ ఋషిరార్షేయో**
**యః శుశ్రువాన్ తస్మాదేవమాతా"**

తై.సం. 66.1

దీని భావము:- "ఈ సమయంలో అత్రిగోత్రములో జన్మించిన బ్రాహ్మణుని సువర్ణదానంతో సంతోష పెడతాను. ఆ బ్రాహ్మణుడు వేదార్థములను బాగుగా ఎరిగినవాడు. వేదార్థములను బాగుగా ఎరిగినవాని పుత్రుడు. తండ్రివద్ద చక్కని శిక్షణ పొందినవాడు. సంప్రదాయమును బాగుగా నెరిగి ఉత్తమ పతివ్రతగా ప్రసిద్ధిచెందిన తల్లికి తనయుడు. లోహములన్నిటిలోకి ఉత్తమమైన బంగారమును దక్షిణగా స్వీకరించుటకు తగినవాడు. పెద్దల నాశ్రయించి, శుశ్రూషచేసి జ్ఞాననిధి అని పేరొందిన వాడు".

యాగంలో పాల్గొని అనేక శ్రమలకు ఓర్చి నిర్విఘ్నంగా యాగాన్ని పూర్తిచేసిన ఋత్విక్‌లు 16మంది ఉండగా, వీరికి కదా వేదంలో చెప్పబడిన దక్షిణ, ముందు ఒక అత్రేయస గోత్ర బ్రాహ్మణుని

వెతికి తీసికొని వచ్చి ముందుగా వానికి "హిరణ్య" దానం చేసి తరువాతనే ఋత్విక్కులకు దక్షిణ ఈయవలెనని వేదమే నిర్బంధించి చెప్పుచున్నది. అత్రివంశంలో జన్మించడమే ఆ బ్రాహ్మణుని ప్రత్యేకత. ఆపస్తంబుడు, బోధాయనుడు, కాత్యాయనుడు మొదలగు కల్పసూత్రకారులు ఇదే అభిప్రాయాన్ని తెలియజేస్తున్నారు.

సూత్రః : '**బ్రాహ్మణమద్య రాధ్యాస మిత్యాత్రేయాయ ప్రథమాయ హిరణ్యం దదాతి, ద్వితీయాయ, తృతీయాయ వా**" ఆపస్తంబశ్రౌతసూత్రము 13.6.12)

ఆత్రేయులు ప్రవరను అనుసంధించుకునే సమయంలో మూడు విధాలుగా చెప్పబడియున్నారు. మొదటివాడు దొరకకపోతే రెండవ వానికి, రెండవ వాడు కూడ దొరకనిచో మూడవ వానికి ఈయ వలెనని పైసూత్రము తెలుపుచున్నది. మిగిలిన కల్పసూత్రములు కూడ ఈ రీతిగనే వివరించుచున్నవి.

"అత్రిణా త్వా క్రిమే హన్మి" అనునది ఒక వేదమంత్రము. క్రిములను చంపునపుడు ఇది చదువబడుచున్నది. అత్రిమహర్షి ఈ శాస్త్రంలో ఆరితేరిన వాడు కావడంచేత ఆ మహర్షిపేరు ఇందులో చెప్పబడి యున్నది.

"యది ఘర్మదుఘం వా మహావీరం వా
క్రిమయ ఉపాధి గచ్ఛేయుః తానద్భిః ప్రక్షాళయేత్

'అత్రిణా త్వా క్రిమే హన్మి' ఇతి (మంత్రేణ)

బోధాయన శ్రౌతసూత్రం 9-18

**విద్యానిధి:-**

ధర్మానుష్ఠానంలో తనకు ఎన్నడూ ఎవరూ సాటిలేరని ప్రసిద్ధిపొందిన అత్రిమహర్షి, ఆయుర్వేదం, జ్యోతిషం మొదలైన విద్యలందును అగాధమైన పాండిత్యము కలవాడట. ఆయా విభాగాలలో ఈయన వ్రాసిన గ్రంథములు ఈనాటికీ జనులకు మార్గదర్శకత్వము చేయుచు కీర్తిప్రతిష్ఠలతో విరాజిల్లుచున్నవి.

**అత్రిమహర్షి వైష్ణవోత్తముడే:**

ఆదికాలంలోనే బ్రహ్మయొక్క గోళ్ళనుండి ఉద్భవించినవాడు విఖనసమహర్షి. శ్రీమన్నారాయణుని ఆరాధనను అనేక విధములుగా ఆచరించి లోకమునకు అట్టి ఆరాధనావిధానమును అందించిన వాడతడు. ఈ మహర్షి ముఖ్యశిష్యులు నలువురిలో అత్రిమహర్షి ఒకడు. అత్రిమహర్షి పేరుతో ఒక సంహితా గ్రంథము ప్రామాణికముగా ఈనాటికీ ప్రచారములోనున్నది.

ఈ విధముగా ప్రపంచ సృష్టి జరిగినపుడే ఉద్భవించి, సృష్టిలోని ప్రతిఒక్కరు సుఖజీవనం గడుపవలెనని భావంతో మనసుతో ఆలోచించుటకు కూడ శక్యముకాని పనులను అనేకములాచరించి, పుత్రపౌత్రాది సంతానమును అనేక కోట్ల సంఖ్యలో పొంది, చాల గొప్పతనము కలదిగా ప్రసిద్ధిచెందిన 'ఆత్రేయగోత్రము'నకు మూలపురుషుడై వెలుగొందిన అత్రిమహర్షి మహిమ మన వేదాలలోను, పురాణాల లోను, మిగిలిన లక్షణ గ్రంథాలలోను విస్తారముగా చెప్పబడియున్నది. దీనిని వివరించి నచో గ్రంథ విస్తరమగునను భయముతో ఇంతటితో విరమించి, వృద్ధ భాగవతోత్తముడైన అత్రి, అనసూయా దంపతులకు నమస్కరించి ముగించుచున్నాను.

(అత్రిమహర్షి చరితం సమాప్తం)



## పరమపద వార్త

శ్రీమతి దాసరి నాగమణిగారు విజయనగరం వాస్తవ్యులు. వీరు **26-3-2004**న పరంపదించినారు. ఈ సందర్భంగా వీరి కుటుంబ సభ్యులు భక్తినివేదనకు కైంకర్యం కావించినారు. వీరి కుటుంబసభ్యులకు శ్రీస్వామివారి మంగళాశాసనములు తెలియజేస్తున్నాం.



# హనుమంతుని సాగరలంఘనం
## రామాయణంలో రమ్యగాథలు

-చెవుటూరి కుసుమ కుమారి, విజయవాడ.

ఆకాశమార్గాన అక్కడ అనేక పక్షులు, ఐరావతము, దేవేంద్రుని ఇతర గజములు తిరుగాడుతున్నాయి. అతి నిర్మల ఆకసాన గజ, సింహ, వ్యాఘ్ర, సర్పపక్షి రూపాలలో వున్న అనేక దేవతా విమానాలు కనువిందుగా సంచరిస్తున్నాయి. కైశికి మొదలగు రాగధ్వనులు వీనులకు విందుగా సోకుతున్నాయి. సూర్యుడు, చంద్రుడు అశ్విన్యాది నక్షత్రములు అందంగా ప్రకాశిస్తున్నాయి. యజ్ఞ యాగాదులలో దేవతలకు సమర్పించబడిన హవిస్సులను మోసుకుపోతున్న అగ్ని కనిపించు చుండగా, పుణ్యముచేత స్వర్గమును పొందిన మహాభాగ్యశాలురు వారి వారి స్థానములను అలంకరించి వున్నారు. విశ్వవసువను గంధర్వరాజు అచట వసించివున్నాడు. వీరులు, సచ్ఛీలురు అయిన విద్యాధరులు అచట అధికముగా కనిపించుచున్నారు. అంతయు మహర్షులతో, యక్షులతో, నాగులతో, గంధర్వులతో నిండి యుండగా కొంతభాగము మాత్రము నిర్జనముగా వున్నది. శుభకరము, మంగళప్రదము అయిన వినీలాకాశమార్గము జీవకోటికి పైన విధాత వేయించిన పందిరిలా భాసిస్తున్నది.

వాయుపుత్రుడైన హనుమ గొప్ప రెక్కల పర్వతంలా నిరాధారమైన ఆకాశములో చాలా ఎత్తు ఎగురుతూ వెళ్ళుచుండుట చేత అన్నింటినీ చూడ గలుగుతున్నాడు. ఇంతలో కామరూపిణియైన సింహిక అనే రాక్షసి దృష్టి అంజనానందనునిమీద పడినది. సింహిక వెంటనే తన దేహాన్ని విపరీతముగా పెంచినది. ఇంత కాలమునకు ఇంత పెద్దజంతువు నాకు ఆహారముగా లభించినది. తుష్టిగా విందు చేయగలనని యోచించిన ఆ సింహిక హనుమ నీడను ఆకర్షించినది. అప్పుడు అమితవేగముతో మునుముందుకు సాగిపోతున్న హనుమ మహాసముద్రంలో ఎదురుగాలికి ముందుకు సాగలేక బలాత్కారముగా అస్తవ్యస్తముగా లాగబడుతున్న ఓడలా పరాక్రమం తగ్గి క్రిందికి ఈడ్చుకు పోవుచున్నట్లు తెలిసికొన్నాడు. ఇరుప్రక్కలా, క్రిందకూ చూచినాడు. ఆ లవణసముద్రమునుండి బయల్వెడలిన ఒక మహాజంతువు కనుపించి నది. ఛాయాగ్రాహి, అమిత బలశాలి, అద్భుతము అయిన ఈ వింత జంతువు నిశ్చయముగా, ఇంతకు పూర్వము సుగ్రీవుడు చెప్పిన సింహికయే అని బుద్ధిశాలి అయిన హరివరుడు గ్రహించి నాడు. అమిత వేగముగా, తన శరీరమును వర్షజలపూర్ణమైన మేఘంలా పెంచినాడు.

అది చూచిన సింహిక ఉరుములా గర్జిస్తూ నోటిని పాతాళములా తెరచి వానరశ్రేష్ఠునిమీదకు ఉరికినది. కుశాగ్రబుద్ధి, వేగవంతుడూ అయిన హనుమ వజ్రసన్నిభమైన తన శరీరాన్ని సూక్ష్మం చేసి, చంద్రగ్రహణమునాడు రాహువు నోటపడు తున్న పూర్ణచంద్రునిలా అదృశ్యం కావటం సిద్ధచారణులందరూ వీక్షించినారు. హరిసత్తముడైన హనుమ అంత వేగముగానూ సింహిక హృదయ

మును చీల్చుకొని వెలికి వచ్చినాడు. చంపబడిన ఆ సింహికను చూచిన సిద్ధచారణులు "హనుమా! ధైర్యము, సూక్ష్మదృష్టి, బుద్ధి, నేర్పు అనే నాలుగు లక్షణములు ఎవనికి ఉండునో అతడు ఏకార్యము నైననూ వైఫల్యమెరుగక సాధించగలడు". అని ప్రశంసించగా, కార్యదక్షుడైన హనుమ తనకార్య మును తాను స్మరించుచూ గరుత్మంతునివలె మున్ముందుకు నింగిన సాగిపోయినాడు.

"యోజనానాం శతస్యాన్తే వనరాజిం దదర్శసః"

నూరు యోజనముల తరువాత ఒక వృక్ష పంక్తిని ఆ వానరపుంగవుడు చూచినాడు. కొంత వడికి ఆవలి ఒడ్డుకి చేరి క్రిందకి దిగినాడు. నలుదెసలా పరికించినాడు. మంచి వనాలను చూచినాడు. వెంటనే ఆ బుద్ధిశాలికి తన దేహము పర్వత సంకాశముగా ఉన్నదని, అంతటి పెద్ద శరీరమును చూచిన రాక్షసులు కుతూహలమును పెంచుకొనగలరని భావించి అజ్ఞానము తొలగి పోయిన ఆత్మజ్ఞాని తన స్థూలశరీరమును విడచి సూక్ష్మశరీరమును పొందినట్లు, బలిని అణచుటకై త్రివిక్రముడైన శ్రీహరి మూడడుగుల మేదినిని కొలిచి తిరిగి వామనరూపధారి అయినట్లు అనేక రూపములు ధరించగల సమర్ధ కపివరుడు తన సహజరూపము ధరించి ముందు ముందు తన కార్యక్రమమును గురించి ప్రణాలిక యోచించుటకై లంబపర్వత శిఖరాన దిగినాడు. ఆ వేగపాతము నకు ఆ శిఖరములనున్న మృగములు భీతిల్లిపారి పోయినవి. ఆ శిఖరము నుండి అమరావతివలె వున్న లంకాపట్టణాన్ని చూచినాడు హనుమ. అక్కడి నిలచిన హనుమపై లంకలోని వృక్షములు పుష్పవృష్టి కురిసినవి. నూరుయోజనముల సాగరాన్ని ఎగిరి దాటిననూ "అనిశ్వసన్ కపిస్తత్ర నగ్లాని మధిగచ్ఛతి" కొంచెము కూడా అలసట చెందలేదు. నిట్టూర్పు కూడా విడువలేదు. అంజనా నందనుడు రావణపాలితమైన లంకానగర సౌందర్యాన్ని పరిశీలించసాగినాడు.

***

## "హరివరుని లంకానగర ప్రవేశం"

దేవశిల్పి విశ్వకర్మచేత మనసా నిర్మితమైన ఆ లంకానగరము బంగారు ప్రాకారము కలిగి వుండగా, మట్టి గోడలతో నిర్మించిన ప్రాకారము, శిలానిర్మిత ప్రాకారము దానికి జఘనముగానూ, అగడ్తలలో ప్రవహించు అత్యధిక జలము వస్త్రముగానూ, శతఘ్నులు, శూలములు మొదలగు ఆయుధములు కేశపాశమువలెను, కోట బురుజులు కుండలములుగానూ వున్న ఆ లంక ఒక స్త్రీవలే హనుమకు కనుపించినది. తెల్లని ఎత్తైన భవనాలతో శిఖరాగ్రాన నిర్మంచబడిన లంకానగరము ఆకాశమున నిర్మింపబడినదా! అన్నట్లు కైలాస శిఖరంలా వున్నది.

భయంకరులైన రాక్షసులతోనూ, సర్పముల తోనూ నిండినపాతాళమా! అన్నట్లున్నది. కోరలు గలవారు, శూలపట్టిసాది ఆయుధములు ధరించిన వారూ. ఎందరో భయంకర రాక్షసులు ఆ పట్టణ మును రక్షించుచున్నారు. సర్పములు గుహను రక్షించినట్లు కట్టుదిట్టమైన లంకను ఆ పట్టణమున కున్న గొప్ప రక్షణ విధానమును, చుట్టునూ వున్న సముద్రమును చూచిన హనుమ రావణుడు భయంకరమైన శత్రువనిగ్రహించినాడు.

"ఆగత్యాపీహ హరయో భవిష్యన్తి నిరర్థకాః,
నహి యుద్ధేన వై లఙ్కా శక్యా జేతుం సురైరపి"

దేవతలైననూ ఈ లంకను యుద్ధమున జయించ సాధ్యముకాదు. ఇంక వానరులు వచ్చిన ఏమి ప్రయోజనముండును? ప్రవేశింప సాధ్యము కాని ఈ లంకకు వచ్చిననూ మహాబాహువైన రామ చంద్రుడైననూ ఏమి చెయ్యగలడు? ఈ రాక్షసుల విషయమున సామదాన భేదములకు అవకాశము లేదు. యుద్ధమందుమా అసలే అసాధ్యము.

"చతుర్ణామేవ హి గతి
ర్వానరాణాం మహాత్మనామ్,

**వాలి పుత్రస్య నీలస్య**

**మమ రాజ్ఞశ్చ ధీమతః"**

అంగదుడు, నీలుడు, ధీశాలి అయిన సుగ్రీవుడు, నేను మాత్రమే సాగరమును దాటి లంకకు రాగలము. అయిననూ ముందుగా ఈ యోచన లేల? మొదట సీత జీవించివున్నదా? లేదా? అని తెలిసికొనవలెను,. అటుపిమ్మట రామాభ్యుదయ మునకై కాగల కార్యమును నిర్ణయించవచ్చును.

భయంకరులు, పరాక్రమశాలురు అయిన రాక్షసులను మోసము చేతకాక వేరువిధమున సీతను వెదుకజాలను. అయినను ఈ రాక్షసులు వంచింప దగినవారే. నేను ఈ మహాకార్యమును సాధించ వలెనన్న లక్ష్యాలక్ష్యమైన రూపముతో లంకలో ప్రవేశించుటయే సమయానుకూల కార్యము. ప్రవేశించిననూ దుర్బుద్ధియైన ఆ రావణుని కంటపడక సీతనెట్లు వెదుకను? నిర్జనప్రదేశమున ఏకాకిగా వున్న సీతను చూచుట ఎట్లు కుదురును? ఇంత కష్టమును సహించి, సముద్రమును లంఘించి నందులకు ఫలమేమి? వచ్చినపని చెడకుండా, వ్యాకులము లేకుండా చక్కగా అలోచించి ఉపాయమును వెదుకవలెనన్న రాక్షసులు చూచిరేని, రావణ సంహారము చేయవలసిన శ్రీరామచంద్రుని లక్ష్యము చెడిపోవునే! పోనీ, రాక్షసరూపము ధరించెదమన్న ఈ లంకలో దానవులకు తెలియకుండ ఎట్లు సాధ్యము? ఇంక ఏ ఇతర రూపమైననూ ఇంక చెప్పవలెనా? ఈ పట్టణమునుండి రాక్షసులకు తెలియకుండా గాలి కూడా బయటకు వెళ్ళదు అని తెలియుచూనే వున్నది కదా! అయిననూ ఈ బలవంతులైన రాక్షసులకు తెలియని ప్రదేశమెక్కడ వుండును కనుక. నేను ఈ పెద్ద ఆకృతితో ఇక్కడనే వున్నచో వీరు నన్ను తప్పక చంపుదురు. అప్పుడు ప్రభువు సుగ్రీవుని కార్యము కూడా చెడిపోవును. ఇంక నేను ఈవిధంగా వ్యాకులపడుచూ కాలయాపన చేయతగదు.

**"భూతాశ్చార్థా విపద్యన్తే దేశకాల విరోధితాః,**

**విక్లబం దూతమాసాద్య తమః సూర్యోదయే యథా"**

స్థిరబుద్ధిలేని దూతలకు కాలప్రబోధము లేక చేతికందిన పనులు కూడా సూర్యోదయము కాగానే నశించిన అంధకారమువలె చెడిపోవును.

**"అర్థానర్థాన్తరే బుద్ధిర్నిశ్చితాపి న శోభతే,**

**ఘాతయన్తి హి కార్యాణి దూతాః పణ్డితమానినః"**

ఈ కార్యము ఈవిధముగా చేయవలెనని నిర్ణయించుకొనిన తరువాత కూడా అర్థానర్థము లను ఊహించు కొనుచూ మినుమిక్కిలిగా యోచించుచూ తమ బుద్ధికుశలతకు తామే మురిసిపోవు దూతలు పండితమానినులై (తామే పండితులమని) కార్యమును విఫలము చేసు కొనుట "రామకార్యార్థినై" లంకలో ప్రవేశించె దను. దరిచేర శక్యముకాని లంకనంతయు రావణుని గృహముతో సహా వెదకి వెదకి చూచి సీతదర్శనమును తప్పక పొందెదను ఇది నిశ్చయము. అని ఆలోచించి సూర్యాస్తమయ మునకై వేచివున్నాడు.

**"సూర్యే చాస్తం గతే రాత్రౌ**

**దేహం సంక్షిప్య మారుతిః,**

**వృషదంశక మాత్రః సన్**

**బభూవాద్భుత దర్శనః"**

సూర్యుడస్తమించగానే అప్పటివరకూ మహా పర్వతాకారుడైన హనుమ తన శరీరాన్ని మార్జాల ప్రమాణమునకు ఊహించలేనంతగా కుంచించి నాడు (ఎందుకనగా పిల్లి చీకటిలో కూడా చూడగలదు. అటువంటి నేత్రాలతో హనుమ బయలుదేరినాడు). ప్రదోషవేళ శీఘ్రముగా ఎగిరి సువిభక్త, విశాల రాజమార్గ ములు గల సుందర లంకానగరములోనికి ప్రవేశించినాడు ఆ సుందరుడు ఆంజనేయుడు.



# శ్రీవిష్ణు మహాపురాణం

## బ్రహ్మస్తుతి

## 9వ అధ్యాయం

శ్రీ ఉ.వే. శ్రీమాన్ S.V. రంగరామానుజాచార్యస్వామి, రాజమండ్రి

బ్రహ్మ, స్వామిని స్తుతిస్తూ పరమాత్మయే భోక్త అని, ఆయనే జగద్రూపంగాను, దివ్య మంగళవిగ్రహంతోను 'భోగ్య' భూతుడని, సృజించేవాడు సృజింపబడే వస్తువూ ఆయనే నని, కార్యము, కర్త ఆయనేనని ఇలాంటి భగవత్ స్వరూపానికి నమస్కరిస్తున్నాము అంటూ, ఇలాంటి స్వరూపమే "పరమపదం" అని అంటున్నాడు.

విశుద్ధమైన (ఎట్టి దోషాలూ లేని) జ్ఞానంతోకూడి, నిత్యము పుట్టుకలేనిది, క్షయం లేనిది, పరిణామరహితము, ప్రాకృత ఇంద్రియ గోచరం కానిది, ఎట్టి వృద్ధ్యాది వికారాలు లేనిది, ఆ విష్ణువుయొక్క పరమపదం. అది స్థూలంకాదు. అలాగని సూక్ష్మమూ కాదు. ఇలాంటిదని విశేషించి తెలియదగింది కాదు. అలాంటి నిత్యనిర్మలమైన "విష్ణువు యొక్క పరమ పదానికి నమస్కరిస్తున్నాం" అంటున్నారు బ్రహ్మాదులు.

తమ పుణ్యపాప కర్మలు నశించిన తరువాత యోగులు, నిరంతరోద్యుక్తులై "ప్రణవ" ధ్యానముఖంగా, ఓంకార రూప ప్రణవార్థంగా, ఏ అచింత్యమైన (సాధారణ బుద్ధిచే భావింపనలవికాని) స్థానాన్ని దర్శిస్తూ ఉంటారో అలాంటి అక్షయమైన వైష్ణవ పరమ పదస్థానాన్ని ప్రణమిల్లుతున్నాము.

ఈ పరమపదాన్ని దేవతలు కాని, మునులుకాని, నేనుగాని (చతుర్ముఖ బ్రహ్మకాని) శంకరుడు కాని తెలియజాలరో, అలాంటి పరమేశ్వరుడైన నారాయణుని దివ్యస్థానమైన పరమపదాన్ని ప్రణమిల్లుదుముగాక. ఏ దేవునికి బ్రహ్మ-విష్ణు-శివాత్మకాలైన మూడు శక్తులున్నాయో, సనాతనుడైన ఆ విష్ణువుయొక్క పరమపదాన్ని ప్రణమిల్లుదుముగాక" అంటూ బ్రహ్మాదులు పరమపద వైభవాన్ని కీర్తించారు.

స్వామీ! విశ్వాత్మన్! సర్వాశ్రయా! అచ్యుతా! ఓవిష్ణూ! నీ భక్తులమైన మాకు నీవు దృష్టి గోచరుడవుకా తండ్రీ! అని ప్రార్థించారు.

బ్రహ్మ అంతవరకూ, వైష్ణవధామమైన పరమపదాన్ని వీక్షించి, అది తనకు కూడా దృగ్గోచరం కాదని చెప్పిన మాటలు విని, ఇతర దేవతలు కూడా ప్రణతిపూర్వకంగా ఆ పరమపదాన్ని స్తుతిస్తూ ఇలా అన్నారు-

**"యన్నాయం భగవాన్ బ్రహ్మ**
**జానాతి పరమం పదమ్ ।**
**తన్నతాః స్మ జగద్ధామ,**
**తవ సర్వగతా చ్యుత" ॥**

"అంతటా ఉన్న ఓ అచ్యుతా! నీకు నెలవై, ఈ సమస్త జగత్తుకు ఆశ్రయమైన ఈ బ్రహ్మకూడా ఎరుగజాలని నీ "పరమపదాని"కి ప్రణతి ఘటిస్తున్నాం స్వామీ!" అంటూ స్తుతించారు. ఇక్కడ యజ్ఞమూర్తి ధరుడైన స్వామిని "యజ్ఞః" అంటూ స్తుతించారు.

బ్రహ్మ, ద్వాదశాదిత్యులతోపాటు పూష ఏకాదశరుద్రులతో శంకరుడు, అగ్నులతో కలసి అగ్ని, అశ్వినులు, వసువులు మరుద్గణాలు, సాధ్యులు, విశ్వేదేవతలు, దేవేంద్రుడు వీరంతా దైత్య సైన్యంచే పరాజితులై "శరణం త్వా మను ప్రాప్తాః" అంటూ శరణు వేడారు.

ఇలా దేవతలచే స్తుతింపబడిన స్వామి, శంఖ చక్రాదులను ధరించి, అపూర్వమైన దివ్యదేహంతో తేజోరాశిగా వారిముందు గోచరించాడు.

దేవతలు అందరూ, క్షోభను వీడి స్తిమిత దృష్టులతో పుండరీకాక్షుడైన స్వామిని మళ్ళీ స్తుతించారు. దేవతాదులు చేసిన అనన్య గతికమైన శరణ వరణానికి ఇది ప్రత్యక్ష నిదర్శనం.

**త్వామార్తాః శరణం విష్ణో**
**ప్రయాతా దైత్య నిర్జితాః ।**
**వయం ప్రసీద సర్వాత్మన్**
**తేజసా ఆప్యాయ యస్వనః ॥**

**తావదార్తిః తథావాంఛా,**
**తావన్మోహః తథా అసుఖమ్।**
**యావన్న యాతి శరణం**
**త్వామ్ అశేషాఘ నాశనమ్॥**

**త్వం ప్రసాదం ప్రసన్నాత్మన్**
**ప్రపన్నానాం కురుష్వనః ।**
**తేజసా నాథ సర్వేషాం**
**స్వశక్త్యా ఆప్యాయనం కురు ॥**

ఈ శ్లోకాలు మనం అనుసంధానం చేయాలి.

ఇలా స్తుతింపబడిన స్వామి, మెల్లగా ప్రసన్నదృష్టులను ప్రసరింపజేసి ఇలా అన్నాడు.

"ఓ దేవతలారా! మీ తేజస్సును వృద్ధి పొందించుతాను. నేనేమి చెబుతున్నానో దాన్ని మీరు చేయండి. దైత్యులతో కలసి సకల ఔషధాలు తెచ్చి క్షీర సాగరంలో వేసి అమృతం కోసం దైత్య దానవులతో పాటు కలసి, మందరాన్ని కవ్వంగాచేసి, వాసుకిని త్రాడుగా చేసి చుట్టి మథించండి. నేను సహాయుడుగా ఉంటాను.

ముందుగా దైత్యులను సహకరించేలా చేసికోండి. అందరం కలసి ఫలాన్ని అనుభవిద్దామని వారికి చెప్పండి. మథనం వల్ల పుట్టిన అమృతం చేత మీరు అమరులు, బలవంతులు కండి. దేవ ద్వేషులైన దైత్యులు అమృతం పొందలేని విధంగా నేను చేస్తాను. వాళ్ళకు క్లేశం తప్ప ఏమీ ఉండదు" అన్నాడు స్వామి.

►►►

# శ్రీమద్భగవచ్ఛాస్త్రము

శ్రీ ఉ.వే.శ్రీమాన్ రమాకాంతాచార్యస్వామి - హైదరాబాద్

సంవర్తుడిట్లు పలికెను:- శ్రీపాంచ రాత్రమునకు సమానమైన శైవాదిశాస్త్రములు నాటినుండి శ్రీమన్నారాయ ణుని యాజ్ఞచే విష్ణుమాయా ప్రేరితమై ఎదురులేనివిగా ప్రసిద్ధమై ప్రవర్తించుచున్నవి. శైవాచారములు గూడ నచ్చటచ్చట స్థిరపడినవి. పాంచరాత్రము యన్న పంచశాస్త్రములకన్న విలక్షణము గలదయ్యు, మరుగుపరచుటకే సృష్టింప బడుటచే లోకమున స్వతస్సిద్ధ ప్రమాణమైన శ్రీపాంచ రాత్రము ఆయా శాస్త్రప్రవక్తలచే దూషింపబడుచునే యున్నది. పాషణ్డులు నిర సింపబడినను-హేతు వాదానుకూలము విష్ణుమాయావిష్టులై, పతితులు, దుర్మార్గులయొక్క బలముచే, నాస్తికులు నిందితుల గుచు వివిధ వ్యాధులచే మిక్కిలి బాధలనొందుచు పుట్టుచు, చచ్చుచు నరకమునందు ఉడికించబడు చున్నారు. కొందరు మాయతో మనస్సులు మురికిగాఁ జేయబడి స్వర్గముననను వసించుచున్నారు. ఎవరు మాయను ధిక్కరించగలిగిరో వారు జనన మరణ రూపమైన ఈ సంసార సముద్రమును దాటి పునరావృతిలేని మోక్షమును పొందుచుండిరి. సర్వ శాస్త్రములు పరిశోధించి, పలుమారులు విచారించి, అమృతమయమైన శ్రీమన్నారాయణ ధ్యానమును వేదాంతులనుసరించుచున్నారు.

అన్ని కులములయందు బ్రాహ్మణులును, అన్ని ఆశ్రమములందు సన్యాసులును, సర్వతీర్థముల యందు గంగానదియు ఎట్లు విశిష్టమైనవో? దేవతలందరిలో సర్వోత్తముడు విష్ణువు ఎట్లో! శాస్త్రములన్నింటిలోను శ్రీపాంచరాత్రశాస్త్రము సర్వోత్తమము. అందు వలన ఎవరు శ్రీపాంచరాత్రోక్త విధిననుసరించి శ్రీహరిని ఆరాధింతురో, మోక్షము నొంది తిరిగి జన్మలేనివారగుచు, తరుగని ఫలరూపమైన ఆనందమునొందునట్టి ధన్యాత్ములగు చున్నారు. అనుమానమే లేదు. అట్లు సర్వేశ్వరుని అనుగ్రహపాత్రుడై, శుభకరుడైన ముక్తునియొక్క పితరులు స్వర్గస్థులైనను బ్రహ్మలోకమున పూజింప బడుదురు. అట్టి తరి ఇక నరకమును గూర్చిన ప్రస్తావనేల? విష్ణు సంబంధ మంత్రములతో నెవ్వరు, దేవతలను, పిత్రుదేవతలకు హవ్య, కవ్యముల నొసగుదురో అట్టి కర్మఫలము తరుగనిదై వానిచే పితృదేవతులు తృప్తినొందుచున్నారు. ఎవరివంశమునందు హరిభక్తుడైన మహాత్ముడు జన్మించునో అట్టివాని తండ్రులు, తాతలు ఎగిరి గంతులువేయుచు నర్తింతురు. పాంచరాత్రశాస్త్రము ప్రకారము వాసుదేవు నాశ్రయించి-భగవద్ధ్యాన తత్పరులై సర్వదోషములు తొలగి మోక్షము నొందగలరు. ఈ శాస్త్రమును ఇతరులెవ్వరికో అనాలోచితముగాగాక--ఓర్మి గలవారికి ఆచార్యాభి మాన పాత్రుడగువానికి మాత్రమే ఉపదేశింప వలయునేగాని, ఇతరులకునొసంగరాదు. వేదము నందు విశ్వాసముగల వానికి వేదమువలెనే ఉపనయనాది సంస్కారములు జరిపి చదివించ వలెను. మహోపనిషత్తుగా పిలువబడు ఈ శాస్త్రము పాంచరాత్రమను పేరనీలోకమున నెట్లు ప్రసిద్ధినంది నదో? గమనింపుడు.

ఈ శాస్త్రమునకన్న భిన్నములైన ఐదింటి కన్న విలక్షణమై-స్వప్రకాశకమైనందున మిగతా శాస్త్రములు చీకటివలె మరుగుపరచబడినవగుటచే పాంచరాత్రమను పేరుగలిగినది. పగటియందు చంద్రుడు. చుక్కలు ఎట్లు మరుగుపరచబడుచున్నవో! అట్లే ఈ శాస్త్రము ముందు శైవాది శాస్త్రపంచకము ప్రకాశములేనివగుచున్నవి. సూర్యప్రకాశముచే చీకట్లు నశించినట్లు ఈ శాస్త్రము ముందు ఇతర శాస్త్రములైదును ఉనికిని పోగొట్టబడుచున్నవి. కావున పవిత్రమైన, పాపహరమైన, జన్మరాహిత్యము గలిగించు ఈ శాస్త్రము-జనన, మరణరూపమైన ఈ సంసార సముద్రమున అజ్ఞానముచే మునిగి-కర్మపాశముచే కట్టబడియున్న వారికి ఆవలి ఒడ్డుకు చేర్చగల తెప్పవలె సహకరించునదీ శాస్త్రము.

వేదమువలె నాలుగు విభాగములుగలదీ

తంత్రము:– ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అధర్వ వేదములు నాలుగు భాగములుగానున్నవో అట్లే ఈ శాస్త్రము సిద్ధాంత భేదముచే నాలుగు విభాగములు గానున్నది. సిద్ధాంత శబ్దమునకు సరియైన అర్థము, వేదాన్త శాస్త్రమునందు పూర్తి ప్రయోజనమునందిన బుద్ధిమంతులకు చివరగా పరమప్రయోజనమును పొందించు యోగ్యతను గలిగించుచున్నందున ఇది "సిద్ధాంతమని" పిలువబడుచున్నది. సిద్ధాంత భేదము లేవనగా, వ్యూహములకు మూలమైన వాసుదేవుడే ప్రధానముగా శ్రియాదులు–పరివారములుగా ఆరాధింపబడుట ఇందలి విశేషము. ఇది మంత్ర సిద్ధాంతముగా చెప్పబడినది. ఇక లోక ప్రసిద్ధమైన ఆగమ సిద్ధాంతము వాసుదేవాది చతుర్వ్యూహ మూర్తులు క్రమముగా సమాన కక్ష్యలో పూజింప బడునో అది ఆగమ సిద్ధాంతము. ఇందు కర్మ సన్యాసమును పేర్కొనుట జరిగినది. ఇక మూడవదైన తంత్రసిద్ధాంతము నవమూర్తి ఆరాధనాత్మకమైనది. అవి క్రమముగా వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధమూర్తులను అనుసరించి నారాయణ, హయగ్రీవ, విష్ణు, నృసింహ, వరాహ మూర్తులు ఆరాధింపబడు విధానము. నాల్గవదైన తంత్రాంతర సిద్ధాంతములో ఒకేమూర్తి నాల్గు ముఖములుగనో, మూడు ముఖములుగనో ఆరాధింపబడు తంత్రమును తంత్రాంతర సిద్ధాంతముగా గుర్తించుట. శాస్త్ర సమ్మతమైన నాలుగు సిద్ధాంత స్వరూపములు తెలుపుతూ ఇందు పరస్పర సంకరము కూడదని నిషేధము విధించడమైనది. ఒకవేళ సాంకర్యము జరిగినచో పరిపాలకునికి, రాజ్యమునకు వినాశము తప్పదని శాసింపబడినది కూడ. ఇట్టి ఆగమ సిద్ధాంతములలో ఏ సిద్ధాంతము ననుసరించి భూమికర్షణము మొదలు క్రియాకలాపములు జరిపించబడినవో ఆ వ్యక్తి చేతనే ప్రతిష్ఠాంత క్రియలు జరిపించుట మంత్ర విభాగము తెలిసిన ఆగమజ్ఞుని కర్తవ్యముగా స్పష్టపరచినది. ఒకవేళ తంత్రాంతరము నిచ్ఛగించినను–అన్నిసిద్ధాంతములు–సర్వ ఫలప్రద ములుగా చెప్పబడినవి. అట్టి సిద్ధాంత చతుష్టయ ములో మొదటిదైన మంత్ర సిద్ధాంతమునకు చెందినవే ఈ పాద్మ సంహితయని స్పష్టపరచ బడినవి. వక్తల యొక్క విభాగములనను సరించి సిద్ధాంతములు గూడ బహుభేదకములుగా తలుపబడుచున్నవి. అవి కొన్ని సంగ్రహముగాను, మరికొన్ని విస్తరము గాను తంత్ర గ్రంథములను ప్రకటించుట జరిగినది. శిష్యుల హితముగోరి మంత్రసిద్ధికలుగునటుల నుపదేశింపబడిన ఈ తంత్రములన్నింటిని ఉపదేశిం చినది శ్రీమన్నారాయ ణుడేనని తెలియదగును. భక్తులనను గ్రహించుటకే స్వయముగా వినిపించెను. ఇక వినిన వారలు ఎవరెవరనిన, బ్రహ్మదేవుడు, మునులు, ఈ శాస్త్ర ప్రయోజనము ప్రకృతిలో అలభ్యమైన మోక్షమే–దీని సాధనము ఉత్తమమైన భగవదారాధనయే, సత్పురుషులు సాధ్య వస్తువు మోక్షమైన, సాధనము భగవదా రాధనము– ఈరెంటికినీ పరమాత్మయే కారణము. శృతిమూలకమైనదే–ఈ తంత్రము కల్పసూత్రము వలె పరమప్రమాణమైనది. సర్వేశ్వరుని శాసనమువలన ప్రతి సృష్టియందును తెగకుండ అనుసరింప బడుచున్నది.

ఈ లోకమున చింతామణియు, కామధేనువు, కల్పవృక్షము ఏ విధముగా కోరిన ఫలములను ప్రసాదించుచున్నవో! అట్లే ఈ శాస్త్రముగూడ సర్వఫల ప్రాప్తిని కలిగించును. ఇతర సాధనముల యపేక్షలేదు. శ్రీపాంచరాత్ర శాస్త్రము, ధర్మార్థ, కామ, మోక్షప్రాపకము. ఇతర శాస్త్రముల యందాశచే చేయు శ్రమయంతయు వ్యర్థమే యగును. అట్టి సాధకుల కాలము వృధా యగును. ఒకవేళ లభించినను పూర్తి ఫలమునీయజాలవు. అందువలన ఇతర శాస్త్ర వ్యసనమును వదలుట మంచిది. సర్వేశ్వరుడైన వాసుదేవుని వదలి ఇతర దేవతలనారాధించుట నరకప్రాప్తికి కారణమగు నేగాని ఈ విషయమున విచారింపదగిన అంశము లేదు. చేతులు పైకెత్తి ప్రతిజ్ఞ చేయుచున్నాను. వేదశాస్త్రములకన్న ఉత్కృష్టమైనవి లేవు. కేశవునికన్న పరదైవతములేదు. అందువలన దేవదేవుడైన శ్రీహరిని యీ దివ్యశాస్త్రమునను సరించి యారాధింపుము. అని కణ్వమహర్షికి సంవర్తుడు తెలిపెను. అది విని కణ్వుడు ద్విజశ్రేష్ఠుడైన సంవర్తుని తంత్రభేదములెన్ని, అవి ఏయే పేర్లుగలవో? వినగోరుచున్నాను తెలుపుమనెను.



# బదరికాశ్రమంలో సత్సంగ సదనమునకు విరాళాలు సమర్పించిన దాతలు

**శ్రీమతి పి. రమణమ్మగారు- విజయనగరంద్వారా**

**మహారాజ పోషకులు:**

శ్రీమాన్ దాసరి యతిరాజ సంపత్కుమార్- విజయనగరం;

**జీవిత సభ్యులు:**

**విశాఖపట్నం:** శ్రీమతి ఎమ్. లక్ష్మి; శ్రీమాన్ పి.వి.జె.మోహనరావు; శ్రీమాన్ సి. రఘునాథ రాజు; శ్రీమాన్ ఎమ్.ఎల్. నరసింహారావు; శ్రీమతి ఆర్. సీతమ్మ; శ్రీమాన్ ఆర్. అప్పారావు, నారాయణమ్మ; శ్రీమాన్ ఎన్.ఆర్.కె. రెడ్డి; శ్రీమాన్ కె. వెంకటేశ్వరరావు-బొబ్బిలి; శ్రీమాన్ ఎన్. పురుషోత్తమరావు, భారతి; శ్రీమాన్ ఎస్.ముత్యాలప్పడు; శ్రీమాన్ ఆర్.స్వామి నాయుడు; శ్రీమాన్ ఆర్. చింతామణిరావు; శ్రీమాన్ ఎ. సత్యన్నారాయణ; శ్రీమాన్ ఎన్.ఆర్.కె. రెడ్డి; శ్రీమాన్ ఎన్. మధు; శ్రీమాన్ ఎన్. శ్రీకాంత్; శ్రీమాన్ కృష్ణారెడ్డి;

**అభిమానులు:**

**విశాఖపట్నం :** శ్రీమాన్ పి. నాగేశ్వరరావు, శ్రీమతి అన్నపూర్ణ; శ్రీమాన్ బి. రామచంద్రరావు; శ్రీమాన్ అన్నసముద్రం వెంకట జగన్నాథరావు; గోపాల పట్నం. శ్రీమతి ఎస్. సరోజనమ్మ-విజయనగరం; **బొబ్బిలి:-** శ్రీమాన్ భోగి పోలీస్, శ్రీమాన్ టి. నమ్మాళ్వార్, శ్రీమతి సిహెచ్. సీతాలక్ష్మి; శ్రీమాన్ జె.సూర్యనారాయణ; శ్రీమాన్ సుబ్రహ్మణ్యం-అనంతపురం; శ్రీమాన్ పి. కృష్ణమోహన్-ఒరిస్సా; శ్రీమాన్ నారాయణం నరసింహమూర్తి-విజయనగరం; శ్రీమాన్ కాళ్ళ అప్పలనాయుడు, లక్ష్మమ్మ-మర్రిపాలెం; శ్రీమతి బి. కమలమ్మ, శ్రీమాన్ కోట్ల కృష్ణయ్య, సుభద్ర-మహబూబ్‌నగర్; శ్రీమాన్ వి. అప్పారావు, రామయ్యమ్మ-విజయనగరం; శ్రీమతి ఎస్.ఎ. రాజేశ్వరి-పెద్ద వాల్తేరు; శ్రీమాన్ టి. సన్నపురాజు-అక్కయ్య పాలెం;

**శ్రీమాన్ రమేశ్ గుప్తాగారు ద్వారా :-**

**రాజ పోషకులు:**

శ్రీమాన్ పి. యాదయ్యగుప్త-హైదరాబాద్

శ్రీమాన్ సరిదెన సువర్ణ, రామ్మోహన్‌రావు, సచిత, విహారి

**పోషకులు:**

శ్రీమాన్ కె. జై ప్రకాష్‌రామ్-హైదరాబాద్

శ్రీమాన్ తేలుకుంట్ల చిరంజీవన్-హైదరాబాద్

**అభిమానులు:** శ్రీమాన్ పోతూరి వెంకటేశ్వర్లు, ఒంగోలు.

**ఆఫీస్ ద్వారా:**

**మహారాజ పోషకులు:**

శ్రీమతి కాప లక్ష్మిగారు-ఏలూరు

శ్రీమాన్ పి. రఘుప్రసాద్-హైదరాబాద్

**రాజ పోషకులు:**

శ్రీమతి ఎస్. జానకీదేవి-విజయవాడ

డా॥ బెల్లంకొండ మోహన్‌బాబు-

శ్రీమతి లక్ష్మీనారాయణమ్మ-కొవ్వూరు

శ్రీమాన్ పప్పుకొండయ్య-బుడ్మి

**పోషకులు:** శ్రీమతి ముత్యాల వీర రాజమ్మ-కార్ప

శ్రీమాన్ చిలకమర్రి రామానుజాచార్యులు- హైదరాబాద్

శ్రీమాన్ మల్లాది బసవపున్నయ్య-మోపర్రు

శ్రీమాన్ కుదరవల్లి రామకోటేశ్వరరావు,

శ్రీమతి అనసూయమ్మ-ఏలూరు

శ్రీమాన్ కొత్త అనంతరెడ్డి-నల్గొండ

శ్రీమాన్ ఎస్.బి. మత్స్యాచార్య-హన్మకొండ

**జీవితసభ్యులు:**

బదరీనారాయణ ట్రావెల్స్-చెన్నై

**అభిమానులు:**

శ్రీమాన్ చిన్నమ్మనాయుడు-దుగ్గుపురం; శ్రీమాన్ పి. రాజు, జమునారాణి-సికింద్రా బాద్; శ్రీమాన్ చిలకపాటి శ్రీనివాసాచార్యులు, నరసమ్మ-ఒంగోలు; శ్రీమాన్ సి.ఎస్. రఘునాథన్-తిరుపతి; శ్రీమాన్ సిహెచ్. విశ్వనాథన్-మార్కాపూర్; శ్రీమాన్ ఎమ్మెస్. వెంకటేశ్వరరావు-ఎర్రగొండపాలెం; శ్రీమతి ఎమ్. విజయలక్ష్మి-విజయనగరం; శ్రీమాన్ పి.ఎస్. కనక రాజు-విశాఖపట్నం; శ్రీమాన్ విశ్వనాథన్-చిత్తూర్; శ్రీమాన్ ఎ.ఎస్. మనోహర్-చిత్తూర్; శ్రీమాన్ ఎమ్. కృష్ణదేవ రాయపిళ్ళై-చిత్తూర్; శ్రీమాన్ ఎమ్. తిమ్మ రాయప్ప, మంగ-మదనపల్లి; శ్రీమతి ఎ. రోజా-న్యూఢిల్లీ; శ్రీమాన్ ఎస్. రాధాకృష్ణ మూర్తి- తెనాలి; డా॥ కె.సి. హనుమంతప్ప- అనంతపూర్; శ్రీమాన్ జి. వెంకటాద్రి-చిత్తూర్; శ్రీమతి జి. వెంకటమ్మ-కుదువపల్లి; శ్రీమాన్ ఎ.కె. రావు-విద్యానగర్; శ్రీమాన్ ఎ.వి. ధవాల్-న్యూఢిల్లీ; శ్రీమతి సరస్వతీ బాయి-చిత్తూరు; శ్రీమాన్ ఎమ్. దక్షిణా మూర్తి-అక్కయపాలెం; శ్రీమాన్ ఎమ్.సి. రావు, కాత్యాయిని-విశాఖపట్నం; శ్రీమాన్ ఎస్.ఆర్. సత్యన్నారాయణ-చిత్తూరు; శ్రీమతి కె. కావేరి-చిత్తూరు; శ్రీమాన్ జి. రాఘవయ్య-చిత్తూరు; శ్రీమాన్ స్వామిబదరీ నారాయణ, ఆండాళ్-హైదరాబాద్; శ్రీమాన్ తెన్నేటి బలరామ్-విశాఖ పట్నం; శ్రీమాన్ పి. చెన్నారెడ్డి-మహబూబ్‌నగర్; శ్రీమాన్ పి. రామిరెడ్డి-మహబూబ్‌నగర్; శ్రీమాన్ జె.లింగన్న-తిప్ప సముద్రం; శ్రీమాన్ ఎ. వేణుగోపాలరావు-శ్రీకాకుళం; శ్రీమాన్ ఎ.వి. సుబ్బారావు-గుంటూరు; శ్రీమాన్ ఆర్. శ్రీరామకృష్ణశర్మ-హైదరాబాద్; శ్రీమన్ ఎ. సింగరాచార్యులు-గుంటూరు; శ్రీమాన్ శంకరరావు-నర్సీపట్నం; శ్రీమాన్ డి. సూర్య నారాయణాచార్యులు- జి.ఎస్.పురం; శ్రీమాన్ టి. రంజి-పెందుర్తి; శ్రీమాన్ రెడ్డి నాగేశ్వరరావు, సీతమ్మ-పిడుగురాళ్ళ; శ్రీమతి ఎమ్. స్వరాజ్య లక్ష్మమ్మ-పిడుగురాళ్ళ; శ్రీమాన్ సిహెచ్. గంగరాజు-ఆకివీడు; శ్రీమాన్ కె.వి.ఆర్. కృష్ణం రాజు-విజయవాడ; శ్రీమాన్ టి. రామకృష్ణం రాజు-భీమవరం; శ్రీమాన్ ఎమ్. శివరామరాజు-మల్కీపురం; శ్రీమాన్ సత్యన్నారాయణ-చెన్నై; శ్రీమతి వేల్పూరు పద్మావతీ గిరిధర్; శ్రీమతి ఎన్. ఆండాళ్, బాలజీ-బేతూరు; శ్రీమాన్ జి.ఎన్. సుకుమార్, శశికళ-అంబూరు; శ్రీమతి ఇ. నిర్మల, రామానుజ-చెన్నై; శ్రీమాన్ ఒ.కె. ప్రకాశ్ కుమార్-అంబూరు; శ్రీమాన్ డి. చిన రామచంద్రరాజు-ఏలూరుపాడు; శ్రీమాన్ నాగేంద్రవర్మ-భీమవరం; శ్రీమాన్ కె.రామకృష్ణంరాజు-సీతమ్మధార; శ్రీమాన్ పి.వెంకట సోమరాజు, చిరంజీవి-భీమవరం; శ్రీమాన్ జె.ఎమ్. కిశోర్-విశాఖపట్నం; శ్రీమతి కె.వి.కె. రత్నమాల-చిలకపూడు; శ్రీమాన్ జి. శాస్త్రి-గుంటూరు; శ్రీమాన్ చిరుగంటి నీలకంఠం శర్మ-భిలాయ్‌నగర్; శ్రీమతి చింతపల్లి సుశీల-రాజీపేట; శ్రీమాన్ ముప్వ మాధవరావు- రావి పాడు; శ్రీమతి ఎఱ్ఱమ్మ-పి. రామచంద్రపురం; శ్రీమతి సిహెచ్. శివాయమ్మ-దొప్పలపూడి శివారు; శ్రీమాన్ జి. సత్యనాథ్-దొప్పలపూడిశివారు; శ్రీమాన్ ఎస్. ఆదిరెడ్డి-పాలమూరు; శ్రీమాన్ ఎస్. వెంకటరెడ్డి- పాలమూరు;



## పరమపద వార్త

శ్రీమాన్ **కొమాండూరి గోపాలకృష్ణమాచార్యులు**గారు రాజమండ్రి వికాసతరంగిణి సభ్యులు. వీరు మే 31 2004 న పరంపదించినారు. వీరి కుటుంబ సభ్యులు, భార్య సులోచనగారు ఈ సందర్భంగా భక్తినివేదనకు కైంకర్యం సమర్పించినారు. వీరి కుటుంబ సభ్యులకు శ్రీస్వామివారి మంగళాశాసనములు అందజేస్తున్నాం.

# ఇతిహాసబోధ - 22(3)

లోక వ్యవహారమంతా సహజంగా 'అహంకార, మమకారాల' ప్రాతిపదికపైనే పనిచేస్తుంటుంది. 'ఈ దేహమే నేను' అనే అహంకారం, 'దీనికి సంబంధించినవన్నీ నావనే' మమకారం జీవకోటి చైతన్యానికి ప్రేరణశక్తులు. సమస్త దుఃఖాలకు కారణమైన ఈ అజ్ఞానపు పునాదులను విడనాడి సర్వేశ్వరుడిని ఆలంబనంగా చేసుకొని జీవించాల్సిందిగా శాస్త్రాలు మహానుభావుల జీవితాలను నిదర్శనాలుగా చూపి మరీ బోధిస్తున్నాయి. అయితే ఈ బోధనలను అర్థం చేసు కొని, అమలుపరచగల శక్తివంతమైన బుద్ధికుశలత్వమే మనకు పెద్దకొరత. భావోద్వేగపూరితమైన మానసిక సంకల్పాలకు ఊడిగం చేయటానికే మనబుద్ధి అలవాటు పడింది.

కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాదుల వల్ల కలిగే భయం, ద్వేషం, దుఃఖం, అవమానం, అసూయ, ఆగ్రహం, ఆవేదనవంటి వికారాల వత్తిడికి లొంగి మన బుద్ధి హ్రస్వమౌతుంది. బలీయమైన మానసిక అనుభూతుల ప్రభావానికి లోబడి దాస్యం చేసే బుద్ధియొక్క వివేచనాశక్తి సరైన నిర్ణయాలను తీసుకోలేదు.

పర్యవసానంగా మనోవాక్కాయ కర్మలు ఋజు మార్గాన్ని విడనాడి వక్రగతిన పరిస్థితుల ప్రభావానికి తగ్గట్లుగా పరిభ్రమిస్తుంటాయి. మనోవాక్కాయ కర్మలను సరైన రీతిలో నడపగలిగిన శక్తివంతమైన పరికరంగా బుద్ధి విశేషాన్ని వికసింపచేసుకోగలిగిన వారిలోనే 'ఆర్జవ ప్రవృత్తి' జ్ఞానలక్షణంగా వ్యక్తమౌతుంది. ఆర్జవప్రవృత్తిగలవారి ఆలోచనాశైలి ఏవిధంగా ఉంటుందో తెలుపటానికై త్రేతా యుగంనాటి **'మిథిలరాజవంశీయుల గాథ'**ను ఈ **ఇతిహాస బోధ** వివరించే ప్రయత్నం చేస్తోంది.

ఇక్ష్వాకుచక్రవర్తి రెండవ కుమారుడు **నిమి**. కులగురువు వశిష్ఠుని శాపంతో విదేహుడైన నిమి చక్రవర్తి దేహాన్ని మథనం చేయడం వల్ల జన్మించిన శిశువుకు ఋషులు జనకుడ'ని పేరుపెట్టారు. విదేహునికి పుట్టడం వల్ల, విదేహుని మథనం ద్వారా జన్మించడంవల్ల మిథిలుడని కూడా ఆ బాలునకు పేరువచ్చింది. అతడు నిర్మించిన నగరమే మిథిలానగరం.

అతని కాలం నుండి మిథిలానగరం రాజులు ఎవ్వరైనా 'జనకుడ'నే పేరుతోనే లోకప్రసిద్ధులయ్యారు. మొదటి జనకునికి 20వ తరంవాడు సీరధ్వజ జనకుడు. సీతకు తండ్రిగా, శ్రీరామచంద్రునికి మామగా ఖ్యాతి గడించిన మహానుభావుడాయన.

సీరధ్వజుని తర్వాత కుశధ్వజుడు, అతని తర్వాత ధర్మధ్వజుడు మిథిలకు రాజులయ్యారు. ధర్మధ్వజునికి కృతధ్వజుడు, అమితధ్వజుడు అని ఇద్దరు పుత్రులు. తమ పూర్వీకులవలె ఇరువురూ గొప్ప వేదాంతులు. తాత్త్వికులు. క్షత్రియధర్మాన్ని అనుసరించి పిత్రార్జితమైన రాజ్యాన్ని అన్నదమ్ములిరువురూ విభేదాలు లేకుండా విభజించుకొని పాలించారు.

కృతధ్వజుని అనంతరం అతని పుత్రుడైన కేశి ధ్వజుడు మిథిలకు చక్రవర్తి అయ్యాడు. తండ్రి నుండి రాజ్యాన్నే కాక బ్రహ్మవిద్యను కూడా పొందిన మహాజ్ఞాని కేశిధ్వజుడు. ఇక అమితధ్వజుని కుమారుడైన ఖాండిక్యుడు వైదికమైన కర్మమార్గంలో ప్రావీణ్యాన్ని సంపాదించాడు. యజ్ఞయాగాది క్రతువుల నిర్వహణ, విధివిధానాలలో అతడు బహునేర్పరి.

ఒకరు జ్ఞానమార్గాన్ని, మరొకరు కర్మమార్గాన్ని ఉపాసిస్తూ, రాజ్యపాలన చేస్తున్నప్పటికీ దాయాది మాత్సర్యంచేత పరస్పరం గెలవాలనే పట్టుదలతో భీకర యుద్ధాలు చేసారు. చివరకు విజయం కేశిధ్వజుడికి లభించింది. పరాజయం పాలైన ఖాండిక్యుడు పురోహిత, మంత్రిసహితంగా కొద్దిపాటి బలగంతో రాజ్యాన్ని విడిచి అడవులలో తలదాచుకున్నాడు. రాజ్యభ్రష్టుడైన ఖాండిక్యుడు కుమిలిపోయే విధంగా ఉభయ రాజ్యాలను ఎంతో వైభవంగా పరిపాలించసాగాడు కేశిధ్వజుడు. జ్ఞాన నిష్ఠుడైన కేశిధ్వజుడు వైదికక్రతువుల పట్ల ప్రీతితో ఇక్షుమతీ నదీతీరాన ఎన్నో యజ్ఞాలను సశాస్త్రీయంగా నిర్వహించాడు. అలా ఒకసారి కేశిధ్వజుడు యజ్ఞదీక్షలో ఉన్న సమయంలో అనుకోని విధంగా ఆ యజ్ఞానికి విఘ్నం ఏర్పడింది.

యజ్ఞం కోసం ఎంపిక చేసిన ఆవు నదీతీరాన పచ్చిక బయళ్ళలో మేతమేస్తున్న సమయంలో అటుగా

వచ్చిన ఓ పులి దాన్ని చంపివేసింది. దైవికంగా ఏర్పడ్డ ఈ విఘ్నానికి ప్రాయశ్చిత్తం ఏం చేయాలని ఋత్విక్కులను అడిగాడు కేశిధ్వజుడు.

వారీ సమస్యకు పరిష్కారాన్ని 'కశేరువు'ను అడిగి తెలుసుకుందామని రాజుకు సలహాఇచ్చారు. రాజు కశేరువును ఆశ్రయించాడు. ఆ మహర్షికూడా తన నిస్సహాయతను ప్రకటిస్తూ "భృగుమహర్షి పుత్రుడైన శునకునికి బహుశా ఇందుకు తరుణోపాయం తెలియవచ్చు. అతనిని సంప్రదించమని" రాజుకు సలహా ఇచ్చాడు.

ఋతుధ్వజుడు శునకునిచేరి విషయం విన్నవించాడు. "ఈ సంక్లిష్టమైన పాయశ్చిత్తకర్మ విధానాన్ని కశేరువుగానీ, నేనుగాని ఎఱుగము. ఈ విధివిధానాల మర్మమెరిగినవాడు భూమిమీద ఖాండిక్యుడు ఒక్కడే. అతడు నీచేత పరాజితుడై అడవులలో మ్రగ్గుతున్న విషయం నీకు తెలుసుకదా! యజ్ఞం నిర్విఘ్నంగా సాగే కిటుకును నీకు ఖాండిక్యుడే చెప్పాలి"! అన్నాడు శునకుడు.

ఆలోచించాడు కేశిధ్వజుడు "మహామునీ! నేను యజ్ఞదీక్షలో ఉన్నాను మీరు చెప్పిన విధంగా లోపరహితంగా యజ్ఞాన్ని పూర్తిచేసే మార్గాన్ని తెలుపవలసిందిగా ఖాండిక్యుడిని కోరుతాను. అతడు నన్ను శత్రువుగానే భావించి వధిస్తాడా? మంచిదే! యజ్ఞదీక్షలో ఉండి మరణించిన వానికి మహాయజ్ఞ ఫలం సంప్రాప్తిస్తుంది కదా!

అలాకాక అతడు విజ్ఞుడై మార్గాన్ని బోధిస్తే యాగం సఫలమౌతుంది అని కేశిధ్వజుడు తన నిర్ణయాన్ని మునికి తెలియజేసి కృష్ణాజినం ధరించి రథమెక్కి అడవిలో ఖాండిక్యుడిని వెతుక్కుంటూ బయలుదేరాడు.

కేశిధ్వజుడిని దూరం నుండే గమనించాడు ఖాండిక్యుడు. క్రోధంతో అతని నేత్రాలు ఎఱ్ఱబడ్డాయి. పగతో అతని గుండె రగిలిపోయింది. తననూ, తన పరివారాన్ని అడవులపాలు చేసిన ఈ దుర్మార్గుడిని తక్షణమే మట్టు పెట్టాలని ఖాండిక్యుడు విల్లెక్కుపెట్టాడు.

తీక్షణంగా రాజును చూస్తూ "కేశిధ్వజా! కపటత్వంతో కృష్ణాజినకవచం ధరించి నన్ను వధించడానికి వచ్చిన నీ కుటిలత్వాన్ని గ్రహించ లేని వెఱ్ఱినికాను నేను.

జింకచర్మం కట్టుకొని వచ్చినంత మాత్రాన నిన్ను విడిచి పెడతాననుకొన్నావా? మూర్ఖుడా? మనమెన్ని జింకలను బాణాలతో నేలకూల్చలేదు? ఈ రోజు నీగతీ అంతే. నేటితో మన పగ పరిసమాప్తమౌతుంది. చూడు నా దెబ్బ"! అంటూ హూంకరించాడు.

కేశిధ్వజుడు నిరాయుధుడు. అత్యంత స్థిరత్వంతో, ప్రశాంతంగా ఖాండిక్యుని కళ్ళలోకి సూటిగా చూస్తూ, "ఖాండిక్యా! నేను విఘ్నమైన యజ్ఞసందర్భంగా సందేహ నివృత్తికోసం నిన్ను ఆశ్రయించటానికి వచ్చినవాడిని. నీపై పగతో నిన్ను వధించవచ్చిన శత్రువును కాదు. ఆలోచించి నిర్ణయం తీసుకో! చంపదలిస్తే నిరభ్యంతరంగా నన్ను చంపవచ్చు. కోపాన్నో, బాణాన్నో దేనిని విడిచినా స్వీకరించడానికి నేను సిద్ధమే"! అన్నాడు కేశిధ్వజుడు.

ఖాండిక్యుడు ఆశ్చర్యపోయాడు. అతని ఆగ్రహం చల్లారింది. మంత్రులను, పురోహితులను పిలిచి మంతనాలాడాడు. తక్షణ కర్తవ్యాన్ని నిర్ణయించుకొనేందుకు వారి మధ్య తీవ్రచర్చ జరిగింది.

"బ్రహ్మాండమైన అవకాశమిది! మన వాళ్ళ నెత్తురు బొట్టు చిందకుండా సమస్త రాజ్యమూ సంప్రాప్తించే సువర్ణ ఘట్టం నడిచి మన ముందు కొచ్చింది. ఇక ఆలోచించాల్సిన పనిలేదు. వెంటనే చేతికిచిక్కిన శత్రువును సంహరించి మన సమస్య లను పరిష్కరించు కొందాం" అన్నారు మంత్రులు.

ఖాండిక్యుడు వివేకి. "మీరంతా మంచి సలహాయే ఇచ్చారు. ఈ కేశిధ్వజుడు హతుడైతే సమస్త రాజ్య సంపదా నా వశమౌతుంది. అందులో ఏ మాత్రమూ సందేహం లేదు. ఆకులలములు తింటూ ఈ అడవిలో మనం పడుతున్న కష్టాలు మాయమై రాజ్యభోగాలు అనుభవించే అదృష్టం మనముందు ఈ రూపంలో నిలిచింది.

దీనిని నేను కాదనటం లేదు.... అయితే ఇక్కడ ఓ చిన్న మెలిక ఉన్నది. ఇప్పుడు నేను ఇతడిని సంహరిస్తే ఇతనికి పరలోక జయం లభిస్తుంది. అనంతమైన పరలోకజయాన్ని ఇతనికి వదిలి, అల్పమూ, అశాశ్వతమూ అయిన ఈ లోకజయాన్ని నేను పొందడం ఎంత వరకు సబబు?

సందేహనివృత్తికోసం నిరాయుధుడిగా చేతులు కట్టుకువచ్చిన వాడిని రాజ్యలోభంతో వధించి పాపాన్ని భుజించేంత మూర్ఖుడినికాను. మా పూర్వీకుల రక్తం నాలోనూప్రవహిస్తున్నది. విజ్ఞతతోనే ఈ వ్యవహారాన్ని నిర్వహిస్తాను". అని తన నిశ్చయాన్ని మంత్రులకు తెలియజేసి కేశిధ్వజుడిని చేరాడు ఖట్వాంగుడు.



హైదరాబాద్ ఎయిర్ పోర్ట్‌లో జీయర్‌స్వాములను శ్రీవారు స్వయంగా స్వాగతిస్తున్న దృశ్యం



సైబర్ గార్డెన్ వద్ద స్వాగత దృశ్యం



మహంతులకు పూర్ణ కుంభ స్వాగతం





విచ్చేసిన స్వాములను పుష్పమాలాంకృతులను చేస్తున్న శ్రీ స్వామివారు



ప్రసంగిస్తున్న శ్రీస్వామివారు మరియు ప్రముఖులు



దక్షిణ దేశం నుండి వచ్చిన అర్చకులు



పండ్లు, పాలతో అతిథి మర్యాదలు చేస్తున్న వేద విద్యార్థులు



విచ్చేసిన ప్రముఖులసత్కారములకు సిద్ధమౌతున్న కార్యకర్తలు



జీయరుస్వాములను సన్మానిస్తున్న సంగోష్ఠి నిర్వాహకులు





మహంతులను సత్కరించి వారి ఆశీస్సులు పొందుతున్న సంగోష్ఠి నిర్వాహకులు



నిజాం కాలేజి గ్రౌండ్‌లో వేదికపై ఆసీనులైన శ్రీ జీయర్లు, మహంతులు



సభకు విచ్చేసిన అశేష భక్త జనవాహిని





శంషాబాదులో మొక్కలను నాటుతున్న శ్రీ స్వామివారు, వానమామలై స్వామివారు మరియు శ్రీ రామేశ్వరరావుగారు ప్రభృతులు

"కేశిధ్వజా! చెప్పు నీ సమస్యను. పరిష్కారమార్గం తెలిస్తే చెబుతాను" అన్నాడు ఖాండిక్యుడు.

ప్రమాదవశాత్తూ శార్దూలం చేతిలో మరణించిన ఘర్మధేనువువల్ల యజ్ఞనిర్వహణకు ఏర్పడ్డ అవరోధాన్ని వివరించి యజ్ఞం సాఫీగా సాగే మార్గం ఉపదేశించమని కోరాడు కేశిధ్వజుడు.

వివరాలను తెలుసుకొని ప్రాయశ్చిత్తకర్మలను ఏ విధంగా నిర్వర్తించాలో రాజుకు స్పష్టంగా తెలియజేసాడు ఖాండిక్య జనకుడు. ఖాండిక్యుని అనుమతి తీసుకొని కేశిధ్వజుడు యజ్ఞభూమికి వెళ్ళి ప్రాయశ్చిత్త విధులను నిర్వహించి యజ్ఞాన్ని సక్రమంగా పూర్తి చేసాడు.

అవభృథ స్నానానంతరం కేశిధ్వజుడు ప్రశాంతంగా ఒంటరిగా కూర్చుని ఆలోచించాడు. "యజ్ఞం సుసంపన్న మైంది. ఋత్వికులను, బ్రాహ్మణులను, బంధువులను, అర్థులనూ అందరినీ సంతృప్తిపరిచాను. అయినా నా మనస్సులో ఇంక శంక తొణికిసలాడుతూనే ఉంది. ఈ కొఱతకు కారణం ఏమిటి? ఆ! కారణం తెలిసింది. యజ్ఞానికి ఏర్పడ్డ అవరోధాన్ని తొలగించుకొనేమార్గం బోధించిన ఖాండిక్యుని ఋణాన్ని తీర్చుకోలేదు కదా! గురుదక్షిణ ఇవ్వకపోతే యజ్ఞఫలం నాకెక్కడదక్కుతుంది? తక్షణమే ఖాండిక్యుడిని దర్శించి ఋణవిముక్తుడిని కావాలి"! అని నిశ్చయించుకొని కేశిధ్వజుడు మళ్ళా అడవికి బయలుదేరాడు.

యజ్ఞాని పూర్తిచేసుకొని ఈ రాజు నన్ను వధించ డానికి మళ్ళా అడవికి వచ్చాడని భావించాడు ఖాండిక్యుడు. ఆయుధాలు ధరించి యుద్ధానికి సిద్ధమయ్యాడు. తనపై బాణం ఎక్కుపెట్టిన ఖాండిక్యుడిని చూస్తూ "ఖాండిక్యా! నేను నీతో కయ్యానికి రాలేదు. ఆగ్రహించక ఆయుధాన్ని విడిచిపెట్టు. నీ దయవల్ల యాగాన్ని నిర్విఘ్నంగా నెర వేర్చాను. గురుదక్షిణ చెల్లించవలసిన బాధ్యత నాది. నీవు కోరిన దాన్ని గురుదక్షిణగా చెల్లించే ఉద్దేశ్యంతోనే ఇక్కడకు వచ్చాను. దక్షిణగా ఏమి సమర్పించమంటావో తెలియ జేయి'! అన్నాడు కేశిధ్వజుడు.

తెల్లబోయాడు ఖాండిక్యుడు. అతడు ఊహించని పరిణామం ఇది. వెంటనే మంత్రులను పిలిచి ఏకాంతంగా వారిని సంప్రదించాడు.

"ఆయాస పడకుండా సమస్త రాజ్యాన్ని సంపాదించు కొనే అవకాశాన్ని భగవంతుడు మళ్ళా మనకి ఈ రూపంలో ప్రసాదించాడు. గురుదక్షిణగా కేశిధ్వజుడిని రాజ్యాన్ని కోరండి. మన సమస్యలు తొలగిపోతాయి" అని సలహా ఇచ్చారు మంత్రులు. ఈ విషయాన్నే తన "ఆముక్తమాల్యద"లో శ్రీకృష్ణదేవరాయలు ఎంతో అందంగా ఈ క్రింది విధంగా తెలియ జేసాడు.

---------------- నేడుగా
దైవముగల్గె; వేగ గురుదక్షిణగాఁ జతురర్ణవీవృతో
ర్వీ వలయం బశేషమును వేడుము
భూవర; మమ్మునందఱన్‌బ్రోవుము;
బాంధవాప్తజన పోషణకన్నను బుణ్యమున్నదే?

రాజ్యాన్ని గురుదక్షిణగా స్వీకరించి బంధువు లను, ఆప్తజనులను పోషించే ధర్మాన్ని నిర్వర్తించమన్నారు మంత్రులు. నిజమే మరి! ఓడి అడవిలో ఉన్నవాడు ఖాండిక్యుడ్ను గెలిచి రాజ్యాన్ని స్థిరం చేసుకున్నవాడు కేశిధ్వజుడ్ను. కేశిధ్వజుడిని జయించగల బలగాన్ని ఖాండిక్యుడు సంపాదించుకోగలగడం సందేహం. ఇలాంటి సమయంలో యుద్ధంతో పనిలేకుండా రాజ్యభోగాలను అనుభవించే అవకాశం దానంతటదే తమ ముందుకు వచ్చినప్పుడు, దానిని రాజు వదలిపెట్టరాదన్నది వారి నిశ్చయం.

**"అనవుడు నల్ల నవ్వి మనుజాధిపుఁ**
**డిట్లను! 'మీరలర్థ సాధన పరతంత్ర**
**కోవిదులు దక్క, మహాసుఖదాయి**
**మోక్షమార్గ నయ విచార కోవిదులు**
**గా, రతి చంచల రాజ్యలక్ష్మినే**
**మని చని వేడు వాడఁ బరమార్థము**
**వేడక యమ్మహామతిన్"? -**

మంత్రుల సలహా విని రాజు పక పకా నవ్వాడు. "గొప్ప మంత్రులయ్యా మీరు! పరమార్థతత్త్వం పిసరంతైనా అంటలేదు మీకు! జీవితానికి అర్థసాధనమే పరమ ప్రయో జనమనుకుంటున్నారా? మీ విచక్షణాశక్తి ఇంత అల్పంగా ఉంటుందని ఊహించలేదు.

వచ్చిన కేశిధ్వజుడు భూమిని ఇవ్వగల చక్రవర్తే కాదు మహాజ్ఞానికూడా. ఈ విషయం మీకు గుర్తులేదేమో! ఈ మహానుభావుడిని స్వల్ప ఫలాన్నిచ్చే చంచలమైన రాజ్యలక్ష్మిని అడిగి నన్ను నేను చిన్నబుచ్చుకోలేను" అంటూ కేశిధ్వజుడినిచేరి సాదరంగా పరికిస్తూ, "గురు

దక్షిణ చెల్లిస్తానన్న మాట సత్యమే కదా" అని ప్రశ్నించాడు. అవునన్నాడు కేశిధ్వజుడు

'నవనీ తలేంద్ర! నీవధ్యాత్మ రతుడవు
దక్షిణ గురునకీఁదలచితేని
సకల భువన క్లేశ సంక్షయం బెయ్యది
య వ్విద్య బోధింపు"

కేశిధ్వజునికి ఆశ్చర్యం వేసింది. "ఈ రాజు రాజ్యాన్ని కోరుతాడని భావించాను. ఇదేమిటీ? సకల భువనక్లేశాలను నశింపచేసే ఆధ్యాత్మిక విద్యను గురుదక్షిణగా ఇవ్వమని కోరుతున్నాడే"! అనుకొని "ఖాండిక్యా! ఇదేమి వింత కోరిక! మనబోటి క్షత్రియులకు రాజ్య, భోగంకన్నా ప్రీతికరమైనది మరొకటి ఉన్నదా? రాజ్యలాభాన్ని గురుదక్షిణగా ఎందుకు కోరటం లేదు"? అని ప్రశ్నించాడు.

"కేశిధ్వజా! రాజ్యాన్ని నేను ఎందుకు కోరలేదో చెబుతాను విను, అజ్ఞానులు మాత్రమే ఇలాంటి అల్పభోగాలకు ఆశపడతారు. నాకు అలాంటి లౌల్యతలేదు. శత్రువులను గెలవటం, ప్రజలను పోషించడం క్షత్రియధర్మాలనడంలో ఎటువంటి సందేహమూ లేదు. నీవు శక్తివంతుడవై నా రాజ్యాన్ని గెలిచావు. ఉత్తమక్షత్రియుడనైన నేను కోల్పోయిన రాజ్యాన్ని యాచించడం ధర్మం కాదు.

సజ్జన సమ్మతమైన కోర్కెనే నిన్ను కోరుతున్నాను.

"మంత్రధానులు వేడు సామ్రాజ్యమనెడు
పలుకు ధర్మచ్ఛలంపు లోభం బయుక్త
మిది యెఱిగి రాజ్యమడగ నే నిచ్చగింప"
"ఆస పడుదురె బుధులు రాజ్యంబు మమత
మానని జడాత్ముల,ట్ల హం మానపాన
మత్తులకె కాక యది యేల మా దృశులకు"?

లోభాది దోషాలకు కారణమైన రాజ్యాన్ని కోరమని నా మంత్రులు సలహా ఇచ్చినప్పటికీ అది ధర్మబద్ధం కాదని త్రోసిపుచ్చాను. మమత్వాన్ని వీడని వారు, అహంకారపు మత్తుతో విఱ్ఱవీగేవారు పోయే దారి నాబోటి వారికి తగింది కాదు. కనుక తరించే మార్గాన్ని తెలుసుకోవడమే నాకు తగిన కర్తవ్యమౌతుందన్నాడు ఖాండిక్య జనకుడు.

కేశిధ్వజనృపతికి ఖాండిక్యుని నిశ్చయం సంతోషాన్ని కల్గించింది. "ఖాండిక్యా! నీ వల్ల మన 'నిమి' కులం పావనమైంది. వివేకమంతమైన కోర్కెను గురుదక్షిణగా కోరావు! అవిద్యా స్వరూపాన్ని తెలియచేస్తాను. సావధానంగా విను.

"ఆత్మకాని మేననాత్మ బుద్ధియును న
స్వంబునందు మిగుల స్వత్వమతియు
నవ ని వర! యవిద్యయను మహాతరువును
తృత్తికీ ద్వయంబు విత్తు మొదలు"-
"అనాత్మన్యాత్మబుద్ధిర్యాఅన్వే స్వమితియామతిః
అవిద్యా తరుపంభూతి బీజ మేర్ద్విధాస్థితమ్"

- శ్రీ విష్ణుపురాణం.

అవిద్య అనే మహావృక్షానికి రెండు విధాలైన విత్తులు మొదలుగా ఉన్నాయి. ఆత్మకాని దాన్ని ఆత్మ అన్న బుద్ధితో వ్యవహరించడం మొదటిదైతే, తనది కాని దాన్ని తనదని అతుక్కుపోయే బుద్ధి రెండవది.

"నరనాథ! పాంచభౌతిక
శరీరమున దేహి మోహసాంద్ర తమ తమః
పరివృతుడై 'యే నిది నా
పరికర'మని యవధిలేని భ్రమఁబడి తిరుగున్"

ఈ పాంచభౌతిక శరీరంలో దేహి మోహాంధకారంలో మునిగి 'ఇది నేను, నాది' అని భ్రమపడి తిరుగుతున్నాడు.

"జల వసుధాంబర పవన
జ్వలనంబులకంటె దానజస్రంబు వెలిన్
వెలుగొందు నాత్మయుండగ
గళేబరము నెవ్వదాత్మగా దలబోయున్"

నీరు, భూమి, ఆకాశం వాయువు, అగ్ని వీటి కంటె వేరుగా ప్రకాశిస్తున్న ఆత్మను గ్రహించక ఈ కళేబరాన్ని ఆత్మగా భావించడం అవిద్య.

"వ పు రుప భోగ్యముల్ నృపగృహ క్షేత్రాదు
లవి బొందివాఁ గాక యాత్మవగునె"-
"యట్లన పుత్రపౌత్రా నీకములు నాత్మ
కాని మైబుట్టుట గావు తనవి"-
"గాన మృత్యువుఁగను కాయంబున జనించు
పుత్రాదులెడ స్వత్తబుద్ధి తగదు"-.

ఈ గృహక్షేత్రాదులన్నీ దేహంతో అనుభవించవలసినవే కదా? ఇవి ఆత్మకు చెందినవి కావు. అలాగే పుత్రపౌత్రాదుల సంబంధం కూడా.

ఈ సత్యాన్ని గ్రహించక జీవుడు ఈ దేహసంబంధమైన భోగాలపట్ల అమిత వ్యామోహంతో కర్మలు చేస్తూ

జన్మ పునర్జన్మల చక్రబంధంలో చిక్కుకుని అలమటిస్తున్నాడు. మోహమనే మకిలిని జ్ఞానజలంతో కడిగివేసుకోగలిగిన ప్రజ్ఞాశీలికే నిజమైన సౌఖ్యం లభిస్తుంది. దుఃఖం, అజ్ఞానం ప్రకృతియొక్క లక్షణాలు. ఆత్మ పరిశుద్ధమైనది. అది జ్ఞానస్వరూపం.

అగ్నితో సంబంధం పాత్రతోనే ఉన్నప్పటికీ, పాత్రలోని నీరు ఎట్లా కుత కుతలాడుతూ చప్పుడు చేస్తుందో, అలాగే ఆత్మకూడా ప్రకృతి ప్రభావంచేత, దేహసంబంధంగా అహంకారాది దోష వికారాలను ప్రదర్శిస్తున్నది. ఈ సత్యాన్నిగ్రహించి క్లేశనాశకరమైన "యోగాన్ని" ఆశ్రయించు అన్నాడు కేశిధ్వజుడు.

"మహాసుభావా! మన నిమి సంతతిలో నీవంటి శ్రేష్ఠుడైన 'యోగి' మరొకడు లేడు. అందుకే నిన్ను ఆశ్రయించాను. భవరోగహరమైన 'యోగరహస్యాన్ని నాకు అనుగ్రహించు' అన్నాడు ఖాండిక్యుడు. ఖాండిక్యా! విను!

**"ప్రాణికోటికెల్ల బంధంబు మోక్షంబు**
**చేరుటకును మనసు కారణంబు**
**విషయసంగియైన, వినుబంధకారి; ని**
**ర్విషయమైన, ముక్తి విభవకారి".**

సమస్త ప్రాణికోటియొక్క బంధానికీ, మోక్షానికీ కారణం మనస్సే! మనస్సు విషయాసక్తమైతే బంధం. విషయాలపట్ల అది ఆసక్తిని విడిస్తే మోక్షం.

ఈ సత్యాన్ని గ్రహించి సాధకుడు పరమేశ్వరుని ధ్యానిస్తూ విషయాలపై నుండి మనస్సును మళ్ళించే అభ్యాసం చేయాలి. అప్పుడే అయస్కాంతం ఇనుపముక్కను ఆకర్షించినట్లుగా భగవంతుడు సాధకుడిని స్వీకరిస్తాడు.

సాధనకు సంబంధించి యమనియమాదులను వివరిస్తాను. తెలుసుకో"! అంటూ వాటిని గూర్చి వివరంగా ఖాండిక్యుడికి తెలియజేసాడు కేశిధ్వజుడు. "మహాశయా! సమస్త దోషాలను పోగొట్టే శుభాశ్రయాన్ని స్పష్టంచేయి! చిత్తచాంచల్యానికి విరుగుడు అదే కదా"! అన్నాడు ఖాండిక్యుడు.

"భూపతి! చిత్తానికి శుభాశ్రయం బ్రహ్మయే"! అంటే బ్రహ్మ తత్త్వాన్ని వివరించాడు కేశిధ్వజుడు.

"పురుషశ్రేష్ఠా! చంచలమైన చిత్తానికి స్థిరత్వాన్ని ప్రసాదించే శుభాశ్రయం విష్ణువుకు శరణాగతి చేయడమే. ఎవరి చిత్తం విష్ణుమయమౌతుందో వారి సమస్త పాపాలను వాయు సహితుడైన అగ్ని గడ్డిని దహించివేసినట్లుగా, ఆ స్వామి దహించి వేస్తారు.

**"సమస్త శక్తిరూపాణి తత్కరోతి జనేశ్వర ।**
**దేవతిర్యఙ్మనుష్యాది చేష్టావన్తి స్వలీలయా"॥**

రాజా! తన లీలావిశేషంతో ఆ స్వామి దేవతలు, పశు పక్షులు, మనుష్యులువంటి సమస్త శక్తులరూపాలను ధరిస్తున్నాడు.

**తద్రూపం విశ్వరూపస్య తస్యయోగ యుజానృప ।**
**చిన్త్యమాత్మ విశుద్ధ్యర్థం సర్వ కిల్బిష నాశనమ్"॥**

ఆత్మశుద్ధికోసం సర్వపాపాలన నాశనం చేసే విశ్వరూపుడిని ధ్యానించు. అంటూ సవివరంగా ఖాండిక్యునికి ముక్తిస్వరూపాన్ని వివరించాడు కేశిధ్వజుడు. ఖాండిక్యుడు పరమానందభరితు డయ్యాడు.

"కేశిధ్వజా! అశేష చిత్తమాలిన్యాన్ని నశింపచేసే శ్రేయోమార్గాన్ని ఉపదేశించావు. ధన్యుడిని" అంటూ అతడు తగిన విధంగా కేశిధ్వజుడిని పూజించాడు.

కేశిధ్వజుడు ఆ విధంగా గురుదక్షిణను సమర్పించి, తన నగరానికి చేరి యథాప్రకారం నిష్కామ కర్మతో రాజ్యపాలనం కావించాడు. ఖాండిక్యుడు కేశిధ్వజునివల్ల పొందిన తన రాజ్యానికి తన పుత్రుడిని రాజుగా చేసి తాను శ్రీమన్నారాయణునిపై మనస్సునిలిపి యోగసిద్ధి కోసం అడవిలోనే సాధన కొనసాగించాడు.

ఆ విధంగా ఇద్దరు జనకులూ తమ సాధనతో శ్రీమన్నారాయణుని ప్రసన్నం చేసికొని ఆయన సాన్నిధ్యాన్ని పొందగలిగారు.

'ఖాండిక్య, కేశిధ్వజులగాధ'ను పరిశీలించాము కదా! రాగ ద్వేషాల తాకిడికి ఊగిసలాడని సునిశితబుద్ధి విశేషం వారిరువురి జీవితాలను ధన్యంచేసింది. సర్వప్రాణులలోనూ మాధవుడిని దర్శించి సేవించాలనే ప్రతిజ్ఞను స్వీకరించిన మనకు కూడా అట్లాంటి స్థిరబుద్ధి అత్యంత అవసరం

మనోవాక్కాయ కర్మలను ఈ లక్ష్యం దిశగా నడిపించే యోగ్యమైనబుద్ధివిశేషాన్ని అనుగ్రహించ వలసిందిగా భగవంతుని వేడుకోవటంతోపాటు, అందుకు అవసరమైన సాధనపరమైన శ్రద్ధనుకూడా అభ్యసించే ప్రయత్నం చేసినపుడే ఆర్జవం మన ప్రవృత్తిగామారే అవకాశం ఉంటుంది.

ఈ అభ్యాస క్రమానికి సంబంధించిన మరికొన్ని విశేషాలను వచ్చే ఇతిహాస బోధలో తెలుసుకునే ప్రయత్నం చేద్దాం.

జై శ్రీమన్నారాయణ !


నచికేతుడు
....................గత సంచిక తరువాయి
నచికేతా! జాగ్రత్తగా విను, ఇది ఉత్తమమైన బ్రహ్మోపాసన! మోక్షసాధనమైనది.
శాశ్వతమైన విష్ణు లోకాన్ని అందిస్తుంది.
ఇది సామాన్యు లకు తెలిసేది కాదు.
వేదగుహలలో రహస్యంగా దాగిన విద్య


ఈ అగ్నిని ఆరాధించేటపుడు
నిర్మించే కుండాలకీ ఎన్ని
ఇటుకలు, ఏ ఆకృతిలో ఉన్నవి
వాడాలో వేదమే చెప్పినది.
ఆ వివరాలన్నీ నీకు
ఉపదేశిస్తా!
యముడు నచికేతుని కుడిచెవిలో అగ్నిని
ఆరాధించే విధానాన్ని అనుగ్రహించుట.
నాయనా!
అవగతమైనదా?

# కరిమబ్బు కదిలింది

శ్రీ చెలికాని మైథిలీకుమారి, బొబ్బిలి

పరమపదంలో వేంచేసియున్న "కరిమబ్బు" ఏ విధమైన మార్పులు లేని తన నిత్యకార్య కలాపముల వలన కొద్దిగా విసుగనిపించింది. తనయందున్న ప్రేమాతిశయంతో తనకు రక్షణవలయంగా చేరియున్న వారినందరిని కనుగప్పి తన సృష్టినంతా అలా... అలా... తిరిగి అవలోకించుదామా! అనే ఆలోచన వచ్చింది. కాలవిలంబన చేయక తనదైన నాలుగురకములైన వయ్యారి నడకలతో కమనీయంగ కదిలింది.

తన స్వేచ్ఛా స్వాతంత్ర్యములకు తానే మురిసిపోతు కరిమబ్బు చిన్నగ గర్జించింది. పెద్దగా సవ్వడి చేస్తే తన గుట్టురట్టవుతుందేమోనని భయం అనుకున్నంత అయింది. కరిమబ్బులో ఒదిగియున్న మెరుపుతీగె మిన్నకుంటుందా "స్వామీ! నేను వెంటలేకుండా మీరు అలా పోదగునా! ఆగండాగండి!" అని తళుకుల కాంతులు కుమ్మరిస్తూ సౌదామిని పయనమైంది.

తన యజమానులు విహారమునకు సన్నద్ధమవుతుంటే వారి అంతరంగ అనుచరుడైన అనంతుడు ఆగుతాడా! "బుస! బుస!" మని తాను బయలుదేరాడు. మన కాలమేఘము తన విభూతులన్నింటిని విలోకించుతుండగ హఠాత్తుగ మనస్సు మామగారింటి వైపు మరులు కొంతి. ఏ జామాతకైన మామగారింట మర్యాదలంటే మక్కువే కదా!

తలవని తలంపుగ తన యెదుట ప్రత్యక్షమైన అమ్మాయిని, అల్లుడుగారిని కాంచి క్షీరసాగరుడు ఆనందంతో అంతెత్తున ఉప్పొంగినాడు. వెన్నెలకాంతివంటి చిరుకెరటములతో వారిని స్వాగతిస్తూ గారవించినాడు. చల్లని, తెల్లని క్షీరబిందువులు నల్లని స్వామి చరణారవిందములపై ముత్యాల రాశిలా మురిసినవి. "అమ్మా! బాగున్నావా తల్లీ!" అని అమ్మ చెక్కిలిపై తుంపరులుగ త్రుళ్ళిన పాలబిందువులు, తమ ఇంటి ఆడబడుచును ఆదరముతో కుశలప్రశ్నలు వేసాయి. తండ్రిగారి నిలువెత్తు మమకారంతో క్షీరసాగరతనయ నిండార మునిగింది సంతోషంతో పులకరించింది. తన సుమసదృశ్యమైన కరములతో తండ్రిగారు తనకిచ్చిన విందును దోసిళ్ళతో సేవించింది. చెంతనున్నతన నాథుడికి కూడ సమర్పించింది. సమర్పించి ఊరకయుండక "స్వామీ! తృప్తిదీరా సేవించండి. మరల మామగారింట మర్యాదలు సరిలేవంటూ సతాయించుతే ఒప్పను సుమా"! అనే భావము స్ఫురించునట్లు తన మనోహరుని వైపు ఒక ఓరచూపు చూచింది. ఆలి ఆంతరంగానన్ని అర్థం చేసుకున్న అచ్యుతుడు తన ఎర్రని పగడముల వంటి అధరములపై సుతిమెత్తని చిరునగవుల దొంతరులను అలవోకగా దొర్లించినాడు.

మన కరిమబ్బుగారికి అలసట తీరింది. మామగారింట అన్ని మర్యాదలు చక్కగ అమరినాయి. మనస్సులో విసుగుపోయింది. హాయిగా, మత్తుగా నిదురముంచుకు వచ్చింది ఆ పుండరీకాక్షుడికి. తన శేషి మనసెరిగిన శేషుడు చెంతనే ఉన్నాడు కదా! చక చక క్షణకాలములో మెత్తని, చల్లని విశాలమైన, పరిమళభూరితమైన పానుపుగ రూపుదాల్చినాడు. తన వేయిపడగలతో ఒక్కసారిగ్గా విచ్చుకొని చాందినీగా పద్మనాభునుకు అమరిపోయినాడు. స్వామి అనంతునిపై ఒక ప్రక్కకి ఒదిగి ముచ్చటగా శయనించాడు. జగములేలె పరమాత్మ కమలచరణాల చెంత చేరింది అమ్మ. కాసింత కాలము మన కరిమబ్బు మామగారింట అత్యంత మనోహరముగ విశ్రమించింది. సవ్వడి చేయుట తగదు సుమా!

జై శ్రీమన్నారాయణ !

# న్యూస్ ప్రచార వార్తలు

ముగ్గురు జీయర్లు ఒకచోట దర్శనమిస్తే అదొక దివ్యక్షేత్రంగ భావిస్తారు. 16మంది జీయరులు ఒకచోట చేరితే? అది సాక్షాత్తు పరమపదమే! భాగ్యనగరము, హైదరాబాదు, ఈ భాగ్యాన్ని పొందింది. వేలమంది భక్తులకు ఈ సౌభాగ్యాన్ని పంచింది గూడ!

16మంది జీయరులు, 40మంది ఉత్తర భారతావనికి చెందిన శ్రీభగవద్రామానుజ జగద్గురు పీఠాలకు నిర్వాహకులైన మహంతులు, ఆంధ్ర, తమిళనాడులకు చెందిన దివ్యదేవాలయ నిర్వాహకు లైన శ్రీపాంచరాత్రాగమ, శ్రీవైఖానసాగమ విద్వాంసులు, అర్చకస్వాములు, వివిధ ఆచార్యపురుష కుటుంబాలకు ప్రతినిధులైన స్వాములు, ఉభయ వేదాంత ప్రవర్తకాచార్యులైన పండితులు సుమారు 200మంది, మరెందరో శ్రీవైష్ణవస్వాములు, శ్రీవైష్ణవ భక్తగోష్ఠి.... ఇందరొకచోట సమావేశమై సంప్రదాయ పరిరక్షణకై రెండు దినాలు సుదీర్ఘమైన చర్చలు జరపడం శ్రీవైష్ణవ చరిత్రలో; ఈ మధ్యకాలంలో ఎన్నడూ జరుగలేదు.

జూన్ 12, 13 తేదీలు ఈ మహద్భాగ్యాన్ని అందించాయి. జ్యేష్ఠ బహుళ దశమీ, ఏకాదశి తిథులు ఈ మంగళ కార్యాన్ని జరుపుకొని ఆదర్శ తిథులుగ నిలచిపోయాయి. ఈ రెండు తిథులలో, అంటే, శని ఆదివారాలలో హైదరాబాదు, సైబర్ గార్డెన్‌లో జరిగిన "సర్వ వైష్ణవ సంగోష్ఠి" ఒక చారిత్రాత్మక సంఘటనే. ఉజ్జయిని, కుంభవేళా తరువాత, అక్కడి సంఘటనలను ఆధారం చేసుకొని "సర్వ వైష్ణవ సంగోష్ఠి"ని జరపాలని శ్రీవైష్ణవ పరిషత్, భాగ్యనగర భక్తులు నిర్ణయించారు.

శ్రీ కైలాశ్‌నారాయణ భాంగడియా, శ్రీలక్ష్మీ నారాయణ శుంథ్‌వాల్, శ్రీకల్యవతారంగారలీ విషయంలో చొరవ తీసుకొని ఏర్పాట్లు ప్రారంభిం చారు. ఉత్తర, దక్షిణభారతాన్నుంచి వైష్ణవ సంప్రదాయ పెద్దలందరినీ ఒకచోట సమావేశ పరచి, "వైష్ణవుల మంచితనాన్నెరుగక, వారిపైనా, వైష్ణవస్థానాలపైనా జరుగుతున్న దౌర్జన్యాలను అరికట్టడం, వాటిని పరిరక్షించడం" వంటి విషయా లలో మార్గదర్శకత్వాన్ని స్వీకరించాలని నిర్ణయించారు. శ్రీవైష్ణవ పరిషత్ సుమారు 20మంది జీయర్లను, వివిధ వైష్ణవశాఖీయులైన సాధుసంతులను, పండితులను, అనేకమంది ఆచార్య పురుషులను, సుప్రసిద్ధ క్షేత్రాల అర్చకులను ఆహ్వానించింది.

వీరందరికీ వసతులకై, హైదరాబాద్ జంటనగరాల భక్తబృందాలను ఆహ్వానించింది. వికాస తరంగిణి కార్యకర్తలను, సేవకు ఆహ్వానించింది. ఈ సందర్భంగా సుమారు రూ. 25లక్షలు పైగా ఖర్చు కావచ్చునని అంచనావేసింది.

సుమారు 120మంది భాగ్యనగర గృహస్థులు తమ తమ గృహాలలో, ఆచారవ్యవహారాలకు తగినట్లుగనే ఏర్పాట్లు చేస్తామని, ఒక్కొక్క పెద్దలను, వారి పరివారంతో సహా స్వాగతించడం, వసతి కల్పించడం, ఒక కారుతో వారి సేవలో ఉండి, సంగోష్ఠి సమయానికి తీసుకొని రావడం, తిరిగి వారు తమ నగరానికి వెళ్ళేంతవరకు తగిన రీతిలో వారి సేవలో ఉండటం.... వంటి సమస్త బాధ్యతలూ తీసుకుంటామని సిద్ధపడ్డారు. తమ తమ గృహాలను అలంకరించి, ఇత్తడిగిన్నెలుగూడ సిద్ధపరచు కొన్నారు ప్రసాదాల తయారీకై. ఆచారవంతుల కొఱకై నూతులున్న గృహాలను కూడ కొన్నింటిని సిద్ధపరచారు. కొందరు ఉదారహృదయంతో ఏర్పాట్లకవసరమైన ధనాన్ని సమకూర్చ ప్రారంభించారు.

హైదరాబాదు నుండే కాక, చుట్టుప్రక్కల జిల్లాలనుండిగూడ వికాసతరంగిణి శాఖలు తమవంతు ధనసమర్పణతో ఈ సేవలో తాము పాల్గొన్నారు. **జంటనగరాల భక్తగోష్ఠి, తమ నేర్పరితనాన్ని సదా చాటుకొంటూనే ఉంటుంది.** కొందరు తమ గృహాన్ని అతిథులకు కేటాయిస్తూ, ధనాన్నిగూడ సమర్పించారు.

హైటెక్ సిటీ ప్రక్కనున్న సైబర్‌గార్డెన్ కార్యక్షేత్రమైంది. ఆ సమీపంలోనే ఉన్న 'మై హోమ్-నవద్వీప్ కొందరు స్వాముల వసతికి, అపోలో హాస్పిటల్ కొందరుస్వాముల వసతికి ఏర్పాటైంది. సుమారు 300మంది వాలంటీర్లు సేవలందించ డానికి సిద్ధపడ్డారు. శ్రీమాన్ Ch. రామచంద్రా రెడ్డిగారు, శ్రీమాన్ పురుషోత్తంరావుగారు, శ్రీమాన్ రమేష్‌గారు, శ్రీమాన్ గుప్తగారు మొదలైన కార్యకర్తలు. సభాస్థలంలో సంగోష్ఠి జరగడానికి వీలయ్యేట్లు గుండ్రంగ అందమైన సోఫాలు, ఆ వెనుకగ కొన్ని కుర్చీలు ఏర్పాటు చేసారు. పర్యవేక్షకులుగ విచ్చేసే శ్రీవానమామలై జీయరుస్వామి, శ్రీగాధి పీఠాధీశులు ప్ర.భ. శ్రీనివాసాచార్యస్వామి-వీరిరువురకు ప్రధాన ఆసనాలు అమర్చబడ్డాయి. వీరికి ఒకవైపు జీయర్లు, మరోవైపు మహంతులు, ఎదురుగ, ఆ వెనుకగ పండితులు, ఇతరస్వాములు. ఆ వెనుకగ భక్తజనులు కూర్చొనే ఏర్పాట్లు జరిగాయి.

ఇదిలా ఉండగ రాజస్థాన్‌లో అళ్వర్ పీఠాధీశులు శ్రీ కోసలేంద్ర ప్రపన్నాచార్య స్వామి, ఉత్తరదేశీయ మహంతు లందరికీ ఆహ్వానాలు పంపి వారి రాకకు ఏర్పాట్లు చేసారు. అయోధ్యలోని జగద్గురు పీఠాధీశ్ విద్యాభాస్కర్ శ్రీవాసుదేవాచార్య స్వామి మరి కొందరిని ఆహ్వానించే బాధ్యత వహించారు. ఇక తమిళనాడు నుండి విచ్చేసే వారందరినీ ఆహ్వానించే బాధ్యత శ్రీమతి ఆనందకు మారిగారు, శ్రీమాన్ మాధవన్ గారి

సహాయంతో స్వీకరించారు. ఇక్కడికి పూర్వరంగము పూర్తి అయింది. అంతేకాక, అటునుండి విచ్చేసే వారికొక విమానాన్నే ఏర్పాటుచేసారు. అందులో వారు 11వ తేదీ రాత్రికి రావాలి. 14వ తేదీ ఉదయం తిరిగి వేంచేయాలని ఏర్పాటు. మొదటిసారిగ 8మంది జీయర్లు మిగిలిన పండితులతో నిండిన విమానమది. అందులో ఆకాశంలో వారంతా శ్రీవిష్ణు సహస్రనామ పారాయణ చేస్తూ రావడం ఒక చారిత్రాత్మక సంఘటన. మరో ఇరువురు 11వ తేదీ రాత్రికే బెంగుళూరునుండి హైదరాబాదు చేరారు.

వీరందరినీ స్వయంగ వెళ్ళి ఆహ్వానించే బాధ్యతను శ్రీశ్రీశ్రీ రామచంద్ర రామానుజ జీయరుస్వామివారు స్వీకరించారు. శ్రీశ్రీశ్రీ రంగరామానుజ జీయరుస్వామివారు రెండు దినాల రూపురేఖలు ఎలా ఉండాలో తీర్చిదిద్దారు. 13వ తేదీ ఏకాదశీ పర్వదినాన, ఇందరు విష్ణు స్వరూపులను భాగ్యనగర భక్తజనాళి దర్శించకపోతే ఎలా? అందుకని, ఆనాటి సాయంకాలం నిజాం కాలేజీ మైదానంలో బహిరంగసభ ఏర్పాటు చేసారు శ్రీవైష్ణవ పరిషద్ వారు, వికాసతరంగిణి, జెట్ సభ్యులూ సంయుక్తంగ.

11వ రాత్రి గం. 8-00కి హైదరాబాద్ విమానాశ్రయం పరమపవిత్రస్థలంగ, పుణ్యక్షేత్రంలా, తీర్థరాజంగ మారింది. 10మంది జీయర్లు అక్కడ అడుగు పెట్టగా, శ్రీశ్రీశ్రీ చిన్నజీయరుస్వామివారు శ్రీశ్రీశ్రీ రంగరామానుజ జీయరుస్వామివారు, శ్రీశ్రీశ్రీ రామచంద్ర జీయరుస్వామివారు, శ్రీశ్రీశ్రీ వ్రతధర జీయరుస్వామివారూ, శ్రీశ్రీశ్రీ అష్టాక్షరీ రామానుజ జీయరు స్వామివారూ తదితర పండితవర్గమూ, ఇందరు జీయర్లకూ పూర్ణకుంభాలతో స్వాగతం పలికారు. విమానాశ్రయమంతా భగవన్నామంతో మారుమ్రోగింది.

స్వరూపానురూపంగ అందరినీ పలుకరించి, స్వాగతించి, కుశల ప్రశ్నలు కాగానే, వారందికీ 12వ తేదీనాటి కార్యక్రమ విధానాన్ని వివరించారు శ్రీచిన్న జీయరుస్వామివారు. ఆయా ఆతిథేయ గృహస్థులకు కొందరిని అప్పజెప్పారు. అయితే పండితులంతా కలసే ఉండే అలవాటు వల్ల చాల మంది ఒక్కొక్క చోటుకే చేరిపోయారు. అలా అతిథులు తక్కువ, ఆతిథేయులు ఎక్కువమందీ అయ్యారు. చాలమంది గృహాలు ఖాళీగానే మిగిలిపోయాయి. వారి సేవలు ఎప్పుడైనా వినియోగిస్తామని శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు హామీ యిచ్చారు.

వీరుగాక, మేల్కోట, కర్నాటక నుండి సంస్కృత సంశోధన సంస్థ డైరెక్టరు శ్రీ ఉ.వే. శ్రీమాన్ M.A. లక్ష్మీతాతాచార్యస్వామిని ప్రత్యేక అతిథులుగ ఆహ్వానించారు. వారు 11వ తేది ఉదయానికే విచ్చేసారు. శ్రీ చిన్న జీయరుస్వామివారి ద్వారా కార్యక్రమ వివరాలన్ని తెలుసుకున్నారు.

అలానే చైతన్యమఠం నుండి, శ్రీస్వామి నారాయణ గురుకులం, శ్రీస్వామినారాయణ

సంస్థాన్‌ల నుండి నిర్వాహక సాధువుళ్లను గూడ అతిథులుగ ఆహ్వానించారు. ఉడిపి పీఠాధీశ్వరులు శ్రీ విశ్వేశ్వరతీర్థస్వామివారు గూడ 13వ తేదీ మధ్యాహ్నం విచ్చేసారు.

12వ తేదీ ఉదయం సరిగ్గా గం.8.45కి శ్రీవిష్ణుసహస్రనామ పారాయణంతో కార్యక్రమ మారంభమైంది. వెంటనే వేదనాదం ప్రారంభమై గం. 10.30కి ముగిసింది. అప్పటికి రావలసిన పెద్దలందరూ సభాస్థలికి చేరారు. శాంతి మంత్రం ప్రార్థనలను- శ్రీ చిన్న జీయరు స్వామివారు అందరిచేత చేయించారు. శ్రీ చిన్న జీయరుస్వామివారు, విచ్చేసిన జీయరుస్వాములను, సాధు సంతులనూ, అతిథులనూ, భక్తులనూ స్వాగతించారు. వెంటనే సభాధ్యక్షులైన శ్రీశ్రీశ్రీ వానమామలై కలియన్ రామానుజ జీయరు స్వామివారినీ, శ్రీ గాధి పీఠాధీశులైన ప్ర.భ. శ్రీనివాసాచార్య స్వామివారినీ స్వాగతించి, సభకు పరిచయం చేసారు. ఆపై శ్రీచిన్న జీయరుస్వామివారి ఆజ్ఞతో శ్రీశ్రీశ్రీ కోసలేంద్ర ప్రపన్నాచార్య ఫలహారీస్వామి, మహంతులను అందరినీ పరిచయం చేసారు. విచ్చేసిన అర్చక, స్థానాచార్యస్వాములను, పండితులనూ శ్రీచిన్న జీయరుస్వామి వారే పరిచయం చేసాక శ్రీ డా॥ S.V. రంగ రామానుజాచార్యస్వామి అందరకూ స్వాగతాన్ని సంస్కృత భాషలో సుమధురంగ పలికారు. శ్రీశ్రీశ్రీ రంగ రామానుజ జీయరుస్వామివారు తెలుగులోనూ, శ్రీశ్రీశ్రీ వ్రతధర జీయరు స్వామి వారు హిందీలోనూ కార్యక్రమ పరిచయాన్ని గావించారు.

చర్చనీయాంశాలను మొత్తం 3గ విభజించారు.

1. **శ్రీవైష్ణవ వాఙ్మయము, వైదికతా, శిష్టాచారము,**
2. **ఇతిహాస పురాణాగమముల పరస్పర ఉపా దేయత,**
3. **ఆలయాల, సంప్రదాయాచారములు & చారిత్రక చిహ్నముల రక్షణ, మన కర్తవ్యము.**

ఇలా మూడు వేళల్లోను మూడు విషయాలు చర్చించాలని, మొదటిపూట పరిచయ కార్యక్రమము, అధ్యక్షులు, అతిథుల శుభసందేశములు ఉంటాయని శ్రీచిన్న జీయరు స్వామి విషయ పరిచయంచేసి, అతిథులుగ విచ్చేసిన శ్రీమాన్ P.V.R.K. ప్రసాద్IAS గారిని ఆహ్వానించారు.

'ఆలయాలు, సంప్రదాయాల రక్షణ' అందరి బాధ్యతగ గుర్తించి ఇందరు పెద్దలు విచ్చేయడం ఒక ఐతిహాసిక అద్భుతంగ వర్ణించి, అర్చక స్వాములను సామాజిక స్పృహకలవారుగ తీర్చిదిద్దుకోవలసిన అవసరాన్ని నొక్కి చెప్పారు.

చైతన్యమఠం నుండి వచ్చిన శ్రీ బి.ఎస్. నారాయణ మహారాజ్ సామాజికసేవలో వైష్ణవుల బాధ్యతను గుర్తుచేసారు. శ్రీస్వామి నారాయణ గురుకుల్ నిర్వాహకులు శ్రీశ్రీశ్రీ సంత్ దేవప్రసాద్ స్వామిమహారాజ్ వైష్ణవసేవలో జీవితాన్ని సార్థకం చేస్కొనే విధానాన్ని వర్ణించారు. శ్రీస్వామినారాయణ సంస్థ నిర్వాహకులు శ్రీయజ్ఞేశ్వర స్వామి

దాస్‌జీ, తమ సంస్థ చేసే వివిధ సేవలను శ్రీ చిన్న జీయరుస్వామి వారితో తమకుకల అనుబంధాన్ని తెలిపి, శ్రీప్రముఖ స్వామి మహరాజ్‌వారి ఆశీశ్శులను అందరికీ అందచేసి, వైష్ణవులంతా కలసి ఉండాల్సిన అవసరాన్ని తెలిపారు.

వీరికందరకూ అధ్యక్షులచేత మంగళా శాసనాలు చేయించారు. శ్రీశ్రీశ్రీ వానమామలై స్వామి తమ అధ్యక్షోపన్యాసాన్ని ప్రసాదించారు. 'శ్రీవైష్ణవసంప్రదాయము పరమవైదిక మైనదని, వేదప్రతి పాద్యమైన తత్వాన్ని తు.చ. తప్పకుండా పాటించే ఋషిపరంపరను, శిష్టాచారాన్ని వదలక కాపాడే సంప్రదాయం శ్రీవైష్ణవ సంప్రదాయ మని, ఇక్కడ చేరిన ఇందరు మహానుభావులూ ఆ సంప్రదాయ రక్షణకు సిద్ధపడాలని, ఇందులకై అందరూ కలసి ఏకకంఠంతో అవైష్ణవశక్తులను దూరంగ ఉంచాల్సిన అవసరమాసన్నమైన దని, తిరుమల తిరుపతి వంటి చోట్ల జరిగే అరాచకాలను సహించేది లేదని, అందులో ఇతరుల జోక్యాన్ని సుతరాం అంగీకరించ రాదని, ఖండితంగ చెపుతూ అందరకూ మంగళా శాసనాలు చేసారు.

అనంతరం శ్రీగాధి స్వామివారు తమ మంగళాశాసనాలను అనుగ్రహించారు. ఉదయం సభ కొంతసేపు విరమించి, తదీయారాధనకు ఏర్పాట్లు చేసారు కార్య నిర్వాహకులు. శ్రీమాన్ రమాప్రతాపరెడ్డి గారు అందరు పెద్దలకూ కావలసిన అల్పాహార, ఫలరసాలను, క్షీరాదిపానీయా లను బహు శ్రద్ధతో ఏర్పాటు చేసారు.

12వ తేదీ మధ్యాహ్నం కూడా విచ్చేసిన జీయర్లు, కొందరు మహంతుల ప్రవచనాలు సాగాయి. సాయంకాలం గం. 5.30కు సభ చాలించారు.

ఇందరు శ్రీవైష్ణవస్వాములు వేంచేసిన పుడు వారి గుర్తుగ భాగ్యనగరంలో ఏమైనా చేస్తే బాగుండునని, శంషాబాద్‌లోని 50 ఎకరాల స్థలంలో ఒక్కొక్కరిచేత ఒక్కొక్క మామిడిమొక్క నాటిస్తే, అవి పెరిగి, ఇచ్చే ఛాయ, వాయువులు, ఫల పత్రాదులద్వారా ఇందరి సంప్రదాయ నిష్ఠను చాటి చెప్పే సాక్ష్యాలుగ నిలచి ఉంటాయని ఇందరి కృపను అందించే దివ్యక్షేత్రంగ ఆ భూమి మారుతుందని భావించి శ్రీచిన్న జీయరు స్వామివారు శ్రీరామేశ్వరరావుగారికి విషయం తెలిపితే వారి సోదరులు శ్రీ జగదీశ్‌గారి ద్వారా పూర్వరంగం సిద్ధం చేసారు. శ్రీస్వామి వారు స్వాములందరినీ సభాచివరిలో ఈ విషయాన్ని వారందరికీ విన్న వించగ, వారంతా వెంటనే అంగీకరించారు.

కార్లలో అంతా అక్కడ చేరేసరికి సాయం. గం.7.30 అయింది. అయినా కార్లలైట్ల వెలుతురులలో అందరూ తలా ఒక మొక్కనాటి తిరిగి రాత్రి గం.11.30కు వసతులకు చేరారు.

13వ తేదీనాటి ఉదయం కార్యక్రమ ప్రారంభంలోనే విషయ పరిచయం చేస్తూ తిరుమలలో 14వ శతాబ్దానికి చెందిన1000 కాళ్ళ చారిత్రక మండపం తొలగించి, ఆలయముందున్న కొండను ముక్కలు చేసి,

ఆదిశేషుని స్వరూపమీ వేంకటాద్రి అనే పవిత్రభావనగానీ, చరిత్రపై శ్రద్ధగానీ లేకుండా కొట్టి చదును చేసివేసిన దృశ్యాలను, దీనికి మూలకారణమైన "మాస్టర్‌ప్లాన్ CDని" అందరకూ చూపి జరిగే విధ్వంసాన్ని వివరించారు శ్రీచిన్న జీయరుస్వామివారు.

ఆ వెంటనే చూచినవారందరికీ దుఃఖం ఉప్పొంగింది. TTD చెప్పే కారణాల గురించి, వాటి శాస్త్రీయత గురించి, నిర్మూలించిన దౌర్జన్యాన్ని అరికట్టే విధానాన్ని, శాస్త్రంలో వీటిని నిరూపించిన పద్ధతి గురించి విపులంగ చర్చ జరిగింది. చెన్నై, శ్రీగోష్ఠీపురం, తిరునాంగూర్ దివ్యదేశాల వైఖానస విద్వాంసులందరూ ఈ చర్చలలో శాస్త్రీయ విషయాలనెన్నింటినో తెలిపారు. TTD వారు చేసే దారుణాలను నిర్ద్వంద్వంగ ఖండించారు.

అహోబిల మఠ నిర్వాహకులు శ్రీమాన్ సౌందర రాజన్ స్వామి గూడ తమ సలహాలతో కార్యక్రమాన్ని బలపరిచారు.

1 క్రొత్త ప్రాకారం కట్టనవసరం లేదని, కడితే అది 4వది అవుతుంది, ప్రాకారాలు బేసిసంఖ్యలోనే ఉండాలని తెలిపారు.

2 ఆర్జితసేవలైన కళ్యాణాలు బయటనైనా చేయువచ్చని, ఇప్పటికే పద్మావతీ పరిణయోత్సవ మలా చేస్తున్నారని,

3 అమ్ముకొనే వాటిని ప్రసాదాలనే అనరాదని, అలాంటి వంటకాలు ఎక్కడైనా చేస్కోవచ్చని,

4 బయట వండినవి ప్రసాదం పేరుతో (చిన్న లడ్డూలు క్యూలో వెళ్ళేవారికిచ్చే ఉచిత లడ్డూలు) ఆలయంలో పంచడం పరమదారుణమైన అనాచారము, భక్తులను, దేముణ్ణి వంచించడమేనని,

5 నిర్మాణాలేవి కూలగొట్టినా, ఆలయ స్వరూపాన్ని భంగంచేసినట్టే కనుక, అక్కడక్కడ ఉండే దేవతల కది అయిష్టము. అట్లాంటి కూల్చివేత వల్ల అరిష్టాలు తప్పవని,

6 వేయికాళ్ళ మండపం రాపత్తు ఉత్సవాలకు కట్టి, 1970దాక దేముని సేవలతో పునీతం చేస్తే, అది కేవలం అలంకారానికే కట్టినదని బుకాయిస్తూ కూలద్రోయడం చరిత్రనే వినాశనం చేసే ప్రయత్నమని,

7 దైవ సన్నిధిలో ప్రతి ఇసుక రేణువుకూ ఎంతో పవిత్రత ఉండగ, మండప స్తంభాలను కాళ్ళతో త్రొక్కేట్లు, జనులు మలమూత్రాలకు వాడేచోట్ల, అనాదరణతో పారవేయడం ఘోరాపరాధ మని,

8 ఇలాంటి సలహాలిచ్చేవారు పండితుల పేరుతో చెలామణి కావడం, TTD వారికాశ్రయం యిచ్చి, వారినడ్డుపెట్టుకొని సాగించే ఈ ఘాతుక కృత్యాలను వెంటనే నిలిపివేయాలని,

9 నిర్మూలిత కట్టడాలు, తిరిగి అదే స్థానంలో ఆయా చరిత్ర తెలిపేట్టు పునర్నిర్మితాలు అవ్వాలని,

10 మాడవీధిలో గృహాలులేకపోతే అసలది ఆ పేరుతో పిలవడానికే తగదని,

11 ఆచార వ్యవహారాలు నాశనం కానివ్వ కుండా ఇందరు పెద్దలూ చూడాలని, TTD వారి వ్యాపార ధోరణి ఏమాత్రమూ ఉపేక్షించరాదని,

12 పెద్దజీయ్యంగారి మఠం, గొల్లదాని మండపం వంటివి తొలగించడం, స్థలం మార్చడం, 1000 కాళ్ళ మండపాన్ని స్థలం మార్చడం, కొండపైకి 'రోప్ వే' నిర్మాణం చేయడం ఇలాంటివన్ని అశాస్త్రీయమైనవని, పై వాటికన్ని ప్రమాణాలున్నాయని నిరూపిస్తూ వారంతా కూలంకషంగ చర్చ జరిపారు.

మహంతులు గూడ చాల శ్రద్ధగా ఇందులో పాల్గొన్నారు. చరిత్రనూ, సంప్రదాయాలను తెలిపే చిహ్నాలు ఏవైనా భావితరాలకు ప్రేరకాలౌతాయి. అవి తొలగితే సర్వమూ నశించినట్లే కనుక **"చరిత్రను నాశనం చేసే ఏ సౌకర్యాలు మాకు అవసరం లేదని"** ప్రజలందరి తరపున తాము చెపుతున్నామని అందరూ ముక్తకంఠంగ చాటారు.

మధ్యాహ్నం విరామం లేకుండా ఏకధాటిగ గం. 4-00 దాక సభ సాగింది.

***ఈ 'సంగోష్ఠి'కి విచ్చేసిన జీయరులు, మహంతులు, అర్చకస్వాములు, పండితులు:***

**సంగోష్ఠికి విచ్చేసిన జీయరులు:**

1. ప.ప. శ్రీశ్రీశ్రీ త్రిదండి వానమామలై కలియన్ రామానుజ జీయరుస్వామివారు (తమిళనాడు)
2. ప.ప. శ్రీశ్రీశ్రీ త్రిదండి వరద యతిరాజ జీయరుస్వామివారు (శ్రీపెరుంబూదూరు)
3. ప.ప. శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ నారాయణ జీయరుస్వామివారు (శ్రీరంగం)
4. ప.ప. శ్రీశ్రీశ్రీ త్రిదండి యదుగిరి యతిరాజసంపత్కుమార రామానుజజీయరుస్వామివారు (మేల్కోట)
5. ప.ప. శ్రీశ్రీశ్రీ త్రిదండి రంగప్రియ మహాదేశిక జీయరుస్వామి వారు (బెంగుళూరు)
6. ప.ప. శ్రీశ్రీశ్రీ త్రిదండి శఠగోప రామానుజ చిన్న జీయరుస్వామి వారు (తిరుమల)
7. ప.ప. శ్రీశ్రీశ్రీ త్రిదండి అళ్గియ మణవాళ విష్ణుచిత్త రామానుజ జీయరుస్వామివారు (తమిళనాడు)
8. ప.ప. శ్రీశ్రీశ్రీ త్రిదండి వైనతేయ రామానుజ జీయరుస్వామివారు (ఆళ్వార్ తిరునగరి)
9. ప.ప. శ్రీశ్రీశ్రీ త్రిదండి దేవనాయక జీయరుస్వామివారు (నేపాల్)
10. ప.ప. శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు (సీతానగరం)
11. ప.ప. శ్రీశ్రీశ్రీ త్రిదండి రంగరామానుజ జీయరు స్వామివారు (కాకినాడ)

12. ప.ప. శ్రీశ్రీశ్రీ త్రిదండి రామచంద్ర రామానుజ జీయరు స్వామివారు (భీమవరం)

13. ప.ప. శ్రీశ్రీశ్రీ త్రిదండి అష్టాక్షరీసంపత్కుమార రామానుజజీయరుస్వామివారు (విజయవాడ)

14. ప.ప. శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీనివాస వ్రతధరరామానుజ జీయరుస్వామివారు (హైదరాబాదు)

15. ప.ప. శ్రీశ్రీశ్రీ త్రిదండి కృష్ణశరణ్య రామానుజ జీయరు స్వామివారు (శ్రీరామతీర్థం,విజయనగరం)

16. ప.ప. శ్రీశ్రీశ్రీ ఉడిపి పీఠాధీశ్వర్లు శ్రీవిశ్వేశ్వర తీర్థస్వామివారు (పెజావర్ స్వామివారు–ఉడిపి)

**సంగోష్ఠికి విచ్చేసిన మహంతులు:**

శ్రీశ్రీశ్రీ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ గాధి పీఠాధీశులు ప్ర.భ. శ్రీనివాసాచార్య స్వామివారు (ముంబయి)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ విద్యా భాస్కర్ వాసుదేవాచార్యస్వామి (అయోధ్య)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ కృష్ణమా చార్యస్వామి (ఋషీకేశ్)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ రాజనారాయణాచార్యస్వామి (దేవరియ)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ రాఘవాచార్య స్వామి (గయ)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ రామ చంద్రాచార్య స్వామి (పుష్కర్)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ శ్యామ నారాయణాచార్యస్వామి (అయోధ్య)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ రంగ నాథాచార్యస్వామి (ఉజ్జయినీ)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ సుదర్శనా చార్యస్వామి (ఫరీదాబాద్)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ శ్రీకాంతాచార్యస్వామి (ఉజ్జయినీ)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ కోసలేంద్ర ప్రపన్నాచార్య ఫలహారీ స్వామి (అళ్వర్–రాజస్థాన్)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ అనిరుద్ధాచార్యస్వామి (బృందావన్)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ సుదర్శనాచార్యస్వామి (గుజరాత్)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ త్రివిక్రమాచార్యస్వామి (జైపూర్)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ శ్రీధరాచార్యస్వామి (అయోధ్య)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ ధరణీధరాచార్య స్వామి (ముంబై)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ అనంతాచార్య స్వామి (బృందావన్)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ రేవతీరమణాచార్యస్వామి (ప్రయాగ)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ సుదర్శనాచార్యస్వామి (ప్రయాగ)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ పురుషోత్తమాచార్యస్వామి (ఫరీదాబాద్)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ సుదర్శనాచార్యస్వామి (కోల్‌కతా)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ లక్ష్మణ్ ప్రపన్నజీ (బృందావన్)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ శ్రీనివాసాచార్యస్వామి (బదయూం - యు.పి)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ నారాయణాచార్యస్వామి (నేపాల్)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ పద్మధరాచార్యస్వామి (నేపాల్)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ వాసుదేవ ఆత్రేయ స్వామి (నేపాల్)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ జగన్నాథాచార్యస్వామి (నేపాల్)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ ఘనశ్యామసుందరాచార్యస్వామి (నేపాల్)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ ఖగేంద్రాచార్యస్వామి (నేపాల్)

శ్రీమాన్ రేవంత్ కోయిరాలజీ స్వామి (నేపాల్)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ దామోదరాచార్యస్వామి (నేపాల్)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ పురుషోత్తమాచార్యస్వామి (నేపాల్)

శ్రీమాన్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ పరమఖుష్ స్వామి (నేపాల్)

శ్రీశ్రీశ్రీ స్వామి బి.ఎస్. నారాయణ మహారాజ్ (చైతన్యమఠం - సికింద్రాబాద్)

శ్రీశ్రీశ్రీ సాధు యజ్ఞేశ్వర్‌దాస్ గురుప్రముఖ్ స్వామి మహారాజ్ (స్వామినారాయణమందిర్- సికింద్రాబాద్)

శ్రీశ్రీశ్రీ సాధు జయ తీర్థదాస్ గురుప్రముఖ్ స్వామిమహారాజ్ (స్వామినారాయణ మందిర్- సికింద్రాబాద్)

శ్రీశ్రీశ్రీ సాధు దేవప్రసాద్ స్వామి మహారాజ్ (స్వామినారాయణ గురుకులమ్)

శ్రీశ్రీశ్రీ సాధు శుకవల్లభ్ స్వామి మహారాజ్ (స్వామినారాయణ గురుకులమ్)

**సంగోష్ఠికి విచ్చేసిన**

**ఆచార్యపురుషులు-అర్చకులు- పండితులు:-**

శ్రీ ఉ.వే. శ్రీమాన్ టి.పి. రామచంద్రాచార్యస్వామి

శ్రీ ఉ.వే. శ్రీమాన్ డా॥ ఎస్.వి. రంగ రామానుజాచార్యస్వామి

శ్రీ ఉ.వే. శ్రీమాన్ లక్ష్మీతాతాచార్యస్వామి (మేల్కోట్ - కర్నాటక)

శ్రీ ఉ.వే. శ్రీమాన్ టి. మాధవన్‌స్వామి

శ్రీ ఉ.వే. శ్రీమాన్ వేల్కూడి కృష్ణన్‌స్వామి

శ్రీ ఉ.వే. శ్రీమాన్ అప్పన పార్థసారథిస్వామి

శ్రీ ఉ.వే. శ్రీమాన్ పరాశర నరసింహ భట్టర్‌స్వామి

శ్రీ ఉ.వే. శ్రీమాన్ పి.బి. రాజహంసస్వామి

శ్రీ ఉ.వే. శ్రీమాన్ టి.ఎ.పి. శ్రీరంగాచార్య స్వామి

శ్రీ ఉ.వే. శ్రీమాన్ టి.జి శ్రీనివాసాచార్య స్వామి

శ్రీ ఉ.వే. శ్రీమాన్ వెంకటేశ్ భట్టర్‌స్వామి

శ్రీ ఉ.వే. శ్రీమాన్ పార్థసారథి భట్టర్‌స్వామి

శ్రీ ఉ.వే. శ్రీమాన్ శేషాద్రి భట్టర్‌స్వామి

శ్రీ ఉ.వే. శ్రీమాన్ శ్రీరామభట్టర్‌స్వామి

శ్రీ ఉ.వే. శ్రీమాన్ సుందరరాజ భట్టర్ స్వామి

శ్రీ ఉ.వే. శ్రీమాన్ శ్రీకృష్ణమాచార్యస్వామి

శ్రీ ఉ.వే. శ్రీమాన్ మణిబాలాజీ స్వామి

శ్రీ ఉ.వే. శ్రీమాన్ వేంకట కృష్ణన్ స్వామి

శ్రీ ఉ.వే. శ్రీమాన్ ఎ. నారాయణస్వామి

శ్రీ ఉ.వే. శ్రీమాన్ ఆర్. నారాయణస్వామి

శ్రీ ఉ.వే. శ్రీమాన్ ఆర్.ఎస్. జగన్నాథాచార్యస్వామి

శ్రీ ఉ.వే. శ్రీమాన్ ఎస్. రామానుజస్వామి

శ్రీ ఉ.వే. శ్రీమాన్ మణివణ్ణన్ స్వామి
శ్రీ ఉ.వే. శ్రీమాన్ రామానుజ స్వామి
శ్రీ ఉ.వే. శ్రీమాన్ నరసింహన్ స్వామి
శ్రీ ఉ.వే. శ్రీమాన్ రాఘవన్ స్వామి
శ్రీ ఉ.వే. శ్రీమాన్ శ్రీరామన్‌స్వామి
శ్రీ ఉ.వే. శ్రీమాన్ శ్రీహరి ప్రసాద్‌స్వామి
శ్రీ ఉ.వే. శ్రీమాన్ చక్రపాణి స్వామి
శ్రీ ఉ.వే. శ్రీమాన్ శ్రీకృష్ణస్వామి
శ్రీ ఉ.వే. శ్రీమాన్ శ్రీవిల్లిపుత్తూర్ అరయర్‌స్వామి
శ్రీ ఉ.వే. శ్రీమాన్ రాఘవాచార్యస్వామి
శ్రీ ఉ.వే. శ్రీమాన్ సుందరరాజన్‌స్వామి
శ్రీ ఉ.వే. శ్రీమాన్ గోవిందరాజన్‌స్వామి
శ్రీ ఉ.వే. శ్రీమాన్ వి. రవిచంద్రన్‌స్వామి
శ్రీ ఉ.వే. శ్రీమాన్ ఆర్. కృష్ణంఅయ్యంగార్
శ్రీ ఉ.వే. శ్రీమాన్ కె. తిరుమలై స్వామి
శ్రీ ఉ.వే. శ్రీమాన్ వి. నరసింహంస్వామి
శ్రీ ఉ.వే. శ్రీమాన్ వి. సంపత్‌స్వామి
శ్రీ ఉ.వే. శ్రీమాన్ కృష్ణన్‌స్వామి
శ్రీ ఉ.వే. శ్రీమాన్ ఉడయవర్లు స్వామి
శ్రీ ఉ.వే. శ్రీమాన్ ముదుంబైరామానుజాచార్య స్వామి
శ్రీమాన్ ముదుంబై శ్రీమన్నారాయణాచార్య స్వామి
శ్రీమాన్ ముదుంబై సింగరాచార్యస్వామి
శ్రీమాన్ కోటి రామకృష్ణమాచార్యస్వామి
శ్రీమాన్ పొడిచేటి సీతారామాచార్యస్వామి
శ్రీమాన్ కె.ఇ. స్థలశాయిస్వామి
శ్రీమాన్ రంగరాజ భట్టర్‌స్వామి
శ్రీమాన్ సెల్వమణిస్వామి
శ్రీమాన్ నంబి వేణుగోపాలాచార్య స్వామి
శ్రీమాన్ సముద్రాల రమాకాంతాచార్య స్వామి
శ్రీ ఉ.వే. శ్రీమాన్ ఇ. రామానుజాచార్యస్వామి
శ్రీమాన్ గుమెళ్ళ వేంకట బుచ్చితాతా చార్యస్వామి

శ్రీమాన్ శేషభట్టర్ వేంకటాచార్యస్వామి
శ్రీమాన్ భట్టర్‌స్వామి (అపోలో)
శ్రీమాన్ భరత్‌స్వామి
శ్రీమాన్ పీతాంబరరంరఘునాథా చార్య స్వామి
శ్రీమాన్ టి. కృష్ణమాచార్యస్వామి
శ్రీమాన్ నరసింహస్వామి
శ్రీమాన్ జి. సురేంద్రాచార్యస్వామి
శ్రీమాన్ భాగవతాచార్యస్వామి
శ్రీమాన్ గోపీకృష్ణమాచార్యస్వామి
శ్రీమాన్ జి. బదరీనాథ్ స్వామి
శ్రీమాన్ రామాచార్యస్వామి
శ్రీమాన్ లక్ష్మణాచార్యస్వామి
శ్రీమాన్ జి. రఘునాథస్వామి
శ్రీమాన్ శఠగోపాచార్యస్వామి
శ్రీమాన్ కె.వి. రంగనాథన్‌స్వామి
శ్రీమాన్ ఎస్. రాఘవాచార్యస్వామి
శ్రీమాన్ ఎస్. మధుసూధనాచార్యస్వామి
శ్రీమాన్ జె. సుదర్శనాచార్యస్వామి
శ్రీమాన్ కె. నరసింహాచార్యస్వామి
శ్రీమాన్ కె. వేంకటాచార్యస్వామి
శ్రీమాన్ ఎస్.బి. సురేంద్రాచార్యస్వామి
శ్రీమాన్ ఎస్.బి. ప్రహ్లాదాచార్యస్వామి
శ్రీమాన్ సిహెచ్. రంగాచార్యస్వామి
శ్రీమాన్ కె. మాధవాచార్యస్వామి
శ్రీమాన్ శ్రీనివాసాచార్యస్వామి
శ్రీమాన్ దివి వేంకట నరసింహాచార్యస్వామి
శ్రీమాన్ శరత్‌కుమారాచార్యస్వామి
శ్రీమాన్ కిడాంబి తిరువేంగళాచార్యస్వామి
శ్రీమాన్ శేషాచార్యస్వామి
శ్రీమాన్ ఎన్.సిహెచ్. సంపత్ కృష్ణమాచార్యస్వామి
శ్రీమాన్ ఎమ్. యుగంధరాచార్యస్వామి
శ్రీమాన్ జి. జగన్నాథాచార్యస్వామి
శ్రీమాన్ మధుసూధనాచార్యస్వామి

ఈ సందర్భంగా స్వాములందరూ **14** తీర్మానాలను ఏకగ్రీవంగా ఆమోదించారు.

## సర్వ వైష్ణవ సంగోష్ఠి తీర్మానములు :-

1. క్రీ.శ. 2004, జూన్, 12,13 తేదీలలో హైదరాబాద్ మహానగరంలోని సైబర్‌గార్డెన్స్ మండపంలో 'శ్రీవైష్ణవ పరిషత్' నేతృత్వంలో 'సర్వవైష్ణవ సంగోష్ఠి'లో దేశం నలుమూలల నుండి, నేపాలునుండీ వేంచేసిన 16మంది జీయరు స్వాములు, 40మంది పీఠాధిపతులైన మహంతులు, అనేకమంది ఆచార్యపురుషులు, పండితులు, శ్రీవైఖానస, శ్రీపాంచరాత్ర ఆగమ పరంపరలోని అర్చకస్వాములు ఒకే చోట సమావేశం కావటం ఒక అపూర్వమైన చారిత్రాత్మక సంఘటనగ తీర్మానించడమైనది.
2. ఈ సంగోష్ఠిలో ఎంతో శ్రమకోర్చి దూర తీరాలనుండి శ్రీసంప్రదాయాచార్యుల తోపాటు మధ్వ సంప్రదాయం, చైతన్య సంప్రదాయం, స్వామినారాయణ సంప్రదాయం నుండిగూడ సాధుసంతులు విచ్చేసి ఈ గోష్ఠిని తమ ఉదార సూచనలతో సుసంపన్నం చేసినందులకు ఆచార్య, సాధు, మహంతు, పండిత, అర్చకగోష్ఠికందరకూ కృతజ్ఞతలను ఆవిష్కరిస్తూ తీర్మానించడమైనది.
3. వేదము నిషేధించని విషయాలను వర్ణించే వాఙ్మయం ఏదైనా, ఏ భాషలో ఉన్నా దానిని 'వైదికమే' అనాలని అది అందరకూ 'ప్రామాణికమే' అవుతుందని స్పష్టం చేస్తూ తీర్మానించడమైనది.
4. శ్రీపాంచరాత్రం, శ్రీవైఖానసం అనే రెండు వైష్ణవ ఆగమాలూ వేదతాత్పర్యమైన విష్ణు పారమ్య ప్రతిపాదకములే కనుక పరమ ప్రామాణికములు మరియు వైదికములు అవటం వలన, వాటిలో ఒకటి వైదికము మరియొకటి అవైదికము అంటూ అజ్ఞులు చేసే వాదనలకు జాలిపడుతూ అట్టి వాదనలను తీవ్రంగా ఖండిస్తూ తీర్మానించడమైనది.
5. భగవన్ముఖ వినిసృతాలూ, పరస్పర ప్రపూరకాలూ అయిన శ్రీపాంచరాత్ర, శ్రీవైఖానసాగమ సంబంధంగా అనూచానంగ వస్తున్న ప్రామాణిక ఆచారాలలో ఏవైనా ఒకటి రెండు కాలక్రమేణా ఇతర ప్రాంతాలలో లోపించినా, దక్షిణ దివ్యదేశములలో ఆ పరంపర, శిష్టాచారములు ఈనాటికీ చాల వరకు ప్రవర్తిస్తూ, వాటిని ప్రకాశింపచేయు నిదర్శనంగా చారిత్రక చిహ్నములు, శిల్పసంపద కనిపిస్తున్నందున కంఠరవేణ ఆ విషయాలను చెప్పే ప్రమాణ, వాక్య, శ్లోకభాగములు లభ్యమవ్వకపోయినా ఆ శిష్టాచారములు, పరంపరా కూడా ప్రమాణములే అవుతాయని తీర్మానించడమైనది.
6. సంస్కృతికి, సంప్రదాయానికి, ఆచారానికి కేంద్రబిందువులైన ఆలయాలలో అధికారులు, అనధికారుల ప్రవేశం, జోక్యముల వలన సంస్కృతి, సంప్రదాయము, ఆచార వ్యవహారాలను పూర్తిగా కోల్పోయే పరిస్థితి ఏర్పడుతోందని గుర్తించి వాటిని

పరిరక్షించుకొనేట్లుగా, ఆయా వ్యక్తులను తీర్చిదిద్దడంకానీ, వీలైనంత దూరంగా వారిని ఉంచడానికి కృషి చేయాలని తీర్మానించడమైనది.

7. ప్రాచీన ఋషులు, ఆళ్వారులు, ఆచార్యుల అనుభవాలను, అవగాహనలను ప్రతిబింబించే స్థానాలను, వస్తువులను, నిర్మాణాలను, భవనాలను, గుర్తులను భావి తరాలకు చరిత్రచిహ్నాలుగా, మార్గదర్శకము లుగా, ప్రేరకములుగా అందించడం ఈతరం యొక్క 'గురుతర బాధ్యత'గా గుర్తించి వాటిని యథాతథంగా, సకల విధములా పరిరక్షించుకోవాలని తీర్మానించడమైనది.

8. పై తీర్మానాన్ని కేవలం సంస్థలూ, వ్యక్తులే కాక ప్రభుత్వ ప్రతినిధులూ, అధికారులూగూడ గుర్తించి, వారి బాధ్యతను ఏమాత్రమూ విస్మరించకుండా నెరవేర్చునట్లు చేయవలెననీ, అలా వారు గుర్తించని పక్షంలో ఏ విధమైన చర్యద్వారా ఆయా వ్యక్తులు గుర్తిస్తారో వాటిని అమలు పరచడానికి వెనుకాడరాదని ముక్తకంఠంతో అంగీకరిస్తూ తీర్మానించడమైనది.

9. ప్రస్తుతం తిరుమలలో 'మాస్టర్‌ప్లాన్ అమలు' అనే పేరుతో జరుగుతున్న చారిత్రక కట్టడాల కూల్చివేత సంప్రదాయ చిహ్నాల తొలగింపు, నూతన నిర్మాణాలు మొదలైనవి శాస్త్రవిరుద్ధములని, చరిత్రకు కూడా హానికరములు అని మాత్రమే కాకుండా భగవద్రామానుజుల సంబంధాన్ని తిరుమల ఆలయం నుంచి తుడిచివేసేందుకు జరుగుతున్న ప్రణాళికాబద్ధమైన దుశ్చర్య అని ఏకగ్రీవంగా నిర్ణయిస్తూ వెయ్యికాళ్ళ మంటపము, అనంతాళ్వాన్‌యొక్క గృహం మొదలైన వాటిని పూర్వపుఎత్తులో, అదే స్థానంలోనే తిరిగి నిర్మింప చేయుటకు TTDవారిని నిర్దేశిస్తూ తీర్మానించడమైనది.

10. తిరుమల తిరుపతి ఆలయాలలో జరుగుతున్న ఆచార వ్యవహారాలను, అనుష్ఠానాలను సర్వవైష్ణవ సంగోష్ఠి నిశితంగ గమనించి, సమీక్షించి అధికారుల, అనధికారుల జోక్యం, లేదా, అనాదరణ వలన జరుగుతున్న సంప్రదాయ భంగకరమైన లోపాలను లేదా శాస్త్రవిరుద్ధ చర్యలను ఎంతమాత్రము సహించేది లేదని వాటిని వెంటనే సంస్కరించుకోవాలని TTD వారికి స్పష్టపరుస్తూ తీర్మానించడమైనది.

11. 7,8,9వ తీర్మానములననుసరించి వెనువెంటనే తగు సంస్కరణ చర్యలను తీసుకొనుటకు వీలుగా జీయర్‌స్వాములు, మహంతులు, ఆచార్యపురుషులు, అర్చకులతో కూడిన ఒక ప్రతినిధి మండలి TTD ప్రతినిధులను కలిసి ఈ సమావేశ తీర్మానములను వారికి అందించి, వివరించి, TTD వారి స్పందనననుసరించి తరువాతి కార్యక్రమాన్ని నిర్ణయించాలని తీర్మానించడమైనది.

12. ప్రతినిధి మండలిలో 1. శ్రీశ్రీశ్రీ త్రిదండి రంగరామానుజ జీయర్ స్వామివారు-కాకినాద; 2) శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరామచంద్ర జీయర్‌స్వామివారు- భీమవరం; శ్రీశ్రీశ్రీ జగద్గురు రామానుజాచార్య విద్యాభాస్కర్ వాసుదేవాచార్య స్వామివారు- అయోధ్య; 4) జగద్గురు మహంత్ రంగనాథాచార్యస్వామి- ఉజ్జయిని; 5) శ్రీశ్రీశ్రీ కోసలేంద్ర ప్రపన్నాచార్య ఫలహారీ స్వామివారు-రాజస్థాన్; 6) శ్రీశ్రీశ్రీ జగద్గురు రాజనారాయణాచార్య-దేవరాహా, బీహార్; 7) శ్రీమాన్ M.A. లక్ష్మీతాతాచార్య స్వామి-మేల్కోట, కర్నాటక; 8)శ్రీమాన్ డాక్టర్ M.A. వేంకట కృష్ణన్‌స్వామి-చెన్నై; 9) శ్రీమాన్ D. నరసింహాచార్యులు (వైఖానస ఆగమ అర్చకులు) తిరుపతి; 10) శ్రీమాన్ Ch. అయోధ్య రామారావుగారు-కరీంనగర్; 11) శ్రీమాన్ B. కమలాకరరావుగారు- హైదరాబాద్; 12) శ్రీమాన్ D.V.L.N.మూర్తిగారు I.A.S.- హైదరాబాద్; 13) శ్రీమాన్ C. రామచంద్రారెడ్డిగారు-హైదరాబాద్; 14) శ్రీమాన్ J భాస్కరరావుగారు- హైదరాబాద్; 15) శ్రీమాన్ Prof P. పురుషోత్తంరావు గారు-హైదరాబాద్ ఉంటారని, అవసరాన్నిబట్టి అందరూ కాని, కొందరుగాని ఆయా కార్యక్రమాలను నిర్వహించాలని తీర్మానించడమైనది.

13. సమావేశమైన జీయర్లు, మహంతులు మొదలగు వారందరితో కలిసి సంప్రదాయ పరిరక్షణ కార్యక్రమాన్ని ఇకపై కూడా అవిచ్ఛిన్నంగ కొనసాగించడానికి వీలుగా జాతీయస్థాయిలో ఒక సమితి ఏర్పడాలని, దానికి 'వైష్ణవ ప్రతిష్ఠాన్" అని నామకరణం చేయాలని తీర్మానించడమైనది.

14. వీలయినంత త్వరలో ఈ "వైష్ణవ ప్రతిష్ఠాన్" యొక్క రూపరేఖలను పైన తెలియపరచిన ప్రతినిధి మండలి కూలంకషంగా చర్చించి భవిష్యత్ కార్యక్రమాన్ని నిర్వహించగలిగేట్టు 'వైష్ణవ ప్రతిష్ఠాన్' కొఱకై తగు రూపురేఖలను దిద్దుతూ ఒక నియమావళిని తయారుచేయడానికి అధికారాన్నిస్తూ తీర్మానించడమైనది.

**సంగోష్ఠికి హాజరైన భక్తజనులు :**

శ్రీమాన్ సి. ప్రతాపరెడ్డిగారు (అపోలో హాస్పిటల్)
శ్రీమాన్ జె. శ్రీకుమారి రామేశ్వరరావుగారు
శ్రీమాన్ సి. రామచంద్రారెడ్డి గారు
శ్రీమాన్ మారుతిగారు & కృష్ణకుమారి గారు
శ్రీమతి రమాప్రతాపరెడ్డిగారు
శ్రీమతి జె. వసుమతీభాస్కరరావు గారు
M/s భవాని జ్యూయలర్స్

శ్రీమాన్Ch.వేంకటేశ్వరరావుగారు & హరిప్రియగారు
శ్రీమతి అరుణారాఘవరెడ్డి గారు
శ్రీమాన్ శ్యామ్‌మోహనరావు గారు
శ్రీమాన్ ఎ. సుదర్శన్ & బ్రదర్స్
శ్రీమతి సుభాషిణి గారు
శ్రీమతి రాజ్యలక్ష్మి జీవన్ గారు
శ్రీమతి మీనాక్షీ సుందరం గారు
శ్రీమాన్ టి. రమేశ్‌గుప్తా గారు

శ్రీమాన్ డా॥ ఆనందరావు గార్లు
శ్రీమతి ఎ. ప్రమీలాదేవి గారు
శ్రీమతి జి. వనజాభాస్కరరావు గారు
శ్రీమతి పి. శ్యామలామురళీధరరావు గారు
శ్రీమతి పి. పద్మాశ్రీనివాసరావు గారు
శ్రీమతి పి. సులోచన నరసింహారెడ్డి గారు
రామాంతపూర్ వికాసతరంగిణి
కార్యకర్తలు
శ్రీమాన్ కె. శ్రీహర్ష గారు
శ్రీమతి శ్రీలతాభూపాల్ గారు
శ్రీమతి ఆనందకుమారి గారు
శ్రీమతి కె. రామ నవనీత కృష్ణారావు గారు
శ్రీమాన్ కె.వి. రంగనాథం గారు
శ్రీమతి ఎమ్. సరళ గారు
దుర్గాబాయి దేశ్‌ముఖ్ కాలనీ
వికాసతరంగిణి సభ్యులు
శ్రీమతి కామమ్మ&మసాబ్ ట్యాంక్
వికాసతరంగిణి కార్యకర్తలు
సంతోష్‌నగర్ వికాసతరంగిణి కార్యకర్తలు
శ్రీమతి అరుణారమేశ్ గారు
శ్రీమతి సుచరితా రత్నాకరరావు గారు
శ్రీమాన్ జనార్ధన శశికళ గారు
శ్రీమతి కె. పుష్పమ్మ గారు
మెదక్ వికాసతరంగిణి కార్యకర్తలు
M/s ఘనశ్యామ్ జ్యూయలర్స్
శ్రీమతి శకుంతలాఠాగూర్ గారు
శ్రీమాన్ టి.వి.ఆర్. ప్రసాద్ గారు
శ్రీమతి శారదామల్లిఖార్జునరావు గారు
శ్రీమతి పుష్పలతా రామచంద్రారెడ్డి గారు

శ్రీమాన్ వి. కొండలరావు, నిర్మల గారు
సిద్ధిపేట వికాసతరంగిణి గోదాగోష్ఠి సభ్యులు
శ్రీమాన్ ఎమ్. రామిరెడ్డి గారు
శ్రీమాన్ గోగినేని రంగారావు గారు
శ్రీమతి టి. సుకశ్రీ విశ్వంభర రెడ్డి గారు
శ్రీమతి మంగాఅశోక్‌రావు గారు
శ్రీమతి డా॥ శోభాజయంత్ గారు
శ్రీమతి సుశీల గారు
శ్రీమతి పద్మ గారు
శ్రీమతి అమృతకృష్ణారెడ్డి గారు
శ్రీమతి వి. రమావసంతరావు గారు
కుమారి వింధ్య గారు
శ్రీమతి లక్ష్మీగోపాల్ గారు
శ్రీమతి పి. కమలమ్మ గారు
శ్రీమతి కె. రమాదేవి మధుసూధనరెడ్డి గారు
శ్రీమతి డా॥ శోభా చంద్రమోహన్ గారు
శ్రీమాన్ జి. రాజారెడ్డి గారు
శ్రీమాన్ వి. శ్రీనివాస్ గారు
శ్రీమాన్ వి. హరికుమార్ గారు
శ్రీమాన్ జి. సరోజినీ పురుషోత్తమరావు గారు
శ్రీమతి గాయత్రీ అనీల్‌కుమార్ గారు
శ్రీమాన్ కె. చంద్రశేఖరరావు గారు
శ్రీమాన్ పుండరీకాక్షరరావు గారు
శ్రీమాన్ నరసింహారెడ్డి గారు
శ్రీమాన్ డా॥ అరుణ్‌కుమార్ గారు
శ్రీమాన్ కల్కి అవతారం గారు
శ్రీమాన్ వరకుమార్ గుప్తా గారు
శ్రీమతి కృష్ణకుమారి గారు
శ్రీమాన్ కైలాశ్ భాంగడియా గారు
శ్రీలక్ష్మీనారాయణ శుంఠ్‌వాల్ గారు

సుమిత్రా ఎంటర్ ప్రైజెస్ సభ్యులు
శ్రీమతి కె. రాజమణి గారు
శ్రీమతి వనజాచలపతిరావు గారు
శ్రీమాన్ విజయభాస్కరరెడ్డి గారు
శ్రీమతి రంగనాయకమ్మ గారు
శ్రీమాన్ వేంకటాచారి గారు
శ్రీమతి రమావతి గారు
శ్రీమాన్ సుందరమూర్తి గారు
శ్రీమాన్ ఎస్. సుందరమూర్తి గారు
శ్రీమతి లీలామహేందర్‌రెడ్డి గారు
శ్రీమాన్ విజయకుమార్ గారు
శ్రీమతి లలితా త్రిపాఠిరావు గారు
శ్రీమతి భారతీసుధీరరెడ్డి గారు
శ్రీమాన్ జి.వి.కె. రెడ్డి గారు
శ్రీమాన్ డా॥ ఆనందరావు గారు
శ్రీమాన్ ధనరాజ్ కలోంజి గారు
శ్రీమాన్ ఎమ్. రాఘవేంద్రరావు గారు
శ్రీమాన్ రంగారెడ్డి గారు
ఎస్.ఆర్. నగర్ వికాసతరంగిణి కార్యకర్తలు
శ్రీమాన్ వి. శ్రీనివాసరెడ్డి గారు
శ్రీమతి చిత్రామాధవన్‌గారు
శ్రీమాన్ ఎమ్. సంపత్ గారు
శ్రీమాన్ ఎమ్. నారాయణరావు గారు
శ్రీమాన్ రామ్మోహన్‌రావు గారు
శ్రీమాన్ ఎమ్. రామ్మోహనరావు గారు
శ్రీమాన్ జె. శ్రీనివాసరావు గారు
శ్రీమాన్ జె. జగపతిరావు గారు
శ్రీమాన్ టి. శ్రీనివాసరావు గారు
శ్రీమాన్ టి. బాలకృష్ణ గారు

సంగోష్ఠికి విచ్చేసిన ఆగంతకులందరికీ అతిధేయ గృహస్థులు, యాజమానులు కృతజ్ఞతా పూర్వకంగ వస్త్ర, సంభావనాదికాలు సమర్పించుకున్నారు. వెంటనే అందరూ బయలుదేరి నిజాం కాలేజీ గ్రౌండ్స్‌కు బహిరంగ సభావేదికవద్దకు చేరారు. సాయం. గం. 7.00దాక శ్రీవిష్ణు సహస్ర నామ పారాయణం, భజనలు జరిగాయి.

అప్పటికే గ్రౌండంతా ఇసుకవేస్తే రాలనంత దట్టంగ నిండిపోయారు. విశాల మైన వేదిక, నిండుగ 4వరుసలలో, ముందు జీయర్లు, ఆపై మహాంతులు, ఇతర పెద్దలు.... ఇలా ప్రముఖులంతా ఆశీనులైనారు.

**శ్రీశ్రీశ్రీ చిన్న జీయరుస్వామివారు సభను, పెద్దలను పరిచయంచేసారు. సంగోష్ఠి ఆశయా లను వివరించి, ఇందరుపెద్దల దర్శన భాగ్యం పొందిన భక్తులను మంగళాశాసనాలతో సంభా వించారు. శ్రీవానమామలై స్వామివారు "ఇంత ముసలివాడనైన నాకే TTD వారి చర్యలతో రక్తం ఉడుకుతోంటే మీకు మాత్రం ఉండదా" అంటూ ప్రశ్నించారు. శ్రీపెరుంబుదూర్ వరద యతిరాజ జీయరు స్వామి, తాము దేనికైనా సిద్ధమన్నారు. శ్రీవిద్యాభాస్కర్ వాసుదేవాచార్య స్వామి "5వేళ్ళున్నట్లు 5 నిమిషాలైన మనశక్తిని సవ్యంగ వాడితే TTD వంటివారి దౌర్జన్యాలు ఆగిపోతా యన్నారు". శ్రీఫలహారీస్వామి వారు "ఉత్తరాదిలో కాశ్మీర్‌నుండి ఉండే వైష్ణవ సమాజ మంతా శ్రీచిన్న జీయరుస్వామివారి వెంట ఉందని సూచనా మాత్రం చేత వేలసంఖ్యలో తామంతా తరలిరాగల**

మని, దేనికైనా, వైష్ణవ సంప్రదాయాన్ని రామానుజుల సిద్ధాంతాన్ని రక్షించుకోడానికి తామంతా సిద్ధమని స్పష్టం చేసారు.

**శ్రీరంగరామానుజ జీయరుస్వామివారు అందరినీ లేఖల ద్వారా తమ ప్రతిఘటనను తెలుప మని సూచించారు. 'రామానుజుల వారిపైన, శ్రీవైష్ణవ సంప్రదాయాలపైనా- అది తెలియని, వైష్ణవేతరులైన వారు, ఎవరైనా ఎంత పెద్దలైనా- దోషారోపణ, నిర్మూలనా ప్రయత్నాలు చేస్తే అలాంటి దుష్టశక్తులను ఎదుర్కోడానికి వెనుకాడేది లేదని, దేనికైనా తాము సిద్ధం అని పెద్దలైన మహంతులంతా ఏకకంఠంతో ఉద్ఘోషించారు.**

**చివరగ శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్య స్వామి ఆశ్చర్యకరంగ, ఆనంద దాయకంగ సమర్పించిన కృతజ్ఞతా నివేదికతో 'శ్రీవైష్ణవ సంత సందర్శన' బహిరంగ సభ సుసంపన్నమైంది.**

మధ్య మధ్యలో వానదేవుడు కాస్త కాస్త పలుకరించి వెడుతున్నా వేలాదిమంది భక్తులు శ్రద్ధతో చివరిదాక ఉండి, విషయాన్ని అర్థం చేసుకొన్నారు. TTD వారికిదొక హెచ్చరికగ ముగిసింది. పెద్దలందరికీ 14వ తేదీ ఉదయమే వీడ్కోలు పలికారు శ్రీచిన్న జీయరుస్వామివారు. ఇతర జీయరు స్వాములంతా కార్యకర్తలకు, నిర్వాహకులకూ వాలంటీర్లకు, ఉదారగృహస్థులకు మంగళా శాసనాలు చేసారు. 14వ తేదీనాడు అస్సాం నుండి వచ్చిన భక్తులకు సమాశ్రయణం చేసి శ్రీచిన్న జీయరు స్వామివారు సీతానగరం బయలుదేరారు.

15వ తేదీనాడు ఆశ్రమకార్యక్రమాలను పర్యవేక్షించి రాత్రి బయలుదేరి, చెన్నై 16వ తేదీనాటికి చేరారు. 16వ తేదీనాడు వాన మామలైమఠంలో ప్రెస్‌వారితో సమా వేశమై సంగోష్ఠి వివరాలన్ని శ్రీవారు తెలిపారు. ఆపై వివేకానంద విద్యాలయ విద్యార్థులకు మంగళాశాసనం చేసారు. చెన్నైలో శ్రీవారు శ్రీమాన్ చలపతిరావు రాజ్యలక్ష్మిగార్ల గృహంలో బసచేసారు. రాత్రి ఆరాధన కాగానే అందరకూ మంగళాశాసనం చేసి US యాత్రకై బయలుదేరారు.

'శ్రీవైష్ణవసంగోష్ఠి' తయారు చేసిన తీర్మానాలను ప్రభుత్వాధికారులకు, రాజకీయ నేతలకూ, TTD బోర్డు ఛైర్మన్‌కు అందచేసి, 24వ తేదీలోపల తమ సమాధానం తెలియచెప్పాలని 'ప్రతినిధి మండలి' సభ్యులు కోరారు. 24వ తేదీన TTD బోర్డు సమావేశ మైంది. తీర్మానాల విషయం ప్రస్తావించనే లేదు. కానీ 1000కాళ్ల మండపం బదులు 2000 కాళ్ళమండపం కడతామని, అదీ వేరేచోట చేస్తామని ఓ అర్థ రహిత ప్రకటన చేసారు. ఆలయ ముందు భాగాన్ని ముక్కలు చేసి, నేలంతా చదును చేస్తున్నామనే పేర, మరిన్ని చారిత్రక కట్టడాలనుగూడ తొలగించే పని ఆపకుండా సాగిస్తూనే ఉన్నారు. నిజానికి చదును చేయడం కాదు చేయవలసి నది, ఆస్థానంలో మరల ఎత్తుచేసి, మండపాన్ని అక్కడే కట్టాలి. ఆలయ ముందుండే వీధిని పునరుద్ధరించాలి. మాడవీధి నిర్మాణం కావాలి. అదేం వారికి పట్టలేదు.

ఇంతలో భగవత్సంకల్పం వల్ల హైకోర్టు చొరవ తీసుకొని 29.6.2004నాడు TTD వారికి అక్కడి పనులను వెంటనే నిలుపమని ఆజ్ఞలు జారీచేయడం ఆనందించదగిన పరిణామం. ఇది ఇక్కడితో ఆగిపోదు. ఇదొక ఆధ్యాత్మిక ఉద్యమం. ఎన్నో విషయాలిందులో ఇమిడి ఉన్నాయి కనుక, అధికారులు తాము చేసినది తప్పేనని తెలిసినా అంగీకరించడానికి వారి అహం అడ్డొస్తుంది, పైగా తమని ఎవరైనా కాదంటే పట్టుదలగ ఆ తప్పే సాధించాలనే ఎన్ని ప్రయత్నాలైనా చేయక మానరు. ఇదొక రాజకీయమైన రంగులుగూడ పులుము కొనే ప్రమాదం లేకపోలేదు. రాజకీయనాయకుల జాతకాలను మార్చ గలిగినవారు ప్రజలే. ప్రజలు కనులు తెరిస్తే ఎంతటివారైనా మసికాక తప్పదు. TTD వంటి విషయాలలో చెలగాట మాడి తమ పంతం, పబ్బం గడుపుకుందామనుకొనే అధికారులకూ, వారికి వంతపలికే ప్రబుద్ధులకూ సరియైన గుణపాఠం చెప్పవలసిందీ ప్రజలే. "ఆ ప్రజలకే సౌకర్యం చేయడానికే తామీ శ్రమంతాపడి నాశనం చేస్తున్నా"మని వారంటున్నారు. కానీ వాస్తవాలు గుర్తించిన భక్తులెవ్వరూ ఈ వినాశాన్ని సహించలేకపోతు న్నారు.

భక్తులారా! భగవద్బంధువులారా! మీరూ ఆలోచించండి. చరిత్రనూ, సంప్రదాయా లనూ నాశనం చేసే సౌకర్యాల పేరుతో జరిగే దైవాపచారంలో మీరూ భాగస్వాములు కాదలచుకొంటున్నారా?

దేవాలయ మండపాలను, ఆచారా లనూ, నాశనం చేసే దైవద్రోహంతో మీరూ పాలుపంచుకోదలచు కుంటున్నారా? వారు చేస్తున్నామని చెప్పే సౌకర్యాలు మీరు కోరుకుంటున్నారా? కాదన్నట్లైతే మీ నిరసనను వెంటనే తెలియచేయండి.

**ఈ క్రింద ఒక నమూనా ఫారాన్నిస్తున్నాం. ఇలాంటివి మీరూ వ్రాయండి. దాని క్రింద కనీసం 25మంది మీకు తెలిసిన, శ్రీవేంకటేశునిపై భక్తి, శ్రద్ధకల వారెవరికైనాసరే, పై విషయాలు చెప్పి, వారికీ ఈ నాశనం తప్పని అనిపిస్తే సంతకం చేసి ఎడ్రస్సు, ఫోను నెంబరుతో సహా యిమ్మని అడగండి.**

ప్రతీఫారం మీద 25పేర్లు, చిరునామాలు, ఫోను నెంబరు, వారి సంతకం, చివర సేకరించినవారి సంతకం, చిరునామా ఉండాలి. ఇలాంటివి ఎన్ని ఫారాలైనా మీరు తయారు చేస్కోవచ్చు.

ఆంధ్రలోనే కాకుండా ఎక్కడెక్కడున్న శ్రీవేంకటేశుని భక్తులైనా ఈ సంతకాల ఉద్యమం ప్రారంభించతగును. నింపినఫారా లను 'సీతానగరం, హైదరాబాదు కార్యాల యాలకుగానీ, లేదా మీకు సమీపంలోని వికాసతరంగిణివారికి కానీ, వైష్ణవసంగోష్ఠి మెంబర్ల దగ్గరకానీ అంద చేయండి. లక్షల సంఖ్యలో ఇది జరగాలి. కోట్లభక్తుల భక్తిభావన మీదజరిగే ఈ విఘాతం తొలగాలి. శ్రీస్వామి సేవ గతం వలె వైభవంగ సాగాలి.

జై శ్రీమన్నారాయణ !

శ్రీమతే రామానుజాయ నమః

ఓం నమో వేంకటేశాయ

# తిరుమల తిరుపతి దేవస్థానం సంరక్షణకై భక్తుల స్పందన

## ప్రభుత్వానికి, రాజకీయ నేతలకు అధికారులకు శ్రీవేంకటేశ్వర భక్తమండలులు చేయు హెచ్చరిక

1) తిరుమలయొక్క చరిత్రను నాశనం చేసే సౌకర్యాలు మాకు అవసరం లేదు. ఆనందనిలయం పర్యాటకుల విలాసనిలయం కారాదు.
2) సంప్రదాయాలకు, ఆచారాలకు విరుద్దంగా జరిగే కట్టడాలను, కొట్టడాలని, కూల్చివేతల్ని వెంటనే ఆపాలి.
3) ఆలయ ప్రాచీనతను తెలియచేసే కట్టడాలను, ఆలయ ముందుభాగాన్ని (ఉదా: వేయికాళ్ళ మండపం, అనంతార్యగృహం) పూర్వము వలె యథాతథముగా పునర్నిర్మాణం చేయాలి.
4) ఆచార వ్యవహారములలో జరిగే అనాచారాలను, లోపాలను తక్షణం నిలువరించాలి.
5) పూర్వాచార్యుల నిర్ణయాలను, కోట్లభక్తుల మనోభావాలను కించపరచే అన్నిచర్యలను **T.T.D** వెంటనే మానాలి.
6) సంప్రదాయ వ్యతిరేకుల జోక్యం **T.T.D** వ్యవహారాలలో అన్ని స్థాయిలలోను పూర్తిగా తొలగాలి.
7) దేవునికి, సంప్రదాయానికి, దేవాలయానికి తగిన రక్షణ వ్యవస్థను వెంటనే ఏర్పరచాలి.

| వ.నెం. | పేరు | చిరునామా | ఫోన్ నెం. | సంతకం |
|---|---|---|---|---|
| | | | | |

సేకరించిన వారి సంతకం చిరునామా



MAHA STRONG
MAHA VALUE
43 GRADE
53 GRADE
MAHA CEMENT
MY HOME CEMENT INDUSTRIES LTD.
Corporate Office : 4th Floor, "MY HOME JUPALLY"
Ameerpet, Green Lands, Hyderabad - 500 016.
E-Mail : myhome@hd2.dot.net.in
: 23401038, 23408032 / 33 / 34, Fax : 23401271.
QUALITY CONCIOUS CONSTRUCTIONS
MY HOME
CONSTRUCTIONS LIMITED
Corporate Office : 5th Floor, "MY HOME JUPALLY"
Ameerpet Road, Green Lands, Hyderabad - 500 016.
Website : www.myhomeindia.com
23411342, 23403517, Fax : 040-23401271.
MYHOME GROUP
Dr. RAMESWAR RAO JUPALLY
Chairman & Managing Director

July - 2004 BHAKTHINIVEDANA
Sitanagaram, Guntur Dist - 522 501.

Licenced post with out prepayment
No. AP/VJ/5-34/03.

RNI Regd. No.: 52762/91
Postal Regd. No. PMG/VJ/5-34/03 (2003-2005)
Dt. : 30-12-2002.

# విషయ సూచిక.....



## పంచాంగ వివరాలు

### ఆగస్టు

11 సర్వేషామేకాదశి
14 మాస శివరాత్రి
15 భారత స్వాతంత్ర్యదినోత్సవం, త్రిద్యుస్పృక్, గోదావరీ అంత్యపుష్కరారంభం
16 సోమవతీ అమావాస్య
17 సింహ సంక్రమణం ఉ.6-31, మఖకార్తె
19 నాగచతుర్థి
20 నాగపంచమి, గరుడపంచమి
21 సామవేదీనాం ఉపాకర్మ
24 క్షేష్టాంగారకం
26 సర్వేషామేకాదశి
27 వరలక్ష్మీవ్రతం
27 సార్ధకోటి సహిత అరుణోదయ కాలం
కృష్ణానదీపుష్కరారంభం, ఋగ్వేదీ నాముపాకర్మ,వరాహజయంతి, శనిత్రయోదశి
29 హయగ్రీవ జయంతి
30 పుబ్బకార్తె, యజుర్వేదీనాముపాకర్మ, రాఖీపూర్ణిమ, రక్షాబంధనం,
31 అవమతిథి

### సెప్టెంబరు

1 **శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి తిరునక్షత్రం**
2 సంకష్టహర చతుర్థి
5 గురుపూజోత్సవం
6 స్మార్త శ్రీకృష్ణాష్టమి
7 వైష్ణవానాం శ్రీకృష్ణాష్టమి, శ్రీకణ్ణన్ తిరు॥
8 గురుమౌఢ్యారంభాం


Printed and published by Sri **T.P. Sriramachandracharyulu** owned by **Jeeyar Educational Trust** and Printed at **Sriman Printers & Processors** Sitanagaram and Published at Sitanagaram, **Editor Sri T.P. Sriramachandracharyulu 7-48, Brindavani, Visakhapatnam - 530 028.**

మీ సేవలో....

**భక్తినివేదన,** సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, & (08645) 272929,

**చందావివరాలు:**-సంవత్సరచందా రూ.50/-, జీవితచందా రూ.500/-, విదేశాలకు సంవత్సరచందా $ 25,

E-mail : jetsitanagaram@yahoo.com Internet : www.chinnajeeyar.org

D.T.P. & Design by : పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం,




శ్రీమతే రామానుజాయ నమః

# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాస పత్రిక




శ్రీతారణ నామ సంవత్సరం అధిక శ్రావణం

**సంపుటి 57 2004 ఆగస్టు సంచిక 5**


వ్యవస్థాపకులు

శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యులు
శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు

సంపాదకులు :

శ్రీ ఉ. వే. శ్రీమాన్ డా. **శ్రీరామచంద్రాచార్యులు**

సంపాదకీయం

# నయవంచకులు –

మనిషి జంతువుకంటె ఘోరంగా ప్రవర్తించగలడు. క్రూరంగా పలకనూగలడు.

ఇట్లాంటి మాటకాని చేతకాని మనసుకాని వారి వారి సంస్కారాన్ని పట్టి ఉంటాయి. చదువు పుట్టుక సావాసం కూడా కొంత తోడ్పడవచ్చు.

కొందరు చదువుకున్నవారు కూడా మాటల మేలిమిలేక చేతల తాలిమి లేక కనవస్తారు. "కుండబద్దలు కొట్టినట్టు మాటలాట్టం మా అలవాటండీ, చాటుమాటులు మాకులేవు, ఉన్నదేదో మొగాన అనేస్తాం"– అని తమ 'ఆర్జవాన్ని' వీరు బహుధా కీర్తించుకొంటారు.

ఎల్లవేళలా ఎల్లచోటులా ఇది సాగిపోదు. ఒక్కొ వేళ వీరి వర్తనం ఒరులకేకాదు తమకూ చేటు చేకూర్చకపోదు.

మంచి చేసినా చెడు చేసినా ఒకమారు ఆ వ్యక్తిని గమనించేక, వారిట్లాంటివారని తెలిసేక ప్రమాదం లేదు. అనుకూలుణ్ణి ఆదరిస్తాం. ప్రతికూలుణ్ణిదవుల నిలుపుతాం.

కాని ఎంత బుద్ధిమంతుడికీ, ఎంత అనుభవశాలికీ అందని మనుషులుంటారు. వీరు కడునేర్పరులు. మనసుపై గొప్ప అదుపు గలవారు. గొప్ప తెలివికలవారు. మరెంతో లోకజ్ఞత కలవారు. ఎదుటి వారిని వారెంతటి వారైనా క్షణాలలో నమ్మించగల మంచిమాటకారులు. తమ మనస్సులో ఎన్నెన్ని కుటిలోపాయాలు, వక్రబుద్ధులు, మాయలు– మర్మాలు, స్వార్థభావనలు, కొంపలు కూల్చే కుతంత్రాలు కందురీగల తుట్టెల్లా ముసురుకొని ఉన్నా మనసు మల్లెపందిరిలా ఉన్నట్టు మొగాన వెన్నెల విరిసినట్టు 'ఆర్జవం' ఎదురుగా నిలిచినట్టు నీతో పలుకగలరు. వారి మాటలు పన్నీరు చిలుకుతాయి. వారి మాటలు మంచిగంధం పూస్తాయి. వారి మాటలు సన్నజాజులు కుమ్మరిస్తాయి. వారి మాటలు మైమరపిస్తాయి. అట్టె కట్టిపడేస్తాయి. నిన్ను వారి మనసులలోకి తొంగి చూడనియ్యవు. అసలు నిన్ను కదలనియ్యవు.

ఎద హాలహలం నింపుకొనీ
మాటల తేనెలొలికిస్తారు వీరు.

నయవంచకులు.

ఇదిగో వీరూ ప్రమాదకారులు! వీరిని పసికట్టటం కష్టం వీరి నుంచి బతికి బట్ట కట్టటమూ కష్టమే.

ఎంత సజ్జనుడు! ఎంత పరోపకారబుద్ధి! ఎంత పరార్థజీవి! ఇట్లాంటి వారివల్ల కదా లోకాన ఈ మాత్రమయినా ధర్మం నిలుస్తోందివేళ!– అనిపించేట్టు వ్యవహరిస్తారు వీరు.

వీరు వట్టి స్వార్థపరులు. పయోముఖ విషకుంభాలు. సమాజం కుళ్ళిపోయేది వీరివల్ల. జాతి చెడిపోయేది వీరివల్ల! వీరు నయవంచకులు!

ఈ నయవంచకులలో కూడా రెండు రకాలు. ప్రకృతి తత్త్వాన్ని, లోకరీతిని చావు





పుట్టుకల స్వభావాన్ని గంభీరధోరణిలో కనుల ముందు నిలిపి తామనుకొన్న దాన్ని వినేవాడి చెవికెక్కేట్టు మనస్సుకు పట్టేట్టు చెప్పి తమ దారికి తెచ్చుకొని అవతలి వారినుద్ధరిస్తున్నామన్న భావనను వారికి కలిగించి తమ పబ్బం గడుపుకొనే తెంపరులు కొందరు; ఒక రకమైన నివృత్తి మార్గం వీరిది. వీరిది నివృత్తి మార్గం కాదు. వినేవారికి వీరు నివృత్తిమార్గనిష్ఠుల్లా అనిపించేది. వీరూ ప్రవృత్తి మార్గపరులే! మామూలు ప్రవృత్తి మార్గం కాదు. పూట పూటకు పొట్టకోసం తమ తెలివిని పలు తెరగులు క్షణాల మీద పండించుకోగల పచ్చి వ్యాపారులు వీరు.

ఇక రెండో రకం వారున్నారు.

ప్రేమను, అనుబంధాలను, మమతను, మానవతను, నిసర్గ దౌర్బల్యాలను పరమ సుకుమారంగా తమకనుకూలంగా మలచుకొంటూ తమ పబ్బం గడుపుకొనేవారు వీరు. మమత మీదా, మానవత మీదా వీరికి నమ్మకం లేదు. బంధాలు అనుబంధాలు వీరికి పట్టవు. ఆ పేరు చెప్పుకొని తమ బతుకులు గట్టెక్కించుకోవాలనుకొనేవారు వీరు.

ఇట్లాంటి లోక ప్రవృత్తిని మహాభారతం లోని ఒక ఉపాఖ్యానం చక్కగా వివరిస్తుంది.

లేక లేక ఒకరింట పిల్లవాడొకడు కలిగేడు. తల్లిదండ్రులకే కాక బంధువులకూ ఆ పిల్లవాడంటే పంచప్రాణాలూను కంటికిరెప్పలా కాపాడుకొంటున్నారు. కాని విధి విలాసం. కొన్నినాళ్ళకే ఆ పిల్లవాడు కాస్తా కన్నుమూసేడు.

ఏడ్చేరు. మొత్తుకున్నారు. గోలపెట్టారు. ఏంచేస్తారు? చనిపోయిన పిల్లవాణ్ణి కాటికి తీసుకుపోయేరు.

పిల్లడు పోయినా వీరి మమకారం పోలేదు. ఎత్తుకొంటారు ముద్దులాడతారు. వాని ఆటపాటలు తలుచుకొంటూ ఏడుస్తారు. ఎంతకూ వదలిపోలేరు.

అప్పుడు అక్కడికో గద్దవచ్చింది. మంచి ఆహారం దొరికినందుకు సంతోషించింది. కాని పొద్దుపోతోంది. వారాపిల్లవాణ్ణి వదలి పోవటంలేదు. ఎల్లాగైనా వారినక్కడనుంచి పంపాలి. అప్పుడా గద్ద వారితో–ఎంతసేపు ఏడుస్తారు? ఏడిస్తే చచ్చినవాడు బతుకుతాడా? రోజూ ఎంతమంది యిక్కడకు రావటం లేదు? కాలగతియిది! ఏం చేస్తారు? పొద్దుపోతోంది. మీరిక్కడ ఎక్కువసేపుండటం క్షేమం కాదు. పోయిన వాడు బతకడు కద! ఇళ్ళకుపొండి!–అన్నది.

చీకటి పడితే గద్దకు చూపానదు. వీరు వేగం పోతే ఆ బిడ్డను పీక్కుతిందామని దాని తలపు. ఆలసిస్తే చీకటి పడుతుంది. ఏ నక్కలో వస్తాయి. దొరికిన తిండి కాస్తా తనకందకుండా పోతుంది. అని దాని బెంగ. అంతరంగం బయటపడకుండా అందంగా తత్త్వోపదేశం కావించింది.

పాపం ఆ పిల్లవాని తల్లిదండ్రులు, బంధువులు కాస్త తేరుకొని నిజమే, ఏం చేస్తాం ఎంతసేపున్నా మన పిల్లవాడు బతికివస్తాడా? గద్ద మంచిమాట చెప్పింది. పదండి పోదాం. మనకింతే ప్రాప్తం! అని పిల్లవాణ్ణి అక్కడ వదలి లేవబోయినారు.

అక్కడే బొరియలో ఒక నక్క ఉంది. చాలసేపటి నుంచీ యీ వ్యవహారం అంతా గమనిస్తోంది. తనకు మంచి ఎర లభించబోతున్నందుకు సంతోషంగా ఉంది. కాని యీ గద్ద ఒకటి చేరింది. పొద్దుపోయేదాకా వీళ్ళిట్లా ఏడుస్తూ మొత్తుకొంటూ కూచున్నా చీకటి పడినాకయినా ఇళ్ళకు మరలుతారు. చీకటి పడినాక గద్ద తప్పుకోక తప్పదు. అప్పుడు ఎక్కటిగా తానే తినవచ్చుననుకొంటూండగా, పొద్దుండగానే ఈ గద్దమాటలు విని వీరంతా యిళ్ళకు మరలిపోతున్నారే. ఎల్లాగయినా కాస్సేపు వీరికాపితే బాగుండుననుకొన్నది.

పోతున్న మనుషుల్ని చూసి – మనుషులెంత నిర్దయులు! పిల్లవాణ్ణి ఇక్కడ ఎట్లా వదిలిపోతున్నారు. క్షణం దాకా వాడి ప్రేమకు పరవశించిన మీరు ఇంత కఠినంగా ఎట్లా కాదని పోతున్నారయన? పశువులకు పక్షులకు ఉన్నపాటి ప్రేమ కూడా మనుషులకు సంతానం పట్ల ఉండదా? పిల్లలు పెద్దయేక పశువుల్లో పక్షుల్లో తల్లిదండ్రులను ఆదరింపవు పోషింపవు. అయినా అవి తమ పిల్లలను ప్రేమతో పోషిస్తాయే! ఆ పాటి ప్రేమ మనుష్యుల్లో ఉండేదా! వీడు మీకు వంశోద్ధారకుడే! కాస్సేపు వీడి కోసం ఏడవను కూడా లేరా? మీ ఏడుపులు విని ఏ దేవతలైనా కరుణించి వీణ్ణి బతికించునేమో? అట్లా బతికిన వారికథలు ఎన్ని వినలేదు? అందాలు చిందుతూ ముద్దులు మూటగడుతున్న ఈ పిల్లవాణ్ణి యిట్లా దిగవిడిచి పోను మీకు మనసెట్లా ఒప్పుతోందయ్యా! – అన్నది.

దానితో వారు – నిజమే ఎంత కానివాళ్ళం! ఎట్లా పోగలుగుతున్నాం? ఏమో ఏ దేవత కరుణవల్లనైనా మనవాడు బతుకుతాడేమో. కాస్సేపు ఉందాం అని లేచిన వారు అక్కడే నిలిచిపోయేరు.

ఇట్లా గద్ద, నక్క రెండూ – చీకటిపడకముందు వారిని సాగనంపాలని గద్ద, చీకటి పడేవరకూ వారినక్కడే ఆపాలని నక్క తమ తమ ఉపదేశాలు సాగించినాయి.

కడుకు ఏం జరిగిందన్నది మనకప్రస్తుతం.

గద్ద, నక్క రెండూ అంతరంగాలలో ఆ పిల్లవాని పీనుగును తినటమే పరమ ప్రయోజనంగా భావించి ఉన్నాయి. తమ అంతరంగాలు బయటపడకుండా తత్త్వోపదేశమే హితోపదేశమే తమ పరమ లక్ష్యంగా ప్రవర్తించినాయి.

వింటున్న వారికి ఏ మాత్రమూ తమ అంతరంగం అందనట్టు వ్యవహరించగలగటమే వాటి నేర్పు.

మనుష్యుల తీరూ ఇల్లాగే ఉంటుంది సుమండీ అని ప్రబోధిస్తుంది యీ ఉపాఖ్యానం.

అయితే అసలు లోకంలో ఆర్జవం కలవారు పరహిత చింతన ప్రవణులు వేరని కాదు. గృధ్ర, గోమాయువుల వలెకాక జనాన్ని జీవింపచేసేవారూ, ఉజ్జీవింప చేసేవారూ ఉన్నారు. అట్లాంటి వారిని మనం అన్వేషించుకోవాలి. ఆశ్రయించాలి అనుగ్రహం పొందాలి.

**- శ్రీ రామచంద్రాచార్య**





# భృగు మహర్షి

## మహర్షుల చరిత్ర

తమిళమూలం :
వై.వా. నావల్‌పాకం దేవనాథ తాతాచార్యస్వామి

తెలుగు సేత :
శ్రీ.ఉ.వే.ప్ర శ్రీమాన్ తూపురాణి ఉడయవర్‌స్వామి, విజయవాడ

**భృగుమహర్షి చరిత్ర సంగ్రహంగా పరిశీలిద్దాం:**

ప్రపంచ సృష్టి ఆరంభంలోనే అవతరించిన వ్యక్తి భృగుమహర్షి. బ్రహ్మయొక్క భుజముల నుండి ఉద్భవించినవాడితడు. ఈయన పుత్ర పౌత్ర సంతతి చాల పెద్దది. లోకమంతా వ్యాపించి ఉన్నది. **'శ్రీవత్స గోత్రము'** మనకందరకు బాగా పరిచయం ఉన్నదే. ఈ గోత్రానికి చెందినవారు లక్షలలో ఉన్నారు. ఇట్టి ఈ గోత్రానికి మూల పురుషుడే భృగుమహర్షి. ఈ గోత్రానికి ప్రవర్తకులుగా ఇంకో నలుగురు ఉన్నారు. వీరందరూ ఈ భృగుమహర్షికి జ్ఞాతులే. సాధారణంగా గోత్ర ప్రవర్తకుల పేర్లు చెప్పేటప్పుడు తద్ధిత ప్రత్యయం చేర్చి చెప్పడం పరిపాటి. ఈ శ్రీవత్స గోత్ర ప్రవర్తకుల విషయంలో కూడ ఇదే సాంప్రదాయం కనబడుతుంది. భృగు, చ్యవన, ఆప్నవాన, ఔర్వ, జమదగ్ని అనే ఐదురుగు శ్రీవత్సగోత్ర ప్రవర్తకులు. ఈ పేర్లని తద్ధిత ప్రత్యయాంతములుగా మార్చి భార్గవ, చ్యావన, ఆప్నవాన, ఔర్వ, జామదగ్న్య అని చెప్పడం చూస్తూ ఉన్నాము. చాల ప్రాచీన కాలం నుంచీ వచ్చే అలవాటు చేత ఈ పేర్లు చెప్పేటప్పుడు కొన్ని ఉచ్చారణ భేదాలు ఉండవచ్చు. కాని పైన చెప్పినదే సరియైన ఉచ్చారణ.

పైన చెప్పిన ఈ ఋషులంతా పుణ్యమైన చరిత్రతో కూడిన గొప్ప మహిమాన్వితులు. వీరందరికంటె మాత్రమే కాక, ప్రాచీన మహర్షు లందరికంటే భృగుమహర్షి ఆధిక్యంతో ప్రకాశి స్తున్నాడని మన పూర్వీకుల అభిప్రాయం. ఇది యధార్థం అని శ్రీకృష్ణభగవానుడు భగవద్గీతలో చెప్పిన "మహర్షీణాం భృగురహం" అనే శ్లోక ఖండం తెలియజేస్తోంది.

భగవానుడు ఇలా భృగుమహర్షికి ఇంత ప్రాధాన్యం ఇవ్వడానికి ఒక కారణం ఉంది. భృగుమహర్షికి కర్దమ ప్రజాపతి కుమార్తె ఖ్యాతితో వివాహం అయింది. ఆమెకు పుట్టినదే మహాలక్ష్మి. ఆ మహాలక్ష్మిని శ్రీమన్నారాయణుడు వివాహమాడి 'లక్ష్మీకాంతుడు' 'తిరుమకల్ కేళ్వన్', 'శ్రియః పతి' అనే పేర్లతో పిలువబడ్డాడు. మహాలక్ష్మికి తన తండ్రి 'భృగు' మహర్షిననుసరించి 'భార్గవి'

**శ్రీవారి పర్యటనా వివరములు:** పరమహంస పరివ్రాజకులు **శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారు** అమెరికా నుండి **5-8-04** ఉదయం మద్రాసు వేంచేస్తారు. అక్కడ ఆరాధన పూర్తిచేసుకొని రాత్రికి నడిగడ్డపాలెం వేంచేస్తారు. 6వ తేదిన నడిగడ్డపాలెంలో **శ్రీశ్రీశ్రీ పెద్దజీయరు స్వామివారిని** సేవించుకొని సాయంత్రానికి సీతానగరమునకు వేంచేసి, 7వ తేది ఉదయం సీతానగరంలో తీర్థగోష్ఠి అనంతరం హైదరాబాద్ వేంచేస్తారు.

అనే పేరు ఏర్పడింది. భృగుమహర్షి శ్రీమన్నారాయణునికి మామగారు కదా! అందాలరాశి లక్ష్మీదేవిని కని, పెంచి, తనకిచ్చి వివాహం చేసి, ఇతర దేవతలను లక్ష్మీ హీనులు (తిరువిల్లా దేవర్ గళ్)గా చేసిన భృగుమహర్షియందు శ్రీమన్నారాయణునికి అంత గౌరవభావం ఉండడం సహజమే.

'అకల్‌గిల్లేన్ ఇఱైయుమ్" (నిన్ను విడచి ఒక క్షణం కూడ ఉండలేను) అని పరమాత్మ వక్షస్థలంలో వేంచేసి ఉండే లక్ష్మి (అలర్‌మేల్ మంగ) యొక్క కరుణాకటాక్షములకు నిరంతరము పాత్రమై ఆ ఆనందమును ఎఱిగిన పరమాత్మ "ఈమెను కన్న మహర్షి ఎంత పుణ్యాత్ముడో కదా" అని భావించి భృగు మహర్షిని గౌరవించినట్లు చెప్పవచ్చును.

సృష్టికి ఆరంభంలోనే అవతరించి, సుదీర్ఘకాలం చక్కని జీవితాన్ని గడిపి, భృగుమహర్షి సాధించిన అనేక ఘనకార్యాలు వేద, ఇతిహాస, పురాణకాలంలో విస్తారముగా చెప్పబడి ఉన్నాయి. ప్రపంచసృష్టికి జీవాధారమయిన అనేక తత్త్వములకు ఇతడే కారణ భూతుడుగా చెప్పబడ్డాడు. అనేకమంది మహర్షులకు శిష్యుడుగను, ఇట్లే అనేకమంది మహర్షులకు ఆచార్యుడుగను ఉండి ఈ మహర్షి కావించిన పవిత్రకార్యములు లెక్కించరానివి.

తైత్తిరీయ ఉపనిషత్‌లో 'భృగువల్లి' అనుభాగము ప్రసిద్ధమైనది. ఇందు చక్కని వేదాన్త విచారము చేయబడినది.

మహాభారతంలో **'భృగు భరద్వాజ సంవాదం'** అనే భాగం తత్త్వాన్ని ప్రతి పాదించడంలో సాటి లేనిది. ఇందు అడిగేవాడు భరద్వాజ మహర్షి. చెప్పేవాడు భృగుమహర్షి.

పవిత్రమైన మన భారతదేశంలో పుణ్య క్షేత్రాలు, పుణ్యతీర్థాలు, పుణ్యపర్వతాలు అనేకం ఉన్నాయి. వీటి అన్నిటియందు భృగుమహర్షి పేరు జోడించి చెప్పడం మనకు కనిపిస్తూ ఉంటుంది. భృగుతీర్థం, భృగుపుష్కరిణి, భృగు ప్రస్రవణం, భృగుతుఙ్గం, భృగుదేశం అని ఈనాటికి మనం వింటూ ఉన్నాం.

ఇట్టి భృగుమహర్షిని, తమ కులమూల పురుషునిగా పొందిన శ్రీవత్సగోత్రమునకు చెందిన వారు నిజంగా స్తవనీయులే.

వేదప్రసిద్ధి:- వేదాలలో భృగుమహర్షికి చాల ప్రాముఖ్యత ఉంది. "అంగీరసులు" అనువారు ఋషులలో ఒక భాగము భృగు పరంపరను గుఱించి చెప్పచూ వేదం **"భృగూణామఙ్గిరసాం తపసా తప్యధ్వమ్"** అంటుంది. అనగా భృగువులు, అంగిరసులు అను విభాగములవారు తపస్సులో శ్రేష్ఠులు. మీరు కూడ అట్టి తపమును ఆచరించబడి అని అర్థము.

భృగుమహర్షికి అగ్ని దేవతకు చాలదగ్గర సంబంధం ఉంది. అగ్నినుండే భృగుమహర్షి పుట్టినట్లు అనేక వేదమంత్రాలు తెలియ జేస్తున్నాయి. అగ్నిని రాజేయుట (మండింప జేయుటకు) సమిధను తెచ్చి హోమములు చేయుట, అగ్నితో మాటలాడుట మొదలగు విషయాలలో అత్యంత ఆసక్తికలవానినిగా ఈ భృగుమహర్షిని వేదం వర్ణిస్తోంది.

మొట్టమొదగా అగ్నిని దర్శించి దానిని లోకానికి అందించిన ఘనత భృగుమహర్షిదే. ఋగ్వేదంలో అగ్నికి ఉత్పత్తిస్థానాలు అనేక విధాలుగా చెప్పబడి ఉన్నాయి. ఆకాశము, తీగలు, లతలు, దట్టమైన పొదలు, జలము, అడవులు, ఓషధులు - వీటినుండి మనిషికి అత్యంత అవసరమైన అగ్ని బయలుదేరినదని. ఒక మంత్రం తెలియజేస్తోంది. సైన్సు, చరిత్ర చెప్పే అనేక విషయాలు ఇవి మనకు తెలియ చేస్తున్నాయి. నీటిలోనుండి అగ్నిని పుట్టించి లోకానికి అందించినది ఒక అద్భుత సంఘటన, దానిని సాధించినది భృగు మహర్షియే. నీటికి, నిప్పుకు బద్ధవైరం అన్న





విషయం అందరికీ తెలిసినదే. అది బాహ్యంగా గోచరించేది మాత్రమే. సైన్సు ప్రకారం ఆలోచించి చూస్తే నీటిలో నిప్పు దాగి ఉన్నట్లు తెలుస్తుంది. దానికి చక్కని ఆలోచనాశక్తి కావాలి. అవసరమైన పరిశోధనలు చేయగల గాలి. వీటికన్నిటికంటే ముఖ్యంగా నీటిలో నిప్పు ఉంటుంది అనే విశ్వాసం ఉండాలి. ఈ నీటి శాస్త్రజ్ఞులు అద్భుతంగా వీటిని నిర్వహించాలి. నీటిలో నుండి నిప్పును బయలు పరచి లోకమునకు అనేక విధములుగా ఉపకరించినారు. చరిత్రకు కూడ అందని చాల పూర్వకాలమే భృగుమహర్షి నీటిలో నుండి నిప్పు పుట్టుచున్నదని ఋజువుచేసి లోకానికి మార్గదర్శకుడయ్యాడు.

ఈ క్రింది ఋక్ వేదమంత్రం ఈ విషయాన్నే చెబుతోంది.

మం. **ఇమం విధన్తో అపాం సధస్థే**
**పశుం న నష్టం పదైరనుగ్మన్**
**గుహా చతన్త ముశిజో నమోభి**
**రిచ్ఛన్తోధీరా భృగవోవిన్దన్ ॥**
*(ఋ.వే10.46.2)*

మం॥ **ఇమం విధన్తో అపాం సధస్థే**
**ద్వితాదధుర్భృగవః** *ఋగ్వేదం 2.4.2*

భృగువంశీయులైన ఋషులు గొప్ప మేధావులు. మొక్కవోని అభినివేశము ఆలోచనాదార్ఢ్యము కలిగినవారు. వీరికి అగ్ని అంటే మహా ఇష్టం. ఆ అగ్నిని సేవించి ఆరాధించడంలో వీరి ఆసక్తి హద్దులు దాటి ఉంటుంది.

ఈ అగ్ని సులభంగా వెతికి పట్టుకోవడా నికి వీలులేని ప్రదేశంలో దాగి ఉన్నాడట. అదెక్కడో తెలసినుసా? నీటిలోనే. నీటిలో ప్రవేశించి, విడతీసి చూపడానికి వీలుకానట్లుగా కలిసిపోయాడు. ఇతరులెవరు ఈ రహస్యాన్ని తెలుసుకోలేకపోయాడు. ఎందుచేతనంటె మిగతావారికి అగ్నియందు అంతభక్తి శ్రద్ధలు లేకపోవడమే. భృగువంశీయులకు మేధస్సుతో పాటు ఆసక్తి కూడ అధికం. అందుచే వారు నీటిలో దాగి ఉన్న అగ్నిని కనిపెట్టి వెలువ రించారు. దీనికోసం వారు అనేక పరిశోధనలు చేశారు. చివరకు విజయం సాధించారు. ఆవో, గేదో, తప్పిపోతే యజమాని, పోతే పోయిందని సోమరిగా ఉండక, ఆ పశువు ఎక్కడెక్కడకు వెళ్ళడానికి అవకాశం ఉందో ఆ ప్రదేశాలకు వెళ్ళి వెతుకుతాడు గదా! మట్టిలో పడిన దాని పాదముద్రలను బట్టి అది ఎక్కడకు వెళ్ళి ఉండవచ్చు అన్నది ఊహిస్తాడు. ఆ మార్గంగా వెళ్ళి పశువును పట్టి తీసికొని వస్తాడు. అలాగే భృగువంశీయులు కూడ అనేక శ్రమలకోర్చి అవిశ్రాంతంగా వెతికి వెతికి నీటిలో దాగిన అగ్నిని బయట పెట్టారు.

మం. **ఔర్వ భృగు వచ్చుచిమప్నవాన వదా హువే,**
**అగ్నిం సముద్ వాసనమ్ ॥** *ఋ.వే. 8.102.4*

మం. **అయమిహ ప్రథమో ధాయి ధాతృభిర్హోతా**
**యజిష్ఠో అధ్వరే ష్వీడ్యః ।**
**యమప్నవానో భృగవో విరురుచిర్వనేషు**
**చిత్రం విభ్వం విశే విశే ॥** *ఋ.వే. 4.7.1*

"ఔర్వుడు, భృగు, అప్నవానుడు మొదలగు వారివలె అగ్నిని ఆహ్వానిస్తున్నాను. ఈ అగ్ని ప్రముఖుడుగా ఉన్నాడు. యాగం చేయు ఋత్విక్కులు ఈ అగ్నినే ముందుగా స్తుతిస్తున్నారు. అప్నవానుడు మొదలైన భృగువంశీయులు ఈ అగ్నిని పెంచి పోషించారు. సామాన్యజనం కోసం అనేక రూపాలు ధరించి వస్తాడు ఈ అగ్ని" అని దీని తాత్పర్యము.

ఇంకను అనేక మంత్రాలు ఈ భృగు వంశం వారికి అగ్నితోగల గాఢ స్నేహాను బంధాన్ని తెలియజేస్తున్నాయి. ఋగ్వేదము లోని అనేక సూక్తములను దర్శించి ఉపదేశించిన మహానుభావులనేకులు ఈ భృగువంశంలో ఉన్నారు.



# రామాయణంలో రమ్యగాథలు

-చెవుటూరి కుసుమ కుమారి, విజయవాడ.

## "లంకిణి వధ"

**"అథ సా హరిశార్దూలం**
**ప్రవిశన్తం మహాబలమ్,**
**నగరీ స్వేన రూపేణ**
**దదర్శ పవనాత్మజమ్"**

హనుమలోనికి ప్రవేశించుచుండగా, స్త్రీ రూపమునవున్న లంకానగరి(లంకిణి) చూచినది.

**"స్వయమేవోత్థితా తత్ర వికృతానన దర్శనా"**

వికృతమైన ముఖముతోనూ, క్రుద్ధ నేత్రాలతోనూ స్వయముగా పైకి లేచినది. ''ఓ వానరుడా! నీవెవరవు. ఏ కారణమున ఇక్కడకు వచ్చినావు? అభిగుప్తమై రావణ సైన్యముచేత రక్షింపబడుచున్న ఈలంకలోనికి నీవు ప్రవేశించలేవు. నేను నీ ప్రాణములు తీయకముందే నిజము చెప్పుమని గర్జించినది. అంతట హనుమ నేను నీకు యథార్థమునే చెప్పెదను. భయంకర నేత్రాలతో, వికృతరూపముతో లంకాద్వారము వద్ద నిలబడి నన్నడ్డగించి బెదిరించు నీవెవరో ముందుగా చెప్పుము" అనినాడు. నేను రాక్షస రాజైన రావణ రాజ్యమును రక్షించు లంకానగరిని, నన్నుకాదని నీవు ఈ లంకను ప్రవేశించలేవు. అని కామరూపిణియైన లంక వానరుడా! నిన్ను వెంటనే దీర్ఘనిద్ర పొందించెదను'' అని పలికినది. మేధావి అయిన హనుమ ఆమెనెదిరించుటకు సిద్ధపడి శరీరమును పర్వతసదృశం చేసి స్త్రీరూపంలో వున్న ఆ లంకతో ఇలా పలికినాడు. ''లంకానగర సౌందర్యాన్ని చూడవలెనని ఉద్యానవనములలో, అడవులలో విహరించ తలచి వచ్చినాను''. అని చెప్పగా ఓరీ వానరాధమా! "నన్ను జయించకుండా రావణ పాలిత లంకను ప్రవేశించ నీ తరముకాదు". అని గర్జించినది. "అమ్మా! నేను ఒక్కసారి లంకను జూచి వచ్చినదారినే వెళ్ళెదను'' అనగానే ఆ లంకిణి క్రుద్ధురాలై హనుమంతునిపై కురికి అరచేతితో ఒక దెబ్బ చరిచినది. ఆ తాడనమునకు క్రోధోద్దీపితుడైన హనుమ ఇప్పటివరకు స్త్రీవి కదా అని సహించినాను. ఇంక సహించనని పిడికిలి బిగించి ఒక ముష్టి ఘాతము నిచ్చినాడు. ఆ దెబ్బకు ఆ నిశాచరి వికృతమైన ముఖముతో ఒడలు తిరిగి, కళ్ళు తేలిపోవగా నేలన పడిపోయినది.

ఆమె నేలమీద పడుటను చూచిన హనుమ అయ్యో! "స్త్రీని కొట్టినాను కదా"! అని జాలిపడినాడు. ఆ దెబ్బకు ఎంతో భయపడిన లంక గద్గద కంఠంతో "ఓ మహాబాహూ! వానరశ్రేష్ఠా! నన్ను అనుగ్రహించి రక్షించు. నీవంటివారు స్త్రీని వధించరాదు అను నియమమును ఉల్లంఘించరు కదా! వీరుడవైన వానరా! నీవు నన్ను జయించినావు.

**"ఇదం తు తథ్యం శృణు వై**
**బ్రువన్త్యా మే హరీశ్వర,**
**స్వయంభువా పురా దత్తం**
**వరదానం యథా మమ"**

హే కపివరా! పూర్వము విధాత





నాకిచ్చిన వరమును గురించిన యదార్ధ విషయమును నీకు చెప్పుచున్నాను వినుము.

**"యదా త్వాం వానరః కశ్చిత్**
**విక్రమాద్వశ మానయేత్,**
**తదా త్వయా హి విజ్ఞేయం**
**రక్షసాం భయమాగతమ్"**

"ఏనాడు ఒక వానరుడు తన పరాక్రమము చేత నిన్ను జయిచునో ఆనాడే ఈ రాక్షసులకు భయపడవలశిన కాలము సమీపించినది అని తెలుసుకొనుము" అని. హే హరిశ్రేష్ఠా! నీ దర్శనముచేత ఆ కాలము ఇప్పుడు ఆసన్నమైనదని తలచుచున్నాను. బ్రహ్మావాక్కునకు తిరుగుండదు కదా!

సీతానిమిత్తమై దురాత్ముడైన లంకేశ్వరునకు, రాక్షసజాతికి కూడా వినాశకాలము దాపురించినది. కపివరా! నీవు నిశ్చితంగా లంకలో ప్రవేశించి, నీ ఇచ్ఛవచ్చిన రీతిన నీవు వచ్చిన కార్యము ముగించుకొని పొమ్ము.

**"ప్రవిశ్య శాపోపహతాం హరీశ్వర**
**శ్శుభాం పురీం రాక్షసరాజ పాలితామ్**
**యదృచ్ఛయా త్వం జనకాత్మజాం సతీం**
**విమార్గ సర్వత్ర గతో యథా సుఖమ్"**

"హరిసత్తమా! రావణపాలితమైన ఈ లంక (నందికేశ్వరుని) శాపోపహతమై వున్నది. అటువంటి ఈ లంకను ప్రవేశించినారీ శిరోమణి అయిన సీతాదేవిని అన్వేషించుము'. అని అంగీకరించి పంపినది.

మహాతేజశ్శాలి, మహాబాహువూ, అయిన వానరశ్రేష్ఠుడు హనుమ కామరూపీ, శ్రేష్ఠురాలు అయిన లంకను జయించి, శత్రువుల నగరిని ప్రవేశించునపుడు అనుసరించ వలసిన ఆచారమును అనుసరించి, ద్వారము లేని ప్రాకారము మీదినుండి లోనికి దుమికినాడు.

**"ప్రవిశ్య నగరీం లఙ్కాం**
**కపిరాజ హితం కరః,**
**చక్రేஉథ పాదం సవ్యం చ**
**శత్రూణాం సతు మూర్ధని"**

వానరరాజైన సుగ్రీవుని హితము కోరి వచ్చిన ఆ హనుమ లంకానగరమున ప్రవేశించి శత్రువుల శిరస్సుమీద తన ఎడమకాలూని నాడు.

**"ప్రయాణకాలే చ గృహప్రవేశే**
**వివాహకాలేஉపి చ దక్షిణాఙ్ఘ్రిమ్,**
**కృత్వాగతః శత్రుపురః ప్రవేశే**
**నిధ్యాత్సురతో నృపాలః"**

ప్రయాణ సమయమునందు, గృహ ప్రవేశమునందు, వివాహ సమయమున కుడికాలు ముందుంచి ప్రవేశించవలెను. శత్రువుల పట్టణమున ప్రవేశించునపుడు మాత్రము ఎడమ పాదము ముందుంచి ప్రవేశించవలెను పద్ధతిని అనుసరించిన అంజనానందనుడు సుగ్రీవుని హితముకోరి లంకాపట్టణమునకు అశుభసూచనగా తన ఎడమ పాదమును మోపినాడు.

ముత్యములతోనూ, పువ్వులతోనూ అలంకరించబడిన రాజమార్గమున నడిచి, వజ్రములు పొదిగిన కిటికీలు కలిగి అంకుశాకారముగా నిర్మింపబడినవి, వాద్యధ్వని పూరితములై, నవ్వులతో ప్రతిధ్వనిస్తున్నదీ అయిన లంకాపట్టణాన్ని పరిశీలిన్తూ ముందుకు సాగినాడు ఆ సుందరుడు (వానరుడు).

\ \ \

## "లంకానగరంలో కేసరినందనుని సీతాన్వేషణ"

స్వర్గమువలెనున్న ఆ లంకానగరంలో చంద్రుడుదయించినాడు. ఎల్లెడలా చీకటి నశించినది. పద్మాలలో, ఉదకములలో సాగరానవుండు లక్ష్మి చంద్రునాశ్రయించినది. వెండి పంజరంలోని హంసలా, మందర గిరి సింహంలా, మదించిన వృషభంలా, మహోన్నత శిఖరంలా, కరినెక్కిన వీరునిలా చంద్రుడు ప్రకాశించినాడు.

ఆ ధీమంతుడైన కపికుంజరుడు అంజనా సుతుడు లంకలో అనేక విధాలైన గృహాలను చూచాడు. అక్కడి గృహములన్నీ లక్ష్మితో ఓల లాడుతున్నాయి.

**"బుద్ధి ప్రదానాన్ రుచిరాభిధానాన్**
**సంశ్రద్ధ ధానాన్ జగతః ప్రదానాన్**
**నానా విధానాన్ రుచిరాభిధానాన్**
**దదర్శ తస్యాం పురి యాతుధానాన్"**

అక్కడ బుద్ధిశాలురు, శ్రద్ధావంతులు, మాటకారులు, విలక్షణ ప్రకృతులతో విరాజిల్లు వారు, అందమైన పేర్లు కలవారు, ఘనకార్య ములచేత జగత్తున ప్రసిద్ధులైనవారు, అయిన రాక్షసులను చూచినాడు. విద్యావంతులు, సద్గు ణవంతులు అయిన అనేకమంది రాక్షసులను చూచిన హనుమ ఎంతో ఆనందించినాడు. (విద్యా, సద్గుణ సంపదలను ఎక్కడ చూచినా అభినందించి ఆనందిచటం ఉత్తముల స్వభావం) తరువాత సీతాసుందరిని ఈ అంతః పుర నారీజనం మధ్యన వెదుకసాగాడు.

**"తతో వరార్హాః సువిశుద్ధ భావాః**
**తేషాం స్త్రియస్తత్ర మహానుభావాః**
**ప్రియేషు పానేషు చ సక్తభావా**
**దదర్శ తారా ఇవ సుప్రభావాః"**

అత్యుత్తమ గుణసంపద కలిగి యోగ్యురాళ్ళు అయినవారు, గొప్ప ప్రభావముకలిగి, భర్తలపై అనురాగాతిశయముగలవారు, నక్షత్రములవలే ప్రకాశించువారూ అయిన రాక్షసస్త్రీలమధ్య వెదుకసాగాడు. మేలిమి బంగారు మేని ఛాయ గల వారినీ, ఛామనఛాయ చానలను, సుమ సంకాశ సుకుమార సుందరీ మణులనూ, మేడల పైభాగములందు పతులతో సరస సంభాషణా సక్తులైన ఇంతులను చూచినాడు. కాని,

**"నత్వేవ సీతాం పరమాభిజాతాం**
**పథిస్థితే రాజ కులే ప్రయాతామ్**
**లతాం ప్రఫుల్లా మివ సాధు జాతాం**
**దదర్శ తన్వీం మనసాభిజాతామ్"**

ఆ హనుమన్తుడు ఇలా ఎందరో స్త్రీలు కను పించినారు గానీ, ధర్మమార్గ నిష్ఠితమైన రాజ వంశమున ప్రభవించినదీ, మహాసౌందర్య రాశి, సుకుమారి, అతి సనాతన ధర్మనిష్ఠకలదీ, రామచంద్రుని మనస్సున స్థిరమైన స్థానము కలదీ, స్త్రీలలోకెల్లా ఉత్తమురాలు, దట్టమైన కనురెప్పలతో స్నేహమాధుర్య కంఠస్వర ముతో నాట్యము చేయక నిలచివున్న మయూరిలా సర్వాభరణ భూషిత అయి నిలబడినదీ పుష్పించినలతవలే సుకుమారి. శ్రీరాముని ప్రియపత్ని అయిన సీతామాత ఎంతసేపు వెదకిననూ కనుపించక ఆ వానర శ్రేష్ఠుడు నిస్పృహచెందినాడు. ఉత్సాహము నశించి దుః ఖాక్రాంతుడైనాడు.

కాని కార్యదీక్షాదక్షుడైన హనుమ లంకా నగరమును మరొకసారి మరింత నిశితముగా పరశీలించవలెనని నిర్ణయించి నాడు. స్వేచ్ఛారూపి అయిన ఆ కపిశ్రేష్ఠుడు సింహరక్షితమైన మహారణ్యంలా భయంకర రాక్షసులచేత రక్షింపబడుతున్న రావణ గృహాన్ని నిశ్శబ్దంగా పరిశీలిస్తూ, ఒక భవనం మీదనుండి మరొక భవనం మీదకు దుము కుతూ, ఉద్యాన వనాలను కూడా పరిశీలిస్తూ, ముందుగా ప్రహస్తుని గృహం మీదికి దుమికి, అక్కడినుండి మహాపార్శ్వుని భవనంమీదకు, అక్కడనుండి మేఘసంకాశమైన కుంభకర్ణుని ప్రాసాదమును, అచటి నుండి విభీషణుని గృహమును, అదేవిధముగా విద్యున్మాలి, శుక, సారణ, ఇంద్రజిత్తుల గృహములకు కూడా వెళ్ళినాడు. ఇంకనూ జంబుమాలి మొదలైన వారి ఇళ్ళుకూడా పరిశీలించినాడు.

సీతాన్వేషణతో పాటు ఆ రాక్షస గృహాల సంపత్సమృద్ధినీ రక్షణ వ్యవస్థనూ కూడా పరిశీలించసాగినాడా రామదూత.

\\\





# శ్రీవిష్ణు మహాపురాణం

## 9వ అధ్యాయం

## దేవదానవోద్యమం-సముద్రమథనం

శ్రీ ఉ.వే. శ్రీమాన్ D.D. రంగరామానుజాచార్యస్వామి, రాజమండ్రి

ఇలా దేవదేవుడైన శ్రీమన్నారాయణుడు చెప్పగానే, దేవతలు అసురులతో సంధిచేసికొని అమృతసాధనం కోసం యత్నం సాగించారు.

అనేకౌషధాలను తెచ్చి క్షీరసాగరంలో వేశారు. మందర పర్వతాన్ని కవ్వంగాచేసి, వాసుకి అనే ఒక మహా సర్పాన్ని త్రాడుగాచేసి మథించడం ఆరంభించారు. భగవానుని నిర్దేశం ప్రకారం తోకవైపున దేవతలు, శిరోభాగాన దైత్యులు ఉండి రెండు వైపులా లాగుతూ మందరాన్ని త్రిప్పుతూ మథించడం సాగిస్తూ ఉండగా దైత్యులు వాసుకి ముఖం నుండి వెలువడిన విషవాయువులచే స్వప్రభ తరిగి, సహజంగా ఎంతో బలం కలవారంతా బలహీనులైనారు. ఇక తోకవైపున ఉన్న దేవతలకు బలం వృద్ధిచెందింది భగవదనుగ్రహంచేత.

క్షీరోద మధ్యంలో భగవానుడు తాను తాబేలుగా ఆకృతిని ధరించి, గిర్రున తిరుగుతున్న మందర పర్వతానికి ఆధారంగా ఏర్పడ్డాడు. మరొక రూపములో స్వామి, దేవతల మధ్యలో చేరి తాను స్వయంగా నాగరాజును లాగాడు. ఇలాగే దైత్యులమధ్యలో కూడా ప్రవేశించి పామును లాగి వారికి సహకరించాడు. కవ్వంగా ఏర్పడిన పర్వతానికి పైని తాను ఒకరూపంలో ఆక్రమించి పర్వతం తేలిపోకుండా నిలబెట్టాడు. మరొక అద్భుతము అదృశ్యము అయిన రూపంతో నాగరాజులో ప్రవేశించి ఆతని బలం తరుగకుండా పోషించాడు. ఇలా అంతా తానై అటు దైత్యులకు, ఇటు దేవతలకు, వాసుకికి అందరికీ బలాన్ని చేకూరుస్తూ స్వామి సముద్ర మథనకృత్యాన్ని స్వయంగా నిర్వహింపజేసాడు.

ఇలా మథిస్తున్నప్పుడు ముందుగా కామధేనువు ఆవిర్భవించింది. అందరూ ఆశ్చర్యపడేలా "వారుణి" అనే పానీయ ద్రవాన్ని చేతబట్టి ఒక స్త్రీ ఆవిర్భవించింది. ఆ తరువాత పరిమళాలు నలువైపులా వెదజల్లుతూ దేవపారిజాతం ఆవిర్భవించింది. ఆ తరువాత ఉదారరూప సంపదకల "దివ్యాప్సరోగణం", తరువాత చల్లని కిరణాలు వెదజల్లే చంద్రుడు ఆవిర్భవించాడు. దాన్ని పరమశివుడు స్వీకరించాడు. ఆ తరువాత విషం ఆవిర్భవించింది. దాన్ని సర్పాలు స్వీకరించాయి. అటుపిమ్మట శ్వేతాంబర ధారియై అమృతపూర్ణమైన కమండలు హస్తంతో దేవవైద్యుడైన ధన్వంతరి ఆవిర్భవించాడు.

దీన్ని వీక్షించి దేవతలు దైతేయ దానవులు మునిగణాలు ఆనందించాయి. ఆ తరువాత-

తతః స్ఫురత్ కాంతిమతీ
వికాసికమలే స్థితా।
శ్రీర్దేవీ పయసస్తస్మాత్
ఉద్భూతాధృతపంకజా ॥

కాంతులు దశదిశల వెదజల్లుతూ వికసించిన కమలంలో కూర్చొని పద్మహస్తయై లక్ష్మీ అమ్మవారు వెలుపలకు వచ్చింది. ఆమెను శ్రీ సూక్త విధానంతో మహర్షులు స్తుతించారు. విశ్వావసు ప్రముఖులైన గంధర్వులు గానంచేశారు. ఘృతాచి మొదలైన అప్సరసలు నర్తించారు. గంగాది నదులు అమ్మను స్నానం చేయించడానికి అక్కడ వచ్చి నిలచాయి. దిగ్గజాలు హేమపాత్రలతో నిర్మల జలాన్ని తీసికొని లక్ష్మీ అమ్మవారికి అభిషేచనం చేశాయి.



క్షీరసాగరుడు శరీరధారియై వచ్చి వసివాడని పద్మమాలను సమర్పించాడు. విశ్వకర్మ వివిధాలంకారాలను సమర్పించాడు.

ఈవిధంగా అభిషేచితయై, తల్లి దివ్యమాల్యాంబరాలు ధరించి, వివిధ భూషణ భూషితయై, దేవతలంతా చూస్తూ ఉండగా శ్రీహరి వక్షఃస్థలాన్ని చేరింది.

"తయా విలోకితా దేవా
హరివక్షః స్థలస్థయా।
లక్ష్మ్యా మైత్రేయ సహసా
పరాం నిర్వృతి మాగతాః ॥

ఉద్వేగం పరమం జగ్ముః
దైత్యా విష్ణు పరాఙ్ముఖాః।
త్యక్తా లక్ష్మ్యా మహాభాగ!
విప్రచిత్తి పురోగమాః ॥

ఈ మాటల్లో ఒక రహస్యం ఇమిడి ఉంది. అదేమిటంటే, ఎవ్వరు సత్త్వ గుణ సంపన్నులైన బహుజన ప్రయోజనాన్ని కాంక్షించే స్వభావం కలిగి ఉంటారో, ఎవరు భగవద్విద్వేషులు కారో వారికే ఐశ్వర్యం లభిస్తుంది. దాని కొరకు శ్రమపడవలసి వచ్చినా ఆ శ్రమకు తగిన ఫలాన్ని సాత్త్వికులైనవారే అనుభవింప గలుగుతారు. ఇక రాజసులు తామసులు అయిన వారు బహుజన ప్రయోజనాన్ని కాక స్వార్థాన్నే లక్ష్యంగా పెట్టుకొని, స్వార్థ సమీహతోనే ఏ ప్రయత్నమైనా చేస్తారు. వారికి దైవంమీద విశ్వాసం ఎంతమాత్రం ఉండదు. మీదుమిక్కిలి దైవవిద్వేషం ఉంటుంది. వీరలా శ్రమపడినా– ఫలాన్ని అనుభవింపవలసి వచ్చినప్పుడు వీరి స్వార్థభావన, ఇతరులకు ఎంతమాత్రం ఫలం దక్కగూడదన్న భావన, వీరిని వంచిస్తుంది. దేవతలు లక్ష్మి ఆవిర్భవించడాన్ని చూచి ఆనందించారు. ఆ లక్ష్మి తమకే కావాలనే దుర్భావన స్వార్థకామన వారిలో లేదు. అంతేకాక తానువడే శ్రమకు ఫలాన్నిచ్చేవాడు సర్వాంతర్యామి అయిన పరమాత్మ అని, ఆయన సహాయ సంపత్తులుంటేనే తాము





సాఫల్యాన్ని చెందగలమనే ధృఢమైన అధ్యవసాయం వారికి ఉంది. కనుకనే తల్లి ఆవిర్భవించి విష్ణు వక్షఃస్థలాన్ని పొందడమే వారు కాంక్షించారు. వీక్షించి ఆనందించారు. తల్లి కటాక్ష వీక్షణానికి నెలవైనారు. దానవుల ప్రవృత్తి వేరు. వీరెప్పుడూ తల్లిని– నారాయణుని నుండి వేరుచేసి భోగసాధనంగా స్వాయత్తపరచు కోవాలనే దుర్భావన కలిగే ఉంటారు. ఒకప్పుడు ఇలాంటి వారి దౌర్జన్యానికి లొంగినట్లు 'అమ్మ' కనిపించినా, అది తాత్కాలికమే తప్ప శాశ్వతం కాదు. హిరణ్యకశిపు, రావణ ప్రభృతులు, చివరికి బలిచక్రవర్తి వంటివారు కూడా శ్రీదేవిచే వంచితులు కావలసి వచ్చింది. "బలి"వంటి వారిలో కొంత సాత్త్వికతా లక్షణం దైవ నిర్ణయాన్ని గుర్తింపగల సామర్థ్యం ఉండటం వల్లనే తల్లి వారిని కూడా కటాక్షించింది. "విష్ణు పరాఙ్ముఖాః" అన్న విశేషణం వేసి విష్ణు పరాఙ్ముఖులైన వారిగతి ఇంతే! లక్ష్మి వారికి దూరమేనని పురాణకర్త సూచిస్తున్నాడు.

ఈనాటి సమాజంలో కూడా ఇతరులతో కలసి శ్రమపడేవారు కూడా స్వార్థచింతన కలిగి సాత్త్విక బుద్ధి కొరవడి, విష్ణువైముఖ్యం కలవారైతే, విష్ణువును ద్వేషించేవారైతే వారికి తాత్కాలికంగా ఐశ్వర్యం అబ్బినా అది ఎంతమాత్రం నిలబడదు. స్వార్థ పరాయణులకు కూడా ఇదేగతి.

ఇలా లక్ష్మి పరిత్యక్తులై దురాగ్రహానికి లోనై దానవులు ధన్వంతరి హస్తంలోని అమృత పూర్ణమైన కమండలువును లాగుకొని పోసాగారు. అప్పుడు, స్వామి తన మాయచే స్త్రీ రూపధారియై, వారిని మోహపుచ్చి వారినుండి అమృతాన్ని తాను స్వాయత్తపరచుకొని దేవతలకందించాడు.

బాహ్యరూప వ్యామోహితులైనవారు కూడా వంచితులు కావలసినదే–

ఇలా స్వామి అనుగ్రహంతో ఇంద్రాది దేవతలు అమృతాన్ని పరిగ్రహించి, బలవంతులై, తమపై దండెత్తి వచ్చిన దానవులను దునుమాడారు. ఇలా నారాయణానుగ్రహీతులైన దేవతలు విజయాన్ని పొంది భగవత్స్తవనం చేస్తూ దేవలోకానికి వెళ్ళారు. శ్రీవినష్టి వలన ఏర్పడిన దోషాలన్నీ తొలగిపోయాయి.

యాజకుల హోమాగ్నులు యథాపూర్వంగా ప్రజ్జ్వరిల్లినాయి. జ్యోతిస్సులు ప్రకాశించాయి. ధర్మమందు ప్రజల బుద్ధి కుదురుకున్నది. దేవేంద్రుడు యథాపూర్వంగా దేవ రాజ్యాన్ని పొంది మళ్ళీ 'ఇంద్ర' అనే సార్థక నామాన్ని పొందగలిగాడు–



**శ్రీమాన్ కడప చెన్నకేశవయ్యగారి సంవత్సరీక (ది. 23-8-2004) సందర్భంగా:** వీరు శ్రీస్వామివారి శిష్యులు. వీరి కుటుంబ సభ్యులు భక్తినివేదనకు కైంకర్యము సమర్పించారు. వీరు అనంతపురం జిల్లా ధర్మవరం వాస్తవ్యులు. వీరి కుటుంబానికి శ్రీస్వామివారి మంగళా శాసనములు అందజేస్తున్నాము.

–భక్తినివేదన

# శ్రీహయగ్రీవావతారము

**శ్రావణ శుద్ధ పౌర్ణమి 29.8.2004 ఆదివారము హయగ్రీవ జయంతిని పురస్కరించుకొని....**

**"జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్ ।
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే ॥"**

పురాణ, ఇతిహాసములలో ప్రసిద్ధములైన భగవానుని దశావతారాలలో ఒకటిగా హయగ్రీవుని అవతారము లెక్కింపక పోయినా వేదోద్ధరణకై సంభ వించిన ఈ హయగ్రీవావతారము చాల ముఖ్యమైనది. దేశికులు సంకల్ప సూర్యోదయ నాటక ప్రారంభంలో **"అనన్య భక్త్యున్మీలనీవ్ ఆదిమాం దేవతామభి గచ్ఛామి"** అని, తమ ఇష్టదైవమగు శ్రీహయగ్రీవుని స్తుతిస్తారు. అలాగే ఉత్తమూర్ స్వామి వ్యాఖ్యానంలో "హయగ్రీవస్తు అవతారమూర్తిత్వాత్ ఆదిమః విభవమూర్తిష్వాదిమశ్చ" అన్నారు. వేద సముద్ధరణకై జ్ఞానము, వాక్కు ఆచారమునాశ మొందక సాగునట్లు అనుగ్రహించడమునకై ఈ అవతారము "శ్రావణ శుద్ధ పౌర్ణమి"నాడు సంభవించినట్లు పెద్దలైన మహానుభావులచే వింటున్నాము.

భాగవతములోని 7వ అధ్యాయ మున బ్రహ్మ నారద సంవాదములలో భగవదవతారములను గూర్చియు, అందు శ్రీహయగ్రీవుడు బ్రహ్మచేసిన యజ్ఞమందు ఆవిర్భవించినట్లు తెలియుచున్నది. స్కాంధపురాణమున బ్రహ్మాది దేవతలచే ప్రార్థింపబడి అశ్వముఖుడై భగవానుడ వతరించినట్లు కలదు. ఇలా పురాణాల లోనే కాక పూర్వగాథాలహరిలోగూడ హయానన వృత్తాంతము ఈ విధంగా వ్రాయబడినది. ప్రళయకాలంలో విష్ణువు కొంతకాలము జలరాశిలో శయనించి పిదప సృష్టిని చేయదలచి నాభినుండి పద్మము, దానినుండి బ్రహ్మను సృజించెను. సృష్టికార్యమునకై బ్రహ్మకు వేదములనప్పగించెను. ఇట్లుండగా పరమాత్మచే సృష్టించబడిన రజస్తమోగుణ పూర్ణులైన మహాబలశాలురైన మధుకైటభులను ఇద్దరు రక్కసులు బ్రహ్మనుండి వేదములను అపహరించి పాతాళమునకు చేరిరి. అప్పుడు బ్రహ్మచే ప్రార్థింపబడిన భగవానుడు హయగ్రీవుడై పాతాళమునకేగి ప్రణవనాదము చేసెను. ఆ నాదము వచ్చిన దిశగా దానవులు పరిగెత్తిరి. భగవానుడు వేదములను తెచ్చి బ్రహ్మకు అప్పగించెను. మధుకైటభులు హయ గ్రీవునిచే యుద్ధమున మరణించిరి. ఈ కథ దేవీభాగవతమున కూడా కొద్ది మార్పులతో వర్ణించబడినది. దివ్యప్రబంధా లలో మన ఆళ్వారులు కొందరు హయగ్రీవ స్వామిని స్తోత్రము చేసినట్లు కనిపిస్తున్నది. లక్ష్మీయే విద్య (సరస్వతి)పేరున హయాననునికి ధర్మపత్ని గానున్నదని ఈ వాగ్దేవి ఈ స్వామికి పత్ని అని మల్లినాథ సూరి నైషధ వ్యాఖ్యానమున





తెలిపెను. జగన్నాథమను దివ్యక్షేత్రమున లక్ష్మియు, సరస్వతియు అచటి స్వామికి ఇరువైపుల దేవేరులుగా వెలసియుండుట స్పష్టపడు చున్నది. "కీర్తిః శ్రీః వాక్చ నారీణామ్" అను గీతావాక్యము ననుసరించి భగవానునకు వాగ్దేవియు ఒక పత్నియని తెలియుచున్నది. ఆమె అనుగ్రహమును పొందిన బ్రహ్మ దేవుని పత్నికి సరస్వతి, భారతి, వాణి మొదలగు పేర్లు ప్రసిద్ధములయి నవి.

ఈ స్వామి జ్ఞానము, వాక్కును అనుగ్రహించుటకై శంఖము, చక్రము, పుస్తకము, జ్ఞానముద్రను విష్ణురూపుడనని తెలుపుటకు చతుర్భుజుడై ఉండెను. బ్రహ్మాదులకే కాక మన పూర్వాచార్యులు పరకాలస్వామికిని, వేదాంత దేశికులకు కూడా తిరువహీంద్రపురంలోని ఔషధాద్రి శిఖరముననిష్టగా గారుడ మంత్రమును జపించగా గరుత్మంతుడు ప్రత్యక్షమై శ్రీహయగ్రీవ మంత్రమును ఉపదేశించె నట. ఆ మంత్రమును జపింపగా స్వామి హయగ్రీవమూర్తిగా ప్రత్యక్షమై పరిపూర్ణముగా అనుగ్రహించెనట. ఈ విధముగా అందరికీ ఆరాధనామూర్తిగా విలసిల్లు చున్నాడు.

రాజస స్వభావి అగు బ్రహ్మ వేద ములు పొందలేదని ఎంచి భగవానుడే శాస్త్రీయ విషయములను పాటించనవ సరము లేకయే హయగ్రీవ రూపమున ఆ బ్రహ్మకు వేదములను ప్రదానము చేసినాడట.

నవీన కాలమున పండిత జగన్నాథాదులు వాగర్థ సంపత్తిని హయ వదనుని ప్రసాదముననే పొందెనట. అందుకే ఉత్తమ జ్ఞానమును వాక్కును, ఉత్తీర్ణతను సకల శుభములను పొందు టకై విద్యార్థులు ఉపాధ్యాయులేకాక ప్రతిఒక్కరూ జ్ఞానాభిలాషులై ఈ స్వామి అనుగ్రహపాత్రులగుటకు శ్రీ వేదాంత దేశికులచే రచింపబడిన "హయగ్రీవ స్తోత్రము"ను పఠించిన చాలును. వీరి జయంతి శ్రావణశుద్ధ పౌర్ణమి. సర్వులకూ ఆచరణీయము. జ్ఞాన సంప్రత్ప్రదము.

**"హయగ్రీవ హయగ్రీవ
హయగ్రీవేతి యోవదేత్।
తస్య సంగచ్ఛతే వాణీ
జహ్ను కన్యా ప్రవాహవత్"** అన్నట్లు

ఆ స్వామి నామమును ఉచ్చరించినంత మాత్రము ననే వాక్కులు గంగా ప్రవాహమువలె జాలువారును. శ్రీహయగ్రీవయస్వామి జయంతి సర్వులకు ఆచరణీయము. జ్ఞానసంప్రత్ప్రదము.

జయ హయవదన!

## ముఖచిత్ర వివరణ

శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు రాష్ట్రవ్యాప్తంగా నిర్వహిస్తున్న "గీతాజ్యోతి" ప్రచారానికి ధర్మరథాన్ని శ్రీమాన్ పి. రామ్‌ప్రసాద్‌గారి ద్వారా బహూకరిస్తున్న ఆంధ్రాబ్యాంకు ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ శ్రీమాన్ ఆర్. బాలకృష్ణన్ గారు, వారి సౌహార్ద్రతను పరిమళించేలా చేసిన మంచి మనీషి శ్రీమాన్ ఎ.యల్. నాగేశ్వరరావుగారు ప్రభృతులు.

# నచికేతుడు

.....................గత సంచిక తరువాయి










# శ్రీమద్భాగవచ్ఛాస్త్రమ్

శ్రీ ఉ.వే.శ్రీమాన్ రమాకాంతాచార్యస్వామి - హైదరాబాద్

సంవర్తుడు కణ్వునిగూర్చి నూట యెనిమిది తంత్రములుగా పురాణమందు వింటిని. వాటిపేర్లను తెలిపెదవినుము. 1. పాద్మమ్, 2. పద్మోద్భవమ్, 3. మాయా వైభవమ్, 4. నలకూబరమ్, 5. త్రైలోక్య మోహనమ్, 6. విష్ణుతిలకమ్, 7. పరమ, 8. నారదీయమ్, 9. ధనదీయమ్, 10. వాసిష్ఠమ్, 11. పౌష్కరమ్, 12. సనత్కుమార, 13. సనక, 14. సత్య, 15. విశ్వ, 16. అనన్త, 17. మహీప్రశ్న, 18. శ్రీప్రశ్న, 19. పురుషోత్తమ, 20. మహేంద్ర, 21. పంచప్రశ్న, 22. తత్వసాగర, 23. వాగీశ, 24. సాత్వత, 25. ద్రవిణ, 26. శ్రీకర, 27. సంవర్త, 28. విష్ణు సిద్ధాంతం, 29. విష్ణుతంత్రం, 30. కౌమారం, 31. అహిర్బుధ్న్య, 32. విష్ణువైభవ, 33. సౌర, 34. సౌమ్య, 35. ఈశ్వర, 36. అనన్త, 37. భాగవత, 38. జయాఖ్య, 39. మూల, 40. పుష్టితంత్ర, 41. శౌనకీయ, 42. మారీచ, 43. దక్ష సంహితా, 44. ఉపేంద్ర, 45. యోగహృదయ, 46. హారీత, 47. పారమేశ్వర, 48. ఆత్రేయ, 49. మాందర, 50. విష్వక్సేన, 51. ఔశనస, 52. వైఖానస, 53. విహగేంద్ర, 54. భార్గవ, 55. పరమపురుష, 56. యాజ్ఞవల్క్య, 57. గౌతమ, 58. పౌలస్త్య, 59. శాకల, 60. జ్ఞానార్ణవ, 61. జామదగ్న్య, 62. యామ్య, 63. నారాయణ, 64. పారాశర, 65. జాబాల, 66. కాపిల, 67. వామన, 68. జయోత్తర, 69. బార్హస్పత్య, 70. జైమిని, 71. కాత్యాయన, 72. వాల్మీక, 73. ఔపగాయన, 74. హిరణ్యగర్భ, 75. అగస్త్య, 76. కాణ్వ, 77. బోధాయన, 78. భరద్వాజ, 79. నారసింహ, 80. గార్గ్య, 81. ఉత్తరపూర్వ, 82. శాతాతప, 83. అంగీరస, 84. కాశ్యప, 85. పైఙ్గల, 86. త్రైలోక్యవిజయ, 87. యోగ, 88. వాయవీయ, 89. వారుణ, 90. కృష్ణ, 91. అమ్బర, 92. ఆగ్నేయ, 93. మార్కండేయ, 94. మహాసనత్కుమార, 95. వ్యాస, 96. విష్ణు, 97. మార్కండేయనం, 98. పారిషద, 99. బ్రహ్మనారద, 100. శుకరుద్ర సంవాద, 101. ఉమామహేశ్వర సంవాద, 102. దత్తాత్రేయ, 103. శర్వ, 104. వారాహ మిహిర, 105. సంకర్షణ, 106, ప్రద్యుమ్న, 107. వామన, 108. కల్కి-రాఘవ, (ప్రాచేతస?) అనునవి నూటయెనిమిది నాచే తెలుపబడినవి. ఇవిగాక ఇంకను తంత్రము లున్నవి. అవియన్నియు ప్రత్యేకముగా మోక్ష సాధకములైనవే, మహామతులైన పెద్దలచే చెప్ప బడిన ఈ తంత్రనామముల తలచిన మాత్రమున మానవుడు సర్వపాపముల నుండి విముక్తుడగుచు. సనాతన పరబ్రహ్మమును పొందగలడు.





ఇట్లు శ్రీపాంచరాత్రమున మహోపనిషత్తు నందు పాద్మసంహితలోని జ్ఞానపాదమున, శాస్త్రావతరణమను మొదటి యధ్యాయము ముగిసినది.

సంవర్తుడిట్లనెను. ఓ పద్మనాగరాజా! పూర్వము నీవు వినియున్న తంత్రమును నన్నునుగ్రహించి నేర్పగోరెద. నాగరాజైన పద్ముడు పలికెను- ఓ బ్రహ్మర్షీ! లోకప్రసిద్ధమైన ఆ తంత్రమును చెప్పుచున్నాను. జ్ఞాన, యోగ క్రియా, చర్యాత్మకమై నాలుగు పాదములుగా విభజింపబడినది. రహస్యమైన ఈ తంత్రము ఆశ్చర్యకరమును, దివ్యమును ఐన ఈ శాస్త్రమును శ్రీకపిల మహర్షిచే, నేవింటిని. అది సంక్షిప్తమయినదయ్యు గొప్ప ప్రయోజనము చేకూర్చునది. సకల సిద్ధులు బడయుటకు గొప్ప సాధనముగూడ. ఒక కోటి యేబది లక్షల గ్రంథము భగవానునినుండి బ్రహ్మ వినెను. అతని నుండి క్షీరసాగరము నుండి అమృతమును బొందినట్లు ఈ శాస్త్రమున మొదట విజ్ఞాన పాదమున (విజ్ఞాన మనగా భగవానుని తెలిపెడిది అని అర్థము) సృష్టి క్రమమంతయు చెప్పబడుచున్నది. తదుపరి యోగపాదము, క్రియాపాదము, చర్యాపాదము అను నాలుగు విభాగములు- విజ్ఞానం భగవద్‌జ్ఞానం తద్‌జ్ఞానాన్ముక్తిరుచ్యతే; భగవానుని తెలియుటచే మోక్షప్రాప్తి కలుగును. అట్టి భగవద్రూపమెట్టిదన!

మొదలు, నడుమ, చివరలు లేక పెరుగుట, తరుగుటలు లేకయుండి ఎల్లప్పుడు తన స్థానమునుండి తొలగకయుండి సాటిలేని ప్రకాశముతో సర్వాభీష్టసిద్ధినొంది, ఎదురు లేని వాడై సమస్తరూపములు తానై, తనకొక రూపములేక పెనుచీకటి కవ్వల తరుగని సంపదలతో సమస్త సృష్టి, స్థితి, లయ ములకాది కారణమైన సనాతనునుండి రెండు చేతులు, ఒక ముఖముగల పరిశుద్ధ మైన పాలరాయివలె ప్రకాశించుచు, వేయి సూర్యాగ్నుల ప్రకాశమును, తాపమును గలిగియుండియు ఒక లక్షకోటి చంద్రుల వెన్నెలలబోలు కాంతిని ఆహ్లాదమును గలిగించుచు మరీచి చక్రమధ్య మునునుండి చక్రాది ఆయుధములు గుర్తులుగా శ్రీవత్స మను, ముక్కోణాకారముగల పుట్టుమచ్చ వక్షస్థలమున కుడిభాగమునందుగలిగి, కౌస్తుభమను మహారత్నమును నాయక మణిగా వక్షస్థలము నడుమ గలిగి, వనమాలచే నలంకరింపబడి, కిరీటము, అనేకహారములు, భుజకీర్తులు, కంకణములు అలంకరింపబడి పసుపురంగుగల పట్టు పుట్టము ధరించి, శాంతమూర్తియై మొట్ట మొదటి రూపమనదగు వానిని చూచెదము.

అతడే వాసుదేవుడు అని తెలియ దగును. ఆతని ముఖమునుండే సర్వము పుట్టినది. యోగులెల్లరును తమ హృదయ కమలాసనములందు ఆతనినే ధ్యానించు చుందురు. నిత్యసూరులందరూ ఎల్లవేళల దర్శించుచుందురో, అద్దియే మిక్కిలి విశిష్టమైన విష్ణుస్థానము. **"తద్విష్ణోః పరమం పదం సదా పశ్యన్తి సూరయః"** అని శ్రుతి వాక్యమునకర్థము. ఆ వాసుదేవుని నుండి

మరొక వాసుదేవరూపుడు కలిగెను. ఇతనికి తలయొక్కటేయైనను, నాలుగు బాహువులు, చక్రాద్యాయుధముల గుర్తులుగలిగి, రక్షణకై చక్ర, పద్మములను-సృష్టికొఅకు పాంచ జన్యమను శంఖమును, లయమొనర్చుటకు కౌమోదకియను గదాయుధమును ధరించి, శ్రీవత్సమను పుట్టుమచ్చ (ఇందు లక్ష్మిసదా వసియించి యుండును) అట్లే ప్రళయ కాలమున కౌస్తుభమణిలో సమస్త జీవులు ఒదిగియుందురని శాస్త్రనిర్ణయము) వనమాలాది సమస్త చిహ్నములు గలిగి యుండుటచే ఇద్దరికీ అభేదము. కాక మూలవాసుదేవుడు. స్ఫటిక వర్ణము (తెలుపు) కాగా అపర వాసుదేవుడు నెమలి కంఠము వంటి నీలివర్ణముగలవాడట! సహజమైన పసుపుపుట్టము ధరించిన వాసుదేవుడే, జన్మ, రక్షణ, నాశనము చేయుటేగాక జీవులకు మోక్షము నివ్వగలవాడు. అతడే తన సంకల్పముతో తనను రెండు రూపములుగా చేసుకొనెను. అందులోనొక రూపము వాసు దేవుడే! మూలవాసుదేవునివలె స్వచ్ఛమైన తెల్లని దేహముగలవాడు. రెండవ రూపము "నారాయణుడు" నీలమేఘశ్యాముడు. ఈ మూర్తులలో నారాయణ రూపముకన్న మొదటిదగు వాసుదేవునినుండి "సంకర్షణ ప్రద్యుమ్న, అనిరుద్ధ" మూర్తులుగా నేర్పడిరి. ఈ నాలుగు స్వరూపములు నాలుగు భుజములుగలవారే;

జ్ఞాన, శక్తి, బల, ఐశ్వర్య, వీర్య, తేజస్సు లనబడు గుణములు వాసుదేవుడు కలిగి యుండగా, జ్ఞానాధిక్యము గలిగినవాడు సంకర్షణమూర్తి. బలాధిక్యముగలవాడు ప్రద్యుమ్నుడు. ఐశ్వర్యాధికుడు అనిరుద్ధడు. ఇట్లీ నలుగురి నుండి ఇరువది నాలుగు మూర్తులేర్పడిరి. వీరందరూ దీపమునుండి మరియొక దీపము వెలిగించినవిధమున, అందరును పూర్ణులై, స్వశక్తి ప్రకాశముల వీడకయుండిరి. అందరునూ శంఖ, చక్ర, పద్మ, గదాధరులై నాలుగు భుజములతో నొప్పుచుండిరి. వ్యూహ వాసుదేవుని నుండి కేశవ, నారాయణ, మాధవరూపులును, సంకర్షణుని నుండి గోవింద, విష్ణు, మధు సూదన, రూపములు. ప్రద్యుమ్నుని నుండి త్రివిక్రమ, వామన, శ్రీధర మూర్తులు, అనిరుద్ధునినుండి హృషీకేశ, పద్మనాభ, దామోదరయను పండ్రెండు అంశలు గలవారైరి.

# పరమపద వార్త



శ్రీమతి **ముదునూరు వెంకటలక్ష్మి**గారు విజయనగర వాస్తవ్యులు. ది. 21-6-2004న పరమపదించిరి. వీరు శ్రీస్వామివారి దగ్గర సమాశ్రితులు. వీరు ముదునూరు సత్యనారాయణరాజు (M.S.N. రాజుగారు) గారి ధర్మపత్ని. వీరు విజయనగరం వికాసతరంగిణి ముఖ్యులు. శ్రీచిన్న జీయరుస్వామివారు వీరి కుటుంబానికి మంగళాశాసనం కృపచేసినారు.

**- భక్తినివేదన**







# బదరికాశ్రమం లో పునర్నిర్మించే సత్సంగసదనమునకు విరాళాలు సమర్పించిన దాతలు

**శ్రీమతి వి. కమలాదేవిగారు, వరంగల్‌ద్వారా**

**పోషకులు:**

**శ్రీమాన్ కొత్త అనంతరెడ్డి-నల్గొండ**

**జీవిత సభ్యులు:**

శ్రీమతి సరళా బిపిన్ లాపస్య యు.ఎస్.ఏ.;

**అభిమానులు:**

శ్రీమతి కె. సుజాతాదేవి-హైదరాబాద్; శ్రీమాన్ ఎ. వేంకటేశ్వరరావు, రాధమ్మ -నల్గొండ;

**శ్రీమాన్ బి. మురళీకృష్ణగారి ద్వారా:**

**పోషకులు:**

ఎస్.బి. వాత్స్యాచారి-హనుమకొండ;

**జీవిత సభ్యులు:**

శ్రీమాన్ సాయికిరణ్-హైదరాబాద్;

**అభిమానులు:**

శ్రీమాన్ శ్రీమాన్ తేలుకుంట మనోజ్‌రెడ్డి-సికింద్రాబాద్, శ్రీమాన్ కె. పురుషోత్తమ రెడ్డి, రంగాపురం.

**శ్రీమాన్ గుడిమెళ్ళ బదరీనాథ్‌గారు, నడిగడ్డపాలెం ద్వారా**

**పోషకులు:**

**వివేక విద్యాసంస్థ-తెనాలి; శ్రీమాన్ జంధ్యం రామారావు, కృష్ణకుమారి-తెనాలి(నిర్మాణానికి శ్రీమాన్ జంధ్యం రామారావు, కృష్ణకుమారి -తెనాలి (తదియారాధనకు);**

**శ్రీమాన్ M.R.K. ప్రసాద్‌గారు, గుంటూరుద్వారా:**

**పోషకులు:**

**శ్రీమాన్ గుడిశెట్ల వీరభద్రస్వామి-కాకినాడ; శ్రీమాన్ పెండేకంటి గౌరీప్రసాద్, లక్ష్మి -గుంటూరు;**

**జీవిత సభ్యులు:**

**గుంటూరు:-**

శ్రీమతి జి.ఎల్ సామ్రాజ్య తాయారమ్మ; శ్రీమాన్ బి. రామచంద్రరావు; శ్రీమతి మద్ది రామ కుమారి; శ్రీమాన్ కొత్తూరి వెంకట అప్పారావు;

శ్రీమాన్ ఎల్. రాఘవరావు-విజయవాడ; శ్రీమాన్ వి.డి.వి. రామచంద్రరావు-ఢిల్లీ; శ్రీమాన్ ఎమ్. రమేష్ ప్రసాద్, మీర-బెంగుళూరు; శ్రీమాన్ ఎమ్. శశిధర్-సికింద్రాబాద్; శ్రీమతి ఎమ్. లక్ష్మి కుమారి-సికింద్రాబాద్;

**అభిమానులు:**

**గుంటూరు:-** శ్రీమాన్ ఎమ్.ఆర్.కె. ప్రసాద్; శ్రీమాన్ కొనగళ్ళ వెంకటేశ్వరరావు, పార్వతి; శ్రీమాన్ కొనగళ్ళ వెంకటేశ్వరరావు, సాయి; శ్రీమాన్ ఎ. వెంకట మల్లిఖార్జునరావు; శ్రీమాన్ పువ్వాడ సాంబశివరావు; శ్రీమాన్ మద్ది గోవిందరెడ్డి; శ్రీమాన్ నిరంజన్‌లాల్; శ్రీమాన్ చేగు సత్యనారాయణ; శ్రీమాన్ సిహెచ్.

రామారావు; శ్రీమతి పి. పార్వతి; శ్రీమాన్ గండికోట వెంకటేశ్వర్లు; శ్రీమాన్ సిహెచ్. వెంకటసుబ్బయ్య; శ్రీమాన్ పారేపల్లి బాపనయ్య, సావిత్రి; శ్రీమాన్ పారేపల్లి సావిత్రి; శ్రీమతి జి. వజ్రమాల; శ్రీమాన్ అంజనాగరాజ మోహన్, రామసుందరి; శ్రీమతి సూర్యకుమారి; శ్రీమతి రేవతి నాగ సుబ్బరాణి; శ్రీమాన్ ఎమ్. వెంకటపతిరావు; శ్రీమాన్ టి. నాగేశ్వరరావు; శ్రీమాన్ టి. సుబ్బారావు; శ్రీమాన్ ఎ. నాగేశ్వరరావు; శ్రీమాన్ ఎన్.ఎస్. కృష్ణమూర్తి, అహల్య; శ్రీమాన్ డా॥ రాజేశ్వర శెట్టి; శ్రీమాన్ కె.ఎ. రాంబాబు; శ్రీమతి పి. అంకమ్మ; శ్రీమాన్ ఎ. లోకనాధరావు; శ్రీమాన్ ఎ. గోపాలకృష్ణమూర్తి; శ్రీమతి బి. హనుమాయమ్మ; శ్రీమాన్ కె. ధనుంజయం; శ్రీమాన్ వేమ సుబ్బారావు; శ్రీమాన్ నాళం గురవయ్య; శ్రీమాన్ తోట సాంబశివయ్య; శ్రీమాన్ నంది సాంబశివ; శ్రీమాన్ సి.హెచ్. పొన్నారావు; శ్రీమతి ఎమ్. సీతారామలక్ష్మి; శ్రీమాన్ బి. వరదయ్య; శ్రీమాన్ అల్లా లోకనాధరావు; శ్రీమతి జె. రాధమ్మ; శ్రీమతి సౌభాగ్యమ్మ; శ్రీమతి మద్దాల శ్రీవల్లి; శ్రీమతి మద్దాల శాంతకుమారి; శ్రీమతి మద్దాల పద్మజ; శ్రీమతి మద్దాల మాధవి; శ్రీమతి మద్దాల హైమావతి; శ్రీమతి మద్దాల సుగుణవతి, శ్రీమతి మద్దాల మహేశ్వరి; శ్రీమాన్ డి. వెంకట ఝాన్సీలక్ష్మి; మెద్దివారి అన్నసత్రం; శ్రీమాన్ చందోలు వెంకట సాంబశివరావు; శ్రీమాన్ వి. లక్ష్మి నరసింహారావు; శ్రీమాన్ ఎ. వెంకటస్వామి; శ్రీమాన్ ఎస్.బి.రామానాయుడు మరియు పదిమంది భక్తులు; శ్రీమతి తినేమల పద్మావతి; శ్రీమాన్ కె. విశ్వనాధం; శ్రీమాన్ తిరుమలశెట్టి పాపారావు; శ్రీమతి మాచరాజు అన్నపూర్ణమ్మ; శ్రీమాన్ ఎమ్. జగన్‌మోహనరావు; శ్రీమాన్ మద్ది రంగనాథ కుమార్; శ్రీమాన్ చింతగుంట వెంకట సుబ్బారావు;

శ్రీమాన్ జె. రామారావు, కృష్ణకుమారి–తెనాలి; శ్రీమాన్ బి. నరసింహారావు, మహాలక్ష్మి–బందరు; శ్రీమాన్ జె. మధు సూధనరావు–ఏలూరు;

**బెంగుళూరు:–** శ్రీమాన్ శ్రీమతి సత్యవతి; శ్రీమాన్ బి.సిహెచ్. అనీల్‌కుమార్; శ్రీమాన్ డా॥ రాజేశ్వరరావు, తేజ; శ్రీమాన్ ఎమ్. నరేందర్; శ్రీమాన్ ఎమ్. రాజేష్ ప్రసాద్, మిత్ర; శ్రీమాన్ ఎస్. నరేందర్; శ్రీమతి ఎమ్. ఇందిర;

**సీతానగరం ఆఫీస్ ద్వారా:**

**పోషకులు:**

**శ్రీమతి కుదరవల్లి రామకోటేశ్వరమ్మ–ఏలూరు;**

**జీవిత సభ్యులు:–**

శ్రీమాన్ డా॥ ఆర్ నరసింహారావు–ఖమ్మం; శ్రీమాన్ సీతారామిరెడ్డి–ఖమ్మం; పెండ్యాల శ్రీనివాస్–విశాఖ పట్నం; శ్రీమతి డి.బి. రాజేశ్వరి–సాలిగ్రామపురం; శ్రీమాన్ అక్కిరాజు శివకుమార్–హైదరాబాద్; శ్రీమాన్ పి. కృష్ణారావు–నెల్లూరు; శ్రీమాన్ ఎమ్.ఎన్.





శ్రీమన్నారాయణాచార్యులు–మామిళ్ళ గూడెం; శ్రీమాన్ టి. రామనాథం– హైదరాబాద్; శ్రీమాన్ కె. కృష్ణ భగవాన్– నూజివీడు; శ్రీమాన్ సిహెచ్. కృష్ణమూర్తి– ఖమ్మం; శ్రీమాన్ పి. వెంకటేశ్వరరావు– ఖమ్మం; శ్రీమాన్ ఎన్. శివప్రసాద్–వరంగల్; శ్రీమాన్ ఆర్. అశోక్ కుమార్–ఖమ్మం; శ్రీమాన్ సిహెచ్. జనార్దన్–అశ్వరావుపేట; శ్రీమతి వేదవల్లి అరుణ–ఖమ్మం; శ్రీమాన్ పి. హేమంత్‌కుమార్, శివనాగజ్యోతి– ఖమ్మం; శ్రీమాన్ డా॥పి. ఆదిశంకరరావు–ఖమ్మం; శ్రీమాన్ ఎమ్. గీతాచార్యులు బ్రదర్స్–ఖమ్మం; శ్రీమాన్ పి. సత్యన్నారాయణ, జయలక్ష్మి–ఖమ్మం; శ్రీమాన్ శ్రీరంగం మాధవయ్య–మరిపేడ; శ్రీమాన్ జి. బుచ్చిరాజు, లక్ష్మీజయప్రద–కైకలూరు;

**అభిమానులు:–**

శ్రీమాన్ సూరారెడ్డి, సూరాయమ్మ–పాలమూరు; శ్రీమాన్ ఎన్. బసివిరెడ్డి, భానుమతి–పాలమూరు; శ్రీమాన్ డి.వెంకటరెడ్డి, ఆదిలక్ష్మి–గొల్లలమామిడాల; శ్రీమతి ఎన్. జయలక్ష్మి–విజయవాడ; శ్రీమతి తులసీరత్నం–కాకినాడ; పి. వెంకటలక్ష్మి–కాకినాడ; శ్రీమాన్ కె. సూర్యనారాయణ, ఆదిలక్ష్మి– విశాఖపట్టణం; శ్రీమాన్ కె. షణ్ముఖరెడ్డి–మందూరు; శ్రీమతి ఇ. పిచ్చమ్మ–చుండూరు; శ్రీమాన్ ఆర్. వీర్రాజు, సూర్యకాంతం–రాజోలు; శ్రీమాన్ రాయపురెడ్డి సత్యారావు– మద్దిలపాలెం; శ్రీమాన్ గొల్లపూడి వెంకటసుబ్బారావు–జాంగ్రపేట; శ్రీమతి ఎమ్. కనకమ్మ,బుచ్చయమ్మ–కుంకలమర్రి; శ్రీమతి సి.హెచ్. పార్వతి–చుండూరు; శ్రీమాన్ జాన్ అప్పారావు–పుల్లపల్లి; శ్రీమాన్ కె. సతీష్ కుమార్–విజయనగరం; శ్రీమాన్ పి.మదన కుమార్– విజయనగరం; శ్రీమాన్ ఆర్. సత్యనారాయణ–నర్సరావుపేట; శ్రీమాన్ కె. శేషావతారం–విజయనగరం; శ్రీమాన్ డి.వి.ఎస్.ఆర్. ఆచార్య–విజయనగరం; శ్రీమాన్ పి. వెంకటాచార్యులు –కొత్తవలస; శ్రీమాన్ వి. జగన్నాథం & కంపెనీ–విజయ నగరం; శ్రీమాన్ ఐ. వెంకట నాగేశ్వరరావు– ఏలూరు; శ్రీమాన్ ఎమ్.వి. మణిభూషణ రావు–విజయనగరం; శ్రీమాన్ కె. రామారావు, భారతి–ఖమ్మం; శ్రీమతి డి. వెంకట శేషాయమ్మ–చిత్రాద; శ్రీమాన్ కె. రమణయ్య,భారతి–వరంగల్; శ్రీమాన్ టి. సీతారామయ్య–ఖమ్మం; శ్రీమాన్ కె. లక్ష్మయ్య, కమలమ్మ –అమ్మపేట; శ్రీమాన్ కె. శంకరయ్య–లకినపల్లి; శ్రీమాన్ పి. పుల్లయ్య, సులోచన–దూగొండి; శ్రీమాన్ దేవిశెట్టి ప్రసాదరావు, చిట్టెమ్మ–పాల్వంచ; శ్రీమతి జి. సుశీల–కొత్తగూడెం; శ్రీమతి సిహెచ్ కమలాదేవి–కరీంనగర్; శ్రీమాన్ సిహెచ్ రాఘవేందర్‌రావు, సులోచన– హైదరాబాద్; శ్రీమాన్ రఘుపతిరావు, ఉమాదేవి–హైదరాబాద్; శ్రీమాన్ కె.వి. రాజు, జ్యోతి–సికిందరాబాద్; శ్రీమాన్ సిహెచ్ నితిన్‌కుమార్–సికిందరాబాద్; శ్రీమాన్ వై.

➸➸➸

వెంకటేశ్వరరావు-తమ్మరబండ పాలెం; శ్రీమాన్ బి. నరసింహారావు-ఖమ్మం; శ్రీమాన్ వి.వెంకన్న, లక్ష్మీకాంతం-ఖమ్మం; శ్రీమాన్ ఎమ్. నాగేశ్వరరావు-మామిళ్ళ గూడెం; శ్రీమాన్ ఆర్ వెంకయ్య-మోతె; శ్రీమాన్ ఆర్. సత్యన్నారాయణ -మోతె; శ్రీమాన్ వి. సత్యన్నారాయణ- మామిళ్ళగూడెం; శ్రీమతి జి. లక్ష్మీనరసమ్మ- మామిళ్ళగూడెం; శ్రీమాన్ ఎమ్. కమలాకరరావు-ఖమ్మం; శ్రీమాన్ వి. శ్యామసుందర్, రాజ్యలక్ష్మి-ఖమ్మం; శ్రీమాన్ వి. రామయ్య- ఖమ్మం; శ్రీమాన్ పి. లక్ష్మీప్రసాద్-ఖమ్మం; శ్రీమాన్ కె. శ్రీనివాసాచార్యులు-విజయవాడ; శ్రీమాన్ వి.ఎల్.వి. వి.ఎల్.ఎన్. ఆచార్యులు-గడ్డిఅన్నారం; శ్రీమతి సంపూర్ణమ్మ-కలువపాముల; శ్రీమాన్ సిహెచ్. ఎన్. వెంకట్రావు-ఖమ్మం; శ్రీమతి ఎమ్ ఆదిలక్ష్మి-అల్లాపురం; శ్రీమతి. పి. రోశమ్మ- నల్గొండ;

**ఖమ్మం :-** శ్రీమతి వి. బిషయమ్మ; శ్రీమాన్ బి. నాగార్జున సింగ్; శ్రీమతి పి. భారతీదేవి; శ్రీమాన్ సిహెచ్. తులసీరాం; శ్రీమాన్ పి. శ్రీమన్నారాయణ; శ్రీమాన్ జి. పాండురంగారావు; శ్రీమాన్ వి. వెంకట్రావు; శ్రీమాన్ కె. వీర రాఘవులు-ఖమ్మం; శ్రీమాన్ పి. సుబ్బారావు, ప్రమీల; శ్రీమాన్ బి. రంగారావు, జయలక్ష్మి; శ్రీమాన్ బి. వెంకయ్య, అనసూయమ్మ; శ్రీమాన్ పి. సుబ్బారావు; శ్రీమతి టి.పద్మావతి; శ్రీమాన్ ఎన్. రామానుజాచార్యులు; శ్రీమతి ఎన్ కమలమ్మ-ఖమ్మం; శ్రీమాన్ జి. లక్ష్మణమూర్తి-ఖమ్మం; శ్రీమాన్ పి. రోహన్; శ్రీమాన్ ఇ. రాజారావు; శ్రీమతి సుధారాణి; శ్రీమాన్ నెల్లూరు లక్ష్మయ్య;శ్రీమాన్ జవ్వాజి నరసింహారావు- మామిళ్ళగూడెం; శ్రీమాన్ సామినేని సతీష్-తిమ్మనేని పాలెం; శ్రీమాన్ నారాయణ, కృష్ణమోహన్- దోర్నకల్; శ్రీమాన్ సేతు నాగరాజు, వెంకట కామేశ్వరి-గుంటూరు; శ్రీమాన్ ఎమ్ రామకృష్ణ-గుంటూరు; శ్రీమాన్ బి.వి. శివకుమార్-ఖమ్మం; శ్రీమతి సత్యవతమ్మ- హైదరాబాద్; శ్రీమాన్ డా॥ సి. పరమేశ్వర్- కామారెడ్డి; శ్రీమతి వి. శశికళ- వేల్పూరు; శ్రీమాన్ పెనుగొండ అనగారావు; శ్రీమాన్ పి. వెంకటేశ్వరరావు-ఖమ్మం; శ్రీమాన్ ఎడ్లరాములు-ఖమ్మం; శ్రీమతి సిహెచ్ అరుణ-హైదరాబాద్; శ్రీమాన్ ఎ. విశ్వనాథం, చంద్రకళ-ధర్మసాగర్; శ్రీమాన్ ఉమా ప్రకాశరావు- ఈలపాక; శ్రీమాన్ బి. నరసింహ, వీరమ్మ- నరంపేట; శ్రీమతి తోట రత్నమ్మ-నెల్లూరు; శ్రీమాన్ లక్ష్మీనారాయణ -నెల్లూరు; శ్రీమాన్ కె. శేషయ్య- నెల్లూరు; శ్రీమాన్ దగ్గుపాటి వెంకట సుబ్బయ్య-నెల్లూరు; శ్రీమతి వై. శ్రీవైష్ణవి-నెల్లూరు; శ్రీమతి ఎల్లా అఖిలాండేశ్వరి-హైదరాబాద్; శ్రీమాన్ ఐ. వీరలింగం, స్వరాజ్యం-నరసరావుపేట; శ్రీమతి బి. లక్ష్మీబాయి-నుడుంబల్గొండ; శ్రీమాన్ పి.ఎల్.ఎన్. ఆచార్యులు-జగ్గయ్యపేట; శ్రీమాన్ వి.ఎల్.ఎన్. దీక్షితులు-విజయవాడ; శ్రీమతి శేషమ్మ-భీమవరం; శ్రీమాన్ ఎ. వెంకట





చలపతి- సరసమ్మ; శ్రీమతి జి. సరోజిని-మంగళగిరి; శ్రీమతి నాగలక్ష్మి- విశాఖ పట్నం; శ్రీమాన్ ఎన్. సూర్యనారాయణమూర్తి-గణపవరం; శ్రీమాన్ ఇ. రామన్న- ఉంగుటూరు; శ్రీమాన్ కె. వెంకట రామయ్య-విసాకోడేరు; శ్రీమతి కె. వెంకటలక్ష్మి-విసాకోడేరు; శ్రీమాన్ టి. అమ్మిరెడ్డి-కుతుకులూరు; శ్రీమాన్ ఎస్. రవీందర్-ఖమ్మం; శ్రీమాన్ వి.వి.ఎన్. ప్రసన్నకుమార్-సికిందరాబాద్; శ్రీమాన్ జెడ్. చిన్నయ్య-అనసారం; శ్రీమాన్ పి. కోటేశ్వరరావు- ముజ్జగూడెం; శ్రీమాన్ వి. మల్లయ్య-వైరా; శ్రీమాన్ పి. నాగేశ్వరరావు-కంకిపాడు; శ్రీమతి పి. పుష్పావతి-గుంటూరు; శ్రీమాన్ టి. మోహన్‌రావు-హైదరాబాద్; శ్రీమతి భాగ్యలక్ష్మిరామానుజ దాసి- విజయవాడ; శ్రీమాన్ జి. లక్ష్మణమూర్తి-ఖమ్మం; శ్రీమతి కె. శకుంతల -హైదరాబాద్ శ్రీమాన్ జి. వీరాస్వామి-ఖమ్మం; శ్రీమాన్ కృష్ణస్వామిరావు-హెచ్చముక్కల; శ్రీమాన్ ఐ రామకృష్ణ, స్వరూప-ఎల్లెందు; శ్రీమాన్ ఎన్.శ్రీనివాస్-ఖమ్మం, శ్రీమాన్ బి. సాంబిరెడ్డి-ఖమ్మం; శ్రీమాన్ బాలవెంకటశ్రీహరి-ఖమ్మం; శ్రీమాన్ వై. శ్రీధరరెడ్డి-హైదరాబాద్; శ్రీమాన్ వి.వి.కృష్ణారావు- ఖమ్మం; శ్రీమాన్ ఇ.వి.ఎల్.ప్రసాద్-భద్రాచలం; శ్రీమాన్ ప్రదీప్-భద్రాచలం; శ్రీమాన్ కోట్లమాధవ రావు-ఖమ్మం; శ్రీమాన్ ఎస్.వేణుగోపాలా చార్యులు- నల్గొండ; శ్రీమాన్ ఎర్రా వేదవ్యాస్-ఖమ్మం; శ్రీమాన్ ఎర్రా రాజీవ్-ఖమ్మం; శ్రీమతి బండ్లదీపిక-ఖమ్మం; శ్రీమాన్ మండెపూడి ప్రమోద్-ఖమ్మం; శ్రీమాన్ పి.గురునాథశాస్త్రి-ఖమ్మం; శ్రీమతి అనంతేశ్వరమ్మ-ఖమ్మం; శ్రీమాన్ ఎన్.రామ చంద్ర- మోదుగులగూడెం; శ్రీమాన్ ఆర్.బాలకృష్ణ-ఖమ్మం; శ్రీమాన్ సి.హెచ్. రామకృష్ణారావు-ఖమ్మం; శ్రీమాన్ పి.కృష్ణ కుమార్-గోదావరిఖని; శ్రీమాన్ ఆర్.వెంకట నరసింహారావు-ఖమ్మం; శ్రీమాన్ నందివాడ సీతారం-ఖమ్మం; శ్రీమాన్ టి.బాలాజీ-యు.ఎస్.ఏ; శ్రీమాన్ బందారు శివరామకృష్ణ-మామిళ్ళగూడెం; శ్రీమాన్ పి.బాపిరాజు-భీమవరం; శ్రీమాన్ ఎస్.సునీల్‌కుమార్, సునీత-అంబూర్; శ్రీమాన్ ఎ.ఎన్.కృష్ణమూర్తి-టుటికార్న్; శ్రీమాన్ బాబు, సరస్వతి; శ్రీమాన్ ఎమ్.రవన్న -చుండూరు; శ్రీమాన్ టి.వెంకట రాజు-పెదబ్రహ్మదేవం; శ్రీమతి జి.లక్ష్మి, వెంకయ్య-పలాస; శ్రీమాన్ ఎ.రామచంద్ర, రత్నమాల-బొంబాయి; శ్రీమతి ఆర్.రమాదేవి -గుంటూరు; శ్రీమాన్ ఐలూరిశ్రీనివాసులు -కర్నూలు; శ్రీమాన్ ఐ.నరసయ్య-కర్నూలు; శ్రీమాన్ ఎమ్.బలరామశెట్టి-కర్నూలు; శ్రీమాన్ కె.కృష్ణమూర్తి-కర్నూలు; శ్రీమాన్ ఎ.సుబ్రహ్మణ్యం-ఆళ్ళగడ్డ; శ్రీమాన్ కంటకం శేషయ్య,శ్రీదేవి-కర్నూలు; శ్రీమాన్ ఎస్.హర నాథబాబు, కమలావతి-వింజారం; శ్రీమాన్ కె.గురురాజారావు,ఇందిర-హైదరాబాద్; శ్రీమతి జి. రంగనాయకమ్మ- హైదరాబాద్; శ్రీమాన్ చెన్నయ నాయుడు, తిరుపతమ్మ-

కమ్మపాలెం; శ్రీమాన్ బి.చెన్న కృష్ణయ్య-కృష్ణాపురం; శ్రీమాన్ ఎన్.వి.రావు-హైదరాబాద్; శ్రీమతి ఏలూరు కొండమ్మ-అనంతపురం; శ్రీమతి కె.యశోదమ్మ-గార్లదిన్నె; శ్రీమతి కె.సీతాయమ్మ-వడ్లూరు; శ్రీమతి కె.జయలక్ష్మి-వడ్లూరు; శ్రీమాన్ ఎ.రామరాజు, లక్ష్మి-హైదరాబాద్; శ్రీమాన్ డి.సంగమేశ్వర ప్రదీప్-అనంతపురం; శ్రీమతి బి.మాధవీలత- అనంతపురం; శ్రీమతి ఐ. విజయలక్ష్మి -వలసపాకల; శ్రీమాన్ ఎస్.నీల కంఠప్ప, పార్వతమ్మ-అనంతపురం; శ్రీమతి కె.శారద-కోడూరు; శ్రీమతి ఎ.స్వరాజ్యం- భట్లెలంక; శ్రీమతి డి.భద్రమ్మ-పిప్పర; శ్రీమతి ఎస్.కె. పార్వతి-హైదరాబాద్; శ్రీమాన్ జి.గొల్లరాజు-పార్వతీపురం; శ్రీమాన్ జె.రాజయ్య, కళావతి-నిజామాబాద్; శ్రీమాన్ బి. శ్రీరామచంద్ర మూర్తి-భీమవరం; శ్రీమాన్ డా॥ ఎమ్.వి.వి. మురళీమోహన్ -అనకాపల్లి; శ్రీమాన్ ఆర్. సోమరాజు-తాపేశ్వరం; శ్రీమతి ఆర్. మంగాయమ్మ-తాపేశ్వరం; శ్రీమాన్ ఎమ్.రామారావు-పిడుగురాళ్ళ; శ్రీమాన్ ఎమ్.సత్యనారాయణ,కస్తూరిబాయి-ఇల్లెందు; శ్రీ రాజగోవింద భజన్ సమాజం-విజయవాడ; శ్రీమాన్ జి.బాబూరావు-కాకినాడ; శ్రీమాన్ లక్ష్మణరావు-కాశీనగర్; శ్రీమాన్ జి.వెంకట నరసింహాచార్యులు-సీతారాంపురం; శ్రీమాన్ జక్కా సత్యనారాయణ-బదన్‌పూర్; శ్రీమాన్ టి.దేవదాస్,లక్ష్మి-చండీపుట్; శ్రీమతి ఎమ్.లక్ష్మీ ప్రశాంతి-పిడుగురాళ్ళ; శ్రీమాన్ ఎస్.కన్నారావు-కంచరపాలెం; శ్రీమాన్ సి.హెచ్. బాపన్నపాపాయమ్మ-పెహోపురం;

శ్రీమతి కొండవీటి నాగఉష-పెహోపురం; శ్రీమాన్ సి.హెచ్. సత్యనారాయణ, మంగాయమ్మ-పెహోపురం; శ్రీమాన్ వై. పట్టాభి రామన్న-పెద్దపూడి; శ్రీమాన్ కొండవీటి కృష్ణమూర్తి-పెద్దపూడి; శ్రీమాన్ సి.హెచ్. రామారావు, వీర రాఘవమ్మ-సామర్లకోట; శ్రీమాన్ ఎమ్. రామకృష్ణ, లక్ష్మి-పెద్దపూడి; శ్రీమతి కె. జానకమ్మ- షెహపురం; శ్రీమాన్ ఎమ్. వెంకన్న,లక్ష్మి- జి. మేడపాడు; శ్రీమాన్ పి. వెంకటరావు-సామర్లకోట; శ్రీమాన్ ఓ.వీర వెంకటరావు-షెహోపురం; శ్రీమాన్ జి. లక్ష్మినారాయణ-షెహోపురం; శ్రీమాన్ సి. హెచ్. సుబ్రహ్మమణ్యం-రామచంద్రాపురం; శ్రీమాన్ వై. సత్యరాజు-పెదపూడి; శ్రీమాన్ వై. సీతారామయ్య -కారంచేడు; శ్రీమాన్ హరిప్రసాద్,శ్రీలక్ష్మి -కారంచేడు; శ్రీమతి జమునదాసి-బీర్గంజి; శ్రీమతి ఎల్. కుమారిదాసి-బీర్గంజి; శ్రీమతి విష్ణుప్రియ దాసి-బీర్గంజి; శ్రీమతి ఎమ్. గంగమ్మ, వెంకటేశం-హైదరాబాద్; శ్రీమాన్ ఎ. శంకరయ్య-కరీంనగర్; శ్రీమాన్ ఆర్. శేఖరయ్య-సిరిసిల్ల; శ్రీమాన్ సి.హెచ్. శంకరయ్య-సిరిసిల్ల; శ్రీమాన్ ఎన్.వి. ఆర్.ఎల్. తిరుమలాచార్యులు- తారాపూర్; శ్రీమాన్ పి. మాధవరెడ్డి-గద్వేల్; శంశుషా-హైదరాబాద్; శ్రీమతి టి. అరుణకుమారి-హైదరాబాద్; శ్రీమతి ఎమ్.ఇందిర, నరసింహాచార్యులు-యాదగిరిగుట్ట; శ్రీమతి ఎన్.కమల, సుందరాచార్యులు-సిరిసింగండ్ల; శ్రీమతి జి. పద్మావతి-ధర్మవరం; శ్రీమాన్ వి. సుబ్రహ్మణ్యం-విశాఖపట్టణం; శ్రీమాన్ జె. నరసింహమూర్తి-విశాఖపట్టణం;





శ్రీమాన్ పోలిశెట్టి కుటుంబం-బెంగుళూరు; శ్రీమాన్ బి. వెంకట సుబ్రహ్మణ్యశర్మ-హైదరాబాద్; శ్రీమతి జి. వెంకట రమణమ్మ-కాకినాడ; శ్రీమాన్ జి. చలపతిరావు, కన్యాకుమారి -కాకినాడ, శ్రీమాన్ వి. రామకృష్ణ-భువనేశ్వర్; శ్రీమాన్ బాబి,రమ్య వేదాల-భువనేశ్వర్; శ్రీమాన్ ఓ. వీర వెంకటరావు-షెహోపురం; శ్రీమాన్ జి. లక్ష్మీనారాయణ-షెహోపురం; శ్రీమాన్ నాగళ్ళ పుల్లయ్య, లక్ష్మీ-అయ్యగారి పేట; శ్రీమాన్ గుట్టా అప్పారావు-సత్తుపల్లి; శ్రీమతి వెంపటి సూర్యనారాయణమ్మ -శ్రీరాంపురం; శ్రీమాన్ మోరంపూడి పెంటయ్య, తేజస్వి-సత్తుపల్లి; శ్రీమతి నరుకుళ్ళ మహాలక్ష్మి-సత్తుపల్లి; శ్రీమాన్ ఎ. కృష్ణమోహన్, లీలావతి-విశాఖపట్టణం; శ్రీమాన్ వేముల దత్తాత్రేయ,రాజమణి -సికింద్రాబాద్; శ్రీమాన్ వి. శ్రీనివాస ప్రసాద్,సంతోష్‌లక్ష్మి-సికింద్రాబాద్; శ్రీమాన్ ఎ.కృష్ణమోహన్-వైజాగ్; శ్రీమతి గౌరీస్మిత,ప్రసన్న-విశాఖపట్టణం; శ్రీమతి బి.వి. దేవీకుమారి-హుబ్లి; శ్రీమాన్ జి. లక్ష్మణరావు-పైడిపర్రు; శ్రీమాన్ జువ్వల మల్లయ్య-కడియం; శ్రీమాన్ నున్న రామారావు- వేల్పూరు; శ్రీమాన్ కర్రి వెంకటరెడ్డి-మహేంద్రవాడ; శ్రీమతి పసుమర్తి లక్ష్మీదేవమ్మ-మిర్యాలగూడ; శ్రీమాన్ పి. బసవరాజు-మరికల్; శ్రీమాన్ ఎన్. వీర్రాజు-వేల్పూరు; శ్రీమాన్ ఆర్. శ్రీనివాస-హైదరాబాద్; శ్రీమాన్ కర్రి సత్యరెడ్డి-రావులపాలెం; శ్రీమాన్ కె.వి. వసంతరావు-పొండూరు; శ్రీమాన్ విష్ణుకుమార్, చంద్రావతి-హైదరాబాద్; శ్రీమాన్ ఎమ్.సత్య నారాయణ-హైదరాబాద్; శ్రీమాన్ వై.

విష్ణుప్రసాద్-తిరుపతి; శ్రీమాన్ ఎమ్.బోసు, శ్రీనివాస్-హైదరాబాద్; శ్రీమాన్ ఇ. వీరయ్య- ముదునూరు; శ్రీమాన్ ఎమ్.కోటమ రాజు- రామలమ్మ-ముదునూరు; శ్రీమాన్ ఎమ్. శేషపాణి-హైదరాబాద్; శ్రీమాన్ పి.విష్ణుశయ నాచార్యులు -జీడిమెట్ల; శ్రీమతి ఎ. రాజ్యలక్ష్మి-ముసునూరు; శ్రీమాన్ అన్నవరపు సత్యనారాయణ-ముసునూరు; శ్రీమతి టి. లక్ష్మీదేవి-ముదునూరు; శ్రీమాన్ వి. వెంకట చలమయ్య-యలమర్రు; శ్రీమాన్ సిహెచ్. జవహర్‌లాల్, లక్ష్మీకల్పన- హైదరాబాద్; శ్రీమాన్ ఎమ్. శేషఫణి- హైదరాబాద్; శ్రీమాన్ శ్రీవత్సశేఖర్- విశాఖపట్నం; శ్రీమతి కె. విజయలక్ష్మి- పూండ్ల; శ్రీమతి శాంతి-చెన్నై; శ్రీమతి ఇందిరాబోస్-హైదరాబాద్; శ్రీమాన్ జి.వి. బదరీనారాయణ, అపర్ణ-విజయవాడ; శ్రీమాన్ శ్రీనివాసరావు-విజయవాడు; శ్రీమతి జి. లక్ష్మీదేవి, మాధురీదేవి-బావాజీపేట, విజయవాడ; శ్రీమతి వి. లీలావతి-సికిందరా బాద్; శ్రీమాన్ నారాయణ చౌదరి-పూండ్ల, శ్రీమతి సిహెచ్. పున్నమ్మ-ఉనికిలి; శ్రీమాన్ బి. రాజు-హైదరాబాద్; శ్రీమతి కె. సుధా రాణి-హైదరాబాద్; శ్రీమాన్ ఎన్. రఘు పాల్‌రెడ్డి-హైదరాబాద్; శ్రీమాన్ సుకేషిణిరెడ్డి- హైదరాబాద్; శ్రీమతి డా॥ కె. గీత-హైదరా బాద్; శ్రీమతి జె. సుభాషిణి- హైదరాబాద్; శ్రీమాన్ టి. సుబ్బారావు-ఏలూరు; శ్రీమతి టి. సౌభాగ్యమ్మ-ఏలూరు; శ్రీమాన్ కె. బాబూరావు-గుంటూరు; శ్రీమాన్ బి.

వాసుదేవరావు–ఎనమదల; శ్రీమాన్ అనిశెట్టి రామోహనరావు–చిత్తూరు; శ్రీమతి పద్మజ–బెంగుళూరు; శ్రీమాన్ భూపతిరాజు వెంకటసుభద్ర రాజు–పోలవరం; శ్రీమాన్ డా॥ ఆనందరావు, జ్యోతి–సికిందరాబాద్; శ్రీమాన్ డా॥ జనార్ధనరెడ్డి, సుభాషిణి–హైదరాబాద్; శ్రీమాన్ చేగు పాండురంగ విఠల్, లక్ష్మి–జగ్గయ్యపేట; శ్రీమాన్ డి. జనార్ధన రావు–పద్మావతి; శ్రీమాన్ డి. రాజేందర్‌రావు, పద్మావతి– పెనుగంచిప్రోలు; శ్రీమాన్ ఐ. ఉపేంద్ర–వరంగల్; శ్రీమాన్ ఆర్.ఎస్. సీతా రాములు, రోహిణీదేవి–తంగేడు; శ్రీమాన్ ఆర్. సీతారామరాజు–జి. కొండూరు; శ్రీమాన్ ఆర్. సూర్యనారాయణ రాజు–జి. కొండూరు; శ్రీమాన్ ఎన్. సూర్యనారాయణ రాజు, పద్మావతి–భీమవరం; శ్రీమాన్ ఎన్. రాఘవరాజు, ప్రభావతి–భీమవరం; శ్రీమాన్ ఎన్. రంగరాజు, రాధిక–భీమవరం; శ్రీమతతి బి. మహేశ్వరి–విశాఖపట్నం; శ్రీమాన్ జి.వి.ఎస్.ఎన్. రాజు, శ్రీకృష్ణకుమారి–ఐలాండు పోలవరం; శ్రీమాన్ జి. ఆది నారాయణశాస్త్రి–న్యూఢిల్లీ; శ్రీమాన్ డి. నరసింహాచార్యులు–కేశవపురం, కాకినాడ; శ్రీమాన్ టి. సీతారామాచార్యులు–రాజమండ్రి; శ్రీమాన్ డి. శ్రీధర్–మెహిదీ పట్నం, హైదరాబాద్; శ్రీమాన్ కె. రాజమన్నార్–రాజమండ్రి; శ్రీమాన్ ఎ.వి. శేషాచారి–మర్రిపాలెం; శ్రీమాన్ ఎమ్. వెంకటాచార్యులు–హైదరాబాద్; శ్రీమాన్ బి. రాములు–సిరిసిల్ల; శ్రీమాన్ డి. అప్పలరాజు, పుష్ప, అనుపమ–అనకాపల్లి; శ్రీమాన్ ఎస్. జగన్నాథరాజు–అనకాపల్లి; శ్రీమాన్ అల్లాడి

మోహన్‌రావు–జనగాం; శ్రీమాన్ బి. రాములు–సిరిసిల్ల; శ్రీమాన్ ఎ.ఎన్. ఆర్.కె.వి. సుబ్బారావు–కాకినాడ; శ్రీమాన్ ఎమ్. నరసింహారావు–మంచిర్యాల; శ్రీమతి ఎల్. సుభద్రా ఆనందరావు– గోపాలరావు పేట; వికాసతరంగిణి– మంచిర్యాల; శ్రీమతి బి. వెంకటసుబ్బమ్మ–వాకాడు; శ్రీమాన్ కె. వెంకటసుబ్బారెడ్డి–వాకాడు; శ్రీమాన్ పి. మల్లారెడ్డి యశోదమ్మ–గూడూరు; శ్రీమతి కె. సీతారావమ్మ–చెన్నై; శ్రీమాన్ పి. గౌతంరెడ్డి–మద్రాసు; శ్రీమాన్ కె. వెంకట సుబ్బయ్య–వాకాడు; శ్రీమాన్ ఎస్. మోహన రావు–ఖమ్మం; శ్రీమాన్ గుమ్మడి ఉషాదేవి–జమీగొల్వేపల్లి; శ్రీమతి పొట్లూరి సీతమ్మ–కాకలపాడు; శ్రీమాన్ ఐ.వి.ఎస్. మోహన రావు–జమీగొల్వేపల్లి; శ్రీమాన్ జి. నాగభూషణం–జమీగొల్వేపల్లి; శ్రీమతి వి. కృష్ణవేణి–నరసింగరావు–బరంపురం; శ్రీమాన్ వట్టా బుచ్చెయ్య–అప్పల నరసమ్మ–శ్రీకాకుళం; శ్రీమాన్ జె.వి. మాధవరావు–సత్తుపల్లి; శ్రీమాన్ సిహెచ్. నరసింహారావు, నిర్మల–సత్తు పల్లి; శ్రీమాన్ కె. పూర్ణచంద్రరావు, వనజాక్షి– నగరం; శ్రీమాన్ ఎమ్. రాజకుమార్–ఆదోని; శ్రీమాన్ చెన్నా వీరప్ప, బసవేశ్వరి–టెక్కలి; శ్రీమాన్ కె. నారాయణప్ప–ఆదోని; శ్రీమాన్ పి. రఘునాథ్‌సింగ్ ఠాకూర్–అజామాబాద్; శ్రీమాన్ ఎ.వి.ఎన్. సురేశ్‌కుమార్–చిలకలూరి పేట; శ్రీమాన్ టి. శ్రీనివాస రావు–గుంటూరు; శ్రీమతి మానుకొండ సామ్రాజ్యం–చిలకలూరి పేట; శ్రీమాన్ ఎస్. సత్యన్నారాయణ–కొరేస పాడు; శ్రీమాన్ కె. వెంకారెడ్డి–కొరేసపాడు;





శ్రీమాన్ ఎస్.వి. సుబ్బారావు–మేదరమెట్ల; శ్రీమతి లక్ష్మి కుమారి–హన్మకొండ; శ్రీమాన్ వై. మోహనరావు–కారంచేడు; శ్రీమాన్ వై. రామకృష్ణ–గుడివాడ; శ్రీమతి ఎమ్. ప్రమీలా దేవి–నాగులపాలెం; శ్రీమతి కొమ్మినేని సీతారావమ్మ–దేవరపల్లి; శ్రీమాన్ నూర్‌భాషా నబీ సాహెచ్–కారెంచేడు; శ్రీమాన్ బాలనాగు, అరుణ–చిలకలూరిపేట; శ్రీమాన్ వేముల అంకాలు, లక్ష్మమ్మ–నరసరావుపేట; శ్రీమాన్ పి.వెంకటేశ్వర్లు–గుంటూరు; శ్రీమతి పి. భారతి–హైదరబాద్; శ్రీమాన్ బి. ఉదయ్ కిరణ్–సికింద్రాబాద్; శ్రీమతి సి. లలితా యాదగిరి–సికింద్రాబాద్; శ్రీమాన్ బి. భక్త వత్సలం–హైదరాబాద్; శ్రీమాన్ రామ్మూర్తి, భారతి–సికింద్రాబాద్; శ్రీమాన్ బి. వెంకటేశ్వరరావు, రాజేశ్వరి–సికింద్రాబాద్; శ్రీమతి ఎమ్ కృష్ణాబాలమణి–సికింద్రాబాద్; శ్రీమతి కె. శేషారత్నం–భీమనపల్లి; శ్రీమాన్ జి. వేణు, కృష్ణ, మల్లిక–తిరుపతి; శ్రీమాన్ పి.వి. రామయ్య–విజయవాడ, శ్రీమాన్ ఎమ్. హేమచంద్రరావు– మంగళగిరి, శ్రీమాన్ వి.వి. పున్నారావు–గుంటూరు, శ్రీమతి పి. రంగమ్మ–రాజగోపాలపురం, శ్రీమాన్ ఎమ్. గణపతిరావు–విశాఖపట్నం, శ్రీమతి వెంకట లక్ష్మి–పాతగాజువాక, శ్రీమాన్ ఎన్.వి. సాంబయ్య, రాజ్యలక్ష్మి– ఒంగోలు, శ్రీమాన్ వి. వెంకటసుబ్బయ్య– ఒంగోలు, శ్రీమాన్ ఎమ్. వెంకటేశ్వరరావు, కమల–ఐ.భీమవరం, శ్రీమాన్ జి. ఎస్.నారాయణ, సీత–రూర్కేళ, శ్రీమాన్ పి. రామచంద్ర నాయుడు–తిరుపతి, శ్రీమాన్ ఆర్.

శివప్రకాష్, కుమారి– ఏర్పేడు, శ్రీమాన్ జి. చక్రవర్తి–విశాఖపట్నం, శ్రీమాన్ ఎస్. అప్పారావు, విష్ణుదేవి–విశాఖపట్నం, శ్రీమాన్ ఎన్.వెంకటాచార్యులు–హైద్రాబాద్, శ్రీమాన్ ఎన్. నరశింహాచార్యులు –హైద్రాబాద్, శ్రీమాన్ వి. రామకృష్ణమూర్తి –హైద్రాబాద్, శ్రీమాన్ పి. సారధి–ఖమ్మం, శ్రీమాన్ జి. శ్రీనివాసరావు–ఖమ్మం, శ్రీమాన్ కె. శ్రీనివాస్, కమల–హైద్రాబాద్, శ్రీమాన్ కె. వీరరాఘువా చార్యులు–హైద్రాబాద్, శ్రీమాన్ కె.ఎస్. రాఘువ, లక్ష్మి–కాకినాడ, శ్రీమాన్ రంగా మల్లిఖార్జునరావు, కమల–ఖమ్మం, శ్రీమాన్ శ్రీరామశాస్త్రి, సుబ్బలక్ష్మి–ఖమ్మం, శ్రీమాన్ డి. రామారావు, జ్యోతి–ఖమ్మం, శ్రీమాన్ జి. సత్యం, సీత–ఖమ్మం, శ్రీమాన్ జి. రామ్‌శ్రీ –హైద్రాబాద్, శ్రీమతి ఇ. సీతాదేవి– హైద్రాబాద్; శ్రీమాన్ శ్రీమాన్ పి. భద్రయ్య, విజయలక్ష్మి–ఖమ్మం; ఆకుల ఉపేందర్‌రావు, సుగుణావతి–ఖమ్మం; శ్రీమతి ఆర్. భారతమ్మ–ఖమ్మం; శ్రీమాన్ నెల్లూరు హనుమంతరావు, నాగమణి–బానాపురం; శ్రీమతి జి.విశాలక్ష్మి–ఖమ్మం; శ్రీమాన్ పి. వెంకట రమేష్–హనుమకొండ; శ్రీమాన్ కరుణాకర్ రెడ్డి–మన్నెగూడెం; శ్రీమాన్ జి. పట్టాభిరాములు–ఖమ్మం; శ్రీమతి ఎ. భారతి– హైదరాబాద్; శ్రీమాన్ ఎస్.రాజా–ఫలక్‌నామా; శ్రీమాన్ ఎమ్. లక్ష్మీనారాయణా చార్యులు–హైదరాబాద్; శ్రీమాన్ డి.ఎస్.శ్రీనివాసరావు –ఆదిలాబాద్ బాద్; శ్రీమాన్ వి. మల్లిఖార్జున–మక్తల్; శ్రీమాన్ ఎ. పార్థసారధి–బర్ధంపూర్; శ్రీమాన్ కె.వి.ఆర్.

ప్రసాద్,ప్రమీల-మల్లెల; శ్రీమాన్ బి. కేశవ నారాయణ,రాజ్యలక్ష్మి-విశాఖపట్టణం; శ్రీమాన్ శ్రీరామ పార్థసారధి-చిత్రాడ; శ్రీమతి సీతమ్మ-హనుమాన్ జంక్షన్; శ్రీమాన్ నాగరాజు-హనుమాన్ జంక్షన్; శ్రీమాన్ వి.వి. ప్రసాదరాజు-హనుమాన్ జంక్షన్; శ్రీమాన్ ఎమ్. రామలింగరాజు-కోరుకొల్లు; శ్రీమాన్ జి. రాధాకృష్ణ,విజయలక్ష్మి -చాట్రాయి; శ్రీమాన్ ఇ. శ్రీమన్నారాయణ, భాగ్యమ్మ -చాట్రాయి; శ్రీమాన్ శివశంకర రెడ్డి- హైదరాబాద్; శ్రీమాన్ వెంకటరెడ్డి, నిరువమ- హైదరాబాద్; శ్రీమతి నీలోహిత-హైదరాబాద్; శ్రీమతి పద్మా,మన్మధకిషన్-హైదరాబాద్; శ్రీమాన్ కె. వెంకట కృష్ణారావు-హైదరాబాద్; శ్రీమాన్ జి. సీతారామారావు-హైదరాబాద్; శ్రీమతి కల్పనా హరినాధ్-విజయవాడ; శ్రీమాన్ ఎన్.సి.రమేష్ -న్యూఢిల్లీ; శ్రీమాన్ సి. హెచ్. లక్ష్మీకాంతరావు -విజయవాడ; శ్రీమతి పి.నళినీ జయంతి -విజయవాడ; శ్రీమాన్ జి. వెంకట కృష్ణమూర్తి-రాజమండ్రి; శ్రీమాన్ ఆత్మారామ్ సింగ్-బళ్ళారి; శ్రీమాన్ డా॥ రామ్‌సింగ్ -సికింద్రాబాద్; శ్రీమాన్ జి. వేణుగోపాల్,ఉమారాణి-హైదరాబాద్; శ్రీమాన్ కె.వి. సత్యనారాయణ-పిరికిగూడెం; శ్రీమాన్ బి. వెంకట మాణిక్యాలరావు-పాలకొల్లు; శ్రీమతి బంగారు అన్నపూర్ణమ్మ, నాగేంద్ర-తణుకు; శ్రీమాన్ ఎల్. సుబ్బారావు-రాజమండ్రి; శ్రీమతి ఎమ్. లక్ష్మీ నరస్వతి-రాజమండ్రి; శ్రీమతి బి. ప్రభావతి-రాజమండ్రి; శ్రీమతి పి. పద్మావతిదేవి-వినగడప; శ్రీమతి ఆర్. సులోచన,గోపాలరావు-హైదరాబాద్; శ్రీమాన్ కె.కె.వి. సత్యనారాయణ; శ్రీమాన్ హరికృష్ణ -హైదరాబాద్; శ్రీమాన్ పి.గోపాలకృష్ణమూర్తి -రామన్నగూడ.

## పరమపద వార్త



శ్రీమాన్ **పాకలపాటి సత్యనారాయణరాజు** (సూరిబాబు)గారు విజయనగరం వాస్తవ్యులు. ది. 7-7-2004న పరమపదించిరి. వీరి శ్రీమతి లక్ష్మి(బేబి)గారు విజయనగరంలో శ్రీస్వామివారిచే నిర్వహింపబడుచున్న Visually impaired children Residential School సెక్రటరీ & కరస్పాండెంట్‌గా వ్యవహరిస్తున్నారు.









శ్రీమన్నారాయణ రామానుజ యతిభ్యో నమః
జగదాచార్యులు **శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి** మంగళాశాసనములతో...
శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యులు

## శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ పెరియ జీయరుస్వామివారి
# 96వ తిరునక్షత్ర మహోత్సవములు
## మరియు పంచకుండాత్మక- కృష్ణా పుష్కర బ్రహ్మ యజ్ఞము
### ది. 28-8-2004 నుండి ది.1-9-2004 వరకు

శ్లో॥ ఉత్తరాభాద్ర నక్షత్రే శ్రావణే సౌమ్యవత్సరే ।
ఆవిరాసీద్గురుః శ్రీమన్నారాయణ యతీశ్వరః ॥

**ప్రియ భగవత్ బంధువులారా!**

కలియుగంలో మానవులను తరింపజేయటానికి అవనిపై అవతరించిన అష్టాక్షరి మంత్రమును ఎల్లరుకూ ఉపదేశించి, విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని దిగంతాలకు వ్యాప్తిచేసిన భగవద్రామానుజులు- వారి అపర అవతారము ఆదిగురువు నారాయణుడు అవతరించిన మాసంలోనే మన పరమాచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ (పెద్ద) జీయరు స్వామివారు. సత్సంకల్పంతో శ్రీ స్వామివారు 1954లో సన్యాసాశ్రమం స్వీకరించి ఇటు దక్షిణభారతదేశంలోను, అటు ఉత్తరభారత దేశంలోనూ శ్రీవైష్ణవ సంప్రదాయాన్ని వ్యాప్తి చెందించిన జగదాచార్యులు. బదరీనాథ్‌లో అష్టాక్షరి కోటి హవన క్రతువు 40 రోజులు, మద్రాసు నగరంలో రామస్వామి నాయకర్ అనే వ్యక్తి శ్రీరామాయణ గ్రంథాన్ని అవమానించడం గురించి విని, దానికి ప్రాయశ్చిత్తం అతని బదులు తామే చేసుకుంటామని 9 సం॥పాటు 108 శ్రీరామ మహా క్రతువులు సల్పారు. 5సం॥పాటు 108 స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞములు, గోదావరి, కృష్ణ నదుల పుష్కరములలో బ్రహ్మ యజ్ఞములు, తిరుమలలో 1972లో శ్రీలక్ష్మీనారాయణ మహాక్రతువు 1008 కుండములతో యిత్యాది మహాయజ్ఞములు నిర్వహించి లక్షలాది మందికి పైగా అష్టాక్షరి మంత్రాన్ని కటాక్షించిన కారణజన్ములు. ఆ కాలంలోనే స్త్రీలకోసం యతిరాజ మహిళామండలిని స్థాపించడమే కాక శుక్రవారం సామూహిక లక్ష్మీపూజలు నిర్వహింప చేసేవారు. ఈనాడు ఆంధ్ర ప్రదేశ్‌లో పుండ్రధారణ చేసిన తిరుముఖ మండలాలు కనిపిస్తున్నాయంటే, శ్రీవిష్ణు సహస్రనామ పారాయణ చేస్తున్నారంటే అదంతా మన పెద్దజీయరు స్వామివారి చలవే. అట్టి మన స్వామి 96వ తిరునక్షత్రం నిజశ్రావణ (సింహ) మాసంలో ఉత్తరాభాద్ర నక్షత్రం అనగా 1-9-2004 ప్రతి సం॥ మాదిరిగానే 5 రోజులపాటు ఈ తిరునక్షత్ర ఉత్సవాలను నిర్వహించుకుంటూ ఈ సం॥ కృష్ణానదీ పుష్కర ప్రవేశం 28-8-04న ఆరోజునుండే మన స్వామి తిరునక్షత్ర ఉత్సవం ప్రారంభం. ఈ సందర్భము పురస్కరించుకొని మన ఆశ్రమంలో నూతనంగా నిర్మించుకొన్న శాశ్వత యాగశాలనందు శ్రీ స్వామివారికి ప్రీతికరమైన కార్యక్రమములను ఈ ఉత్సవ సందర్భముగా నిర్వహించుకోవడం. అందు పుష్కర సందర్భముగా బ్రహ్మయజ్ఞం 5 రోజులు 5 హోమగుండములతో వేదముల హవనము, సమిష్టి ప్రబంధ 'తిరువాయ్ మొழిపారాయణ, మరియు సమష్టి పూజా కార్యక్రమములను విశేషంగా నిర్వహించుకుందాం! కావున యిట్టి మహత్తర యజ్ఞ

కార్యక్రమంలో శ్రీవారి శిష్యులు, అభిమానులు ఆబాల గోపాలం విశేషసంఖ్యలో పాల్గొని ఆచార్యకైంకర్యములతో అనేక విధములుగా భాగస్వామ్యం వహించి, ఆచార్య కృపాకటాక్షాన్ని పొంది దీని ద్వారా పెరుమాళ్ళ అనుగ్రహం పొందుదాం!

## నిత్య కార్యక్రమములు

ఉదయం 6 గం॥కు నిత్యారాధన, సేవాకాలం, తీర్థగోష్ఠి; 8-30ని॥ నారాయణ అనువాకంతో వేద, ఇతిహాస, పురాణ, స్తోత్ర దివ్య ప్రబంధాది పారాయణలు ప్రారంభం. యాగశాలలో చదుర్వేద హవనం ప్రారంభం 10-30 ని॥కు సమష్టి పూజా కార్య క్రమముల 12-30 ని॥కు నిత్య పూర్ణాహుతి.

సా॥ 4 గం॥కు పండితులచే ప్రవచనములు 6 గం॥కుసమష్టి శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణము మరియు యాగశాలలో హవనం ప్రారంభం.6-30 గం॥కు సమష్టి తిరువాయ్ మొழి ప్రబంధ పారాయణము8-30 ని॥కునిత్య పూర్ణాహుతి, శాత్తుమొఱై గోష్ఠి.

## విశేష కార్యక్రమములు

**27-8-04 శుక్రవారం:** సా॥ 4 గం॥ శ్రావణ శుక్రవారోత్సవం. రాజ్యలక్ష్మీ తాయారులకు ఊంజల్‌సేవ, సా॥7 గం॥ బ్రహ్మ యజ్ఞమునకు విష్వక్సేన పూజ, పుణ్యాహవాచనం,ఇత్యాది.

**31-8-04 మంగళవారం:** గరుడ వాహనసేవ- శ్రీ జీయరు స్వామి ఉత్సవమూర్తి- రాత్రి 9 గం॥తిరువీధి.

**1-9-04 బుధవారం:**శ్రీ జీయరు స్వామి తిరునక్షత్రం- ఉత్సవ, మూలమూర్తులకు ఉదయం 12 గం॥అభిషేకం, మహాపూర్ణాహుతి, శాత్తుమొఱై, ఋత్విక్ సన్మానము.

## విశేష పూజలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| **27-8-04** | శుక్రవారం | శ్రీ లక్ష్మీనారాయణ పూజ | **28-8-04** | శనివారం | శ్రీ వేంకటేశ్వర పూజ |
| **29-8-04** | ఆదివారం | శ్రీ హయగ్రీవ పూజ (హయగ్రీవ జయంతి) | **30-8-04** | సోమవారం | శ్రీకృష్ణ పూజ |
| **31-8-04** | మంగళవారం | సుదర్శన పూజ | **1-9-04** | బుధవారం | పెద్ద జీయరు స్వామి పూజ |

## కైంకర్య వివరములు

| | | |
|---|---|---|
| 1. | ఒకపూట యాగశాల ఒక హోమకుండ యాజమాన్యం- | రూ. 500/- |
| 2. | ఒకరోజు పూర్తి యాగశాల యాజమాన్యం- | రూ. 2000/- |
| 3. | గరుడ వాహనసేవ - జీయర్ తిరువీధి- | రూ. 4000/- |
| 4. | ఒకరోజు తిరునక్షత్ర యాగ పూర్తి యాజమాన్యం | రూ. 10,000/- |
| 5. | సమష్టి పూజలకు (సమక్షంలో) | రూ. 50/- |
| 6. | ఒకరోజు తదీయారాధన- | రూ. 4000/- |
| 7. | ఒకరోజు ప్రసాద వినియోగము- | రూ. 1000/- |

పై విధముగనే కాక యథాశక్తి, యథావకాశము, ధన వస్తు రూపంలో తమ కైంకర్యములు ఎం.ఓ. ద్వారా లేక ఆంధ్రాబ్యాంక్, చుండూరుకు డ్రాఫ్టుద్వారా సమర్పించవచ్చు.

వివరములకు

**బృందావన నిత్యారాధన సమితి**
శ్రీ వాసుదాసాశ్రమం, నడిగడ్డపాలెం, వయా చుండూరు, గుంటూరు జిల్లా- 522 318
ఫోన్ నెం. 08644- 276150, 276260, 276522

\17/
Mydocuments\
Bn Jan. o4.p65



# కృష్ణా పుష్కరములు

**27-8-2004 శుక్రవారం రాత్రి గం.10.38ని॥లకు ప్రారంభం**

మన దేశమునగల జీవనదులన్నిటికి ఎంతో ప్రాముఖ్యత యున్నది. భారతీయులు నదులను కన్నతల్లివలె గౌరవాదరణలతో పూజిస్తారు. నదులు అనంతకాలం ప్రవహిస్తూ స్థావర, జంగమాదులకు జీవమైన నీటిని అందిస్తున్నవి. మానవులకు ప్రాణాధార రక్షణకు సస్యవృద్ధికి నదులే ఆధారం. ఈ నదులను మన ఋషులు తమ తమ తపోబలముచే వివిధ ప్రాంతాలకు కొనివచ్చిరి. నదులన్నీ పురాతనములైనవే కాన పురాణాలలో ప్రత్యేక గౌరవస్థానం వీనికి కలదు.

ఈ నదులకు స్వభావములు కలవు. ఉదా: గోదారి సింహరాశి తత్వమును, కృష్ణానది కన్యారాశి తత్వమును; గోదావరి సింహరాశి; కృష్ణ కన్యరాశి తత్వాలని పేర్కొనిరి. ఆయా రాసులలో గురువు(బృహస్పతి) సంచరించినపుడు ఆ నదులకు దివ్యస్పర్శ పరిపూర్ణంగా ఉండును. కన్యారాశిలో గురువు సంచరించునపుడు కృష్ణానది జలములు అత్యంత పవిత్రములై ఉండును. బృహస్పతి పన్నెండు సంవత్సరములకొకసారి ఒకరాశియందు సంచరించును. ఆ రోజులను పుష్కరములు అందురు.

పుష్కరమనగా పన్నెండు 12 సం॥ల కాలం. తుందిలుడనే ముని శివుని అర్చించి పుష్కరుడయ్యేను. శివుని అష్టమూర్తులలో ఒకటైన జలరూపమును పొందెను. బ్రహ్మ ఈశ్వరుని ఆరాధించి లోకసృష్టికి సహకరించమని అడుగగా ఆయన తీర్థరూపమునున్న పుష్కరుని బ్రహ్మకొసగెను. బ్రహ్మ వానిని కమండలమున నుంచెను. బృహస్పతి గ్రహాధిపత్యము సర్వజ్ఞత్వమును కోరుచూ పుష్కరుని తన వశము చేయమని బ్రహ్మను కోరెను. పుష్కరుడు బ్రహ్మవేడుట ఇష్టపడకపోవుటచే బ్రహ్మయే పుష్కరునివెంట నిశ్చయించెను.

బృహస్పతి మేషాది రాశులలో ప్రవేశించునపుడు గంగాది నదులలో పుష్కరుడు ఉండవలసి వచ్చెను. ఆయా నదీపుష్కర సమయాలలో పుష్కరుడు సార్ధ త్రికోటి తీర్థములలో నుండునుగాన అది పరమ పవిత్రమైన సమయము. అపుడు చేసిన దాన ధర్మాదులు, స్నానాది వ్రతములు, అనేక పుణ్యఫలదములు. మేషరాశి గంగకు, వృషభరాశి నర్మదకు, మిథునము సరస్వతికి, కర్కాటకము యమునకు, సింహము గోదావరికి, కన్యారాశి కృష్ణానదికి, తుల కావేరికి, వృశ్చికము తామ్రపర్ణికి, ధనుస్సు సింధునదికి, మకరం తుంగభద్రానదికి, కుంభం భాగీరథీనదికి; మీనం ప్రణీకా నదికి పుష్కరకాలము.

చాతుర్మాస్యదీక్ష సమయమున కృష్ణాపుష్కరములు వచ్చుట మన పూర్వపుణ్య విశేషము. పుణ్యక్షేత్రములలో తీర్థక్షేత్రములలోనూ పిత్రు, పిండదానములు, మొదలగునవి. ఆవశ్యకము. అలాగే కృష్ణాపుష్కరాలలో అన్నియు ఆచరించవచ్చును. ఇతరప్రాంతాలవారికి క్షౌరాదులు, ఉపవాసములు ఆవశ్యకములే కనుక స్నానదానాదులచే పుణ్యమును సంపాదిచుకొందురుగాక.

# సంస్కృతభాష-వైశిష్ట్యము

--శేషభట్టర్ వేంకటాచార్య

భారతావనిలో అతిప్రాచీనమైనది పవిత్రమైనది సంస్కరింపబడిన భాష "సంస్కృతము". సంస్కృతము అంటే సమ్యక్+కృతం సమగ్రము చేయబడిన, సంస్కరించబడిన భాష.

భాషలన్నింటిలో సంస్కృతభాష ప్రాణమువంటిది. ఆత్మయైనది. మాతృ భాషలెన్నివున్నా మరొక భాషను ఆత్మీయముగా ఆదరించి అభ్యసిస్తే ఆయా దేశాలమధ్య ఆప్యాయత, అనురాగాలు వృద్ధిచెందుతాయి. భాషవల్ల శాస్త్రపరిచము విజ్ఞానాభివృద్ధి సంస్కృతి తెలియడమే కాక భాషావైశాల్యముతో సంకుచితతత్వం మాయమవుతుంది. ఇక భాషాపాండిత్యము మానవునికి మూడవ కన్నువంటిది.

అన్ని భాషలు సంస్కృతాన్ని'మాతృవత్' గౌరవించి ఉన్నత స్థానంలో ఉంచాయి. వేదాలు, ఉపనిషత్తులు, పురాణేతిహాసాలు ఇవికాక కాళిదాసాది విరచిత కావ్య నాటకాలు చంపూ గ్రంథాలు (గద్యపద్య మయం చంపూ) నాట్యశాస్త్రాలు వైద్య, జ్యోతిష, గణిత, నీతిశాస్త్రాలు, అలంకార, ఛందో గ్రంథాలు, సాముద్రికాది గ్రంథాలు ఇవన్నీ సంస్కృత భాషలోనే విలసిల్లుతున్నాయి. అంతే కాక శతకాలు, చాటువులు, కాదంబరిలాంటి గద్య కావ్యాలు సర్వవిధ సాహిత్యసముదాయము సంస్కృతాధారమే. పుష్పమాలికలో దారములా అన్నింటికి ఆధారభూతమై విరాజిల్లుచున్నది.

అవసరానుకూలముగా విద్యా రంగాలు, ఆధ్యాత్మిక సమాజములు ప్రచార మునకై భగవద్గీతలాంటి గ్రంథాలే కాక స్తోత్రములకు, కావ్యములకు, కొన్ని నాటకములకు పరీక్షార్థుల ఉపయోగము నకై గూడ వానికి తెలుగు అర్థ తాత్పర్యము లను సిద్ధపరచి ప్రచురించి అందజేయు చున్నారు. పుస్తక విక్రేతలు గూడ సంస్కృత భాషా బోధినుల ద్వారా సులభంగా భాషను అభ్యసించుటకు అవకాశము కల్పించు చున్నారు. ఈ విధముగా ఈ మధ్య కాలములో అనేక రములైన అనువాద గ్రంథములు కూడా దొరుకుచున్నవి. అవి ఉపయోగార్హములే.

మన దేశములో సంస్కృత పండితు లకు, కవులకు నాటినుండి నేటి వరకు కొదువేమియులేదు. అయితే సమాజంలో సంస్కృతము అంటే అదేదో మంత్రము, పూజలాంటి వానికి ఉపయోగించు భాషయని, మనం చదవలేము అనుకొనుట జరుగుచున్నది. కాని వారు అనుకొన్నంత కఠినమైనది కాదు ఈ భాష. దరిదాపు ప్రతి ఒక్కరు మాట్లాడే మాటల్లో 75%పైగా సంస్కృతపదములే కన్పిస్తున్నవి. ఉదా హరణకు ప్రకృతి, విశ్వము, జగత్తు, జలము, అగ్ని, వృక్షము, గృహము, అన్నము, సోదరులు, మాతా పితరులు, పాఠశాల, పుస్తకము, ఆశ్రమము, ప్రయాణము... మొ॥నవి.

ఐతే వానిని సంస్కృతమని గుర్తింపక పోవుట వలన అదేదో అందరాని భాషయనే భ్రమ కలుగుతున్నది. కాని **"యత్నే కృతే యది న సిధ్యతి కో౽త్ర దోషః"** అని ప్రయత్నము చేసి వీలుచిక్కునపుడల్లా రోజుకో ఐదు పదాల చొప్పున అభ్యసించినను భాషా జ్ఞానము కొద్దిరోజులలోనే కలుగుతుంది. **"కావ్య సేవా వినోదేన కాలో గచ్ఛతి ధీమతామ్"** అన్నట్లు ఏదో గ్రంథం చదవబుద్ధేస్తుంది. ఆ రుచివేరుగా ఉంటుంది. కొంచెం శ్రమచే వ్యాకరణ పరిచయము కలిగించుకొన్నచో భాషాపాండిత్యము కలుగుతుంది. తాము నేర్చుకొని తమ వారికే కాక తమ తోటివారికి నేర్పవచ్చు. ఈ విధముగా మన భాషను మనం వృద్ధిపొందించుకొనవచ్చు. **"క్షణశః కణశశ్చైవ విద్యామర్థంచ సాధయేత్"** క్షణమైనను కాలము వృథాచేయక అభ్యసించినచో కృతకృత్యులు కావచ్చు. సంస్కృత భారతి కన్నులెదురుగా నాట్యమాడిన అనుభూతి కలుగుతుంది. జన్మధన్య మౌతుంది.

ఆధ్యాత్మిక గ్రంథాలు, సాహిత్య గ్రంథాలు, అలంకారాది గ్రంథాలు కూడ కోకొల్లలుగా లభించుచున్నవి. వాటిలోని వర్ణన. వస్తు సౌందర్యము అనుభవములోకి వస్తే జన్మకు ఇంకేమి కావాలి.



ఫ్రాన్స్, జర్మనీవంటి దేశస్థులు కూడ మన సంస్కృతభాషకు పెద్ద పీఠవేసి గౌరవించారు. ఆదరించారు. అనేక దేశాలు మన గ్రంథాలను తమ భాషలోనికి అనువ దించుకొని ఉపయోగము పొందుతున్నారు. భగవద్గీత దాదాపు అన్ని దేశాలలో అన్నిభాషల లోకి అనువదింపబడి అధ్యయనము చేయబడుచున్నది. అంతేకాక జర్మన్‌లోని ఒక పండితుడు (గోథే మహాశయుడు) కాళిదాస విరచిత శాకుంతల నాటకమును తన తలపై పెట్టుకొని పరవశముతో నాట్యం చేసాడట.

మన దేశంలోని కర్నాటక రాష్ట్రంలో 'శివమొగ్గ'వద్దగల గ్రామము పూర్తి సంస్కృతభాషనే తమ వాడుక భాషగా ఉపయోగించుచున్నది. ఇలా ఎందరో భాషావైశిష్ట్యము తెలుసుకొని ఆనందిస్తు న్నారంటే మనము కూడా మన స్థితి ఆలోచించుకొనవలసియున్నది.

మన సంస్కృతభాష సనాతనమైనది. సంస్కార జనకమైనది. వేదవాఙ్మయ రూపములో యుగయుగాల నుండి అవిచ్ఛిన్నంగా అభివృద్ధి చెందుతూ వస్తున్న భాష ఈ సంస్కృత భాష ఒక్కటే. ఇట్టి పవిత్రమైన సంస్కృతభాషను నేర్చుకొని మన సంస్కృతిని మనము కాపాడుకుందాం!!

***జై సంస్కృత వాణీ!***

# సర్వ వైష్ణవ సంగోష్ఠి - సర్వజన స్పందన

యతీంద్ర పదవిలాసాల 'శ్రీ'నివాస, భాగ్యనగరం.

మలయానిల గానాల మనోజ్ఞ ప్రాభాత వేళ సూర్య కిరణపు గిలిగింతలకు హిమనగము కరిగి వరదౌతుంది. ఇది సహజం.

శారద సాత్త్విక కళ విహరించు వేళ చంద్రకాంతి పరిచర్యలకు చీకటి చెదరి పోతుంది. ఇదీ సుపరిచితం. మరి ఈ వేళ భాగ్యనగరపు ఆకాశవీధిలో ఆగాథ మేఘాలు ఎందుకు కమ్మాయి? నీలి నీలి కాంతులను ఎందుకు విరజిమ్మాయి? దిక్తటులదిరేలా ఉరుముట మాని మూగగ ఎందుకు మురిసి చూస్తున్నాయి? ఇది మాత్రం ఓ విశ్వ హిత కార్య విరచితం.

భాగ్యనగర ఆవరణలో ఇట్టి శీతల వాతావరణం... ఋతుపవనాల ప్రభావమా? ఋజుమతులైన యతిపతులసన్నిధి ప్రభావమా? అన్వయించిన అంతరంగాలే అసలు నిజాన్ని చెప్పగలవు.

మనకైనా సరే మేలుకోరే బంధువులను చూస్తే మేనంతా పులకింతలు, స్వార్థములేని స్నేహితుని సన్నిధి లభిస్తే మైమరపులు, మనసును కదిలించగల కమ్మని పలుకులు, వినిపిస్తే కన్నీటి వరదలు కలుగక మానవు కద!

కనిపించే ఈ విశ్వమంతా భగవంతుని సుందరశరీరం. ఇలా అనుకొన్నప్పుడు ఇందులో ఉండే మనమంతా భగవద్బంధువులమే కదా! విశ్వవ్యాప్తమైన ఆ భగవచ్ఛక్తినే వేదశాస్త్రాలు **'విష్ణువు'**అను పేరవర్ణించాయి.ఆ విష్ణువ్యాపకత్వాన్ని త్రికరణశుద్ధితో విశ్వసించి, విశ్వశాంతి ప్రార్థనే పరమలక్ష్యంగా జీవించే ఎవరినైనా **'వైష్ణవుడు'** అంటాం! ఇట్టి గుణ గరిష్ఠుడే మనకందరికీ శ్రేష్ఠమైన బంధువు. సర్వజీవుల పట్ల సహజమైన కరుణాసింధువు కాగలుగుతాడు. కాయపక్వమై పండు అయినట్లే ఈ వైష్ణవజ్ఞానం పండి, వసుధైక కుటుంబ భావన నిండి, పదుగురికీ దానిని పంచగలవారే వైష్ణవాగ్రగణ్యులు.

ఈ వైష్ణవధర్మ నిర్వహణకూ, ప్రచారానికీ జీవితాన్ని అంకితం చేసిన సన్యాసులు, ఉభయవేదాంత ప్రవర్తకులు, దక్షిణ భారతావనిలో **'జీయరులు'**గా సుప్రసిద్ధులు. ఉత్తర భారతాన **'మహంతులు'**గా ప్రఖ్యాతులు. ఇట్టి వారిలో 'నేపాల్' మొదలుగా అఖిలభారతము వరకు 18మంది జీయర్ స్వాములు, సుమారు '40'మంది మహంతులు కలసివచ్చి కనుల విందు చేసిన కమ్మని వేదిక మన భాగ్యనగరం కావటమే ప్రకృతి హర్షానికి ప్రత్యక్ష కారణం! భాగ్యనగరానికి సౌభాగ్యతోరణం!

ఇది ౧.౧లో వచ్చిన వార్త, కరపత్రంలో కనిపించిన సమాచారం! చదివిన తరువాత మనసులోని లోపొరల్లో పడిపోయింది! కానీ సమయం ఆసన్నం కాగానే.... ఆదివారం, ఏకాదశి, సాయంత్రం '6'గం॥లకు నిజాం కాలేజీ గ్రౌండ్స్ వైపుకు లాక్కుపోయే మనసు వెంట కాళ్ళునడుచుకుంటూ పోయాయి. తీరా వెళ్ళి చూద్దునా, కళ్ళు చెదిరిపోయాయి. ఆహ్! ఎంతమంది జనం? భాగ్యనగరంలో విడిది పెట్టిన క్రొత్తసాగరంలా బారులుతీరిన జన సమూహం చివరలు కనిపించటంలేదు! డబ్బు





లిచ్చి, సేకరించి తెచ్చిన జనం కాదు, డాబుసరి ప్రకటనలు నెలల తరబడి నుండి వినివచ్చిన జనం కాదు. విషయం పుట్టి రెండు రోజులు కాలేదు, ఇంతమంది గుండెలకు పట్టిందా? వింతగా ఉందే !

ఇంతలో జనకోలాహలం. టీ.వీలో రోజూ ప్రవచనం చెప్పే చిన్నజీయరు స్వామి వారు చిరునవ్వులు చిందిస్తూ వేదికపైకి వచ్చారు. నేనూ రోజూ వింటాను కదా, గగన నక్షత్రాన్నైనా చేతిలో పట్టుకునేంత తేలికగా, బాగా ప్రవచనం చెబుతారు. వేదికపైన '18' మంది జీయ్యరుల కాషాయశోభ, 40 మంది మహంతుల పసుపు పచ్చని అంబరాల ప్రభ కనులపండుగ చేస్తూ, ఇంకాసిని కళ్ళుంటే చూస్తూ ఉండొచ్చు కదా అనిపించేట్టు ఉంది.

ఇక చిన్నజీయరుస్వామివారి ప్రవచనం ప్రారంభమైనది. ఆ గాత్రం గాంధర్వగానం. అందలి విషయం కర్ణామృతం! శ్రద్ధగా వింటూ ఆ ప్రసిద్ధుని భావన గ్రహించాను! ఎంతటి ఉదాత్తభావ ధార ఉంది అందులో! ఆ భావనే సరిగ్గా సమాజానికి నీడనిచ్చే గొడుగులా, వ్యక్తిత్వానికి రక్షణనిచ్చే తొడుగులా ఉంది.

వేరుకు నీరుపోస్తే చాలు వేయిశాఖలతో వృక్షం వ్యాప్తినొందుతుంది. వేరేచోట ఏ పరిచర్యలూ అవసరంలేదు. ఇది మనకు అనుభవంలోని విషయమే. వేదవిశ్వాసం గలవారంతా ఈ జగత్తుకు మూలమైన తత్త్వాన్ని విష్ణువుగా ఆరాధిస్తారు. మిగతావారి అవగాహనను ఆదరిస్తారు. అందరితో కలసి మెలసి ఉండి సమాజాన్ని అలరిస్తారు. సమాజం... కులానికో, వర్ణానికో కాదు గౌరవం ఇవ్వవలసింది. సంస్కారానికి గౌరవం ఇవ్వాలి. "విష్ణు భక్తిలేనివాడు బ్రాహ్మణు డైనా సరే గౌరవించ వలసిన పనిలేదు. అలానే విష్ణుభక్తి ఉన్నవాడు హరిజనుడైనా, గిరిజనుడైనా సరే అతను పూజ్యుడే అవుతాడు. ఇదే వైష్ణవ పద్ధతి. ఎంత స్పష్టమైన భావన!

ఈ విశాలభావనను సంకుచిత తత్త్వంగా అభివర్ణించి, వైష్ణవసంప్రదాయాన్ని రూపుమాపాలనే ప్రయత్నాలు ఈ మధ్య ఎన్నో వైపులనుండి జరుగుతున్నాయి. వాటిలో ఒక భాగమే ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన తిరుమల దేవాలయంలో చారిత్రా త్మకమైన కట్టడాల కూల్చివేతలు. సంప్రదాయాలను భంగపరుస్తూ, **"భక్తులకు వసతి"** అనే ముసుగులో చేపట్టిన సరిక్రొత్త నిర్మాణాలు.

ఇలాంటివి ఎందుకని ప్రశ్నిస్తే, ఇలా తగదని హెచ్చరిస్తే, తగు మార్పులను సూచిస్తే అదే నేరమన్నట్లు శ్రీశ్రీశ్రీ చిన్న జీయరుస్వామి వారిపై పత్రికలకెక్కి నిందలు, వాస్తవాలను పక్కదోవ పట్టించే ఆరోపణలు చెయ్యటం కూడా వారి శ్రీవైష్ణవ సంప్రదాయ వినాశనోద్యమంలో ఒక భాగమే అయ్యింది.

మంచితనాన్ని చేతకానితనం అనుకొనే పరిస్థితి దాపురించడం జాతికే ప్రమాదకరం. చావక్రింద నీరులా ప్రమాదకరమైన ఈ విద్రోహ భావనలను మంచివారంతా ఐక్యతతో ఎదిరించాలి. ఈ సదుద్దేశ్యంతోనే **"అఖిల భారత వైష్ణవ పరిషద్"** ఈ నెల 13వ తేదీ సాయంత్రం '6'గం॥లకు **"సర్వవైష్ణవ సంగోష్ఠి"**ని నిర్వహించినది. ఈ ఏకాదశీ పుణ్య దినాన ఇందరు మహాత్ములను సందర్శించుకునే భాగ్యాన్ని భాగ్యనగరానికి ప్రసాదించింది.

ఈ పరమ హంసల సమున్నత లక్ష్య శుద్ధి వింటుంటే నా హృదయం ఎంత స్పందించిందో కదా! ధర్మానికి హానికలిగి

నప్పుడు నేలకు దిగివచ్చే భగవంతుని అవతారాలు ఈ మహాత్ములే అనిపించింది. నాలానే ఇక్కడ చేరిన ఈ అశేష భక్తజనానికి ఏమనిపించిందో తెలుసుకోవాలని కూడా అనిపించింది. వివిధ వ్యక్తులను వారి అభిప్రాయాలు కోరగా, వారి మాటల్లో....

"ఏది తప్పో! ఏది ఒప్పో తెలియక తికమకపడే సామాన్యులకి మంచిచెప్పటానికి ఇందరు పెద్దలు ఒకచోట చేరడం నిజమైన మంచివనిగా నాకనిపిస్తుంది. రాబోయే మంచిరోజు దగ్గరలోనే నాకు కనిపిస్తోంది".

**- - ఓ స్కూలు ఉపాధ్యాయుడు.**

"తిరుమల ఆలయం విషయంలో అధికారుల స్వేచ్ఛాప్రవృత్తిని, సామాన్య ప్రజల అజ్ఞానాన్ని శ్రీవేంకటేశ్వరుని బాలాజీగా విశ్వసించే ముస్లిం సోదరులు సైతం వ్యతిరేకిస్తున్నారు. మరి మనం స్పందించి సరైన నిర్ణయం తీసుకోకపోతే అంత కంటే అవమానం ఇంకొకటి లేదు అని బాధపడుతున్న నాకు ఈ స్వామీజీల సమైక్య సమావేశం ఊరటనిస్తోంది.

**-- ఓ మెడికల్ రిప్రజెంటేటివ్**

"సమాజంలో ఉండే ఒక పౌరునిగా గత 20 సంవత్సరాలనుండీ గమనిస్తున్నాను. శ్రీ చిన్న జీయరుస్వామివారు నిర్వహిస్తున్న ఆధ్యాత్మిక, సామాజిక కార్యక్రమాల్లో ఏ రకమైన దాపరికము, సంకుచిత తత్త్వమూ నాకు కనిపించలేదు. అటువంటి వారు ఓ వ్యవస్థలో జరుగుతున్న తప్పును సరిదిద్దుకోవాలని చెబుతున్నారంటే ఖచ్చితంగా దాన్ని పట్టించు కోవలసిన అవసరం అటు పౌరులకీ, ఇటు పాలకులకీ ఉందని అభిప్రాయ పడుతున్నాను". **-- ఒక సాధారణ ఉద్యోగి.**

"మేం బ్రతుకు తెరువు కోసం వ్యాపారాలు చేస్తున్నాం! కానీ దేవాలయాలను వ్యాపారకేంద్రాలుగా చూడడం విచారకరం. శాశ్వతమైన ధర్మాలకి నిలయాలైన దేవాలయాల విషయంలో నిర్ణీత సమయం వరకే పనిచేసే అధికారుల అభిప్రాయాలే తుది నిర్ణయం కావడం ఎంత మాత్రం సమంజసం కాదు. అంతకంటే జీవితాన్ని దైవం కోసం అంకితం చేసిన ఇందరి పెద్దల నిర్ణయమే అవసరం అనుకుంటున్నాను". **-- ఒక వ్యాపారి.**

"ఇందాక నుండి శ్రీ చిన్న జీయరు స్వామివారి ప్రవచనం వింటున్నాను. వారేం చెబుతున్నారో కూడా స్పష్టంగా అర్థమౌతోంది. ఈ విషయాలను అటు ముస్లిం సోదరులు, ఇటు క్రిష్టియన్స్ కూడా అర్థం చేసుకొని ఆమోదిస్తుంటే హిందూ మతంలోనే పూజ్యులుగా, గొప్పవారుగా చెలామణి అవుతున్న వారు ఎందుకు వివాదం లేవనెత్తు తున్నారో అర్థం కావడం లేదు. బహుశా ఓర్వ లేనితనం కారణమేమో? ఇట్లాంటి వాటికి ఈ సాధుసమావేశం పరిష్కారం అవుతుంది".

**-- ఒక కార్యకర్త.**

"మాది సిక్కుమతం ఇటుగా వెళు తుంటే మంచిమాటలు వినిపించాయి. విందామని వచ్చాను. ఎంత బాగుంది వింటుంటే. ఇది హిందూమతం గురించి మాట్లాడుతున్నట్లు లేదు. పక్కమతం వారిని తక్కువ చేస్తున్నట్లు లేదు. మానవులందరి గురించి మాట్లాడుతున్నట్లే ఉంది. పూర్వ కాలం నుంచి ఇప్పటివరకు మా దేవాలయాల విషయంలో ఎవరైనా వేలుపెడితే మేం ఎప్పుడూ ఊరుకోలేదు. ప్రాణం తీయటాని కైనా, ప్రాణం వదలటానికైనా మేమెప్పుడూ సిద్ధమే. మీమతంలో మీరు కూడా మీ దేవాలయాలను తప్పకుండా కాపాడుకోవాలి".

**-- ఒక సిక్కు సహోదరుడు**





"హద్దులేకుండా అవసరాల పేరుతో తిరుమల కొండలను త్రవ్వి ఆధునీకరించు కుంటూ పోతే, రేప్రొద్దున ప్రతివాడూ ఈ క్రొత్త కట్టడాలను చూసి దీని చరిత్ర వంద సంవత్సరాలే అనే ప్రమాదం లేకపోలేదు. ఈ మాత్రం కూడా ఆలోచించ కుండా పనులు చేసే ఆలయకమిటీ వారి చర్య అనాగరికం. ఈ విషయంలో అసంతృప్తిని తెలియజేయ టానికి నేనెప్పుడూ సిద్ధమే. ప్రజలకు ఈ అనాలోచిత కార్యాలను తెలియజెప్పే "సర్వవైష్ణవ సంగోష్ఠి" సమయ, సందర్భోచితంగా ఉంది". **-- ఒక డిగ్రీ స్టూడెంట్**

"వాస్తు వృత్తిలో నాకు ఇరవైఏళ్ల అనుభవం ఉంది. నా అనుభవంతో చూచినా తిరుమలలో జరుగుతున్న మార్పులూ, చేర్పులూ శాస్త్రీయం కావు అనేదే నిజం. కానీ ఈ నిజాల్ని ప్రజలకు చెప్పగల పెద్దలు ఈ స్వామీజీలే! వీరు చేపట్టిన ఈ సమైక్య ఉద్యమం మాత్రమే తగినట్లు ప్రజలని స్పందింప చేయగలుగు తుంది". **-- ఒక వాస్తు నిపుణుడు.**

"చిన్న జీయరు స్వామివారు చెబుతున్న విషయాలు మా ఆలోచనలకు కూడా అందుతు న్నాయి. వాటిని అంగీకరించడానికి మాకే అభ్యంత రాలు కనిపించడంలేదు. వాటిలో ఎంతో లాజిక్ ఉంది. మనం ఎంత వేగంగా ప్రయాణించే యుగంలో ఉన్నా, గుడిగోపురాలను కాపాడు కోవ టానికి ఈ పెద్దలమాటలే, రాచబాటలు అవు తాయి". **--మోడరన్ డ్రస్సులలో ఉన్న విద్యార్థినులు**

"ప్రాచీన చరిత్రలో భగవంతుడికి కష్టం వస్తే చూసి తట్టుకోలేక ప్రాణత్యాగం చెయ్యాలనే ఉద్దేశ్యంతో నడుమున కత్తి నిలుపుకు తిరిగిన 'ధనుర్దాసు' వలె, మనం కూడా దైవానికీ, ధర్మానికీ అపచారం జరుగుతుంటే చూస్తూ బ్రతికి ఉండటం కన్నా కత్తితో మనల్ని మనమే పొడుచుకోవటం మిన్న". **--- దేవుడి భక్తి లోనే కాదు, చదువులో కూడా ప్రథమ స్థానంలో ఉండే ఇంటర్ విద్యార్థి.**

"ఇందరు మహాత్ములు ఒకచోట చేర బట్టే ఈ చల్లనిగాలులు, నల్లని మొబ్బులు, తెల్లని చినుకురవ్వలు. ఇందులో ఏ మాత్రం సందేహం లేదు." **-- ఒక వృద్ధ మహిళ.**

ప్రత్యక్షమైన ఈ సర్వజన స్పందనను సాక్ష్యాలు అక్కరలేకపోయినా, కొందరి మనోగతాలనైనా స్మరించి, తరించాలనే చిరుప్రయత్నమే ఈ అక్షరాలు!

ఎదనిండి బయల్పడిన పరవశానికి లక్ష లక్షణాలు ఈ అక్షరాలు! ఈ ప్రశాంత ప్రకృతి స్థితిపై విశ్వాసాలు ఎలా ఉన్నా రానా, మాననా అంటూ ఊగిసలాడిన వానదేవుని సొగసులు, ఉరుముల వెనుక ఊసులు ఎన్ని ఊహలకైనా వర్తిస్తాయి! అంబరాన్ని చుంబించిన ఈ సంబరంలో 'జై' కొట్టని చెయ్యిలేదు, వర్ణించని కన్నులేదు, హర్షించని 'ఎద'కన రాలేదు.

విశ్లేషణలు, వివరణలు, అభిప్రాయాలు, ఆలోచనలు ఎలా ఉన్నా అంతమందీ భక్తజనుల అంతస్స్వరం! మాత్రం ఈ "సర్వ వైష్ణవ సంగోష్ఠి" కనుల పండుగ చేస్తోందనే ప్రతిధ్వనించింది! ప్రతి ఒక్కరూ ఆ పరమ హంసల పదస్పందనలలో పులకించి, పయనించాలనే తీర్మానించింది!

**భక్తినివేదన చందాదారులకు విజ్ఞప్తి :** మీ సభ్యత్వమును ఒకనెల ముందుగనే పునరుద్ధరించు కోగలరు. మీ చందానెంబరు తప్పక సూచించగలరు. సభ్యత్వరుసుమును ఎమ్.ఒ. లేదా డి.డి. విజయవాడలోని ఏ బ్యాంక్ ద్వారా అయిననూ భక్తినివేదన, సీతానగరం అడ్రెస్‌కు పంపవచ్చును. భక్తినివేదనకు చెక్‌లు అనుమతించబడవు. చందాదారు తన చిరునామాను స్పష్టంగా వ్రాయవలసి ఉంటుంది. లేనిఎడల పత్రిక చేరుటకు అవరోధం కలుగుతుంది.

**- భక్తినివేదన -**

# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాసపత్రిక

సెప్టెంబర్ - 2004






కృష్ణా పుష్కర ప్రయుక్త బ్రహ్మయజ్ఞ ప్రవేశ ద్వారం



బ్రహ్మయజ్ఞశాల ఇష్టిశాల



పుష్కర ప్రారంభ స్నానం చేస్తున్న శ్రీస్వామివారు



నదీ హారతి నిర్వహిస్తున్న శ్రీస్వామివారు



అన్నదాత, క్రేన్ అధినేత శ్రీ గ్రంధి సుబ్బారావుగారు, శ్రీకాంత్‌గారు భక్తులకు ప్రసాదం వితరణ



యజ్ఞాచార్యుల ప్రారంభపూజ



బ్రహ్మయజ్ఞానికి ముందురోజున వాస్తుపూజ



నదీపూజ సమయంలో సేవించవచ్చిన సర్పము



శ్రీస్వామివారు కృష్ణవేణమ్మకు హారతిస్తున్న సమయంలో
జ్యోతి భగవంతుని ఆకారంగా చిత్రంలో చూడవచ్చు



ఫొటో ఎగ్జిబిషన్‌ను ప్రారంభిస్తున్న శ్రీ గంగరాజుగారు



ఫొటో ఎగ్జిబిషన్‌ను తిలకిస్తున్న శ్రీవారితో గంగరాజుగారు



నడిగడ్డపాలెంలో పెద్దజీయరుస్వామివారి సన్నిధిలో శ్రీవారు



నిత్యాన్నదాన సన్నివేశం



శ్రీమతే రామానుజాయ నమః

# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాస పత్రిక




శ్రీతారణ నామ సంవత్సరం | అధిక శ్రావణం

సంపుటి 57 | 2004 సెప్టెంబరు | సంచిక 6


వ్యవస్థాపకులు

శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యులు

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు

సంపాదకులు :

శ్రీ ఉ. వే. శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు

# విషయ సూచిక.....



## పంచాంగ వివరాలు

### సెప్టెంబరు

5 గురుపూజోత్సవం

6 స్మార్త శ్రీకృష్ణాష్టమి

7 వైష్ణవానాం శ్రీకృష్ణాష్టమి, శ్రీకణ్ణన్ తిరు॥

8 గురుమౌఢ్యారంభం

10 సర్వేషామేకాదశి

13 మాసశివరాత్రి

14 పోలాల అమావాస్య

15 తిరుమల శ్రీవారి బ్రహ్మోత్సవారంభం

17 షోడశోమా వ్రతం, బలరామ జయంతి, కన్యాసంక్రమణం ఉ. 6-45

18 వినాయకచవితి, విష్వక్సేనారాధన

19 ఋషి పంచమి, తిథిద్వయం, తిరుమలై నంబి తిరు॥

20 తిరుమల శ్రీవారి గరుడోత్సవం

21 తిరుమల శ్రీవారి బంగారురథోత్సవం, జ్యేష్ఠాంగారకం,

24 సర్వేషాం పరివర్తనైకాదశి, తిరువేంగడ త్తాన్ తిరు॥ వేదాంతదేశికర్ తిరు॥ తిరుమల శ్రీవారి చక్రస్నానం,

25 వామన జయంతి, కల్కి ద్వాదశి

27 అనంతపద్మనాభ వ్రతం, హస్తాకార్తె

29 మహాలయ పక్షారంభం

### అక్టోబర్

1 భరణీ మహాలయం

2 గాంధీజయంతి

4 గురుమౌఢ్యనివృత్తి

9 త్రిద్యుస్పృక్

10 సర్వేషామేకాదశి,యతుల మహాలయం.

Printed and published by Sri T.P. Sriramachandracharyulu owned by **Jeeyar Educational Trust** and Printed at **Sriman Printers & Processors** Sitanagaram and Published at Sitanagaram, **Editor Sri T.P. Sriramachandracharyulu 7-48, Brindavani, Visakhapatnam - 530 028.**

మీ సేవలో....

**భక్తినివేదన,** సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. ✆ (08645) 272929.

**చందావివరాలు**:-సంవత్సరచందా రూ.50/-, జీవితచందా రూ.500/-, విదేశాలకు సంవత్సరచందా $ 25,

E-mail : jetsitanagaram@yahoo.com Internet : www.chinnajeeyar.org

D.T.P. & Design by : పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రాసెసర్స్, సీతానగరం.

# సంపాదకీయం శ్రీ విలాసాలు

తినటం, కనటం ప్రాణికోటికి సాధారణం. పుట్టిన ప్రతిప్రాణీ తింటుంది. కంటుంది. పురుగులు, పులుగులు, పశువులు, మనుషులు అందరు చేసేదీ ఇంతే. అయితే ఇందులోనే కాస్త ఉత్తరోత్తరం ఉత్కర్ష.

కాని మానవుడు మట్టుకు ఇంతతోనే ఆగిపోలేదు. ఈ ప్రాథమిక లక్షణాలతో పాటు తన జీవితాన్ని ఇతర ప్రాణి విలక్షణంగా పరిపూర్ణంగా మలచు కొన్నాడు. తనకు లభించిన జీవితాన్ని చరితార్థం చేసుకున్నాడు.

ఇందుకు అతనికి కరచరణాద్యవయ వాలకంటె బహుధా తోడ్పడినది అతని బుద్ధి. ఇతర ప్రాణి విలక్షణమైన చైతన్య స్పందనాతి శయమూను. అనాదిగా వస్తున్న వాసనలు ఆర్జించుకున్న విద్యావివేకాదులూ బాగా దోహదం కావించాయి.

అసలు ఒక మనషి 'మనిషి'గా మనుగడ సాగించాలంటే, మన్నన పొందా లంటే ఏం కావాలి అతనికి? ఎట్లా ఉండాలి అతడు?

పుట్టినచోటు మంచిదికావాలి. చవిటి నేల మొలిచిన మొక్కకంటె సారవంతమైన నేలలో మొలిచిన మొక్క ఏపుగా ఎదగటం చూస్తున్నాం లోకంలో. విశుద్ధ కీర్తనుల ఇంట యశోవంతుల ఇంటి జన్మ కావాలి. ఆర్షేయ - పౌరుషేయములు కల కుటుంబంలో జన్మించగలగటం గొప్ప అదృష్టం. ఆ వంశంలో వెనకటి తరాల వారందరూ యోగ్యులు, సమర్థులు, కీర్త నీయాచరితులు కావాలి. ఇదీ 'ఆర్షేయం'. వారి గొప్పలు చెప్పు కొని బతకటం కాక వారికీ కీర్తిని తెచ్చిపెట్టే వైయుక్తిక ప్రతిభా విశేషాలు కలవాడు 'వీడూ' కావాలి. ఇది 'పౌరుషేయం'. "ఆర్షేయ పౌరుషేయము కల కుటుంబమంటే కానిది"- అనిపించు కోవటం ఘనత.

చెట్టుపేరు చెప్పుకొని కాయలమ్ము కోవటం కాదు వీడూ సమర్థుడు కావాలి అన్నాం. ఆ సామర్థ్యమూ **'యేన కేనా ప్యుసాయేన....'** అన్నట్లు కాకుండా బహు శ్రుతులను సేవించి పొందిన జ్ఞానం వల్ల, వేదశాస్త్రాదుల అధ్యయనంద్వారా లభించిన వైదుష్యపు ఫలం కావాలి. జ్ఞానానుష్ఠానాలు రెండిటివల్లా తాను తరిస్తూ పరులనూ

తరింప జేయగల దొడ్డ మనిషికావాలి వీడు.

ఆభిజాత్యమున్నంత మాత్రాన, వైదుష్యం లభించినంత మాత్రాన మనిషి బతుకు తెల్లారదు. మరి సంపదకావాలి. 'మనిషికి ఉన్నది పుష్టి. పశువుకు తిన్నది పుష్టి'. సరిపడిన సంపదకావాలి. అది రోజు రోజుకూ తరిగి పోయేది కాక అంతో ఇంతో పెరిగేదిగానూ ఉండాలి. అప్పుడే వీడికి తృప్తి. సమాజంలో పరిగణనమూను. అంతే కాదు ఈ ఐశ్వర్యం వల్ల తాను సుఖంగా బతకటంతో పాటు పదిమందిని బతికించనూగలుగుతాడు.

యోగ్యులయిన ఉదారులయిన తమ పెద్దల దీవెనలతో, విద్యవల్ల లభించిన వివేకంతో, న్యాయం తప్పకుండా, ధర్మాతిక్రమణం కాకుండా సంపాదించాలి. అట్లా రావాలి ఐశ్వర్యం. అది జారిపోయేది కాదు. స్థిరంగా నిలుస్తుంది.

ఆభిజాత్యం. వైదుష్యం. ఐశ్వర్యం. మాత్రమే మనిషికి చాలవు. అసలు మనిషి మనిషిగా మనగలగటానికి కావలసినది 'మంచి మనసు'. ఒరుల కష్టాలన్నిచూసి 'అయ్యో' అని ఆక్రందించగల ఎదకావాలి. అట్లాంటి ఎదలోంచి పెల్లుబికిన ఆక్రందనమే కవిత. ఎదకరిగిన ఆ వాల్మీకి ఆక్రందనమే ఆది కావ్యాన్ని లోకాని కందించింది. తడి ఎదనుండి వెలువడిన పొందికయిన సుతిమెత్తని అందపు పలుకులు ఎవరినలరించవు? వేనిని కదిలించవు? కరిగించవు? అట్లాంటి కవితాత్మకమయిన పలుకుకావాలి మనిషికి. మనసున్నందుకు సార్థకత, మాట నేర్చినందుకు సార్థకత. మానవతకు సార్థకత అప్పుడే చేకూరుతుంది.

ఎంతటి ఆభిజాత్యం ఉన్నా, వైదుష్యం వరించినా, సంపదలు సమకూరినా, కవిత్వం అబ్బినా మానవతకు పరిపూర్తి లేదు. అహంకార మమకారాలు వదలి శ్రియఃపతి శ్రీచరణాలవ్రాల ఆత్మ సమర్పణం చేసుకున్న నాడే వీడు 'ఉన్నవాడు'. అది లేకపోతే ఏమి ఉన్నా ఎన్ని ఉన్నా తాను 'లేనివాడి' కిందే లెఖ్ఖ. హరిపద ప్రపదన పరుడు కావాలి నరుడు.

ఇంతలో అతని జీవితం ఆగిపోదు. అయిపోదు. తాను కొలిచిన తన ఇలువేలుపును తన తరువాతా కొలిచే సంతానాన్ని పొందాలి. సంతానం పొందటానికి పరమ ప్రయోజనం ఇదే అని పెద్దల తలపు.

విద్యావంతులు ధనవంతులు యశోవంతులు మాత్రమే కాక పరంపరాగతమైన 'గృహమాధవ' సమారాధన పరిపాటిని పరిపాలించే 'సన్మతిమంతులూ' కావాలి

బిడ్డలు. ఇట్లాంటి సత్సంతానం సంప్రాప్తించటం సామాన్యం కాదు. ఇది వ్యక్తికే కాదు సమాజానికీ బలాన్ని చేకూరుస్తుంది. సత్సంతానం వల్లనే సమాజం సమృద్ధం, సమర్ధం, సమగ్రం అవుతుంది.

ఇన్ని సమకూరిన వాని అదృష్టాన్ని లోకులు కీర్తించక ఎట్లా ఉంటారు? ఏమేమో చేసి పేరు సంపాదింపవచ్చు. డబ్బు వెదజల్లి కీర్తిని కొనవచ్చు. వైదుష్యాతిశయంతో వాదిభంజనాలు చేసి కీర్తి నార్జించవచ్చు. కీర్తికావాలన్న తపనలో ఏమేమో చేసి నిమిషానికిన్ని యీగలను పట్టినారనో, దెబ్బకిన్ని దోమలను కొట్టినారనో 'పేరు'ను సంపాదించవచ్చు. కాని అది కాదు అచ్చపు యశస్సు.

మఱి, పైన చెప్పినట్టు సద్వంశంలో జన్మించి, జ్ఞానానుష్ఠానాలు కలిగి, న్యాయంగా, ధర్మంగా ఐశ్వర్యమార్జించి చక్కని కవితావైభవం కలిగి ముకుందపద భక్తితో బతుకుతూ– జీవించిన కాలంలో, తాము తనువు చాలించినాక తమ మాటను, బాటను అనుసరించే సంతానం పొందటం వల్ల వచ్చే కీర్తి శుభకరమైనది. స్పృహణీయమైనది.

సరే. బాగానే ఉంది. ఇవన్నీ మనిషికి లభించే దెట్లా?

జగన్మాత లక్ష్మీదేవి చల్లని కడకంటి చూపుల ప్రసార ఫలాలు సుమా ఇవన్నీ అంటాడు వేంకటాధ్వరి–

"శుచౌ వంశే జన్మ శ్రుతి
నయమతిర్మాతరతులా
వికంపా సంపత్తి ర్విశ
దమదిగీతా చ కవితా
ప్రపత్తిః దైత్యారౌ హిత
పరమసత్యం శుభయశః
వికార్హా స్పప్తామీ ధ్రువమ
సదృశాం తావకదృశామ్ ॥"

ఆళువందారులు చతుఃశ్లోకి, కూరేశుల శ్రీస్తవం పరాశర భట్టారకుల శ్రీగుణరత్న కోశం, నిగమాంత దేశికుల శ్రీస్తుతి తల్లిని తలచుకోవటానికి మనకు లభించిన పెన్నిధులు పెద్దల బాటననుసరించి క్షీరార్ణవ తనయా శుభగుణార్ణవంలో ఆర్తితో తానవగాహించి తనిసి, తరించి మనకోసం ఆనందంతో శ్రీగుణరత్నకరంగా లక్ష్మీ సహస్రాన్ని ప్రసాదించినాడు వేంకటాధ్వరి.

ఆ తల్లి చల్లని చూపులు మనపై ప్రసరించాలని కోరుకుందాం.

– శ్రీ రామచంద్రాచార్య



"వైష్ణవ ప్రతిష్ఠాన్" పీఠాధిపతులు, మహంతులందరి తరపున
భాగవతోత్తములకు సమర్పించుకొనే నివేదిక

# TTD వివాదాలకు సంబంధించిన వాస్తవాలు-వివరాలు

తిరుమలలో వేంచేసిన శ్రీ వేంకటేశ్వరుని పరంపరాగత కైంకర్యాలకు విఘాతం ఏర్పడింది. ఉపచారాలన్నీ, మొక్కుబడిగ జరిపేవి, యాంత్రికాలూ అయ్యాయి. వాటిని TTD వారి కోరిక మేరకే బయటకు తెచ్చిన శ్రీ చిన్న జీయరు స్వామివారిపై హద్దుమీరి ఎందరో, ఎన్నో రకాల ఆరోపణలు, అభాండాల బురదజల్లే ఉద్యమం కావాలని పనిగట్టుకొని చేస్తున్నారు.

**వాటన్నిటికీ సమాధానం చెప్పడంకోసం కాదీ ప్రయత్నం!**

వాస్తవాలు తెలియనీయకుండా, ధనాన్ని, పదవులను వాడుకొంటూ, యంత్రాంగాన్ని విచ్చలవిడిగా దుర్వినియోగపరుస్తున్న అధికారులు, వారి నీడలో తమ లోపాలను దాచుకొనే ప్రయాస పడుతున్న సలహా మండలుల తీరుతెన్నులూ ప్రజల ముందర స్పష్టపరచడమే ఈ ప్రయత్నానికి లక్ష్యం.

## వేయికాళ్ళ మండపం కొట్టడం, మహాప్రాకారం నిర్మించడం విషయంలో ఈ చిచ్చురేగింది.

1. TTD EO గా ఉన్న వ్యక్తులు ది. 4-2-2002లోనూ, 20-12-2002 లోనూ శ్రీ చిన్నజీయరు స్వామివారిని దేవస్థాన పూజాపద్ధతుల గురించి, ధర్మప్రచార పరిషత్‌ను బాగ తీర్చిదిద్దే విషయంలోనూ వారంరోజులైనా ఉండి సలహాలిచ్చి, వారిని ఉత్తమ సేవకులుగ తయారుచేయడానికి సహకరించవలసిందని కోరారు.

2. ధర్మప్రచార పరిషత్ (DPP) ను సరిచేయడానికి **'గీతాజ్యోతి'** అనే పథకాన్నిచ్చి, వాహనాలు+పుస్తకాలు, పత్రాలు తయారుచేస్తే, తాముకూడా వికాసతరంగిణి కార్యకర్తలతో కలసి DPP వారికి సహకరిస్తామన్నారు స్వామివారు. కానీ, TTD చొరవ చూపలేదు. శ్రీస్వామివారే వికాసతరంగిణుల ద్వారా దానిని తిరుమలలోనే 12.4.2002న ప్రారంభించారు. వికాసతరంగిణులు లక్షలాది భక్తులతో కలసి ఆంధ్రలో ఉద్ధృతంగ

సాగించిన **'గీతాజ్యోతి'** ఉద్యమం ఎందరికో నచ్చింది. కొందరు అధికారుల చొరవతో ప్రభుత్వం 2 1/2 సం॥తర్వాత నవంబరు, 2003లో TTDని, ఇలాంటి పథకంలో కలిసి పనిచేసే దిశలో సాహిత్యాన్ని సిద్ధం చేయమని కోరింది. (శ్రీచిన్న జీయరువారీ విషయంలో ప్రభుత్వాన్ని కానీ, TTDవారిని కానీ 2002 తర్వాత సహాయము ఏమీ అడగలేదు. **చివరికి ధనమిమ్మని లేఖగూడ వ్రాయలేదు.)** TTDకి యిది నచ్చలేదు. స్వాములనందరినీ ప్రేరేపించి, చిన్నజీయరు వారు 2 1/2 కోట్లుతీసుకొంటున్నారని వదంతులు సృష్టించి, స్వామివారిపై రకరకాలుగ బురద జల్లించింది.

ధనాన్నసలు స్వామివారు అడగలేదు. TTD ధనమివ్వలేదు. కోర్టు స్వామివారికి యివ్వవచ్చని తీర్పు చెప్పిన తర్వాత కూడా శ్రీవారు దానిని హుందాగా తిరస్కరించి వేసారే తప్ప తీసుకొనే ప్రయత్నం చేయనేలేదు. అయినా దానినొక మాయాభూతం చేసి, లోకులను మభ్యపెట్టడం ప్రారంభించారు కొందరు ప్రబుద్ధులు. ఆరకంగా స్వామివారిని కావాలని DPP విషయంలోకి లాగి, వారి సంస్థల, కార్యక్రమాల పరువును బజారుపాలు చేయాలని తలచింది.

శ్రీస్వామివారు డబ్బు మనిషి కాదని, స్వామివారి కార్యక్రమాల్లో పాల్గొన్న వారందరికీ తెలుసును. 1994లో 1028 కుండాలతో జరిగిన శ్రీమహావిష్ణు యాగంలో మిగిలిన రూ. 1.2 కోట్లను TTDకే ఇచ్చివేసిన విషయం అప్పటి EO. శ్రీ DVLN మూర్తి IAS గారిద్వారా తెలుసుకోవచ్చు. ఇలాంటి యజ్ఞాలు ఎన్నెన్ని జరిగాయో సంఖ్య చెప్పడం అనవసరం.

3. దేవాలయ ఆరాధనా పద్ధతులు గురించి సలహాకోసం 8.2.2002 నుండి జరిగిన సమావేశాలలో కొన్ని లోపాలను ఎత్తిచూపి, సరిచేసుకొమ్మని శ్రీచిన్న జీయరు స్వామి చెప్పారు. అక్కడే చికాకు ప్రారంభమైంది. అక్కడి ఆగమ పండితులూ, అర్చకులూ తప్పులను దిద్దుకొనేందుకు అంగీకరించలేదు. శ్రీవారు ఊరుకున్నారు.

తిరిగి ఇప్పటి E.Oగారి కోరికపైనే 27, 28, 29 తేదీలలో 2003 జనవరిలో తిరుమలలో, శ్రీచిన్నజీయరువారి మఠంలోనే సమావేశాలు జరిగాయి. 110దాక, ప్రస్తుతం, లోపాలున్నట్లు అంగీకరిస్తూ, వాటిని సవరించుకొనేందుకు సిద్ధపడుతూ ఒక పెద్దపత్రం

అధికారులు తయారు చేసారు. (సమావేశం వీడియోలు పూర్తిగ శ్రీస్వామివారి వద్ద, TTD వారి వద్దా కూడా ఉన్నాయి.)

అంతవరకూ కొంత సౌమ్యంగానే సాగింది వ్యవహారం. TTD వారు, శ్రీచిన్నజీయరువారిని సంప్రదించేవారు. శ్రీస్వామివారుగూడ నిర్మోహమాటంగ తప్పులు తెలిపి సవరించమనీ కోరేవారు.

ఎటొచ్చి మహాప్రాకార నిర్మాణాన్ని తలపెట్టవద్దని జీయర్ స్వామివారు చెప్పేసరికే TTD వారు ఎదురు తిరిగారు. మహాప్రాకార నిర్మాణానికి అడ్డొస్తోంది అంటూ వేయికాళ్ళ మండపాన్ని ఎవరికీ తెలియకుండా కూల్చివేసారు. ఆ చారిత్రక కట్టడాన్ని ఎవరికీ చెప్పి దాన్ని తొలగించలేదు. తొలగించాక అందరికీ తెలిసింది. అప్పటి ముఖ్యమంత్రి కూడా తనకీ విషయం తెలీదని పేపర్లలో ప్రకటనలు వెలువడ్డాయి.

☞ చాలమంది **"వేయికాళ్ళ మండపాన్ని కొడుతుంటే ఎందుకు ఆపలేదు? ఇప్పుడెందుకు ఈ గోల"** అని శ్రీచిన్నజీయరు స్వామివారిని ప్రశ్నిస్తున్నారు. శ్రీ చిన్నజీయరుస్వామి వారు అక్కడి కట్టడాలకు కాపలాదారు కాదు. అధికారి అంతకంటేకాదు. ఆపవలసిన అక్కడివైదిక వర్గం, మీడియా, అవి రెండూ ఈ విషయంలో **"ఏ కారణం వల్లనో"** చలించలేదు. కూల్చివేత విషయం తెలియగానే శ్రీవారు స్పందించడమేకాదు, లోకానికీ విషయాన్ని విశదీకరించారు. విషంచల్లుతున్నా, పట్టించుకోకుండా జనాన్ని మేల్కొల్పుతున్నారు. శ్రీస్వామివారు ఎన్నోసార్లు చెప్పి, ఆపే ప్రయత్నం చేస్తున్నా, వినకుండా కొండను ముక్కలు చేసారు. వివాదం రాకముందేమి జరిగినా, ఒకసారి వివాదమంటూ రేగితే, తేలేవరకూ దాన్ని తాకకుండా ఉంటే మర్యాదగ ఉండేది. TTD ఈ విషయంలో క్షమించరాని రీతిలో వ్యవహరించింది.

☞ ఈవిషయం తెలిసే, 16 మందిజీయర్లు, 200మంది మహంతులూ శ్రీవారికి అండగనిలబడ్డారు. దేనికైనా సిద్ధంగ ఉన్నారు గూడ.

☞ చారిత్రక ప్రాధాన్యాన్ని మరచామని, తప్పు ఒప్పుకోడానికి మనస్కరించని వైట్‌కాలర్ అహంకారం తనచేతిలోని అన్ని అధికారాలనూ వినియోగించి, విషయాన్ని పక్కదారి పట్టిస్తోంది.

☞ **అర్థాత్** TTD. **కావాలని అందులోకి శ్రీ స్వామివారిని లాగి, దారుణంగ నిందారోపణలు చేస్తోంది, చేయిస్తోంది.**

4. TTDపై అధికారంకోసమో, తనవారికి పదవిని సంపాదించడానికో శ్రీ చిన్నజీయరువారు ఇది చేస్తున్నారనేది మరో ఆరోపణ. గత ప్రభుత్వాలున్నపుడే, రెండుసార్లు, TTDబోర్డులో ఉండమని కోరడమే కాదు, ఒకసారి పేరునుగూడ ప్రక టించేసారు. అయినా దానిని శ్రీస్వామివారు సున్నితంగ తిరస్కరించారు. తప్ప పదవులాసించే వ్యక్తి శ్రీస్వామివారు కాదనేది అందరికీ తెలుసు.

☞ తమ బంధువులకు పదవులివ్వలేదని అక్కసుతో ఈ దుమారం లేపుతున్నారనేది శ్రీస్వామివారిపై మరో ఆరోపణ, శ్రీస్వామివారికి అందరూ బంధువులే. ఎవ్వరికీ పదవులు యిప్పించేవిషయంలో, శ్రీవారెప్పుడూ ఎవరికీ చెప్పడంకానీ, చెప్పించడం కానీ, **ఇంతవరకూ చేయలేదు.**

తిరుమల జీయర్ల విషయంలో **"సమర్థులైన వ్యక్తులు"** ఉంటే, వ్యవస్థ బాగుపడుతుందని గతంలో శ్రీ స్వామివారు చెప్పిన విషయం వాస్తవం. దానికైనా, అక్కడి నియమాలకు విరుద్ధం కాకుండా ఉండే వ్యక్తులనే తీసుకొమ్మన్నారు తప్ప తమవారంటూ ఎవరినీ నియమించమనలేదు. ఈ నిందారోపణ మూర్ఖులు చేసేది.

☞ పాంచరాత్రాన్ని, తిరుమలలోని వైఖానసం మీద రుద్దే ప్రయత్నం చేస్తున్నారనేది అతి తీవ్రమైన అభ్యంతరకరమైన ఆరోపణ. ఇది పెద్దపెద్దలందరి దగ్గరనుండీ అసూయతో బయలుదేరిన ఆరోపణ. "పాంచరాత్రాగమ అర్చకులతో శ్రీ స్వామివారు ఎన్నో కార్యక్రమాలు చేసినట్లే, శ్రీ వైఖానసాగమార్చకులతో కలిసీ శ్రీస్వామివారు ఎన్నో కార్యక్రమాలు చేశారు".

"స్వీయ ఆరాధన – సర్వ ఆదరణ" అనే సూత్రాన్ని హృదయాంతరంగంలోంచి కూర్చి వేల హృదయాలలో స్పందింపచేసిన శ్రీ చిన్నజీయరు స్వామి ఇలాంటి మార్పిడులు చేయరు, చేయరు, చేయరు. ఇతరులు చేయడానికి అంగీకరించరు గూడ!

**ఇక..... వివరాలను చదవండి!... వాస్తవాలను గ్రహించండి!**

**తగినట్లు స్పందించండి!!!.**

# తిరుమలలో కట్టడాలు, కొట్టడాలు విషయంలో నిజానిజాలు

## 1. వేయికాళ్ళమండపం అంటే ఏమిటి? దేనికి?

ప్రాచీన దేవాలయాలలో సుమారు 1000 రాతి స్తంభాలతో నిర్మించిన ఒక మండపాన్ని వేయికాళ్ళమండపం అంటారు. విష్ణ్వాలయాలలోనైతే, సాధారణంగ దాంట్లోకి దేవుడు వేంచేసినపుడు 'అధ్యయనోత్సవ' ముగింపు 10దినాలు ఉత్సవం చేస్తారు. దీనినే 'రా పత్తు మండపం' అని కూడ కొన్నిచోట్ల అంటారు. ప్రత్యేకించి కొన్ని ఉత్సవాలు జరపడానికంటూ కనుక దానిని నిర్మిస్తే ఆ ఉత్సవాలను తప్పనిసరిగా చేస్తూ దాంట్లో చేస్తూ మిగిలిన వాటికీ దానిని వాడుకోవచ్చు.

ఇక తిరుమల విషయానికొస్తే....

ఆలయ మహాద్వారానికి ఎదురుగ ఆగ్నేయమువైపు ఎత్తైన ప్రదేశంలో ఉన్న పెద్ద మండపానికే 'వేయికాళ్ళ మండపం' అనిపేరు. అది గత 2004 జనవరి నెల దాక ఉండేది. **TTD** అధికారులు దానిని మూర్ఖంగ కూల్చివేసారు.

కూల్చడానికి **TTD** చెప్పే కారణాలు చాలా ఉన్నాయి అందులో 5 చూడండి:-

రి) అది యాత్రీకుల సౌకర్యం కోసం కట్టినదే తప్ప ఆలయంతో దానికి సంబంధంలేదు.

రిరి) దేవుని ఉత్సవాలతో ఆ మండపానికి ఏ సంబంధంలేదు. అందులో ఎప్పుడూ శ్రీనివాసుడి ఉత్సవాలు జరిగిన దాఖలాలు, ప్రమాణాలు ఏవీలేవు.

రిరిరి) ఆగమాలలో అది ఉండాలనే ప్రమాణాలు ఏవీ లేవు అని మా ఆగమ సలహాదారులంటున్నారు.

రిఖీ) అందులో రకరకాల చెడు కార్యాలు జరగడం, బాత్‌రూములు ఉండటం, దుకాణాలు ఉండటం, పాడైపోవడం, కొన్ని కూలిపోయి ఉండటం వంటివాటివల్ల ప్రమాదకరంగ తయారైంది కనుక తొలగించేసాం.

ఖీ) దేవుని ఊరేగింపులకు అడ్డొస్తోంది. ఎక్కువమంది ప్రజలకు సౌకర్యం కలిగించాలని తొలగించేసాం. ఇలా...

**TTD** అధికారులూ, వారికి మాత్రమే తెలుసుననుకొనే ఎన్నో కారణాలవల్ల వారిచేతిలో పావులుగ మారి వారి ఒత్తిడులకు పూర్తిగా లొంగిన ఆలయార్చకులు చెప్పే పైవాదనలు ఎంతవరకు నిజాలో చూడండి:-

రి) కేవలం యాత్రికుల సౌకర్యం కోసమైతే 1000 కాళ్ళతో ఇరుకుగా ఉండే మండపాన్ని నిర్మిస్తారా? అందులో అవతారాలూ, ఆచార్యుల మూర్తులన్నీ చెక్కిస్తారా? సౌకర్యానికైతే గదులుగ వసతులతో నిర్మిస్తారుగానీ, బహిరంగ మండపంలా ఎందుకు కడతారు? అందుచే ఈ కారణం తప్పు.

దేవుని కోసమే కట్టారు-ప్రమాణాలున్నాయి:-

ii) వేయికాళ్ళమండపాన్ని విజయనగర ప్రభువైన సాళువ మల్లదేవమహారాజు నిర్మించినట్లు 18.1.1464**A.C.** నాటి శిలాశాసనం ఉందని TTD వారి **'INSCRIPTIONS'**-వాల్యూమ్2, 24వ పేజీలో స్పష్టంగ ఉంది. (సీరియల్ No. 18, శాసనం No. 157 T.T. ను చూడండి.)

అందులో ఏ ఉత్సవాలూ జరగలేదనడం సరికాదు. రాజశాసనంలో- ఈ మండపంలో 1) శ్రావణమాసంలో పవిత్రోత్సవాలు 5రోజులూ, కార్తీక పూర్ణిమనాడు, బ్రహ్మోత్సవాలలో ధ్వజారోహణనాడు, మొదటిరోజున ఆ వేయికాళ్ళ మండపంలోనికి అమ్మవార్లతో పాటు శ్రీనివాసుడు వేదికమీదకి వేంచేయాలనీ, అలా శ్రీ వేంకటేశ్వరస్వామి వేంచేసినపుడు ఏమేమి ప్రసాదాలు, ఎంతెంత చేసి ఆరగింపు చేయాలో, ఆ తర్వాత తిరువీధ్యుత్సవం ఎలా చేస్తారో వ్రాసి ఉంది. ఆ రాజుల ఆజ్ఞను అతిక్రమించక కొన్ని తరాలైనా అందులో ఉత్సవాలకు దేవుడు వేంచేసి ఉంటాడనేది స్పష్టం. ఈమధ్యకాలంలో వీరు ఆపేసి ఉండవచ్చు.

s వారే ముద్రించిన పుస్తకాలు దైవ సంబంధం ఈ మండపానికి ఉందంటూ చెపుతూండగ, ఆ మండపానికీ ఆలయానికీ సంబంధం లేదనడం ఎంత తెలివితక్కువతనమో!

| | |
|---|---|
| **1 విమానార్చనా కల్పం - 11వ పటలం**<br>**TTD సిరీస్-488లో - 31వ పేజీ, 33పేజీ** | ఉత్సవాలకై బయటి ప్రాకారానికి సమమైన విస్తారం కలిగి, లేదా, ప్రాకారానికి ముప్పాతిక, లేక, సగం విస్తృతి కలిగిన ఆస్థానమండపం ప్రాకారపు బయట నిర్మించాలి. దానిలోనే హోమం చేసి ప్రసాదం వండి, నైవేద్యం పెట్టడం కూడా చేయాలి. |
| **2 కాశ్యప జ్ఞానకాండము- 91వ అధ్యాయం**<br>**TTD సిరీస్-492లో - 174వ పేజీ** | 'భేరీ పూజాబలి' అనే అంశాన్ని చెప్పే సందర్భంలో దేవాలయమునకు ఎదుట **మండపాన్ని** నిర్మించి అందులో పీఠాలు, వేదికలు నిర్మించి ఆ ఉత్సవం చేయాలి. |
| **3 ఖిలాధికారము - 32వ అధ్యాయం**<br>**TTD సిరీస్-490లో - 425వ పేజీ** | **'మండపాలంకారః'** అనే ప్రకరణంలో దేవాలయానికి ఎదురుగ **ఎత్తైన పీఠంతో విశాలమైన మండపమును** నిర్మించి, అందులో బ్రహ్మోత్సవాలలో గరుడ పటాన్ని పూజించాలి. |

| | |
|---|---|
| TTD సిరీస్-490లో - 432వ పేజీ 433వ పేజీ | దేవేరులతోపాటు, స్వామిని అలంకరించి ఆ ఆస్థానమండపానికి వేంచేపు చేయాలి. ఉత్సవమొదటిరోజున. |
| 4 యజ్ఞాధికారము - 38వ అధ్యాయం TTD సిరీస్-484లో - 197వ పేజీ | ఉత్సవవిధిని తెలుపుతూ గరుడధ్వజాన్ని పూజించడానికి ఆలయానికి ఎదురుగ సర్వాలంకారాలతో విశాలమండపాన్ని నిర్మించి అందులో హోమ కుండములు ఏర్పరచాలి. |
| 5 శ్రీవేంకటాచల మాహాత్మ్యం 1వభాగం, 46వ అధ్యాయం TTD సిరీస్-1949లో - 56వ పేజీ | ఆనందవిమానమునందు శ్రీనివాసుడా విర్భవించునపుడు, క్రీడామండపము, నానారత్నములు పొదిగిన వేయికాళ్ళ మణిమయ మండపముతోనూ గూడ కలిపియే అవతరించెను. (శిథిలమైన ఆలయాన్ని తొండమాన్ చక్రవర్తి బాగుచేసినట్లే. సాళువరాయలు ఈ మండపాన్ని అక్కడ శిలామయముగ నిర్మించెను.) |

ఇంకా, అనేక గ్రంథాలలో అనేక ఉత్సవాలలో స్వామికోసం ఆలయం ఎదుట విశాలమైన మండపం ఉండాలని ఘోషిస్తున్నాయి.

ఉదాహరణకు కొన్ని చూపిస్తున్నాము అంతే.

గ్రంథాలలో ఈ వేయి కాళ్లమండపానికి ప్రమాణాలులేవంటూ, దేవునికి దీనితో సంబంధం లేదు అనేవారు ఆగమపండితులు అవుతారా? వారిచ్చిన సలహాలెలా ప్రమాణాలు అవుతాయి?... అలాంటి వారిని సలహాదారులుగ తీసుకొన్న **TTD** ని ఏమనాలి? అధికారుల మాటనే చిలుక పలుకులుగ పలికే సలహాదారులను అడ్డుపెట్టుకొని వారసత్వపు కట్టడాలను కూల్చడంలోని, **TTD** వారి, ఆంతర్యం ఏమిటి?

ఉత్సవాలు ఎక్కువైనపుడు, శాశ్వతంగ మండపం ఉండడం మంచిదని విజయనగర ప్రభువులు తమ ద్రవ్యంతో "ఆచంద్రార్కం ఉండాలి ఈ మండప"మని శిలాశాసనం చేసి, ఆ ఉత్సవాలకీ, అప్పుడు చేసే ప్రసాదాలు మొదలైన ఖర్చులకి ఎన్నో గ్రామాలనిచ్చారని ఆ శిలాశాసనాలే చెపుతూంటే, ఆగమాలలోనూ, ఇతరత్రా ప్రమాణాలే లేవనేవారికి అసలు గ్రంథాలతో పరిచయముందా? వారు చూసారా? ఇది కోట్లాది భక్తులను వంచించడమే. లేదా ఇందులో మరేదో ప్రయోజనం వారికి ఉండనైనా ఉండాలి.

iv) నిర్మాణాలన్నవి కాలక్రమంలో పాడౌతుంటే, రిపేరు చేసి, తిరిగి అదే విధంగ

రూపురేఖలుండేట్లు చక్కబెట్టుకొంటారు. అందులో వారసత్వాన్ని (heritage) తెలిపేదైతే, చాల జాగ్రత్తగ ప్రభుత్వాలే కాపాడాలి. మతపరమైన కట్టడాలైతే మరింత శ్రద్ధ, జాగ్రత్తలు తీసుకొని మరీ కాపాడాల్సి ఉంది.

కావాలని బురదలో కాలుపెట్టి, 'బురదలోపడింది కనుక ఈ కాలుని తీసివేస్తా'ననేవాడిని ఏ వర్గంలో చేర్చాలి! సరైన వ్యక్తి అయితే తెలిసో తెలియకో బురదలో దింపిన కాలుని పైకితీసి కడుగుకొంటాడు కద!

అలానే వెయ్యికాళ్ళమండపంలో ఏ అసందర్భక్రియాకలాపాలు జరగకుండా జాగ్రత్తగ, పరిశుభ్రంగ ఉంచడం **TTD** విధి! అది చేయలేదు. అందులో అసాంఘిక వ్యక్తులు చేరి, అనైతికకృత్యాలు జరిగితే తొలగించవలసింది **TTD** యే! అదీ చేయలేదు శిథిలమైన స్తంభాలను బాగుచేయవలసింది. అదీ జరుగలేదు. బాత్‌రూమ్‌లు **TTD**కి తెలియకుండా, రహస్యంగా ఎవరైనా నిర్మించారా? అలా చేస్తే వెంటనే చర్య తీసుకోకుండా ఏమి చేస్తున్నట్లు? అసలవి నిర్మించినది **TTD** వారేనాయె! బ్యాంక్ కౌంటర్లు, లడ్డు అమ్మకపు కౌంటర్లు, మ్యూజియమ్, ఇవన్నీ **TTD** వారే కావాలనే అందులో పెట్టారా? లేక అజ్ఞాతవ్యక్తులు ఆక్రమించి ఆ దుకాణాలు అందులో కట్టారా? రకరకాల సాకులు చూపి ఉత్సవాలు అందులో జరుగకుండా ఆపివేయడానికి కారకులు **TTD** కాదా? సరే, అయినదేదో అయిపోయింది. వారి గ్రంథాలే ఆమండపంలో ఎన్నో ఉత్సవాలు జరగాలంటూంటే అందుకు తగినట్టు బాగుచేయాలే తప్ప దానిని దాచి, అదంతా శిథిలాల కుప్పగ మారింది కనుక ఇక కూల్చివేస్తామనడంలో అర్థమున్నదా?

**ఈ విషయంలో వైఖానసాగమానికి చెందిన TTD వారి సిరీస్ 483, ప్రకీర్ణాధికారం, 35వ అధ్యాయం, 594 నుండి 597 శ్లోకం దాక ఏమంటుందో చూడండి శ్రద్ధగా:-**

"ఆలయాలలో శిథిలమైన భాగాలను వెంటవెంటనే యథాతథంగా జీర్ణోద్ధరణ చేస్తూ ఉండాలి. శిథిలమైన భాగాలను అలానే చూస్తూ, లేదా వాటిని గురించి వింటూ వుండటమనేది సహించరాని దైవద్రోహం. అంతేకాదు, వాటిని యథాపూర్వంగా వెంటనే నిర్మించకపోతే, లేదా, వాటిలో యథేచ్ఛగ మార్పులు చేస్తే, పరిపాలకులకు, దేశానికి ఘోర విపత్తులేర్పడతాయి. వాటిని చక్కగా పునర్నిర్మించడమే ధర్మరక్షణము" అని నిర్మోహమాటంగ పై వైఖానసాగమమే స్పష్టం చేసింది.

**స్కాందపురాణంలో శ్రీవేంకటాచల మాహాత్మ్యాన్ని తెలిపే, 6వ అధ్యాయంలో :-**

"ప్రజాసౌకర్యాలకోసమనే వంకపెట్టి దేవుని సేవలో, బ్రహ్మవేత్తలసేవలోను లోపం చేసినందువల్లనే, మరియు, దేవుని ధనాన్ని వృధా చేస్తూ, తన స్వంతానికి, తనవాళ్ళకూ వాడుకొంటేనే, 3జన్మలు చాతకపక్షిగ, ఒక జన్మ గ్రద్దగ, 7జన్మలు కుక్కగను, 28జన్మలు బల్లిగను జన్మించవలసివచ్చింది" అని, హేమాంగుడనే రాజు బల్లిగ ఉన్నపుడు శృతదేవుడనే ద్విజోత్తమునితో చెప్పిన విషయం జ్ఞాపకం పెట్టుకోదగినది.

(v) పురాతనము, శిథిలావస్థలో ఉన్నాయని, జనాలకి అడ్డొస్తున్నాయి కనుక తీసేస్తే బోలెడు స్థలమొస్తుందని చారిత్రాత్మక ప్రాచీన కట్టడాలను కూల్చగలరా? తగునా? తిరుమలకొండకూ, అక్కడి 6 శతాబ్దాల కట్టడాలకీ ఆమాత్రం గౌరవములేదా?

ఊరేగింపులకు చోటు చాలడంలేదు. విశాలంగా స్థలం కావాలనుకుంటే తగినట్లు, ఏర్పాట్లు ఎలా చేయాలో ఆలోచించే యంత్రాంగం **TTD**కి లేదా? అనేక చోట్ల కావాలనుకున్నపుడు జనాలను కట్టడి చేయడంలేదా? అమాయకులైన జనాలను తిరుమలస్వామిని అడ్డుపెట్టుకొని చరిత్రను కూల్చివేయడం ప్రమాణాలను ఉల్లంఘించడం, పైగా ఇదే సరైనదంటూ దబాయించడం సహించదగునా?

**2. "బలిపీఠం దాటి ప్రాకారానికి బయట, మాడవీధి దాటి ఉండే నిర్మాణాలకూ, ఆలయానికీ సంబంధం ఏమీలేదు. అందుకే ఆ వెయ్యి కాళ్ళమండపాన్ని కూల్చడం తప్పేమీ కాదు" అనేది, TTD మరియు వారి అగమ సలహాదారుల విచిత్రవాదన:**

**దీనికి సమాధానం:-** మాడవీధి దాటి ఈశాన్యమూల ఉన్న స్వామిపుష్కరిణి కూడా అపుడు ఆలయంతో సంబంధం లేనిదే కావాలసి వస్తుంది. ఇది ఎవరైనా ఒప్పుకుంటారా? పోనీ, వారైనా అంగీకరిస్తారా? స్వామిపుష్కరిణిలోనే బ్రహ్మోత్సవాలలో చివరి అంశముగ. 'తీర్థవారీ' జరుగుతోంది. కనుకనే పుష్కరిణి ఆలయం నుండి విడదీయరాని ఒక భాగమైనట్లే, బ్రహ్మోత్సవ ప్రారంభదినాన గరుడపట పూజ, 5దినాల పవిత్రోత్సనం, కార్తీకపూర్ణిమోత్సవం, ఇవేకాక మరెన్నో ఉత్సవాలలో శ్రీవేంకటేశ్వరుని ఆ వెయ్యికాళ్ళమండపంలోకి తీసుకొని వెళ్ళడం అక్కడే నైవేద్యాలు జరగాలని, ఉత్సవాంగ హోమాదులు జరగాలని ప్రమాణాలైన ఆగమ గ్రంథాలేకాక, మండపనిర్మాతలైన రాజుల శాసనాలు ఉన్నాయి కనుక, ఆ మండపం గూడ ఆలయం నుండి విడదీయరాని ఒకభాగమే అనడంలో ఏ సందేహమూ లేదు. కనుకనే దానిని కూల్చడం ద్వారా ఆలయ స్వరూపాన్ని నాశనం చేసినట్లే.

**3. తిరుమల ఆలయము మాత్రమే నియమానికి చెందినది తప్ప ప్రాకారం బయట ఉండేవాటికి ఆగమ నియమాలు వర్తించవు. ఇది TTD మరియు వారి ఆగమ సలహాదారుల మరో వాదన:-**

ఇది సరికాదు. స్వామిపుష్కరిణి, వెయ్యికాళ్ళమండపం ఆలయానికే చెందిన అంతర్భాగాలనేవి యిప్పటికే తెలుసుకున్నాం! అంతమాత్రమే కాదు. తిరుమల కొండపైన, కొండతోపాటు చుట్టుప్రక్కల ఉండే అనేక ప్రాంతాలు శ్రీవేంకటేశుని సన్నిధిచేత, ఆతని ఆజ్ఞచేత సంస్కరించబడ్డాయి. ఆలయానికి దూరంగా ఉన్న పాపవినాశం తీర్థాన్ని స్వామి ఆరాధనలో స్వీకరించాడు. కొండపైనా, కొండచుట్టూ ఉండే 60కోట్ల తీర్థాలు స్వామి సంబంధంతో పునీతాలై. లోకానికి ఉజ్జీవనకరాలౌతున్నాయని వరాహ పురాణం- భూగోళోపాఖ్యానంలోని ధరణీవరాహ సంవాదంలో, ప్రథమాధ్యాయమంతా స్పష్టపరుస్తోంది.

ఇలా, ఎన్నో పురాణాలలో తిరుమల చుట్టూ ఉండే కొండలన్నీ స్వామిసేవలో పవిత్రాలైనట్టు తిరుచ్చానూరు దాకకూడ శ్రీనివాసుడు వేంచేసినట్టు చెప్తూంటే, అక్కడక్కడికి స్వామి విచ్చేసినట్టు ఉంటూంటే, స్వామిసంబంధం కల్గినచోటల్లా అగమోక్తాలైన ఏదోరకమైన ఉత్సవాలే జరుగుతాయి. అలాంటపుడు ఆలయప్రాకారం బయట ఆగమనియమం వర్తించదు అనడం ఎంతవరకు వివేకవంతమో ఆ అనేవారికే తెలియాలి!

# మహా ప్రాకారం - తిరుమల తిరుపతి దేవస్థానం

## మహా ప్రాకారం అంటే ? దాని ప్రయోజనం?

ఆలయానికి చుట్టూ రక్షణకోసం నిర్మించే కట్టడాన్ని **'ప్రాకారం'** అంటారు.

ఇది రక్షణకోసం, మంగళకరంగా ఉంటుందని, వివిధ దేవతలను ఆయాస్థానాలలో స్థాపించడానికి ఉపయోగపడుతుంది.

## ఇప్పడున్న ప్రాకారాలెన్ని?

తిరుమలలో శ్రీవేంకటేశ్వరస్వామివారి దేవాలయానికి ఎన్ని ప్రాకారాలూ, గోపురాలు ఉండాలో కలియుగాదిలో భగవంతుడే తొండమాన్ చక్రవర్తికి ఆజ్ఞాపించాడని, భవిష్యోత్తరపురాణం, 13వ అధ్యాయం, 33నుండి39వ శ్లోకం దాక స్పష్టంగా ఉంది.

రెండుగోపురాలు, మూడుప్రాకారాలు, ఏడు గుమ్మాలూ, వంటశాల, బంగారపు పూతగల రాగిరేకుతో కూర్చిన బావి, ఇతరమండపాలూ ఉండేట్టు తొండమాన్ చక్రవర్తి శిలామయ ఆలయాన్ని నిర్మించి, స్వామిని అందులోకి విచ్చేయమని ప్రార్థిస్తాడు. శ్రీనివాసుడంగీకరించాడు. ఆ తర్వాత కొన్ని సంవత్సరాలకు ఇక తాను శిలామయ మూర్తిగానే, **<u>ఏమీ తెలియనివానిలా, చూడని వానిలా</u>** ఉండి అన్నీ గమనిస్తూంటానని, ఇక ఎవ్వరితోనూ నేరుగా మాటలాడనని శ్రీనివాసుడే నియమం ఏర్పరచుకున్నాడనిగూడ ఆ పురాణమే తెలిపింది, 14వ అధ్యాయం, 156వ శ్లోకంలో. ప్రస్తుతం తిరుమలలో శ్రీనివాసుని ఆలయానికి 3 ప్రాకారాలు, 2 గోపురాలు, 7 గుమ్మాలు ఉన్నట్లు స్పష్టమౌతోంది.

## TTD రికార్డులు ప్రాకారాలు గురించి ఏం చెప్తున్నాయి?

ఈ ఆలయానికి మూడు ప్రాకారాలున్నాయి. 1) ముక్కోటిప్రాకారం, 2) విమానప్రాకారం, 3) సంపంగిప్రాకారం.

1) **ముక్కోటిప్రాకారం:-** గర్భాలయానికి చుట్టూ మూడువైపులా వ్యాపించి ఉంది. రోజూ భక్తులకు బయటకు, కనపడదు. ముక్కోటి ఏకాదశినాడుమాత్రమే దానిని తెరుస్తారు. లోపల దక్షిణాన 8 1/2 అడుగుల, ఉత్తరాన సుమారు 17 అడుగుల సన్నని దారి మాత్రం ఉంటుంది. అందులోనే ఈశాన్యమూల విష్వక్సేనులవారి సన్నిధి ఉంది.

2) **విమాన ప్రాకారం:-** ధ్వజస్తంభం దాటి లోపలికి వెడితే, భక్తులందరూ ప్రదక్షిణం చేసే ప్రాంగణమిదే. ఇక్కడే బంగారు విమానదర్శనం, దానిమీదుండే విమాన

వేంకటేశ్వరుని దర్శనం జరుగుతుంది. ఆగ్నేయంమూల వరదరాజస్వామి సన్నిధి, దానికి ముందుగ (పురాణాలలో) లక్ష్మీదేవి నిర్మించినట్లు చెప్పే వంటశాల ఉంది. దీనినే అన్నప్రసాదాల 'పోటు' అంటారు. దానిముందు "బంగారుబావి" ఉంది. ఉత్తరంవైపు ఎత్తుగ శ్రీభాష్యకారులైన రామానుజులవారి సన్నిధి, దానికి తూర్పువైపున యోగనరసింహస్వామి సన్నిధి ఉన్నాయి.

3) **సంపంగి ప్రాకారం:-** ధ్వజస్తంభం, రంగమండపం, అద్దాలమండపం. కళ్యాణోత్సవ మండపం, లడ్డూ, వడలవంటి పణ్యారములు చేసే వంటశాల 'బయట పోటు' (ఇది భూదేవి నిర్మింపచేసినట్లు, పురాణాలు చెపుతున్నాయి.) శ్రీవారి నిర్మాల్య మాలికలు వేయడానికి ఏర్పడ్డ 'సంపంగి బావి' మొదలైనవన్ని ఈ మూడవ ప్రాకారం లోపలే ఉన్నాయి. ఆలయానికున్న మహాద్వారంలోంచి లోపలికి అడుగుపెట్టగానే ద్వారానికి రెండువైపులా రెండు దేవతావిగ్రహాలుంటాయి. వాటిని శంఖనిధి, పద్మనిధి అంటారు. ఆ విగ్రహాలక్రింద వాటిని ప్రతిష్ఠచేయించిన రాజుల చిన్న విగ్రహాలు కూడా ఉన్నాయి. దీనికే 'సంపంగి ప్రదక్షిణమని పేరు. ప్రదక్షిణ'మనే పేరేగానీ, లడ్డూల వంటివన్నీ ఇందులో ఉత్తరదిశలో చేస్తూ ఉండటం వల్ల భక్తులకు అందులో ప్రదక్షిణంగ తిరిగే అవకాశం ఉండదు.

## ఈ విషయాన్ని TTD వారే ముద్రించిన గ్రంథాలన్ని స్పష్టంగ చెపుతున్నాయి.

1) సాధు సుబ్రహ్మణ్య శాస్త్రి రచించిన **"తిరుపతి శ్రీవేంకటేశ్వర"** 1981

2) **S.K.** రామచంద్రరావు రచించిన **"ది హిల్‌ష్రైన్ ఆఫ్ వేంగడం"** 1993 ముద్రణ 99వ పేజీ, 197వ నుండి చూడవచ్చు.

3) **Dr. N.** రమేశన్ రచించిన **'ది తిరుమల టెంపుల్'** 1981 ముద్రణ, 84వ పేజీ.

4) జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, రచించిన **"హరికొలువు" TTD** సిరీస్ 585 పేజీ-10.

ఇవే కాక **"TTD ఇన్‌స్క్రిప్షన్స్"** అనే గ్రంథాలను (7+1) 8 వాల్యూమ్స్‌గా సాధు సుబ్రహ్మణ్యశాస్త్రిగారే రచిస్తే 1930, 1998 సం॥రాలలో **TTD** వారే ముద్రించారు. వాటిల్లో 3 ప్రాకారాలపైనా ఎన్నెన్ని శిలాశాసనాలున్నాయో, వాటిల్లో ఏమేమి రాసి ఉన్నాయో ముద్రించారు.

## ఇప్పుడు TTD వారేమంటున్నారు?

రెండే ప్రాకారాలున్నాయి. ముక్కోటి ప్రాకారం లెక్కలోనిది కాదు. దానికి ప్రాకారం లక్షణాలులేవు. అందులో దేవతలులేరు. అక్కడ ఆలయార్చకులు పూజలు

చేయరు. ప్రాకారకొలతలూ సరిగ్గాలేవు. అది వదిలేస్తే ఇక రెండే ప్రాకారాలుంటాయి. అది తప్పు. అందుకే మరొకటి కట్టాలి. మా ఆగమ సలహాదారులూ ఇదే చెపుతున్నారు. పైగా ఇంకో ప్రాకారం కట్టవలసిన నిర్బంధమూ ఏర్పడింది. ఎందుకంటే:

1) ప్రస్తుతం 900 మందే కళ్యాణోత్సవంలో పాల్గొంటున్నారు. ఎక్కువమందికి చోటుచాలడంలేదు. ప్రాకారం దాటి కళ్యాణం, అందులో వాడే వైదికాగ్నిని బయట చేయరాదట. అందుకే మేం మూడో ప్రాకారం కడతాం. దానికై కొండను త్రవ్వేశాం, వెయ్యికాళ్ళమండపంవంటి చారిత్రక కట్టడాలడ్డు వచ్చాయి, కనుక కొట్టేశాం.

2) అమ్మకానికిచేసే లక్ష లడ్డూలు చాలడంలేదు. డిమాండ్‌ను బట్టి 2,3 లక్షలు చేయాలి. బయట చేయరాదని మా ఆగమసలహాదారులమాట. అందుకే మరో ప్రాకారం కట్టి దాని లోపలే లడ్డూలు చేస్తాం. అందుకే మరో ప్రాకారం కడతాం.

3) సరిసంఖ్యలో ప్రాకారాలుండతగదని **"మూడవది"** మేం కడుతున్నాం. ఒకవేళ ఎవరైనా మూడు ఇది వరకే ఉన్నాయంటూ, ఇది సరిసంఖ్యగ నాలుగవదవు తుందన్నా, ఏమీ ఫర్వాలేదు. సరిసంఖ్య, బేసిసంఖ్య అనే నియమమేమియు మా గ్రంథాలలో లేదు. 7 ప్రాకారాలదాక ఎన్నైనా కట్టుకోవచ్చునని ఆగమగ్రంథాలు చెపుతున్నాయని మా ఆగమసలహాదారుల ఉవాచ. పద్మావతీ, గోవిందరాజస్వామి వారి ఆలయాల్లో రెండేసి ప్రాకారాలే ఉన్నాయి. కనుక సరిసంఖ్యలో ప్రాకారాలున్నా తప్పుకాదు.

4) ఉత్సవాలలో ప్రజల సౌకర్యంతో పాటు, పరిశుభ్రత, పారిశుద్ధ్యాలు బాగుపడతాయని.

5) బలిపీఠం దాటితే ఆగమాల నియమాలు వర్తించవు. ప్రాకారాలకూ అంతే.

6) రక్షణవ్యవస్థ, అంటే, సెక్యూరిటీ దేవునికి బాగుండాలని ప్రాకారం కడుతున్నాం. దీనివల్ల వాస్తు కూడ బాగుంటుంది. అసలు ఈ ఆలయానికి వాస్తు చూడక్కర్లేదు. అయినా దానిని మేం సరిచేస్తున్నాం. క్రొత్త ప్రాకారంవల్ల స్వామిపుష్కరిణికి ఏమీ ఇబ్బందిలేదు.

## TTD వారి మాటలు నిజమేనా?

ప్రాకారాలు మూడున్నాయని వారిగ్రంథాలే బోలెడన్ని చెపుతున్నాయని పైన చదివాం. <u>**ముక్కోటి ప్రాకారం కూడా ఒకప్రాకారమే.**</u> దానిలో దేవతలెవరూ లేరు అనడం తప్పు. దేవతలందరి ప్రతినిధిగ శ్రీవిష్వక్సేనులవారున్నారు. అసలు పరివార దేవతలు విగ్రహరూపంలోనే ఉండనవసరంలేదు. మంత్రరూపంలో ఆహ్వానించి అక్కడక్కడ వారిని ఆరాధిస్తారు. ఆరగింపుకాగానే బలిహరణ చేసేటపుడు 8 దిక్కులలో ఇంద్రాది దిగ్దేవతలను

ఆయాస్థానాలలో ఆరాధిస్తారు. అక్కడ విగ్రహాలుండవు. ఆ ప్రాకారంలో మేం బలిహరణ, పూజలు చేయటం లేదు కనుక అది ప్రాకారమే కాదనడం అక్కడివారి అమాయకత. మనం పూజలుమానేస్తే మానిన వానిది దోషం తప్ప అక్కడి దేవతలది కాదు. అంతమాత్రాన అది ప్రాకారం కాకపోతుందా?

అది వేలసంవత్సరాల క్రితం కట్టింది కనుక ఎలా కొలతలున్నాయో అదే నియమవుతుంది. స్వయంవ్యక్తస్థలాలలో ఏ రూపంలో ఉన్నాయో అదే నియమ మమౌతుంది. స్వయంవ్యక్తస్థలాలలో నిర్మాణపరమైన లోపాలు చూడరాదని 'ప్రకీర్ణాధికారః' అనే వైఖానసాగమ గ్రంథం 34వ అధ్యాయం విడమర్చి చెప్పింది. పాపం! ఆగమ సలహాదారులకది తెలియదులా ఉంది.

ముక్కోటి ప్రాకారంపై ఎన్నో శిలాశాసనాలున్నాయని **TTD** వారి పుస్తకాలలో ఉన్నాయన్నాం కద! అర్చకులు కానివారు తిరగడానికి పనికివచ్చే ప్రతీ ఆవరణా ఒక్కొక్క ప్రాకారంతో చుట్టబడి ఉంటుంది. ముక్కోటి ప్రాకారంగూడ అలా అందరూ తిరగడానికి పనికి వచ్చేదే. వైకుంఠ ఏకాదశినాడు అందరూ తిరుగుతారు. అందుకే పూర్వులు దానిని మొదటి ప్రాకారంగ గుర్తించారు. దీనిని బట్టి లెక్కిస్తే **ఇప్పుడున్నవి మూడు ప్రాకారాలే. వారు కట్టాలనుకొనేది నాలుగవదే!**

1) కళ్యాణాలలో ఎక్కువమందికి అవకాశం కల్పించాలనే ఆశయం మంచిదే. దానికోసం వారు బయటికి మార్చాల్సిన అవసరమేలేదు. ఒక్కొక్క టిక్కెట్టుకు ప్రస్తుతం పంపే 5గురికి బదులు ఇద్దరినో ముగ్గురినో పంపిస్తే ఇంకో 150, 200మందికి ఎక్కువ అవకాశం కల్గించవచ్చు. వారి రికార్డుల ప్రకారమే ఇంతవరకూ ఏ సీజన్‌లోనూ ఇప్పుడు ఉన్న సంఖ్య 900కంటె, 30, 40 టిక్కెట్ల కంటె ఎక్కువ ఎప్పుడూ తిరస్కరించిన సంఘటనలు లేవు. కొన్ని కొన్ని రోజులు అసలు సంఖ్య నిండనే నిండదు. టిక్కెట్లు కొన్నవాళ్ళకు కూర్చొనే అవకాశమిచ్చి, ఆ కళ్యాణాన్ని **TTD**వాళ్ళ లోపలి **Tv**ల్లో చూపితే, నిజానికి వేలమంది చూడగల్గుతారు. **TTD** వారికి భక్తుల మీద అంత ప్రేమ ఒలికితే, ఈ పని చేయాలి తప్ప, తప్పుసాకులు చెప్పి చరిత్రను నాశనం చేస్తూ శాస్త్రాన్ని వక్రీకరించరాదు.

కళ్యాణాలలో హోమం చేస్తాం, <u>**అది ప్రాకారం బయట చేయరాదనే వాదన శుద్ధ తప్పని వారి ఆగమగ్రంథాలే**</u> ఘోషిస్తున్నాయి.

ఆలయానికి ఎదుట మండపంలోకి దేవుని వేంచేపుచేసి, అక్కడే సభ్యాగ్నిని తయారు

చేయాలని, అందులో ఏ హోమం ఎలా చేయాలో ఆగమగ్రంథాలన్ని చెప్పాయి. అంతేకాదు అక్కడే ప్రసాదం వండిగూడ నైవేద్యం చేయవచ్చని **విమానార్చనాకల్పం 53వ పటలంలో స్పష్టంగా ఉంది.** ఇంకా ఎన్నో గ్రంధాలలో ఉంది. అవన్నీ యిక్కడ చోటు చాలదని ఇవ్వడంలేదు.

**TTD** వారి ఈ ఆగమపండితులే కళ్యాణం గట్రా బయట చేయవచ్చునని లిఖిత పూర్వకంగ **TTD** కి1998లో వ్రాసి యిస్తే, **TTD** రూ. 50లక్షలతో ఓ మండపాన్ని గూడ కట్టించారనేది జగమెరిగిన రహస్యం.

1992లో అప్పటి ముఖ్యమంత్రితో పశ్చిమాన, ఆలయం వెనుక, కళ్యాణమండపానికి శంకుస్థాపన చేయించారు. అదీ మరచారు. 1998లో రూ. 50లక్షలతో మరో మండపం కట్టేసి, దాన్ని అపై ధ్యానమందిరంగ పేరుమార్చివేసారు. ఇవన్నీ ఆగమసలహాదారులు అంగీకరిస్తూ వ్రాసి యిస్తే, ప్రజాధనాన్ని, స్వామిసొత్తునూ కడుతూ, కొడుతూ అందినంతా కొల్లగొట్టాక, ఇప్పుడు ఏకంగా, ఆయన ఉనికికే భంగం కలిగేలా కొండను ముక్కలు చేసి క్రొత్త ప్రాకారము మరొకటి కడతారట. అందు లోపల కళ్యాణమండపం ఇంకోటి, కడతారట. అందులో 4,5వేలమందైనా కళ్యాణాలుచేయించ వచ్చుట. అంతమందేరీ అసలు? ఒకవేళ అంతసంఖ్య పెరిగితే ఇప్పుడున్న కట్టడాలలో చేస్కోవచ్చే!

ఆలయందాటి బయట కళ్యాణోత్సవాలు జరిగే వైఖానస దేవాలయాలు, శ్రీవిల్లిపుత్తూర్, తిరువల్లిక్కేణి వంటివి ప్రాచీన ఆలయాలెన్నో ఉన్నాయి. తమ సంపాదన కోసం శ్రీనివాసుని చరిత్రనే పణంగా పెట్టారు **TTD** అధికారులు.

2) తిరుమల దర్శించే భక్తులు ఎంత ఎక్కువైనా 60వేలు దాటరు. వారికి ఒక్కొక లడ్డూయిచ్చినా యిప్పుడు చేసేవి చాల ఎక్కువ. పోనీ రెండేసి యిచ్చేట్టయితే, కాస్త అధిక సంఖ్యలో, ఉన్నవాళ్ళే చేయగలరు. అసలు కొందరు భక్తులు వాటిని ఆశించనే ఆశించరు. పాతవంటశాలను పెంచి నిర్మించారు. అలాంటపుడు, ఉన్నవారిని సరిగా చేయనిస్తే 2 లక్షలు లడ్డూలు దాక ఏ శ్రమా లేకుండానే చేసేయగలరు. ఇక దీనికై మరో ప్రాకారం అవసరమా?

☞ వంటచేసినదంతా దేవుడి దగ్గరకు వెళ్ళక్కర్లేదు. ఆరగింపుచేసినది కొంత తెచ్చి బయట వండిన దాంట్లో కలిపితే ప్రసాదమైపోతుందని ఏ ఆగమగ్రంథాలు చెప్తాయో ఆ పండితులకే తెలియాలి! ప్రకీర్ణాధికారం **TTD** సిరీస్ 483లో 490,510వ పేజీలలో "దేవునికి ఆరగింపు చేసిన ప్రసాదాన్ని ఇతర వంటకాలతోకలపడం కూడా పాపమేనని" తెలిపింది.

☞ ఎలానో తయారుచేసినవీ, ఎక్కడో తయారైనవి ప్రసాదంగ అమ్మడం ప్రజల సౌకర్యానికేనా? <u>**నిజంగా ప్రజలకు సౌకర్యం కలిగించాలంటే**</u> ఆగమ గ్రంధాలు చెప్పినట్టుగా దేవునికి ఆరగింపు చేసిన లడ్డూ ప్రసాదాన్ని వచ్చిన భక్తులందరికి అమ్మకము లేకుండా <u>**ఉచితంగా పంచిపెట్టాలి.**</u>

3) **TTD** వారన్నట్లు తిరుమలలో ప్రాకారాలు రెండులేవు. <u>**మూడే అని వారి గ్రంధాలే చెప్తూంటే**</u>, అవి తప్పని వారే వ్రాసుకుంటున్నారు. శిలాశాసనాలను ఖాతరు చేయమంటున్నారు. వారినేమనాలి? మొదట చూపిన <u>**భవిష్యోత్తర పురాణవచనంలో**</u> మూడు ప్రాకారాలున్నాయని ఉంది. మొదటే ఒక ప్రాకారం శిథిలమై ఉంటే దానిని పునరుద్ధరించి, 2 ప్రాకారాలు, 2 గోపురాలతో తొండమాన్ చక్రవర్తి ఆలయం కట్టి "స్వామి ఆజ్ఞ ప్రకారం 3ప్రాకారాలు, 2 గోపురాలూ తయారైనాయి వచ్చి ప్రవేశించమని" ప్రార్థిస్తాడు. శ్రీనివాసుడు ఆనందించి అందులో ప్రవేశించినాడు.

ఆ పురాణవచనాలను అంగీకరించమనడానికి వీల్లేదు. అసలు శ్రీనివాసుని ఉనికికీ, అక్కడి ఆరాధనాపద్ధతులకీ అవే అధారాలు. కనుక వాటిని అంగీకరించక తప్పదు.

★ ఇక, సరిసంఖ్యలోనైనా ప్రాకారాలుండవచ్చుననేది శుద్ధతప్పు.

అన్ని వైఖానస సంహితలలోనూ 3,5,7తో అంతమయ్యేట్లు ప్రాకారాలుండాలే తప్ప మరోలా కారాదు అనే ఉంది.

**TTD వారి సిరీస్ 488, నాగరలిపిలో ఉన్న - విమానార్చన కల్పం, 11వ పటలంలో**

1 ప్రాకారం ఉంటే అధమం,

2 మధ్యమం,

3 ఉత్తమం అని ఒక విభాగం చెప్పింది.

**మూడు దాటి ఒకవేళ 5 ప్రాకారాలుంటే <u>అప్పుడు మాత్రం</u>**

3వది మధ్యమాధమం,

4వది మధ్యమమధ్యమం,

5వది మధ్యమోత్తమమవుతుంది.

**5 దాటి ఒకవేళ 7 ప్రాకారాలుంటే అప్పుడు మాత్రం**

5వది ఉత్తమాధమం,
6వది ఉత్తమ మధ్యమం,
7వది ఉత్తమోత్తమమౌతుందని
ఉంది.

ఇందులో 3 ఉంటే మూడవది ఉత్తమమనే ఉంది తప్ప 4,6 ఉండాలని చెప్పనేలేదు. 5,7 నిర్మిస్తే అందులో 4,6 రాక తప్పవు కనుక వాటికి స్థాయిని నిర్దేశించిందంతే. దీనిని వారి ఆగమ పండితులు అర్థం చేసుకోలేదు.

**TTD వారి సిరీస్ 483, ప్రకీర్ణాధికారం, 6వ అధ్యాయంలోనైతే,** 3కాని, 5కానీ ప్రాకారాలు మాత్రమే ఉండాలని, అందులో ఉండవలసిన దేవతలు స్థానాలను నిర్దేశించిందే తప్ప 4 ప్రాకారాల ప్రస్తావన కానీ, అప్పుడు దేవతలనెక్కడెక్కడ ప్రతిష్ఠించాలి అనేదాన్ని కానీ అస్సలు ప్రస్తావించనుకూడా లేదు.

దీన్నిబట్టి "7లోపు ఎన్నైనా ఉండవచ్చు. కనుక మేం నాలుగవదైనా, సరిసంఖ్య అయినా ప్రాకారం కట్టి తీరుతాం" అనేది ఆగమవిరుద్ధం, ఆచారవిరుద్ధం. దాన్ని సమర్థించే వారిని ఆగమ సలహాదారులు **అనుకోవడం** దేవుని వంచించడమే.

అన్ని వైఖానస గ్రంథాలలోనూ **మొదటి ఆవరణలో విష్వక్సేనుడు** ఉండాలని ఉంది. **రెండవ ప్రాకారంలో మాత్రమే వంటశాల, బావి** ఉండాలని చక్కగాఉంది. **శంఖనిధి, పద్మనిధి అనే దేవతలు మూడవప్రాకార ద్వారానికి ఇరువైపులా** ఉండాలని ఉంది. దీనిని బట్టి చూస్తే విష్వక్సేనుడున్న ముక్కోటి ప్రాకారం మొదటిదని; అన్నప్రసాదాల పోటు, బంగారుబావి ఉన్న విమాన ప్రాకారం రెండవదని, ధ్వజస్తంభం, **శంఖనిధి, పద్మనిధి ఉన్న సంపంగి ప్రాకారం మూడవదిన్నీ** అనే తెలుస్తూంటే ఏవేవో డొంకతిరుగుడు కల్పితాలతో "రెండే ఉన్నాయి ప్రాకారాలు. మూడవదే మేం కడుతున్నా" మంటూ వితండంగ వాదించే ఆగమ సలహాదారులూ, వారిచే ఆ పలుకులు పలికించే **TTD** అధికారులు ఎంత వంచనకు తెగించారూ అనేది స్పష్టమే!

నిజానికి పద్మావతి అమ్మవారికి, గోవిందరాజస్వామివారి ఆలయానికీ 2 ప్రాకారాలు కావు. పద్మావతీ అమ్మవారి సన్నిధి మొదట బలరామ కృష్ణుల ఆలయం.

రాజగోపురానికి ఎదురుగ ఉన్న సన్నిధి అదే. దానికి ఉన్నది ఒకటే పెద్ద ప్రాకారం. ఆపై అందులో పద్మావతి అమ్మవారి సన్నిధి ఏర్పడింది. దానికి లోపల ఒక ప్రాకారం ఏర్పరిచారు.

అలానే గోవిందరాజస్వామి సన్నిధి మొదట పార్థసారధిస్వామివారి ఆలయం. రాజగోపురానికి ఎదురుగ ఉన్నదదే. ప్రాకారం దానికే చెందినది. ఆపై లోపల, గోవిందరాజస్వామివారి ఆలయం రామానుజులవారి కాలంలో నిర్మితమైంది. దానికి ఒకటే ప్రాకారం. రెండున్నాయనేది తెలియని వారిని తప్పుదారి పట్టించడమే. వాటికున్నవి ఒక్కొక్క ప్రాకారమే.

4) ప్రజాసౌకర్యం చేస్తామని చెప్పే తేనెపూసిన కబుర్లు ఎంత నిజమో. తిరుమల వెళ్ళిన ప్రతియాత్రికునికీ తెలుసు. కొండచేరినది మొదలు, దిగేవరకూ, గర్భాలయందాక అంతటా ఎన్ని ఇబ్బందులు, ఎన్ని కర్ణకఠోరమైన తిట్లు, దోపిడికీ గురికావలసి వస్తుందో భక్తులనడిగితే ఏకరువుపెడతారు. గతంలో ఒక మంత్రివర్యులకే ఈ పాట్లు తప్పలేదనేది స్మరించదగినది.

- లోపలి కులశేఖర పడిదాక దర్శనానికి కూడా వెళ్ళనివ్వకుండా, బయటి గుమ్మంలోంచే పో పొమ్మని తిడుతూ నెట్టివేసే ప్రేమ **TTD** అధికారులకు సొంతం. ఇదే ప్రజాసౌకర్యం.
- ప్రజలకు సౌకర్యం కోసమంటూ ఎన్ని కొడతారు. ఎన్ని కడతారు? 15 లక్షలపైబడి భక్తులు చేరే పూరీజగన్నాథ క్షేత్రాన్ని ప్రజాసౌకర్యం పేర నాశనం చేయడంలేదే!
- కాళహస్తిలో పాతాళగణపతి దర్శనానికి పోయే సన్ననిదారిని ప్రజాసౌకర్యం కోసం నాశనం చేయలేదే!
- శుక్రవారపు అభిషేకానికి వేలమందివస్తే ప్రజల మీద ప్రేమ ధారలుగా కారుతోందని గర్భాలయ ద్వారాలు, గోడలు తీసేస్తారా? ఎందుకు కొద్దిమందినే పంపుతున్నారు. ఏం? అక్కడ ప్రజాసౌకర్యం జ్ఞాపకం రాలేదా?
- ప్రజలమీద ప్రేమ పొంగి సినిమా టాకీసులలో గోడలు తీసేసి అందరినీ సినిమా చూడనీయరే! పట్టినంతమందినే వదలి మిగిలి వారిని ఆపేస్తారే! ప్రజాసౌకర్యం ఎందుకు చూడరు?
- ప్రజలమీది ప్రేమలు పొంగిపొరలి ప్రభుత్వాలలో ఉద్యోగాలు పెంచేయడంలేదే? ఏం? యోగ్యులందరికీ ఉద్యోగాలిచ్చేస్తే ప్రజాసౌకర్యం మరింత కలుగుతుంది కదా!

☞ ఇస్లాం మతస్థులు మక్కాలో సైతాను శిలను కొట్టడానికి వెళ్ళేదారి ఇరుకని, పెంచబోతే, వారసత్వాన్ని తాకరాదని నిర్బంధించి నిలిపివేసారు. దానిని జ్ఞాపకం చేసుకోవడం అందరి కర్తవ్యం.

☞ జనాభాను నియంత్రిస్తూ కుటుంబ నియంత్రణ పాటింపచేస్తున్నారే తప్ప, ప్రభుత్వాలు ఇళ్ళు, వాకిళ్ళూ నాశనం చేసి, సీమలు తొలగించి దేశాన్ని విస్తరింపచేస్తున్నారా? దేవుని విషయంలో ఆ మాత్రపు ఆలోచన తట్టదా ఈ ఆగమసలహాదారులకీ, **TTD** అధికారులకీ? లౌకిక విషయాలకే ఇన్ని నిర్బంధాలుంటే, శాస్త్రం చెప్పిన, దేవునికీ, ఆలయానికీ నిర్బంధాలు ఉండవా!

☞ పరిమితికి, ప్రమాణానికీ, ఆగమానికీ, సంప్రదాయానికీ అనుగుణంగ ప్రజా సౌకర్యాలను కల్పించాలేకాని, ప్రజలపేరు చెప్పి పైవాటిని ఉల్లంఘిస్తూ ధనార్జనే ధ్యేయమై దైవద్రోహం చేయరాదు.

☞ ఏ పవిత్రతను ఆశించి భక్తులు వస్తున్నారో, దానికి భంగం రానీయని రీతిలో స్పందించాలే తప్ప, మూలాన్ని నాశనం చేసే అతితెలివిని ప్రదర్శించడం చరిత్రకు ద్రోహం చేయడమే.

☞ తురుష్కులు, ఆంగ్లేయులు దేశాన్ని ఆక్రమించినా, ఎన్నో కొల్లగొట్టుకుపోయినా, వారినుండి రక్షణపొందిన తిరుమలను నాశనం చేసి, వేలసంవత్సరాల చరిత్రను తుడిచి వేసే ఈనాటి ఆగమసలహాదారులను, వారిని పావులుగా నొక్కిపెట్టి ఆడించే **TTD**అధికారులను ఏ కోవలో చేర్చాలి? ఘజనీ, ఘోరీలు ఇప్పటి అధికారుల ప్రతాపం చూసి సిగ్గుతో తలవంచుకోవాలి!

5) బలిపీఠం దాటితే ఆగమాలు వర్తించవనేమాట ఏ వైఖానసాగమమూ చెప్పలేదు. ప్రాకారాలుదాటి బయట మండపాలు కట్టి ధ్వజపటపూజ మొదలుకొని ఎన్నో ఉత్సవాలు చేయమని ఆగమాలే చెప్తున్నాయి. అది బలిపీఠం బయటకాదా? దేవునికి సంబంధించిన ఉత్సవాలెవరైనా ఎక్కడ జరిగినా అవి ఆగమానికి చెందినవే, వాటికై నిర్దేశించిన స్థలాలు ఆగమనియమాలతోనే ఉంటాయి.

వరాహస్వామీ, తిరుమల శ్రీనివాసుడు ఏడుకొండలపై సంచరించిన ప్రతీ అణువూ అతనిదే అవుతుంది. అక్కడ ఆగమమూ వర్తిస్తుంది. అయినా స్వయంవ్యక్తమైన స్వామి గురించి ఏ నియమాలుంటాయో ఆ ఆగమపండితులు వారి గ్రంధాలను యోగ్యులద్వారా చెప్పించుకొని తెలుసుకోవడం ఉత్తమం.

కాస్తోకూస్తో గ్రంధాలు తెలిసి, వ్రాతపూర్వకంగ తమ పాండిత్యాన్ని వెలిబుచ్చిన ఆగమపండితులను **TTD** అధికారులు దారుణంగ తప్పుదారి పట్టించి, వారి లోపాలను తమ చేతిలో పెట్టుకొని, తమ ఇచ్చవచ్చినట్లు ఆడిస్తున్నారనేది సుస్పష్టం. అందుకే, ఏమి పలుకుతున్నారో కూడా తెలుసుకోలేని దైన్యావస్థలో ఆ సలహామండలి కూరుకుపోయి ఉంది.

☞ అందుకే చారిత్రాత్మకమైన పుష్కరిణికి దక్షిణాన ఉండే తీర్థాలను నాశనం చేయడానికి కూడా అంగీకరించారు.

☞ క్రొత్తప్రాకార నిర్మాణం వల్ల యమ, అగ్ని, వశిష్ఠ తీర్థాలు నశిస్తాయి. పుష్కరిణి పవిత్రత నశిస్తుంది. అసలు ప్రాకారం బయట వీధి రావాలి. అది పుష్కరిణి మీద బ్రిడ్జిలా కట్టాల్సివస్తుంది. అలా నిర్మించడానికి ఆగమసలహాదారులు అంగీకరిస్తారా? వారి రాతలకవి విరుద్ధంకాదా?

6) లోపలి ప్రాకారం కంటే బయట నిర్మించే ప్రాకారం లోపలి దానితో సమానమైన విస్తారమైనా కలిగి ఉండాలి. లేదా అంతకంటే ఎక్కువ విస్తారమైన ఉండాల్సి ఉంటూండగ, లోపలి ప్రాకారం 55 అడుగులుండగ, క్రొత్తదాన్ని 48 అడుగులకు కుదించి నిర్మిస్తామని ప్లానులో చూపుతున్నారు. ఇది ఆగమాలకు అనుకూలమా?

☞ తప్పు చేసి దిద్దరాక ఎన్ని రకాల వక్రమార్గాలనో త్రొక్కుతున్నారు. మాస్టర్‌ప్లాన్ పేరుతో ఎప్పటినుండో గుడిచుట్టూ ఉన్న **"అక్రమ నిర్మాణాల తొలగింపు"** జరుగుతున్నా అందులో ప్రాకారనిర్మాణము, వెయ్యికాళ్ళమంటపం తొలగింపు అనే అంశాలు లేవు. అప్పటికవి ఆలోచనలోనే లేవు. హఠాత్తుగ అవి 2002లో అనాలోచితంగా చోటుచేసుకున్నాయి. ఇది కాదని **TTD**వారు నిరూపించగలరా?

☞ 2002 డిశంబర్‌లో ఎజెండాలో లేని అంశంగ **TTD**బోర్డులో ప్రవేశపెట్టి, అంతే తొందరలో అప్పుడే ప్రాకారం కట్టాలి, చారిత్రక కట్టడాలు కూల్చాలని నిర్ణయించేసారు. ఈనాటికీ ఎక్కడ కట్టాలో స్పష్టత లేనేలేదు, ఆవిషయంలో. అంత ఆదరాబాదరా నిర్ణయాలు తీసుకోవలసినంత ఘోరశిథిలస్థితిలో వేయికాళ్ళ మండపం కానీ, ఇతర కట్టడాలు కానీలేవే! కోట్లరూపాయిల ప్లాన్, ఎజెండాలో లేకుండా ఎలా శాంక్షన్ అయిపోయింది? పోనీ, దానిమీద విమర్శలు

రేగినప్పుడైనా, దానిని ఆపి, తగిన వారితో చర్చించకుండా కొండనుశూన్యం చేయాల్సినంత తొందర ఏం ముంచుకొచ్చింది?

☞ 1959లో నిర్మించిన వసంతోత్సవ మండపాన్ని తొలగించాలంటే “తగదు తగదు. అది ప్రాచీనకట్టడ”మంటూ, లిఖితపూర్వకమైన ఆక్షేపణ తెలిపిన అర్చకస్వాములకు, 600సం॥రాల చరిత్ర కల వేయికాళ్ళమండపం నాశనం చేయడాన్ని అంగీకరించడానికి మనస్సెలా వచ్చిందో?

☞ కళ్యాణాలు బయట చేయడాన్ని ప్రమాణాలతో లిఖితపూర్వకంగ, అంగీకరించిన అర్చకస్వాములు ఈవేళ బయట చేయ తగదు కనుక ప్రాకారం కట్టాలనడంలోని ఆంతర్యమేమిటో? వారు ఏ ఏ భయాలకు లొంగి, అధికారుల చేతిలో కీలు బొమ్మలయ్యారో ఆలోచించాలి. కారణాలు తప్పక ఉండే ఉంటాయి. త్వరలో అవి బయట పడతాయి.

☞ పురాతన కట్టడాలకే కాదు, అవి ఉండే స్థలానికీ ఆ ప్రాచీన విలువఉంటుందని రాజ్యాంగం హామీయిస్తూంటే, కూల్చిన దానిని ఎక్కడికో మార్చేస్తామనే **TTD**వారి భావమేమి? దానికి తందానతాన పలికే ఆలయార్చక, ఆగమస్వాముల వంతపాటలోని మర్మమేమి?

☞ శ్రీ చిన్నజీయరువారు పాంచరాత్రులు, వీరికి తిరుమలతో సంబంధం లేదంటున్నారు. వారు పాంచరాత్రులా? కాదా అనేది వేరే విషయం. **TTD** వారే “మాకు వీరే పెద్దలు. వీరి సలహాలు శిరోధార్యాలు” అంటూ చూపించే తిరుమల జీయర్లు ఎవరు?

☞ పడి భాష్యకారుల సన్నిధిని తిరుమల జీయరులు పాంచరాత్రం ప్రకారం పునః ప్రతిష్ఠచేసేయబోతుంటే, వారిని ప్రార్థించి, ఆగమ పండితులను, వారినీ, అధికారులను కూర్చోబెట్టి ఒప్పించి “వైఖానసాగమప్రకారమే” 7.2.2003నాడు ప్రతిష్ఠ జరగడానికీ, అక్కడికి శ్రీవారి మర్యాద వేంచేయడానికి ఏర్పాటు చేసినది శ్రీ త్రిదండి చిన్న జీయరువారు కాదా? అక్కడి ఆగమ పండితులకీ, అధికారులకీ, అర్చక స్వాములకీ ఈ విషయం మరపుకొచ్చింది కాబోలు!

భగవద్రామానుజస్వామివారు వైఖానసాగమాన్నే తిరుమలలో సంస్కరించి జరిగే

ఏర్పాటు చేసారని **TTD**వారి గ్రంధాలే చెపుతున్నాయి. శ్రీ త్రిదండి జీయరువారే కాదు తిరుమల జీయర్లు గూడ ఆ పరంపరవారే అనే విషయం మరువరాదు. వైష్ణవజీయర్లకు వైఖానస, పాంచరాత్ర ఆగమాలు రెండూ సమానంగ గౌరవించదగినవే! ఎక్కడ ఏ నియమం ఉంటుందో, అక్కడ దాన్ని కాపాడటమే వారి కర్తవ్యం. అదే భగవద్ రామానుజస్వామి చేసారు. దాన్ని కాపాడమనే అక్కడ జీయర్ వ్యవస్థను ఏర్పరచినది. అదే "రామానుజార్య దివ్యాజ్ఞ". అది ఎవరైనా పట్టించుకున్నారా?

అక్కడి వారు ఆ విధిని మరిస్తే, లేదా, వారికా అవకాశాన్ని అక్కడి అధికారవర్గం లోపింపచేస్తే దాన్ని పునఃప్రతిష్ఠించడం ఆ సంస్థమీదా, శ్రీవేంకటేశుని మీద గౌరవమంటూ ఉన్న వారందరి కర్తవ్యం. ఇందులో సందేహానికి తావులేదు.

ఇప్పటి మాస్టర్‌ప్లాన్ విషయంకానీ, బోర్డు వారి ఇతర నిర్ణయాలలో కానీ అక్కడి జీయర్లును ఇంతవరకూ ఎప్పుడైనా సంప్రదిస్తున్నారా? ఒకనాడు వారి నేతృత్వంలో అన్ని జరిగేవి. ఇప్పుడు వారు నామమాత్రావశిష్టులు. వారిని ఆర్ధిక పరమైన విషయాలలో కీలుబొమ్మను చేసి, అలాంటి వారిని అడ్డు పెట్టుకొని ఇన్ని ఆటలాడటం, ప్రభుత్వాన్ని, ప్రజానీకాన్ని, చివరికి దేవుణ్ణిగూడ వంచించి తప్పుదారి పట్టించే **TTD** అధికారవర్గం దీనికి తగిన మూల్యం చెల్లించక తప్పదు.

- ఇప్పుడున్న ప్రాకారాలు, రక్షణ కల్గించటంలో ఏ లోపం కల్గిలేవు. అసలు గతంలో బయట ప్రాకారానికి పశ్చిమాన కన్నం పెట్టాలనేది **TTD** వారి యోచన. అది సాగలేదు. అక్కడ **TTD** లో చేతనైన అధికారులు చేరితే రక్షణ కలుగుతుందే తప్ప ఉన్న చరిత్రను నాశనం చేసే అధికారులవల్ల, ప్రాకారాలవల్ల కాదనేది గుర్తించాలి. ఇన్ని రకాలుగా ఇంతమందిని చివరకి ప్రభుత్వాన్ని కూడా దారుణంగా తప్పుదారులు పట్టించే అధికారుల కొమ్ముకాయటం ప్రభుత్వానికి క్షేమంకాదు.
- నేతలు ఏవిధమయిన బలహీనతలకు లోబడి, చట్టవ్యతిరేక చర్యకు పాల్పడుతున్న అధికారులను ఉపేక్షించ తగదు.
- లక్షలాది ప్రజలముందు నోటిమాటగాకాక, ప్రభుత్వ పత్రంగా విడుదలచేసిన "వేయికాళ్ళమండపాన్ని పునఃనిర్మాణము చేస్తాం, ప్రాకార నిర్మాణాన్ని నిలుపుతున్నాం" మొదలైన నిర్ణయాలలో రెండునాల్కల ధోరణి ప్రదర్శించటం రాజ్యాంగానికి అవమానం కాదా?

☞ 'ఏదో కంటి తుడుపుకు కావలసిన, కాగితాన్ని ఎవరో యిచ్చారే తప్ప అది మా పూర్తి సమ్మతికాదు' అంటూ ప్రకటించటం పదికాలాలపాటు ఉండవలసిన వారి లక్షణమేనా? తమ వారిని కోట్లాది ప్రజలముందర అవమానించు కోవటం కాదా?

☞ ప్రజల విశ్వాసంతో చెలగాటమాడటం ఏ నేతలకూ క్షేమం కాదు.

☞ ప్రభుత్వ ఆజ్ఞాపత్రాలను, చంటిపిల్లల కంటి తుడుపు పత్రాలుగా, పిల్లల చెలగాలాటగా భావించటం (అలా ప్రకటించటం) దేశ భవిష్యత్తుకు ప్రమాదకరం. కోట్లాది ప్రజలను తక్కువ అంచనావేయడమే.

☞ అర్థంలేని, ఆక్షేపణలు చేసే 4,5గురు తప్పు ప్రమాణాలతో పద్ధతులను ఎత్తి చూపించి, ప్రజాహితాన్ని పలికిన 50 మంది పీఠాధిపతులు, 200మంది మహంతులు, వేలమంది మధ్య నిజామ్ కాలేజి గ్రౌండ్స్‌లో జూన్ 13వ తారీఖున ముక్తకంఠంగ పల్కిన హితోక్తులూ, భాగ్యనగరమంతా మారు మ్రోగేటట్లు ముక్తకంఠంతో చేసిన ఘోషణా వినపడలేదా! కనపడలేదా! ఎవరో పీఠాధిపతులు **TTD**ని సమర్థిస్తుంటే చిన్న జీయరుకేమి సంబంధమని నోరు చించుకునే వారి చెవులు మూసుకు పోయాయా? పై వందలమంది పీఠాధిపతులూ చెప్పటం వీరి చెవులకు ఎక్కదా?

☞ ఏ వ్యక్తైనా తన రంగంలో ప్రామాణికుడు కాగలడే తప్ప, ప్రతిదాంట్లోనూ తలదూర్చ రాదు, ఈ సన్యాసులు వెళ్ళి ఏ చర్చికో, మసీదుకో సలహాలిస్తారా? వస్త్రధారణ, మనిషి బలం కాదు గౌరవాన్నిచ్చేవి. వ్యక్తికి, విషయంపై అవగాహనయే గౌరవాన్ని, ప్రామాణ్యాన్ని సంపాదించి పెడతాయి. ఇప్పుడు శ్రీచిన్న జీయరును ఆక్షేపించే వ్యక్తులకు వైఖానస- పాంచరాత్రాగమాలపై ఏ మాత్రమూ అవగాహన లేదని వారి అర్థ రహిత ప్రకటనలే చెపుతున్నాయి. వ్యక్తిగతదూషణకే ప్రాధాన్యాన్నిస్తూ, విషయం లేని శుష్కవచనాలతో మీడియానంతా నింపేస్తున్నారు. చేతనైతే, విషయాన్ని చర్చించగలిగితే, ఆధారాలతో ముఖాముఖి నిర్ణయిద్దాం, రమ్మంటే, ధైర్యంలేని సలహాదారులూ, అధికారిగణమూ చెడుమార్గాలనుపట్టి, వెన్నుపోటుగా ఎందరినో ప్రేరేపించి, ఎన్నో రకాల సాధన సంపత్తిని దుర్వినియోగం చేస్తూ ప్రజలను తప్పుదారి పటిస్తోంది. ఇప్పటికైనా శ్రీచిన్న జీయరుస్వామి వారొక్కరే కాదు, సర్వవైష్ణవ సంగోష్ఠిలో పాల్గొన్న పెద్దలందరూ ఆరోగ్యవంతమైన చర్చలను చేద్దామన్నపుడు, స్పందించి జనాలను మాయలో ముంచకుండ ఉండటం **TTD** అధికారుల బాధ్యత. ఆగమసలహాదారుల కర్తవ్యం.

☞ త్యాగముంటే కాషాయానికీ–సంప్రదాయము సొంతజనాలు ఉంటే ఆ పీఠానికి **అంతవరకు** గౌరవాన్ని ఇచ్చుకోవచ్చు. అది ఎవరూ కాదనరు. కాషాయం కట్టినంత మాత్రాన, ఒక పీఠం పేరు పెట్టుకున్నంత మాత్రాన వారికి అన్ని శాస్త్రాలు గురించి మాట్లాడే హక్కు ఉండదు. వారు చెప్పేదల్లా వేదమని అంగీకరించనవసరములేదు. శాస్త్రాన్ని ప్రామాణికంగా చెప్పేవారెవరయినా ప్రామాణికులే అవుతారు. అలాంటి వారే మాట్లాడతగును.

తగుదునమ్మా అంటూ కన్పించిన ప్రతిదాంట్లోనూ వేలు పెడితే "నా బంగారు కన్నంలో వ్రేలు పెడితే..." అన్న చిన్న చీమకథ జ్ఞాపకం చేసుకోవల్సి ఉంటుంది.

☞ అలాగే వైఖానస సోదరులు అందరూ వ్యతిరేకులు అనడానికి వీలులేదు. కాని ప్రస్తుతం వారందరిని విపరీతమైన భ్రమకు లోనుచేసి, పావులుగ వారిని వాడుకుంటు, ఎందరో లబ్ది పొందుతున్నారు. గుర్తించలేని కొందరు వైఖానసులు హద్దులు మరిచి వాస్తవాలను విస్మరించి మాట్లాడుతున్నారు. ఎప్పటికైనా వారికి, తమ వాస్తవస్థితిని గుర్తించగలిగే యోగ్యత ఏర్పడాలని భగవంతుడ్ని ప్రార్థించడం కంటే ప్రస్తుతం చేయగలిగినది ఏమిలేదు. తమను తప్పుదారి పట్టించే వారిని వీరు గుర్తించలేకపోతున్నారు. వారి తప్పును వారు గుర్తించుకోగలిగి సరిదిద్దుకోగలిగితే అదే పదివేలు.

శ్రీ చిన్నజీయరు స్వామివారే కాదు, ఎందరో పీఠాధిపతులు, వందలాది మహంతులు యింతవరకూ ఈవిషయాలను తెలియజేయడంలో విశేష కృషి చేసారు. ఎన్నో నిందలనుభవించారు. ప్రజలకు యిప్పుడిప్పుడే ఒక అవగాహన కలుగుతోంది విషయంలో. ప్రజలు ఈవిషయంలో తీవ్రమైన ఆందోళనకు గురిఅవుతున్నారు. **TTD** చర్యలను వారు సహించడానికి సిద్ధంగలేరు.

**ప్రభుత్వమీవిషయంలో తగిన చొరవ తీస్కొని, తన మాటను నిజంచేస్కోవలసిన అవసరం ఉంది. ప్రభుత్వం తన మాటను మార్చి, తప్పటడుగువేస్తే, భగవంతుడూ, భక్తులే భవిష్యత్తును నిర్ణయించుకుంటారు.**

–ఓమ్ నమో వేంకటేశాయ–

జై శ్రీమన్నారాయణ !

ఇట్లు

వైష్ణవ ప్రతిష్ఠాన్

శ్రీ వేంకటేశ్వర భక్తమండలి సికింద్రాబాద్ వారు భక్తులందరికీ చేసే విజ్ఞాపనము :-

## తిరుమల తిరుపతి దేవస్థానపు

# మహాప్రాకారం అభివృద్ధా? విధ్వంసమా?

ఇటీవల తిరుమలతిరుపతిదేవస్థానం తీసుకున్న "మహాప్రాకార నిర్మాణ నిర్ణయం" దేశవ్యాప్తంగా వివాదాస్పద చర్చనీయాంశమైంది. "భక్తులకు సౌకర్యాలను పెంచి తిరుమలను అభివృద్ధి చేయడంకోసం రూపొందించుకొన్న మాస్టర్‌ప్లాన్‌లో భాగమే మహాప్రాకార నిర్మాణం. ఇది తప్పనిసరైన అవసరం" అని TTD వాదిస్తోంది.

"మహాప్రాకార నిర్మాణం తొందరపాటుతో తీసుకొన్న తప్పుడు నిర్ణయం. ఈ నిర్మాణం వల్ల తిరుమల చరిత్ర, వారసత్వాలను, మతవిశ్వాసాలను ప్రతిబింబింపచేసే చారిత్రక కట్టడాల విధ్వంసం జరుగుతుంది. భక్తులు ఎంతో విశ్వాసంతో భగవంతునికి సమర్పించిన ధనాన్ని తప్పుడు ప్రణాళికలతో అనవసరంగా TTD వృధా చేస్తున్నదని విమర్శకుల వాదన.

72 కోట్ల రూపాయల ఖర్చుతో నిర్మించ తలపెట్టిన మహాప్రాకార నిర్మాణం ఏ మేరకు అవసరం? ఆఅవసరాలను నెరవేర్చడానికి మహాప్రాకారం మినహా మరే ప్రత్యామ్నాయ మార్గాలూ లేవా? చారిత్రక, మతపరమైన కట్టడాల విధ్వంసం అనివార్యమయ్యేంత ఆవశ్యకత నిజంగా తిరుమలలోఉన్నదా?

పలువురు ధర్మాచార్యులు ఈ సమస్యపై చేస్తున్న తీవ్ర ఆందోళనలు ఎంత వరకూ సమజసం? అసలు ఈ సమస్యకు పరిష్కారమేమిటి? భక్త మహాశయుల నెందరినో వేధిస్తున్న ఇలాంటి ప్రశ్నలకు సమాధానం చెప్పేందుకే ఈ కరపత్రం.

### మాస్టర్ ప్లాన్ - మహాప్రాకారం

వేలాది భక్తులతో నిరంతరం రద్దీగా ఉన్న తిరుమలలో భక్తులు ఎదుర్కొంటున్న తీవ్ర అసౌకర్యాలను, ఇబ్బందులను తొలగించడానికి 1970వ దశకంలో TTD అధికారులు ఆలోచించిన అభివృద్ధి ప్రణాళికే- "మాస్టర్ ప్లాన్".

1978 నుండి 1982 వరకూ E.O గా పనిచేసిన శ్రీ P.V.R.K. ప్రసాద్ ఈ **"మాస్టర్ ప్లాన్"**ను బహుళప్రచారంలోకితెచ్చారు. ఈ విషయాన్ని వారు తమ **"సర్వ సంభవామ్"** పుస్తకంలో ఎంతో హృద్యంగా వివరించారు. "తిరుమలను ఒక ఆదర్శవంతమైన **యాత్రా స్థలంగా చేయాలనే"** దృఢ సంకల్పంతో వారు తమపై అధికారులను, నేతలను వొప్పించి ఒక సమగ్ర

వ్యూహాన్ని **"మాస్టర్ ప్లాన్"** పేరుతో రూపొందించుకున్నారు. తిరుమల గ్రామం మొత్తాన్ని సర్వే చేయించి, మూడు వేల నిర్మాణాలను తొలగించి ఇప్పటి ఆస్థాన మండపం, అన్నదానం కాంప్లెక్స్, క్యాంటీన్, కళ్యాణకట్ట, మార్కెట్ కాంప్లెక్స్, క్యూకాంప్లెక్స్‌ల నిర్మాణానికి తగిన వెసులు బాటు కల్పించారాయన. ఇరుకు బజారులా ఉన్న సన్నిధివీధిని విశాలం చేసారు.

ఇన్ని సంస్కరణలకు కారణమైన ఈ **"సమగ్ర వ్యూహం"** మాస్టర్ ప్లాన్‌లో **"మహాప్రాకార నిర్మాణం అంశం"** ఊహామాత్రంగా అయినా లేదు. 2002 వరకూ ఎందరో కార్యనిర్వాహణ అధికారులు తిరుమల అభివృద్ధికోసం ఎన్నో ఆలోచనలు చేసినా వారెవ్వరికీ తట్టని "మహాప్రాకార" నిర్మాణ ఆలోచన, నిర్ణయం **2002 డిసెంబర్‌లో నేటి కార్య నిర్వాహణాధికారి శ్రీ అజయ్ కల్లాం** గారి మనస్సులో పురుడుపోసుకున్నది.

**2002 డిసెంబర్ నెలాఖరులో బోర్డు ఆమోదం** పొందిన వేయికాళ్ళ మండపం తొలగింపు, కళ్యాణ మండపం నిర్మాణం, దేవాలయం చుట్టూ మహాప్రాకార నిర్మాణం- అంతా మాస్టర్ ప్లాన్‌లోభాగమని TTD వాదన. అయితే ఈ మేరకు TUDA, డైరెక్టర్, టౌన్‌ప్లానింగ్, రాష్ట్ర ప్రభుత్వాల సరైన అనుమతి తీసుకోకుండానే వేయికాళ్ళ మండపాన్ని కూల్చివేయాల్సిన తొందర కార్య నిర్వాహణాధికారిగారికి ఎందుకు వచ్చింది? 72కోట్ల రూపాయల వ్యయంతో కూడిన ఈ ప్రాజెక్టు అమలు విషయంలో పాటించాల్సిన ప్రొసీజర్‌ను ఆయన ఎందుకు పాటించ లేకపోయారు?

ఎందరో ప్రముఖులు అభ్యంతరాలు తెలియజేస్తున్నా పట్టించుకోకుండా ఈ ప్రాజెక్టు అమలుకు వారు ఎందుకు మొండి పట్టుదల చూపారు? ఇది తక్షణమే అమలులోనికి రాకపోతే భక్తులకు, దేవాలయానికి ప్రమాదం సంభవించేంతటి తీవ్ర వ్యవహారమేమన్నాఇందులో ఇమిడి ఉందా? పరిశీలిద్దాం.

**కళ్యాణోత్సవ మండపం:-**

మహాప్రాకార నిర్మాణానికి నిశ్చయించుకోవడానికి ప్రధాన కారణాలు కళ్యాణోత్సవ మండపం, లడ్డూల తయారీకి అదనపు వంటగది. తిరుమలలో శ్రీనివాసునికి జరిగే అన్ని రకాల ఆర్జిత సేవలలో "శ్రీవారి కళ్యాణోత్సవ సేవ" ఒకటి. భక్తుల రద్దీ పెరిగే కొద్దీ కళ్యాణోత్సవ సేవలో పాల్గొనే భక్తుల సంఖ్య కూడా పెరిగింది. దీని కారణంగా కళ్యాణోత్సవ స్థలం మార్పులు జరిగాయి. ఈ విషయాన్ని తన "సర్వ సంభవమ్"లో ప్రస్తావిస్తూ శ్రీ P.V.R.K. ప్రసాద్ కళ్యాణోత్సవాలను గుడి వెలుపల జరపాలని భావించారు.

**గుడి ప్రాకారానికి బయట కళ్యాణోత్సవాలు జరుపకూడదా?**

"వైదికాగ్నిని గుడి బయటకు తీసుకు రాకూడదు. కనుకకళ్యాణోత్సవాలను మహాప్రాకారం

లోపలే జరపాల్సి ఉంది. అందుచేత నూతన కళ్యాణ మండప నిర్మాణంకోసం "ఆగమ సలహాదారుల మండలి" సలహాపై మహాప్రాకారం నిర్మిస్తున్నామని TTD వారి వాదన.

## ఇంతకీ ఆగమ సలహా మండలి ఎప్పటి నుండి పనిచేస్తున్నది?

తిరుమల ఆలయంలో వైఖానస ఆగమ విధానాన్ని అనుసరించి పూజాదికాలు జరుగుతాయి. ఆగమ విషయాలలో సలహాలు అందజేసేందుకై "మొదటి సారిగా 1998లో ఐదుగురు సభ్యులతో ఆగమ సలహామండలిని TTD నియమించింది. ఆ తర్వాత ఏడుగురికి పెంచింది. ఆగమ సలహామండలి స్వతంత్ర ప్రతిపత్తి ఉన్న సంస్థ కాదు. తమ సలహాలకు అనుగుణంగా అధికారులను నిర్బంధించి అమలుపరచగల **"శక్తి సామర్థ్యాలు, అధికారాలు సలహా మండలికి చట్టబద్ధంగా లేవు"**. అధికారుల అవసరాలను ఆగమమనే పేరుతో సమర్థించడానికి ఏర్పడ్డ యంత్రాంగమిది.

## కళ్యాణోత్సవాలను గుడి బయటకు తెచ్చే ప్రయత్నాలు:-

కార్యనిర్వాహణాధికారిగా P.V.R.K. ప్రసాద్ పనిచేసిన కాలం నుండి కళ్యాణోత్సవాలను గుడిబయటకు తెచ్చే ప్రయత్నాలు కొద్దో గొప్పో జరిగాయి.

## ఆస్థాన మండపం కళ్యాణోత్సవాలకు ఎందుకు ఉపయోగించలేదు?

"ఆస్థాన మండపంలో" కళ్యాణోత్సవాలను నిర్వహించాలని అధికారులు ఆలోచించారు. అయితే ఈ మండపంలో కళ్యాణోత్సవాలను నిర్వహించేందుకు TTD అధికారులు సీరియస్‌గా ఎప్పుడూ ప్రయత్నించలేదు. ఎందుకంటే?

1. 'ఆస్థాన మండపం' సెల్లార్ భాగాన్నంతా షాపులకు, హోటళ్ళకు, ఇతర వాణిజ్య అవసరాలకు ఇవ్వడం జరిగింది. ఇలా అన్నిరకాల వ్యాపారాలు నడిచే చోటికి ఉత్సవ విగ్రహాలను తీసుకొని వెళ్ళడం అపవిత్రమని భావించారు.
2. ఆస్థాన మండపానికి వెళ్ళే సన్నిధి వీధి కూడా వ్యాపారాలవల్ల జనంతో క్రిక్కిరిసి ఉండేది. ఈ వీధికుండా ఉత్సవ విగ్రహాలను తీసుకొని వెళ్ళడం సమంజసం కాదు.
3. పైగా బయట 'కళ్యాణమండపం'కు వెళ్ళితీరాలనినిర్బందించేంతగాకళ్యాణోత్సవాల సంఖ్య లేదు.

పై కారణాలవల్ల 'ఆస్థాన మండపం'లో కళ్యాణాలు జరగలేదే తప్ప '**ఆగమ సలహా దారుల వ్యతిరేకత**' వల్లకాదు.

## 1992లో మరోచోట మరో కళ్యాణోత్సవ మండపానికి శంకుస్థాపన:

1992 జులైలో దేవాలయానికి పశ్చిమదిశలో కళ్యాణమండపాన్ని నిర్మించాలని TTD నిర్ణయించింది. పశ్చిమ మాడవీధికి దేవాలయ పశ్చిమ ప్రాకారానికి మధ్య కళ్యాణ మండప

నిర్మాణం జరగాలని, పశ్చిమ ప్రాకారం నుండి ఉత్సవ విగ్రహాలు కళ్యాణమండపానికి రావడానికి దారి ఏర్పాటు చేయాలని నిశ్చయించారు. కళ్యాణోత్సవ మండపం చుట్టూ కాంపౌండ్‌వాల్ నిర్మించాలని కూడా ఆలోచన చేసారు.

నాటి ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కరరెడ్డి ఈ నిర్మించ తలపెట్టిన కళ్యాణోత్సవ మండపానికి శంకుస్థాపన చేసారు. TTD ఛైర్మన్‌గా శ్రీ T. సుబ్బిరామిరెడ్డి, E.O.గా శ్రీ M.V.S. ప్రసాద్, ఛీఫ్ ఇంజనీర్‌గా శ్రీ ఆంజనేయులు నాయుడు ఆ సమయంలో ఉన్నారు. వీరెవ్వరూ కళ్యాణమండపం కోసం మరో ప్రాకార నిర్మాణం చేయాలని కాని, వేయికాళ్ళ మండపాన్ని తొలగించాలని కానీ ఆలోచన చేయలేదు.

## 1992లో ముఖ్యమంత్రిగారే శంకుస్థాపన చేసిన చోట కళ్యాణ మండపం ఎందుకు నిర్మాణానికి నోచుకోలేదు?

ముఖ్యమంత్రిగారు స్వయంగా శంకుస్థాపనచేసినా, ఆ స్థలంలో కళ్యాణమండపాన్ని TTD నిర్మించలేకపోయింది. **అందుకు 'వైదికాగ్ని'ని మహా ప్రాకారం బయటకు తీసుకురాకూడదనే ఆగమ సలహాదారుల ఆలోచన కారణం** కాదు. కళ్యాణమండప నిర్మాణానికి అవసరమైన స్థలమంతా ఆక్రమణలకు లోనై ఉన్నది. భూసేకరణ జరిగినప్పటికి ఆక్రమణదారులు మాత్రం స్థలాన్ని ఖాళీచేయలేదు. న్యాయ సంబంధమైన కోర్టు చిక్కులను పరిష్కరించు కుని, ఆక్రమణదారులను వేర్వేరు ప్రదేశాలకు పంపడానికి ప్రభుత్వ అనుమతి పొందడానికి TTDకి పదేళ్ళకు పైగా సమయం పట్టింది. **2003 మార్చినాటికి మాత్రమే ఈ స్థలాన్ని TTD పూర్తిగా ఖాళీచేయించగలిగింది.**

అంటే కళ్యాణమండపాన్ని ఈ శంకుస్థాపన చేసే స్థలంలో నిర్మించే అవకాశం TTDకి 2003లోనే లభించిందన్నమాట. 1992నుండి 2003 వరకూ కళ్యాణమండపం నిర్మించలేకపోవడానికి కారణం 'స్థల ఆక్రమణలే తప్ప' ఆగమ సలహాదారుల వ్యతిరేకత కాదు.

## "వైభవోత్సవ మండపం"లో కళ్యాణోత్సవాలు ఎందుకు జరగలేదు?

దేవాలయానికి పశ్చిమదిశలో కళ్యాణోత్సవ మండప నిర్మాణానికి శంకుస్థాపన చేసినప్పటికీ కోర్టుసంబంధమైన వివాదాల కారణంగా దానిని పూర్తిచేసే అవకాశం లేకపోవడంతో 1998వ సంవత్సరంలో మరొక చోట కళ్యాణోత్సవ మండపాన్ని నిర్మించాలని TTD నిర్ణయించింది. శ్రీస్వామివారి పుష్కరిణికి ఎదుటగా, రామ్ బగీచా గెస్ట్ హౌస్‌కు దగ్గరలో 50లక్షల రూపాయల ఖర్చుతో 'వైభవోత్సవ మండపం' పేరుతో **కళ్యాణమండపం నిర్మాణమైంది.**

అప్పటి ఆస్థాన వైఖానస పండితుడు శ్రీ మాడంబాకం శ్రీనివాసాచార్యులు సలహా తీసుకొన్న తర్వాతనే TTD ఈ నిర్మాణాన్ని చేసింది.

కళ్యాణ మండపం నిర్మించాక ఒక పత్రికలో ప్రాకారానికి బయట కళ్యాణోత్సవాలు నిర్వహించరాదనే విమర్శ వచ్చింది. దాంతో "ఆగమ సలహాదారుల మండలి" పేరుతో 5గురు సభ్యులను 1998లో మొదటిసారి నియమించి వారి అభిప్రాయాన్ని ఈ అంశంపై TTD కోరింది.

ఈ ఆగమ సలహాదారుల మండలిలో శ్రీమాడంబాకం శ్రీనివాసాచార్యులుతోపాటు ఇప్పుడు దేవాలయ ప్రధాన అర్చకులలో ఒకరుగా వ్యవహరిస్తున్న శ్రీ A.V. రమణ దీక్షితులు కూడా ఉన్నారు. దేవాలయ ప్రాంగణానికి బయట కళ్యాణోత్సవాలను నిరభ్యంతరంగా నిర్వహించ వచ్చని ఐదుగురు సలహాదారులలో నలుగురు వ్రాతపూర్వకంగా తెలియజేసారు. కేవలం ఒక్కరు మాత్రమే దీనికి అభ్యంతరం తెలిపారు.

శ్రీరమణ దీక్షితులు, శ్రీమాడంబాకం శ్రీనివాసాచార్యులుతో కూడిన ఈ నలుగురు వైఖానస ఆగమ సలహాదారులు **కళ్యాణోత్సవాలు దేవాలయ ప్రాంగణ బయట నిర్వహించవచ్చని తెలుపుతూ** అందుకు అనుమతిని తెలియజేసే గ్రంథ సంబధమైన ఆధారాలను TTD కి సమర్పించారు. వారు TTD కి ఆనాడు సమర్పించిన వైఖానస ఆగమ గ్రంధాల ప్రమాణాలలో కొన్నింటిని క్రింద ఉదహరిస్తున్నాము.

1. కాశ్యప జ్ఞానకాండ, పేజీ 17
2. విమానార్చన కల్పము, పేజి 245
3. యజ్ఞాధికారః, పేజీ 145, 146
4. ఖిలాధికారము పేజి 272
5. అత్రి సంహితాయామ్ –సమూర్తార్చనాధికారే – పేజి నెం. 199

కేవలం తిరుమల ఒక్కటే వైఖానస ఆగమ గ్రంధాలను అనుసరించే దేవాలయం కాదు. ఈ ఆగమశాస్త్రాన్ని అనుసరించి ఎన్నో దేవాలయాలు భారతదేశంలో ఆరాధనాదులను నిర్వహిస్తున్నాయి. అలాంటి దేవాలయాలలో ఎప్పటినుండో కళ్యాణోత్సవాలను దేవాలయానికి బయట నిర్వహించే సంప్రదాయం ఉన్నది. **ఉదాహరణకు:-**

1. వైఖానస ఆగమం ప్రకారం నడిచే శ్రీవిల్లిపుత్తూరులోని గోదాదేవి దేవాలయం.
2. తంజావూరు దగ్గర ఉన్న వైలాళి మణవాళస్వామి దేవాలయం.

ఈ విధంగా ఐదుగురు సభ్యులలోని మెజారిటీ సభ్యుల (నలుగురు సభ్యుల) సలహా ప్రకారం 1999లో డా. I.V. సుబ్బారావు కార్యనిర్వాహణాధికారిగా ఉన్న సమయంలో కళ్యాణోత్సవాలను వైభవోత్సవ మండపంలో నిర్వహించాలని TTD నిర్ణయించింది. ఆ నిర్ణయాన్ని ఇప్పటికీ మార్చలేదు.

వైఖానస ఆగమ సలహామండలిలోని మెజారిటీ సభ్యుల అభిప్రాయం మేరకు TTD వైభవోత్సవ మండపంలో కళ్యాణోత్సవాలను నిర్వహించాలని నిర్ణయించినా, ఆ తర్వాత ఆ దిశగా తగిన చొరవ తీసుకోలేదు. ఇందుకోసమై 50 లక్షల రూపాయలు దేవుని డబ్బు ఖర్చు పెట్టి నిర్మించిన వైభవోత్సవ మండపం కాస్తా 'ధ్యానమండపం'గా పేరు మార్చుకుంది.

2002 డిసెంబర్ 26వ తేదీన మరల ఆగమ సలహామండలిలో ఈ "సమస్య చర్చ"కు వచ్చింది. సలహా మండలిలోని ఏడుగురిలో ఆరుగురు సభ్యులు కళ్యాణోత్సవాలను దేవాలయం బయట నిర్వహించవచ్చని అభిప్రాయపడ్డారు. 1999లో ఏ సభ్యుడైతే కళ్యాణోత్సవాలు దేవాలయం బయట జరపరాదని వాదించాడో ఇప్పుడూ అతడే అదే అభ్యంతరాన్ని తెలియ జేసాడు.

ఏడుగురు సభ్యులలో ఆరుగురు దేవాలయం బయట కళ్యాణోత్సవాలు జరపటానికి అనుకూలం. అయితే దేవాలయానికి మరో ప్రాకారం నిర్మించి అందులో కళ్యాణమండపాన్ని నిర్మించవచ్చనే సూచనను మాత్రం ఏడుగురు సభ్యులనుండి ఏకాభిప్రాయంగా TTD రాబట్టగలిగింది.

## కార్యనిర్వహణాధికారి శ్రీ అజయ్‌కల్లాం అత్యుత్సాహం:

**2002 నవంబర్ 9న** TTD కార్యనిర్వహణాధికారిగా శ్రీ అజయ్‌కల్లాం పదవీబాధ్యతలు స్వీకరించారు.

పదవీబాధ్యతలు చేపట్టి రెండు నెలలు నిండకుండానే విషయం లోతుపాతులలోకి వెళ్ళకుండా "మహాప్రాకార నిర్మాణాని"కి శ్రీ అజయ్‌కల్లాం ముందుకు వెళ్ళారు.

"ఆగమ సలహామండలి"లోని మెజారిటీ సభ్యుల (ఏడుగురికి ఆరుగురు) అభిప్రాయం మేరకు వైభవోత్సవ మండపాన్ని కళ్యాణోత్సవాలకు ఉపయోగించే విషయం పట్ల వారు ఏ మాత్రమూ శ్రద్ధ చూపలేదు.

'మహాప్రాకార నిర్మాణం' లో ఉండే సాధక బాధకాలను గూర్చి లోతుగా పరిశీలించలేదు. ఆగమ సలహాదారుల సలహా అమలుకు సంబంధించి ఆ సమయంలో *TTD జీయంగార్ల* అభిప్రాయంకానీ, ఇతర పీఠాధిపతుల అభిప్రాయాలను కానీ నిపుణులైన అనుభవజ్ఞుల అభిప్రాయాలను కానీ స్వీకరించాలనే ఆలోచనే *E.O. గారికి* లేకుండా పోయింది. *TTD* జీయ్యంగార్లకు ఆగమ సలహామండలి కమిటీలో సభ్యత్వమే లేదు.

## మహాప్రాకారానికి బోర్డు అంగీకారం

**2002 డిసెంబర్ 27,28లో** జరిగిన TTD బోర్డు సమావేశంలో **"ఎరైజింగ్ అంశం"**గా కార్యనిర్వహణాధికారి మహాప్రాకార నిర్మాణ అంశాన్ని ప్రవేశపెట్టారు. ముందుగా **తమ ఎజెండాలేకపోయినా,** ఈ అంశాన్ని బోర్డు స్వీకరించి నూతన కళ్యాణ మండప నిర్మాణం

కోసం మహా ప్రాకారాన్ని కట్టడానికి సూత్రప్రాయంగా అంగీకరించింది. వేయికాళ్ళమండపాన్ని తొలగించి **తగిన స్థలంలో** దానిని పునర్నిర్మించ డానికి అవసరమైన చర్యలు తీసుకోవలసిందిగా కార్యనిర్వహణాధికారికి సూచించింది.

తన తొందరపాటుతనంతో కార్యనిర్వహణాధికారి 'సమగ్ర సమాచారం లేకుండానే మహా ప్రాకార నిర్మాణం విషయంలో బోర్డును తప్పుదారి పట్టించారనే విమర్శ ప్రారంభమైంది.

## TTD అవసరాలకు మహాప్రాకార నిర్మాణం తప్పనిసరా? ప్రత్యామ్నాయాలు లేవా?

### I) కళ్యాణోత్సవాలను గూర్చిన ప్రత్యామ్నాయ మార్గాలు :

### ఎ) ఆర్జిత కళ్యాణోత్సవాల సభ్యుల సంఖ్యను తగ్గించడం :-

ప్రస్తుతం TTD ఆర్జిత కళ్యాణోత్సవంలో ఐదుగురిని ఒక్కటిక్కెట్టుపై అనుమతిస్తున్నది. ఈ సంఖ్యను రెండుకు తగ్గిస్తే ఉన్న స్థలంలోనే మరో మూడొందల మందికి (150 టిక్కెట్లు) కళ్యాణోత్సవ సేవాభాగ్యాన్ని కల్పించవచ్చు. అనేక సందర్భాలలో భక్తుల రద్దీ దృష్ట్యా సంఖ్యను తగ్గించిన అనుభవం TTDకి ఉన్నది. ఉదాహరణకు 1). ఆర్జిత కళ్యాణోత్సవాలలో10 నుండి 5కు 2). ప్రత్యేక కళ్యాణోత్సవాలలో 5 నుండి 2కు, 3). పవిత్రోత్సవంలో 10 నుండి 5 కు 4). సహస్ర కలశాభిషేకంలో 10 నుండి 6కు 5). తిరుప్పావడైలో 10 నుండి 6కు 6). అష్టదళ పాదపద్మారాధనలో 5నుండి 2కు - ఇలా సంఖ్య తగ్గించిన సందర్భాలు ఎన్నో ఉన్నాయి.

**బి).** మహాప్రాకారంతో నిమిత్తం లేకుండా 'వైభవోత్సవ మండపం'లో కళ్యాణాలు చేయవచ్చు. ఆగమ సలహాదారుల అనుమతితోనే దేవుని సొత్తు 50లక్షల రూపాయిల ఖర్చుతో నిర్మించిన వైభవోత్సవమండపంలో కళ్యాణాలు ఎందుకు చేయ కూడదు? 5గురికి 4గురు, ఏడుగురులో ఆరుగురు-ఆగమసలహాదారులు అంగీకరించిన అంశాన్ని బోర్డు, E.O. ఎందుకు విస్మరించారు?

**సి).** అవరోధాలన్నీ తొలగిపోయాయి కాబట్టి 1992లో కళ్యాణోత్సవమండప నిర్మాణం కోసం శంకుస్థాపన జరిగినస్థలంలోనే మండపాన్ని నిర్మించవచ్చు. శంకుస్థాపనచేసిన సమయంలో TTD చైర్మన్‌గా ఉన్న శ్రీసుబ్బిరామిరెడ్డి ఇప్పుడూ చైర్మన్‌గా ఉన్నారు.

**డి).** వేయికాళ్ళ మండపాన్ని అదే స్థానంలో పునర్నిర్మించి కళ్యాణమండపంగా వినియోగించడం.

### II). లడ్డూల తయారీకి మహాప్రాకార నిర్మాణం అవసరమా?

ప్రస్తుతం సంపంగి ప్రాకారంలో ఉత్తర, పశ్చిమదిశలలో లడ్డూల తయారికి రెండు వంటశాలలు (పోటు) ఉన్నాయి. ఉత్తరం వైపు ఉన్న 'పోటు'లో **మిరాశి వ్యవస్థఉన్న రోజుల్లో, రోజుకు లక్షన్నర లడ్డూలు చేసిన అనుభవం** ఉన్నది. పశ్చిమదిశలో నిర్మించిన 'పోటు'లో షిఫ్ట్

పద్ధతిలో పనిచేయించి లక్ష లడ్డూలను చేయించవచ్చు.రెండు పోటుల ద్వారా కనీసం రోజుకు రెండు లక్షల లడ్డూలు తయారు చేసే అవకాశం ఉన్నది. రోజూ దర్శనం నిమిత్తంగా వచ్చే భక్తులు సాధారణంగా 50,000కి మించరు. సగటున భక్తునికి రెండు లడ్డూల చొప్పున లెక్కేసుకున్నా ప్రస్తుత లడ్డూల అవసరం రోజుకు 'లక్ష' మాత్రమే. ప్రస్తుత అవసరాలకు రెట్టింపు స్థాయిలో 'లడ్డు'లను తయారు చేసే అవకాశం ఇప్పుడున్న వంటశాలలోనే ఉన్నప్పుడు లడ్డుల తయారీ పేరుతో 'మహా ప్రాకార నిర్మాణానికి' TTD ఎందుకు తొందరపడింది?

కళ్యాణోత్సవాల విషయంలోకానీ, లడ్డూల విషయంలో కానీ ఇలాంటి ప్రత్నామ్నాయ మార్గాలు ఉండగా 72 కోట్ల రూపాయల ఖర్చుతో చారిత్రక కట్టడాలను విధ్వంసం చేసి మహా ప్రాకారం నిర్మాణం చేయడం అవసరమా?

## వేయికాళ్ళ మండపం తొలగింపు అవసరమా?

శ్రీవారి ఆలయ మహాద్వారానికి ఆగ్నేయ దిశగా మిట్టప్రదేశంలో ఉన్న పెద్దమండపమే వేయికాళ్ళమండపం. క్రీ.శ. 15వ శతాబ్దంలో ఇది నిర్మితమైంది. క్రీ.శ. 18-1-1464నాటి శిలాశాసనం ఈ మండప నిర్మాణ విశేషాలను వివరించింది. ఉత్సవవిగ్రహాలను ఈ మండపంలోని వేదికవద్దకు తెచ్చి, పవిత్రోత్సవం వంటి మతపరమైన కార్యక్రమాలు నిర్వహించేవారని ఈ మండపాన్ని వినియోగించేవారిని శాసనాలు తెలుపుతున్నాయి.

తన **"హిల్ ష్రైన్ ఆఫ్ వేంగడం"** గ్రంథంలో శ్రీ యస్.కె. రామచంద్రరావు పేజి 79లో ఈ అంశాన్ని ప్రస్థావించారు.

కాలక్రమంలో అధికారుల నిర్లక్ష్యానికి గురై వేయికాళ్ళమండపం రకరకాలుగా వినియోగించబడింది. చివరకు 2003లో ఈ చారిత్రక, వారసత్వ వైభవ కట్టడం విధ్వంసానికి గురైంది.

ఆంధ్రప్రదేశ్ **"ఏనిషెంట్ అండ్ హిస్టారిక్ మాన్యుమెంట్స్ ఆఫ్ ఆర్కియాలాజికల్ సైట్స్ అండ్ రిమైన్స్ యాక్ట్ 1960"** సెక్షన్ 2(ఎ) లో తెలియజేసినట్లుగా 100 సంవత్సరాల పూర్వం నిర్మించిన కట్టడం ఏదైనా "ప్రాచీన కట్టడం"గా పరిగణింపబడుతుంది.

ఈ చట్టప్రకారం 550 ఏళ్ళక్రితం నిర్మితమైన "వేయికాళ్ళమండపం" పరిరక్షించి తీరవలసిన చారిత్రక చట్టడం. **దీని విధ్వంసం చట్టప్రయోజనాలకు వ్యతిరేకం. జాతి చరిత్ర సంస్కృతికి పెనుద్రోహం.**

మతపరమైన, చారిత్రకమైన ప్రాధాన్యం ఉన్న కట్టడాల విధ్వంసం, తొలగింపు సహజంగా ప్రజలను తీవ్ర అసంతృప్తికి, ఆందోళనకు గురిచేస్తుంది. ఉదాహరణకు:-

1 డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ విశాఖపట్టణంలో ఒకప్పుడు నివసించిన వసతిగృహాన్ని (రౌండ్‌హౌస్) విధ్వంసం చేయడానికి ప్రయత్నించినప్పుడు.

2 చెన్నైలో డిజెపి ఆఫీస్‌ను విధ్వంసం చేసినప్పుడు

3 బెంగుళూరులో హైకోర్టు ఆఫీసును ధ్వంసం చేయడానికి ప్రయత్నించినప్పుడు ప్రజలు ఆందోళనచేసి ఆ కట్టడాలను పరిరక్షించుకొన్నారు. చెప్పుకోవాలంటే ఇలాంటి ఉదాహరణలు ఎన్నో ఉన్నాయి.

4 తిరుమలలోనే ప్రధాన అర్చకులు, ఆగమ సలహాదారులు అయిన శ్రీ రమణదీక్షితులు నిండా 50 ఏళ్ళ చరిత్రలేని వసంతమండపాన్ని TTD తొలగించడానికి ప్రయత్నించినప్పుడు ఇదే కారణం చూపి వ్రాతపూర్వక అభ్యంతరాన్ని తెలియజేసారు. **అదే వ్యక్తి ఇప్పుడు 550సంవత్సరాల చరిత్రకలిగిన వేయికాళ్ళమండప నిధ్వంసానికిఅంగీకరించడానికి వెనుక ఉన్న మర్మమేమిటి?**

**ప్రభుత్వం తిరిగి వేయికాళ్ళమండపాన్ని అక్కడే నిర్మించడానికి తీసుకున్న నిర్ణయాన్ని వ్యతిరేకించడంలో ఆంతర్యం ఏమిటి?**

**వేయికాళ్ళమండప పునర్నిర్మాణంలో భిన్నాభిప్రాయాలు:**

ఒక స్పష్టమైన అవగాహనకు రాకుండానే వేయికాళ్ళమండప విధ్వంసానికి, మహాప్రాకార నిర్మాణానికి TTD తొందర పడిందనేది సుస్పష్టం.

1 ఇప్పుడున్న స్థలం నుండి వేయికాళ్ళమండపాన్ని తొలగించి వాయువ్యంలో పునర్నిర్మించాలని ఆగమ ఎడ్వైజరీ కమిటీ సలహా ఇచ్చింది.

2 ఎండోమెంట్ డిపార్ట్‌మెంటుకు చెందిన శ్రీ పెరుమాళ్ళ స్థపతి విమానాన్ని కేంద్రంగా చేసుకొని పశ్చిమదిశగా వేయికాళ్ళమండపాన్ని నిర్మించాలని సలహా ఇచ్చారు.

3 కంచికి చెందిన పద్మశ్రీ గణపతి స్థపతి **'తొలగించిన స్థలంలోనే'** వేయికాళ్ళ మండపాన్ని పునర్నిర్మించాలని సలహా ఇచ్చారు.

ఇప్పటికీ వేయికాళ్ళ మండప పునర్నిర్మాణం విషయంలో TTD కి ఒక స్పష్టమైన విధానంలేదు. తాము సంప్రదించిన వాస్తు, ఆగమ పండితుల భిన్నాభిప్రాయాలను సమన్వయం చేసుకొని ఒక నిర్ణయానికి రాకుండానే TTD వేయికాళ్ళమండపాన్ని **తొలగించడంలోని లోగుట్టు ఏమిటో?**

**వేయికాళ్ళమండపం అక్కడ ఉండటం యాత్రికులకు అసౌకర్యమా?**

1 వేయికాళ్ళమండపం ఉన్నచోట నిలబడి భక్తులు ఎంతో చక్కగా ప్రతిరోజూ **"సహస్ర దీపాలంకరణ సేవ"**ను దర్శించేవారు.

2 పండుగల రోజుల్లో శ్రీవారి ఉత్సవ ఊరేగింపులను ఈ ఎత్తైన స్థలం పైనుండి వేలమంది బాగా చూడగలిగేవారు.

3 శ్రీవారి ఆలయంలోకి దర్శనానికి వెళ్ళే భక్తులకు వేయికాళ్ళమండపం ఏమాత్రం అవరోధంకాదు. ఎందుకంటే దర్శనానికై దేవాలయంలోకి ప్రవేశించే దారితో కాని, నిష్క్రమించే దారితో కానీ వేయికాళ్ళ మండపానికి ఏమాత్రం సంబంధం లేదు.

4 TTDచరిత్రలో వేయికాళ్ళ మండపం వద్ద ఒక్క తొక్కిసలాటైనా జరిగిన దాఖలాలు లేవు.

తిరుమల వెళ్ళే భక్తులకెవరికైనా పై అంశాలలోని నిజం స్పష్టంగా బోధపడుతుంది, ఒక్క TTD అధికార వర్గానికి తప్ప.

## దేవాలయానికి ముందున్న తూర్పు మాడవీధి విస్తరణ సమస్య

బ్రహ్మోత్సవంలాంటి పండుగలు నిర్వహించే సమయంలో మహారథాలు తిరిగేందుకు దేవాలయానికి ముందున్న తూర్పు మాడవీధి కాస్త ఇరుకుగా ఉంది. 90 అడుగుల మేరకు తూర్పువీధిని విస్తరించినట్లయితే ఉత్సవ విగ్రహాల ఊరేగింపుకు సౌకర్యం బాగా ఉంటుంది. ఈ అవసరం మేరకు TTD మాడవీధిని విస్తరించడానికి నిర్ణయం తీసుకొన్నది. "వేయికాళ్ళ మండపాన్ని తొలగించడం ఈ మాడవీధి విస్తరణ" అనే రెండూ వేర్వేరు అంశాలు. ఈ రెండింటికీ ముడి పెట్టడంతప్పు.

## మహా ప్రాకార నిర్మాణ నిర్ణయంలో తొందరపాటుతనం :

1) వేయికాళ్ళమండపాన్ని తొలగించి కళ్యాణోత్సవ మండపాన్ని నిర్మాణం చేయడం కోసం 2) లడ్డూల తయారీ కోసం మహాప్రాకారాన్ని నిర్మాణం చేయాలనుకోవడం ఎంత తొందరపాటుతనమో ఇప్పటిదాకా విశ్లేషించాము. మహాప్రాకార నిర్మాణంలోని మరి కొన్ని కోణాలను పరిశీలిద్దాం.

"ఇప్పుడున్న దేవాలయానికి పశ్చిమ, ఉత్తర, దక్షిణ దిశలుగా 55 అడుగుల దూరంలో మహాప్రాకార నిర్మాణం జరగాలని" ఆగమ సలహా మండలి సలహా యిచ్చినది. ఈ సలహా అమలులో ఉన్న ప్రమాదాలను గమనిద్దాం.

## పుష్కరిణికి ప్రమాదం :

శ్రీవారి దేవాలయానికి ఈశాన్యంలో ఉన్న శ్రీస్వామివారి పుష్కరిణి ప్రాధాన్యమేమిటో భక్తులందరికీ తెలుసు. ఆగమ సలహామండలి తెలియజేసినట్లు ఉత్తరదిశగా మహాప్రాకార గోడ నిర్మించాలంటే పుష్కరిణిలో కాలమ్స్ నిర్మించి దానిపైన శ్లాబ్ వేయాల్సి ఉంటుంది.

పుష్కరిణిలో అన్నివైపులా ఎన్నో పుణ్యతీర్థాలున్నాయని పురాణ శాస్త్రాలు చెప్పాయి. TTD పుష్కరిణిపై చేపట్టిన నిర్మాణాలవల్ల ఆ భాగంలో ఉన్న అగ్నితీర్థం, యమతీర్థం, వశిష్ఠతీర్థాలు దెబ్బతింటాయి. ప్రాకారం దాటి చుట్టూ రావలసిన వీధికి చోటేలేదు. ఉత్తరాన అది పుష్కరిణి మీదనుండి కట్టవలసి వస్తుంది. కాగా ఎండోమెంట్ శాఖకు చెందిన రిటైర్డ్ స్థపతి, చరిత్రకారుడు శ్రీ యస్.కె. రామచంద్రరావులు ఉత్తరంవైపున మహాప్రాకార నిర్మాణానికి 48 అడుగుల దూరం సరిపోతుందని తెలియజేసారు. ఆగమ సలహామండలి '55 అడుగుల దూరం' ఉంచాలనే సూచనకు ఇది వ్యతిరేకం. TTD సంప్రదించిన ఆగమ పండితులు. నిపుణులు, చరిత్రకారులమధ్య ఏకాభిప్రాయం లేకపోవడం ఇక్కడ గమనించదగినది.

## పెద జీయంగారి మఠానికి, స్వామి హాథీరామ్‌జీ మఠానికి ప్రమాదం:

మహా ప్రాకార నిర్మాణం కారణంగా విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవర్తకులు శ్రీ రామానుజాచార్యుల వారి కాలంలో నిర్మాణమైన చారిత్రక, మతపరమైన కట్టడం పెద జీయంగారి మఠం పూర్తిగా విధ్వంసమౌతుంది. ఈ మఠములో శ్రీరామానుజులవారు ఏర్పాటు చేసిన ఆరాధనామూర్తి శ్రీరామచంద్రుల వారిని ఇక్కడ నుండి తొలగించాల్సి వస్తుంది.

సాక్షాత్తూ వేంకటేశ్వరస్వామి వచ్చి పాచికలాడిన స్థలమని ప్రసిద్ధిగాంచిన స్వామిహాథీరామ్‌జీ మఠానికి సంబంధించి 850 చదరపు గజములలోని నిర్మాణాలు ధ్వంసమౌతాయి.

TTD అభివృద్ధి సాకుతో ఖర్చుపెట్టే 72 కోట్ల రూపాయలకన్నా, ఈ మతపరమైన, చారిత్రక కట్టడాల పట్ల భక్తుల శ్రద్ధా విశ్వాసాల విలువ ఎంతో ఎక్కువ. వీటిని గౌరవించడం TTD బాధ్యత. అయితే తాము పట్టిన కుందేటికి మూడేకాళ్ళనే మొండివైఖరితో అధికారులు అభ్యంతరాలను పట్టించుకోకుండా విధ్వంసాన్ని రచించారు.

## అసలు ఇంతకీ కట్టబోయే మహాప్రాకారం ఎన్నవది?

TTD అధికారులు ప్రస్తుతం దేవాలయానికి రెండే ప్రాకారాలున్నాయని, ఇప్పుడు కట్టబోయేది మూడవ ప్రాకారమని వాదిస్తున్నారు.

TTD వారు ముద్రించిన

1. సాధు సుబ్రమణ్యశాస్త్రి రచించిన "తిరుపతి వేంకటేశ్వర" (1981)
2. డా॥ ఎన్. రమేశన్ రచించిన "ది తిరుమల టెంపుల్" (1981)
3. ఎస్.కె. రామచంద్రరావు రచించిన 'ది హిల్ ష్రైన్ ఆఫ్ వేంగడం' (1993)
4. జాలకంటి బాలసుబ్రమణ్యం రచించిన "హరికొలువు"
5. TTD తాజా వెబ్‌సైట్- www.tirumala.org

అటువంటివన్నీ ప్రస్తుతం తిరుమలలో ఉన్నవి మూడు ప్రాకారాలని అవి 1) ముక్కోటి ప్రాకారం 2) విమాన ప్రాకారం 3) సంపంగి ప్రాకారం అవి వివరిస్తున్నాయి.

ఈ పైవన్నీ ప్రామాణికం కావని, ఇప్పుడున్నవి వైఖానస ఆగమం ప్రకారం రెండే ప్రాకారాలని TTD క్రొత్తగా భాష్యం చెబుతూ తన మాటకు తానే విరుద్ధంగా మాట్లాడుతోంది.

వైఖానస ఆగమ గ్రంధాలలో ఏ ప్రాకారం వద్ద ఏ ద్వారపాలకులు ఉండాలో స్పష్టమైన వివరణ ఉన్నది.

శంఖనిధి, పద్మనిధి అని రక్షక దేవతలు మూడవ ప్రాకారానికి ద్వారపాలకులుగా ఉంటారని విమానార్చన కల్పంవంటి వైఖానస ఆగమ గ్రంథాలు తెలియజేసాయి.

ఆ గ్రంథాలలో ప్రకటించిన విధంగానే తిరుమల శ్రీ వేంకటేశ్వర స్వామివారి దేవాలయ ప్రవేశ ద్వారానికి ఇరువైపుల శంఖనిధి, పద్మనిధుల యొక్క 2 అడుగులు ఎత్తు గల పంచలోహ విగ్రహాలు మనకు కనిపిస్తాయి. ఇంత స్పష్టమైన శిల్ప ఆధారాలను కూడా తిరస్కరిస్తూ ఉన్నవి 2 ప్రాకారాలే అని TTD బూకరించడంలోని ఆంతర్యం ఏమిటి?

కనీసం ప్రాకారాల సంఖ్య విషయంలో భక్తులలో తాము ప్రచురించిన గ్రంథాల ద్వారానే గందరగోళం ఏర్పడుతుందని, నిజానిజాలు స్పష్టంచేసి ఏకాభిప్రాయం కల్గించాకే నిర్మాణం విషయంలో, విధ్వంసం విషయంలో ముందుకు వెళ్ళాలనే కనీస బాధ్యత కూడా TTD అధికారులకు ఎందుకు లోపించింది?

"తాము ఏది మాట్లాడితే అదే శాస్త్రమనే అజ్ఞానమా" లేక తాము ఏదిచేసినా, చెప్పినా అడ్డు ఉండదనే ధైర్యమా!

## మహాప్రాకారం భద్రత దృష్ట్యా అవసరమా?

అవసరం లేదు. **"అక్షరధామం"** లో ఈమధ్య జరిగిన తీవ్రవాదుల దాడి దీనికి ఉదాహరణ.

## భక్తులలో ఏకాభిప్రాయ నిర్మాణం TTD బాధ్యత కాదా?

శ్రీవేంకటేశ్వర స్వామివారి దేవస్థానానికిచక్కని వైభవాన్ని, అందాన్ని అందించే కట్టడాల నిర్మాణాన్ని ఏభక్తుడూ వ్యతిరేకించడు. వైఖానస ఆగమశాస్త్ర ప్రకారం "ఏడు కొండలవాడికి" ఏడు మహాప్రాకారాలు నిర్మించినా సంతోషమే. అయితే ఎటొచ్చీ "దేవుడి సొమ్ము" చేతులు మారటం కోసం మాత్రమే కట్టే, కొట్టే కట్టడాలౌతున్నాయనే అనుమానం రాకూడదు. ఎటువంటి అపోహలు పండితులలో, ప్రజలలో లేకుండా, ఏకాభిప్రాయాన్ని నిర్మాణంచేయడం TTD బాధ్యత అనేది అక్కడవారికి ఎవ్వరికీ పట్టలేదు.

## సమస్యకు పరిష్కారాలు:-

### I. వేయికాళ్ళ మండపం:-

1 వేయికాళ్ళ మండపాన్ని యథాస్థానంలో పునర్నిర్మించాలి.

2 అవసరమైతే ఒక్కొక్క స్థానంలో రెండేసి స్తంభాల చొప్పున "వేయిస్తంభాల"ను ఈ మండపంలో అందంగా తీర్చిదిద్దవచ్చు.

3 నూతనంగా పాతస్థలంలోనే నిర్మించే వేయి కాళ్ళ మండపాన్ని"కళ్యాణోత్సవాల"కు ఉపయోగించవచ్చు.

4 'వేయికాళ్ళ మండపాన్ని" పూర్వపు ఎత్తుస్థాయికి పెంచి నిర్మించాలి.

5 దేవాలయం ఎదుట పూర్వంలాగా అదే ఎత్తులో నిర్మాణం ఉంటే యాత్రికులు ఉత్సవ పరులను దర్శించటం సులభంగా ఉంటుంది.

### II. కళ్యాణోత్సవాలు

1 నూతనంగా నిర్మించే వేయికాళ్ళ మండపాన్ని కళ్యాణోత్సవాలకు వీలుగా రూపొందించ వచ్చు

2 లేదా 1999లో TTD నిర్ణయించిన ప్రకారం. స్వామి పుష్కరిణికి ఎదురుగా గతంలో నిర్మించిన వైభవోత్సవ మంటపంలో కళ్యాణోత్సవాలను జరుపవచ్చు.

3 ఆర్జిత కళ్యాణోత్సవాలలో పాల్గొనే సభ్యుల సంఖ్యను 5కు బదులు 2కు తగ్గించి 150 టిక్కెట్లను అదనంగా ఇవ్వవచ్చు. అప్పుడు లోపలే కళ్యాణాలు హాయిగా చేసుకోవచ్చు.

**III. లడ్డూల తయారీ**

1 సగటున రోజుకు స్వామివారిని దర్శించే యాత్రికులు 50 వేలకు మించరు. వారికి కావలసిన లడ్డూలు రోజుకు 1 లక్ష మించవు.

2 ప్రస్తుతం ఉన్న రెండు పోటులను 2 లక్షల లడ్డూలను తయారు చేసేందుకు వీలుగా ఏర్పాట్లు చేయవచ్చు.

**IV. మహాప్రాకారం**

1 మహాప్రాకారాన్ని కట్టవలసిన అవసరం లేదు.

2 పుష్కరిణి, పెద్దజీయంగారి మఠం, హాథీరామ్‌జీ మఠాలకు ఎటువంటి హాని తలపెట్టరాదు.

V. తూర్పు మాడవీధి విస్తరణ

తూర్పు మాడవీధిని 90 అడుగులకు విస్తరింపచేయవచ్చు. దీనికీ మహాప్రాకారానికీ ఏమాత్రం సంబంధం లేదు.

**VI. పై సూచనల అమలు వ్యయం:-**

72 కోట్ల రూపాయల ఖర్చుతో తలపెట్టిన 'మహాప్రాకార ప్రాజెక్ట్'ను విరమించి, పై సూచనలను అమలుపరిచేందుకు అయ్యే వ్యయం 10 కోట్ల రూపాయలకు మించదు. భక్తులు దేవునికి సమర్పించిన ధనాన్ని ఈవిధంగా కోట్లరూపాయల మేరకువృథాకాకుండా నివారించి నట్లవుతుంది.

వాస్తవాలు ఇలా ఉన్నాయి. మహాప్రాకార నిర్మాణం మీద ఎంతో రగడ జరిగింది. దీనికి కారణం సామాన్యులకు కాని, శ్రద్ధాళువులకు కాని పై సత్యాలు తెలియకపోవటమే. శ్రీవేంకటేశ్వర భక్త మండలి ఈ సత్యాలను అందరికీ తెలియజేయటం తన కర్తవ్యంగా భావిస్తున్నది. ఇది ఎవరో ఒక వ్యక్తి బాధ్యత తీసుకొని చేయవలసిన కార్యం కాదు. దేవుడు పెళ్ళికి అందరూ పెద్దలే. కలియుగ నాయకుని సన్నిధిలో జరిగే అరాచకాలను అరికట్టడం స్వామిమీద భక్తి ఉన్నవారందరి కర్తవ్యం.

లోపాలను ఎత్తిచూపే అధికారం శ్రీ స్వామివారి భక్తులందరికీ ఉంది. సవరించుకోవడం TTD బాధ్యత. వారిని అలాగ శాసించడం ప్రభుత్వ బాధ్యత. మా బాధ్యతను మేము నెరవేరుస్తున్నాము. నెరవేరుస్తూనే ఉంటాము కూడా! మరి విషయం తెలిసాక మీ కర్తవ్యాన్ని నెరవేర్చటానికి మీరుకూడా వెనకాడరని మా విశ్వాసం.

పై అంశాలపై మరే వివరాలు కావాలన్నా అందించడానికి శ్రీవేంకటేశ్వర భక్తమండలి సిద్ధంగా ఉంది. సమాచారం కోసం ఈ క్రింది చిరునామాలను సంప్రదించవచ్చు:-

| | |
|---|---|
| **శ్రీవేంకటేశ్వర భక్తమండలి**<br>ప్లాట్ నెం. 203, కనకదుర్గ అపార్ట్‌మెంట్స్,<br>విక్రమపురి, సికింద్రాబాద్<br>సెల్ :98480 40567, 98480 47227 | **శ్రీవేంకటేశ్వర భక్తమండలి**<br>8-20-30, బాలాజీ నగర్,<br>విజయనగరం-535 002<br>ఫోన్:08922-225707 సెల్:94405 40467. |
| **శ్రీవేంకటేశ్వర భక్తమండలి**<br>ద్రోణాచలం, కర్నూలు జిల్లా-518 222<br>సెల్ :94402 90041,<br>ఫోన్ : (08516) 222051 | **శ్రీవేంకటేశ్వర భక్తమండలి**<br>2-6-1485/2,<br>శ్రీనివాస కాలనీ, హనుమకొండ<br>వరంగల్-506 001.<br>సెల్ :98492 77389 |



శ్రీమత్పరమ హంసేత్యాది శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ (పెద్ద) జీయరు స్వామివారితో రెండు దశాబ్దాలు సన్నిహిత సంబంధాలుండి పూర్వాశ్రమంలో ఉ॥వే॥ విద్వాన్ కలువకంట కృష్ణమాచార్యస్వామి. శ్రీవైష్ణవ సంప్రదాయానికి యథాశక్తిగా సేవ చేస్తున్న ఈ స్వామి ఈ మధ్యనే శ్రీపెరుంబూదూర్ యతిరాజ పీఠాధిపతులు శ్రీమత్పరమ హంసత్యేది శ్రీశ్రీశ్రీ వరదయతిరాజ జీయరు స్వామివారి సన్నిధిలో సన్యాసాశ్రమం స్వీకరించారు.

ప్రస్తుతం వీరి ఆశ్రమ నామం పరమ హంసేత్యాది శ్రీత్రిదండి శ్రీకృష్ణ యతీంద్ర రామానుజ జీయరుస్వామిగా వుంచారు. వీరి అడ్రసు: శ్రీగీతాశ్రమం ట్రస్ట్, అలకాపురీ కాలనీ, కరీంనగరం-1. ఆంధ్రదేశంలో వీరితో కలిసి ఏడుగురు జీయరుస్వాములగుట. సంప్రదాయానికి మరింత చేయూత లభించును.

# భృగు మహర్షి

## మహర్షుల చరిత్ర

తమిళమూలం :
శ్రీ.వా. నావల్‌పాకం దేవనాథ
తాతాచార్యస్వామి



తెలుగు సేత :
శ్రీ.ఉ.వే.ప్ర శ్రీమాన్ తూపురాణి
ఉడయవర్‌స్వామి, విజయవాడ

**పురాణ ప్రసిద్ధి:**

ఇతిహాస పురాణములనన్నింటిని సూత పౌరాణికునివద్ద విని లోకోపకారకుడుగా ప్రసిద్ధిచెందిన శౌనకమహర్షి భృగువంశానికి చెందినవాడే.

ఎన్నడూ పదహారు ఏళ్ళు దాటని యువకుడుగా ఉండి, చిరంజీవియై యముని కూడా జయించిన మార్కండేయుడు కూడ భృగు వంశీయుడే.

పరశురాముడు కూడ భృగువంశీయుడే. దశావతారాల పేర్లు చెప్పేటప్పుడు 'రామ' అను పేరు మూడుసార్లు మూడు అవతారాలకు చెప్పబడింది. అప్పుడు ఒక్కొక్క అవతారమునకు భేదం తెలియడం కోసం పరశురామావతారాన్ని 'భార్గవరామ'గా చెప్పడం చూస్తున్నాం. ఇది 'భృగువంశ'ములో జన్మించడం చేత ఏర్పడిన పేరే.

వృత్రాసురుణ్ణి చంపడం సాధ్యం కాక, ఏమిచేయుటకు తోచని స్థితిలోనున్న ఇంద్రునికి, తన వెన్నెముకనిచ్చి, వజ్రాయుధముతోపాటు వెన్నెముకను గూడ ఆయుధముగా ఉపయోగించమని చెప్పి, లోకక్షేమానికై తన నాశనమును కూడ లెక్కించని ఉత్తముడైన దధీచిమునికూడ భృగువంశానికి చెందినవాడే.

జనమేజయుని సర్పయాగానికి కారణభూతుడై, లోకమంతా ఆశ్చర్యపడునట్లు ఆ యాగాన్ని నిర్వహించిన ఉదంక మహర్షి కూడ ఈ వంశీయుడే.

ఈ విధంగా మహాతేజస్సంపన్నులైన ఎందరో మహర్షులు ఈభృగువంశంలో అవతరించారు.

**అగ్నికి కలిగిన శాపం:-**

భృగుమహర్షికి 'అగ్ని'కి మధ్య పరస్పరం ఆదరణ, స్నేహం, అభిమానం ఉండేవి. ఒకసారి ఈస్థితి విపరీతంగా పరిణమించింది. అగ్నిని భృగుమహర్షి ఘోరంగా శపించాడు. లోకమంతా ఒక్కసారి భ్రమించిపోయింది. దేవతలంతా అవాక్కయి పోయారు. చతుర్ముఖ బ్రహ్మకూడ నిశ్చేష్టుడ య్యాడు. యాగాలన్నీ నిలచిపోయాయి. లోకవ్యవహారమే స్థంభించిపోయింది. ఎవ్వరికీ ఏం చేయాలో అర్థంగా లేదు. 'ఓ అగ్నీ! నీవు సర్వ భక్షకుడవుకమ్ము!' అని భృగుమహర్షి అగ్నిని శపించాడు. దీనికి అర్థం స్పష్టమే కదా! "నీవు అన్నీ తినేవాడివిగా అవుతావు. అనగా ఇది తిన తగినది, ఇది తినకూడనిది అనే వ్యవస్థ లేకుండ ఇకపై నీవు అన్నిటిని భక్షించగలవు" అని శాపము నకు సారము. ఈనాటినుండి తినతగిన వాటితో పాటు తినతగనివానిని

కూడ తినవలసిన గతి నీకు పడుతుంది అని గదా తాత్పర్యము.

అగ్ని ఏదైనా తినడం, తినకపోవడం అంటే దానిని భస్మం చేయడం, చేయక పోవడమే. ఇప్పుడు మనం అగ్నిని అన్నిటినీ భస్మం చేసే దానినిగానే చూస్తున్నాం. అగ్నిలో పడేసినవన్నీ భస్మమయిపోతున్నాయిగదా! ఏదీ మిగలడం లేదు. ఈ పరిస్థితి భృగుశాపం తరువాత అగ్నికి ఏర్పడింది.

ఈ శాపానికి పూర్వం అగ్నిస్థితి అలా ఉండేదికాదు. దేవతలకోసం మంత్రపూతంగా అగ్నిలో సమర్పించిన వస్తువులనే అగ్ని దహించేది. ఇతర వస్తువులను అగ్నిలో వేసే వారే కాదు. ఒకవేళ వేసినా అది దగ్ధమయ్యేది కాదు. దేవతలయొక్క ముఖమే (నోరు) అగ్ని. ముఖంలో అశుద్ధ పదార్థాలను వేయరుగదా! అలా వేసినా స్వీకరించరు గదా! తినడానికి యోగ్యంగా ఉన్న పదార్థాలనే జాగ్రత్తగా వేరుచేసి నోట్లో వేసుకుంటాం! కూడని పదార్థాలను ముందే జాగ్రత్తగా తొలగించి వేస్తాం. అలాగే దేవతలకు ముఖమైన అగ్ని, అశుద్ధ పదార్థాలను దగ్ధం చేయకుండా కాపాడుకుంటూ ఉండేవారు. సహజంగానే అగ్ని, దేవతలకోసం సమర్పించబడిన హవిస్సును మాత్రమే దగ్ధం చేసేది.

ఆ పదార్థాలను దేవతలకు విభజించి ఇచ్చేది. అప్పటి పరిస్థితి అది. ఆనాటి అగ్ని యొక్క ఆ స్థితి, ఈనాటి మనకు అర్థం కావడం కష్టం. ఇలాంటి స్థితిని తన ఘోరమైన శాపంతో భృగమహర్షి మార్చి వేశాడు.

**అగ్ని చేసిన తప్పిదం:-**

ఇంత కౄరమైన శాపాన్ని భృగుమహర్షి ఇవ్వడానికి కారణం, అగ్ని చేసిన తప్పిదమే. ఇదొక చిన్న కథ.

భృగుమహర్షికి, అనేకమంది భార్యలు ఉండేవారు. వారిలో 'పులోమ' ఒకతె. ఆమె అపురూప సౌందర్యవతి. ఇటువంటి పులోమను భృగుమహర్షి వివాహం చేసుకోప డానికి పూర్వం 'పులోమ' చిన్నపిల్లగా ఉన్నప్పుడు జరిగిన ఒక సంఘటన ఈ శాపానికి దారితీసింది.

చాల చిన్నపిల్లగా ఉన్న పులోమకు మొండితనం (ఎవరు చెప్పినా వినకపోవడం) ఎక్కువగా ఉండేది. మొండితనంతో అందరినీ విసిగించేది. తమ బంగారుబిడ్డ అయిన 'పులోమ'యొక్క మొండితనాన్ని మాన్పించా లన్నా, చెయ్యకూడని పనులు చేస్తూ ఉంటే నివారించాలన్నా తల్లిదండ్రు లకు పెద్ద ప్రశ్నార్థకంగా మారింది. దీనికి వారు ఒక ఉపాయాన్ని ఆలోచించారు. పాపను ఎత్తుకుని వాకిట్లోకి తీసుకువచ్చే వారు. "ఇదుగో చూడు, ఆ చెట్టుమీద ఒక బ్రహ్మరాక్షసుడున్నాడు. నువ్వు అల్లరి చేస్తేవాడికి నిన్ను ఇచ్చేస్తాం, అంతే" అని ఆ చెట్టును చూపించి భయపెట్టేవారు. కొంచెంసేపు ఆ పాప భయపడి వారు చెప్పినట్లు వినేది. మళ్ళీ తరువాత మామూలే. తల్లిదండ్రులు కూడ మళ్ళీ చెట్టువైపు చూపి భయపెట్టేవారు. ఇలా కాలం గడిచి పోసాగింది. ఆమె పెద్దదై వివాహ యోగ్యత వచ్చేవరకు ఇది కొనసాగింది. భృగు మహర్షితో ఆమెకు వివాహం జరిగింది.

భర్తతో ఆమె అత్తవారింటికి చేరింది.

**వెంటపడిన రాక్షసుడు:**

చిన్నప్పుడు ఈమెకు ఏ చెట్టు చూపించి దానిపై రాక్షసుడున్నాడని భయపెట్టారో, ఆ చెట్టుమీద నిజంగానే ఒక రాక్షసుడు దాగి ఉన్నాడు. పులోమకుగాని ఆమె తల్లిదండ్రులకు గాని ఈ విషయం తెలియదు. కాని ఆ రాక్షసుడు వీరి మాటలనన్నిటినీ గమనిస్తూనే ఉన్నాడు. ఆ పాపను తనకు ఇస్తామని వాళ్ళు చెప్పిన మాటలను బాగా జ్ఞాపకం పెట్టుకున్నాడు. ఆ పాపను సన్మార్గంలో పెట్టడానికి తన సహాయం వారు తీసుకున్న విషయం కూడా గమనించాడు. అందుచే ఈ పాపను తగిన సమయం వచ్చినపుడు వివాహం చేసుకోవడానికి తనకు హక్కు ఉందని భావించాడు. తగిన సమయం రానీ, అప్పుడు వివాహం చేసుకుందాం అని కాచుకుని కూర్చున్నాడు. పాపం, భృగువుతో పెళ్ళి అయి, అతనితో వెళ్ళిపోయింది, పులోమ.

తనకు నిశ్చయించబడిన ఆ 'సుందరి'ని అక్రమంగా భృగుమహర్షి వివాహం చేసుకున్నాడని భావించిన ఆ రాక్షసుడి కోపం హద్దులుదాటింది. కాని భృగుమహర్షిని సమీపించడానికి భయపడిపోయాడు. అంత గొప్ప తేజస్వి ఆ భృగుమహర్షి. అయినా వదలకుండా వారిని, అనుసరించి వచ్చాడు. సమయం చిక్కినపుడు 'పులోమ'ను అపహరించుకు పోదామని అనుకున్నాడు. భృగుమహర్షి ఆశ్రమానికి దగ్గరనే నివసించడం ఆరంభించాడు. →→→

## పరమపద వార్త



శ్రీమాన్ **ఉల్లి నారయ్యనాయుడు**గారు జంబూపట్నం, తూ.గో. జిల్లా వాస్తవ్యులు పరమపదించినారు. వీరు శ్రీస్వామివారివద్ద సమాశ్రితులు. వీరి కుటుంబ సభ్యులు భక్తినివేదనకు కైంకర్యము కావించారు. వీరి కుటుంబ సభ్యులకు శ్రీస్వామివారు మంగళాశాసనములు చేసారు.

## పరమపద వార్త



శ్రీమతి **మాదవరపు లోకమ్మ**గారు ఆదిలాబాద్ జిల్లా, హాజీపూర్ వాస్తవ్యులు.. వీరు శ్రీస్వామివారివద్ద సమాశ్రితులు. వీరు ది. **11-8-2004**న పరమపదించినారు. వీరి కుమారులు- కోడళ్ళు, కుమార్తెలు-అల్లుళ్ళు భక్తినివేదనకు కైంకర్యము కావించారు. వీరి కుటుంబ సభ్యులకు శ్రీస్వామివారు మంగళాశాసనములు చేసారు.

# శ్రీ స్వామివారి అమెరికా పర్యటన వివరాలు

శ్రీ స్వామివారు ఈసంవత్సరం జూన్ 17వ తేదీనుండిఆగస్టు 3వ తేదీ వరకు అమెరికాలో వివిధ ప్రాంతాలు సందర్శించారు.

1. వాషింగ్‌టన్ డి.సి.
2. పిట్స్ బర్గ (పెన్సిల్వేనియా)
3. శాన్‌ఫ్రాన్సిస్కో (కాలిఫోర్నియా)
4. ఆస్టిన్ (టెక్సాస్)
5. హ్యూస్టన్ (టెక్సాస్)
6. బర్మింగ్‌హాం (అలబామా)
7. తల్హసీ (ఫ్లోరిడా)
8. ఓర్లాండో (ఫ్లోరిడా)
9. ఫోర్ట్ లాడర్‌డేల్ (ఫ్లోరిడా)
10. బ్రేడెన్‌టన్ (ఫ్లోరిడా)
11. కొలంబియా (సౌత్ కెరొలినా)
12. అట్లాంటా (జార్జియా)
13. షార్లెట్ (నార్త్ కెరొలినా)
14. న్యూజెర్సీ
15. న్యూయార్క్

మే 25న జరగాల్సిన శ్రీవారి అమెరికా ప్రయాణం, తిరుమలలో కొనసాగుతున్న సంప్రదాయ విధ్వంసక చర్యల మూలంగా జూన్ 17వ తేదీకి వాయిదా పడింది. విధ్వంసక చర్యలను ఆపివేసి కూల్చిన కట్టడాలను యథాతథంగా నిర్మించాలని శ్రీ స్వామివారు తిరుమల అధికారులకు సూచించారు. ఇది మా ఒక్కరి అభిప్రాయం కాదు. యావద్భారతావని జనాభిప్రాయం అని జూన్ 12, 13వ తేదీలలో హైదరాబాద్ 'సైబర్ గార్డెన్స్'లో జరిగిన "సర్వవైష్ణవ సంగోష్ఠి" కార్యక్రమం ద్వారా నిరూపించారు. అమెరికాలో కూడా శ్రీ స్వామివారు పర్యటించిన ప్రతిచోట భక్త కోటికి తిరుమలలో జరుగుతున్న విధ్వంసక చర్యలను విశదం చేశారు. ఇది చాలా అనాగరికం, సంప్రదాయ విరుద్ధం అని అక్కడి వారందరూ ముక్తకంఠంతో ఖండించారు.

ఇక మనము అమెరికా పర్యటన వివరాలు తెలుసుకుందాం:-

**1. వాషింగ్‌టన్ D.C.:**

శ్రీ స్వామివారు 16వ తేదీ రాత్రి తమ పరివారంతో చెన్నై నుండి బయల్దేరి 17వ తేదీ మధ్యాహ్నం వాషింగ్‌టన్ డిసి, చేరుకున్నారు. శ్రీమాన్ రవి అహరం, శ్రీమాన్ కిషోర్, శ్రీమతి చిత్రా మాధవన్, శ్రీమాన్ ఖమ్మం రామారావు, శ్రీమాన్ రామకృష్ణారెడ్డి, శ్రీమాన్ తేజస్విగార్లు శ్రీ స్వామివారికి, పరివారానికి ఘనస్వాగతం పలికారు. వారితో కలిసి-ఫెయిర్‌ఫాక్స్ లోని శ్రీ వేంకటేశ్వర ఆలయానికి చేరుకున్నారు.

భక్తజనం, చిన్నారులు శ్రీ స్వామివారికి స్వాగతాంజలులు సమర్పించారు. సుదీర్ఘ ఆకాశమార్గ ప్రయాణంచేసిన పెరుమాళ్ళకి శ్రీ స్వామివారు అలుపుతీర ఆరాధన సమర్పించి రాత్రి 11-00గం॥కు తీర్థగోష్ఠి నిర్వహించారు.

18వ తేదీన శ్రీమాన్ రమేశ్, శ్రీమాన్ వెంకట్‌గార్ల గృహాలను, శ్రీమాన్ పుట్టా కిషోర్, శ్రీమతి వాసంతి అహరం సంయుక్తంగా నిర్వహిస్తున్న గ్లోబల్ సాఫ్ట్‌వేర్ కార్యాలయాన్ని సందర్శించారు. సాయంకాలం విల్లోస్ప్రింగ్ స్కూల్ ఆడిటోరియంలో భక్తులందరిచే శ్రీస్వామివారు శ్రీలక్ష్మీనారాయణ పూజను విధి విధానంగా చేయించారు.

**ఆధ్యాత్మిక శిక్షణ శిబిరము - వాషింగ్‌టన్ D.C.**

జూన్ 19వ తేదీ నుండి 23వ తేదీ వరకు బాణీబ్రీ స్కూల్‌లో శ్రీస్వామివారు ఆధ్యాత్మిక శిక్షణ శిబిరము నిర్వహించారు. ఉదయం ముండకోపనిషత్‌ను, మధ్యాహ్నము శ్రీభగవద్గీత ద్వితీయ షట్కాన్ని విశదీకరించారు. ఈ శిబిరంలో చిన్న పిల్లలకు ప్రత్యేక తరగతులు నిర్వహించారు. శ్లోకములు, భజనలు, నీతి కథలు పిల్లలందరూ శ్రద్ధగా నేర్చుకున్నారు. 23వ తేదీ శిబిర సమాపన ఉత్సవంలో చిన్న పిల్లలందరూ సంప్రదాయాన్ని ప్రతిబింబించే సాంస్కృతిక కార్యక్రమాలను ప్రదర్శించి కన్నుల విందుచేశారు. శిబిరములో పాల్గొన్న వారందరికి, నిర్వహించిన జెట్ కార్యకర్తలందరికి మంగళాశాసనములు కృపచేశారు.

24వ తేదీ కొందరికి సమాశ్రయణాలు జరిపి, నాసా కేంద్రాన్ని సందర్శించారు. సాయంత్రం రిచ్‌మండ్‌లో డా॥ లోకేశ్‌గారి గృహంలో ప్రవచనాన్ని అనుగ్రహించారు.

25వ తేదీన స్ప్రింగ్ స్కూల్ ఆడిటోరియంలో చిన్నారుల చేత విజ్ఞాన ప్రదాత శ్రీ హయగ్రీవ పూజ చేయించారు. అనంతరం జెట్-వాషింగ్‌టన్ D.C. కార్యకర్తలను శ్రీస్వామివారు మంగళాశాసనములు చేసారు. సాయంకాలం శ్రీవిష్ణు సహస్రనామ పారాయణం, పాదపూజ కాగానే శ్రీ స్వామివారు పిట్స్‌బర్గ్ బయల్దేరారు.

**పిట్స్‌బర్గ్(పెన్సిల్వేనియా)**

27వ తేదీ తెల్లవారుఝామున గం. 3-00 కు శ్రీస్వామివారు పిట్స్‌బర్గ్ చేరుకొని శ్రీమాన్ ఘోరె త్రివేణి - శ్రీమతి చంద్రావతి గారి గృహంలో బసచేశారు. ఆరాధనానంతరం తిరుమలగా ప్రసిద్ధి గాంచిన పిట్స్‌బర్గ్ వేంకటేశ్వర దేవాలయమును సందర్శించారు. భగవద్రామానుజ వైభవాన్ని తిరుమల విధ్వంసాన్ని గూర్చి ప్రవచించారు. అనంతరం గొర్రెపాటి సుమత- సుధాకర్, సుధా-శ్రీవత్సన్‌ల గృహాలను మంగళాశాసనం చేశారు.

28వ తేదీ పాదపూజ కాగానే తిరిగి ఆలయానికి విచ్చేసారు. రాత్రి 7-00 గం॥కు

శ్రీ స్వామివారు ఆలయ ఆడిటోరియంలో "భక్తి" గురించి ప్రవచించారు. 29వ తేదీ పిట్స్‌బర్గ్ నుండి బయలుదేరి 'శాన్‌ఫ్రాన్సిస్కో' చేరారు.

### శాన్ ఫ్రాన్సిస్కో (కాలిఫోర్నియా)

విమానాశ్రయంలో శ్రీమాన్ విష్ణురెడ్డి, శ్రీమాన్ జైమిని శ్రీనివాసాచార్యులు, శ్రీమాన్ వంశీ దంపతులు తదితరులు శ్రీ స్వామివారికి స్వాగతం పలికారు. శ్రీమాన్ అరుణా విష్ణు రెడ్డిగారింట శ్రీవారు బసచేసారు. 30వ తేదీ శ్రీమాన్‌వంశీ, శ్రీమాన్ రాజేందర్‌గార్ల గృహాల్ని సందర్శించారు. జూలై 1వ తేదీ మధ్యాహ్నం శ్రీమాన్ రామమూర్తి రాజుగారి గృహాన్ని సందర్శించారు. సాయంకాలం 6-00 గం॥కు స్టాన్‌ఫర్డ్ యూనివర్సిటీలో జెట్ కాలిఫోర్నియా నిర్వహించిన 'యూత్ మీట్'లో పాల్గొన్నారు. యువతకు చక్కటి మార్గదర్శనం మల్టీమీడియా ప్రదర్శన ద్వారా చేసారు. శ్రీమాన్ వంశీ, రఘు, శ్రవణ్, శ్వేత, రంజని కో-ఆర్డినేటర్స్‌గా వ్యవహరించి, ఈ కార్యక్రమాన్ని చక్కగా నిర్వహించి శ్రీ స్వామివారి మంగళాశాసనాలందుకున్నారు. 2వతేదీ "గురుపూర్ణిమ" సందర్భంగా "హయగ్రీవేష్టి" జెట్ కాలిఫోర్నియా కార్యకర్తలు సన్నీవేల్ టెంపుల్‌లో నిర్వహించారు. భక్తులు విశేష సంఖ్యలో పాల్గొన్నారు. అర్చన కాగానే ఆచార్య వైభవాన్ని శ్రీస్వామివారు ప్రవచించారు. అనంతరం హరిత-భీమ్‌గారి గృహాన్ని సందర్శించారు.

### ఆధ్యాత్మిక శిక్షణ శిబిరము - శాన్‌ఫ్రాన్సిస్కో

"గురుపూర్ణిమ" 2వ తేదీ సా॥ 4-00 గం॥ల నుండి 6వ తేదీవరకు స్టాన్‌ఫర్డ్ యూనివర్సిటీలో శ్రీస్వామి వారు ఆధ్యాత్మిక శిబిరమును నిర్వహించారు. స్థానికులే కాక ఇతర రాష్ట్రాలనుండి కూడా జిజ్ఞాసువులు శ్రద్ధతో పాల్గొన్నారు. ఈ శిబిరములో కూడా చిన్నారులకు ప్రత్యేక తరగతులు జరిగాయి. ప్రాతఃస్మరణీయం, భజనలు, అనేక నైతిక విషయాలు నేర్చుకున్నారు.

4వ తేదీ లివర్‌మూర్ టెంపుల్‌ను సందర్శించారు. వేదపండితులను సమాదరించి ఆరాధించడం మన కర్తవ్యం అని భక్తులందరికి ఉద్బోధించారు. అనంతరం ఆడిటోరియంలో అశేష భక్తజనా న్నుద్దేశించి ప్రవచించారు. 5వ తేదీ శ్రీస్వామివారు పెరుమాళ్ళతో శ్రీమాన్ హరి సూరపనేని గారి గృహాన బసచేసారు. 6వతేదీ ఉదయం విష్ణుగారింటికి తిరిగి వచ్చి, ఫ్రీమౌంట్ టెంపుల్ సందర్శించారు. సత్సంగం యొక్క ఆవశ్యకతను గూర్చి ప్రవచించారు. అనంతరం శ్రీమాన్ జైమిని శ్రీనివాసన్‌గారి గృహానికి వేంచేసి మంగళాశాసనం కృపచేశారు. 7వ తేదీ నాడు జరిగిన సమాశ్రయణములలో తెల్లజాతీ యులు గూడ కొందరు పాల్గొన్నారు. సాయంత్రం

క్యుపర్టినో కమ్యూనిటీ హాల్‌లో శ్రీస్వామివారు ప్రసంగించారు. అనంతరం శ్రీమాన్ మురళి-రాధ కల్వపూడి, శ్రీమాన్ ఈశ్వర్-ఉమల గృహాలను సందర్శించారు. 8వ తేదీ నరహరి అనుపమ-శరత్ చంద్రలను మంగళాశాసనం కావించారు. జెట్ సభ్యులను, పత్రికా ప్రతినిధులను సంబోధించారు. ఆపై 9వ తేదిన ఆస్టిన్ (టెక్సాస్) బయల్దేరారు.

**ఆస్టిన్ (టెక్సాస్)**

ఆస్టిన్‌లో శ్రీమాన్ తమిరస గోపాలా చార్యులు-పద్మినిగారి గృహంలో బసచేశారు. సాయంకాలం మర్చిసన్ మిడిల్ స్కూల్‌లో శ్రీస్వామివారు ఆస్టిన్ భక్తులను ఉద్దేశించి ప్రవచిస్తూ, 'వేద వాఙ్మయాన్ని నిత్యజీవితానికి అనుసంధానం చేసుకొనవలసిన విధానాన్ని' వివరించారు. అనంతరం వేముగంటి రంగారావు, జడల రఘుగార్ల గృహాలను సందర్శించారు మంగళాశాసనం చేశారు. 10వ తేదీన శ్రీ స్వామివారు సమాశ్రయణాలు నిర్వహించారు. తమిరస గోపాలాచార్యులు-పద్మిని దంపతుల ఆతిథ్యం స్వీకరించి తూపూరి రఘురాంగారిని మంగళాశాసనం చేసి హ్యూస్టన్ బయల్దేరారు.

**హ్యూస్టన్ (టెక్సాస్)**

ఆరోజు సాయంత్రం హ్యూస్టన్‌లోని మెమోరియల్ హెర్మన్ సౌత్ వెస్ట్ హాస్పిటల్ ఆడిటోరియం చేరారు. శ్రీమాన్ డా॥ తమిరస శ్రీనివాసాచార్యులు- డా॥రేణుక దంపతులు, శ్రీమాన్ తాతాచార్య స్వామివారు, కార్యకర్తలు శ్రీ స్వామివారికి ఘనస్వాగతం పలికారు. స్వామివారు వేంచేసే వరకు శ్రీమతి శోభారాజు గారు అన్నమాచార్య సంకీర్తనలను ఆలపించారు. వారికి మంగళా శాసనములు కృపచేసి శ్రీ స్వామివారు విష్ణుపురాణము గూర్చి ప్రవచించారు. 11,12 తేదీలలో కూడా సాయంత్రం 7-00 గం॥కు ఇదే విషయంపై ప్రవచించారు. శ్రీస్వామివారు డా॥ తమిరస శ్రీనివాసాచార్యులుగారి గృహంలో బస చేశారు. 11వ తేదీ ఉదయం అష్టలక్ష్మి దేవాలయం నిర్మించే స్థలంలో శ్రీ సుదర్శన యాగం శ్రీవారితో వచ్చిన శ్రీమాన్ యుగంధరాచార్యులు గారు నిర్వహించారు. శ్రీస్వామివారి కరకమలముల మీదుగా ఆలయానికి శంకుస్థాపన జరిగింది. సాయంత్రం శ్రీ స్వామివారు శ్రీమాన్ రవి-పద్మ తమిరస, శ్రీమాన్ రాజన్-సీత నుండభూషి గృహాలను సందర్శించి మంగళాశాసనం చేశారు. 12వ తేదీన డా॥ తమిరస శ్రీనివాసాచార్యులుగారి జన్మదిన సందర్భంగా 13వతేదీ డా॥ రేణు తమిరసగారి జన్మదిన సందర్భంగా శ్రీ స్వామివారు ప్రత్యేక మంగళా శాసనములు కృప చేశారు. 12వ తేదీ మధ్యాహ్నం శ్రీస్వామివారు నూతనంగా నిర్మిస్తున్న స్వామి నారాయణ్ టెంపుల్ సందర్శించారు. పాలరాతిలో శిల్పకళా వైభవం ఉట్టిపడేట్టు సుందరంగా నిర్మిస్తున్నారు. మధ్యాహ్నం అక్కడ నిర్మించబోయే అష్టలక్ష్మి ఆలయానికి తగిన సూచనలు కృపచేశారు. రాత్రి ప్రవచనం అనంతరం శ్రీమాన్ దొంతి

మనోహర్-గీత, శ్రీమాన్ విజయ్-షర్మిల మిర్యాల, శ్రీమాన్ కిరణ్-స్వాతి మిర్యాల గృహాలను సందర్శించి మంగళాశాసనం చేశారు. 13వ తేదీ శ్రీమాన్ తమిరస కుటుంబసభ్యులు శ్రీ స్వామివారిని సత్కరించు కున్నాక 'బర్మింగ్‌హాం' బయల్దేరారు.

**బర్మింగ్‌హాం (అలబామా)**

డా॥ శ్రీమాన్ వల్లభనేని సత్యనారాయణ రావు-సరస్వతి దంపతుల కుమార్తె డా॥ అనూరాధ గారి గృహంలో బసచేశారు. డా॥ రావుగారే గతంలో కెనడాలో శ్రీస్వామివారి కార్యక్రమాలు ఏర్పాటు చేసారు. వారు అమెరికా మకాం మారాక శ్రీస్వామివారిని రెండు సం॥లుగ తమ ప్రాంతానికి తీసుకు వెళ్ళాలనే తపనతో ఉన్నారు. అది ఇపుడు తీరింది. సాయంత్రం హిందు టెంపుల్ ఆఫ్ బర్మింగ్‌హాం లో భగవద్గీతపై శ్రీస్వామివారు ప్రవచించారు. 14వ తేదీన కొందరికి **సమాశ్రయణాలు,** ఆలయంలోని శ్రీవేంకటేశ్వర స్వామివారికి శ్రీమాన్ యుగంధరాచార్య నవకలశ స్నపన కార్య క్రమాన్ని కన్నుల పండుగగా నిర్వహించారు. సాయంత్రం భక్తులందరిచేత శ్రీ లక్ష్మి నారాయణ పూజను చేయించారు. 15వ తేదీ శ్రీ స్వామివారు శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్ర వైభవాన్ని వివరించారు. డా॥ రావు వల్లభనేని గారి గృహాన్ని మంగళాశాసనం చేసి "టల్హసీ" బయల్దేరారు.

**టల్హసీ (ఫ్లోరిడా)**

15వ తేదీ రాత్రి గం. 10-00 దాటాక శ్రీ స్వామివారు టల్హసీ చేరుకొని పబ్బతి శైలజ-లక్ష్మీనివాస్ రెడ్డిగారి గృహంలో బస చేశారు. 16వ తేదీ ఉదయం తీర్థగోష్ఠి అనంతరం శ్రీ స్వామివారిని కంభం నీరజ-రాజీవ్ రెడ్డి, కొత్తూరు హేమ-భీంరెడ్డి, జనార్ధనం శాంతి-దీనదయాలన్, కస్తూరి జయశ్రీ-సతీష్, రాల్ఫ్-అబిగెల్ డిమో, తూల అనూష-రామారావు, అనతమ-రవి, తమ్మిశెట్టి అనూరాధ-శ్రీనివాస్ మొదలైన వారంతా తమ గృహాలకు తీసుకువెళ్లారు. సాయంత్రం స్టేట్ యూనివర్సిటి ఆఫ్ ఫ్లోరిడాలోని స్టూడెంట్ సర్వీస్ సెంటర్ హాల్‌లో అశేష భక్తజనాన్నుద్దేశించి శ్రీ స్వామి వారు ప్రవచించారు. 17వ తేదీ శ్రీమాన్ లక్ష్మీనివాస్ రెడ్డిగారి గృహంలో శ్రీ సుదర్శన హోమం వైభవంగ జరిపి బయల్దేరారు.

**ఫోర్ట్‌లాడర్‌డేల్ (ఫ్లోరిడా)**

శ్రీమతి శాంతి-శ్రీమాన్ రాజుగారి గృహంలో బసచేశారు. సాయంకాలం ఆలయంలో శ్రీకృష్ణపూజా కార్యక్రమాన్ని భక్తులచే చేయించారు. 20వ తేదీ శ్రీఫిలిప్ నిర్వహిస్తున్న **'Fastrack'** పాఠశాల విద్యార్థులకు మంగళాశాసనం చేసి బ్రేడెన్‌టన్ బయల్దేరారు.

**బ్రేడెన్‌టన్ (ఫ్లోరిడా)**

మధ్యాహ్నానికి శ్రీమాన్ ముడుంబై గోపీచార్యులు-నీళాగారి నివాసానికి చేరు

కున్నారు. సమాజసేవలో అంకితమైన వివిధ సేవాసంస్థల నిర్వహకులు, జిజ్ఞాసువులైన 10మంది శ్వేత జాతియులతో సత్సంగం జరిగింది. శ్రీవారు, వారి సంశయాలనెన్నిటినో తీర్చి, వేదిక్ సంప్రదాయాన్ని వారికి వివరిస్తూ గీతాజ్యోతి సూత్రాలను స్పష్టపరిచారు. వారందరు ఆనందంతో వాటిని ఆమో దించారు. సాయంత్రం యూనిటి చర్చ్‌కు చేరుకున్నారు. భక్తులపుకరింపులు కాగానే హాల్‌లో శ్రీమన్నారాయణతత్త్వంపై ప్రవచించారు. అది అన్నిమతాలకు, అన్ని రూపాలకు అతీతం అన్నారు. శ్రీస్వామివారి కాన్సెప్ట్ పాల్గొన్న అమెరికన్స్ అందరికి చాలా బాగా నచ్చినది. విచిత్రమేమిటంటే, హాలంతా 350మందిపైగా అమెరికన్స్‌తోనే క్రిక్కిరిసి పోయింది. అందులో 10% మాత్రమే భారతీయులు. ప్రవచనం అనంతరం సందేహాలు-సమాధానాలు చాలా ఆసక్తి కరంగా సాగాయి. రెవెరెండ్ దరోతి ఆన్, రెవెరెండ్ డఫీ రట్లెజ్ ముఖ్య అతిథులుగా పాల్గొన్నారు. ఈస్ట్ మనాటీ హెరాల్డ్ ట్రిబ్యూన్, నాచురల్ అవేకెనింగ్ నుండి వార్తా ప్రతినిధులు పాల్గొన్నారు. ఈ కార్యక్రమాన్ని చక్కగా నిర్వహించిన శ్రీమాన్ గోపీచార్యులు-శ్రీమతి నీళ దంపతులకు శ్రీస్వామివారు ప్రత్యేక మంగళాశాసనములు కృపచేశారు. వీరే గత సం॥ తత్త్వ ప్రచారకులు శ్రీమాన్ శాంతారామ్‌గారి ద్వారా బ్రహ్మ సూత్రములు అధ్యయనం చేశారు. శ్రీ స్వామివారు కార్యక్రమంలో చివరగా **జై శ్రీమన్నారాయణ** నామభజన చెప్పగా అమెరికన్స్ అంతా గొంతెత్తి పాడారు. వారందరి ఆనందానికి అవధుల్లేవు. కార్యక్రమం నిర్వహించిన మైత్రేయీ సెంటర్, యూనిటీ చర్చ్, జెట్-టాంపా కార్యకర్తలందరికి, మంగళాశాసన ములు కృపచేసి శ్రీ స్వామివారు ఓర్లాండో బయల్దేరారు.

**ఓర్లాండో**

21వ తేదీ ఉదయం డా॥ శ్రీమాన్ పద్మకేసరి రాజు- శ్రీమతి అన్నపూర్ణరాజుగారి గృహంలో శ్రీ స్వామివారు ఆండాళ్ తిరు నక్షత్రాన్ని అత్యంత వైభవంగా నిర్వహించారు. వారి కుటుంబానికి మంగళాశాసనములు కృపచేసి శ్రీస్వామివారు సౌత్ కెరోలినా రాష్ట్ర రాజధాని కొలంబియా బయల్దేరారు. మధ్యలో శ్రీమాన్ డా॥ పట్టిసపు జోగెరావు-అన్నపూర్ణ గారి గృహాన్ని మంగళాశాసనం కావించారు. ఫ్లోరిడా రాష్ట్ర పర్యటనంతా డా॥ పద్మకేశరి రాజుగారే శ్రీస్వామివారి వాహనానికి సారథ్యం వహించి మంగళాశాసనాలందుకున్నారు. టాంపానుండి శ్రీమాన్ సుబ్రహ్మణ్యం, శ్రీమాన్ చక్రధర్ శ్రీస్వామి వారిని కొలంబియాకు స్వాగతించారు.

**కొలంబియా (సౌత్ కెరొలినా)**

సాయంకాలానికి కొలంబియా చేరు కుంటూనే కొలంబియా యూనివర్సిటీకి వేంచేసి విద్యార్థులనుద్దేశించి సృష్టి విధానాన్ని ప్రవచించారు. అనంతరం శ్రీమాన్ దేవులపల్లి మనోజ్ గృహానికి చేరారు. 22వ తేదీ

ఉదయం పొలిమినేని శ్రీధర్- అనుపమ లకు మంగళాశాసనం చేశారు. సాయంకాలం శ్రీమాన్‌మనోజ్ కార్యాలయం గ్లోబల్ పండిట్స్ Inc కు వేంచేసి మంగళాశాసనం చేశారు. అనంతరం రాధాకృష్ణ టెంపుల్‌కి వేంచేసి చిన్నపిల్లలనుద్దేశించి ప్రసంగించారు. అనంతరం భక్తుల అభ్యర్ధనపై శ్రీ స్వామివారు నిర్వహిస్తున్న వివిధ సేవాకార్యక్రమాలను మల్టీమీడియా ద్వారా చూపించారు. 23వ తేదీ బదరీనారాయణ పెరుమాళ్ తిరునక్షత్ర మహోత్సవం శ్రీమాన్ మనోజ్ గృహంలో శ్రీ స్వామివారు వైభవంగా నిర్వహించారు. ప్రాశస్త్యాన్ని భక్తులందరికి విశదం చేశారు. శ్రీమాన్ బద్దిరాజు లక్ష్మణ్‌రావు-అరుణ, శ్రీమాన్ గణేశ్‌శర్మ, శ్రీమాన్ వేరువ రాజేంద్ర-పద్మజ, శ్రీమాన్ కౌశల్‌సిన్హా-అరుణిమ సిన్హాగార్లు శ్రీవారిని తమ గృహాలకు వేంచేపు చేసుకువెళ్ళారు. సాయంకాలం రాధాకృష్ణ మందిరంలో శ్రీలక్ష్మీనారాయణ పూజ చేయించారు.

**అట్లాంటా(జార్జియా)**

శ్రీ స్వామివారు 24వ తేదీ సాయంత్రానికి అట్లాంటా చేరారు. గతంలో వలెనే డా॥ కృష్ణమోహన్- రాజ్యలక్ష్మిగార్ల గృహంలో బస. వెంటనే శ్రీ వేంకటేశ్వర స్వామివారి దేవస్థానంలో అశేష భక్తజనంతో సామూహిక శ్రీలక్ష్మీనారాయణ పూజలు చేయించారు. అనంతరం శ్రీమాన్ డా॥ గోపాల్‌రావు-శోభ గారి గృహానికి వేంచేసి మంగళాశాసనం చేశారు.

25వ తేదీ సమాశ్రయణాలు జరిగాయి. ఆలయంలో శ్రీ సుదర్శన హోమాన్ని పూర్తిచేసారు. సాయంత్రం గ్లోబల్‌మాల్ లోని శివమందిర్‌లో, శ్రీ స్వామివారు, సత్సంగ ప్రాముఖ్యాన్ని ప్రవచించారు. అనంతరం నల్ల ప్రదీప్‌రెడ్డి- శ్రీలక్ష్మి, జ్యోతి-రాఘవేంద్రన్‌ల గృహాలను సందర్శించి మంగళాశాసనం చేశారు.

26వ తేదీ నడాదూర్ శ్రీనివాస అనంత కృష్ణన్-శ్రీనిత్య, కరుణాకర్-ప్రశాంతి, గురుమూర్తి చందర్-నిత్య, శ్రీమాన్ సుధన్వాచార్య-పద్మ, సుమతి-భరత్ శ్రీవత్స మొ॥గు వారి గృహాలు శ్రీస్వామివారు సందర్శించి సాయంత్రం టెంపుల్ ఆడిటోరియంలో ప్రవచనం కావించారు. రాత్రి భక్తుల కోరికపై స్టోన్ మౌంట్‌ను వీక్షించారు. 27న తిరిగి సమాశ్రయణాలు నిర్వహించి మేకన్ ప్రాంతానికి వేంచేసి డా॥కల్లి వి.రమణ-విజయ, సెల్వరాజ్-చంద్రిక గృహాలను సందర్శించారు. అనంతరం డా॥ రాజు. ఎమ్ వానపల్లి-తులసి, ఆలయఅర్చకులు శ్రీమాన్ శేషావతారం-మాధురి గార్ల గృహాలను సందర్శించారు. 28వ తేదీన ప్రత్యేక విమానంలో ఫ్లోరిడాలోని పామ్‌బీచ్‌కి విచ్చేసారు. మన ట్రస్టు కార్యదర్శి శ్రీమాన్ గంగరాజు గారి పిల్లలు శ్రీమతి పద్మ, M.R. రాజును వారి గృహంలో మంగళాశాసనం చేసి సాయంత్రానికి నార్త్ కెరొలినా రాజధాని షార్లెట్ చేరుకున్నారు.

**షార్లెట్ (నార్త్ కెరొలినా)**

28వ తేదీ సాయంత్రం హిందూ టెంపుల్ ఆఫ్ షార్లెట్‌లో "విభీషణ శరణాగతి"ని శ్రీస్వామివారు వివరించారు. శ్రీమాన్ న.చ. జగన్నాథ్ శరణాచార్యులు- పద్మల గృహంలో బస చేశారు. 29వ తేదీ శ్రీమాన్ నరేందర్ రెడ్డి, శ్రీమాన్ నరసింహన్, శ్రీమాన్ కిషోర్ ఖండేల్ వాల్‌గార్ల గృహాలను సందర్శించారు. సాయంత్రం ఆలయంలో "గజేంద్ర శరణా గతి"పై ప్రవచించారు.

30వ తేదీ శ్రీమాన్ జగన్ కుటుంబానికి, సుష్మ-శ్రీధర్, అశ్వత్థనారాయణగార్ల గృహాలను శ్రీస్వామి వారు మంగళాశాసనం చేసి రాత్రి టెంపుల్‌లో అశేష భక్తజనంతో శ్రీ లక్ష్మీనారాయణ పూజ విధివిధానంగా చేయించారు. టెంపుల్ ఛైర్మన్ శ్రీమాన్ సంజీవన్ సోనీ కృతజ్ఞాతాభి వందనములు తెలియజేశారు.

**న్యూజెర్సీ/న్యూయార్క్**

శ్రీస్వామివారు 31వ తేదీ ఉదయం 7-00గం॥కు న్యూజెర్సీ చేరి మొట్టమొదటగా బర్లింగ్‌టన్‌లోని శ్రీమాన్ అశ్విన్ పటేల్ గృహానికి వేంచేసి మంగళాశాసనం చేశారు. వీరు శ్రీమతి డా॥ ఊర్వశి పటేల్‌గారి సోదరులు. డా॥ ఊర్వశిగారు ఈ పర్యటనలో పూర్తిగా పాల్గొన్నారు. కుమారుడు చి॥ ప్రునేల్, అశ్విన్‌గారి కూతురు బేబి విశాలి (5 సం॥) కూడా పాల్గొన్నారు. బోస్టన్ నుండి డా॥ చంద్రశేఖర్ గారు కూడా శ్రీ స్వామివారితో పర్యటించే భాగ్యాన్ని పొందారు.

ఆపై ప్లేన్స్‌బరోలోని శ్రీమాన్ శర్మ-విజయ అల్లక్కి గారి గృహానికి చేరారు. ఆరాధన కాగానే శ్రీమద్యామునాచార్య స్వామివారి తిరునక్షత్రం జరిపారు. సాయంత్రం దుర్గాటెంపుల్‌లో శ్రీ స్వామివారు అశేష భక్తజనాన్ని ఉద్దేశించి ప్రవచనం కావించారు. రాత్రి 10-00 గం॥కు శ్రీమాన్ శ్రీనివాస్-శాంతిగారి గృహానికి వేంచేసి మంగళాశాసనం చేశారు.

ఆగస్టు 1వ తేదీన జిజ్ఞాసులకు సమాశ్రయణాలు నిర్వహించారు. సాయంత్రం లివింగ్‌స్టన్‌లోని శ్రీమాన్ ఇప్పనపల్లి హరి కిషన్-శాంతిశ్రీ గారి గృహానికి వేంచేశారు. వీరు శ్రీ స్వామివారితో మానస సరోవర-కైలాసయాత్రలో పాల్గొన్నారు. "ప్రజ్ఞ లెర్నింగ్ సెంటర్" నార్త్ జెర్సీ విభాగాన్ని వీరి గృహంలో శ్రీ స్వామి వారు ప్రారంభించారు. చిన్నారులకు అక్షరాభ్యాసం చేసిన తర్వాత అక్కడచేరిన భక్తులందరికి జెట్ నిర్వహించే సేవాకార్యక్రమాలను మల్టీమీడియా ద్వారా వివరించారు. రాత్రి హిందూ సమాజ్ మందిర్‌లో ప్రవచనం కృపచేసి శ్రీమాన్ తోట రమేష్-సునీత గారి గృహానికి పెరుమాళ్ళతో వేంచేసి బసచేశారు. వీరు మన హైదరాబాద్ జెట్‌లోని శ్రీమాన్ విజయ్‌కుమార్ గారి సోదరులు.

2వ తేదీ ఉదయం శ్రీమాన్ పట్టాభి; శ్రీమాన్ జయ్ ఆర్నాల్‌గారి ఆహ్వానంపై

సొల్యూషన్స్ కార్యాలయాన్ని సందర్శించారు. అక్కడి సిబ్బందికి చక్కని సందేశాన్ని కూడా అందించారు. తర్వాత శ్రీమాన్ రమేశ్ నిర్వహిస్తున్న కంఫర్ట్స్ మోటల్‌ను సందర్శించి మంగళాశాసనం చేశారు. మధ్యాహ్నం శ్రీమాన్ దిట్టకవి భట్టాచార్య-మాధురి, శ్రీమాన్ చలమచర్ల శ్రీనివాస్-శ్రీలక్ష్మి, శ్రీమాన్ తోట రవిందర్-యశోద, తోట గోవిందరాజులు-రమ, డా॥ సిరికొండ పూర్ణచందర్-అనూరాధ మొ॥వారి గృహాలను సందర్శించారు.

సాయంత్రం న్యూయార్క్ లాంగ్ ఐలాండ్‌లోని శ్రీమాన్ రావూరి వీరయ్య-సరళ గారి గృహానికి వేంచేశారు. వీరు శ్రీమాన్ (ఖమ్మం) E. రామారావు గారికి ఆప్త మిత్రులు. శ్రీమాన్ వీరయ్యగారి శ్రద్ధను శ్లాఘించి శ్రీ స్వామివారు వారి కుటుంబానికి మంగళాశాసనములు కృపచేశారు. అక్కడ చేరిన భక్తులందరికి చక్కటి సందేశాన్నం దించారు. అనంతరం డా॥ శ్రీమాన్ పోలవరపు రాఘవరావు-తులసి గారి గృహానికి వేంచేసి మంగళాశాసనం చేశారు. శ్రీ స్వామివారు 1994వ సం॥లో మొట్ట మొదటిసారి అమెరికా వచ్చినపుడువీరి గృహంలోనే బస చేశారు. బోస్టన్ నుండి డా॥ అమ్మణి-దంపతులు కూడా శ్రీ స్వామివారిని సేవించుకున్నారు. శ్రీమాన్ కర్రి విశ్వ నాథం-వందన గారి గృహాన్ని కూడా మంగళాశాసనం చేసి శ్రీ స్వామివారు న్యూజెర్సీకి తిరిగి వచ్చారు.

3వ తేదీ శ్రీ స్వామివారి 2004 అమెరికా పర్యటనలో చివరిరోజు. తీర్థగోష్ఠి అనంతరం బోర్డ్ మీటింగ్ జరిగింది. శ్రీమతి చిత్రా మాధవన్, శ్రీమతి మణి అక్కినేని, శ్రీమాన్ శర్మ అల్లక్కి-విజయ్, శ్రీమాన్ రవి అహరం పాల్గొన్నారు. 'ప్రజ్ఞ' శిక్షణ కేంద్రాల గురించి వివరంగ చర్చించారు. ఇంతవరకూ జరిగిన కార్యక్రమాలను సమీక్షించి భవిష్యత్ కార్యక్రమాన్ని గూర్చి చర్చించారు.

శ్రీమాన్ రమేశ్-సునీత దంపతుల ఆతిథ్యాన్ని గైకొని అందరికీ మంగళాశాసనములు కృపచేసి శ్రీ స్వామివారు సాయంత్రం 5-00 గం॥కు నెవార్క్ విమానాశ్రయం నుండి మాతృదేశానికి బయల్దేరారు.

5వ తేదీ చెన్నైలో శ్రీమాన్ జయలక్ష్మి చలపతిగార్ల గృహంలో బసచేసారు. **T.T.D.** విషయంలో జరుగుతున్న చర్యలను చర్చించి, నడిగడ్డపాలెం వేంచేసారు.

6వ తేదీన ఆశ్రమంలో విజయనగర వాస్తవ్యులు, జెట్ నిర్వాహకులు శ్రీమాన్ **M.S.N** రాజుగారి శ్రీమతి వికాసతరంగిణి సభ్యురాలు వైకుంఠవాసిని శ్రీమతి లక్ష్మిగారి పరమపదోత్సవం జరిగింది. శ్రీస్వామివారు ఆ కార్యక్రమంలో పాల్గొని వారి పుత్రులకు, కుటుంబ సభ్యులకు మంగళాశాసనాలు చేసారు. శ్రీ పెద్దస్వామివారి సన్నిధిలో విదేశీయాత్రా విశేషాలు విన్నవించి,

తిరుమలలో జరుగవలసిన దానికై ఆజ్ఞ స్వీకరించి సీతానగరం మీదుగ 7వ తేదీ హైదరాబాద్ చేరారు.

**T.T.D.** కూల్చివేసిన వేయికాళ్ళమండప ప్రాంతంలో రాళ్ళు పరుస్తున్నారు. ఆ స్థలం వివాదాస్పదమైనపుడు ఆ వివాదం తేలేవరకూ అక్కడ ఏ నిర్మాణాలూ జరపకుండా ఉండ వలసింది. అలా కాక నిర్మాణాలు అతి చురుకుగా సాగిపోతూనే ఉన్నాయి.

ఇది గమనించి 11వ తేదీన ఒక నిర్ణయం ప్రకటించాలని శ్రీ చిన్న జీయరు స్వామివారనుకున్నారు. ఈ విషయం ఈనోటా, ఆ నోటా వార్తాపత్రికలో వచ్చింది. ప్రభుత్వ ప్రతినిధిగా కార్యదర్శి **T.T.D.** ఛైర్మన్, ఎండోమెంట్స్ మంత్రి వచ్చి శ్రీవారితో మాట్లాడివెళ్ళారు.

9వ తేదీ రాత్రికి ఎండోమెంట్స్ మంత్రి శ్రీమాన్ **M.** సత్యనారాయణ, **T.T.D.** ఛైర్మన్ **T.** సుబ్బిరామిరెడ్డి, **T.T.D.** సభ్యులు, శ్రీ **G.** రామరాజుగారు, ప్రిన్సిపల్ సెక్రటరీ **J.S.N.** మూర్తి, తదితరులూ, మన జెట్ భవనంలోనే సమావేశమై, "వేయికాళ్ళ మండపం అక్కడే పూర్వంవలె నిర్మిస్తాం, క్రొత్త మహాప్రాకారం నిర్మాణం వెంటనే నిలిపివేస్తున్నాం" అంటూ ప్రభుత్వం ఆర్డరును మెమోను శ్రీవారికి భక్తులముందర, మీడియా ముందర అందించారు. క్రొత్త ప్రభుత్వం ఆరకంగా ఒక చారిత్రాత్మక ఆర్డరును చారిత్రాత్మకంగానే విడుదల చేసారు.

ఇది జీర్ణం చేసుకోలేని కొందరు ప్రభుత్వంపై, మంత్రిగారిపై తీవ్రమైన ఆరోపణలను సంధించనారంభించారు. అధినేతలు ఈ పరిణామాలకు భయపడి తమ ఆర్డరుపై ఊగిసలాటలు ప్రారంభించారు. ద్వంద్వవైఖరిని ప్రకటించనారంభించారు. దీనిపై జరగవలసిన చర్యను 'వికాసతరంగిణి' ఆంధ్రప్రాంత సభ్యులందరూ 29వ తేదీన సమావేశమై నిర్ణయిస్తారని శ్రీవారు ప్రకటించారు ఇదిలా ఉండగ **T.T.D.** ఛైర్మన్ తమ మాటపై తప్పక నిలబడతామని 27.8.04న పత్రికలో ప్రకటించారు.

29న సీతానగరంలో **V.T.** సమావేశం జరిగింది. వివిధ జిల్లాలనుండి వచ్చిన ముఖ్య కార్యకర్తలు తిరుమలలో ఇటీవల జరిగిన పరిణామాలను సమీక్షించారు. **T.T.D.** ఛైర్మన్ ప్రకటనకు హర్షాన్ని వ్యక్తం చేస్తూనే అది కార్యరూపం ధరించే వరకు కూడా మన కృషిని ఆపటానికి వీల్లేదు. వాతావరణం సానుకూలంగా మారి దాని అమలుకు తగిన రూపురేఖలు స్పష్టం కావాల్సి ఉంది. ఇందుకోసమై దీపావళిదాక సమయాన్ని ఇవ్వటం సముచితమని వికాసతరంగిణి నిర్ణయించింది.

ఈ రెండో వాగ్దానంలో అయినా ఊగిసలాట లేని స్థిర ధోరణిని **T.T.D.** అను [illegible] ఉంది. ఈ లోపు సమాచారాన్ని [illegible]దరికి ఆలయజేయటం, అన్ని రకాలుగా

భక్తులను విజ్ఞానవంతులను చేయటం తక్షణ కర్తవ్యంగా **V.T.** భావించింది.

అందుకే వైష్ణవ ప్రతిష్ఠాన్, శ్రీవేంకటేశ్వర భక్తమండలి తయారు చేసిన రెండు కరపత్రాలను సాధనాలుగా వాడుకోవాలని నిర్ణయించింది. పుష్కరాల్లో అన్ని వైపులనుండి భక్తులు విజయవాడకు వస్తారు కనుక సమాచారాన్ని అందించటానికి ఇదొక చక్కని అవకాశంగా భావించి దానికోసం కార్యకర్తలను సమాయత్తం చేయాలని **V.T.** సూచించింది.

ఈ రెండు కరపత్రాలకోసం భక్తులు సమీపంలోని వికాసతరంగిణి కార్యకర్తలను సంప్రదించవచ్చని, అవసరమైన కరపత్రాలను స్థానికంగానే ముద్రించుకొని అందరికీ అందజేసే ప్రయత్నం చేయాలని **V.T.** నిర్ణయించింది.

ఈ విషయంలో ప్రతి **V.T.** శాఖ భక్తులకు సమాచారం అందించే కేంద్రంగా పనిచేస్తూ ఎప్పటికప్పుడు తమ రిపోర్టులను కేంద్ర కార్యాలయానికి తెలియచేయాలి. హిందీ, ఇంగ్లీషులలో తయారైన కరపత్రాల కోసం కేంద్ర కార్యాలయాన్ని శాఖలు సంప్రదించవచ్చని **V.T.** సమావేశం నిర్ణయించింది.

**కృష్ణా పుష్కర ప్రయుక్త బ్రహ్మయజ్ఞం** (28-8-04 నుండి 8-9-04 వరకు) **P.W.D.** వర్క్‌షాపు, సీతానగరం ప్రక్కన ఉన్న శ్రీ గోకరాజు గంగరాజుగారి స్థలంలో కృష్ణా పుష్కర ప్రయుక్త బ్రహ్మయజ్ఞ అంకురారోపణ కార్యక్రమాన్ని 27-8-04 సాయంత్రం శ్రీస్వామివారు ప్రారంభించారు. ఈ సందర్భంగా సామూహిక లక్ష్మీనారాయణ పూజలు అద్భుతంగా జరిగాయి.

28-8-04 అగ్ని మథనంతో బ్రహ్మయజ్ఞ కార్యక్రమం ప్రారంభమైనది. నాలుగు హోమ కుండాలతో చతుర్వేద హవనం ఒక శాలలో, ఇష్టులను రెండో శాలలో నిర్వహించటానికి ఏర్పాటు చేసారు. 29వ తేదీ సాయంత్రం హయగ్రీవ జయంతి సందర్భంగా సామూహిక పూజలను భక్తులతో శ్రీస్వామి వారు నిర్వహించారు.

30వ తేదీన శ్రీస్వామివారి చాతుర్మాస్య దీక్ష ఆరంభమైంది. 1.9.04తేదిన శ్రీశ్రీశ్రీ పెదజీయరుస్వామివారి తిరునక్షత్ర సందర్భంగా శ్రీస్వామివారు నడిగడ్డపాలెం వెళ్ళి అక్కడ అభిషేకకార్యక్రమాన్ని సేవించుకొని, తిరుమల విషయాలను అక్కడ భక్తులందరికీ తెలియజేసారు. సాయంత్రం సామూహిక పూజా కార్యక్రమాన్ని బ్రహ్మయజ్ఞస్థలంలో శ్రీస్వామివారు నిర్వహించారు.

మిగతా వివరాలు వచ్చే సంచికలో....

జై శ్రీమన్నారాయణ !

## విషయ సూచిక.....



## పంచాంగ వివరాలు

### అక్టోబర్

10 సర్వేషామేకాదశి,
యతుల మహాలయం, చిత్తకార్తె
12 విషశస్త్రహత జనానాం మహాలయం
13 మహాలయ అమావాస్య
14 దౌహిత్రకర్తవ్య మహాలయం, తిరుమల
శ్రీవారి నవరాత్రి బ్రహ్మోత్సవారంభం,
15 అవమతిథి, శరన్నవరాత్రారంభం
16 తిరుమలైనంబి తిరు॥
17 తులాసంక్రమణము సా. 5-19
19 సరస్వతీపూజ, స్వర్ణరథోత్సవం
20 సేనైమొదలియార్ తిరు॥
21 తిరుమల శ్రీవారి రథోత్సవం,
దుర్గాష్టమి
22 మహర్నవమి, విజయదశమి,
దసరా, పొయిఘయాళ్వార్ తిరు॥
పిళ్లైలోకాచార్యర్ తిరు॥
23 ఏకాదశి తిథి రాజ్ఞాం పట్టాభిషేకం
పూదత్తాళ్వార్ తిరు॥
తిరుమలై యాండాన్ తిరునక్షత్రం
24 పేయాళ్వార్ తిరు, సర్వేషామేకాదశి,
స్వాతి కార్తె
28 వాల్మీకి జయంతి, అదృశ్య చంద్రగ్రహణం

### నవంబర్

1 పంచమి తిథి,
ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవం
4 గురుపుష్యమి
6 విశాఖ కార్తె
8 సర్వేషామేకాదశి
11 నరకచతుర్దశి స్నానం, దీపావళి పండుగ,
మాస శివరాత్రి,
12 ధనలక్ష్మి పూజ,
**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామి వారి తిరునక్షత్రం**


Printed and published by Sri **T.P. Sriramachandracharyulu** owned by **Jeeyar Educational Trust** and Printed at **Sriman Printers & Processors** Sitanagaram and Published at Sitanagaram, **Editor Sri T.P. Sriramachandracharyulu 7-48, Brindavani, Visakhapatnam - 530 028.**



మీ సేవలో....

**భక్తినివేదన,** సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, ✆ (08645) 272929,


**చందావివరాలు:**-సంవత్సరచందా రూ.50/-, జీవితచందా రూ.500/-,
విదేశాలకు సంవత్సరచందా $ 25,


E-mail : jetsitanagaram@yahoo.com Internet : www.chinnajeeyar.org



D.T.P. & Design by : పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రాసెసర్స్, సీతానగరం,


శ్రీమతే రామానుజాయ నమః

# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాస పత్రిక




శ్రీతారణ నామ సంవత్సరం భాద్రపదం

**సంపుటి 57** **2004 అక్టోబరు** **సంచిక 7**


వ్యవస్థాపకులు

శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యులు
శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు

సంపాదకులు :

శ్రీ ఉ. వే. శ్రీమాన్ T.P. **శ్రీరామచంద్రాచార్యులు**

సంపాదకీయం

# సిరికి తగిన సత్కృతి

లోకంలో సిరిగలవారిని అదృష్ట వంతులంటాం. పెట్టి పుట్టేడంటాం. శ్రీమంతుణ్ణి లోకం గౌరవిస్తుంది. "యస్యాస్తి విత్తం స నరః కులీనః...." డబ్బుంటే చాలు, వాడిలో లేనిగుణాలంటూ లేవన్నట్టుగా లోకం కీర్తిస్తుంది.

ఇంతకూ సిరి ఉండగానే సరికాదు. సిరి ఉన్నవాడు చెయ్యవలసినది కూడా ఉంది. అది చేసిననాడే ఆ సిరి సార్థకం అవుతుంది. నిలుస్తుంది.

సంపదకు ధన్యత ఈవితోనే. సంపాదన తన బతుకు సుఖం కోసమే అయినా అది పదికాలాలపాటు నిలవాలన్నా, తాను పొందే సుఖసంతోషాలు నిరుద్విగ్నాలుగా నిత్యప్రసన్నాలుగా జనకంటకాలుగా కాకుండా కొనసాగాలన్నా, ఆ సంపదలు పెరగాలన్నా కావలసింది ఈవి.

ఈ ఈవి ఎందుకు? తన అభ్యుదయం కోసం. సమాజశ్రేయస్సుకోసం కూడాను.

సిరి గలవాడు దానాలచేత యోగ్యులను ఉత్తములను సమ్మానించాలి. సమాజ కల్యాణానికి దానాలు కావించాలి. ఇట్లా వ్యష్టిగాను సమష్టిగానూ కూడా సిరి, సంపాదించినవారికి, సమాజానికీ కూడా ఉపయోగపడాలి. అప్పుడే ఆ కలిమి 'కలిమి' అవుతుంది. అట్లా కాని కలిమి లేమికిందే లెఖ్ఖ.

అయితే ఒక్కమాట. ఈవి కావాలి. నిజమే. కాని అది సిరికి తగి కూడా ఉండాలి. తగ్గా పనికిరాదు. మొగ్గూపనికి రాదు. 'శ్రియా దేయం' అంటుంది శ్రుతి. తగనిపరుగులు తీయరాదు. పేద అరుపులూ పెట్టరాదు.

ఏవో పేరు ప్రతిష్ఠలు సంపాదిద్దామనో ప్రయోజనాలు పొందుదామనో చేసే దానాలు స్పృహణీయాలు కావు. ఈతకాయవేసి తాటికాయ లాగాలనే తీరులో ఇవి సాగరాదు.

సిరికి కల ప్రయోజనాలలో దానం ప్రధానం. చెయ్యాలని చెయ్యాలే తప్ప, దానివల్ల ఏదో పొందుదామన్న దృష్టితో చెయ్యరాదు. కోరకపోయినా దానం వల్ల ఒకానొక ఆనందం అనుభవానికి వస్తుంది. అది అప్రయత్న సిద్ధంకావాలి. అప్పుడే ఆ



సిరి సార్థకం. ఆ దానం యోగ్యమూను.

శ్రీవిల్లిపుత్తూరిలోని భాగవతులు సిరికి తగిన సత్కృతి కావించే వారని రాయలవారు వర్ణిస్తారు. అచటివారి అతిథి సత్కార పరిపాటిని ప్రశంసిస్తారు.

వారనట్టు సిరితో సత్కృతిని కావించాలి. సత్కారాలే కాదు, సత్కార్యాలూ కావించాలి. అప్పుడే సిరి కలిమికి ఫలం.

వెనకటి కాలంలో శ్రీమంతులు వాపీ కూప తటాకారామాగ్రహార దేవాయతన ప్రతిష్ఠాదులయిన సత్కృతులు కావించి తమ సిరిని సార్థకం చేసుకొనేవారు. ఇందులో కీర్తికాంక్షకన్న, 'తనతృప్తికోసం' అనే భావన మిన్నగా ఉండేది. గుప్తదానాలు చేసేవారూ లేకపోలేదు.

సిరి అంటే కేవలం ధనరూప సంపదేనా? సుగుణాల కలిమిని, బుద్ధివైభవాన్ని వైదుషీ వైలక్షణ్యాన్ని. అధికారాతిశయాన్ని, పాడిపంటలను, బలారోగ్యాదులను. సిరి అనే అంటాం. మంచి మగటిమి గల మానిసిని మగసిరి కలవాడంటాం.

అయితే ఈ సకల విధాతిశయాలూ వ్యక్తిగతంగా మనిషిని సంతృప్తిలో నిలబెట్టినప్పుడు సమాజ కల్యాణానికి నేరుగానో, పరోక్షంగానో తోడ్పడ్డప్పుడూ మాత్రమే అవి సిరులవుతాయి. లేకపోతే అవే ఉరులూ అవుతాయి. బతుకుల్లో ఇరులూ కుమ్మరిస్తాయి.

మతిమంతుడు తన మతిని సత్కృతి కుపయోగించాలి. బలవంతుడు తన బలాన్ని, విద్వాంసుడు వైదుష్యాన్ని, ప్రభువు అధికారాన్ని... ఇట్లా అన్ని రకాల అనుకూలాతిశయాలనూ సత్కృతులకే ఉపయోగించాలి.

ఇంతకూ సిరిఅంటే అనుకూలాతిశయం' అని ఇంత విశాలంగా గ్రహించాలి. అది ఏ రూపంలో ఉండనీండి, వ్యక్తియొక్క, సమాజంయొక్క క్రమవికాసానికి ఉపయోగపడాలి. ఏ ఒకరి వికాసం వేరొకరి వినాశానికి, విషాదానికి కారణం కాకూడదు.

'కలవారన్న'మాట చాలా విశాలమైనది. గంభీరమైనది. వెనక చెప్పినట్టు అనుకూలాతిశయం కలవారంతా 'కలవారి' కిందే లెక్క. అదిలేని వారు లేనివారికింద లెఖ్ఖ. లేని వారంటే ధనంలేనివారనే కాదు. కల వారంటే డబ్బున్నవారు మాత్రమే అనీకాదు.

సిరులుండి సత్కృతులు చేయగల బుద్ధి కలవారంతా కలవారు. సిరులు ఇంటపోగులు పడినా సత్కృతులు చేయలేని వారంతా లేనివారు.

శ్రీహర్షుడు నలమహారాజును వర్ణిస్తూ చమత్కారంగా ఆయనను దరిద్రుడంటాడు. మహారాజు దరిద్రుడేమిటి? దరిద్రుడంటే

లేనివాడు. ఏమిలేనివాడు? దారిద్ర్యం లేనివాడు. అల్లాగే కలిమి కలిగీ, అది ఏ విధమైనది కానీండి, దాన్ని ఒరులకీయ లేనివాడూ లేనివాడే మఱి!

కలిమి కలిగి సత్కృతులు చేయగల వారే నిజానికి కలవారు. మిగిలినవారు ఎంతకలవారైనా ఎన్నికలవారైనా లేనివారే! లేనివారని ఎవరినంటాం? నేలపై లేని వారిని. లేనివాడంటే మృతప్రాయులన్న మాట!. వారు భౌతికంగా బతికున్నట్టు కనబడినా వాస్తవానికి మతిలేనివారే అన్నమాట.

బుద్ధిమంతులెవరైనా తమను లేని వారుగా పరిగణించేందుకొప్పుకొంటారా? వారి ఒప్పుదలతో పనిలేదు లోకానికి, లోకం తన తీర్పును నిర్ద్వంద్వంగా వారిని లేనివారుగా ప్రకటిస్తుంది. అంచేత కలవారెవరయినా ఎంత కలవారయినా, ఏం కలవారైనా సత్కృతులు కావించి తమను నిజంగా కలవారుగా నిరూపించు కోవాలి. లేనివారిలో లోకం తమను చేర్చకుండా చేసుకోవాలి.

సిరికి తగిన సత్కృతులు కావించాలి. ఇక్కడి సిరి వైశాల్యాన్ని గ్రహించాలి. సత్కృతుల ప్రయోజన గరిమను, సమాజ కల్యాణ ప్రదత్వాన్ని విస్తృతంగాను, గంభీరంగానూ పర్యాలోచించాలి.

శ్రియాదేయం అన్నశ్రుతి తాత్పర్యాన్ని సత్కృతి పర్యంతం ప్రసరింప చేసుకోవాలి. రాయలవారి 'సత్కృతిని సత్కారాలనుంచి సత్కార్యాల వరకూ సాగనివ్వాలి. అప్పుడే 'సిరికి తగిన సత్కృతి' అన్నది సార్థకం అవుతుంది.

కలవారు లేనివారు కాకుండా తమ సత్కృతులవల్ల తామూ సత్‌కృతులుగా కూడా విరాజిల్లుతారు.

**- శ్రీ రామచంద్రాచార్య**



# అభినందనలు

భక్తినివేదన పాఠక కుటుంబాన్ని మరింత పెంచేందుకు కృషి చేస్తున్నవారిలో శ్రీమతి జి. అరుణకృష్ణగారు ఒకరు. వీరు హిందూపూర్ (అనంతపురం జిల్లా) వికాసతరంగిణి సభ్యులు. వీరికి శ్రీశ్రీశ్రీస్వామి వారు అనేక మంగళా శాసనాలు కృపచేయుచున్నారు.





# భృగు మహర్షి

## మహర్షులు చరిత్ర

తమిళమూలం :
మై.వా. నావల్‌పాకం దేవనాథ తాతాచార్యస్వామి

తెలుగు సేత :
శ్రీ.ఉ.వే.ప్ర శ్రీమాన్ తూపురాణి ఉడయవర్‌స్వామి, విజయవాడ

**తపోబలం:**

సర్వజ్ఞుడైన భృగుమహర్షికి ఈ విషయమంతా తెలిసింది. కాని ఆయన ఎవరితోను ఈ విషయం చెప్పలేదు. తన తపోబలంచేత ఆ రాక్షసుడు ఆశ్రమంలోకి రాకుండా కట్టుదిట్టం చేశాడు. దంపతులిద్దరూ అన్యోన్యంగా, సుఖసంతోషాలతో జీవించ సాగారు. భృగుమహర్షి ఆశ్రమంలో ఉన్నంత కాలం ఆ రాక్షసుడు ఏమీ చేయలేడు. ఆతడు అత్యవసరంగా బయటకు వెళ్ళవలసివస్తే తన భార్య అయిన పులోమను తన అగ్నిహోత్రునికి అప్పగించి వెళుతూ ఉండేవాడు. భృగుమహర్షి వచ్చేవరకు అగ్నిహోత్రడే ఆశ్రమంలోకి ఎవరినీ ప్రవేశించనీయక ఆమెను కాపాడుతూ ఉండేవాడు. ఇలా ఆయా సమయాల్లో భృగువు, అగ్ని పులోమను కాపాడుతూ ఉండేవారు. ఆ రాక్షసుడు కూడ తగిన సమయం కోసం చూసిచూసి విసిగి పోయాడు. కాని, ఆ ప్రదేశాన్ని విడచి వెళ్ళలేదు.

**రాక్షసుని సాహసం :-**

ఒకరోజున భృగుమహర్షి స్నానం చేయడం కోసం బయటకు వెళ్ళాడు. అలవాటు ప్రకారం పులోమను అగ్నిహోత్రునికి అప్పగించి 'జాగ్రత్త' అని చెప్పి వెళ్ళాడు. ఆ సమయంలో రాక్షసుడు ఆశ్రమంలో ప్రవేశించి పులోమను బలాత్కారంగా అపహరించుకు పోబోయాడు. 'అగ్నిహోత్రుని రక్షణలో ఉన్నానుగదా' అని ఆమె నిర్భయంగా ఉంది. కాని రాక్షసుడు లాగుకొని పోతూ ఉంటే దుఃఖించింది. అగ్ని కూడ రాక్షసుణ్ణి అడ్డగించాడు. ఇద్దరికీ పెద్ద వాగ్వివాదం జరిగింది.

రాక్షసుడన్నాడు "ఈమె అసలు నాకు చెందవలసినది. ఈమె తల్లిదండ్రులు నా దగ్గరనుండి తగిన ప్రతి ఫలాన్ని పొంది ఈమెను నాకే ఇచ్చారు. యుక్తవయస్సు వచ్చినపుడు వివాహం చేసుకుని తీసికొని వెళ్లవచ్చును అని నేను అనుకుంటూ ఉండగా మధ్యలో ఈ భృగుమహర్షి వచ్చి ఈమెను వివాహం చేసుకుని గొప్ప అపరాధం చేశాడు. "ఓ అగ్నిదేవతా! నీవు ఆనాడూ, ఈనాడూ, ఏనాడూ ప్రాణులందరి లోపల నిరంతరం నివసిస్తూ ఉన్నావుగదా! అందుచేత, ఈవిషయం నీకు కూడబాగా తెలుసు. దీనిలో ఉండే న్యాయాన్ని నీవే నిర్ణయించి ఈమె నాకు చెందినదో భృగుమహర్షికి చెందినదో చెప్పు అని అడిగాడు.

**ధర్మసంకటం:**

అగ్నికి పెద్ద ధర్మసంకటం ఏర్పడింది. "వేళాకోళమే గుదిబండగా మారింది" అన్న సూక్తి యదార్థమైంది. లోకంలో పిల్లలను సన్మార్గంలో పెట్టడానికి తల్లిదండ్రులు ఏవో ఏవో చేస్తూ ఉంటారు. పిల్లలకు ఇష్టంలేని అనేక పనులు చేసి ఎలాగో ఆ పిల్లల మొండితనాన్ని పోగొట్టి ఒకదారిలోకి తెస్తారు. అంతటితో ఆ విషయాన్ని మరచి పోతారు. ఇది లోకంలో సహజంగా జరిగేది. దీన్ని ఆధారంగా చేసుకుని రాక్షసుడు ఈనాడు 'ఈమె నాకు చెందినది' అని అనడం సరికాదు. నిజంగా ఆ చెట్టు మీద రాక్షసుడు ఉన్నాడు–అని ఆ తల్లిదండ్రులు భావిస్తే 'నిన్ను ఆ రాక్షసుడికి ఇస్తాము' అని అనరుగదా! అసలా ప్రక్కకే వెళ్లరు. చంటిపిల్లను తీసికుని అక్కడనుండి ఇంకోచోటికి పారిపోయి ఉండేవారు.

పైగా, సర్వజ్ఞుడైన భృగుమహర్షి ఈమెను శాస్త్రోక్తంగా వివాహం చేసు కున్నాడు. నిజంగా ఈమె ఇతరులకు చెందినదే అయితే, ఆయన వివాహం చేసుకోడుగదా! రాక్షసుడికి ఈమెకు ఈ విధంగా వివాహం జరగలేదు. ఆమె తల్లిదండ్రులు ఈతని అల్లునిగా భావించి కన్యాదానం చేయలేదు. అందుచే రాక్షసుని వాదం సరియైనది కాదు. చిన్నతనంలో అప్పటి సందర్భాన్నిపట్టి చెప్పిన మాటలను యథార్థంగా భావించడం, దాని ఆధారంగా 'ఈమె నాకు చెందినది' అని రాక్షసుడు అనడం మోసగించడమే. తన రాక్షసబలాన్ని, ఎదుటివారి బలహీనతను చూచి, దుర్మార్గంతో ఈమెను తనదానినిగా చేసుకోడానికి ప్రయత్నిస్తున్నాడు, రాక్షసుడు. "నీవు చెప్పింది సరికాదు, ఈమె భృగు మహర్షికి చెందినదే" అని అనేకసార్లు బాగా ఆలోచించి చెప్పాడు అగ్ని. జరుగవలసినది జరిగిపోయింది:

ఈవాదం పూర్తి అయ్యేవరకు రాక్షసుడు ఆగలేదు. అగ్ని చెప్పిన నిర్ణయాన్నీ అంగీకరించలేదు. బలాత్కారంగా తీసికొని పోయి వివాహం చేసుకోవడం రాక్షస వివాహమని కదా అంటారు. అలాగే చేశాడు రాక్షసుడు. ఒక్కసారి ఆమెను చేతులలో ఎత్తుకుని పారిపోయాడు. పాపం! ఆమె ఆ సమయంలో పదిమాసముల గర్భిణి. ఇంత ఘోరమైన దీనిని ఆమె ఎలా సహించగలదు? ఆ రాక్షసుడు కొద్ది దూరం వెళ్ళేసరికి ఆమె ప్రసవించింది. మహా తేజస్వియైన ఒక శిశువు ఆమెకు జన్మించాడు. ఒకపెద్దకేకతో పులోమ ఒకప్రక్క పడిపోయింది. రాక్షసుడు ఒక పక్క పడ్డాడు. పుట్టిన బిడ్డ తేజస్సుకి రాక్షసుడు భస్మమయ్యాడు. తల్లీ, బిడ్డ ఎక్కడ పడిన వాళ్ళు అక్కడే ఉన్నారు. అంతా క్షణంలో జరిగిపోయింది.

ఇంతలో భృగుమహర్షి తన అనుష్ఠానాన్ని ముగించుకుని ఆశ్రమానికి వచ్చాడు. భార్య కనబడకపోవడంతో కలత చెందాడు. దివ్య దృష్టితో జరిగినదంతా గ్రహించాడు. తొందర తొందరగా తన భార్య, పిల్లవాడు పడి ఉన్న చోటికి చేరాడు. తీవ్రమైన కోపంతో అగ్నిని ఘోరంగా శపించాడు.



రాక్షసుడు వచ్చి అక్రమానికి పాల్పడి తన భార్యను తీసుకునిపోతూ ఉంటే, వానిని వెంటనే భస్మం చేయవలసిన విధి అగ్నికి ఉంది కదా! అలా చేయకుండా వానితో వాదానికి దిగడం, పెద్ద తప్పు. ఇదే పెద్దదోషానికి కారణం అయింది. అగ్నియే కనుక తగిన సమయంలో తన విధి తాను నిర్వహించి ఉంటే ఈ ఘోరం జరిగి ఉండేది కాదు. నిండుచూలాలైన తన భార్యను, ఈ స్థితిలో చూడవలసి రావడంచేత భృగుమహర్షికి చెప్పలేనంత కోపంవచ్చింది! ప్రసవించిన భార్యను, బిడ్డను జాగ్రత్తగా ఆశ్రమానికి చేర్చి తగినరీతిలో ఉపచారాలు చేసి వారిని సంరక్షించాడు. ఈ బిడ్డకే 'చ్యవనుడు' అని పేరు. శ్రీవత్సగోత్రప్రవర్తకులైన ఋషులు ఐదుగురిలో 'చ్యవను'నిది రెండవస్థానం.

**ఏమిటాశాపం:**

"సర్వ భక్షకుడవు అగుము" అనునదే ఆ శాపం. పరమనీచమైన శాపం. 'సర్వ' అనే శబ్దానికి 'అన్నీ'అనే అర్థం ఉన్నా, ముందు మనకు స్ఫురించేది అశుద్ధ పదార్థం. "అయ్యో! ఎంత ఘోరశాపం"అని అంతా ముక్కుమీద వేలు వేసుకున్నారు. దేవతలకు అగ్నిముఖం గదా! ఇలా అశుద్ధపదార్థాలన్నీ తినే అగ్ని ద్వారా తమ హవిర్భాగాలను స్వీకరించడానికి దేవతలు తిరస్కరించారు. యాగాలు, హోమాలు మొదలైన వైదిక కార్యాలన్నీ స్తంభించి పోయాయి.

**చతుర్ముఖ బ్రహ్మరాక!**

సాక్షాత్తుగా చతుర్ముఖబ్రహ్మ భృగు మహర్షికి సాక్షాత్కరించి, శాపాన్ని ఉప సంహరించుకోమని కోరాడు. కాని భృగు మహర్షి అంగీకరించలేదు. అందుచే అందరికీ అంగీకారం అయ్యేరీతిలో ఇలా చెప్పాడు బ్రహ్మ. "జరిగినదేదో జరిగిపోయింది. దీని వల్ల అగ్నికి ఏమాత్రము అశుద్ధి అంటదు. నేను చెబుతున్నాను వినండి. అశుద్ధిపదార్థాలను అగ్ని దగ్ధం చేసినా మునిగిపోయినదేమీలేదు. ఆ పదార్థం అలాగే ఉంటే అందరికి ఇబ్బంది కరంగా ఉండవచ్చు. దానిని దహించి భస్మం చేయుట ద్వారా ఆ ప్రదేశాన్ని పరిశుద్ధం చేస్తున్నాడు. ఇది అందరికీ మంచిదే కదా ఇందులో తలవంచుకోవలసింది ఏముంది? సూర్యుణ్ణే చూద్దాం. తన కిరణాలద్వారా మూల మూలలనున్న అశుద్ధపదార్థాలన్నిటినీ తొలగించి అతడు మనకు ఉపకరిస్తున్నాడు కదా! సూర్యకాంతియే లేకపోతే లోకమంతా చెత్తతో నిండిపోతుంది కదా! దీనిచేత మనం సూర్యుణ్ణి 'అపరిశుద్ధుడు' అని అంటున్నామా? అలాగే ఈ అగ్నివిషయంలో కూడ మనం గ్రహించాలి" అని చెప్పి బ్రహ్మ అంతర్ధానం చెందాడు.

**బ్రహ్మ శాపోపశమనానికి చెప్పిన శ్లోకాలు:**

**శ్లో॥ నత్వం సర్వశరీరేణ,**
**సర్వభక్షత్వమేష్యసి.**
**ఉపాదానేకర్చిషో యాస్తే,**
**సర్వం భక్ష్యన్తి తాఃశిఖాః॥**

**శ్లో॥ యథాసూర్యాం శుభిః, స్పృష్టం,**
**సర్వం శుచి విభావ్యతే**
**తథా త్వదర్చిర్నిర్దగ్ధం,**
**సర్వం శుద్ధం భవిష్యతి"**

అగ్నికి జ్వాలలు అనేకం ఉంటాయి. అందులో కొన్ని మాత్రమే "సర్వభక్షకం"గా ఉంటాయి. మిగిలిన జ్వాలలు పూర్వం వలె పరిశుద్ధంగానే ఉంటాయి. అంటూ సూర్యుణ్ణి ఉపమానంగా చూపి వారిని సమాధాన పరిచాడు బ్రహ్మ. భృగుమహర్షి తేజస్సు ముందు బ్రహ్మకు కూడ తలవంచక తప్పలేదు.

జై శ్రీమన్నారాయణ!

పరమహంస పరివ్రాజకులు

**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామి వారి**

మంగళాశాసనములతో.....

# విజయదశమి (దసరా పండుగ) నిర్ణయము

శ్రీతారణ నామ సం॥ర ఆశ్వీయుజ శు॥ నవమి శుక్రవారము తేది:22-10-2004 రోజున నవమి 20-07 ఘడియలు, శ్రవణము 22-06 ఘడియలు. దశమి శనివారము 23-10-2004 రోజున దశమి 15-01 ఘడియలు ధనిష్ఠ 18-49 ఘడియలు. యున్నందువల్ల నవమి శుక్రవారము రోజున శ్రవణానక్షత్రము దశమికి స్పర్శ యగుటచేతను అపరాహ్ణములోనకు వ్యాప్తి శ్రవణయోగము కూడా లేనందున

శ్లో॥ **"ఆశ్వినస్య సితే పక్షే దశమ్యాం తారకోదయః ।**
**సకాలో విజయోజ్ఞేయః సర్వకార్యార్థ సిద్ధిదః" ఇతి** (కాల నిర్ణయ చంద్రికాయాం)॥

శ్లో॥ **నవమీ శేష సంయుక్తాం దశమ్యా మపరాజితాం ।**
**దదాతి విజయం దేవీ పూజితా జయ వర్ధినీ॥**
**ఈషత్సంధ్యా మతిక్రాంతః కించి దుద్భిన్న తారకః॥**
**విజయో నామ కాలోయం సర్వకార్యార్థ సిద్ధిదః ॥**

(ధర్మసింధు) ధర్మశాస్త్ర ప్రమాణములు తెలుపుచున్నందువల్ల శ్రవణాస్పర్శయుక్త దశమి అపరాహ్ణ వ్యాప్తి యుండుటవల్ల దశమీ కాలమందు నక్షత్రములుదయించు సమయము విజయప్రదమైనందున తేది: 22-10-04 శుక్రవారము విజయదశమి (దసరా పండుగ) ఆచరణయోగ్యమని ప్రమాణములు తెల్పినందు వలన దసరా పండుగను శుక్రవారమునాడు విజయదశమిగ జరుపుకొనవలయును.

**ఇట్లు**

**జై శ్రీమన్నారాయణ !**

**తి.న.చ. సంపత్కుమార**
**కృష్ణమాచార్య సిద్ధాంతి-జనగామ**





లంకానగరంలో వాయునందనుని సీతాన్వేషణ

# రామాయణంలో రమ్యగాథలు

- శ్రీ చెవుటూరి కుసుమకుమారి, విజయవాడ.

హనుమ నిశితదృష్టితో లంకేశ్వరుని భవనమును చుట్టుముట్టి వున్న ప్రముఖుల ప్రాసాదములను కూడా పరిశీలించి రాక్షసేంద్రుని గృహాంగణమును చేరినాడు.

ఆ రావణగృహ ప్రాంగణంలో అనేక సేనావిభాగాలను ప్రయోగించుటకు సిద్ధముగావున్న ఆయుధములతో సహా చూచినాడు. మంచిశిక్షణ పొందిన ఐరావతాల్లాంటి ఏనుగులను, మహావేగవంతమైనవి, ఎరుపు, చారలు, తెలుపు రంగుల గుఱ్ఱాలను చూచినాడు. అటువంటి వెయ్యి సేనావాహినీ విభాగాలను గమనించినాడు.

(వాహిని అనగా ఒక సేనా విభాగము.)

ఆ వాహినిలో

| | | |
|---|---|---|
| ఏనుగులు | = | 81 |
| రధాలు | = | 81 |
| గుఱ్ఱములు | = | 243 |
| కాలిబంట్లు | = | 405 |

ఇటువంటి సేనావిభాగములు వెయ్యి వున్నవి. ఇంకనూ అనేక విధములైన పల్లకీలనూ, చిత్రవిచిత్రములైన లతాగృహాలనూ, క్రీడాగృహాలనూ, కర్రలతో నిర్మించిన పర్వతాలనూ శయ్యాగృహాలనూ, పగటికార్య నిర్వహణా భవనాలనూ చూచినాడు.

**"సమన్దర గిరి ప్రఖ్యం మయూర స్థాన సంకులమ్**
**ధ్వజయష్టిభి రాకీర్ణం దదర్శ భవనోత్తమమ్"**

ఇంకనూ ఆ హనుమ మందరగిరి సమానము, నెమళ్ళకు నివాసమైనదీ, ధ్వజ పతాకములచేత వ్యాపించబడినదీ దండాయుధాలతో, దక్షులైన నిర్వహణాధికారులతో నిష్టితమైనదీ, కేళిగృహములతో కూడినదీ అయిన రావణుని భవనమును చూచినాడు.

అక్కడ ఎక్కడ చూచినా ధనరాశులే. రత్నరాశులే. ఆసనములు, శయ్యలు, పాత్రలు బంగారుమయములే. మణులు రత్నములు పొదగబడిన పాత్రలలో పట్టు తేనెల పానీయాలు అందరూ అధికముగా పానము చేయుట చూచినాడు. వందలాదిగ స్త్రీలు అందెలు, వడ్డాణాలు మ్రోగుచుండగా అటు ఇటు తిరుగుతున్నారు. వారందరికీ ఆ ప్రాసాదమున వేరు వేరు శాలలు చక్కని కిటికీలతో అమర్చబడినవి. అవి ఎటువంటి దోషములు లేక సాక్షాత్తూ మయుడే ఈ భూమిన వీనిని నిర్మించినాడా అన్నట్లు లక్ష్మీ ప్రదంగా వున్నాయి.

అక్కడ భూమి గిరులతోనూ, గిరులు తరువులతోనూ, తరులు విరులతోనూ, విరులు కింజల్కములతోనూ పరిపూర్ణమై వున్నవి. తెల్లని ఉన్నత ఉత్తమ భవనములు. అత్యుత్తమ సరస్సులు, ఆ సరస్సులలో పెద్దపెద్ద పద్మములతో చిత్రవిచిత్ర రీతులతో పెంచిన వనములున్నవి.

**"పుష్పాహ్వయం నామ విరాజమానం**
**రత్నప్రభాభిశ్చ విఘూర్ణ మానమ్**
**వేశ్మోత్తమానామపి చోచ్చమానం**
**మహాకపిస్తత్ర మహావిమానమ్"**

హనుమ అక్కడొక మహావిమానమును చూచినాడు. దానిపేరు పుష్పకము. పేరుకు తగినట్లే మనోహరము. ఆ చుట్టుపట్ల వున్న అత్యున్నత భవనములలోకెల్లా అత్యున్నతమైన దానిచుట్టూ పొదిగిన రత్నకాంతులు వ్యాపించిన జిలుగు, మిరిమిట్లుచేత అది గిర గిర తిరిగిపోవుచున్నట్లున్నది. ఆ విమానము మీద వజ్రవైడూర్యములతో, పగడాలతోనూ, బంగారంతో చెక్కబడిన మంచిరెక్కలుగల చిత్రవిచిత్రమైన పక్షులున్నవి. మాణిక్యములు పొదగబడిన వివిధ సర్పాకృతులూ చిత్రించ బడినవి.

ఉత్తమ జాతికి చెందినవి, శుభలక్షణ సంపన్నములు అయిన గుఱ్ఱములు కూడ అమర్చినారు.

**"నియుజ్య మానాస్తు గజాః సుహస్తాః**
**సకేసరాశ్చోత్పల పత్ర హస్తా**
**బభూవ దేవీ చ కృతా సుహస్తా**
**లక్ష్మీ స్తథా పద్మిని పద్మహస్తా"**

ఆ పుష్పక విమానమున గజలక్ష్మీ చిత్రీకరించబడినది. అందమైన గజములు తమ బలిష్ఠమైన తొండములతో బంగారు కలశములను జలముతో నింపి లక్ష్మీదేవిని అభిషేకించుచున్నవి. తామర పూలతో అర్చించుచున్నవి. పద్మ సరస్సులో నిలచిన కరుల (ఏనుగుల) శరీరములు కింజల్కముతో (పుప్పొడితో) నిండివున్నవి. లక్ష్మీదేవి తన మనోహర హస్తములయందు పద్మములు ధరించి శుభకరముగా వున్నది.

ఇటువంటి అనేక మనోహర వస్తు సముదాయముతో నిండి, వసంత ఋతువున మంచి సుగంధభరితమైన సువాసనలు వెద జల్లుచూ, అందమైన గుహలతో మనోహర ముగా వున్న ఆ లంకేశ్వరుని గృహమును మరల అన్వేషించినాడు ఆంజనేయుడు. అయిననూ రామాయత్త చిత్త అయిన సీతను కానక తానుకూడా విషణ్ణచిత్తుడైనాడు.

అనేక విధాల ఆలోచించి హనుమ దృఢనిశ్చయుడైనాడు. నిశిత దృష్టితో సీతను వెదుకవలెనని తలచినాడు.

**తపః సమాధాన పరాక్రమార్జితం**
**మనః సమాధాన విచార చారిణమ్,**
**అనేక సంస్థాన విశేష నిర్మితం**
**తతస్తతఃతుల్య విశేష దర్శనమ్**

పుష్పక విమానము గొప్ప తపఃఫలంగా నిర్మించబడినది. పరాక్రమముతో కుబేరుని ఓడించి దానిని రావణుడు పొందినాడు. దానిలో కూర్చున్నవారి మనసునెరిగి వారి కోరికననుసరించి అది ప్రయాణించు చుండును. అంతటి శోభాయమానమైన విమానమును ఆకాశ సంచారులైన రాక్షసులు కాపాడుచున్నారు.

రావణుని భవనమును, పుష్పక విమానమును పైకి ఎక్కి మరల మరల వెదుక సాగినాడు హనుమ. అంతలో కమ్మని పిండి వంటల వాసనలు, రుచ్యాన్నాల ఘుమ ఘుమలు, మద్యాది పానీయాల వాసనలు ఎల్లెడలా వ్యాపించినవి.

**"స గన్ధస్తం మహాసత్త్వం**
**బన్ధుర్బన్ధు మివోత్తమమ్**
**ఇత ఏహీ త్యువాచేవ**
**తత్ర యత్ర స రావణః"**

ఒక ఉన్నతుడైన బంధువును ఒక



ఉత్తముడైన బంధువు ఇటు రమ్ము – ఇటు రమ్ము అని సాదరంగా పిలుచుచున్నాడా! అన్నట్లు హనుమను రావణుడున్న చోటునకు తీసుకొనివెళ్ళినది.

అక్కడ రావణునకు అత్యంత ప్రీతికర మైన ఒక పెద్దశాలను చూచినాడు. స్ఫటిక మాణిక్యములు పొదగబడినది, బంగారు కిటికీలు కలది, దంతపు నగిషీలు చెక్కబడి నది, ముత్యములతోనూ, పగడములతోనూ నిలువెత్తిన స్తంభములు కలది. సముద్రము, నదులు, వనములు అది ఇది అననేల! భూతలమున వుండు సమస్తము చిత్రీకరించ బడిన ఒక ఆస్తరణము (తివాసీ) ఆ శాలలో పరచబడగా ఆశాలయే విశాల భూతలమా! అన్నట్లున్నది.

సుగంధ పరిమళాలు వ్యాపించు చుండగా, మత్త విహంగాల రాజిత కూజితా లతో ప్రతిధ్వనిస్తున్నది. ఆ శాల హంసలా తెల్లగా స్వచ్ఛముగా వున్నది. కాని అగరు ధూపాలచేత ఇంచుక ధూమ్రవర్ణము కలిగి వున్నది. పుష్పాలంకారములచేత చిత్ర విచిత్ర ములుగా వున్నది. ఆ శాల మనసాహ్లాదిని మాత్రమేకాక అందున్న వారి శరీర కాంతిని కూడా వర్ధమానం చేస్తున్నది. అది లక్ష్మీ నిలయము. శోకనాశని. నిర్మలమైన ఆ శాల సమస్త ఉత్తమ పదార్థములను సమ కూర్చుచూ, అంతఃపురస్త్రీలతో రావణుని సుఖ డోలలనోలలాడించుశాల రావణుని భోగశాల బంగారు దీపములు నిశ్చలముగా వెలుగు చుండగా వాటి ప్రకాశము, రావణుని రత్నాలంకార కిరణాలు, రావణుని తేజస్సు అన్నీ కలసి ఆ భవనం ప్రజ్వలించుచున్నట్లు తోచినది హనుమకు.

ఆ భవనమున వేయిమంది స్త్రీలు పరుండినారు. నిద్రావశులై ఆభరణ ధ్వనులు లేని ఆభవనము హంసలు తుమ్మెదలుగల గొప్ప పద్మసరస్సులా భాసించినది. తామర సొక్కులు, సౌందర్య రాశులు అయిన ఆ స్త్రీలతో నిండిన ఆ భవనము శరత్కాలమున నక్షత్రములతో ప్రకాశించే ప్రశాంత గగనంలా భాసించినది. నారీపరివృతుడు అయిన లంకేశ్వరుడు తారా పరివృతుడైన నక్షత్ర రాజులా ప్రకాశిస్తున్నాడు. పుణ్యావశమున నింగినతారలై, భూమికి జారినట్లున్నారు.

అచట రాజర్షికాంతలు, పితృకాంతలు, దైత్యకాంతలు, గంధర్వస్త్రీలు, రాక్షసస్త్రీలుకూడా వున్నారు. వారిలో కొందరు యుద్ధమున ఓడించిన వారి కాంతలు. కొందరు తాముగా రావణుని పొందుకోరి వచ్చినవారు. వారిరెవ రినీ రావణుడు బలాత్కారమున పొందలేదు. రావణుని భార్యలలో సత్కులసంజాత కానిది గానీ, సౌందర్యహీనగానీ, బుద్ధి కౌశల్యము లేనిదిగానీ, మనోహారిణి కానిదిగానీ, ఉప చారములు పొందనిదిగానీ ఒక్కతె కూడా లేదు.

వారిని చూచిన హనుమ "అయ్యో! ఈ రావణుడు తనస్త్రీలతోవలే, సీతతో రాముడు కూడివుండినచో ఈ రావణుడు ఇటువంటి అష్టైశ్వర్యములతో కలకాలం మనుగడ సాగించెడివాడుకదా! అని భావించినాడు హనుమ. (సీతనుతెచ్చి రావణుడు ఇంత ఐశ్వర్యమును నశింపచేసుకొను చున్నాడే!) అని ఈ రావణుడు మహాతపశ్శాలి అయికూడా యుక్తాయుక్త విచక్షణ నశించి, సీత విషయ మున కూడనిపని చేసినాడు. ఆ రామపత్నికి, ఆ ఉత్తమ ఇల్లాలికి ఎంతటి కష్టము తెచ్చి పెట్టినాడని మనస్సున దుఃఖము పొందినాడు. మరల సీతాన్వేషణకుపక్రమించినాడు.

# శ్రీవిష్ణు మహాపురాణం

## 9వ అధ్యాయం

శ్రీ ఉ.వే. శ్రీమాన్ S.V. రంగరామానుజాచార్యస్వామి, రాజమండ్రి

## ఇంద్రకృత శ్రీస్తుతి

సింహాసన గతశ్శుక్రః సంప్రాప్య త్రిదివం పునః ।
దేవరాజ్యే స్థితో దేవం తుష్టావ అబ్జకరాం తతః ॥

దేవేంద్రుడు శ్రీదేవి అనుగ్రహాన్ని పొంది మళ్ళీ దేవరాజ్యాధిపతి అయినాడు. సింహాసనాధిష్ఠితుడై కమలహస్త అయిన అమ్మను స్తుతించాడు.

**ఇంద్ర ఉవాచ:** ఇంద్రుడు ఇలా అన్నాడు

నమస్యే సర్వలోకానాం జననీమబ్జసంభవాం ।
శ్రియమున్ని ద్రపద్మాక్షీం విష్ణువక్షః స్థల స్థితామ్ ॥

పద్మాలయాం పద్మకరాం పద్మపత్త్ర నిభేక్షణాం ।
వందే పద్మముఖీం దేవీం పద్మనాభ ప్రియామహమ్ ॥

త్వం సిద్ధిః త్వం స్వధా స్వాహా సుధా త్వం లోకపావనీ ।
సంధ్యారాత్రిః ప్రభాభూతిః మేధా శ్రద్ధా సరస్వతీ ॥

యజ్ఞవిద్యా మహావిద్యా గహ్యా విద్యా చ శోభనే ।
ఆత్మవిద్యా చ దేవి త్వం విముక్తి ఫలదాయినీ ॥

ఆన్వక్షకీ త్రయీా, వార్తా దండనీతి స్త్వమేవ చ ।
సౌమ్యా సౌమ్యైర్జగద్రూపైః త్వ యైత ద్దేవిపూరితమ్ ॥

కాత్వాన్యాత్వామృతే దేవి సర్వ యజ్ఞమయం వపుః ।
అధ్యాస్తే దేవ దేవస్య యోగి చింత్యం గదాభృతః ॥

త్వయా దేవి పరిత్యక్తం సకలం భువన త్రయమ్ ।
వినష్ట ప్రాయమభవత్ త్వయేదానీం సమేధితమ్ ॥



ధారా పుత్రాస్తథాఽగార స్సుహృద్ధాన్య ధనాదికం ।
భవత్యే తన్మహా భాగే నిత్యం త్వ ద్వక్షణాన్నృణామ్ ॥

శరీరారోగ్య మైశ్వర్యం అరి పక్ష క్షయః సుఖం ।
దేవత్వద్ దృష్టి దృష్టానాం పురుషాణాం నదుర్లభమ్ ॥

త్వం మాతా సర్వలోకానాం దేవదేవో హరిః పితా ।
త్వ యైతద్విష్ణునాచాంబ జగద్ వ్యాప్తం చరాచరమ్ ॥

మానః కోశం తథా గోష్ఠం మాగృహం మాపరిచ్ఛదం ।
మా శరీరం కలత్రం చ త్యజేథాః సర్వపావని ॥

మాపుత్రాన్ మా సుహృద్వర్గం మా పశూన్ మా విభూషణం ।
త్యజేథా మమ దేవస్య విష్ణోః వక్షః స్థలాలయే ॥

సత్త్వేన శౌచ సత్యాభ్యాం తథా శీలాదిభిర్గుణైః ।
త్యజ్యం తే తేన రా స్స ద్య సంత్యక్తా యే త్వయామనే ॥

త్వయా విలోకితాస్సద్యః శీలాద్యైరఖివైర్గుణైః ।
కులైవైశ్వర్యైశ్చ యూజ్యం తే పురుషా నిర్గుణా అపి ॥

సశ్లాఘ్యః సగుణీధన్యః సకులీనః సబుద్ధిమాన్ ।
స చారః స చ విక్రాన్తో యస్త్వయాదేవి వీక్షితః ॥

సద్యో వైగుణ్యమాయాన్తి శీలాద్యా స్సకలాగుణాః ।
పరాఙ్ముఖీ జగద్ధాత్రి యస్య త్వం విష్ణువల్లభే ॥

న తే వర్ణయితుం శక్తా గుణాన్ జిహ్వాపి వేధసః ।
ప్రసీద దేవి పద్మాక్షి మాస్మాన్త్యాక్షీః కదాచన ॥

ఇంతవరకు ఇంద్రుడు లక్ష్మీదేవికి చేసిన స్తుతి. ఇది వేదసారం. లక్ష్మీతత్త్వానికి విస్పష్ట నిదర్శనం. ఆచార్యుల స్తోత్రాలు ఈ స్తుతిని ఆధారముగా చేసుకొని ఆవిర్భవించాయి. ఇప్పుడీ స్తోత్రంలో ఆంతర్యాన్ని గుర్తించే ప్రయత్నం చేద్దాం.



# గోపికా గీతం



**నీదు పుట్టువు చేత నొప్పారు రేపల్లె**
**సతము సిరి కొలువంగ చూడరా ఒకసారి**
**నీ కొరకు దిశలెల్ల వెదకి వేసారి**
**నీయందె ప్రాణములుంచి దురపిల్లు నీవారి ॥నీదు॥**

1 ముద్దులొలుకెడు నీదు మోము చూడగ లేని
మాకు, క్షణమొక్కటియె యుగసహస్రమ్మాయే।
కనులరెప్పలువెట్టి వంచించె నలువ మము
కుటిల కుంతలమైన వదనమది కనరాదె ॥నీ॥

2 దివినుండి భువికి దిగి–గుణవైభవము చాటి
గోపజన రక్షణము దీక్షగా గొంటిగద!
మాదు హృదృజబాపు దివ్యౌషదము నీవు
మెల్లగా స్పృశియింపు యెదద–నీ పదయుగళి ॥

3 వ్రజ భూమి విడచి–బహు దూర మావులద్రిప్పి
అలసి సొలసిన నీదు పదముకందిన దనుచు,
కరకు గరికల, శిలల నలిగి నొచ్చినదనుచు
కలత చెందను, మనము – కుదురుపడదే స్వామి॥నీ॥

4 పాదమంటిన వాని పుట్టువంటగబోదు
సిరిబట్టు వరకరము మాదు శిరమున తిరము
నీవు మమ్మెడబాయవన్న–మా గర్వమును
చిలిపి చిరునగవుతో పోద్రోలు మాసామి ॥నీ॥

5 ప్రణత కామప్రదము, కమలాసనార్చితము
నళినసుందర పదము–నాకి జన భయహరము
ఫణి ఫణావళినిడిన–పాదపంకేరుహము
హృదయ సదనమున నిడు–మదనకదనము ॥నీ॥

6 శారదాంభోరాశి–జాతపద్మోదర
శ్రీల దొంగిలు ముగ్ధనయనంపు సొరుచే



బత్తె మెరుగని నీదు, దాస జనమును చంప
వధకాదె, వరద! మా సురత నాధ ॥నీ॥

7 విసపు జలములనుండి వ్యాళ రక్షసినుండి
వర్ష వాయువునుండి వైద్యుతాగ్నులనుండి
వృషరూపుడగు ఘోర భయద దానవు నుండి
చల్లగా కాపాడి భయము పోద్రోలితివి॥నీ॥

8 వెడద కన్నులసామి–హృద్యవాఙ్నిచయమును
శ్రవణపేయమొనర్చి–మోహవివశలజేసి
కింకరీభావమను దృఢబంధమునవెట్టి
గట్టిగా కట్టితివె–జగజెట్టి నీవయ్య

9 ప్రొద్దుగ్రుంకిన వెనుక–చెదరు ముంగురులతో
నందగించిన మోము దమ్మి ధూసరితమై,
కనులబడి మా మనసు కలత వడు–కన్నయ్యా!
కామముద్దీపించు దేహమిది తపియించు ॥నీ॥

10 అధర సుధలను గ్రోలి పులకించి వేణువు వది
కల రవామృతధారలొలికింప, పున్నెమది
ఎన్ని జన్మల ప్రోదిగొన్నయదో, యెరుగమయ,
మధుర బృందావనము గానపులకితమయ్యె!

11 పతిసుతుల బందుగులనెల్ల నావలద్రోసి
నీదుపాదము చెంతనంటియుంటిమికన్న!
గానమోహితలమై గతిని గానకయున్న
పడతులను విడుతువా నడిరేయి యమునకడ ॥నీ॥

12 నీదు చరితామృతము – తప్త జనజీవనము
కవి జనావళినుతము – సకల దోషాపహము. (కలికల్మషాపహము)
శ్రవణమంగళకరము – సిరులుగురిసెడి వరము
భువినుతించిన జనము – బహువదాన్యత ఘనము ॥నీ॥

జై శ్రీమన్నారాయణ !

**స్వేచ్ఛానువాదం: శ్రీ ఉ.వే. శ్రీమాన్ S.V. రంగ**
**రామానుజాచార్యస్వామి - రాజమండ్రి.**


నచికేతుడు
....................ఆగస్టు సంచిక తరువాయి
ఈ అగ్ని కార్యానికి ఇక లోకంలో నీ పేరనే ప్రాచుర్యమేర్పడుతుంది.
ఇక నుండి దీనిని "నాచికేతచయనమ్" అని అంటారు.
సహజంగా ధ్వనించే, నా కంఠసీమ వీడని ఈ రత్నమాలికను మా ప్రేమను చూరగొన్న నీకిచ్చేస్తున్నాము.
అని యమధర్మరాజు నచికేతుని మెడలో వేసాడు.




మూడు ఆవృత్తులు ఈ మంత్రమును పఠించి హోమ, దాన, అధ్యయనం చేసినచో ఈ జనన మరణ చక్రముదాటి ఉత్తమమైన ఆత్మజ్ఞానమునొంది విష్ణుదాస్య రసమందు ఓలలాడును.
శాశ్వతమైన శాంతిని పొందటంతోపాటు నా పరిధిని కూడ దాటి పరమపదమందు సుఖించును.
దీనితో నీ ఋషిఋణము కూడా తీరినది. ఇంతవరకు రెండువరాలు కోరావు నచికేతా!
ఇక మూడో వరం కోరుకో!
ఇంకా వుంది....

# శ్రీమద్భగవచ్ఛాస్త్రమ్

శ్రీ.ఉ.వే. శ్రీమాన్ పాంచరాత్ర మహోదధి S. రమాకాంతాచార్యస్వామి, హైదరాబాద్

ఈ విధముగా పంద్రెండు మూర్తులుగా ఏర్పడిన తరువాత వరుసగా వాసుదేవుని నుండి వాసుదేవుడును, సంకర్షణుని నుండి సంకర్షణుడును, ప్రద్యుమ్ననినుండి ప్రద్యుమ్నుడును, అనిబుద్ధనినుండి అనిబుద్ధుడును మళ్ళీ ఏర్పడిరి. వారిలోను మొదట వాసుదేవునినుండి పురుషోత్తముడును, సంకర్షనునినుండి అధోక్షజుడును, ప్రద్యుమ్ననినుండి నారసింహుడును, అనిబుద్ధని నుండి అచ్యుతుడును ఏర్పడిరి.

ఈ నలుగురినుండే వరుసగా:

1. జనార్దనుడు; 2. ఉపేంద్రుడు; 3. హరి; కృష్ణనామములుగల మూర్తులు వెలసిరి. పిదప మొదటి వాసుదేవునినుండి, 1. బ్రాహ్మీ, 2. ప్రాజాపతీ, 3. వైష్ణవీ, 4.దివ్యా, 5. ఆర్షీ, 6. మానుషీ, 7. ఆసురీ, 8. పైశాచీయను ఎనమండ్రు మూర్తులు కలిగిరి. ఈ అష్టవిధమూర్తుల తరువాత మరొక పది మూర్తులును, సంకర్షణమూర్తి నుండి 1 నారసింహ, 2. వామన, 3. జమదగ్ని కుమారుడైన (పరశు)రాముడును కలిగిరి. ప్రద్యుమ్నని నుండి అటులనే 1. (దశరథ) రఘురాముడు, 2.బలరాముడును, అనిబుద్ధనినుండి, 7. శ్రీకృష్ణ, 2. కల్కియను పదిమూర్తులు ఏర్పడిరి.

తదుపరి సంకర్షణమూర్తినుండి పురుష మూర్తియును, ప్రద్యుమ్ననినుండి సత్యమూర్తియును, అనిబుద్ధనినుండి అచ్యుతమూర్తియు సంభవించిరి. వాసుదేవనినుండి బుద్ధుడు త్రైలోక్య మోహనుడు. దాశార్హమూర్తి, శౌరి, అన్వేశుడు ఏర్పడిరి. సంకర్షణునినుండి హయగ్రీవుడు, శంఖోదరుడు, నరసింహమూర్తి. వైకుంఠమూర్తి (మూల) ముకుందుడు, వృషాకపి, ఆదివరాహ మూర్తియు, సంకర్షణుని నుండే అనన్తుడను సర్పరాజు (శేషుడు) వేయి పడగలుగల వాడునైన మహాబలవన్తుడు కలిగెను. పిదప సుదర్శనము మొదలగాగల ఆయుధములు, కిరీటము, భూషణములు మూర్తులు ఆవిర్భవించు సమయమున కలిసి యుద్భవించినవి. లక్ష్మియను ఆయా మూర్తుల రూపములకు తగినట్లు బహు రూపముల శ్రీవత్సమను పుట్టుమచ్చ నుండియే జనించిరి.

అట్లే వాసుదేవాది మూర్తులనుండే మహాబలవంతులలో శ్రేష్ఠుడును, వాహనముగా నుండి గరుడుడు పక్షులకు ప్రభువై వెలసెను. ఆయన వేదమూర్తియే. ఇట్లే కుముదాది భూతగణముల నాయకులు, పార్షదులెల్లరును అనిబుద్ధమూర్తి పాదము నుండియే వేలకు వేలుగానుద్భవించిరి. వేల తలలు, పాదములు,



చేతులు, కన్నులు గలిగి ఆశ్చర్యముగొలుపు దివ్యాకృతిగల అనిబుద్ధ మూర్తి యంశముచే జగత్తునంతయు తన దివ్యశరీరమునుండే క్రమముగా వెలువరించెను.

అది ఇట్లు వర్ణింపబడినది. నోటినుండి ఇంద్రుడు, అగ్నియు, వేదములు, శిక్షా, వ్యాకరణ, ఛన్దశ్శాస్త్రము, నిరుక్తము, జ్యోతిషము, కల్పములను ఆరు అంగములతోను, శిరస్సునుండి స్వర్గమును, కంటినుండి సూర్యుడును, మనస్సునుండి చంద్రుడును, చెవినుండి దిక్కులును, నాభిప్రదేశమునుండి ఆకాశమును, పాదములనుండి భూమియు, ప్రాణమునుండి వాయువును, అపానము నుండి మృత్యువును, తలవెంట్రుకలనుండి మేఘములును, కాలము తృటి, లవాది భేదములచే బుద్ధినుండి జనించెను. ఓషధులు, వనస్పతులు రోమకూపముల నుండి ఏర్పడెను. ఆ విరాట్స్వరూపుని నుండే మిక్కిలిగా దక్షిణలుగల యజ్ఞములుద్భవించెను. నాలుగు వర్ణములతో క్రమముగా నోటినుండి బ్రాహ్మణులును, భుజములనుండి క్షత్రియులును, తొడలనుండి వైశ్యులును, పాదముల నుండి శూద్రులును జనించిరి.

ఇట్లు సమస్త జగత్తును విశ్వరూపుడైన హరి సృజించి నాగరాజైన అనన్తుని యాసనమున శ్రీ, భూదేవులతో కూడ పాలసముద్రమున నడుమ శ్వేతద్వీప మనబడు చోట బంగారుచే నిర్మించబడిన మేడలో అనేకులగు యోగులచే దర్శింపబడుచు చణ్డాది ద్వారపాలురతో కుముదాది భృత్యులతో, గరుడ, విష్వక్సేనులతో సేవింపబడుతూ ఆనందముతో శ్రీవత్సమను పుట్టుమచ్చతో అలంకారముగానున్న వక్షస్థలముగలిగి, నిరంతరము సంపదల (లక్ష్మి)తో ఎవ్వరి చేత జయింపబడనివాడై, సర్వకాలములందు ఏకవిధముగా (శాశ్వతుడై) నిశ్చలుడైన అనిబుద్ధుడు తన యంశచే జగత్తును, ఇంద్రాదులను పాలించుచున్నాడు.

ఇట్లు మహోపనిషత్తుగా పేర్కొనబడు శ్రీపాంచరాత్రమున పాద్మసంహితలో జ్ఞానపాదమున మూర్త్యుత్పత్తి భేదమను పేరుగల రెండవ అధ్యాయముముగిసెను.

ఇట్లు భగవానుడు తనకుతానే బహురూపముల వెలయించి పిదప బ్రహ్మచే సృజింపజేసిన క్రమము తెలుప బడుచున్నది.

నాగరాజైన పద్ముడు పలుకుచున్నాడు.:–

ఓ బ్రాహ్మణశ్రేష్ఠుడా! (సంవర్తా!) ఇప్పుడు నాచే బ్రహ్మసృష్టిని గూర్చి చెప్పబడుచున్నది. శ్రీమన్నారాయణుడు నీటిని సృజించెను. అదియంతయు గొప్ప సముద్రమయ్యెను. అనిబుద్ధమూర్తి యంశచే జనించిన దుర్గాదేవి మాయారూపియై లోకమును మోహింపజాలినదై ఒక మఱ్ఱిచెట్టును కల్పించెను. ఆ మాయా రూపమైన చెట్టునందు అనిబుద్ధ అంశజుడైన పద్మనాభుడు, లక్ష్మీవిశిష్టుడైన సనాతనుడు లోకముల

న్నియు లయ మొనరించి పురుషనామముతో మఱ్ఱియాకు పడకగా జేసుకొనియుండెను. అట్లు వటపత్రముపై పవళించియున్న శేషశాయియగు పురుషుని యొక్క నాభినుండి బంగారు పద్మయొక్కటి గర్భముగాగల అండము పుట్టెను. ఆయండము పృథివీ, అప్, తేజో, వాయు, ఆకాశాత్మకమగుచు, ఊహ కందనిరీతిలో స్వచ్ఛమై ప్రకాశించుచు క్రమముగా వృద్ధిబొందుచుండెను. అట్లు పెరిగిన అండమధ్యమునుండి తెల్లనికాంతి గలదై వేయిరేకులతో నడుమ కేసరములతో అలంకరింపబడి కర్ణిక మధ్యలో ఆశ్చర్య పరచు సృష్టికి మూలమైన నాలుగు ముఖములుగల బ్రహ్మను ఆ పద్మనాభుడే సంకల్పించి సృజించెను.

లోకకర్తయైన చతుర్ముఖునికి మొదట యాసనముగానున్నందున, పద్మమును ఆసనముగల వాడగుటచే పద్మాసనుడని పిలువబడుచు నాటినుండి దేవతలందరు (ఆసనమగుటచే) పద్మాసనులుగా పిలువ బడుచున్నాడు. పద్మజుడైన బ్రహ్మ తొలుత సనక, సనన్దన, సనత్కుమార, సనత్సుజాతులను మానసపుత్రుల సృష్టి చేయుటకై సృజించెను. వారు పుట్టియు బ్రహ్మకోరిక ప్రకారము సృష్టికార్యమునొల్లక వీత రాగులు, మత్సరములేని వారునై యోగమున పరమ్మాతను ధ్యానించుచు యోగులైరి.

ఇట్లు లోకముల సృజించునాసక్తిలేని యామహాత్ముల విషయమున బ్రహ్మకు ముల్లోకముల కాల్చగల కోపాగ్ని ముడివడిన కనుబొమల నడుమ పుట్టెను. అట్లు లలాటమునుండి వెలువడిన కోపాన్ని కాంతులనుండి “రుద్రుడు” యుగాన్త మున సర్వమును భస్మము జేయజాలు అగ్ని ప్రకాశముతో సగము శరీరము స్త్రీమూర్తియు సగము శరీరము పుంరూప ముతో (అర్ధనారీశ్వరుడుగా) పెద్ద శరీరముతో పరాక్రమవంతు డగుచు పుట్టి తన శరీరమును రెండు ముక్కలుగా నిలువునా చీల్చుకొని, స్త్రీని, పురుషుని ఏర్పరచెను. అట్టి జంటనుండి కోట్ల కొలది రుద్రులు జనించిరి. అందరును నాల్గుచేతులుగలిగి, (క్రూరులై, మూడు కన్నులతో, శూలములచేత ధరించి యుండిరి. అందు ముఖ్యులైన వారు ఏకాదశ(పదకొండు మంది) రుద్రులుగా తలచబడిరి. ఈ రుద్రులు పుట్టుయు వ్యర్థమని తలంచిన బ్రహ్మ–మరీచి మొదలగు ఆరుగురను మనస్సుతోనే సృష్టించెను. వారిచే నీ సకల లోకములు సృజింపబడినవి. (చరా, చరములు) ఇట్లు సృష్టిజేసి పద్మమున బుట్టిన చతుర్ముఖుడు తననుగూర్చి తెలుసుకొనుటకు ధ్యాన మగ్నుడయ్యెను. అట్లు తపించుచున్ననాతని యందు కాంతి పుంజమొకటి ప్రకటిత మయ్యెను. వేయి సూర్యులకాంతి గలిగి, మేఘమధ్యమునందలి మెరుపువలెనందొక పురుషుని పీతాంబరుని, శంఖ, చక్ర, గదా, పద్మములధరించి నాలుగు చేతులతో నొప్పుచు, శ్రీవత్సమును వక్షస్థలమున గలిగి,



కౌస్తుభమణితో ప్రసన్నవదనుడైన వానిని, కిరీట, కుండల, హారములతో ప్రకాశించు పరమపురుషుని చూచి, పద్మజుడు మనస్సున యోచించి ఈతడే సర్వజగత్తులకు ప్రభువైన పరమాత్మగా తలచి, ఇతనికంటే వేరొక కారణమునెరుగక తన సందేహములన్నింటిని యడిగి తెలుసుకొన ఆరంభించెను.

**బ్రహ్మయడిగెను:–**

ఆశ్చర్యకరమైన దివ్యరూపముగల నీవెవ్వరవు?ఓ పురుషోత్తమా!ఎఱుంగగోరి యడుగు చుంటిని నాకు తెలుపుము.

భగవంతుడిట్లనెను:–

సర్వలోకముల సృజించువాడను, పురాణ పురుషునిని, పరమపురుషునిని. ఆది, మధ్య, అంతములు లేనివానిని. నిత్యమైన వానిని, సత్యరూపుడను నేనే, నీయనుమానముల దీర్చుటకే వచ్చియుంటిని. సంశయించక యడుగుము.

అప్పుడు బ్రహ్మ ధన్యుడనైతిని. నీయనుగ్రహమునకు ప్రాత్రుడనైతిని. నా కోరికలన్నియు తీరినవి. ఇప్పుడు నాకు తెలుసుకోదగినది లేదు. చేతకానిది లేదు. పొందదగినది లేదు. పొందలేనిది లేదు. స్వామి! ఏకారణముచే సృష్టి నాచే చేయింప నెంచితిరి? మీ ప్రోత్సాహమునకు కారణము తెలుపుము? అని యడుగగా భగవానుడు బదులు పలికెను.

సృష్టి, స్థితి, లయములచే కేవలము లోకములన్నిటితో ఆదుకొనుటకే సంకల్పించి తిని. కారణమేమియు లేదు. యన బ్రహ్మ తన సంశయమునిట్లు వెళ్లబుచ్చెను.

స్వామీ! ఏ రూపముతో సృష్టించు చుంటివి. ఏ రూపముతో రక్షించుచుంటివి. మరియే రూప ముతో లయమొనర్చెదవో! వినగోరుచున్నాను. అనగా శ్రీమన్నారాయణుడు! ఓ చతుర్ముఖా! నా సంకల్పమాత్రముచే అనన్తములైన శక్తుల సృజించితిని. వానిలో ముఖ్యములైనవి. నాలుగు :– అందులో నీ (ప్రపంచమున) సృష్టిలో కన్పించునవి సత్వ, రజ, స్తమోరూప ములైనవి ముఖ్యమైనవి మూడు. నాల్గవదైన ఆనన్దశక్తియనునది. భోగ్యమైన మోక్షము నొసంగజాలును. రజో గుణముతో, నేనీ లోకమును సృజింతును. (చరాచర రూపము లన్నియును) సత్వగుణ ముచే రక్షించెదను. మరి తమోగుణముచే లయమొనర్తును. ఆనన్దరూపముతో వాసుదేవనామముతో నేనే ఈ సంసార బన్ధమునుండి విడిపించెదను. (ఎవరు నన్ను మాత్రమే ఆశ్రయించి సేవించెదరో అట్టి వారిని) ఇట్లు సృష్టి, స్థితి, లయముల మూడు రూపములతో కావించెదను. యెవరు నిష్కామ కర్ములుగా నన్నే ఆరాధించు చుందురో? అట్టివానిని జననమరణ రూపమైన ఈ సృష్టినుండి విడిపించెదను.

# అన్నమాచార్యులు-వైష్ణవము

డా॥ చెలికాని మురళికృష్ణారావు-బొబ్బిలి

భగవదంశతో మహామహులు అప్పుడప్పుడూ ఈ భూమిపై అవతరించి లోకోద్ధరణ చేస్తుంటారు. వారి సూక్తులు, పాటలు, చేసే కృత్యములు దైవత్వాన్ని స్ఫురింపజేస్తాయి. చిన్ననాటనే భగవన్నామ సంకీర్తనమే జీవనా ధారమై లోకాన్ని వేదాంత,ఆధ్యాత్మిక, శృంగార (జీవాత్మ పరమాత్మల చేరిక) సంకీర్తనలతో మానవాళిని తరింపజేసిన పద కవితాపితా మహు లలో శ్రీతాళ్ళపాక అన్నమాచార్యులు ఒకరు. ఆయన భక్తిపారవశ్యంతో రచించి పాడిన పదాలు ఆయనవంశాన్నే కాకుండా ఇతరులకు కూడా తారక మంత్రములైనవి. ఆధ్యాత్మిక క్షేత్రంలో సుప్రసిద్ధములైనవి కర్మ, జ్ఞాన, భక్తి, యోగాలలో భక్తిమార్గము ముఖ్యమైనది.

శ్లో॥ **ధ్యాయన్కృతే యజన్ యజ్ఞైః**
**త్రేతాయాం ద్వాపరే ఒర్చయన్ ।**
**యదాఒప్నోతి తదాఒప్నోతి**
**కలౌ సంకీర్త్య కేశవమ్ ॥**

కృతయుగమున ధ్యాన యోగపరమగు జ్ఞానముచేతను, త్రేతాయుగమున యజ్ఞము చేతను, ద్వాపరయుగమున అర్చనచేతను ఏ ఫలమును పొందెదరో ఆఫలమును కలియుగమున నామసంకీర్తనతో పొందగలరు. నవవిధ భక్తిమార్గాల్లో అన్నమయ్య ఆత్మనివేదనా మార్గాన్నే ఎంచుకున్నారు. విశిష్టాద్వైతప్రవర్తుకులైన భగవద్రామానుజులవారు ప్రపత్తి మార్గాన్ని లోకానికి ప్రబోధించేరు. అన్నమాచార్యులు రామానుజులవారి సిద్ధాంతాన్ని అనుసరించి పునీతులైనారు. మరియు ఆయన రచించిన పదాల్లో దీర్ఘశరణాగతి తత్త్వం ఎక్కువ చోటు చేసుకుంది.

అన్నమాచార్యులు నేటి కడపజిల్లా రాజంపేట తాలూకాకు చెందిన తాళ్ళపాక గ్రామంలో లక్కమాంబ నారాయణసూరి దంపతులకు శ్రీవేంకటేశ్వర వరప్రసాదిగా కీ.శ.1408న వైశాఖమాసం, విశాఖా నక్షత్రమున జన్మించేరు. వీరిది పండితవంశమని ప్రతీతి. ఋగ్వేదశాఖీయులు, అశ్వలాయన సూత్రులు, భరద్వాజ గోత్రులు. వీరు స్మార్త బ్రాహ్మణులు. అన్నమాచార్యులు కారణజన్ములని, వైష్ణవుల నమ్మిక. వేదాంత దేశికులు శ్రీవేంకటేశ్వరస్వామి గుడిగంట అంశతోను, అన్నమాచార్యులు నందక (ఖడ్గం)అంశతోను జన్మించినట్లు కథనం. ఆయన జన్మించిన పదునారేండ్లకు తిరు వేంగళనాథుడు ప్రత్యక్షమై, ఆ స్వామి ఆదేశాను సారం రోజుకొక్క సంకీర్తన చొప్పున 32వేల సంకీర్తనలు రచించి ఆస్వామికి అంకితమొనర్చిన కారణజన్ముడు.

పన్నిద్దాళ్వారుల్లో ముఖ్యులైన నమ్మాళ్వారు (శఠకోపయతి)కు, అన్నమాచార్యులకు అనేక విషయాల్లో సాదృశ్యం కనిపిస్తోంది. నమ్మాళ్వారు వేదసారాన్ని ద్రవిడభాషలో చెబితే, అన్నమయ్య ఆంధ్రంలో రంగరించేరు. ఇద్దరూ వైశాఖమాసం, విశాఖానక్షత్రంలో జన్మించడం పదహారవ ఏటనుండి ఆయన ద్రవిడ కీర్తనలు, అన్నమయ్య శ్రీవేంకటేశ్వరునిపై పదాలు రచన ప్రారంభించడం, శఠకోపయతి కౌస్తుభాంశతో జన్మిస్తే, ఈయన నందకాంశతో జన్మించడం వీరిరువురికి ఉన్న సాదృశ్యాలు.





అన్నమయ్య అహోబిలమఠ జీయర్ అయిన ఆదివన్ శఠకోపయతివద్ద పన్నెండు సంవత్సరములు వేదాంత రహస్యాలను నాలాయిర దివ్యప్రబంధ రహస్యాలను అధ్యయనం చేసినారు. అహోబిల నృశింహస్వామి తానే గురువై త్రిదండమును, మంత్రమును అనుగ్రహింపగ, సన్యాసాశ్రమును స్వీకరించినారు శఠకోపయతి. గురువు నృసింహోపాసకులు కనుక ద్వాత్రింశాక్షరీ నృసింహమంత్రమును అన్నమయ్య స్వీకరించి, అక్షరానికి వేయి చొప్పున ముప్పది రెండు అక్షరాలకు 32వేల సంకీర్తనలు రచించేరని చెప్పవచ్చును.

ఆయన తన గురువైన శఠకోపయతి వర్యునిట్లు కీర్తించెను.

చూడుడిందరికి సులభుడు హరి
తోడు నీడయగు దొరముని యితడు
కైవల్యమునకు గనకపు తాపల
త్రోవై శ్రుతులకు దుదిపదమై
పావనమొక రూపమై విరజకు
నావై యిదె యున్నాడితడు
కాపాడగ లోకములకు సుజ్ఞాన
దీపమై జగతికి తేజమై
పాపాలడపగ భవపయోధులకు
తేపై యున్నాడిదే యితడు
కరుణానిధి రంగపతికి గాంచీ
వరునకు వేంకటగిరిపతికి
నిరతినహోబిల నృకేసరికి ద
త్పురుడగు శఠగోప(ం)ముని యితడు.

తన గురువైన శఠకోపయతి దొరముని అనియు, సకల ప్రాణికోటికి నిలువనీడ కలిపించిన వాడని, ముక్తికి సోపానమని, విరజను తరించడానికి నావ అని, లోకులకు జ్ఞానదీపమని, పాపాలను కడిగి పరమాత్మ సన్నిధిని నిలిపే గురువని, శ్రీవైష్ణవులకు ముఖ్యమైన నాలుగు దివ్యక్షేత్రాలతో సంబంధమున్నదని. శ్రీరంగపతిని, కంచి వరదుని, వేంకటాచలపతిని, అహోబిల నృసింహుని, మదిలో నిలుపుకొని మానవకల్యాణ యజ్ఞాలు నిర్వహించిన తన గురువు శఠకోపయతి భక్తసులభుడని స్తుతించినాడు అన్నమయ్య.

ఘన విష్ణువనే యతికి శ్రీవేంకటేశ్వర స్వామికలలో అన్నమయ్యకు పంచసంస్కారములు చేయమని ఆదేశించెను. అన్నమయ్య ఆయనవద్ద పంచసంస్కారములు పొందెను. అన్నమయ్య సంతతి అందరూ కవి, భక్తాగ్రేసరులే. వైష్ణవం స్వీకరించి ధన్యులై నారు. అన్నమయ్య కుమారుడైన పెద తిరుమలాచార్యులు కూడా కవి, విశేషించి పరమభక్తుడు, దాత. ఆయనకు శ్రీమద్వేద మార్గ ప్రతిష్ఠాపనాచార్య, శ్రీరామానుజ సిద్ధాంత స్థాపనాచార్య, వేదాంతాచార్య అనే బిరుదులు కలవు. ఈయన అన్నమయ్య సంకీర్తనలన్నీ రాగిరేకుల మీద వ్రాయించి, తిరుమల కొండపైన సంకీర్తనాభాండారమున భద్రపరచినాడు.

అన్నమయ్య వైష్ణవము స్వీకరించిన తడవుగా **"సహజ వైష్ణవాచార వర్తనుల సహవాసమే మాసంధ్య..... యతి రామానుజ మతమే చతురత మెరసిన సంధ్య...."** అని తనకుగల ధర్మకర్మములన్నియు అందునే కలవని విశ్వసించి తిరుమంత్రమును జపించి, చరమశ్లోక, ద్వయార్థములు ఎరిగి తరించాడు అన్నమయ్య.

విశిష్టాద్వైతము ప్రకారము జీవుడు అణుప్రమాణుడు, జ్ఞానానందమయుడు, భగవంతుని నియామకమునకు లొంగినవాడు. అతడు శేషి, జీవుడు శేషము. ఈ ప్రకృతిలో

భగవంతుడు ఒక్కడే పురుషుడు, మిగతా జీవులందరూ స్త్రీలే. అదియే జీవాత్మ పరమాత్మ చేరిక. అన్నమయ్య చాల సంకీర్తనల ద్వారా ఈ విశ్వంలో విష్ణు వొక్కడే దైవమని అతడే సర్వవ్యాపకుడని చాటి చెప్పినాడు. ఆయన సంకీర్తనల్లో దీర్ఘశరణా గతిత్వం, పరమాత్మకు, జీవులకు పతిపత్నీ భావము, నాయక నాయకీ భావము కల్పించి, అనేక దేవాలయములలోని అర్చామూర్తులను వర్ణించి, శరణాగతితత్త్వాన్ని, మహత్తుని వర్ణించేరు. ఏ దేవుని అర్చించినా, వర్ణించినా చివరకు వేంకటేశ్వరునిముద్ర ప్రతిసంకీర్తన చివరన వేసుకోక తప్పలేదు.

అన్నమాచార్యులు తిరుపతికొండ మీద 'బ్రహ్మాండనాయకుడు ప్రత్యక్ష దైవమై వెలిసి యున్నాడని, "ఒహో జనులారా! నా మాట వినండి! స్వామిని దర్శించి కృతార్థులు కండి!" అనే తీరు వినవలసినదే.

చాటెదనిదియే సత్యము సుండో
చేటులేదీతని సేవించినను
హరినొల్లనివారసురులు సుండో
సురలీతని దాసులు సుండో
పరమాత్ముడితడే ప్రాణముసుండో
మరుగక మఱచిన మఱవేదికను
వేదరక్షకుడు విష్ణుడు సుండో
సోదించె శుకుడచ్చుగా సుండో
ఆదిబ్రహ్మగన్నాతడు సుండో
యే దెస వెదకిన నితడే ఘనుడు
యిహ పరమొసగను యీతడె సుండో
వహినుతించె బార్వతి సుండో
రహస్యమిదివో, రహి శ్రీవేంకట
మహీధరంబున మనికై నిలిచె.

హరి ఒక్కడే సత్యము. అతనిని సేవించిన చెడులేదని, ఆయనను ఒప్పని వారందరూ అసురులేనని ఈ జీవులకందరికీ ఇహపర సాధనుడు అతడొకడే అని అన్నమయ్య చాటి చెప్పినాడు.

శ్రీభగవద్రామానుజుల వారు ఈ లోకానికి తిరుమంత్రాన్ని గోపురమెక్కి బహిరంగంగా లోకానికి అందించి ఉద్ధరించినట్లుగా ఈ క్రింది సంకీర్తన ద్వారా అందించేరు.

**గతులన్నిఖిలమైన కలియుగమందును**
**గతి యాతడే చూపె ఘన గురుదైవము**
**ఈతని కరుణనేకాయిల వైష్ణవులమైతి**
**మీతని వల్లనే కంటిమీ తిరుమణి**
**యీతడేకావు ప్రదేశమిచ్చె నష్టాక్షరీ మంత్ర**
**మీతడే రామానుజులు ఇహపరదైవము.**
**వెలయించె నీతడేకా వేదపు రహస్యములు**
**చలమి నీతడే చూపె శరణాగతి**
**నిలిపినా డీతడేకా నిజముద్రా ధారణము**
**యలసి రామానుజులే మాటలాడే దైవము**
**నియమము లీతడేకా నిలిపె బ్రపన్నులకు**
**దయతో మోక్షము చూపదగు నీతడే**
**నయమై శ్రీవేంకటేశునగ మెక్కవాకిటను**
**దయజూచీ మమ్ములనిట్టీ తల్లిదండ్రి దైవము**

ఈ కలియుగంలో రామానుజులే గొప్ప గురుదైవమని అతని దయవలనే శ్రీవైష్ణవులమ యితిమని ఆయన ఉపదేశమువలననే అష్టాక్షరీ తిరుమంత్రాదులు పొందితిమని, తిరుమణి అందాలు పొందితిమనియు, ప్రపన్నులను దయతో మోక్షమునకు దారి చూపిన దైవమని రామానుజులవారిని అన్నమయ్య కీర్తించినారు.

వైష్ణవము వలపుతేనె, వలెననువారికే వైష్ణవము, కోరికలు తెంపుకొని వైరాగ్యము పెంచుకొని భగవంతుని శరణుజొచ్చుట, కోపతాపాలను వదలుకోవడమే వైష్ణవమని ఈక్రింది సంకీర్తనలో అన్నమయ్య చెప్పేడు.



వలెనను వారిదే వైష్ణవము యిది
వలపు దేనెవో వైష్ణవము॥
కోరికలుడుగుచిగుతి నిన్నటిపై
వైరాగ్యమెపో వైష్ణవము
సారెకు కోపము జలమును తనలో
వారించి ఉంటివో వైష్ణవము॥
సుడిగొను దేహపు సుఖదుఃఖములో
వడి చొరనిదె పో వైష్ణవము
ముడివడి యింద్రియముల కింకరుడై
వడబడ నిదె పో వైష్ణవము॥
వుదుటున తన సకలోపాయంబులు
వదలుట పో నిజవైష్ణవము
మెదుటను శ్రీవేంకటేశ్వరునామము
వదనము చేర్చుట వైష్ణవము॥

ఇంకను అన్నమయ్య వైష్ణవ లక్షణమును మరియొకసంకీర్తనలో ఇట్లు పొందుపరిచి నాడు.

మదమత్సరము లేక మనసు పేదైపోవ
వదలిన యాసలవాడు వో వైష్ణవుడు॥
ఇట్టునట్టు దిరుగాడి మేమైనా జెడనాడి
పెట్టరంటా బోయరంటా బెక్కులాడి
ఎట్టివారినైనా దూఱి యెవ్వరినైనా జేరి.
వట్టియాసల బడనివాడువో వైష్ణవుడు
గడన కొఱకుంజిక్కి కామక విద్యలజొక్కి
నిడివినెమైనాగని నిక్కి నిక్క
ఒడలి గుణము తోడవుడుటు విద్యల జాల
ఏడదాకి బడలని వాడువో వైష్ణవుడు॥
ఆవల వొరుల జెడనాడగ విని విని
చేవమీరి యెవ్వరిని జెడనాడక
కోవిదు శ్రీవేంకటేశు గొలిచి పెద్దలకృప
వావివర్తన గలవాడు వో వైష్ణవుడు॥

మద మత్సరములు మాని, ఆశలను త్రుంచుకొనువాడే వైష్ణవుడు, అడ్డమైన దారులు త్రొక్కి అందరినీ దుర్భాషలాడువాడు, పేరాశకు లోనిగానివాడే వైష్ణవుడు వావివర్తన గమనించి పెద్దల మాటలను పాటించి, వేంకటేశ్వరుని సేవించినవాడే వైష్ణవుడు అని వివరించేడు అన్నమయ్య.

ఇంకను అన్నమయ్య శ్రీహరిని గురించి అనేక సంకీర్తనలద్వారా లోకానికి చాటి చెప్పినారు. అంతరంగమెల్ల శ్రీహరికి, అన్నిటి నిదే పరమౌషధము, అరసిన నన్నుగాంచిన (నమ్మాళ్వారు దీర్ఘశరణాగతి), ఇతనికంటే ఘన మికలేదు, వైష్ణవులు కాని వారెవ్వరు, హరినామమొక్కటే ఆనందకరము, హరినెరు గని జన్మమేలా?... అనే సంకీర్తనల ద్వారా వైష్ణవాన్ని శ్రీహరి గొప్పదనాన్ని లోకానికి అన్నమయ్య తెలియపరచినాడు.

అన్నమాచార్యులవారు 95 సంవత్సర ములు జీవించి దుందుభినామ సంవత్సర ఫాల్గుణ బహుళ ద్వాదశి అనగా క్రీ.శ. 1503న పరమపదము చేరెను.

## పరమపద వార్త



శ్రీమాన్ **కర్రి రామచంద్రారెడ్డి**గారు, గొల్లలమామిడాడ వాస్తవ్యులు. ది. **8.9.04**న పరమపదించినారు. వీరు శ్రీస్వామివారి వద్ద సమాశ్రితులు. వీరు శ్రీస్వామివారి అనేక కార్యక్రమములలో పాల్గొని విశేష సేవలను అందించారు. వీరి కుటుంబసభ్యులకు శ్రీస్వామివారు మంగళాశాసనాలు కృపచేసారు.

# ఆంధ్రభారతం అందించిన ధర్మాలు

'మధుర కవి' శ్రీమాన్ కోగంటి వెంకటాచార్యులు, ముత్తుపల్లి

**నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్**
**దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్.**
**అమితాఖ్యానక శాఖలం బొలిచి వేదార్థాదుల ఛ్చాయయై**
**సుమహద్వర్గ చతుష్క పుష్పవితతిన్ శోభిల్లి, కృష్ణార్జునో**
**త్తమ నానాగుణ కీర్తనార్థఫలమై, ద్వైపాయనోద్యాన జా**
**త మహాభారత పారిజాత మమరున్ ధాత్రీ సురప్రార్థ్యమై,** (ఆదిపర్వం:1-66)

శ్రీమన్మహాభారతం పంచమవేదం. సర్వ వేదసారం!

తానే ఆచార్యుడూ తానే శిష్యుడూ అయి శ్రీమన్నారాయణుడు చేసిన భగవద్గీతోపదేశం, భీష్మపితామహుడు ఉపదేశించిన విష్ణుసహస్ర నామస్తోత్రమూ భారతాన్ని పంచమవేదంగా ప్రకాశింపజేశాయి. అంతేకాక

**ధర్మేచార్థే చ కామేచ**
**మోక్షేచ భరతర్ష భ।**
**యది హాస్తి తదన్యత్ర**
**యన్నేహాస్తి న తత్క్వచిత్ ॥**

ధర్మార్థ కామమోక్షాలనే చతుర్విధ పురుషార్థాల గురించి భారతంలో యేమున్నదో అదే యితరత్రా వున్నది. భారతంలో లేనిది ఎక్కడా లేదు. అందువలననే మహాకవి తిక్కన అన్నాడు.

వేదములకు నిఖిలస్మృతి
వాదములకు బహు పురాణ వర్గం బులకున్
వాదైన చోటులను దా మూదల ధర్మార్థ
కామ మోక్ష స్థితికిన్.

శ్రుతి, స్మృతీతిహాస పురాణాల విషయంలో భేదాభిప్రాయం ఏర్పడితే భారతార్థానికే ప్రాధాన్యం. సాక్షాన్నారాయణ స్వరూపి అయిన వ్యాస భగవానుడు లోకక్షేమం కోరి అనేక ధర్మాలను భారతంలోని అనేక స్థానాల్లో మానవాళికి తెలియజేసాడు.

సర్వవేదములను అధ్యయనం చేసి ఆ ధర్మాలనాచరించవలెనంటే అది దుస్సాధ్యమయిన విషయం. కరుణాసముద్రుడయిన వ్యాస భగవానుడు ఆ వేదధర్మాలనూ, చతుర్విధ పురుషార్థాలను సాధించగలిగే సుగమమార్గాలనూ శ్రీమన్మహాభారతం ద్వారా జాతికి అందించాడు. విశ్వజగద్ధితబుద్ధితో 'కవిత్రయ'మని పేరు గాంచిన నన్నయ్యభట్టు, తిక్కన సోమయాజి, ఎఱ్ఱాప్రెగ్గడలు వ్యాసభారతమును ఆంధ్రీకరించి శ్రీమన్మహాభారతమును ఆంధ్రీకరించి ఆంధ్రుల పుణ్యఫలంగా మనకు అందించారు. శ్రీమన్మహాభారత మహోదధి గర్భంలో నిక్షిప్తాలయిన అనర్ఘ ధర్మరత్నాలను ఒకచోట చేర్చి నలుగురికీ అందుబాటులో వుండేలాగ సవినయంగ అందించుకొనేందుకే యీ నా ప్రయాస. ఈ ధర్మాలను తెలిసి కోవడం, ఆచరించడం, మోక్షప్రదమని వేరుగా చెప్పనేల?

**ఇమ్మహాధర్మమ్ము లిమ్ములఁబాయకఁ**
**జదువుచు వినుచు నాచరణ సేయు**
**వారికి విపుల ధర్మార్థ సంగ్రహసిద్ధి**
**యగుఁబరమార్థంబ యశ్రమమున**



**వేదముల్ నాలుగు నాది పురాణముల్**
**పదునెనిమిదియుఁదత్ప్రమిత ధర్మ**
**శాస్త్రంబులును, మోక్షశాస్త్ర ధర్మంబులు**
**నెఱింగిన ఫలమగు నెల్లప్రొద్దు**
**దానములను బహువిధ క్రతు హుత జప**
**బ్రహ్మచర్యములను బడయఁబడిన**
**పుణ్యఫలము వడయుఁబోలు నశేష పా**
**పక్షయంబునగు శుభంబు పెరుఁగు.**

(ఆదిపర్వం-నన్నయ)

ఆంధ్రభారతం అందించిన విష్ణుస్తుతి ధర్మం:

**శుక్లాంబరధరం విష్ణుం**
**శశివర్ణం చతుర్భుజమ్ ।**
**ప్రసన్నవదనం ధ్యాయేత్**
**సర్వ విఘ్నోపశాంతయే ॥**
**ఏకో విష్ణుర్మహద్భూతం**
**పృథగ్భూతా న్యనేకశః ।**
**త్రీన్లోకాన్వ్యాప్య భూతాత్మా**
**భుఙ్క్తే విశ్వభుగవ్యయః ॥**
**విష్ణుఁడొక్కరుండ విను మహాభూతంబు**
**దక్కు భూతతతులు పెక్కుఁగలవు।**
**సిరిఁద్రిలోకములనుఁబరిగి విశ్వంబు భూ**
**తాత్ముఁడమ్మహాత్ముఁడనుభవించు.**

(ఆనుశాసనికపర్వం-పంచమాశ్వాసం)

శ్రియఃపతి, శ్రీవైకుంఠ నికేతనుడు, నిఖిల హేయ ప్రత్యనీక కల్యాణగుణ సముద్రుడూ, అవాప్త సర్వకాముడూ, శంఖచక్రధారి, సకల భువన సార్వభౌమత్వ సూచక దివ్యకిరీట తేజోవిరాజితుడూ, అపార కృపాసింధువు, ఆశ్రిత జన రక్షాదీక్షాధారి, అవ్యాజకరుణాపాలిత అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడూ, సర్గస్థితి లయ కారకుడూ అయిన శ్రీమహావిష్ణువొక్కడే మహాభూతము. ఆదిమధ్యాంతరహితుడు. ఇతర భూతములన్నింటికి తానే ప్రభువై శ్రీదేవిని, త్రిలోకములను విశ్వమునూ తానే అనుభవించేవాడు.

ధర్మములన్నింటికంటె విష్ణుధర్మము శ్రేష్ఠితమమైనది. కురుపితామహుడయిన భీష్మాచార్యుని ధర్మరాజు జిజ్ఞాసతో "ధర్మ స్వరూపా! సకల జగత్కారణమయిన దైవమొక్కడే కదా! ఆ దైవమేది? పొందవలసిన దేది? ఎవరిని స్తోత్రం చేసి అర్చిస్తే మానవులు శుభం పొందగలుగుతారు! అన్ని ధర్మముల కంటె పరమమయిన ధర్మమేదని మీయభి ప్రాయము? ఏ నామజపంతో ప్రాణిజన్మ సంసారబంధం నుంచి వీడబడుతున్నది"? అంటూ అడిగిన అన్నిప్రశ్నలకూ సమాధానంగా భీష్మపితామహుడు వేదోపనిషత్తాత్పర్యమయిన విష్ణుస్తోత్ర వైభవాన్ని వివరించి విష్ణుపారమ్యాన్ని స్థాపించాడు. భారతకవులు ఆ విష్ణుస్తోత్ర ధర్మాన్ని శాంతి, ఆనుశాసనిక, అశ్వమేధ పర్వాలలో విపులంగ వివరించారు. సర్వ నియంత, సర్వేశ్వరుడూ నారాయణుడే గద!

విష్ణుస్తుతి ధర్మమాహాత్మ్యాన్ని ఆంధ్ర భారతం ఎలా అందించిందో విన్నవించుకుంటున్నాను.

**అఖిల జగత్ప్రభువగు దేవదేవు, న-**
**నంతునిఁ బురుషోత్తమాభిధాను**
**నంచిత నామ సహస్రకంబును సంస్తు**
**తించుచు సంతతోద్ధిత మనస్కుఁ**
**డై యజమానుఁడవ్యయుఁడైన యాతని**
**నర్చించుచును దృఢధ్యాన నిరతుఁ**
**డగుచు నమస్కృతి యాచరించుచు ననా**
**ద్యంతు నవ్విష్ణు, నధ్యక్షు నెల్ల**

**లోకములకు, బ్రహ్మణ్యు, త్రిలోకకీర్తి**
**వర్ధనుని సర్వధర్మజ్ఞు వరదు-లోకనాథు**
**భూతభవోద్భవు నమ్మి భక్తిఁ**
**గొలిచి సర్వదుఃఖంబులఁదొలఁగఁద్రోచు.**

(ఆనుశాసనిక పర్వం- పంచమాశ్వాసం)

మనసు నారాయణునియందు లగ్నంచేసి అవ్యయుడైన ఆ మహానుభావుని వేయి నామములనూ భక్తితో సేవిస్తే అన్ని దుఃఖాలూ తొలగిపోతాయి.

సూర్యచంద్ర నక్షత్ర సహితమయిన ఆకాశమూ, చరాచరములతో నిండిన భూమీ, సముద్రాలూ, సుర గరుడోరగ దైత్య గంధర్వ వ్రజములూ అన్నీకూడ హరివశము నందు ఉండేవే! బుద్ధి, ఇంద్రియములూ, మనస్సూ, సత్త్వమూ, బలమూ, తేజస్సూ, ధృతి,క్షేత్రమూ, క్షేత్రంవల్ల జనించిన వస్తువులూ అనేవన్నీ వాసుదేవమయములే! ఆగమములూ, ఆచార మయమయిన ధర్మమూ, అచ్యుతుడే! సాంఖ్యమూ, తంత్రమూ, శిల్పవేదశాస్త్రములూ, కర్మములూ జనార్దనుని వలన సంభవించినవే!

**యదా యదాహి ధర్మస్య**
**గ్లానిర్భవతి భారత ।**
**అభ్యుత్థానమధర్మస్య**
**తదాత్మానం సృజామ్యహమ్ ॥**

(దీనికి ఆంధ్రభారతానువాదము)

**వినుమెత్తఱి ధర్మంబులు**
**దనుజులచే బాధఁబొందుఁ దత్సమయమునన్**
**జనియించి యద్దురాత్ములఁ**
**దునుముఁగృష్ణుండ ధర్మధుర్యులఁగాచున్.**

(ఆనుశాసనిక-పంచమాశ్వాసం)

ఇక్కడ "కృష్ణుండ" అంటే కృష్ణుఁడే అని నిశ్చయవాక్యం. శ్రీమహావిష్ణువు అంటే కృష్ణుడే! ఆయన ధరించే అవతారాలన్నీ కృష్ణుడే! సర్వం కరోతీతి కృష్ణః=అన్నింటినీ చేయగల (చేసే) వాడు (సృష్టి, స్థితి లయములును) కృష్ణుడు.

సర్వమాకర్షయతీతి కృష్ణః- అన్నింటిని ఆకర్షించువాడు కృష్ణుడు.

**సర్వభూతాని కౌన్తేయ**
**ప్రకృతింయాన్తిమామికామ్"** (భ.గీ.అ.9శ్లో7)

సర్వశాస్త్ర వాక్యసమూహం చూచి తఱచి తఱచి ఆలోచిస్తే ఒకే అంశం నిశ్చయింప బడింది. ఆ నిశ్చయం **"నిష్ఠతో నారాయణునే ధ్యానించవలె"**నన్నది. సర్వశాస్త్రార్థ జ్ఞాన పాటవంకంటె నారాయణ తత్పరత చాల గొప్పది. అదే పరమానుష్ఠేయం. కొంచెం సేపయినా నారాయణుని తలచుకొంటే చాలు. సుగతి లభిస్తుంది. 'ప్రణవము'తో కలిపి **"నమో నారాయణాయ"** అనే అష్టాక్షరీ మహా మంత్రాన్ని జిహ్వాకు తెచ్చుకొంటే అచ్యుత పదమయిన శ్రీవైకుంఠం లభిస్తుంది.

నారాయణ పదవాచ్యం బారయ
బ్రహ్మంబు, దానిననిశము వినియున్
సారమతిం దలఁచియు, నింపారఁగ
బొగడియు రమించుట తుల హితమగున్

(ఆనుశాసనిక పర్వం-చతుర్థాశ్వాసం)

నారాయణపదముచే చెప్పబడు పరబ్రహ్మ మును నిరంతరమును శ్రవణము చేసినా, తలంచినా చాలు. హితం కలుగుతుంది. నారాయణ పరాయణుడు పాపములను తొలగించుకొని ప్రకాశించడమే కాదు-తనను ఆశ్రయించినవారికి కూడ జ్ఞానప్రకాశము నిచ్చుటయునగును. ఆ శ్రీమన్నారాయణుని కనుటకు బ్రహ్మాదు లకు కూడ అలవికాదు. కాని ఆయనకు "భక్త వత్సలు"డనే ప్రసిద్ధనామం



వున్నది. కరుణ కలిగితే భక్తులకు మాత్రం కనిపిస్తాడు-అప్యా యంగా. శ్రీమహావిష్ణువును కొలిస్తే పొందలేని పదవి వున్నదా! అందుకోని శుభంవున్నదా!!

ఆయనే శివుడు. దిక్పాలకులాయనే! విశ్వ పతి ఆయనే! తానే కృష్ణుడు. కాలము తానే? (కాలః కలయతా మహమ్- అనాదిర్భగవాన్ కాలః) దిక్కులూ తానే! "శివశ్చనారాయణః..." "దిశశ్చ నారాయణః" అనీ "పతిం విశ్వస్యాత్మే శరగ్ం" అనీ, "కాలశ్చ నారాయణః" అనీ ఉపనిషత్తు చెప్పింది కదా! ఈ దేవకీ సుతు డయిన కృష్ణుడు పరమజ్యోతిగా, అమృతంగా, సత్యంగా వేదాంతవీధుల్లో వెలుగుతున్నాడు.

జ్యోతిస్సులలో శ్రేష్ఠుడు సూర్యుడు, పంచ భూతములలో అగ్ని. విద్యలలో సావిత్రి; దేవత లలో బ్రహ్మ, వేదములలో ఓంకారము, అనిలములలో ప్రాణము, ఛందస్సులలో గాయత్రి, పశువులలో యజ్ఞపశువు, నాల్గు పాదములు గలవానిలో ఆవు, మానవులలో బ్రాహ్మణుడు, పక్షులలో డేగ, యజ్ఞముల యందు హవిస్సు. యుగములలో కృత యుగము, ధాతువులలో బంగారము, ఓషధు లలో యవలు, భక్ష్యభోజ్యములలో అన్నము, పేయము (త్రాగేవాని)లో జలము, పర్వతము లలో మేరువు, వృక్షములలో జువ్వి, దిక్కులలో ఊర్ధ్వదిశ, నదులలో జాహ్నవి, సరస్సులలో సముద్రము, ఆశ్రమములలో గృహస్థాశ్రమ మును శ్రేష్ఠమైనవి. ప్రజాపతులలో విష్ణువు శ్రేష్ఠుడు. మూర్తిత్రయమున కస్తిత్వము కలిగించువాడు విష్ణువే.

శ్రీవిష్ణు సహస్రనామ పారాయణము సమస్త ఫలములనొసగుటయేగాక అచ్యుత పదము నిచ్చును.

శ్రీవిష్ణు సహస్రనామమును కీర్తించువాడు ఎక్కడనూ కూడ భయమును పొందదు. అమిత తేజస్సుకాంతులతోకూడిన బలరూపగుణాలను పొందుతాడు. రోగ, బంధాలువీడి పోతాయి. వాసుదేవ పరాయణుడైనవాడు సహస్రనామ పఠనంతో కల్మషాలుపోయి, దుర్గతులు తొలిగి జన్మమరణాలకూ, జర-రుజలకు (ముదుసలి తనము-రోగము) అందని బ్రహ్మపదాన్ని పొందుతాడు.

పురుషోత్తమ భక్తిపరాయణులయిన వారికి క్రోధమాత్సర్య దుర్మతులు తొలగి పోతాయి. స్మృతి, సౌఖ్యము, క్షాంతి, సిరి, ధృతి, కీర్తులు కలుగుతాయి. వ్యాసప్రణీత మయిన యీ విష్ణుస్తోత్రము సకల శోభన ములు సమకూర్చేది కాబట్టి భక్తితో అందరూ పఠించాలి.

విష్ణునామంబులు వేయును నిత్యంబు
వినినఁబఠించిన మనుజుఁడిహము
నందుఁబరమ్మున నశుభమ్మునొందక
యత్యంత శుభములననుభవించు,
విప్రుండు వేదాంత విదుఁడగు, రాజు వి
జయమొందు, వైశ్యుఁడక్షయ ధనంబు
వడయు, శూద్రుఁడు సుఖభాగితవెలయు,ధ
ర్మార్థ కామ ప్రజాభ్యర్థిజనులు
గాంతురయ్యె తెఱంగు లేకాంత భక్తి
శౌచియై విని కీర్తించి సారయశము,
నచల లక్ష్మియు వంశవర్యతయు, మేలి
పెంపు సొంపునుఁగలిగి శోభిల్లు నరుఁడు.

(ఆనుశాసనిక పర్వము)

ఇది ఆంధ్రభారతం అందించిన విష్ణుస్తుతి ధర్మం.

# మత్తు వదలరా...!

శ్రీ ఉ.వే. శ్రీమాన్ నల్లాని చక్రవర్తుల శ్రీరామ అయ్యంగార్, హైదరాబాద్

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారిని బోధగురువులని భావించిన ఆబాలగోపాలాన్నీ **"భ్రమించి ఇంత కాలమూ ప్రణమిల్లిన మూఢభక్తులని"** బిరుదునిచ్చి చరిత్రలో తొలిసారిగా సామూహిక బలవత్సత్కారం చేసిన విజ్ఞానఖని సంస్కారధుని ప్రభుతకు ప్రతిధ్వని ఆంధ్రభూమి దినపత్రిక సంపాదకులకు మనమందరం కృతజ్ఞాతావిష్కరణం చేసుకుతీరాలి. 14. ఆగస్టు తేదీన 'సమయానికి తగు మాటలాడిన' వీకెన్డ్ పాయింట్‌లో సాక్షి పాక్షికంగానూ, 19వ తేదీ ఆగస్టు 2004న సంపాదకీయంలో సమగ్రంగానూ మూఢశిఖా మణులమైన మనందరికీ జ్ఞానోదయం కలిగించిన ఎగ(వై)తాళికులు. ఆంధ్రభూమ్యాకాశాలు పట్టని త్రివిక్రమ పరాక్రమానికీ శేమూషీ విశేషానికీ విహ్వాలులమై వారినే సర్వోత్తమ సన్యాసులుగా అంగీకరించక తప్పదు. దీని వల్ల మన పత్రికాఋణం కొంతైనా తీరుతుంది.

నిజం చెప్పి అష్టకష్టాలు కొనితెచ్చుకోకూడదని సత్యహరిశ్చంద్రుని కథవలన నీతిని గ్రహించిన గడుసరి అష్టలక్ష్మీకుడౌతాడు. వాని జీవితం పరచిన పూలతోవ. ఇవ్వాళ తను ఔనన్న దానినే రేపు కాదని రెండుసార్లూ జనసందోహం చేత సందేహం లేకుండా అభినందనలు అందుకోగల సమర్థుడు.

పూర్వులు ఆచరించి చరించిన మార్గాన్నే అనుసరించి 'మన'–'స్ఫూర్తి'గా తను నమ్మిన నిజాన్ని అప్రియమైనా సరే నిర్మొహమాటంగా నిర్ద్వంద్వంగా చెప్పినవాడు నష్టలక్ష్మీకుడు. వీనిది రువ్విన రాలబాట. ఎవరు ఔనన్నా కాదన్నా త్రికరణశుద్ధిగా నమ్మిన సిద్ధాంతాన్ని వదలలేని అసమర్థుడు. ఈ గుణాన్ని నిజాయితీకి ప్రతీకగానో బలహీనతకు పరాకాష్ఠగానో ఏ విధంగానైనా సరే మెచ్చిన వారికి ప్రేమాస్పదుడు, నచ్చని వారికి వివాదాస్పదుడు. జీయర్‌స్వామివారికి ఇది స్వభావ సిద్ధమైనందున ఎన్ని తుపానులెదురైనా నమ్మిన సిద్ధాంతానికి కట్టుబడే లక్షణం ఎప్పటికీ మారదు.

సత్యాన్ని సత్యంగా చెప్పటం **జనరలిజం.** అవసరాన్ని బట్టి అర్ధసత్యాన్ని సమ అర్థంగా సత్యమని నమ్మించే ప్రయత్నం **జర్నలిజం.** అసత్యాన్ని సత్యంగా నేర్పుతో చలామణీ చెయ్యటం నేటి **ఒరిజినలిజం.** చేతిలో సర్కారువారి మెమోప్రతులతో శ్రీజీయర్‌స్వామివారి అభిమతానికి అనుగుణంగా తిరుమలలో వేయికాళ్ళమంటపాన్ని యధాస్థానంలోనే నిర్మిస్తామనీ మహాప్రాకార నిర్మాణ ప్రతిపాదనను ఉపసంహరించుకుంటామనీ గౌరవనీయులైన ఇద్దరు పెద్దలు స్వామివారితో సమావేశమై వాగ్దానం చెయ్యటం యావదాంధ్ర ప్రజానీకం టెలివిజన్లలో ప్రత్యక్షంగా చూశారు. వీరిలో ఒకరు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో దేవాదాయ శాఖామాత్యులు. రెండవ వారు తిరుమల తిరుపతి దేవస్థానం పాలకమండలి అధ్యక్షులు. సర్వాధికారాలుగల ప్రభుత్వం స్వయం ప్రతిపత్తిగల దేవస్థానం పాలకమండలి సంయుక్తంగా వ్యక్తం చేసిన ఏకాభిప్రాయాన్ని ఆ మెమోలో పొందుపరచారని ఆ ఘట్టాన్ని చూసినవారెవరికైనా అర్థమౌతుంది. కాని ఆంధ్రభూమి **'నెల్సన్స్ ఐ'** సాక్షిగా వారికి అమాత్యులు సత్యనారాయణరావు గారు ఒక్కరే కనపడటానికీ టి.టి.డి. అధ్యక్షులు సుబ్బిరామిరెడ్డిగారు కనపడక పోవటానికీ ఏ బంధాలు సంబంధాలు అడ్డం వచ్చాయో



తెలియజేస్తే అజ్ఞానాంధకారంలో కొట్టుమిట్టాడుతున్న మూఢమతులకి తటిల్లత. దేవస్థానం స్వయంప్రతిపత్తిని ప్రభుత్వం వారు కాలరాచారని ఇంత చూశాక కూడా పత్రికలో రాయటం అర్ధసత్య కాదనగలరా? స్వయంప్రతిపత్తి అంటే సర్వం స్వాహా ప్రతిపత్తి కాదు. ఇష్టారాజ్యానికీ బాధ్యతారాహిత్యానికీ పట్టం కట్టటం కాదు. ప్రభుత్వానికీ పాలకమండలికీ కూడా ప్రజలకు జవాబుదారీగా వ్యవహరించవలసిన బాధ్యత ఉంది. అధికారానికీ హద్దులుంటాయి. సంప్రదాయ నియమ నిబంధనలను చారిత్రక విలువలను నేలరాచే హక్కు మంత్రిమండలికీ లేదు. దేవస్థాన పాలకమండలికీ లేదు.

ఎన్నో కోట్లరూపాయలు ఖర్చుపెట్టి అమలు జరుపుతున్న మాస్టర్‌ప్లాన్ పరిసమాప్తమయ్యాక తిరుమల రూపురేఖలు ఎలా ఉండబోతాయో, ఇప్పుడు కనిపిస్తున్న ఏ ఏ దృశ్యాలు అదృశ్యమౌతాయో, **"తనువూ మనసూ పరవశింపజేసే"** ఏ కొత్త సీనరీలు **"విహార వినోద విలాస కేంద్రాలు"**వెలుస్తాయో? విశదంగా తెలిపే నమూనాను ప్రజలసందర్శన పరిశీలనార్థం ప్రదర్శించాలని విశృంఖల స్వయం ప్రతిపత్తిని అనుభవిస్తున్న పాలకమండలికీ హైదరాబాదులోని పాలకులకూ రెండు దశాబ్దాలకాలంలో ఏ రోజునా తోచకపోవటం ఆశ్చర్యం. సామాన్య భక్తులకుకూడా సూచనలూ అభ్యంతరాలూ అభివ్యక్తంచేసే అవకాశం కల్పించటం ధర్మకర్తలకు కనీస ధర్మమని పించలేదు. ఎన్నో చిక్కు ప్రశ్నలతో ఎంతటి వారినైనా ఇరుకునపెట్టే మీడియా కూడా పాలనా మండలికే అండదండగా నిలిచి సహకరించారు. తిరుమల వివాదానికి అయోధ్యతో సామ్యం తెచ్చిన ప్రసారమాధ్యమాల ప్రతినిధులు అక్కడ రూపుదిద్దు కోబోయే రామమందిరం నమూనాను ఉద్దేశ్యపూర్వకంగా చూడనిరాకరించి ఉండకపోతే ఈ సూచన వారినించి ఏనాడో రావలసింది.

జీయర్‌స్వామివారికి తిరుమల సన్నిధానంతో బాదరాయణ సంబంధం కూడా లేదని ఆగస్టు పధ్నాలుగవ తేదీ ఆంధ్రభూమిలో **వీక్** సాక్షీబూతులు. **అంతా క్రైస్తవమే ఐనా రోమన్ కాథలిక్ చర్చి నిర్వహణలో ప్రోటస్టెంటులకు అవకాశముండదు. ఏ రకం చర్చి పాలనా వ్యవహారాలను ఆ చర్చికి చెందినవారు మాత్రమే చూసుకుంటారని ముఖ్యమంత్రివర్యులకు తెలియని విషయం కాదు. మహ్మదీయులలో కూడా సున్నీ మసీదుల నిర్వహణలో షియాలకుగాని షియామస్‌జిద్‌లలో సున్నీల ఆధ్వర్యంగానీ ఉండవు. వీటిలో పొరపాటున కూడా అపసవ్యం జరగదు.** ఇది 'విష్ణుమాయ' అనే హెడ్డింగుతో 31వ తేదీ. ఆగస్టు 2004 ఈనాడు దినపత్రిక పదకొండవ పేజీలో ప్రచురించబడిన వార్త చాలామంది చదివే ఉంటారు. "జరిగేవి కృష్ణా పుష్కరాలు. ఉన్నది కనకదుర్గమ్మ సన్నిధిలో పోస్టర్లు సూచిస్తున్నది "విష్ణు కృపపొందాలని" విష్ణువుకు కృష్ణాపుష్కరాలకు, విజయవాడ నగరానికీ సంబంధమేమిటో అర్థం కాక పుష్కరజనం తలగోక్కుంటున్నారు" ప్రజలు ఆ విధంగా ఆశ్చర్యపడక పోతేనే ఆశ్చర్యం. జనసామాన్యానికి దుష్టసమాసంలా ఇది పొసగని సంబంధమనిపిస్తోందనీ ఎబ్బెట్టుగా ఉంటుందనీ స్పష్టమే కదా?

యథాధర్మంగా తిరుమలలోని విష్ణ్వాలయానికి కనీసం స్వరూప స్వభావాలలో విష్ణుభక్తుడైన వారిని ప్రధాన ధర్మకర్తగా నియమించాలని ఎవరైనా ఆశిస్తారు. కానీ **మెత్తనికత్తిలా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం... తిరుమల తిరుపతి దేవస్థానం పాలకమండలిని రుద్రాక్షసాధ్యక్షంలో నియమించటం విపరీతమని సకలకళాబంధుప్రీతిగల ఆంధ్రభూమి**లో ఎవరికీ అనిపించలేదు, సాక్షులకు కనిపించలేదు.

“తలలు తెగటం రక్తపుటేరులు పారటం వంటి బజారుభాషను వాడటం ఈ కాలంలో ఆధ్యాత్మికరంగానికి కొందరు ప్రబుద్ధులు పట్టించిన దుర్గతికి సూచిక” అని ఈ పత్రికవారి నిర్ణయం. ఇది బజారుభాష కాదు. పత్రికాస్వాతంత్ర్యమని ప్రగల్భాలు పలుకుతూ కుహనా లౌకిక వాదసూత్రాలకు బందీలైన సంపాదకులకు బేజారుభాష. ఏరులలో నదులలో నీళ్ళు పుష్కలంగా పారుతున్నాయో రోడ్లమీద రక్తం వరదలై పారుతోందో అందరికీ వివరాలతో తెలియజేసే పత్రికలకే తెలియక పోవటం వారి అంధత్వానికి గుర్తు. ఆత్మవంచనమాని వాస్తవాలను యథాతథంగా అంగీకరించటానికి నిజాయితీ గుండెధైర్యం, నిస్వార్థం అవసరం. ఈ భాష ఆధ్యాత్మికరంగ దుర్గతికి సూచిక కాదు. వాస్తవానికి ప్రతీక. స్వదేశంలోనే అక్షరాల హిందువులకు పట్టిన దుర్గతికి వాగ్రూపంలో వ్యక్తీకరణ. తిరగరాస్తున్న చరిత్రపాఠాలు, తురుష్కుల దండయాత్రలని ఈ పుణ్యభూమి దర్శనానికి చేసిన తీర్థయాత్రలుగా వర్ణించటం, మానభంగాలను మతసహనంగా చిత్రించటం ప్రక్కన పెడదాం. ఈ సంవత్సరం గణపతి నవరాత్రి ఉత్సవాలలో సికింద్రాబాద్ గణపతి ఆలయ విధ్వంసానికి మాస్టర్ ప్లాన్ తయారు చేసిన లష్కర్–ఏ–తోయిబా, ఐ.ఎస్.ఐ. ఏజంట్లుగా వ్యవహరిస్తున్న ఉగ్రవాదుల్ని విధ్వంసక సామాగ్రితో మారణాయుధాలతో సహా పోలీసులు అదుపులోకి తీసుకొని ఉండకపోతే తలలు తెగటం రక్తపుటేరులు పారటం కార్యరూపం దాల్చేది కాదా? పూర్వానుభవంతో ఒక్కసారి ఆలోచించండి. అప్పుడు పత్రికలవారు మతసామరస్యాన్ని గురించీ సంయమనం పాటించవలసిన ఆవశ్యకత గురించీ సంఘటన జ్ఞాపకాలు మరుగున పడేవరకూ భాషాసౌందర్యం భావగాంభీర్యం కలబోసి మన వీక్ పాయింట్ వ్యాసాలూ సంపాదకీయాలు రాసేవారు. జీయర్‌స్వామివారు మాత్రం తలని తల అనీ రక్తాన్ని రక్తమేననీ అంటే అది బజారు భాష. ఒక **ప్రజాప్రతినిధి ఆధ్వర్యంలో ముస్లిం మహిళలు యువకులు పెద్దసంఖ్యలో పోలీసు కమీషనర్ కార్యాలయాన్ని ముట్టడించి, మత ఘర్షణల విద్రోహ చర్యల నేరచరిత్ర కలిగిన ఈ తీవ్రవాదుల అరెస్టును నిరసిస్తూ నినాదాలు చేస్తే, నిరసించిన మీడియా ఆందోళనకారుల చర్యను ఖండించకపోవటం వారి నిష్పాక్షికతకూ, వ్యాఖ్యానించదగిన వార్తల ఎంపికలో ప్రదర్శిస్తున్న జాగ్రత్తకూ పరాకాష్ఠ. ఇది స్వార్థానికి వేసిన విశాల ప్రయోజనాల ముసుగు** కాదా?

గోధ్రా సంఘటన అనంతర పరిణామాలకు మీడియా కల్పించిన ప్రచార ప్రభావం మతపరమైన ద్వేషాగ్నులు రగులుతూనే ఉండటానికీ, ఆ కోర్టు నించి ఇంకో కోర్టుకీ ఆ రాష్ట్రంనించే మరో రాష్ట్రానికీ కేసులు బదిలీ చెయ్యాలనే విజ్ఞాపనలతో న్యాయవ్యవస్థమీదనే నమ్మకాన్ని సడలించటానికి దోహదపడింది. ఇందిరాగాంధీ హత్యానంతరం జరిగిన వేలమంది సిక్కుల ఊచకోత సంఘటనలో నేరస్థులుగా ఆరోపణచేయబడిన వారు కూడ హిందువులే ఐనా ఆ కేసుల విషయంలో ఇంతటి శ్రద్ధాసక్తులు మీడియా కనపరచక పోవటంలో ఆంతర్యం స్వార్థమా? పరమార్థమా? ప్రాధాన్యత లోపమా? సర్దార్జీల పాపమా? ఆగస్టు నెలలో ప్రముఖ పాత్రికేయుడు యం.జే. అక్బర్ ఒక సభలో మాట్లాడుతూ ప్రసారమాధ్యమాలు వాస్తవాలను వక్రీకరిస్తున్నందువల్లనే ముస్లింలు, ముస్లిం దేశాలూ ప్రపంచం దృష్టిలో అపఖ్యాతి పాలవుతున్నాయని ఆరోపించటం దాన్ని ఎవరూ ఖండించకపోవటం విషాదాంతమైన విశేషం. నిత్యపరాయణ గ్రంథమైన శ్రీపతి స్తుతిమాలను కూడా అరబ్బుదేశాలలో విమానాశ్రయంలోనే స్వాధీనం చేసుకొని అక్కడినుండి తిరిగి వచ్చేటప్పుడు మాత్రమే అందజేస్తారని మీడియా వారికి తెలియదా?



ఆంధ్రభూమి సంపాదకులు “అఖిలాంధ్రకేగాక యావద్భారతానికీ ఆరాధ్యదైవం తిరుమలేశుడ”ని పేర్కొంటూ **“వైఖానసాగమాన్ని పాటించే తిరుమల దేవస్థానానికి సంబంధించి చేపట్టే ఏ పని ఐనా మంచిదా కాదా అన్నది వైఖానస పండితులు తేల్చాలి”** (ముంచినా సరే వారే కరెక్టనుకోవాలి) **“అపచారమేదైనా జరుగుతుంటే స్వామి కొలువులోని అర్చకులు బాధపడాలి”** (అర్చకుల వల్ల జరిగే అపచారాలన్నిటికీ స్వామి తన బాధ తనే పడాలి) “పూజాదికాలకు, దైవకార్యాలకు సంబంధించిన సమస్త విషయాలను నియంత్రిస్తారనుకునేది పెద్ద జియ్యంగారు కలుగజేసుకోవాలి” (చిన్న జీయర్‌స్వామివారి సంప్రదాయం ఒరవడికి చెందినవారే తిరుమల పెద్ద జియ్యంగారు కూడా. పైగా వారు అక్కడి ఉపాలయాలను పాంచరాత్ర ఆగమానికి మార్చాలనుకున్నవారు) “అభ్యంతరమేదైనా తోచితే దేవస్థాన అజమాయిషీకి చట్టరీత్యా ఏర్పాటైన టి.టి.డి. పట్టించుకోవాలి” (దాంతో **D.D.T.** చల్లటం పూర్తవుతుంది) అని పిల్లికి ఎలుక సాక్ష్యం చెప్పించారు. ఈ నలుగురూ గుడుగుడుకుంచంగా గుట్టుచప్పుడు కాకుండా ఉప్పుతో పప్పు భోజనాలు (ఉప్పువాడూ పప్పువాడూ కదా మరి) చేస్తుంటే భక్తులంతా టెంకాయలకూ పొర్లుదణ్ణాలకు మాత్రమే పరిమితమవాలిట. వాళ్ళకు ఈ స్వాహాకారుల స్వామిద్రోహానికి ఏడ్చేహక్కు కూడాలేదని పత్రికవారి ఎక్స్‌ట్రాస్ట్రాంగ్ పాయింట్. మీ వెతలే మా సామెతలు అని సాక్షి సిద్ధాంతం.

చిన్న జీయర్‌స్వామివారికి కూడా పౌరహక్కులనేవి ఉంటాయనీ, అప్రతిహతంగా వేంకటేశ్వరస్వామికి భక్తులు సమర్పించిన ధనం దుర్వినియోగమౌతుంటే ప్రశ్నించే హక్కు ఉంటుందనీ, ఇది దేవస్థానం పాలకమండలి స్వంతవ్యవహారం కాదనీ ఈ ఆంధ్రభూమాంధులకు తెలియకపోవటం విచారకరం. మనమేం చేస్తే అది ఘనకార్యమని వారిలో వారు పరస్పరం అభినందించుకుంటే సరిపోదు.

ఈ సందర్భంలో ఒక ఉదాహరణ అప్రస్తుతం కాబోదు. 2004 ఆగస్టు 25వ తేదీ ఈనాడు పత్రిక మెయిన్ ఎడిషన్ నాలుగవ పేజీలో ఈనాడు లేఖలలో “కృష్ణ కృష్ణ!” కృష్ణలో మరుగుదొడ్లా? అని ప్రశ్నిస్తూ ఆంధ్రదేశం గర్వించదగిన కవి శ్రీవేటూరి సుందరరామ మూర్తి గారు ఆవేదనతో రాసిన లేఖను గమనించండి. బాల్యం నించీ కృష్ణానదితో ఆ తీరంలో తాదాత్మ్యం చెంది ఆ అలల హొయలకు తనువూ మనసూ పులకించిన భావుకుడు ఆ మహానుభావుడు. మన జాతి జీవనవాహిని అన్నపూర్ణను సుజలాం సుఫలాం అని భక్తితో నమస్కరించవలసిన కృష్ణకు జరుగుతున్న అపచారానికి వ్యథచెంది గుండెబ్రద్దలై రాసిన మాటలవి. లేఖను ముగిస్తూ వారు వ్రాసిన వాక్యాలు చూడండి “ఇది సిగ్గుచేటు.... మహా పాపం. అన్నింటికీ మించి సంఘద్రోహం. ఎవరీ అధికారులు... ఎవరీ దుశ్చర్యకు పాల్పడిన అవివేకులు? ఆంధ్రజాతి వీరిని క్షమించాలంటే చేసిన తప్పును ఇప్పటికైనా సరిదిద్దుకోవాలి?” ఆంధ్రభూమి సాక్షికి వచ్చిన పత్రికల భాషలో ఆయన పొర్లి పొర్లి ఏడ్చిన టెంకాయలవాడు. వ్యవస్థీకృతమైన ఉప్పువాడు పప్పువాడూ ఊరుకు తీరాలి. ఎందుకంటే తిలా పాపం తలా పిడికెడూ గనుక.

పండితులెవరూ అభ్యంతరం చెప్పలేదు. మంత్రివర్గం చర్చించి నిర్ణయం తీసుకుంది. ప్రభుత్వం సూత్రప్రాయంగా ఆమోదించింది. కమిటీలు అంచనాలు రూపొందించాయి. దేవాదాయశాఖ నిధులు కేటాయించింది. సాంకేతిక నిపుణులు వీటిని డిజైన్ చేశారు. సౌకర్యంగా

ఉన్నత ప్రమాణాలతో నిర్మించటలో ఇంజినీర్లు కంట్రాక్టర్లు పాలుపంచుకున్నారు. భక్తుల సౌకర్యాలు చూడటం చట్టరీత్యా ఈ యంత్రాంగానికి మాత్రమే పూర్తి బాధ్యత. ఇంతమంది నిపుణులు ఆమోదించి అమలు జరిపిన కట్టడాలను సెంటిమెంటు పేరుతో పుష్కర ఏర్పాట్లతో బాదరాయణ సంబంధం కూడా లేని ఈ కవిగారెవరండీ తప్పుపట్టటానికి అని వాదిస్తే ఈ దేశాన్ని భగవంతుడు కూడా కాపాడలేడు.

శ్రీ సుందరరామమూర్తిగారు వ్యక్తం చేసిన బాధనే అవే మాటలలో తిరుమల పవిత్రతను కాపాడటం విషయంలో ఆవేదనతో జీయర్‌స్వామివారు పదే పదే విజ్ఞప్తి చేశారు. అపచార తీవ్రత రెండుచోట్లా సమానమే. ఒక జయప్రకాశ్ నారాయణ్, ఒక అన్నాహజారే ఒక మేథాపాట్కర్ ఒక వేటూరి సుందరరామమూర్తి ఒక జీయర్‌స్వామి బాధ్యతగల పౌరులుగా వీరందరూ ఒక్కరుగానే తన బాధ్యతను సక్రమంగా నిర్వర్తించటంలో విఫలమైన ప్రభుత్వాల మీద ఒంటరి పోరాటం సాగించిన మహోన్నత వ్యక్తిత్వం గలవారు. వీళ్ళకి ప్రజాస్వామ్య సూత్రాల ప్రకారం మెజారిటీ లేదు గనుక ఇలాంటి వాళ్ళ మాటకు ప్రభుత్వం విలువనిచ్చి లొంగిపోకూడదని ఆంధ్రభూమి సలహా. “ఒక చిన్నజీయర్ బెదిరింపులకు బాధ్యతగల ప్రభుత్వం లొంగిపోయి పాదాక్రాంత మవటం సర్వే సర్వత్రా వ్యతిరేకతను రేకెత్తించింది” అని ఈ పత్రిక సంపాదకుల విశ్లేషణ.

లోకంలో ప్రతివ్యక్తీ ఒక తల్లికి బిడ్డ, ఒక చెల్లికి అన్న, ఒక భార్యకు భర్త, తన పిల్లలకు తండ్రి. ఆ వ్యక్తి పోలీసైనా పాత్రికేయుడైనా తేడా ఏమీలేదు. పోలీసుల పట్ల ఆంధ్రభూమికి ఎందుకో అంత అక్కసు వారికే తెలియాలి. సర్వమానవ సమానత్వం మానవహక్కులు అని పెద్దపెద్ద లక్ష్యాలకు అంకితమైనట్టు భ్రమింపజేసే పత్రికలకు పోలీసులందర్నీ సమిష్టిగా ఆ వృత్తినే నీచాతి నీచంగా చిత్రించటం ఉదాత్తమైన భావప్రకటనేనా? సాటి మానవులుగా వారికి సరియైన విలువగౌరవం ఇచ్చినట్లేనా? పాఠకులు గ్రహించకపోరు. అన్ని ఆఫీసుల్లోనూ నిర్మించిన మరుగుదొడ్లను అక్కడ సిబ్బంది వినియోగించినట్లే తిరుమలలో పోలీసులు కూడా వాడుకున్నారు. అందుకు తప్పుపట్ట వలసింది వారిని కాదు. అవి నిర్మించి, పోలీసువారిని అక్కడ పెట్టిన టి.టి.డి.వారిని. “పోలీసుల పాదస్పర్శ వల్ల పునీతమైన వెయ్యికాళ్ళ మంటపానికి” సాక్షీ–భూతంగా నిల్చింది ఈ పత్రిక. అదే పత్రికలవారి పదస్పర్శ ఐతే మరోలా ఉండేదా? నిజాయితీ గలవారూ ద్రోహులూ అన్ని రంగాలలోను ఉన్నారు. వివాదాస్పదమైన విషయం కూలగొట్టబడిన మంటపమేగాని అక్కడ విధి నిర్వహణ చేసిన పోలీసులు కాదు. పోలీసుల భుజాలమీదుగా జీయరుస్వామివారిపై తుపాకీ గురిపెట్టటం నిష్కల్మషమైన రచనా విన్యాసమని ఎవరినీ నమ్మించలేరు.

ఇక జీయర్‌స్వామివారి ఇంటర్వ్యూలో తారాస్థాయిలో వివాదాస్పదం చేయబడిన అంశం శ్రీవేంకటేశ్వరుని ఆలయం అపవిత్రమవటాన్ని వేశ్యావాటికతో పోల్చటం. ఆంధ్రభూమి దినపత్రిక విశ్లేషణ ప్రకారం “జగన్నాథుడైన తిరుమల రాయుడిని పట్టుకుని వ్యభిచారితో పోల్చటం, “దేవుడి పేరు చెప్పుకుని వ్యవహారం సాగిస్తూ మళ్ళీ అదే దేవుడిని పడుపుగత్తెతో పోల్చటం”. ‘వ్యభిచారి’ పుంలింగం. పురుషుడికి వర్తిస్తుంది. ‘పడుపుగత్తె స్త్రీకి అన్వయిస్తుంది. దోపిడీ చేస్తున్నవాడు పురుషుడు. అతని దౌష్ట్యానికి బలియౌతున్నది స్త్రీ. ఒకేసారి ఇద్దరితోనూ పోల్చటం అసంభవం. ‘వ్యభిచారి’ పదం సాక్షి స్వకపోలకల్పితం. జర్నలిజం తోచినరీతిలో మెరుగులు



దిద్దే ప్రయత్నం. స్వామిద్రోహం. అపవిత్రకు గురౌతున్న ఆలయాన్ని అన్యాయానికి బలియై శీలం కొల్లగొట్టబడుతున్న వేశ్యలతో పోల్చటంలోని ఉచితానుచితాలను సాకల్యంగా పరిశీలించబోయే ముందు ఒక విషయం గమనార్హమని పాఠకులకు మనవి. అవతలి వారి మాటలకు విపరీతమైన అర్థాలు కల్పించి ఎంతో అమాయకంగానే ఉద్దేశించిన భావాన్ని తారుమారు చెయ్యవచ్చు. వారి వాక్యానికి లేని అర్థాలు ఆపాదించి అన్వయించవచ్చు. నిత్యజీవనంలో ఇలాంటి సంఘటనలు కోకొల్లలు. వలపన్ని సంఘటితంగా ఒక వ్యక్తిని అపఖ్యాతిపాలు చెయ్యాలనే దృఢనిశ్చయంతో ఉన్నప్పుడు, ప్రత్యేకించి అవతల వ్యక్తి ఉద్వేగంగా సంభాషిస్తున్నపుడు ఈ ప్రక్రియ మరింత సులువు. ఫలానా వారి ఇల్లు ఎక్కడండీ? అంటే– ఇంకో పది అడుగులు వేస్తే మెయిన్ రోడ్డుమీదే ఉందండీ అని సమాధానం చెప్పారనుకోండి. అల్లాగయితే మెయిన్ రోడ్డుమీద వచ్చేపోయే వారికీ వాహనాల రాకపోకలకీ ఆటంకం కాదా? అని ప్రశ్నిస్తే సాంకేతికంగా ఆ ప్రశ్న కరెక్టే. కాని జవాబు చెప్పినవాడు అడిగిన వ్యక్తికి అర్థమయ్యే రీతిలో సాయం చేద్దామని చెప్పినమాట చేసిన ప్రయత్నం విఫలమై వికటించి వికృతమైన ఊహకు చోటిచ్చింది. ఇదే Interpretation by letter as opposed to its spirit అంటే. రాశిలో గాని వాసిలోగాని ఇంతటి అద్భుతాన్ని పుట్టి బుద్ధి ఎరిగినాక చూడలేదని చెప్పే ప్రయత్నంలో “న భూతో న భవిష్యతి” అనగానే ఆయన అబద్ధం చెప్పాడనో, భవిష్యత్తు గురించి ఎలా చెప్పగలడు.... జ్యోతిషశాస్త్రం హేతుబద్ధం కాదు. మాముందు నిరూపించమనండి అని సవాలు చేస్తే, ఇంత దూరాన్వయంతో మాట్లాడలేదే అని చెప్పినవారు ఆశ్చర్యపోవలసి వస్తుంది. అది లోకోక్తి. ‘భవిష్యతి’ అనే పదం కేవలం ఉత్ప్రేక్ష. ఇంత సాగదీస్తే ఆ పదప్రయోగం స్వరూపమే మారిపోయింది. మీడియా చేతుల్లో చేతల్లో ఇల్లాంటివి ఇంకా వింతగా మారతాయి. 1–15 ఆగస్టు 2004 హాసం హాస్య సంగీత పత్రికలో “సినీగీతం సినారె మనోగతం” అనే వ్యాసం చూడండి. “రామా చిలకమ్మ (రామచిలుక) అని కవి రాస్తే తెరకెక్కేటప్పటికి “రామ్మా చిలకమ్మ” ఐ ఊరుకుంది అన్నారు. తీరుమారిన పల్లవే ప్రాచుర్యం పొందింది. రామా అనే రమ్యమైన పదం కూడా ఘోరంగా మారే అవకాశం ఉంది. నాకు పరిచయమున్న ఒక పాత్రికేయునితో “ఆంధ్రయువతీ మండలిలో ఫలానా స్వామివారి భాగవత సప్తాహం” జరుగుతుందిట అని చెప్పాను. వెంటనే అదే మాటను రెట్టిస్తూ ఆయన “యువతీమండలిలో స్వామివారి భాగోతమన్న మాట” అన్నాడు. అన్నవారి భావానికీ విన్నవారి భాష్యానికీ ఇంత అంతరం ఉండే అవకాశం ఉంది. **కొండలలోనూ కోట్లాది గుండెలలోనూ నెలకొన్న శ్రీనివాసుడి ఆలయాన్ని దాని పరిసరాలను పవిత్రతనూ కాపాడుకుంటూ తీర్థయాత్రానుభవం భక్తుల మనసులలో కలకాలం ఆనందస్పందనం కావలసింది పోయి క్షణకాలం కనువిందు చేసే విహారయాత్రా కేంద్రం**గా మార్చాలని వివిధ హోదాలలో ఉన్న కొందరు ప్రయత్నిస్తుండటం–**జీవితకాలం పరమపావనిగా ఉండవలసిన స్త్రీ తన అసహాయస్థితి కారణంగా పతితయై ఆశించిన ప్రతివాడికీ ఏ అర్హతా లేనివాడికి కూడా అంగడిబొమ్మ**గా మారటాన్ని తలపించింది శ్రీజీయర్‌స్వామివారికి. వారి మనసులో ఉద్దేశించిన పోలిక ఇంతవరకేనని సహృదయంతో అర్థంచేసుకున్న వారందరికీ విశదమౌతుంది.

శ్రీవారి భోగాలను భాగ్యాలను కూడా నియంత్రించగల శక్తివంతులు సమర్థులు తామేనని తమవల్లనే కట్టినా పడగొట్టినా తిరుమల సౌందర్యం ఇనుమడిస్తోందనీ దర్పంతో చెలరేగి పోతున్న వారికీ, ఈ వృత్తిలో ఉన్న స్త్రీలందరూ తమ భోగానికేననీ తమవంటి రసికుల వల్లనే వాళ్ళ యౌవ్వనం, జీవితం సార్ధకమౌతున్నాయని తలచే విలాసపురుషులకీ తమ సర్వస్వం అర్పించి, లేదనకుండా వాళ్ళు కోరినట్లుగా కోరికలు తీర్చి తృప్తి పరుస్తూ అరవిరిసిన కనులతో జాలిగా చెరగని చిరునవ్వుతో లీలగా వాళ్ళందర్నీ క్షమిస్తున్న శ్రీనివాసుడు, పడుపుగత్తె పరమౌదార్యంలో సమానులు కాదనగలరా? పరంధాముని పరిపూర్ణానుగ్రహంతో మోక్షాన్ని సాధించగలిగే భక్తుడు కోటికొక్కడు. తుచ్ఛమైన శరీరం వేరు స్వచ్ఛమైన ఆత్మవేరు అని అనుభవపూర్వకంగా పరిపూర్ణ జ్ఞానం గల వారకాంత మనసు గెలువగలిగిన ప్రియుడు నూటికొక్కడు. నిలువుదోపిడీకి గురి అవటంలో స్వామికీ సానికీ సర్వసామ్యం.

చేసిన వాగ్దానానికీ కట్టుబడి శ్రీ ఆదిశంకరులు తమ మాతృమూర్తి అవసాన దశలో ఆమె దగ్గిర ఉండి, అనంతరం సన్యాసి ధర్మానికి ఆచారానికి వ్యతిరేకమైనా సరే తల్లి పార్థివ శరీరానికి అంత్యక్రియలు నిర్వహించ సంకల్పించగా, ఆంధ్రభూమి సంపాదకులవంటి వారి ప్రేరేపణతో కాలడిగ్రామంలోని నంబూద్రి బ్రాహ్మణులందరూ వారిని ఒంటరిగా వదిలేశారు. ఐనాసరే కించ కించిత్తు కూడ లేకుండా వారి పెరటిలోనే మాతృమూర్తికి అంతిమ సంస్కారం చేశారు శంకరాచార్యులవారు. వారిని "కాషాయధారిగా గౌరవించటం కూడా పాపమే" అని ప్రచారం చేసిన ధీశాలురు ఆ కాలంలో కూడా ఉన్నారు. శంకరభగవత్పాదులు సన్యాసాశ్రమంలో ఉండి వ్యవస్థపై ఒంటరి పోరాటం చేసిన తొలి విప్లవవాది. ఆంధ్రభూమి సంపాదకీయం శీర్షికపైన కనిపించే వాక్యం "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" అందులో జనని స్వర్గం కంటె మహోన్నతమని ఆచరణ పూర్వకంగా నిరూపించిన వారు శ్రీశంకరులు.

ఇందుకు భిన్నమైనరీతిలో మరొక ఉదాహరణ. గురువైన తిరుక్కోట్టియూర్‌నంబి (గోష్ఠీపూర్ణులు) ఆజ్ఞను ఉల్లంఘించి పరమ రహస్యమైన అష్టాక్షరీ మహామంత్రాన్ని నరసింహస్వామి ఆలయప్రాకారంపై నిలిచి వేలాది మందిని పిలిచి తర తమ భేదాలు లేకుండా సార్వజనీనంగా ఉచ్ఛస్వరంతో ఉపదేశించారు భగవద్రామానుజులు. "గురుధిక్కారానికి ఫలితం నరకప్రాప్తి అని తెలియదా?" అని ప్రశ్నించారు ఈ చర్యకు ఆగ్రహోదగ్రులైన గోష్ఠీపూర్ణులు. అందుకు రామానుజులు వినయముగా 'తెలియును. ఇంతమందికి మోక్షప్రాప్తికై నేనొక్కడినీ నరకానికి పోవటానికి సంతోషంగా సిద్ధమే" నన్నారు. తపఃఫలాన్ని మంత్రప్రభావసిద్ధిని తనబాగుకంటె ముందు సమాజశ్రేయస్సుకు ధారపోసిన శిష్యుని విశాలదృక్పథానికీ ఔన్నత్యానికీ ముగ్ధులైన గోష్ఠీపూర్ణులు తామే సాష్టాంగంగా నమస్కరించి రామానుజులకు శిష్యులైనారు. జన్మభూమి అంటే దేశంలోని మట్టి మాత్రమే కాదు మనుషులందరూనని ఆనాడే సోదాహరణంగా నిరూపించారు యతిపతులు రామానుజులు. గ్రహించే హృదయం ఉంటే భగవంతుణ్ణి ఆలయ సోపానాల మీద కూడా చూడవచ్చని అన్వేషణ అనే కవితలో "సోపానపంక్తిలో శోషిల్లు కంఠాన నా మూర్తి కనరోయి నా పిలుపు వినరోయి" అన్నారు నాళం కృష్ణారావుగారు. "పతితులారా భ్రష్టులార బాధాసర్పదష్టులార" అని సంఘంలో ఏడిపించబడుతున్న అట్టడుగు వర్గాలను



సంబోధించాడు శ్రీశ్రీ. వీరే భగవంతుని రూపాలు. అందులో పతితులదీ భ్రష్టులదే ప్రథమ స్థానం. చండాలుని ప్రశ్నతో సిగ్గుపడి వానికి సాష్టాంగ నమస్కారం చేసిన శంకర భగవత్పాదులను గుర్తుతెచ్చుకోండి. ఇరవై ఒకటవ శతాబ్దంలో మన నవనాగరికతలో ఎంత అభ్యుదయం సాధించామో ఆలోచించండి. రెండోపదం జన్మభూమిశ్చ అంటే అర్థాన్ని భక్తిమార్గరూపేణ ఆచరించి చూపిన విప్లవవీరుడు సంఘ సంస్కర్త భగవద్రామానుజులు. జనని జన్మభూమి స్వర్గం కంటె గొప్పవి అని రోజూ రాసుకు చూసుకోవటం కాకుండా ఆచరణలో చూపించినవారు ఈ కాషాయాంబరధారులు. శ్రీ చిన్న జీయర్‌స్వామివారిది అదే పరంపర.

ఆంధ్రభూమి భాండారంలోని మరొక అభాండం జీయర్‌స్వామి వారు "ఇంతదాకా శివుడి మీద, శివాలయాలమీద, శైవారాధన మీద కనపరచని అసహనం". శ్రీవిష్ణు పాదోదకమైన గంగను తన శిరసున ధరించిన మహా విష్ణుభక్తుడు శివుడు. పార్వతీదేవికి సహస్రనామ తత్తుల్యమైన తారకమంత్రం రామనామాన్ని ఉపదేశించిన రామోపాసకుడు. అంతటి పరమభక్తునిపట్ల జీయర్‌స్వామికి అసహనమని సాక్షి ప్రమాణపూర్వకంగా ఏదైనా సాక్ష్యాన్ని చూపిస్తే తప్పకుండా నమ్మకం కలుగుతుంది. గాలి వార్తలు విలువలేక నిలువలేక గాలిలోనే తేలిపోతాయి.

ఇన్నేళ్ళూ బమ్మెర పోతనామాత్యుడు రాసిన **"నిన్నల్ల మరాట కిరాత కీచకులకమ్మ త్రిశుద్ధిగ నమ్ము భారతీ!"** అనే పద్యం చదివి పులకించిపోయి సర్వస్వతీదేవికి ఆయన చేసిన దృఢ ప్రతిజ్ఞ, సిరిసంపదలను తృణప్రాయంగా వర్జించగల వైరాగ్య సంపత్తి, అచంచలమైన భక్తిభావన, త్రికరణశుద్ధి మనకీ, మన పిల్లలకీ, రాబోయే తరాలకూ ఆదర్శప్రాయమని నమ్ముతూ వచ్చాం.

యం.యఫ్. హుస్సేన్ అనే చిత్రకారుడు ఆ "సరస్వతీదేవిని నగ్నంగా చిత్రించి తను స్వయంగా తన కళాసృష్టికి ఆనందించి, మనలను కూడా ఆ అలౌకికానందాన్ని అనుభవించి తనను అభినందించి తరించమని ప్రదర్శనలు ఏర్పాటు చేశాడు". నిండు సభలో దుశ్శాసనుని దురాగతాన్ని చూసి సహించలేక ఆ దుర్మార్గుని గుండెలు చీల్చి రక్తం త్రాగుతానని భీషణ ప్రతిజ్ఞ చేసిన భీమసేనుని వలె **పూజలందుకునే చదువులతల్లికి జరిగిన అవమానానికి ఆవేశం, ఆగ్రహం పట్టలేక కొందరు యువకులు ఆ ప్రదర్శనశాలలో భీభత్సం చేశారు. మన నిష్పాక్షిక లౌకికవాద మీడియా వెంటనే స్పందించి ఆ యువకులు ఆందోళనకారులనీ, కరుడుగట్టిన మత ఛాందసవాదులనీ ముద్రవేసింది.** కళాకారునికి తన భావాలను శక్తియుక్తులతో అభివ్యక్తం చేసే హక్కు ఉందనీ, ఆ స్వేచ్ఛను అడ్డుకోవటం అనాగరిక అప్రజాస్వామిక చర్య అనీ తీవ్రంగా నిరసించింది. యువకుల ఆగడాన్నీ (ఆగటం కాదు సుమా) కళాఖండాలపై జరిగిన దాడినీ ఖండించింది. ఈ విధంగా మన ఆలోచనాసరళిని ప్రభావితం చేసి ప్రజాభిప్రాయాన్ని అనుగుణంగా మలచి ప్రగతిపథంలో నడిపించేందుకు దోహదపడుతున్న మీడియా ప్రతిభావ్యుత్పత్తులకు జోహార్లు.

**"తమ సోమా జ్యోతిర్గమయ!"**



# బదరికాశ్రమంలో పునర్నిర్మించే సత్సంగసదనమునకు కైంకర్యములు సమర్పించిన దాతలు

**శ్రీమతి పి. విమలమ్మగారు, విజయవాడ ద్వారా:**

**జీవిత సభ్యులు:**

శ్రీమాన్ దొడ్డపనేని కృష్ణారావు-విజయవాడ

**అభిమానులు:**

**విజయవాడ:**

శ్రీమాన్ పొట్లూరి వేణుగోపాల్; శ్రీమాన్ పాణింగిపల్లి రామచంద్రరావు; శ్రీమాన్ వి. శ్రీరామమూర్తి; శ్రీమాన్ బొప్పన కృష్ణారావు; శ్రీమాన్ గుమ్మడి సుధాకరరావు- లక్ష్మి; శ్రీమాన్ సిహెచ్. శోభ; శ్రీమాన్ కె. బాలసుబ్రహ్మణ్యం; శ్రీమాన్ కిలారు మనుతేజ; శ్రీమాన్ & శ్రీమతి బి.యం.యం. చిదంబరరావు; శ్రీమాన్ వి.వి. కృష్ణరావు; శ్రీమాన్ వుయ్యూరు అంకమ్మరావు, లక్ష్మీ శిరీషకుమారి; శ్రీమాన్ యెనిగళ్ళ వెంకటేశ్వర రావు-వెంకటేశ్వరనగర్; శ్రీమాన్ చలసాని కమలాంబ; శ్రీమాన్ కిలారు విజయ కుమార్; శ్రీమాన్&శ్రీమతి కిలారు సాంబశివ రావు; శ్రీమాన్ వడవల్లి జగన్నాధరావు; శ్రీమాన్ పాలడుగు రాజ్యలక్ష్మి; శ్రీమాన్ సూర్యదేవర మాధవరావు; శ్రీమాన్ పొట్లపల్లి శ్రీరంగనాథ సత్యనారాయణస్వామి; శ్రీమాన్ జాస్తి రాజారావు; శ్రీమాన్ మల్లెల నాగమాణిక్య ప్రసాద్; శ్రీమాన్ గోపాలం వెంకటేశ్వరరావు; శ్రీమాన్ జాలాది సుబ్బారావు-నిడమానూరు; శ్రీమాన్ ముసునూరు విష్ణువర్ధనరావు; శ్రీమాన్ తూమాటి అయ్యగారు; శ్రీమాన్ వి.వి. కృష్ణారావు; శ్రీమాన్ బి. కృష్ణారావు; శ్రీమాన్ జి. చంద్రమౌళిప్రసాద్; శ్రీమాన్ కె. శివాజి రావు; శ్రీమాన్ పి. జనార్దనరావు; శ్రీమాన్ శివప్రసాద్; శ్రీమాన్ పి.వి. రమణ; శ్రీమాన్ కె. హరికృష్ణ; శ్రీమాన్ జి. ఆంజనేయులు; శ్రీమతి ఎ. దీక్షిత; శ్రీమతి ఎ. మాన్విత; శ్రీమతి కె. కృష్ణవేణమ్మ; శ్రీమాన్ కె. నాగభూషణం; డా॥ ప్రసాద్; శ్రీమాన్ లోకేశ్వరరావు; శ్రీమాన్ పి. వెంకటరత్నం; శ్రీమాన్ కోనేరు రామారావు; శ్రీమాన్ తోట రామకృష్ణప్రసాద్; శ్రీమాన్ ఎస్. సంహిత; శ్రీమాన్ జి. లీలావతి; శ్రీమతి లక్ష్మి; శ్రీమాన్ సూర్యప్రకాశరావు; డా॥ ఎల్.పి.సి. శేఖరరావు; శ్రీమాన్ వి. మల్లికార్జున; శ్రీమాన్ డి. సత్యప్రసాద్-కూచిపూడి; శ్రీమాన్ మొవ్వా రాఘువేంద్రరావు(జమీ గొల్వేపల్లి); శ్రీమాన్ కె. పుండరీకాక్షులు; శ్రీమతి వి. నాగ శిరోమణి-హైదరాబాద్;శ్రీమాన్ సిహెచ్. అజయచంద్ర- తిరువూరు; శ్రీమాన్ జె. నాగేశ్వరరావు; శ్రీమతి వై. వజ్రలత-బెంగుళూరు; శ్రీమాన్ వి. సూర్య నారాయణ-కొత్తగూడెం; శ్రీమాన్ జి. రామ కృష్ణారావు; శ్రీమతి శకుంతల-నూజివీడు; శ్రీమతి టి. నాగశిరోమణి-బాపులపాడు; శ్రీమాన్ కె.జి.జి. ప్రసాద్-కానూరు;శ్రీమాన్ నాయుడు వీర రాఘవయ్య-గుంటూరు; శ్రీమతి వీరపనేని సీతారామలక్ష్మి-కాకుల పాడు; శ్రీమాన్ బి.వి.కె. కామేశ్వరరావు; శ్రీమాన్ నరసింహులు-ఖైరతా బాద్, హైదరాబాద్; శ్రీమాన్ గోగినేని మల్లి కార్జునరావు-జి.కొండూరు; శ్రీమాన్ వై. వెంకటేశ్వరరావు-బెంగుళూరు; శ్రీమాన్ బొల్లినేని మాణిక్యాలరావు, రమాదేవి-గంగన్న గూడెం; శ్రీమాన్ కమ్మ నాగేశ్వరరావు, రాజ్య



లక్ష్మి-గవరవరం; శ్రీమాన్ కొల్లిపర శేషగిరి రావు-కపిలేశ్వరపురం; శ్రీమాన్ యలవర్తి రామమోహనరావు, సూర్యకుమారి-ఆటోనగర్;

**ఏలూరు:** శ్రీమాన్ కావూరి అమ్మేశ్వర్- శ్రీమాన్ పొట్లపల్లి శ్రీనివాస జగన్నాధరావు; శ్రీమాన్ గుత్తా వెంకయ్యచౌదరి; శ్రీమాన్ నందిగం చిట్టి బాబు; శ్రీమాన్ యెర్నేని కోనయ్య; శ్రీమాన్ నూతక్కి అరవిందకుమార్; శ్రీమతి వంకినేని రాధాకృష్ణమ్మ; శ్రీమాన్ కొమ్మారెడ్డి వెంకటరత్నం; శ్రీమాన్ ఎమ్.బి.వి.వి. ప్రసాదరావు; శ్రీమాన్ జె. రాజరామ్మోహన రావు; శ్రీమాన్ వి. రామశేషయ్య; శ్రీమాన్ ఎమ్. కృష్ణమోహన్; శ్రీమాన్ కె. శ్రీధర్; శ్రీమాన్ కె. రామకుమార్; శ్రీమతి ఎస్. ఉషారాణి; శ్రీమాన్ కె. గోవర్ధనరావు, సీతాదేవి;

శ్రీమాన్ పర్వతనేని విశ్వేశ్వరరావు-శాంతినగర్; శ్రీమాన్ పి. బాలగంగాధర రావు, శ్రీమాన్ పి. రాంబాబు; శ్రీమాన్ పి. సుబ్రహ్మణ్యేశ్వరరావు-జగన్నాధపురం; శ్రీమాన్ దాసరి ఏసుబాబు-గుడివాడ; శ్రీమాన్ దూబ గుంట శేషాద్రి, కామాక్షమ్మ- ఒంగోలు;

**శ్రీమతి పి. సీతమ్మగారు, విజయవాడ ద్వారా:**

**అభిమానులు:**

శ్రీమాన్ గోగినేని రంగారావు, అరుణ కుమారి; శ్రీమాన్ వెలగపూడి వెంకటేశ్వర రావు, వెలమ వికాసతరంగిణి; శ్రీమాన్ చిక్కాల పోలారావు; శ్రీమాన్ తోట శంకరరావు, నాగేశ్వరావు; శ్రీమతి ఎన్. అన్నపూర్ణమ్మ; శ్రీమతి తోట శ్రీరామమ్మ; శ్రీమాన్ వి. శ్రీధర్, మాధురి-ఫ్లోరిడా; శ్రీమాన్ కె. రాజారామ మోహన్‌రావు; శ్రీమాన్ శ్రీరాఘ వేంద్రరావు; శ్రీమాన్ వల్లభనేని మోహన్‌రావు; శ్రీమతి జి. సుజనలక్ష్మి; శ్రీమాన్ పిన్నమనేని వెంకట రత్నం; శ్రీమాన్ కె. సత్యనారాయణ; శ్రీమాన్ ఎమ్. లింగేశ్వరరావు; శ్రీమాన్ ఎస్. శ్రీవత్సవ శ్రీమాన్ డి. సత్యనారాయణ రెడ్డి; శ్రీమతి బొబ్బా ప్రభావతి; శ్రీమాన్ వడ్డే చలపతిరావు; శ్రీమాన్ బి. సుబ్బారావు; డా॥ పి. లక్ష్మీదేవి; డా॥ శ్రీమతి ఇందిరాదేవి; శ్రీమాన్ ఎల్.ఎస్. ఛటర్జీ; శ్రీమాన్ రామాయణపు దానయ్య; శ్రీమాన్ అందె సురేంద్రబాబు-మంగళగిరి; శ్రీమాన్ పి. గోపాలకృష్ణ-మంగళగిరి; శ్రీమాన్ కట్టమూరి కాళిభాస్కరరావు; శ్రీమాన్ పి. అప్పారావు- రోహిత్ ప్రింటింగ్ వర్క్స్; శ్రీమాన్ బత్తెన వెంకటసుబ్బారావు; శ్రీమతి యలమంచిలి శకుంతల-గుణదల; శ్రీమతి చెరుకూరి శేషారత్నమ్మ-హైదరాబాద్; శ్రీమాన్ సిహెచ్. వెంకటసుబ్రమణ్యం; శ్రీమాన్ గోపు మారుతి మోహనఆర్య; శ్రీమాన్ కట్టమూరి భాస్కర రావు; శ్రీమతి జొన్నాదుల వీరరాజమ్మ; శ్రీమతి కొల్లిసుశీల; శ్రీమాన్ మూల్పూరి హనుమంతురావు; శ్రీమాన్ వీరమాచనేని వెంకటేశ్వరరావు; శ్రీమాన్ తాళంకి వీరాంజ నేయులు-పటమట; శ్రీమాన్ టి. వి.లోకనాథ రావు; శ్రీమాన్ వీరమాచనేని రవీంద్ర, శారద-పటమట; శ్రీమాన్ అనిమేలు నాగభూషణ రావు-పోరంకి; ఎ.కొండూరు రామాలయ వికాసతరంగిణి- ఎ. కొండూరు; శ్రీమాన్ ఐ.వి. రామకృష్ణ గౌతమ్- చీమలపాడు. శ్రీమతి పొట్లూరి కమలావతి-గుడ్లవల్లేరు. శ్రీమాన్ జి. శ్రీనివాసరావు; శ్రీమాన్ తోట కూర శ్రీరామకృష్ణయ్య-చింతగుంటల; శ్రీమాన్ దేవరపల్లి పూర్ణచంద్రరావు- దెందులూరు; శ్రీమాన్ దేవినేని లక్ష్మీ కాంతమ్మ; శ్రీనగర్; ప్రత్తిపాడు భక్తసమాజం- ప్రత్తిపాడు; శ్రీమతి నందా వజ్రం-మాని కొండ; శ్రీమతి జి. లక్ష్మి-మంతెనవారి పాలెం; శ్రీమాన్ ఎస్. వెంకట రాజు, శ్రీమతి అన్నపూర్ణమ్మ-గణపవరం;

**బహరైన్:** శ్రీమతి ప్రోలాప్రగడ-నిహారిక; శ్రీమాన్ జి. మురళీకృష్ణ; శ్రీమతి జి. పద్మజాకృష్ణ, చిరంజీవి జి. భావనకృష్ణ; శ్రీమాన్ ఎమ్. బసవేశ్వరరెడ్డి, నాగమణి; చి॥ ఎమ్. హిమశ్రీ, రీతు; శ్రీమాన్ ఎమ్. శివప్రసాద్‌రెడ్డి; శ్రీమాన్ టి.వి. రామిరెడ్డి, జయలక్ష్మీదేవి; శ్రీమాన్ ఐ.వి.ఎస్. ప్రసాద్; శ్రీమతి అరుణకుమారి; చి॥ ఐ. ప్రవల్లిక; శ్రీమతి ఐ. మహాలక్ష్మి; శ్రీమతి ఐ. సత్యనారాయణ; శ్రీమాన్ ఎమ్. సతీష్‌కుమార్; శ్రీమాన్ ఎమ్.సతీష్ కుమార్- విష్ణువందన; శ్రీమతి విష్ణువందన; శ్రీమతి ఎమ్. జాహ్నవి; శ్రీమతి ఎమ్. సత్యవతి;

**ఆఫీస్ ద్వారా :**

**రాజపోషకులు:**

**శ్రీమాన్ మేడేటి వీర వెంకటరావు-కొవ్వూరు**

**పోషకులు :**

**శ్రీమాన్ తేలుకుంట చిరంజీవన్-హైదరాబాద్. శ్రీమతి సుకన్యదేవి,రామరాజు ప్రభకరరావు-హైదరాబాద్; శ్రీమాన్ ఎమ్. సత్యనారాయణ, జోగమ్మ-ఏలూరు; శ్రీమాన్ మదనమోహనరావు, లక్ష్మి-హైదరాబాద్.**

**అభిమానులు:**

శ్రీమాన్ ఎస్.ఎస్. ప్రకాశ్‌రావు- రాయఘడ్; శ్రీమాన్ బి. సత్యనారాయణమూర్తి-పాలకొల్లు; శ్రీమాన్ వి. రామ్ కుమార్- అగ్రహారం, ఏలూరు; శ్రీమాన్ పి. కృష్ణమూర్తి-ఏలూరు; శ్రీమాన్ ఎమ్.కృష్ణ మోహన్-గుణాపూర్; శ్రీమాన్ కె.వి.ఎస్. పాండురంగారావు-హైదరాబాద్; శ్రీమాన్ ఎన్.ఆర్. శ్రీకాంత్‌గుప్తా-పాలకొల్లు; శ్రీమాన్ వై.వి. శేషశాయి-సికింద్రాబాద్; శ్రీమాన్ పి. సత్యనారాయణ-విజయనగరం; శ్రీమతి నాగభాస్కరమ్మ-రాజమండ్రి; శ్రీమాన్ గిరిజా కామేశ్వరరావు-సికింద్రాబాద్; శ్రీమాన్ ఎమ్.వి.ఎస్. విశ్వేశ్వరరావు-విశాఖపట్నం; శ్రీమాన్ ఎస్. కృష్ణకుమార్-విజయవాడ; శ్రీమాన్ ఎమ్. రాంప్రసాద్-హైదరాబాద్; శ్రీమాన్ పి. పరంధామరెడ్డి-రామలింగపురం; శ్రీమాన్ వెంకటేశన్, రాఘవన్, మల్లేశ్వర రామ్-బెంగుళూరు; శ్రీమతి జి. దీప్తి, జి. సరిత-దర్గామిట్ట,నెల్లూరు; శ్రీమాన్ బి.ఎన్. నరసింహారెడ్డి, సుమతి-పెనగలూరు; శ్రీమాన్ వై. కృష్ణమూర్తి-నాగార్జున కాలనీ; శ్రీమాన్ సిక్కా కామేశ్వరరావు-చిక్కడపల్లి, హైదరాబాద్; శ్రీమాన్ సిహెచ్. చెంచు నారాయణ, సుభద్రమ్మ-ఒంగోలు; శ్రీమాన్ ఎన్. వెంకటేశ్వరరావు, లావణ్య- ఒంగోలు; శ్రీమాన్ పి. లక్ష్మన్న-సౌత్ వసంతనగర్, భిలాయ్; శ్రీమాన్ జి. లక్ష్మణరావు-చెన్నై; శ్రీమాన్ జి. ఆనందశెట్టి- చెన్నై; శ్రీమాన్ అనీల్‌కుమార్-జహీర్‌పురా, ఖమ్మం; శ్రీమతి ఎస్. అరుంధతి-రాయపూర్; శ్రీమతి కె. శ్రీనివాస్- తెనాలి; శ్రీమాన్ కె, సుబ్రహ్మణ్యం, వసుంధర- తెనాలి; శ్రీమతి సిహెచ్.భానుప్రియ-లక్ష్మీపురం; శ్రీమతి ఆండాళమ్మ, రాఘవరెడ్డి-జగిత్యాల; శ్రీమతి కె. దీప్తి- జగిత్యాల; శ్రీమాన్ దుష్యంత్-జగిత్యాల; శ్రీమాన్ రాజ్‌రెడ్డి, ప్రమీలావతి-జగిత్యాల; శ్రీమాన్ చింతల ఫణి, తార-సైదాబాద్ కాలనీ, హైదరాబాద్; శ్రీమాన్ డి.రాజేశ్వర రావు-వీణ; శ్రీమాన్ శేఖర్‌రెడ్డి-నిర్మల్, ఆదిలాబాద్; శ్రీమాన్ శ్యామసుందర్‌రెడ్డి- హిమయత్‌నగర్; శ్రీమాన్ జి. బుచ్చారెడ్డి, యశోదమ్మ- హిమయత్‌నగర్;

**విజయనగరం:** శ్రీమాన్ బి. సూర్యనారాయణ రాజు& పద్మావతి; శ్రీమాన్ లక్ష్మీపతిరాజు, పార్వతమ్మ; శ్రీమాన్ ఎమ్. సన్యాసిరాజు; శ్రీమతి ఇందిరాదేవి-గుంటూరు; శ్రీమాన్ ఎమ్. కృష్ణమూర్తిరాజు-బొండపల్లి; శ్రీమాన్ బి. నారాయణరాజు.



**విశాఖపట్నం;** శ్రీమాన్ ఐ. గోపాలరాజు, నారాయణమ్మ; శ్రీమాన్ టి. సత్యనారాయణ రాజు, సుబ్బలక్ష్మి; శ్రీమాన్ ఎ. వెంకట సత్యశ్రీనివాసరాజు-గాజువాక; శ్రీమాన్ లేటు జి.వి. రాఘవరాజు; శ్రీమాన్ యు.ఎస్. వి.ఎస్. నారాయణరాజు; శ్రీమాన్ లేటు విశ్వేశ్వర రాఘవరాజు; శ్రీమాన్ టి. శ్రీరామానాయుడు, రాజేశ్వరి-పాతగాజువాక; శ్రీమాన్ రామదాసు. పార్వతి-గుంటూరు; శ్రీమాన్ కె.బి.ఎల్. నరసింహారావు- పాలకొల్లు; శ్రీమాన్ ఎమ్. బాపూజీరావు, అనంతలక్ష్మి-భీమవరం6-1; శ్రీమాన్ బి. సన్యాసి, కూరమ్మ-గొట్టెలపాడు; శ్రీమాన్ కె. సీతారామ్, వెంకటలక్ష్మి-రాజోలు; శ్రీమాన్ బి. హరి-శ్రీకాకుళం; శ్రీమతి పి. శాంత ఉమా మహేశ్వరి-ఖమ్మం;

**టి.పి. గూడెం:** శ్రీమాన్ డి. సూర్యఫణి వర్మ,నీలిమ; శ్రీమాన్ ఎస్.వర్మ, లక్ష్మీ కుమారి; శ్రీమాన్ డి. రంగరాజు, విజయ లక్ష్మి; శ్రీమాన్ ఐ. రామరాజు, సూర్యభారతి.

**ఏలూరు:** శ్రీమాన్ సి. గోపాల్, అన్నపూర్ణమ్మ-తణుకు; శ్రీమాన్ ఆర్. సీతారామరాజు; శ్రీమాన్ కె. నాగ రవివర్మ, సత్యశాంతి; శ్రీమాన్ వి.ఎన్. ఆర్.కె. సుబ్రమణ్యవర్మ, విజయరాయ్; శ్రీమాన్ సత్యనారాయణరాజు, విజయ లక్ష్మి-కోదాడ; శ్రీమాన్ రామకృష్ణ వర్మ-కోదాడ; శ్రీమాన్ రామలింగరాజు-భీమవరం;

**తాడినాడ:** శ్రీమాన్ కె. వెంకటరామ రాజు-శ్రీమాన్ కె, సత్యనారాయణరాజు; శ్రీమాన్ ఎన్. విజయరామరాజు; శ్రీమాన్ ఎన్. విజయరామరాజు; శ్రీమాన్ భూపతిరాజు అప్పలరాజు;

**గణపవరం:** శ్రీమాన్ డా॥ కె.వి.పి. ఆర్. విశ్వనాథ్‌రాజు; శ్రీమతి కె. సరోజిని& కె.వి.పి. ఆర్. విశ్వనాథ్‌రాజు; శ్రీమాన్ రవిరాజు; శ్రీమాన్ సిహెచ్. రామచంద్రరాజు-గణపవరం; శ్రీమాన్ సిహెచ్. కన్నమరాజు-మచిలీపట్నం;శ్రీమాన్ కె. కృష్ణకుమార్&సుబ్బ లక్ష్మి- శ్రీమాన్ బి. రామలింగరాజు, ఇందిర-పాలకొల్లు; శ్రీమాన్ బి. వెంకటపతి రాజు, వెంకట రమణ-పాలకొల్లు; శ్రీమాన్ ఎన్. రామరాజు, రమాదేవి-కలిగొట్ల; శ్రీమాన్ డి. వెంకటేశ్వర్లు-పిడుగురాళ్ళ;

**జై శ్రీమన్నారాయణ!**

బదరీ అష్టాక్షరీ క్షేత్రీయ అన్నదానశాఖా సంఘ సమావేశము ది. 12.9.04న మన వేద విశ్వవిద్యాలయము, సీతానగరమందు జరిగినది. ఈ మీటింగునకు హాజరయిన కమిటీ సభ్యుల ద్వారా వచ్చిన కైంకర్య వివరములు:

| | |
|---|---|
| **శ్రీమతి వి. విమలమ్మగారు, విజయవాడ** | **రూ.32,133/-** |
| **శ్రీమాన్ డి. కృష్ణంరాజుగారు, పిట్లవానిపాలెం** | **రూ.14,273/-** |
| **శ్రీమతి పి. రమణమ్మగారు, విజయనగరం** | **రూ. 9,001/-** |
| **శ్రీమతి పి. సీతమ్మగారు, విజయవాడ** | **రూ. 5,000/-** |
| **శ్రీమాన్ ఎమ్.ఆర్.కె.ప్రసాద్‌గారు, గుంటూరు** | **రూ. 3,500/-** |
| **శ్రీమతి కమలాదేవి గారు, నల్గొండ** | **రూ. 2,500/-** |

# విషం విరగాలి

**ది. 20.9.04నాడు శ్రీమతి తిరువెంగళమ్మగారు శ్రీస్వామివారిని సేవించడానికి వారి సోదరులతో కలిసి విచ్చేసారు. శ్రీస్వామివారి ఉదయ ప్రవచనానంతరం శ్రీవారి ఆజ్ఞతో భక్తగోష్ఠినుద్దేశించి ఆమెగావించిన ప్రవచనం...**

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామి పదపద్మ సన్నిధికి దాసోహాలు అర్పిసస్తూ, భాగవతగోష్ఠికి వందనాలు సమర్పిస్తూ మాట్లాడుతున్నాను.

ధర్మరాజు కృష్ణుడితో అంటాడు.... పాండురాజుగారు మా నాన్నగారు చనిపోతూ నిన్ను చూపించి వెళ్ళిపోయారు కృష్ణా...! ఇంక నువ్వే మాకు దిక్కు అని! అలాగ మా నాన్నగారు మాకు దైవంగ, గురువుగ తండ్రిగ అప్పచెప్పారు శ్రీస్వామివారికి మమ్మల్ని. అంచేత వారే మాకు రక్షకులు. (ఒక్కసారి సేవించాలని వచ్చాం. మాట్లాడలని రాలేదు కానీ, శ్రీస్వామివారి ఆజ్ఞ కనుక వారి పదసన్నిధిన విన్నపం చేసుకుంటున్నాం.)

ఈ మధ్య భాగవతం చదువుతూ ఉంటే ఒక్కసారి ఈనాటి ఆధ్యాత్మిక భావనాప్రకర్షికి భాగవతంలో ఉన్న సంఘటనలకీ ఒక సంబంధం ఉంది అనిపించింది. అది విషం ప్రయోగం జరగడం మళ్ళా ఆ విషం విరుగుడు జరగడం మనకి మూడుసార్లు కనిపిస్తుంది. ఇప్పుడు కూడ విషప్రయోగం జరుగుతోంది మన ఆధ్యాత్మిక రంగానికి, కనిపిస్తోంది మీడియా చూస్తుంటే.

అది ఎలా ఎక్కడ జరిగింది? అది ఎలా విరుగుడు అయినది? ఇప్పుడు కూడా అలా విరుగుడు అయ్యే అవకాశం ఉందేమో అన్న ఆశ నాకు ఆ ఘట్టాలను చూస్తే అనిపించింది. దాన్ని ఒక్కసారి మీ ముందు విన్నపం చేస్తాను.

ముందుగా సముద్రంలోంచి పుట్టింది గరళం. ఇది స్పష్టంగ విషం అని అందరికి తెలుసు. మండుతూ వచ్చింది, భయంకరంగా వచ్చింది. చూసేసరికి అందరూ పారిపోయారు.

దేవతలందరూ వెళ్ళి పరమశివుని ప్రార్థించారు. 'స్వామీ కాపాడవయ్యా! అని. ఆయన వాళ్ళావిడతో చెప్పాడు... **"కంటె జగముల దుఃఖము వింటే జలజ యుంటకు నార్తులయాపద విషము వేడిమి ప్రభువై గెంటించుట దానకీర్తి ఫలము మృగాక్షీ"** అంటాడు. 'చూశావా ఎంత వేడిగా ఉందో! మనం పెద్దవాళ్ళం కద! వీళ్ళ ఆపదలు తొలగించాలి. తొలగిస్తే మనకేదో ఫలమొస్తుందని కాదు. నలుగురూ మెచ్చుకుంటారు అంతే. మంచిపని చేయాలి కద' అని. సరే వాళ్ళావిడ ఆరగించమన్నదండీ.

ఎవరైనా భర్తని విషం త్రాగమంటారా?



త్రాగమన్నది ఉమ. ఏమిటిది ఆశ్చర్యం! అంటాడు పోతనామాత్యుడు మన భాగవంతంలో.

**"మ్రింగెడిది గరళమనియను మ్రింగెడివాడు విభుండ"**ని తెలుసు. మింగేది విషం అని తెలుసును. మింగేవాడు భర్త అని తెలుసును. కానీ మింగమన్నదట. ఎందుకని? ఆవిడ సర్వమంగళ. ఆవిడే మంగళాలు అందించగలదు కనుక. ధైర్యంగ భర్తను మింగమన్నది. ప్రజలకు హితం కదా! అని సరే! గరళకంఠుడు పానం చేయటం, దేవతలు సుఖంగ ఉండటం చూశాం మనం.

అయితే ఇప్పుడే మయిందన్నమాట, ఒక స్పష్టమైన విషం, అది విషమని తెలిసిన విషం, దీన్ని ఎవరైనా ఒక సత్పురుషుడు, లోకాలంతటినీ బాగుచేయాలని ఒక మంచి అభిప్రాయమున్న వాడు దాన్ని మ్రింగి బాగు చేయగలడు. దీనికి ఎక్కడ్నుంచో పరమాత్మ దిగి వచ్చేయక్కర్లేదు. సామాన్యంగ ఒక హృదయస్పందన ఉండి మామూలుగ బాగుచేద్దాం లోకాలని అని ఉన్నవాడు, ఈ లోకంలో ఉండే చెడు స్పష్టంగా కనపడితే. అదెలాగ? అంటే ఇపుడు, దైవదూషణ చేస్తాం. ధర్మాన్ని అతిక్రమణ చేస్తాం. ఇవన్నీ విషాలే. స్పష్టంగా తప్పు అని తెలుస్తోంది. తెలిసినపుడు ఎవరైనా పెద్దలు చెప్తారు. శాస్త్రాలూ చెప్పాయి. అవి తెలిస్తే మనం మళ్ళితే మళ్ళచ్చు. అవకాశం ఉంది.

ఇక రెండు. ఇంతకన్నా ప్రమాదమైన విషాలు ఉన్నాయి. పూతన వచ్చింది. పూతన విషం ధరించి మరీ వచ్చింది వ్రేపల్లెకి. ఈ వచ్చినపుడు ఎలా ఉందో చెప్పిన పోతన యశోదమ్మకన్నా అందంగా ఉన్నదండి, అన్నాడు.

యశోదమ్మను ఎక్కడా అంత అందంగా వర్ణించడు భాగవతంలో. పూతన అందం వర్ణిస్తారు. **"శిరి మమ్మున్ బ్రతుకంగ చూచు కొరకై శృంగార వేషంబుతో అరుదే సోపు నటంచు గోపికలు జిహ్వాల్ రాక"** ఉండిపోయినారట. అబ్బబ్బ "లక్ష్మీదేవే మమ్ము అను గ్రహించడానికి వచ్చేస్తోంది... వచ్చేస్తోంది, అందుకే ఇంత బాగుంది.

ఆహాహా! ఔరా! **"క్రాలు కన్నులు గుబ్బ చన్నులు కందువొందని చందురున్ బ్రోలు మోమును, ఏరాళమైన బిరుందు"** అబ్బబ్బ ఏమి అందమో చెప్పలేం ఇలా ఉంటుంది.

ఇప్పుడు మనకీ ఇలాంటి ప్రమాదం వస్తోంది. ఇప్పుడు ఎవరు నిజంగా ఆధ్యాత్మిక విద్యను ఉపదేశిస్తున్నారు. ఎవరు కల్తీ తెలియటం లేదు.

అందరూ స్వాములవార్లే. అందరూ మనకి టి.వి.ల్లో ఎనౌన్సుమెంట్లే. అందరూ ఎంతబాగ చెప్తారో, శాంతి, సహనం, హింస వద్దు చాల చక్కగ చేసుకుందాం. అంటూ ఉంటే....

అయ్యో! ఎవరు పూతన? ఎవరు యశోద? అసలు తెలియట్లేదండి. ఎలాగ పరిష్కారం అయ్యేది? అపుడు పూతన ఎలాగ అంతమయ్యింది? ఈ పూతనను ఒక్కసారి చూసుకుందాం!

ఏం లేదు! ఎప్పటి వరకు పూతన పూతనగా మనగలిగింది? ఇతరమైన పిల్లలందరికీ కృష్ణుడే అనుకోని పాలిచ్చింది. ఆవిడకేమి అవ్వలేదు. హాయిగా ఉంది. అస్సలు కృష్ణుడి దగ్గరకు వచ్చింది. ఇప్పుడు వచ్చింది చిక్కు. మిగతా ధర్మానికి గ్లాని కలిపించే ప్రయత్నాలలో ఎన్ని నాటకాలు ఆడినా బయలు పడరండి.

శ్రీవేంకటేశ్వరస్వామి సన్నిధిని అప చారం చెయ్యబూనినపుడు మాత్రమే వాళ్ళ నిజమైన స్వరూపం బయట పడుతుంది. రాక్షసులకీ బ్రతికున్నంతసేపు మామూలు గానే ఉంటుందట ఆకారం. ఆ కామ రూపం. చచ్చిపోతే మామూలుగా వాళ్ళ కళ్ళు, దయ్యాలుగా అయిపోతారు. సినిమాల్లో చూపిస్తారే మనకి, అలాగ. వాళ్ళ దుర్మార్గతకి అప్పటికి పరాకాష్ఠ.

అలాగే పాపం! పూతన వచ్చింది. వచ్చి, అనుకుందిట... ఒక గ్రుక్కెడు చనుపాలు త్రాగు కుమారా! నీ చెలువ మెరున వచ్చును. నీ చెలువము సఫలమగును అంటుంది. ఒక్క గ్రుక్కెడుపాలు తాగవయ్యా నీ అందం తేలి పోతుంది. నా అందం సఫలమౌతుంది.

అంటే ఏమిటీ? ఇంత వేషం వేసుకుని ఇంత అందంగావచ్చింది ఆయన్ని చంపేయడానికే కనుక అది పరాకాష్ఠ అనుకుంది.

'రెండూ కరెక్ట్' అన్నాడాయన. ఆయన అందంగా మెరిసిపోయాడు. దాని అందం సార్థకమయ్యింది. ఎందువల్ల? అంటే ఎంత దుర్మార్గమైనా పాలివ్వడం భగవంతుడికి ఇచ్చింది కనుక.

ఆవిడ చనిపోయిన తరువాత **"పొగిలి పొగిలి కాలు మగువ దేహంబున అగరు పరిమళముల పొగలు వెడలె".** ఎంచేత? కల్మషములన్ని శ్రీహరి ముఖమున త్రాగ బడుట చేసి. పాపాలన్ని త్రాగేశాడు ఆయన.

చెడైనా ప్రస్తుతకాలంలో ఆయన గురించి అంటున్నారు కనుక ఆ అనే వాళ్ళూ తరించాలనే మనం ఆశిద్దాం! కానీ ఇటు వంటి పూతనలు పూతనలుగా తేలాలి అంటే యశోదమ్మ యశోదమ్మగా మిగలాలి అంటే స్వామే సంకల్పించాలి. స్వామే దాన్ని అంతం చేయాలి.

మానవులం ఏం చేయగలం కనుక. అయితే ఎలా జరుగుతుంది? ఇది ఇంకొక రకం విషం. ఈ విషం ఎంత వరకూ ఒక జీవిని కృష్ణుణ్ణి అంతం చేయాలనేదే దీని ప్రయోజనం.

ఇంతకన్నా భయంకరమైన విషం కాళీయుడి విషం. ఈ కాళీయుడి విషం ఏం చేస్తుంది? ఒక్కళ్ళ కోసం కాదిది. అలా ఎగురుతున్న పక్షులు చచ్చిపోయినాయి. ఇలా చల్లనినీరు త్రాగడానికి వచ్చిన ఆవు దూడలు చనిపోయినాయి. ఇంత ప్రమాదమైన విషం. ఇపుడు మనకి కూడా ఇలాంటి విషం ఉంది.

ఎవరో ఒక వ్యక్తి ప్రచారం చేస్తే ఎంత వరకు కల్మషం అవుతుంది? కొంతవరకే అవుతుంది?

కానీ ఏకంగా శ్రీనివాసుడి సన్నిధినుండి



లోకాన్నంతటినీ ధర్మమార్గంలో ప్రవర్తింప చేయవలసిన ఒక ప్రభుత తప్పుదారి తొక్కితే అప్పుడే మౌతుంది. మొత్తం సమాజం అంతా విషపూరితం అవుతుంది. కాళిందీజలం విషపూరితమైనపుడు "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అని ధర్మ సంస్థాపన కోసం పుట్టిన శ్రీకృష్ణుడు చుట్టబడి పోయినాడు పాముచేత. పాము స్వామిని ఎక్కడా కనబడనీయకుండా చుట్టేసిందండి. ఇలా, ధర్మం తగ్గిపోతుందా? ఇంక దీనికి గ్లాని వచ్చేస్తుందా? అధర్మం విజృంభిం చేస్తోందా? అదే ప్రభుతను ఏలుతుందా? అన్న భయం వేసేస్తోంది.

అలాటి పరిస్థితి వచ్చింది. ఇపుడు స్వామీ ఆవరించబడిపోయినాడు కాళీయుడి చేత. ఎక్కడా కృష్ణుడు కనబడుట లేదు. విషప్రయోగం జరిగిపోతుందో ఏమిటో? ఒరిగిపోతుందో, ఏమిటో, లోపల ఏమయి పోతుందో తెలియదు? మనకందరికీ ఆందోళనే. అయితే ఎలాగ దేనికి పరిష్కారమండి?

వాళ్ళందరూ ఏడ్చారు. ఏడిస్తే పరిష్కారం అవ్వలేదు. అయితే ఎంతసేపు అయ్యిందో తెలియదు ?

ఇంతలో యశోదమ్మ పరుగెత్తికొచ్చింది. వ్రేపల్లెలో ఉన్నావిడకు తెలిసింది. తెలిసి పరిగెత్తుకొచ్చింది. మిగతా వాళ్ళందరూ ఏడ్చారు. ఏడుస్తూనే ఉన్నారు. కానీ, పాపం పరిస్థితి అలానే ఉంది.

యశోదమ్మ పరుగెత్తుకొచ్చి, తండ్రీ, "పన్నగము మమ్ము కరువక నిన్నేటికి కరచెరా" మనందరం అనుకునే మాట ఇది. ఆ పాము ఏదో మమ్మల్ని కరిచినా బాగుండేది ఎంచేతంటే మనకెన్నో సమస్యలు వస్తూ ఉంటాయి. మనం పరిష్కారాలు స్వామి అనుగ్రహంతో పొందుతున్నాము.

మనకి తెలుసు. కానీ వారికే సమస్య వస్తే? తీర్చేది ఎవరు? "పన్నగము మమ్ము కరువక నిన్నేటికి కరచెరా" నీవున్నను మమ్ము రక్షింతువు. నీవు లేవంగ మేము నేరము తండ్రీ అంది. అయితే ఇపుడు ఎవరు రక్షించాలి? ఎవర్ని రక్షించాలి? అంటే యశోదమ్మ రక్షించాలా కృష్ణుడ్ని? రక్షించా లేమో? రక్షించగలదా అమ్మ! రక్షించలేదే. కానీ ఏం చేసింది? వెర్రి ప్రేమతో భయపడి పోయింది. అమ్మో! కృష్ణుడు, అమ్మో కృష్ణుడు పాము కరిచేసింది ఏమయిపోయాడో కృష్ణుడు? లోపల ఎలా ఉన్నాడో నా కృష్ణుడు? అని తల్లడిల్లిపోయింది అమ్మ.

అపుడు కృష్ణుడు ఏం చేశాడు? తన శరీరాన్ని ఒక్కసారి పెంచి పాముని దులిపేసి దానిమీద నర్తనం చేశాడండి. నర్తనం చేస్తూంటే మన భాగవతంలో వర్ణిస్తాడు పోతనామాత్యుడు. అక్కడ స్టేజి ఉందా పాపం, డాన్స్ చేయాలంటే స్టేజి ఉండాలి. ఆడియన్స్ ఉండాలి. ఇవన్నీ ఉండాలి కదా! అన్నీ ఉన్నాయి మాకృష్ణుడు డాన్స్ చేస్తు న్నాడు రమ్మన్నాడు మనల్ని. **"ఘనయమునా నదీ కల్లోల ఘోషంబు సరస మృదంగ ఘోషంబు కాద"** ఆ యమునా నదిలో కెరటాలు పాము

మీద తరంగాలుగా కొడుతున్నాయి.

అదెలా ఉందిట. సరస మృదంగ ఘోషంబు సున్నితమైన మృదంగం చప్పుడు. అంటే, కొన్ని మృదంగాలు మోగిస్తుంటే చెవులు బ్రద్దలవుతాయి.

అలాంటిది కాదు. అలాంటిది లేదు, సుకుమారం అంటే నీరు రసం అంటే ఆనీటి తాకిడికి సరసమృదంగ ఘోషంబట. అలాగ ఎలా ఉందిట?

అక్కడ ఉన్నటువంటి చిన్న పిట్టలన్నీ కిచ్ కిచ్ కిచ్ మంటూ ఉంటే అవన్నీ తాళ శబ్దాల్లా ఉన్నాయట. తాళాలు వేస్తున్నట్లు న్నాయట. **"దివినుండి వీక్షించు దివిజ గంధర్వాది జనులు సభాసీను ఓనాలుగాగ"** ఆకాశం మీదుంచి చూస్తున్నారు. చూస్తున్నటువంటి దేవత లందరూ ఆడియన్స్. మరి డాన్స్ చేస్తుంటే ఆడియన్స్ ఉండద్దా. ఆడియన్స్ ఉన్నారట.

ఇపుడు **"మహిత కాళీయ ఫణిమండప మున"** కాళీయుడి యొక్క రత్నమాణిక్యము లతో నిర్మించబడినటువంటి ఆ మండపం మీద స్వామి డాన్స్ చేస్తున్నాడు.

ఎవరీయన? **"నళినలోచన విఖ్యాత నర్తకుండు"**. డాన్స్ చేయాలంటే హావ భావ ప్రకటనకి మంచి కళ్ళు ఉండాలి. అంత అందమైన కళ్ళు కలిగి నటువంటి కృష్ణుడు **"నిత్యనై పుణ్యమున పేర్చి నృత్యమాడె"** అని స్వామియొక్క నృత్యమును వర్ణిస్తాడు.

ఇది అయితే ఎలాగ ఇపుడు పాము యొక్క విషము విరుగుడు అవ్వాలంటే స్వామి నృత్యం చేసి దాని విషాన్ని తగ్గించి దాన్ని అందులోంచి తొలగింపచేయడానికి కారణం ఎవరయ్యారు?

యశోదమ్మ యొక్క ప్రేమ. యశోదమ్మ యొక్క వెర్రిప్రేమ. ఆమె యొక్క అమాయక మైన ఏడుపు. అయ్యో తండ్రీ! నువ్వప్పుడు ఆ పాము కరుస్తూ ఉంటే అమ్మా అని పిలిచావా? నా కోసం బెంగపెట్టు కున్నావా? నాన్నా. నేనేం చేయలేక పోయానే? అని ఏడుస్తుంది. ఇదిగో ఇలాంటి అమాయకమైన హృదయంలో ఉన్నటువంటి స్పందన స్వామిలో ఒక చైతన్యాన్ని తీసుకువచ్చి ఆయనలో ఆయనే ఆయన్ని రక్షించుకునేట్లు చేసింది.

మనమెవరం రక్షించడానికి? రక్షించ లేం! కానీ స్వామి ఏడుపుకు బాగ లొంగుతాడు. గోపికలందరు కూడ స్వామి కనిపించకుండా మాయమయినపుడు ఎంత తపనపడ్డా కనపడలేదాయన. చివరకు గట్టిగా ఏడ్చారట. ఏడ్చేసరికల్లా 'పీతాంబరధరః స్రగ్వీ' అంటే మంచి ముస్తాబయి, మంచినవ్వు నవ్వుకుంటూ వచ్చి ప్రత్యక్షమవుతాడు స్వామి.

అంచేత మనమందరం మనసార మన స్వామి సంకల్పం నెరవేరాలని ఆ శ్రీనివాసుడి పదసన్నిధిని మోకరిల్లి నిండుహృదయాలతో యశోదమ్మలాంటి మనఃస్థితిని స్వామి అను గ్రహంవల్ల అలవర్చుకుని ప్రార్థన చేద్దాం.

జై శ్రీమన్నారాయణ!



జై శ్రీమన్నారాయణ!







శ్రీమన్నారాయణ రామానుజ యతిభ్యోనమః

# 42వ ఉభయ వేదాంత పండిత సభలు

తేది: అక్టోబర్ ది. 15 నుండి 17వ తేదీ వరకు

వేదిక: వేద విశ్వవిద్యాలయ ప్రాంగణం, సీతానగరం, గుంటూరుజిల్లా

**పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్నశ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి పర్యవేక్షణలో జరుగును.**

**వివిధ సంస్కృత, ద్రావిడ, వేదాన్త విషయాలపై చర్చాగోష్ఠులు జరుగును.**

ఇట్లు
**శ్రీమదుభయ వేదాన్తాచార్య పీఠము (శ్రీరంగం)**
**శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘం (విజయవాడ)**

**చాతుర్మాస్య సందర్భంగా శ్రీస్వామివారు సీతానగరంలో వేంచేసియున్నారు. ప్రతిరోజూ ఉదయం గం.8-00లకు ప్రవచనములు జరుగుచున్నవి. తదనంతరము తీర్థగోష్ఠి జరుగును.**

**గమనిక: –** సందేహాలు–సమాధానాల శీర్షికకి ప్రశ్నలు కార్డుమీద మాత్రమే వ్రాసి పంపవలెను. వ్యక్తిగతంగా సమాధానాలు కోరుకొనేవారు రిప్లైకార్డుపై మీ చిరునామా తప్పక జతపరచండి. పేరులేని ఉత్తరాలు అంగీకరించబడవు. అనివార్య కారణాలవల్ల ఈ నెలకూడా **'సందేహాలు-సమాధానాలు'** శీర్షిక ప్రచురించలేక పోతున్నందుకు చింతిస్తున్నాం.

## భక్తినివేదన చందాదారులకు విజ్ఞప్తి

మీ సభ్యత్వమును ఒకనెలముందుగనే పునరుద్ధరించుకోగలరు. మీ చందానెంబరు మార్పును రేపరుపై గమనించి మాతో జరుపు ఉత్తర ప్రత్యుత్తరములలో క్రొత్త నెంబరు తప్పక సూచించగలరు. సభ్యత్వ రుసుమును ఎమ్.ఒ. లేదా డి.డి. విజయవాడలో ఏ బ్యాంక్ ద్వారా అయిననూ భక్తినివేదన, సీతానగరం అడ్రెస్‌కు పంపవచ్చును. భక్తినివేదనకు చెక్‌లు అనుమతించబడవు. – భక్తినివేదన –

# మన చరిత్రను పరిరక్షించుదాం

డా॥ లతాకుమారి&శ్రీమతి లక్ష్మి, విజయనగరం

చరిత్రను రూపొందించుకోవడానికి వందల సంవత్సరాలు పడుతుంది. ఆ చరిత్రను సంప్రదాయంగా మలచుకోవడానికి మరికొన్ని వందల సంవత్సరాలు పడుతుందని డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు అన్నారు. చారిత్రక కట్టడాలను పరిరక్షించుకోవడానికి బదులుగా నేలమట్టం చేయడమంటే సంస్కృతి చిహ్నాలను చెరిపేయడమే అవుతుంది.

తిరుమల కొండ వేలాది సంవత్సరాలుగా భక్తులకు ఎంతో ఆరాధనీయమైన స్థలం. ఎంతోమంది భాగవతోత్తములు భగవదనుభూతితో తడిసి ముద్దైన స్థలం!

ఆ స్థలాన్ని దర్శించి, ఆ మహానుభావులను తలపుకు తెచ్చే స్మృతి చిహ్నాలను స్మరించి పులకితులయ్యే భక్తకోటివిశ్వాసాలను ''వేయి కాళ్ళమండవ విధ్వంసం'' గాయపరచింది.

పవిత్రస్థలాన్ని 'విహారస్థలం'గా మార్చాలనే అధికారుల నిరంకుశ మనస్తత్వం లోంచి పుట్టిన విపరీతధోరణే ఈ "విధ్వంసానికి" కారణం. "ఆచమన పాత్రలో ఐస్‌క్రీమ్ తినేంత" మోడ్రన్ పద్ధతులను అభివృద్ధి పేరుతో తిరుమలలో సృష్టించే తప్పిదానికి అధికారులు ఒడిగట్టారు.

భక్తుల భావోద్వేగాల పట్ల సెంటిమెంట్ల పట్ల వారి నిర్లక్ష్యానికిదొక సాక్ష్యం మాత్రమే. గొప్ప పాలనా దక్షులమనీ, అంతా తమకే తెలుసనీ అలవి మీరిన అహంకారం. మమ్మల్ని తప్పు పట్టేంతటివారా? అనే దురాగ్రహం!- అధికారులూ, వారిని ఆశ్రయించిన తాబేదార్లూ 'ఆత్మవిమర్శ'కు కొంచెమైనా ప్రయత్నం చేయకపోగా న్యాయ సమ్మతంగా ఆందోళన చేస్తున్న భక్తులపై ద్వేషాన్ని కుక్కుతున్నారు.

ఎన్నో సంవత్సరాలుగా దేవాలయం ఎదుట ఉన్న మిట్టమీద ఉన్న మెట్లపై కూర్చొని భగవంతుని స్మరించుకున్న భక్తులకు ఈరోజు ఆ అవకాశం ఏదీ? శతాబ్దాల పర్యంతం కొన్ని కోట్ల భక్తులు పాదాలతో పునీతమైన ఆ మెట్లను ధ్వంసంచేయడం ఎంతదారుణం? వేయికాళ్ళ మండపం కోవెలకు, భగవంతునికి ఎదురుగా ఉండాలి! దాన్ని ధ్వంసం చేసి ఎక్కడో కడతామనే అధికారుల ఆలోచన చరిత్ర, సంప్రదాయాలపై తెలుసో తెలియకో చేస్తున్న దారుణ అఘాయిత్యం!

తాము చేస్తున్న అఘాయిత్యాలను ప్రశ్నిస్తున్నారని శ్రీ జీయరుస్వామివారిపై అదేపనిగా బురద జల్లించే కార్యక్రమాన్ని అధికారులు చేపట్టారు. వారు ఎక్కడా బయటకు కన్పించరు. తెరవెనుక ఉండి 'విభజించి పాలించు' ఎత్తుగడలతో ప్రలోభ పెట్టి, రెచ్చ గొట్టి, బెదిరించి స్వామివారిపై వేర్వేరు వ్యక్తులను ఉసికొలిపే పన్నాగాలకు పాల్పడుతున్నారు.

రకరకాలుగా దుర్భాషలాడుతూ, కోర్టులకు ఎక్కుతూ సాగించే రభస అంతా తమ తప్పును కప్పి పుచ్చుకోవడానికే. తమకు వ్యతిరేకంగా మాట్లాడే గొంతును నులిమి వేయడానికే!

సత్యాన్ని దాచిపెట్టి సాగిస్తున్న ఈ విద్వేషపూరిత దుష్ప్రచారం వాస్తవం నోరు ఎప్పటికీ నొక్కలేదు. అధికారాన్ని చేతులోపెట్టుకొని వీరు సాగిస్తున్న ఈ విషప్రచారానికి విరుగుడుగా మన స్పందన ఎలా ఉండాలి!

ఊరూ పేరులేని వ్యక్తులతో శ్రీ స్వామివారిపై విమర్శలు చేయించి, దానికి మనం సమాధానం చెప్పడానికి సిద్ధపడితే మనస్థాయిని దిగజార్చి బలహీనపరచడం వీరి ఎత్తుగడ! ఎదుటి వ్యక్తుల దూషణలకు రెచ్చిపోయి మనమెక్కడ తప్పులు చేస్తామా, తద్వారా అసలు అంశాన్ని ప్రక్కకు తప్పించి కొనరు అంశాల్లో మనల్ని ఎట్లా కూరుకుపోయేట్లు చేద్దామా అని ఉచ్చులు పన్ని కూర్చున్నారు మేధావులైన **TTD** అధికారులు.

శ్రీ స్వామివారి వ్యక్తిత్వాన్ని హననం చేసే విధంగా కోర్టుకేసులు, పత్రికలలో రకరకాల స్వాముల పేర్లతో, సభల పేర్లతో సాగిస్తున్న విమర్శల వెనుక ఉన్న వ్యూహం ఇదే. మనం మౌనంగా ఉంటే చేతకానితనమని, తీవ్రంగా స్పందిస్తే దుందుడుకు తనమని వేలెత్తి చూపేందుకు కుట్రపన్నుతున్న కుహనా మేధావులు వీరు.

దైవం-ధర్మం-ధర్మాచార్యులపట్ల గౌరవం-సంస్కృతిపట్ల విశ్వాసం-చరిత్ర పట్ల అభి మానం-ఈషణ్మాత్రమైనాలేని కొందరు వ్యక్తులు TTDకి అధికారులుగా నిలచి భక్తుల సహనాన్ని, విశ్వాసాన్ని అవహేళన చేస్తున్నారు. కుటిల ఎత్తుగడలతో ''తామేంచేస్తే అదే ఘనకార్యం''గా నిరూపించుకోవాలను కోవడం వీరినైజం!

భగవంతుడా! ఇలాంటివారిని అధికారులుగా నీ సేవకు పిలిపించుకొని నీ సేవకులమైన మాకు పరీక్షలు పెడుతున్నావేమిటి?

మా స్వభావాన్ని శోధించడమే నీ ఆంతర్యమా? నీకోసం ఆ అధికారులను కూడా వినమ్రంగా ప్రార్థిస్తున్నాము.

''మహాధికారుల్లారా! ఎన్నో జన్మల సుకృత విశేషంచేత 'స్వామి' కార్యాన్ని నిర్వహించే అధికార భాగ్యం మీకు లభించింది. దయచేసి దీన్ని సద్వినియోగం చేసుకోండి!

వేయికాళ్ళ మండపాన్ని కొట్టాలని తప్పుడు ఆలోచన చేసారు. కొట్టివేసి తప్పు చేసారు. అయింది. ఇకనైనా సరిదిద్దుకోండి! పొరపాటును చేసిన పాపాన్ని క్షమించమని భగవంతుడిని ప్రార్థించుకోండి!

పొరపాటుపడడం మానవ సహజం. హనుమంతుడంతటివాడు లంకలో సీతమ్మ

జాడ వెతుకుతూ రావణాసురుడి ప్రక్కన పడుకొన్న 'మండోదరి'ని చూచి సీతగా భ్రమించాడు. తర్వాత పశ్చాత్తాప పడ్డాడు. పరమ సాధ్వి అయిన సీతమ్మ రావణాసురుని ప్రక్కన ఉంటుందని భావించడమే దోషమని పొర్లి పొర్లి ఏడ్చాడు. దోషాన్ని సవరించుకొన్నాడు.

మరిమీరో! లక్షలాది భక్తుల విశ్వాసాలను గాయ పరచేవిధంగా వేయికాళ్ళ మండపాన్ని విధ్వంసం చేసి ఘోరమైన పొరపాటు చేసారు. ఈ పొరపాటును సవరించుకొని మీ పెద్దరికాన్ని నిలుపుకోండి. తప్పును సవరించుకోవడం ఎప్పుడూ చిన్నతనం కాదు.

చరిత్రకు వయస్సుండాలంటే దానిని కాపాడవలసిన అధికారులకు మనసుండాలి. చరిత్ర 'మార్గదర్శకం' అవుతుంది. కాబట్టి మీరు ఒకటి కొడితే, మరొక అధికారి వచ్చి మరొకటి కొట్టడానికి సిద్ధపడతాడు. కొద్దికాలానికి విపరీత వ్యక్తులు విపరీత ధోరణితో చరిత్రను విధ్వంసం చేయడంలో తమ నీచమైన ముద్రను నిర్లజ్జగా ప్రదర్శిస్తారు.

ఇలాంటి దుష్టపద్ధతికి దారిచూపే అధికారులుగా దయచేసి మీరు నిలవకండి. మీ శ్రేయస్సుకోసం ఆ భగవంతుడిని ప్రార్థిస్తున్నాము. మీలోని శ్రీమన్నారాయణునికి శిరస్సు వంచి నమస్కరిస్తున్నాం!

సత్యంకోసం మేం సాగిస్తున్నదే ఈ ఆందోళన! అహంకారంతో విర్రవీగే అధికారులు చివరకు చరిత్రలో ఎలా మిగిలిపోయారో గుర్తుతెచ్చుకోవలసిందిగా మిమ్మల్ని వినమ్రపూర్వకంగా విజ్ఞప్తి కోరుతున్నాం. ధర్మం, ధర్మాచార్యులు, వారి మార్గ దర్శనంలో నడిచే భక్తులు-వీరిదే ఎప్పటికైనా విజయం. ఈర్ష్యా అసూయలతో విషం కక్కే వారెప్పటికైనా తలవొంచుకోక తప్పదు. ఈ"గుణపాఠాన్ని" లక్షలాది భక్తులు తమ "ధర్మాగ్రహం"ద్వారా నేర్పే పరిస్థితి దయ చేసి తేకండి!

తిరుమలపై దేవుడు శాశ్వతం. ఆయనపై భక్తులు ఏర్పరచుకొన్న భక్తిశ్రద్ధలు శాశ్వతం. ఈ రెండింటినీ అనుసంధానం చేస్తున్న ధర్మాచార్యులు శాశ్వతం. దేవుడిపై వెలగబెట్టే "అధికారం" తాత్కాలికం. ఈ అధికారాన్ని 'శాశ్వతమైనది'గా భ్రమించి మిడిసిపడి వ్యవహారాన్ని దయచేసి "ముదురుపాకాని"కి రానీయకండి. ప్రజ్వరిల్లే లక్షలాది భక్తుల 'ధర్మాగ్రహ జ్వాల'లు మీ అధికారాన్ని, శ్రేయస్సును యశస్సును భస్మంచేసే స్థితికి రాకుండా విజ్ఞతతో వ్యవహరించండి".

వేయికాళ్ళమండపాన్ని అక్కడే నిర్మించడం క్రొత్త ప్రాకార నిర్మాణాన్ని నిలపడం ద్వారా మన చరిత్రను పరిరక్షించుకొనేందుకై ఎటువంటి వత్తిళ్ళకు జంకకుండా కలియుగ నాయకుడైన శ్రీ వేంకటేశ్వరుని అనుగ్రహంతో ఒక "సాత్విక మహోద్యమాన్ని" తీర్చిదిద్దడంలో మనమంతా భాగస్వాముల మౌదాం!

జై శ్రీమన్నారాయణ!



# ప్రచార వార్తలు

## కృష్ణాపుష్కర ప్రయుక్త-బ్రహ్మ యజ్ఞం

ది.28-8-2004 నుండి 8-9-2004 వరకూ జరిగిన "కృష్ణాపుష్కరాల"లో రాష్ట్ర వ్యాప్తంగా కోట్లాది భక్తులుపాల్గొని తరించారు. గోదావరి పుష్కరాల నిర్వహణ అనుభవాలను పురస్కరించుకొని రాష్ట్రప్రభుత్వం తమ పరిధిలో చేయాల్సిన ఏర్పాట్లను కృష్ణాపుష్కరాలకు కూడా చేసింది.

విజయవాడ మహానగరం కావడంచేత లక్షలాది భక్తులు ఇక్కడకు వస్తారని ఊహించి నదికి ఇరుప్రక్కలా అధికారులు కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేసారు. ట్రాఫిక్‌నిబంధనల కారణంగా ప్రకాశం బ్యారేజి పైనుండి వాహనాల రాక ఆగిపోయింది. కిలోమీటర్ల పర్యంతం నడిచి నదికి భక్తులు చేరాల్సిన పరిస్థితి. అటు విజయవాడ వైపు, ఇటు గుంటూరుజిల్లా వైపు కూడా భక్తులు ప్రయాసతో నదికి చేరసాగారు.

ఎన్నో ఏర్పాట్లు జరిగినా, తీరా మొదటి రోజే అపశృతి. అధికారుల అనవధానత కారణంగా 7గురు వ్యక్తులు మరణించారు. ముఖ్యమంత్రి తీవ్రంగా స్పందించి కలెక్టర్‌ను, పోలీస్ కమీషనర్‌ను బదిలీచేసి, కొందరు అధికారులను సస్పెండ్ చేయడంతో అధికారులలో వేడి మరింత ఏక్కువై, ట్రాఫిక్ నిర్బంధాలు మరీ పెరిగాయి.

మహిళలు, వృద్ధులు, బాలురు నదికి చేరడానికి విపరీతమైన శ్రమపడాల్సి వచ్చింది. ఈ ప్రభావం P.W.D వర్క్‌షాప్, ప్రక్కన (సీతానగరం) జరిగే "కృష్ణాపుష్కర ప్రయుక్త బ్రహ్మయజ్ఞానికి" వచ్చే భక్తులపైన కూడా పడింది. ఎక్కడో ఉండవల్లి సెంటర్ నుండి దిగి నడచుకుంటూ అమరావతికి వెళ్ళే కరకట్ట మార్గం ప్రక్కన ఉన్న యజ్ఞస్థలానికి రావడానికి భక్తులకు బ్రహ్మప్రళయమే అయింది.

విజయవాడ వైపునుండి భక్తులకైతే దారే లేదు. కనకదుర్గవారధి వైపునుండి వచ్చే వారు 7,8 కి.మీ. నడచిరావాల్సిన పరిస్థితి.

అసలు శ్రీస్వామివారికి 'కృష్ణాపుష్కరాల' సందర్భంగా కార్యక్రమాన్ని నిర్వహించాలనే యోచనే చేయలేదు. "కృష్ణాపుష్కరాల"కు నదీ సమృద్ధినికోరుతూ గతంలో కృష్ణానదీ గర్భంలో "కృష్ణావసంతోత్సవాన్ని" నిర్వహించారు. అంతటితో ఈ కార్యక్రమానికి స్వస్తిపలికి, చాతుర్మాస్యాన్ని 'బదరి'లో నిర్వహించుకుందామని శ్రీవారు సంకల్పించారు.

అయితే అమెరికా నుండి రాగానే 'తిరుమల'కు సంబంధించిన గడబిడ, ఆ తరువాత బదరీలో వాతావరణం తీవ్ర ప్రతికూలంగా ఉండటంవంటి కారణాల దృష్ట్యా 'సీతానగరం'లోనే చాతుర్మాస్యం చేయాలని నిశ్చయించారు.

మన జెట్ కార్యదర్శి శ్రీ గంగరాజు గారు "కృష్ణావసంతోత్సవ' కార్యక్రమాన్ని నిర్వహించాము. కృష్ణవేణి అనుగ్రహించి పుష్కరాల సమయానికి పరవళ్ళుత్రొక్కుతూ వచ్చింది. అనుగ్రహించిన నదీమతల్లికి కృతజ్ఞతలు తెలుపుకోవడం మన బాధ్యత. అందువల్ల కృష్ణాపుష్కరాలకు మనం కార్యక్రమం చేయా

26/Bn Oct/Desktop/Hp1200

ల్సిందేనని" పట్టుపట్టడంతో శ్రీస్వామివారు "కృష్ణాపుష్కర ప్రయుక్త బ్రహ్మయజ్ఞాని"కి శ్రీకారం చుట్టారు.

తదీయారాధనకు, కార్యకర్తల వసతికి, ప్రవచన మండపానికి పెద్ద రేకుల షెడ్లు నిర్మిత మయ్యాయి. బ్రహ్మయజ్ఞానికి, ఇష్టికి ప్రత్యేకంగా రెండు యజ్ఞవాటికలు అందంగా తయారయ్యాయి. శ్రీస్వామివారు ఉండటానికి వీలుగా కుటీరం ఏర్పడింది.

భక్తుల సౌకర్యం కోసం టాయ్‌లెట్స్, బాత్‌రూమ్‌లు నిర్మాణమయ్యాయి. క్లోక్‌రూమ్, సమాచారం, శ్రీరామానుజవాణివంటి కార్యక్రమాల నిర్వహణ కోసం ప్రత్యేక షెడ్‌లు సిద్ధమయ్యాయి.

అతి తక్కువ సమయంలోనే మన కార్య కర్తల సమష్టికృషి ఫలితంగా 'యజ్ఞస్థలం' పూర్తి హంగులతో సిద్ధమై భక్తులకు స్వాగతం పలికింది.

రోజుకు యాభైవేలమందికి తదీయారాధన ఏర్పాట్లు జరగాలని శ్రీస్వామివారి నిశ్చయం. శ్రీస్వామివారు సంకల్పించిన ప్రతి ముఖ్య కార్యక్రమంలోనూ తదీయారాధన కార్యక్రమా నికి తమవంతు బాధ్యతను నిర్వహించడానికి సదా సిద్ధంగా ఉండే భక్తాగ్రేసురులు మన శ్రీ గ్రంధి సుబ్బారావుగారు. వీరు "కృష్ణా వసంతోత్సవ" కార్యక్రమంలో కూడా తదీయారాధన నిమిత్తంగా 500 క్వింటాళ్ళ బియ్యం, సరిపడ పప్పు, ఉప్పు సమర్పించారు. శ్రీ స్వామివారు కృష్ణాపుష్కరాలకు కార్యక్రమాన్ని చేయడం లేదని మొదట అనుకోవడంచేత అమరావతిలోనూ, తదితర స్థలాలలోనూ సుబ్బారావుగారు తమ కైంకర్యాలను సమర్పించారు.

ఆ తర్వాత విషయం తెలిసి తమవంతు కైంకర్యంగ "బ్రహ్మయజ్ఞానికి పూర్వంలానే సమర్పణ ప్రకటించారు. ఒక ప్రక్క బదరీనాథ్‌లో తదీయారాధనకు సంభారాలను పంపుతూ, మరోక ప్రక్క బ్రహ్మయజ్ఞానికి కూడా వారు సంసిద్ధులయ్యారు. ఇది వారికి భగవత్, భాగవతగోష్ఠి పట్లగల భక్తి శ్రద్ధలకు, వదాన్యతకు నిదర్శనం.

హైద్రాబాద్, వరంగల్‌వంటి ప్రాంతాల లోని వదాన్యులైన భక్తులు "కృష్ణా పుష్కర ప్రయుక్త బ్రహ్మయజ్ఞం"లో తమ భాగ స్వామ్యంగ కైంకర్యాలను సమర్పణ చేసారు.

ఇక కార్యక్రమ నిర్వహణకు షుమారు900 మంది వాలంటీర్లు సిద్ధమయ్యారు. విజయవాడ కార్యకర్తలు 300 మంది అటు విజయవాడ లోనే పుష్కరాల సందర్భంగా కార్యక్రమాలను నిర్వహించడానికి సిద్ధమయ్యారు. రైల్వేస్టేషన్‌లో, క్లోక్‌రూమ్, సమాచార కేంద్రాల నిర్వహణ, వివిధ ప్రాంతాలలో తిరుమలకు సంబంధించిన వాస్తవాలను తెలియజేసే కరపత్రాల పంపిణీ, ప్రజాభిప్రాయ సేకరణవంటి సేవలకోసం విజయవాడ కార్యకర్తలు వంతుల వారీగా పనివిభజన చేసుకొన్నారు.

శ్రీమాన్ వై. సూర్యనారాయణగారు సమన్వయకర్తగా వివిధ విభాగాలు, బ్రహ్మయజ్ఞ సందర్భంగా, భక్తులకు సేవలందించేందుకు సిద్ధమయ్యాయి. శ్రీమతి దమయంతిగారి నేతృత్వంలో కూరగాయల విభాగం, శ్రీగణేష్ రాజుగారు సమన్వయ కర్తగా, స్టోర్సు విభాగం శ్రీమతి పి. లలిత కుమారిగారు, శ్రీమతి కె.



అన్నపూర్ణగారు, శ్రీమతి నిర్మలగారు సమన్వయ కర్తలుగా తదీయారాధన విభాగం, శ్రీమాన్ పి. రుక్మాంగదర రెడ్డి, శ్రీమాన్ శంకరరావు, శ్రీమాన్ గోపి సమన్వయకర్తలుగా సామాన్లు భద్రపరిచే విభాగం, శ్రీమతి ఎమ్.సుబ్బమ్మ, శ్రీమతి ఎమ్. రాజ్యలక్ష్మి సమన్వయకర్తలుగా పాత్రల సంశోధన విభాగం, శ్రీమతి జి. చెంచులక్ష్మి, బి.వాయునందనరావు సమ న్వయకర్తగా ప్లేట్ల శుభ్రత విభాగం, శ్రీమాన్ వి.ఎ. శ్రీనివాసవర్మ సమన్వయ కర్తగా శానిటరీ విభాగం, వై. దేవేంద్రప్రసాద్ సమన్వయ కర్తగా రక్షణ విభాగం, శ్రీమతి పి. విజయలక్ష్మి, సమన్వయకర్తగా ప్రచార విభాగం, వి. వెంకటేశ్వరరావు, వెంకట కాశి సమన్వయ కర్తలుగా ఆఫీసు విభాగం వంటి వివిధ విభాగాలు ఏర్పాడ్డాయి.

వచ్చిన భక్తులకు N.R.I. హాస్పిటల్ డాక్టర్లు, హోమిహోపతి వైద్యులు వైద్య సేవలను అందించడానికి సిద్ధమయ్యారు.

శ్రీమాన్ మధుసూదనాచార్యులవారి ఆధ్వర్యవంలో బ్రహ్మయజ్ఞానికి, ఇష్టి కార్య క్రమాల నిర్వహణకు వైదిక పరమైన సేవల నందించే వ్యవస్థ చక్కగా ఏర్పడింది.

రోజుకు 50వేల మందికి అవసరమైన ఆహార పదార్థాలను వండి అందిచడానికి శ్రీమాన్ రమణిగారి ఆధ్వర్యాన హైద్రాబాద్ నుండి 60 మంది వంటస్వాములు వచ్చారు. శ్రీమాన్ భాస్కరన్ గారు కోయంబత్తురు నుండి పొయ్యిలను, పెద్దపాత్రలను సంసిద్ధంచేసారు.

సేవలు అందుకోవడానికి భక్తులు రావడమే ఆలస్యం. ఏర్పాట్లన్నీ పూర్తయ్యాయి. ముందుగా తెలియజేసిన విధంగా ట్రాఫిక్ నిర్భందాలకారణంగా భక్తులు అధికసంఖ్యలో బ్రహ్మయజ్ఞంలో పాల్గొనటానికి ఇబ్బంది ఏర్పడింది. ప్రతిరోజు 15వేలమందికి పైగా తదీయారాధనంలో పాలొన్నారు. వచ్చిన భక్తు లందరికీ ప్రతిరోజూ 5,6 రకాల పదార్థాలతో చక్కటి తదీయారాధనను నిర్వహించారు.

మన C.I. శ్రీ కోటేశ్వరరావుగారు భక్తుల రాకపోకలకు వీలుగా తగిన ఏర్పాట్లను సమన్వయం చేసారు. మన గీతాజ్యోతి రథాలు ఆశ్రమంనుండి, ఉండవల్లి సెంటర్ నుండి భక్తులను తరలించడానికి నిర్విరామంగ శ్రమించాయి.

ప్రతిరోజు వేద హవనాలతో పాటు ఉదయం 10గంแ నుండి 12.30గంแ వరకూ ప్రవచనమంటపంలో పండితుల ప్రవచనాలు అనంతరం 1 గంటకు యాగ శాలలో పూర్ణాహుతి, నీరాజనం, శాత్తుముఱై, ప్రసాద వితరణ జరిగేది.

సాయంత్రం 5–30గంแకు సామూహిక శ్రీవిష్ణు సహస్రనామ పారాయణం కాగానే నదీపూజ జరిగేది. వేలాది భక్తులతో కలిసి శ్రీస్వామివారు కన్నుల పండుగగా నదీపూజను నిర్వహించి దీపాలను నదిలో వదిలిపెట్టేవారు. ఆపై పండితుల ప్రవచనాలు, శ్రీ పీతాంబరం రఘునాథాచార్యులు, శ్రీ హనుమదాచార్యులు చక్కగా సమన్వయం చేసారు.

**ఫోటో ఎగ్జిబిషన్ :–** శ్రీమాన్ కంప్యూటర్ కృష్ణగారి పర్యవేక్షణలో శ్రీస్వామివారు నిర్వహించిన వివిధ కార్యక్రమాలను హృద్యంగా తెలియజేసే ఫోటో ఎగ్జిబిషన్ బ్రహ్మ

నిలిచింది. శ్రీమాన్ గ్రంధి మల్లిఖార్జునరావు గారు వంటి ప్రముఖులు ఎందరో 'ఎగ్జిబిషన్'ను సందర్శించి, శ్రీవారు నిర్వహించిన పలుకార్యక్రమాల సమాచారాన్ని తెలుసుకొని ఆనందించారు.

విశ్వహిందూపరిషత్ అంతర్జాతీయ అధ్యక్షులు శ్రీమాన్ అశోక్ సింఘాల్‌గారు, ఉపాధ్యక్షులు శ్రీవేదాంతంగారు ప్రభృతులు శ్రీస్వామివారిని దర్శించి, మంగళాశాసనాలను స్వీకరించారు.

శ్రీస్వామివారు మన యజ్ఞస్థలానికి ప్రక్కనే శ్రీ బొల్లేపల్లి సత్యనారాయణ (గుంటూరు) నిర్వహిస్తున్న కార్యక్రమంలో పాల్గొని **"మహాభారత – వైజయంతి 7వ అధ్యాయము"** పుస్తకాన్ని ఆవిష్కరించారు.

**శ్రీకృష్ణాష్టమి:–** ఎన్ని ఏర్పాట్లు చేసినప్పటికీ, వరుణదేవుడి రాక కారణంగా 'బ్రహ్మయజ్ఞ స్థలం' అంతా బురదతో నిండిపోయింది. భక్తులు, కార్యకర్తలు నడవడానికి, పడుకోవడానికి, కూర్చోడానికి కూడా ఇబ్బందులకు గురయ్యారు.

7.9.2004న జరగాల్సిన "శ్రీకృష్ణాష్టమి" కార్యక్రమాలు 'బ్రహ్మయజ్ఞ స్థలం'లో నిర్వహించుకోలేని పరిస్థితి ఏర్పడటంతో శ్రీస్వామివారు కార్యక్రమాన్ని సీతానగరం ఆశ్రమంలో జరపాలని నిర్ణయించారు. శ్రీ పి. వెంకటాచార్యులుగారు సమర్ధవంతంగా తమ పరివారంతో అందుకు తగిన ఏర్పాట్లు పూర్తి చేసారు.

యజ్ఞసమితి ఆహ్వానం మేరకు ముఖ్య అతిథిగా శ్రీకృష్ణాష్టమి వేడుకల్లో పాల్గొనటానికి శ్రీదత్త పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానందస్వామివారు మన ఆశ్రమానికి రావడం ప్రత్యేక ఆకర్షణగా నిలిచింది. శ్రీ స్వామివారు సాదరంగా శ్రీ గణపతి సచ్చిదానందస్వామి వారిని ఆహ్వానించారు. ఇరువురూ ప్రత్యేకంగా సమావేశమై తాము నిర్వహిస్తున్న వివిధ కార్యక్రమాల సమాచారాన్ని పరస్పరం అంద చేసుకున్నారు. అనంతరం శ్రీ స్వామివారు తిరుమల వివాదానికి సంబంధించిన వాస్తవా లను శ్రీ గణపతి సచ్చిదానంద స్వామివారికి వివరించారు.

అనంతరం శ్రీగణపతి సచ్చిదానంద స్వామివారు భక్తులనుద్దేశించి ఎంతో హృద్యంగా ప్రసంగించారు. శ్రీస్వామివారితో తమకున్న అనుబంధాన్ని ప్రస్తావిస్తూ ఈ అనుబంధం ప్రగాఢంగా ఇకముందుకూడా కొనసాగాలని వారు ఆకాక్షించారు. శ్రీస్వామివారు శ్రీ గణపతి సచ్చిదానంద స్వామివారిని పెరుమాళ్ళ శేషవస్త్రంతో సత్కరించారు.

అనంతరం "శ్రీకృష్ణాష్టమి" వేడుకలు వైభవంగా జరిగాయి. శ్రీ రమణిగారి బృందం చేసిన వివిధరకాల ప్రసాదాలను భక్తులు స్వీకరించి ఆరోజు ఆశ్రమంలోనే విశ్రమించారు.

మరునటిరోజు 8–9–2004న ఉదయం నిత్యారాధన కాగానే మహాపూర్ణాహుతి, అవభృద స్నానం, శాంతి కళ్యాణంతో ''కృష్ణాపుష్కర ప్రయుక్త బ్రహ్మయజ్ఞ" కార్యక్రమం సుసంపన్నమైనది.



ఆ రోజు రాత్రి కార్యక్రమంలో పాల్గొన్న కార్యకర్తలందరికీ సీతానగరంలో విభాగాల వారీగా శ్రీస్వామివారు, శ్రీ గంగరాజుగారు జ్ఞాపికలను అందజేసారు.

కార్యక్రమానికి తమవంతు కైంకర్యంగా శ్రీ గ్రంధి సుబ్బారావుగారు పంపిన వస్తు సంభారంలో మిగిలిన 275 క్వింటాళ్ళ బియ్యం, పప్పు, ఉప్పులను 'సద్వినియోగ పరచవలసిందిగా శ్రీస్వామివారు శ్రీ గ్రంధి సుబ్బారావుగారికే మంగళాశాసన పూర్వకంగా తిరిగి అందచేసారు.

**చాతుర్మాస్యదీక్ష :–** "బ్రహ్మయజ్ఞం" పూర్తికాగానే 'చాతుర్మాస్య దీక్ష'ను శ్రీస్వామివారు సీతానగరం ఆశ్రమంలో కొనసాగిస్తున్నారు. ప్రతిరోజూ ఉదయం 8 గం॥కు ప్రవచనం, అనంతరం తీర్థగోష్ఠి కార్యక్రమం నడుస్తున్నాయి.

**బదరీ అష్టాక్షరీ క్షేత్రీయ అన్నదాన శాఖా సంఘ సమావేశం:**

తేదీ 12–9–2004 ఆదివారం సాయంత్రం 4 గంటలకు "బదరీ అష్టాక్షరీ క్షేత్రీయ అన్నదాన శాఖా సంఘ సమావేశం" సీతానగరం ఆశ్రమంలో శ్రీ స్వామివారి పర్యవేక్షణలో జరిగింది. సంఘ సమన్వయకర్త శ్రీ టి. రమేష్ గుప్తాగారు సమావేశంలో తమ వార్షిక నివేదికను అందజేసారు.

ఈ ఏడాది ఆగస్టు వరకూ 30వేల మందికి తదీయారాధన జరిగిందనీ, నవంబర్ 17వ తేదీవరకూ బదరీనాథ్ దేవాలయం తెరిచి ఉంటుందనీ, అప్పటివరకూ సాధువులకు తదీయారాధన కొనసాగుతుందని శ్రీ గుప్తాగారు తెలియజేసారు. వాతావరణ సంబంధమైన తీవ్రప్రతికూల పరిస్థితుల దృష్ట్యా జూలై నుండి రాకపోకలకు అవరోధం ఏర్పడటం వల్ల బదరీ దర్శించే భక్తుల సంఖ్య విపరీతంగా తగ్గిపోయింది. (తిరిగి ఆగష్టులో బాగుపడింది.)

మన క్షేత్రానికి సంబంధించిన 'సత్సంగ సదన' నిర్మాణపు విశేషాలను సభ్యులకు ఇంజనీర్ శ్రీమాన్ మురళీధర్‌గారు తెలియజేసారు. శ్రీమాన్ మురళాధర్‌గారు, కరీంనగర్ నుండి వెళ్ళి బదరీలోనేఉండి నిర్మాణ కార్యక్రమాలు పర్యవేక్షించే సేవలో ఉన్నందుకు వారికీ సమర్ధవంతంగా క్షేత్రనిర్వహణ చూస్తున్న కుమారి ఉషశ్రీకి, ఆరాధన, తదీయా రాధన బాధ్యతలు చూసిన శ్రీధరా చార్యులు, కూర్మాచార్యులు, హరి, వరప్రసాద్, సుబ్బలక్ష్మిగారు, శ్రీధర్, శ్రీనివాస్‌కు శ్రీ స్వామివారు మంగళాశాసనం చేశారు. సమర్ధవంతంగా సంఘ కార్యనిర్వహణ చేస్తున్న సభ్యులందరినీ శ్రీవారు మంగళాశాసనాలు చేసారు. శ్రీవారి మంగళాశాసనాలతో సమావేశం ముగిసింది.

**వినాయక చవితి :** 18–9–2004న "విఘ్న నివారక చతుర్థి" వేడుకలు మన ఆశ్రమంలో చక్కగా జరిగాయి. శ్రీ స్వామివారు "వినాయక చవితి'' ప్రాశస్త్యాన్నిగూర్చి భక్తులకు వివరించారు. వేదాచార్యులు శ్రీ వేదాంతం నరసింహాచార్యులు, చిరంజీవి రాఘవాచార్యులు (వేద విద్యార్థి) పూజాకార్యక్రమాన్ని నిర్వహించారు.

జై శ్రీమన్నారాయణ!



శ్రీమతే రామానుజాయ నమః

# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాస పత్రిక




శ్రీతారణ నామ సంవత్సరం ఆశ్వీజమాసం

సంపుటి 57 2004 నవంబరు సంచిక 8


వ్యవస్థాపకులు

శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యులు

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు

సంపాదకులు :

శ్రీ ఉ. వే. శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు

# విషయ సూచిక.....



# పంచాంగ వివరాలు

## నవంబర్

6 విశాఖ కార్తె
8 సర్వేషామేకాదశి
11 నరకచతుర్దశి స్నానం, దీపావళి పండుగ, మాస శివరాత్రి,
12 ధనలక్ష్మీ పూజ, శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామి వారి తిరునక్షత్రం కేదారవ్రతం
13 ఆకాశదీపారంభం
14 భగినీహస్త భోజనం
15 మణవాళ మహామునుల తిరు॥
16 నాగచతుర్థి, వల్మీకపూజ, వృశ్చిక సంక్రమణం ప.2-49,
18 యాజ్ఞవల్క్య జయంతి,
19 అనూరాధ కార్తె
22 సర్వేషాం బోధనైకాదశి,
23 క్షీరాబ్ధిపూజ, చిలుకు ద్వాదశి, తులసీ వివాహం
25 వైకుంఠ చతుర్దశి
26 కార్తిక పూర్ణిమ, తిరుమంగైయాళ్వార్ తిరు॥ శ్రీవైష్ణవ దేవాలయములందు కృత్తికా దీపోత్సవం, ప్రబంధ నిగమనం
27 తిరుప్పాణియాళ్వార్ తిరు॥ శ్రీవైష్ణవ గృహాదులయందు ప్రబంధ నిగమనం
30 సంకష్టహర చతుర్థి, త్రిద్యస్పృక్ వీరాచల శ్రీరామచంద్ర పునర్వసోత్సవం.

## డిసెంబర్

2 గురుపుష్యమి, జ్యేష్ఠకార్తె
8 సర్వేషామేకాదశి
9 తిథి, యమప్రీతి దీపదానం, శనిత్రయోదశి


Printed and published by Sri **T.P. Sriramachandracharyulu** owned by **Jeeyar Educational Trust** and Printed at **Sriman Printers & Processors** Sitanagaram and Published at Sitanagaram, **Editor Sri T.P. Sriramachandracharyulu 7-48, Brindavani, Visakhapatnam - 530 028.**

మీ సేవలో....

**భక్తినివేదన**, సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, ✆ (08645) 272929,
**చందావివరాలు**:-సంవత్సరచందా రూ.50/-, జీవితచందా రూ.500/-,
విదేశాలకు సంవత్సరచందా $ 25,

E-mail : jetsitanagaram@yahoo.com Internet : www.chinnajeeyar.org

D.T.P. & Design by : పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రొసెసర్స్, సీతానగరం,

సంపాదకీయం

# తత్రాపి తిరువేంగడమ్

సర్వాత్మకుడు, సర్వనియామకుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తి, సర్వస్వామి, సర్వ రక్షకుడు, అయిన శ్రీమన్నారాయణుడు షాడ్గుణ్యపూర్తితో అర్చామూర్తిగా వెలసిన స్థలాలను **'దివ్యదేశాల'**నటం సంప్రదాయం పరిపాటి.

ఈ 'దివ్యదేశం' అనేది చాలా విలక్షణమైనపదం. స్వామి అర్చామూర్తిగా వెలసి ఉన్నంత మాత్రాన అది దివ్యదేశం కాదు. భారతభూమిని భక్తిమరంద వాహినులను ప్రవహింపచేసి సహృదయుల యినవారి ఎదలలో భగవంతుని పదిలంగా నెలకొల్పిన ఆళువారలు తమ దివ్యప్రబంధ ములలో కీర్తించిన అర్చావతారస్థలాలు. దివ్యదేశాలు.

అట్లా వారు కీర్తించిన క్షేత్రాలు నూటెనిమిది. వీటినే దివ్యదేశాలంటారు. ఈ దివ్యదేశాలకే-'దివ్యతిరుపతులు' అని కూడా వ్యవహారం. **'పతి'** అంటే మందిరం. **'తిరు'** లక్ష్మీవాచకమై భగవత్సంబంధాన్ని సూచిస్తుంది. 'తిరుపతి' అంటే భగవానుడైన శ్రీమన్నారాయణుని మందిరం అని తాత్పర్యం. **మందిరంతో** పాటు శ్రీకార్య పరులు నివసించే గ్రామాన్ని కూడా కలుపుకొని 'తిరుపతి' అని వ్యవహారం ప్రారంభమైనది. ఇట్లాంటి తిరుపతులను నూట ఎనిమిదింటిని ఆళువారులు కీర్తించి నందున భక్తులకు సేవ్యాలు **'అష్టోత్తరశత దివ్యతిరుపతులు'**.

ఆళువారులు నేరుగా తాము కీర్తించక పోయినా వారి మూర్తులను ప్రతిష్ఠించి వారి ప్రబంధాల అధ్యయనం నిత్యం కావిస్తూ వార్షికంగా అధ్యయనోత్సవాదులు జరుపు కొంటున్న స్థలాలను కూడా దివ్య దేశా లంటారు.

ఆళువారలు నెలకొనక వారి ప్రబంధాల అధ్యయనం లేక కేవలం భగవన్మూర్తులకే ఆరాధనాదికం జరుగుతున్న స్థలాలను 'ప్రాకృతస్థలాలు' అంటారు. సంప్రదాయ నిష్ఠులు ప్రాకృత స్థలాలను సేవించినా దివ్యస్థలాలలోనే తీర్థప్రసాదాలు స్వీకరించటం అనుస్యూతంగా వస్తున్న సంప్రదాయం.

వేదమార్గానుసారులయిన ప్రపన్న సంప్రదాయ పరులందరకూ నూటెనిమిది దివ్యతిరుపతులూ సేవ్యాలే.

**తత్ర క్షేత్ర చతుష్టయం:**

అయితే ఆ నూట ఎనిమిదిలోనూ నాలుగు దివ్యక్షేత్రాలు ప్రాముఖ్యాన్ని సంతరించుకొన్నాయి. మూర్తి, క్షేత్ర–తీర్థ వైభవాలతోపాటు అనేక చారిత్రక సంప్రదాయ సన్నివేశాలూ ఈ వైలక్షణ్యానికి తోడ్పడినాయి.

ఇవి నాలుగూ శ్రీరంగం, కంచి, తిరుమల, మేల్కోట.

శ్రీరంగనాథుడు ఇక్ష్వాకునినాడు ఇలకు వచ్చిన తొలివేలుపు. నిత్యులు ముక్తులూ కూడా శ్రీరంగవీధులలో భిక్షుకులుగా అవతరించాలని కోరుకొంటారట. ద్రావిడ వేదాన్తం తావులు చిమ్మినది శ్రీరంగం నుంచి. శ్రీశైలేశేత్యాది శ్లోకం అవత రించినది శ్రీరంగాన. అరయురులు గానాభినయ విలాసాలు రంగని గతి విభ్రమాలు కనవచ్చేది యిక్కడే. దివ్య ప్రబంధ మరంద వాహినులు దేశంలో ప్రహించినది ఇక్కడనుండే.

కంచి వేదశాస్త్ర విహారభూమి వరద రాజు అర్థికల్పకం. శ్రీరంగం నుంచి సోయగాలు చిమ్మిన శ్రీరామానుజ దర్శనం రూపుదిద్దుకొన్నది కంచిలోనే. కంచిగరుడ సేవ ఇతర రాగ విస్మారకంగా చరిత్ర ప్రసిద్ధం. శ్రీరామానుజులు విద్యలు నేర్చినది కంచిలో. కప్యాసశ్రుత్యర్థ విచికిత్స వారి ఎదలో మెదిలినది కంచిలోనే. ఈ విచికిత్సే వారిని దర్శనస్థాపకులుగా రూపొందించినది. వరదుడు రంగని కొసగి అబ్బురంపు కానుక రామానుజులు.

తిరుమల భూలోక వైకుంఠం. వైకుంఠంలోని పరత్వానికి విసిగిపోయి చీకటిలో చింతామణిలా వెలుగులు చిమ్మాలని ఆశ్రితవాత్సల్యమే జలధిగా, ఆపదమ్రొక్కులవాడుగా ఆదరాన శ్రియః పతి విడిసిన తావు తిరుమల. పరమపదం నుంచి ధరాతలం వరకు సర్వులూ సేవింప వీలుగా ఈరేడు జగాల ఏలిక. తానుగా వచ్చి ఏడుకొండలపై నెలకొన్న దివ్యస్థలం తిరుమల. ఆళువారలందరూ పాడినారీ స్వామిని, రంగవ్రతులైన భక్తాంఘ్రిరేణు వులు తప్ప.

తిరుక్కోటియూరి గోపురం పైనుంచి వెల్లుబికిన శ్రీరామానుజుల ఔదార్యఝరి మేల్కోటలో మడుగుకట్టింది. నిత్యులకు భగవద్దర్శనానుభవాన్ని భగవద్రామానుజులు చూరవిచ్చిన దివ్యోదారధామ మేలుకోట. "యదుశైలనిత్యవసతిః" అని మేల్కోటలో ఒక గుడిసెవేసుకు వసిస్తేచాలు తరించి పోవటానికి అని ఖ్యాతి కాంచిన దివ్యస్థలం.

ప్రపన్నులకు ఈ నాలుగు దివ్య స్థలాలూ నిత్యసంసేవ్యాలు. సంస్మరణీ యాలు. సంధ్యావందనంలో చివర 'కాయేన వాచా' అని శ్రీకృష్ణార్పణం కావించేక

**"శ్రీరంగమంగళమణిం కరుణా నివాసం**
**శ్రీవేంకటాద్రి శిఖరాలయ కాలమేఘమ్**
**శ్రీహస్తి శైల శిఖరోజ్జ్వల పారిజాతం**
**శ్రీశం నమామి శిరసా యదు శైలదీపమ్"**

అని ఈ నాలుగుస్థలాలనూ భక్తి రసార్ద్రమానసంతో సంస్మరిస్తూ ప్రణమి ల్లటం ప్రపన్న సంప్రదాయరసికులకు నిత్యానుభవం.

అంతే కాదు నిత్యం తిరువారాధనలో ఈ నాలుగు స్థలాలనూ మంగళాశాసన

పూర్వకంగా 'లక్ష్మీచరణలాక్షాంకసాక్షి' '(శియఃకాంతాయ', అస్తు శ్రీస్తనకస్తూరీ', 'కమలాకుచ కస్తూరీ' అంటూ భయభక్తి సంభ్రమానందాలతో స్మరించుకొంటారు ప్రపన్న సంప్రదాయ ప్రవణులందరూ.

**-తత్రాపి తిరువేంగడం-**

పై నాలుగు దివ్యదేశాలూ సేవ్యాలే, స్పృహణీయాలే, సంస్మరణీయాలే, ఉపాదేయాలే అయినా కలియుగ వైకుంఠం అయిన తిరుమల ప్రపన్న సంప్రదాయు లందరకూ పరమప్రాప్యం.

ఆళువారందరి ఎదలలో తానున్నా నమ్మాళ్వారుల ఎదలో ప్రణయాతిరేక విహ్వలుడై ఆయన ఎక్కడ తన ఎదలో నుంచి వెళ్ళి పొమ్మంటారో అని విశ్లేషణ భీరుతాశంకితాంతరంగంతో సావధానుడై కొలువు దీరి ఉంటాడు శ్రీనివాసుడు సదా. 'వకుళాలంకృతయోగిహృన్నిలయ' అంటూ ఈ విషయాన్ని వ్యంజింప చేస్తారు రాయల వారు.

ద్వయమంత్ర వివరణాత్మకంగా విశిష్టాద్వైతసిద్ధాంత వైభవ వైజయంతిగా శ్రీరామాయణాన్ని శ్రీశైలపూర్ణులు శ్రీమద్రామానుజులకు ప్రవచించినది తిరుపతిలో! ఈ ప్రవచనం ఒకమారు రెండుమార్లుకాదు పద్దెనిమిది పర్యాయాలు సాగింది.

"సుస్పష్టమష్టాదశ కృత్వ ఏత్య
శ్రీశైలపూర్ణాద్యతి శేఖరోయం
శుశ్రావ రామాయణ సంప్రదాయం
వక్ష్యే తమాచార్యపరం పరాత్తమ్"

అని యీ విషయాన్ని శ్రీగోవిందరాజు పేర్కొన్నారు.

అంతేకాదు అన్యోన్య వైరస్య నివారణ పూర్వకంగా అఖిలశ్రుతి సమన్వయం కావిస్తూ శ్రుత్యంతరంగాన్ని దురభినివేశాలు పూర్వనిశ్చితసిద్ధాంత ప్రభావాలూ లేకుండా యథాతథంగా నిరూపిస్తూ విశిష్టాద్వైత సిద్ధాంతవైభవ విజయధ్వజంగా నెలకొన్న **'వేదార్థ సంగ్రహాన్ని'** భగవద్ రామానుజులు ఉపన్యసించినది 'తిరుమలలో శ్రీనివాసుని సన్నిధిని బహుపండిత సదస్సులో.

"శ్రీభాష్యకృదుపన్య స్తో
యః శ్రీశైలపతేః పురః
వేదార్థ సంగహస్యాస్య
కుర్మస్తాత్పర్య దీపికామ్"

అని శ్రీసుదర్శనసూరులు పేర్కొంటారు.

వాల్మీకి, మృదువిశద గంభీర రమణీయ హృదయాన్ని పూర్వాచార్యులు వివిధ నిర్వాహాలతో, సహృదయ మహోదయుల పరిష్కారాలతో రసతుందిలంగా సంప్రదాయ సురభిళంగా ఆవిష్కరిస్తూ శ్రీరామాయణానికి వ్యాఖ్యానం రచించేందుకు స్వప్నంలో బుధగణా దేశాన్ని శ్రీగోవిందరాజులు పొందినది తిరుమలలో శ్రీనివాసుని ఎదుట శ్రీ మారుతి సన్నిధిని శ్రీభాష్యకారుల నెలవుమోసల.

"శ్రీమత్యంజన భూధరస్య శిఖరే,
శ్రీమారుతే స్సన్నిధౌ,

అగ్రే వేంకటనాయకస్య,
సదనద్వారే యతిక్ష్మాభృతః,
నానాదేశ సమాగతైర్బుధగణై
రామాయణవ్యాక్రియాం
విస్తీర్ణాం రచయేతి సాదర
మహం స్వప్నేస్మి సంచోదితః"

అని శ్రీగోవిందరాజులీ విషయాన్ని శ్లోకస్థం కావించినారు.

ఇల వెలసిన తొలివేలుపురంగనికి కొంతకాలమాతిథ్యమిచ్చిన గేస్తు తిరుమల శ్రీనివాసుడు. ఇట్లా ఆయన శ్రీరంగ శ్రీసంరక్షకుడుగా శ్రీవైష్ణవులకు మహోపకారకుడు. ఈ విషయాన్ని ఆనాడు శ్రీరంగానికి ఏర్పడిన ఉపద్రవాన్ని కళ్ళారా చూసి తన్నివారణలో యథాశక్తి అన్వయించుకొని 'శ్రీరంగశ్రీ'ని తరువాతి తరాలవారికి అందించటంలో అద్భుత సాహసం కావించిన శ్రీమన్నిగమాంత దేశికులు–

"ఆనీయానీల శృంగద్యుతి రచిత జగద్రంజనాదంజనాద్రేః
చెంజ్యామారాధ్య కించిత్సమయమథ నిహత్యోద్ధనుష్కాన్ తురుష్కాన్।
లక్ష్మీ భూభ్యాముభాభ్యాం సహ నిజనిలయే స్థాపయన్ రంగనాథం.
సమ్యగ్వర్యాం సపర్యాం పునరకృత యశోదర్పణో గోపణార్యః"

అని కీర్తిస్తారు.

అలనాడు బృందావనంలో గోపికల పాదధూళిని తలదాల్చిన ధన్యములయిన తుప్పల్లో మొక్కల్లో తీవల్లో ఒకటికాక పోతినే నేనని పరితపించినాడు కృష్ణ సఖుడుద్ధవస్వామి.

నాకు పశుపతిని కావాలని లేదు. ప్రజాపతిని కావాలని అంతకన్నాలేదు. మరి ఏం కావాలి, అంటావా?

యమునాతీరంలో ఒక కడిమిచెట్టుగానో మొల్ల తుప్పగానో రూపు తాలిస్తే చాలు ధన్యుణ్ణయిపోతానన్నాడు మరోభక్తుడు. వీరేమైనారో కాని

వైష్ణవుల తరపున వకాల్తా పుచ్చుకొని వాది నిర్దోషిత్వాన్ని నిరూపించటానికి కాలసర్పమున్న కడవలో నిర్భయంగా పరమవిశ్వాసంతో చేయిపెట్టి శ్రీవైష్ణవుల మానమర్యాదలను కాపాడి వారికి ప్రాతః స్మరణీయులైన శ్రీకులశేఖరులు తిరుమలలో ఏడుకొండల రాయని ఎదుట తామొక గడపగా నిలవాలని కోరుకొని సత్య సంకల్పులుగా నిత్య శ్రీనివాససేవా సమాయాత భక్తాంఘ్రిరేణువుల తల దాలుస్తూ శ్రీనివాస నిత్యనిరవచ్ఛిన్న విద్రుమాధరసౌందర్యసేవా సామ్రాజ్య భోగానుభవం పొందటం భక్తుల ప్రత్యక్షానుభవం.

శ్రీవేంకటాచలేతిహాసమాల తిరుమలలో శ్రీరామానుజులు కావించిన పలు సంస్కరణలను పేర్కొంటోంది. తిరుమల నంబిగారి సంబంధం. అనన్తాళ్వానుల సంబంధం, జీయరుల పర్యవేక్షణ ఇట్లాంటి

విషయాలు తిరుమలతో శ్రీవైష్ణవుల అనుబంధానికి అద్దాలు పడుతున్నాయి.

ఇన్ని విధాల శ్రీవైష్ణవులకు తిరుమల సద్వారకంగానూ అద్వారకంగానూ ఉపాదేయం నిత్యసంసేవ్యమూను.

భగవానుడు అర్చామూర్తిగా వెలిసిన నెలవుకు 'తిరుపతి' అని వ్యవహారమని ముందే విన్నవించేము. ఇట్లాగే భగవానుడే అర్చారూపిగా విడిసిన కొండకు 'తిరుమల' అని వ్యవహారం.

సింహగిరికాని, యదుగిరికాని, మంగళగిరికాని వేదగిరికాని, వృషగిరికాని ఏదయినా 'తిరుమల'గానే సంప్రదాయ వ్యవహారం. ఇట్లాంటివి పరిమితంగా ఉన్నందున 'తిరుపతుల'కు వచ్చినంత వ్యాప్తి 'తిరుమలల'కు రాలేదు.

ఇట్లా తిరుపతులకు తిరుమలకు ఒజ్జబంతి

**తిరుమల-తిరుపతి**

ఇన్ని కారణాలవల్ల శ్రీవైష్ణవులకు నిత్యస్మరణీయములు సేవనీయములు అయిన నాలుగు దివ్యదేశాలలోనూ స్పృహణీయతమం తిరుమల.

సంధ్యావందనంలో **''కాయేన వాచా''**- అని కృష్ణార్పణం కావించగానే **'శ్రీరంగమంగళమణిం'** అంటూ పై నాలుగు దివ్యదేశాలనూ స్మరించి ప్రత్యేకం.

"వేంకటాద్రిసమం స్థానం
బ్రహ్మాండే నాస్తి కించన
వేంకటేశ సమో దేవో న భూతో న భవిష్యతి"

అని తిరుమలను శ్రీనివాసుని స్మరిస్తారు ప్రపన్న సంప్రదాయ ప్రవణులు.

తిరుమలతో ఇంతటి దివ్యానుబంధం కల శ్రీవైష్ణవ సత్సంప్రదాయపరులు

''శ్రీమన్! శ్రీరంగశ్రియమను పద్రవామనుదినం సంవర్ధయ" అని నిత్యం ఆలయాలలో, గృహతిరువారాధనలలో మంగళాశాసనం కావించుకొంటున్నట్లే

''శ్రీమన్! శ్రీశైల శ్రియ మనుపద్రవామనుదినం సంవర్ధయ" అని తిరుమలశ్రీ కూడా నిరుపద్రవంగా వర్ధిల్లేట్టు అనుగ్రహించమని శ్రీనివాసుని వేడుకోవాలి.

- శ్రీ రామచంద్రాచార్య



## అభినందనలు

భక్తినివేదన పాఠక కుటుంబాన్ని మరింత పెంచేందుకు కృషి చేస్తున్న వారిలో శ్రీమతి **తాండ్ర పద్మాపాపారావుగారు** ఒకరు. వీరు కరీంనగర్ వికాసతరంగిణి సభ్యులు. వీరికి శ్రీశ్రీశ్రీ స్వామివారు అనేక మంగళాశాసనాలు కృపచేయు చున్నారు.

# "వెంకటేశ్వరునికి మొర"

శ్రీమాన్ చెన్నమనేని హనుమంతరావు, కరీంనగర్

శ్రీ శ్రీవెంకటేశ్వర ప్రభూ!

ఆపద మ్రొక్కులవాడా!!

అడుగడుగు దండాలస్వామి !!

ఏమిటీ ఈ నీ లీల?! ధర్మానికి హాని కల్గినపుడు ఎప్పుడైనా దుష్టుల శిక్షించి, శిష్టులను రక్షింప భువిపై పుడ్తూనే ఉంటానని చెప్పావు కదా స్వామి.

ఇప్పుడు నీ చుట్టూరా జరిగే ధర్మహాని, నీవు ఈ భూమిపై పుట్టేంత మోతాదులో లేదా! సరే ధర్మం ఎంత క్షీణిస్తే నీవు ఈ భూమిపైకి వస్తోవో మాకు తెలియదు కాని, నీవు పుట్టకున్నా(?) హాని చేస్తున్న వారికి ఒకింత జ్ఞానం కల్గేటట్లు లేదా చెవిమెలిపెట్టి ఇది తప్పని చెప్పక చెప్పడం చెయ్యరాదా స్వామి....! కనీసం అహంకారులకు వార్నింగ్ ఐనా ఇవ్వరాదా స్వామి! తొండమానునితో మాట్లాడేక ఇక ఎవ్వరితో మాట్లాడనని భీష్మించుకున్నావు సరే అంతరార్థం మాకు బోధపడదు. కాని ఇలా ఉంటే నీ చుట్టూరా జరిగే అన్యాయాలు చూస్తూ నీవు ఏ మహిమ చూపకుంటే సగటు మనిషి నీ గురించి ఏమనుకుంటాడు స్వామి?

సరే కల్పాలనుండి నీవు చూస్తున్న ఈ ఆట నీకు చిద్విలాసం. మాకు బోధపడదు.

సరే! కాని ఇక్కడ ఒక్కటుంది. మీకు మాకు మధ్య కన్పించే దైవంలా మాకొక ఆచార్యులున్నారు. వారి మనోవేదన మేము తీర్చలేకున్నాము. మా బాధ అది. నీకపచారం జరిగితే నీవేం చెస్తావో? ఎలా చేస్తావో? అది మా శక్తికి మించిన ఆలోచన.

కాని మా ఆచార్యుని మనోవేదన మాకు చెందింది. మేమెలా ముందుకు నడవాలో, ఏం చేయ్యాలో తెలియక, నీకే మొర పెట్టుకుంటున్నాము.

కాలమేమొ కలికాలం. అధికారం మాట నిలకడలేని రాజకీయవాదులు, అహంకారులైన అధికారగణం చేతులలో నలుగుతోంది. అది పిచ్చివాని చేతిలోని రాయిలాగా ఎటుపడ్తె అటు విసరపడ్తూంది. దానికి మా ఆచార్యులవంటి వారు విలవిలలాడి పోతున్నారు. ఇప్పుడైనా నీవు చెయ్యకపోతే కనీసం నీకు నచ్చిన, ఇష్టమైన వారెవ్వరితోనైనా మాట్లాడకపోతే భవిష్యత్తులో నీకే ప్రమాదమని చెప్పక తప్పదు.

అప్పటికి ఇలా చిద్విలాసంగా నవ్వుతూనే చూస్తావా, ఏదైనా ప్రయత్నం చేస్తావా? ఏమో! ఏం చేస్తావో? మాకు తట్టదు. మాకనవసరం. కాని మా ఆచార్యులకు వారి మనోవేదన తీర్చటానికి నీవు ఏదో చెయ్యక తప్పదు. చేస్తావనే నమ్మకమూ మాకుంది. కానీ... అదెప్పుడో! ఇప్పుడే కాకూడదా!!

ఇట్లు,

ఎప్పటికి నీ వైభవం పూర్వంలాగానే ఉండాలనుకునే వెర్రి భక్తబృందం.

మొరపెట్టుకోవడానికి నీవు తప్ప ఎవ్వరు లేని ఏకాకులం.

# భృగు మహర్షి
## మహర్షులు చరిత్ర

తమిళమూలం :
వై.వా. నావల్‌పాకం దేవనాథ తాతాచార్యస్వామి



తెలుగు సేత :
శ్రీ.ఉ.వే.ప్ర శ్రీమాన్ తూప్పురాణి ఉదయవర్‌స్వామి, విజయవాడ

**నామవైభవం :**

"భృగు" అనే పేరులోనే గొప్ప మహిమ ఇమిడి ఉంది. బ్రహ్మాండమైన అగ్నిజ్వాలలు దహిస్తున్నపుడు కలిగేధ్వనికి 'భృగు' అనిపేరు. ఫళ ఫళ ప్రకాశించు అనే అర్థం కూడ దీనికి ఉంది. మంత్రాలలో శ్రేష్ఠమైన గాయత్రీమంత్రం లోని 'భర్గ' అనే పదానికి, దీనికి పోలిక ఉంది. సూర్యునిలోని తేజస్సే దానిలోని 'భర్గ' శబ్దానికి అర్థం.

ఘోరమైన తపశ్శక్తితో పాపములను భస్మము చేయువాడని, ఈ భృగుశబ్దానికి అర్థము. బ్రహ్మతేజస్సుతో ప్రకాశించువాడు, అగ్నితో పుట్టి పెరిగినవాడు అని కూడ ఈ శబ్దానికి అర్థం ఉంది.

శంఖమువలె ఉండి ఎత్తైన పర్వత శిఖరానికి భృగు అని పేరు. ఆ పర్వత శిఖరాన్నుండి పడి ఆత్మాహుతి చేసుకుంటే అన్ని పాపముల నుండి విముక్తిని పొంద వచ్చును. దీనికే భృగు పతనమనిపేరు.

ఈ విధముగా పాపాలను పోగొట్టి, మనిషిని పరిశుద్ధునిగా చేసే పనులన్నిటికీ ఈ 'భృగు' నామసంబంధం పూర్వం నుంచీ ఏర్పడి ఉంది. ఇంత పుణ్యప్రదమైన ఈ తిరునామాన్ని అనుసంధించుకున్న ప్రతి సారి, మన పాపరాశి అంతా అణువు అణువుగా నశించిపోతుంది అనడంలో సందేహం లేదు.

బ్రహ్మయొక్క హృదయాన్ని భేదించు కుని భృగుమహర్షి అవతరించాడని కొన్ని ఆధారాలు మనకు తెలియజేస్తున్నాయి. ఆదిమనువు సృష్టించిన ప్రజాపతులు పదహారుమందిలో 'భృగువు'కూడా ఒకడని మనుస్మృతి చెబుతోంది. వరుణుడు ఈ భృగుమహర్షిని (పుత్రుడుగా) స్వీకరించుట చేత, ఇతడు వరుణుని కుమారుడు అంటోంది, తైత్తరీయ ఉపనిషత్.

మం॥ భృగుర్ వై వారుణి: 1 "వరుణం పితరమతపససార" ఈ విధంగా ఈ నామ మాహాత్మ్యాన్ని చెప్పే పురాణఘట్టాలు కూడా అనేకం ఉన్నాయి.

జ్యోతిషం, ఆయుర్వేదం మొదలైన శాస్త్రాలలో, అనేకగ్రంథాలు ఈ భృగు మహర్షి చేత వ్రాయబడినట్టు తెలుస్తోంది. పరతత్వాన్ని నిర్ణయించడంలో ఈయన దిట్ట. ప్రపంచసృష్టి క్రమాన్ని తెలియజేసే గ్రంథాలలో 'భృగుసర్గం' అనే విస్తారమైన అధ్యాయం ఉంది. ఈ మహానుభావుని చరిత్ర అనంతమైనది. అందుచే ఇంతటితో దీన్ని ముగించుకుందాం.

### చ్యవన మహర్షి

శ్రీవత్స గోత్రప్రవర్తుకులు ఐదుగురిలో రెండవ వాడు చ్యవనమహర్షి. ఇతడు భృగుమహర్షి కుమారుడు. ఈ భృగుమహర్షి చరిత్రలోనే చ్యవనమహర్షి పుట్టుకను గురించి తెలుసుకున్నాం. పెరియాళ్వార్ల చరిత్రతో ఆండాళ్ చరిత్రముడిపడి ఉన్నట్లును, పరాశరమహర్షి చరిత్రలో వ్యాసమహర్షి చరిత్ర ముడిపడి ఉన్నట్లును, చ్యవనమహర్షి చరిత్ర భృగుమహర్షి చరిత్రతో ముడిపడియున్నది. ఆండాళ్ళకంటూ ఒక ప్రత్యేకత ఉన్నప్పటికీ ఆండాళ్ళు తనను "పెరియాళ్వార్ల పుత్రికగనే (పట్టర్ పిరాన్‌గోదై) చెప్పమన్నది. అలాగే, వేదవ్యాసుని గొప్పదనం వర్ణించవీలుకానిది గదా! అయినా, "వ్యాసః పారాశర్యః" అంటూ వేదం పరాశరుని సంబంధాన్నిపట్టి వ్యాసుని గొప్పతనాన్ని వర్ణించింది. భగవానుని అవతారమైన శ్రీరాముణ్ణి **"చక్రవర్తి త్తిరుమగళ్"** (దశరథ చక్రవర్తి కుమారుడు) అని పిలచి ఆనందిస్తారు ఆళ్వార్లు, పూర్వాచార్యులు. అలాగే, చ్యవనమహర్షి మహిమలకు కూడ ఏ కొరతాలేదు. అయినప్పటికి 'భృగుమహర్షి కుమారుడైన చ్యవనుడు' (చ్యవనో భార్గవః) అని పిలిపించుకోవడం వీరికి చాల ఇష్టం.

అందుచేతనే కావ్యాలు, ఇతిహాసపురాణాలలో చాలచోట్ల ఈ మహర్షి, భృగుమహర్షి పుత్రుడు అనే చెప్పబడ్డాడు.

శ్రీవత్సగోత్రానికి చెందిన వారంతా చ్యవన మహర్షివంశానికి చెందినవారే అవుతారు. అనగా చ్యవనమహర్షి శరీర సంబంధం కలవారన్నమాట. ఇది తెలియడం కోసమే, వారు 'చ్యవన' అనే పేరు తమ ఋషుల వరసలో రెండవపేరుగా చేర్చి చెప్పుచున్నారు. తద్ధిత ప్రత్యయం చేర్చినపుడు 'భృగు' శబ్దము 'భార్గవ' అని అయినట్లే 'చ్యవన' శబ్దము కూడ చ్యావన అని మారుతుంది. ఈ విధంగా అనేకవేల సంవత్సరాలు గడచినా మనవంశానికి చెందిన మూలపురుషులను విచ్ఛేదం లేకుండా స్మరిస్తూ వారి గొప్పతనాన్ని చెప్పడం, మన భారతీయ సంప్రదాయం. ఇందులో ఒక విశేషం కూడా ఉంది. ఒక ఋషిని చెప్పిన తరువాత ఆ ఋషి కుమారుణ్ణే రెండవ ఋషిగా చెప్పడం సంప్రదాయం కాదు. ఒక ఋషిగా చెప్పడం, లేదా, ముగ్గురునో, ఐదుగురునో చెప్పడం కూడ ఉన్నది. కాని ఇక్కడ, భృగువు, చ్యవనుడు–ఇద్దరూ వరుసగా చెప్పబడ్డారు.

చ్యవనమహర్షి హద్దులేని తేజస్సుచే ప్రభావితులై గోత్రంలోని మూలపురుషులు వరుసలో భృగుమహర్షి తరువాత కుమారుడైన చ్యవన మహర్షి పేరును చేర్చకుండా ఉండలేకపోయారు అని అనిపిస్తుంది.

పెద్దలను సేవించేటప్పుడు, సంధ్యావందనం మొదలైన కార్యక్రమాలు చేసేటప్పుడు అభివాదయే (నేను నమస్కరిస్తున్నాను) అనేపదం ప్రయోగిస్తూ ఉంటాం. ఇటువంటి మహాతేజస్స్వరూపులైన మునిశ్రేష్ఠుల పరంపరలో పుట్టిన నేను అని

మాటి మాటికి భావించినపుడు ఎంత ఆనందంగా ఉంటుంది! ఎంత గర్వించతగిన విషయం. చెడుపనులను విరమించు కోడానికి, మంచిపనులను పై పై చేస్తూ అభివృద్ధిలోకి రావడానికీ ఈ పెద్దల నామానుసంధానం అద్భుతమైన మంత్ర దణ్ణంలా పనిచేస్తుంది అనడంలో సందేహం లేదు. అతిశయోక్తే కాదు.

"మొలకలే తెలియజేస్తాయి, రాబోయే పంటమహిమ"ను అని అన్నట్లు చ్యవన మహర్షి విషయంలో యథార్థమైంది. తన తండ్రియైన భృగుమహర్షికి తాను ఏ విధంగాను తీసిపోను అని పుట్టిన క్షణంలోనే నిరూపించాడు చ్యవనుడు. ఇతడు తల్లిగర్భంలో ఉండగనే గదా, తన తల్లికి రాక్షసునివల్ల పెద్ద ఆపద సంభవించింది. నా గర్భంలో ఉన్న శిశువుతోపాటు నేను కూడ వీడిచేతిలో మరణించవలసిందేనా' అని పులోమ వణికిపోయింది. ఈలోగా ఒక అద్భుతం జరిగింది. యముడిని కూడా గజగజలాడించే యముడా వీడు' అని అనిపించే పిల్లవాడు పుట్టాడు ఆమెకు. ఆ పిల్లవాడు గొప్పతేజస్సుముందు నిలబడలేక ఆ రాక్షసుడు భస్మమయ్యాడు. తల్లీ, పిల్లవాడు క్షేమంగా బయటపడ్డారు.

ఇంతకంటె ఇంకొక అద్భుత విషయం. ఆ పిల్లవాని తేజస్సు రాక్షసుణ్ణి మాత్రం దహించింది. కాని, తల్లిని ఏమీ చేయలేదు. మహావిచిత్రమైన తేజస్సది. దోషమున్నచోట మాత్రమే తన ప్రభావాన్ని చూపి, దోషంలేనిచోట ఏ కష్టాన్నీ, దుఃఖాన్నీ కలిగించదు. నిప్పు, ఒకచోట కాల్చి మరొకచోట కాల్చకుండా ఉండదుగదా! అన్నిచోట్ల ఒకే విధంగా ఉంటుంది. ఈ అగ్ని (తేజస్సు) దీనికి విరుద్ధం.

నరసింహావతారంలో మాత్రమే ఇలాంటి అద్భుతం జరిగింది. నరసింహ (అజకియసింగర్) అవతార సమయంలో పిడుగులాంటి ధ్వనులతోటి, సింహగర్జనల తోటి ప్రత్యక్షమయ్యాడు భగవానుడు. మూడులోకాలు, ఆ భయంకర ఆకారాన్ని చూచి భయపడి పోయాయి. అంతా దిగ్భ్రాంతి చెందిపోయారు. కాని పెరుమాళ్ళ పాదాల దగ్గరే చిన్ని ప్రహ్లాదుడు నిర్భయంగా నిలబడి ఉన్నాడు.

భగవంతుడి ఆ పట్టరాని కోపావేశం ఆ పిల్లవాణ్ణి ఏమీ చేయలేదు. పైగా, అతనికి రక్షణగానే నిలచింది. ఈ విషయం బాగా తెలుసుకున్న ప్రహ్లాదుడికి ఇంక భయం ఎందుకు వేస్తుంది? తనకోసం (ప్రహ్లాదుడి కోసం) భగవంతుడు ఆరోపించుకున్న కోపంగదా అని వ్యాఖ్యాతలు వ్యామోహ పడతారు.

చ్యవనుడి శరీరంలో నుండి వచ్చిన తేజస్సుకూడ ఇలాగే విచిత్రంగా వ్యవహరించింది అని భావించవచ్చు.

⟹ ⟹ ⟹



## లంకానగరంలో వాయునందనుని సీతాన్వేషణ

# రామాయణంలో రమ్యగాథలు

- శ్రీ చెవుటూరి కుసుమకుమారి, విజయవాడ.

ఈ రావణుడు మహాతపశ్శాలి అయికూడా యుక్తాయుక్త విచక్షణ నశించి, సీత విషయమున కూడనిపని చేసినాడు. ఆ రామపత్నికి, ఆ ఉత్తమ ఇల్లాలికి ఎంతటి కష్టము తెచ్చిపెట్టినాడని మనస్సున దుఃఖము పొందినాడు. మరల సీతాన్వేషణకుపక్రమించి రావణ అంతఃపురములోని ఒక శయ్యాగారమును చూచినాడు. వజ్ర, వైడూర్య, మాణిక్య బంగారు నిర్మితమైన ఆసనములు, దంతపు నగిషీలు. విచిత్ర అన్తరణములు (తివాసీలు) అన్నీ యథాస్థానముల అలంకరించ బడివున్నవి. ఆ శయన గృహమున ఉత్తమజాతి పుష్ప అలంకృతమైన ఒక శ్వేత ఛత్రమున్నది. అది చంద్రసమాన కాంతి కలిగివున్నది. అక్కడ అగ్నికాంతి సమాన కాంతిగల ఒక బంగారు నిర్మిత ఉత్తమాసనమును హనుమ చూచినాడు. దానిమీద అనేక దివ్య సుగంధములు చల్లినారు. శ్రేష్ఠమైన సుగంధ ధూపములు వేసినారు. "ఆవికాజిన" అనే మెత్తని గొఱ్ఱె చర్మము (ఉన్ని)చేత చేయబడిన శ్రేష్ఠమైన కంబళ్ళను పరచినారు. వరపుష్పమాలికలను వరుసలు వరుసలుగా వ్రేలాడదీసి అలంకరించినారు. చేత వింజామరలు ధరించిన స్త్రీలు చుట్టును నిలచి వీచుచున్నారు.

"తస్మిన్ జీమూత సంకాశం
ప్రదీప్తోత్తమ కుణ్డలమ్
లోహితాక్షం మహాబాహుం
మహారజత వాససమ్"

మేఘమువంటి దేహముతో, ప్రదీప్త కుండలాలతో, ఎర్రని నేత్రాలతో శ్రేష్ఠమైన బంగారు వస్త్రములు ధరించినవాడూ మహాబాహువు

"లోహితేనాను లిప్తాఙ్గం
చందనేన సుగన్ధినా
సంధ్యారక్త మివాకాశే
తోయదం సతటిద్గణమ్"

గొప్ప సువాసనగల చందన చర్చితమైన శరీరము కలవాడూ, దివ్యాభరణములు ధరించినవాడూ, సంధ్యారుణరాగప్రసరిత గగన తలంమీద మెరుపులతో కూడిన గంభీర తోయదం (మేఘం) లా వున్నవాడూ

"వృతమాభరణైః దివ్యైః
సురూపం కామరూపిణమ్
సవృక్ష వన గుల్మాఢ్యం
ప్రసుప్త మివ మన్దరమ్"

వరాభరణ భూషితుడు, కామరూపి

కనుక అందమైన రూపముతో వున్నవాడూ రతిచేత అలసినవాడు, రాక్షస స్త్రీలకు ప్రియుడు, రాక్షస జాతికి సుఖము కలిగించువాడూ, పెద్దపెద్ద పొదలతోనూ వృక్షసమూహం తోనూ నిండిన మందర పర్వతంలా, మద్యపానమత్తుడై గాఢసుషుప్తిలో వున్న లంకేశ్వరుని హనుమన్తుడు చూచినాడు. దీర్ఘ నిశ్వాసాలతో బుసకొడుతున్న మహాసర్పంలావున్న ఆ రాక్షసేంద్రునికి దగ్గరగా వెళ్ళిన మహాకపివీరుడు కేసరితనయుడు కూడా ఒక్కసారి ఉలిక్కిపడి దూరముగా తొలగిపోయినాడు. ప్రక్కనే వున్న మెట్లమీదుగా ఒక వేదికనెక్కిన రామదూత రావణుని పరీక్షగా చూడసాగినాడు.

దివ్యమైన పర్యంకముమీద నిద్రించు చున్న ఆ రాక్షసేంద్రుడు పెద్ద సెలయేరులోని మదపుటేనుగువలే వున్నాడు. ఆ శయ్యమీద బారజావిన బాహువులు బంగారపు అంగదములతో ఇంద్రధ్వజంలా వున్నవి. ఆ బాహువులమీద ఐరావతపు దంతపు పోట్లచే (దేవతల యుద్ధములందు) పడిన గాయపు మచ్చలున్నవి. బలిష్ఠ భుజాలు అనేక యుద్ధాల్లో వజ్రాయుధపు రాపిడి, సుదర్శన ప్రహారములను పొందెనని తెలుపుచున్నవి. బలిష్ఠమైన బాహువుల అరచేతులు, గోళ్ళు, బొటన వ్రేళ్ళు ఉత్తమ లక్షణ లక్షితాలుగా వున్నవి. దృఢమైన సంధిబంధాలతో కోటగడియల్లా గుండ్రముగా ఏనుగు తొండాల్లా వున్నవి. అనేక సార్లు దేవ గంధర్వ యక్ష పన్నగ దానవులను బాధించి రోదింప చేసిన ఆ బాహువులు, ఉత్తమ స్త్రీలు మైపూతలుగా పూసిన రక్తచందనాది అతి శీతల సుగంధ ద్రవ్యములచేత మర్దింపబడి అలంకరించ బడివున్నవి. అవి మంధర పర్వతంమీద నిద్రిస్తున్న కోపఘూర్ణిత సర్పాల్లా వున్నవి.

ముత్యాలు పొదిగిన కనక మణిమయ కిరీటము ఇంచుక ప్రక్కకు వాలి విచిత్ర వర్ణాలతో ప్రకాశిస్తున్నది. అతడు అత్యుత్తమ పీతాంబరము ధరించి, తెల్లని పట్టు ఉత్తరీయము ధరించినాడు. సగము తెరచి నిద్రిస్తున్న నేత్రాలు రక్తంలా ఎర్రగా వున్నవి. మహాసర్పంలా బుసకొడుతున్న అతడు నల్లని కాటుకరాశిని తలపిస్తూవున్నాడు. నాలుగు దిక్కులా ప్రకాశించే నాలుగు దీపాలు వుండుటచేత ఆ దీపకాంతిపడి, చిమెరుపుల సముదాయంచేత జాజ్వల్యమానం అవుతున్న మేఘంలా, గంగా జలమధ్యంలో నిద్రిస్తున్న గజంలా భాసిస్తున్నాడా లంకేశ్వరుడు రావణుడు.

ఉత్తమాలంకారములు ధరించిన చంద్రముఖులైన రావణ భార్యలు ఆ రావణుని పాదాలచెంత అస్తవ్యస్తముగా నిద్రిస్తున్నారు. వాద్యవాదననిపుణులైన ఆ స్త్రీలు రాత్రి ఎవరెవరు ఏఏవాద్యములను వాయించినారో దానినే పట్టుకొని నిద్రిస్తున్నారు. అక్కడ ఒక శుభకరమైన శయ్యమీద ఉత్తమ సౌందర్యరాశి, సుభూషాంబరధారిణి, మిక్కలిగా అలంకరించుకొనినదీ, బంగారమువంటి మేనికాంతి చేత ఆభవనమునే ప్రకాశింప చేయుచున్నదీ, రావణుని హృదయేశ్వరీ, ఆ లంకేశ్వరుని అంతఃపురాధీశ్వరీ అయిన

మండోదరి నిద్రించుచుండుట చూచినాడు ఆ మహాబాహువైన హరిసత్తముడు హనుమ.

రూపలావణ్యాతిశయము, అలంకార శోభ, యౌవన కాంతిని బట్టి ఆమెయే సీత అని భావించి ఆనందాతిశయం పొందాడు.

**"ఆస్ఫోటయామాస చుచుమ్బ పుచ్ఛం**
**ననన్ద చిక్రీడ జగౌ జగామ,**
**స్తమ్భానరోహన్నిపపాత భూమౌ**
**నిదర్శయన్ స్వాం ప్రకృతిం కపీనామ్"**

సీతమ్మ కనుపించిందన్న ఆనంద పారవశ్యంలో తన జబ్బలు చరుచు కున్నాడు. ఆడి, పాడి స్తంభాలెక్కి దూకి, అటుఇటు గింగిరాలు తిరిగి, తనతోకను తానే ముద్దుపెట్టుకొని మహామేధావి అయిన ఆ హరివరుడు తన సహజ స్వభావాన్ని చాటుకున్నాడు.

ఇది హనుమ మదిలో మండోదరిని చూచి సీత అనుకొనుటచేత హఠాత్తుగా మెదిలిన ఒక భావన. కాని వెంటనే బుద్ధిశాలి అయిన కపిశ్రేష్ఠుడు తన బుద్ధిని స్థిరము చేసుకొనినాడు. స్వస్థచిత్తముతో మరల యోచన చేసినాడు.

**"న రామేణ వియుక్తా సా**
**స్వప్తు మర్హతి భామినీ,**
**నభోక్తుం నాప్యలంకర్తుం**
**న పానముపసేవితుమ్**

**అన్యం నరముపస్థాతుం**
**సరాణామపి చేశ్వరమ్**
**నహి రామసమః కశ్చి**
**ద్విద్యతే త్రిదశేష్వపి"**

శ్రీరామచంద్ర ప్రభువు లేకుండా సీత నిద్రించనే నిద్రించదు. అలంకరించు కొనదు. అన్నపానములు స్పృశించదు. రాముడు తప్ప పరపురుషుని దేవతల ప్రభువైన కానిమ్ము కన్నెత్తి చూడదు. అసలు రామ ప్రభువుకన్న మిన్న అయినవారు దేవతలలో మాత్రమెవరున్నారు కనుక! కనుక ఈమె రామపత్ని సీత కానేకాదు. మరి ఒకర్తుక అని భావించి పానశాలలో మరల సీతాన్వేషణ మొదలిడినాడు. ఆ పానశాలలో వేలాది స్త్రీలు సంగీతార్థములు చెప్పగలవారున్నారు. సరస సంభాషణ చతురులు వున్నారు. ఆ రాక్షసరాజు పానశాల సమస్త భోగ్యవస్తు నిలయమై మేలిరకపు ఆహారములు బంగారు వెండి కడవలనిండా అత్యధికముగా నిలువవుంచిన తేనె, చక్కెర మొదలైన ప్రకృతి పానీయములు, శ్రేష్ఠమైన మద్యాదులుండుట చూచినాడు.

స్నానమునకు ఉపయోగించు సుగంధద్రవ్యములు వివిధ వర్ణముల చందనముల పరిమళములు ఎల్లెడలా వ్యాపిస్తున్నది. ఆ అంతఃపుర స్త్రీలు కొందరు తెలుపు కొందరు మేలిమి బంగారు, కొందరు చామన చాయ కలిగి వున్నారు. అందరూ వసివాడిన పద్మాల్లా నిద్రాపరవశలై వున్నారు. విశాలమైన గోశాలలో గోగణం మధ్య నిద్రించే వృషభంలా వున్న రావణుని చూచినాడు. ఈవిధంగా ఆ పరాక్రమశాలి అయిన హనుమ రాక్షసేంద్రుని అంతఃపురం అంతా గాలించినా సీత కనుపించలేదు.

⟹⟹⟹



# శ్రీవిష్ణు మహాపురాణం

## 9వ అధ్యాయం

శ్రీ ఉ.వే. శ్రీమాన్ S.V. రంగరామానుజాచార్యస్వామి, రాజమండ్రి

### ఇంద్రకృత శ్రీస్తుతి

ఇంతవరకు శ్రీవిష్ణుమహాపురాణంలో పరాశరమహర్షి ఇంద్ర ముఖంగా ఆవిష్కరించిన శ్రీస్తుతిని (మూలాన్ని) అనుసంధానం చేశాం. ఇప్పుడు దాని తాత్పర్యాన్ని అనుసంధానం చేద్దాం. అది శ్రీసూక్తాది వైదిక మంత్రరహస్యాన్ని ఆవిష్కరించే స్తుతి. "సమస్త లోకాలకు జనని అయిన లక్ష్మిని నమస్కరిస్తున్నాను. ఈమెకు 'శ్రీ' అని పేరు. మన సంప్రదాయంలో శ్రీ శబ్దానికి ఎన్నో అర్థాలను పెద్దలు అనుగ్రహించారు.

1 **శృణోతి ఇతి శ్రీః** :- మనం ఆర్తితో చేసిన మనవులను ఓపికగా వింటుంది అమ్మ కనుక ఆమె **శ్రీః**.

2 **శ్రావయతి ఇతి శ్రీః** – తాను వినడమే కాక, తనపతియైన నారాయణుడు వినేలా ప్రేరేపిస్తుంది కనుక శ్రీః.

3 **శ్రయంతే ఇతి శ్రీః**- తనను ఆశ్రయించిన వారిపట్ల స్వామి అనుగ్రహం అప్రతిహతంగా పడేలా స్వామి యొక్క ఆనుకూల్య సాధనకై ఆయనను నిరంతరం ఆశ్రయించి ఉంటుంది అమ్మ.

4. **శ్రాయయతి ఇతి శ్రీః** - మనందరం స్వామిని ఆశ్రయించేలా బుద్ధి ప్రబోదనం చేసి ఆశ్రయింపచేస్తుంది అమ్మ.

5. **శ్రీయతే ఇతి శ్రీః** - మనందరిచేత పురుషకారసాధికగా ఆశ్రయింపబడుతుంది అమ్మ.

6. **శృణాతి ఇతి శ్రీః** మన పాపాలను నశింపజేస్తుంది కనుక **శ్రీః**.

ఇలా ఒక్క '**శ్రీ**' శబ్దము బహువిధార్థాలను ఇస్తున్నది. కనుక ఆమెను 'శ్రీః' అన్నారు. ఆమె 'ఉన్నిద్ర పద్మాక్షి' అంటే వికసించిన పద్మాలవంటి కన్నులు కలది. స్వామి 'పద్మాక్షుడు' ఆయనకు దీటుగా ఈమె కూడా పద్మాక్షియే. భగవద్రామానుజులు శరణాగతి గద్యలో భగన్నారాయణాభి మతాను రూప స్వరూప రూప విభ వైశ్వర్యాలు అమ్మకు ఉన్నాయని అన్నారు. అంటే తన భర్తకు దీటుగా తాను స్వరూప- రూప- గుణవైభవాలు అమ్మకూడా కలిగి ఉన్నదన్నమాట. ఇంతటి అనురూప్యంగా

కలది కనుకనే స్వామి ఈమెను తన వక్షః స్థలమే నిత్యనివాసంగా చేశాడు. ఈమె పద్మనిలయ. పద్మాన్ని హస్తంలో ధరిస్తుంది. పద్మపత్రాలవలె విశాలాలైన కన్నులుకలిగి ఉంది. ఇంతటి విశాల నయనాలు న్నందుకు ప్రయోజనం స్వామిని తన నేత్ర సౌందర్యంతో ఆకట్టుకోవడమేకాక, స్వాశ్రితులబాధలను పూర్తిగా చూడగలదని కూడా అభిప్రాయం. పద్మమువలె నిత్య స్మితవికసిత వదనయైన తల్లి కనుకనే 'పద్మనాభ ప్రియ' అయింది.

అమ్మా! నీవే అణిమాదిసిద్ధివి. నీవు స్వధవు – నీవే స్వాహా రూపిణివి. నీవే లోకపావని మైన 'సుధ'వు. సంధ్యాకాలం, రాత్రి, వెలుగు, ఐశ్వర్యము, బుద్ధి, శ్రద్ధ, సరస్వతి అన్నీ నీవే. నీవే యజ్ఞవిద్యవు. యజ్ఞ స్వరూప నిరూపకమైన శ్రౌత సూత్ర – ధర్మమీమాంసాది, యజ్ఞోపకారకమైన సర్వజ్ఞానము యజ్ఞ విద్యయే. కర్మ స్వరూప నిరూపక విద్య అన్నమాట– 'మహావిద్య' అంటే 'జ్ఞాన'మని కొందరి వ్యాఖ్యానం. విశ్వరూపాదుల ఉపాసనమని శ్రీధరీయ వ్యాఖ్య. ఇంద్రజాలాది కుహకజ్ఞానమే మహావిద్య అని విష్ణుచిత్తీయం. మహావిద్య అంటే బ్రహ్మవిద్య అని దత్తాత్రేయవ్యాఖ్య. ఇది సరికాదు. 'ఆత్మవిద్య' అనే పదంతో పునరుక్తి కలుగుతుంది కదా! ఆయా దేవతోపాసనానుకూలమైన మంత్ర విద్యనే మహావిద్య అనాలి. గుహ్యవిద్య అంటే తంత్ర విద్య. అనగా యంత్ర స్వరూప ప్రతిబద్ధ మైన దైవతాన్ని ఉపాసించే పద్ధతి. ఇది ద్వాదశాక్షరవిద్య అని శ్రీధరవ్యాఖ్య. "గుహ్య విద్యా=మంత్ర వాద విశేషః" అని విష్ణు చిత్తీయవ్యాఖ్య. ఇక 'ఆత్మవిద్య' అనే పదంలోనే ఇది ఆత్మ సంబంధమైన విద్య అని తెలుస్తున్నది కదా! ఇలా యజ్ఞవిద్య, మహావిద్య, గుహ్యవిద్య, ఆత్మవిద్య అని విభిన్నాలైన విద్యలన్నీ అమ్మయే. కనుకనే తాను స్వాశ్రితులకు వలసిన వివేకాన్ని స్వామిద్వారా అనుగ్రహింపజేసి "విముక్తి" అనే ఫలాన్ని ఇప్పిస్తుంది. అమ్మకు స్వయంగా ముక్తిఇచ్చే అధికారం ఉన్నదా? లేదా? అని సంప్రదాయజ్ఞులు విశేషచర్చ చేశారు– తానిచ్చినా, ఇవ్వకున్నా, స్వామికి 'సిఫారసు' చేసి ఇప్పిస్తే తానిచ్చినట్లేకదా! కనుక ఆమె "విముక్తి ఫలదాయిని" అవడంలో అభ్యంతరం ఏమీలేదు–

ఇక లోకోపకారకములైన లౌకిక విద్యలూ కొన్ని ఉన్నాయి. అవి. 1). ఆన్వీక్షికి– తర్కవిద్య (Logic) 2. త్రయి– ఉపనిషద్భాగం విడచి కేవల మంత్ర బ్రాహ్మణముఖ్యమైన వేదత్రయం, 3). వార్త– కృషి–గోరక్ష–వాణిజ్యం, మొదలైన పరిజ్ఞానం అని చిత్సుఖీయ వ్యాఖ్య. శిల్ప శాస్త్రాయుర్వేదాదికమని శ్రీధరీయ– దత్తాత్రేయవ్యాఖ్యలు, 4). దండనీతి–

అర్థశాస్త్రం (సామాద్యుపాయ ప్రతిపాదక మైన రాజనీతి కూడా ఇందులోనే చేరుతుంది) ఇవన్నీ కూడా అమ్మయే. అంతేకాదు. సౌమ్య రూపాలతోను, రౌద్ర రూపాలతోను ఈ జగత్తంతా అమ్మ వ్యాపించింది. వ్యాప్తి సహజంగానే సిద్ధిస్తుందని ఒక సంప్రదాయం. తనకున్న ధర్మభూతజ్ఞానం ద్వారానే అమ్మకు జగద్వ్యాప్తి అని మరొక సంప్రదాయం.

అమ్మా! కేవల యోగిమంత్రధ్యేయమైన, స్వామియొక్క సర్వయజ్ఞాత్మకమైన దేహాన్ని నాకు తప్ప ఇంకెవ్వరు ఆశ్రయించి వక్షః స్థలాన్ని అధిష్ఠించి, ఉండగలరా? అమ్మా, నీవు పరిత్యజించినప్పుడు నశించినది అయిన ఈ జగత్తు మళ్ళీ ఇప్పుడు నీచేతనే సముద్ధరింప బడింది పునరుజ్జీవింప బడింది. భార్య- పుత్రులు - మా అగారులు, మిత్రులు, ధనధాన్యాధికం, ఇవన్నీ నీవు నీకటాక్షాన్ని నిత్యం ప్రసరింపజేస్తేనే ఉంటాయి తప్ప వేరుకాదు. మా శరీరాల్లో ఆరోగ్యంగాని, మా ఐశ్వర్యంగా, మా శత్రువుల వినాశనంగాని, మా సుఖంగాని అమ్మా! ఇవన్నీ నీ కటాక్షం పడినప్పుడు సులభాలే కదా!

అమ్మా! నీవే సకల జగన్మాతవు, శ్రీహరి – తండ్రి. నీవు, విష్ణువు ఇరువురూ ఈ సమస్తాన్నీ వ్యాపించి ఉన్నారు. "త్వయైతదిష్ణునాచాంబ! జగద్ వ్యాప్తం చరాచరమ్!" అనే వాక్యానికి శ్రీవైష్ణవ సంప్రదాయంలోని రెండు అవాంతర సంప్రదాయాల్లో వేరు వేరు సమన్వయాలున్నాయి. అమ్మ విభువని కొందరి భావన. అణువని కొందరి భావన. విభువని అంగీకరించిన వారి పక్షంలో ఈ జగత్తంతటా ఆమె వ్యాపించడంలో అభ్యంతరంలేదు. అయితే, జీవుల్లా ఆమెకూడా అణుస్వరూపవే అని అంగీకరించిన పక్షంలో- జీవులకులాగానే అమ్మకు ధర్మంగా ఏర్పడి ఉన్న జ్ఞానం జగత్తులో వ్యాపించి నందువల్లనే అమ్మకూ వ్యాప్తికల గొన్నదని సమన్వయించడంవల్ల ఈ శ్లోకభాగం అన్వయిస్తున్నది. ఇలా అమ్మను స్తుతిస్తూ, మా శరీరాన్ని, కళత్ర- సుహృదాదులను ఎప్పుడూ విడచి వెళ్ళవద్దని ప్రార్థించడం జరిగింది.

అమ్మ అనుగ్రహిస్తేనే ఈ జీవన కోటిలో శౌచ సంతోషాదులు ఉంటాయని, లేకపోతే ఉండవని నిష్కర్షించడం జరిగింది. అమ్మచేత అవలోకింపబడినవారు, వెంటనే, సకల గుణశోభితులై లోకమాన్యతను పొందుతారని చెప్పబడింది.

ఒక శ్లాఘింపదగినా, ఒకడు గుణ వంతుడైనా, ఒకడు కులీనుడైనా బుద్ధిమంతుడైనా, శూరుడు, జగద్విక్రాన్త

స్వభావుడు అయినా ఇవన్నీ అమ్మ, కటాక్షించినప్పుడేనని, ఎప్పుడైతే ఆమె అగ్రహించి తన దృష్టిని ప్రసరింప జేయకపోతే శీలాదులెన్ని ఉన్నా అవేవీ రాణించదని వ్యర్థమైపోతాయని, కనుక తల్లి– పరాఙ్ముఖ కాకుండా అనుగ్రహించేలా ప్రతివ్యక్తి తన నడవడిని తీర్చిదిద్దుకోమని స్తోత్రకారుడంటాడు. అమ్మ యొక్క గుణగణాలను సాక్షాత్తు బ్రహ్మ కూడా వర్ణించలేడు "న తే వర్ణయితం శక్తా గుణాన్ జిహ్వాపి వేధసః" అనే వాక్యంలోని భావాన్నే భగవద్యామునులు తమ శ్రీస్తుతిలో ఆవిష్కరించారు. అమ్మా! మమ్మల్ని ఎప్పుడూ విడచిపెట్టవద్దని ప్రార్థించి తనస్తుతిని ముగించాడు ఇంద్రుడు.

ఆ తరువాత, ఇంద్రుని స్తుతిచే ప్రీతిగొన్న మహాలక్ష్మి దేవతలందరూ వింటూ ఉండగా, సర్వభూతాలలోనూ నెలకొనివున్న ఆతణ్ణి ఇలా అన్నది. "ఓ ఇంద్రా! నీవు చేసిన ఈ స్తోత్రంచేత నేను పరితుష్టనైనాను. నీకు వరమీయాలని వచ్చాను. ఇక ఇష్టమైన వరాన్ని కోరుకో" అని. ఇంద్రుడు ప్రతి సమాధానించాడు.

"అమ్మా! నేను వరార్హుడనైతే, నీవు వరమీయదలచినట్లైతే ఈ మూడు లోకాలను నీవు ఏ దశలోను విడచి ఉండవద్దనేదే నేను కోరే ఉత్తమమైన వరం.

ఈ స్తోత్రంచేత ఎవ్వడు నిన్ను స్తుతిస్తాడో అటువంటివాడిని నీవు ఎప్పుడూ విడిచిపెట్టవద్దు. ఇదే నాకు రెండవ వరం–" అని, ఈ మాటలు విన్న లక్ష్మీదేవి ఇలా ప్రతిసమాధానించింది. "ఓ వాసవా! మూడు లోకాలను నేను విడచిపెట్టను. నీ స్తోత్రారాధనం చేత పరితుష్టి చెందిన నేను నీకే వరాన్నిస్తున్నాను. ఎవ్వడు ఉదయం, సాయం ఈ స్తోత్రంచేత నన్ను స్తుతిస్తాడో వానికి నేనెప్పుడూ పరాఙ్ముఖను కాను". ఇలా అమ్మ ఇంద్రునికి వరం ఇచ్చింది

⟹ ⟹ ⟹



**శ్రీమాన్ వేపూరి ఈశ్వర రఘురామ కృష్ణప్రసాద్ (రాఘవ)**

**(ది. 27.9.2004) సంవత్సరీక సందర్భంగా:** వీరి కుటుంబ సభ్యులు శ్రీస్వామివారి శిష్యులు. వీరు గుంటూరు వాస్తవ్యులు. వీరి కుటుంబ సభ్యులు భక్తినివేదనకు కైంకర్యము సమర్పించారు. వీరి కుటుంబానికి శ్రీస్వామివారి మంగళాశాసనాలు అందజేస్తున్నాము.



# బదరికాశ్రమంలో పునర్నిర్మించే సత్సంగసదనమునకు కైంకర్యములు సమర్పించిన దాతలు

**శ్రీమతి పి. రమణమ్మగారు-విజయనగరం ద్వారా:**

**జీవిత సభ్యులు :**

విజయనగరం:

శ్రీమాన్ పి. సీతారామరాజు; శ్రీమాన్ డి.ఎల్. సత్యన్నారాయణరాజు; శ్రీమాన్ కె.వి. దయానంద్‌కుమార్; శ్రీమతి సరోజనమ్మ;

**అభిమానులు :**

శ్రీమతి నడింపల్లి నారాయణమ్మ-గంట్యాడ; శ్రీమతి ఎన్.వి. కేశవనారాయణ-విజయనగరం.

**ఆఫీస్ ద్వారా:**

**రాజపోషకులు:**

**శ్రీమాన్ ముప్పానేని రామారావు& హైమవతి-భువనపల్లి**

**అభిమానులు:**

శ్రీమాన్ డి. మధు-పిడుగురాళ్ళ; శ్రీమాన్ కె. రామరాజు, సుభద్రమ్మ-విప్పర్రు; శ్రీమాన్ కె. సూర్యకాంతమ్మ-పెదపుల్లేరు; శ్రీమాన్ పి. గోపాలరాజు-ఆలవరం; శ్రీమాన్ పి. సత్య నారాయణరాజు, విజయ-ఆలవరం; శ్రీమాన్ పి.నరసింహరాజు, సూర్యవతి-ఆలవరం; శ్రీమాన్ పి.రామకృష్ణరాజు-ఆలవరం; శ్రీమాన్ పి. సుబ్రమణ్యరాజు-ఆలవరం; శ్రీమాన్ ఎన్.వి.ఎస్. నాగరాజు-భీమవరం; శ్రీమాన్ కె. కిషోర్‌రాజు-భీమవరం; శ్రీమాన్ పి. వెంకట రామ కృష్ణరాజు-సీతమ్మధార; శ్రీమాన్ రుద్రరాజు జగపతిరాజు-సీతమ్మధార; శ్రీమాన్ పి. సత్యనారాయణరాజు-ఆలవరం; శ్రీమాన్ వి. వెంకటరాజు-భీమవరం; శ్రీమతి వి. రమ బంగార రోహిణి-భీమవరం; శ్రీమాన్ రుద్రరాజు శ్రీరామరాజు-భీమవరం; శ్రీమాన్ రుద్రరాజు శ్రేష్ఠ-భీమవరం; శ్రీమాన్ ఎమ్. సుజాత-హైదరాబాద్; శ్రీమాన్ ఎ. నరసింహాచార్యులు-కోరుకొండ; శ్రీమాన్ ఎన్.వి. నాగానందం, లలిత-హైదరాబాద్; శ్రీమాన్ కె. ప్రసన్న-కొవ్వూరు; శ్రీమతి పి. రుక్మిణమ్మ-చీరాల; శ్రీమాన్ కాకి సత్యనారాయణ మూర్తి-కామవరపుకోట; శ్రీమాన్ పి. ఉమామహేశ్వర రావు-కుప్పెనకుంట్ల; శ్రీమాన్ కె. మనోహర గుప్త, పంకజవల్లి-పటమట; శ్రీమాన్ బి. సుబ్బ రామయ్య-బెంగుళూరు; శ్రీమాన్ ఎన్. నరసింహాచార్యులు-కొండపల్లి; శ్రీమతి ఎ.పి. సరోజనమ్మ-బెంగుళూరు; శ్రీమాన్ కె. హర్షవర్ధన్, వసుంధర-దిల్‌షుక్‌నగర్; శ్రీమాన్ ఎస్. సీతారామాంజనేయులు-అద్దంకి; శ్రీమాన్ ఎస్. మంగరత్నం-కంచరపాలెం; శ్రీమాన్ డి. అప్పారావు-గోపాలపట్నం; శ్రీమాన్ వేగుంట రాంప్రసాద్-విజయవాడ; శ్రీమాన్ ఎమ్. రమేష్-హైదరాబాద్; శ్రీమాన్ జి.శ్రీధర్, విజయ-గూడవల్లి; శ్రీమాన్ ఎమ్. రవికుమార్, లక్ష్మి, సునీత-కొత్తపేట; శ్రీమాన్ ఎ. సాంబ శివరావు-విజయవాడ; శ్రీమాన్ జిల్లా శ్రీనివాస్, నీలిమ-సిద్ధిపేట; శ్రీమాన్ ఎస్. వేణు గోపాలరావు, అమ్మాజి-విజయవాడ; శ్రీమాన్ సిహెచ్. రామకుమార్, స్వాతి-విజయవాడ; శ్రీమాన్ పి. రామకృష్ణ, నిర్మల- సికింద్రాబాద్; శ్రీమాన్ ఎ. బాలనాగేశ్వరరావు, పద్మ-సికింద్రాబాద్; శ్రీమాన్ ఎమ్. బలరామకృష్ణ,

జయశ్రీ–హైదరాబాద్; శ్రీమాన్ ఎమ్ రమేష్, వాణి–విజయవాడ; శ్రీమాన్ జి.వి. శైలేష్ కుమార్–విజయవాడ; శ్రీమాన్ జి. మోహన్, అరుంధతి–విజయవాడ; శ్రీమాన్ జి.వి. రమణ–భిలాన్‌పూర్; శ్రీమాన్ జి.ఎల్. నరసింహాచార్యులు–ప్రొద్దుటూరు; శ్రీమాన్ ఎమ్.వి. రవిశర్మ–ప్రొద్దుటూరు; శ్రీమాన్ ఎస్. వెంకటకృష్ణారెడ్డి–చెన్నూరు; శ్రీమాన్ జె.సత్యనారాయణరావు–అనంతపూర్; శ్రీమాన్ రామసుబ్బారెడ్డి–ప్రొద్దుటూరు; శ్రీమాన్ కె. వెంకటలక్ష్మమ్మ–ప్రొద్దుటూరు; శ్రీమాన్ ఆర్.ఎన్.నరసింహారెడ్డి–ప్రొద్దుటూరు; శ్రీమాన్ పి. వీరనారాయణరెడ్డి–ప్రొద్దుటూరు; శ్రీమాన్ కె. నాగేశ్వరరావు–ఖమ్మం; శ్రీమాన్ పి. జీవన్‌కుమార్, లలితాదేవి–అవనిగడ్డ; శ్రీమాన్ కె. సత్యానందం–ఖమ్మం; శ్రీమాన్ కె. కృష్ణార్జునరావు–ఖమ్మం; శ్రీమాన్ బి. లక్ష్మయ్య, సీతారత్నం–ఖమ్మం; శ్రీమాన్ కె.బుచ్చిరామ రంగయ్య–ఖమ్మం; శ్రీమాన్ ఎన్.ఎ. జయపాలన్, జయలక్ష్మి–కడప; శ్రీమాన్ బి. త్రినాథ్‌రావు, ధనలక్ష్మి–మోదుగగూడెం; శ్రీమాన్ హెచ్.వి. సత్యనారాయణమూర్తి–రేలంగి; శ్రీమాన్ ఎ.వి. సీతారమశాస్త్రి–చిల్లంగి; శ్రీమాన్ పొల్లూరి పద్మావతిదేవి–విజయవాడ; శ్రీమాన్ పి. హనుమాన్, అనంతమ్మ–చిలకలూరిపేట; శ్రీమాన్ అన్నపూర్ణమ్మ–భీమవరం; శ్రీమాన్ ఎస్. పరమేశ్వరిదేవి–ముత్యాలంపాడు; శ్రీమాన్ కె. వెంకట ద్వారకావాసాచార్యులు–విశాఖపట్నం; శ్రీమాన్ కె. వెంకట మురళికృష్ణమోహన్–వైజాగ్; శ్రీమాన్ టి. నరసింహస్వామి–లింగన్నపేట; శ్రీమాన్ టి. సత్యనారాయణ–హైదరాబాద్; శ్రీమాన్ జి. మురళిధరశర్మ–కరీంనగర్; శ్రీమాన్ పి. సులోచన సాంబయ్య శర్మ–కట్టారాంపూర్; శ్రీమాన్ ఎమ్.బుచ్చయ్య–రాజమహేంద్రి; శ్రీమాన్ ఎమ్. శ్రీదేవి–రాజ మహేంద్రి; శ్రీమాన్ వై. శ్రీనివాస కృష్ణకిషోర్, నీరజ–హైదరాబాద్; శ్రీమతి టి. వరలక్ష్మి–విజయవాడ; శ్రీమాన్ టి. సూర్యనారాయణ–విజయవాడ; శ్రీమాన్ ఎస్.సత్యనారాయణ, విజయవాడ; శ్రీమాన్ ఎన్. రామకృష్ణారావు, సీతామహలక్ష్మి–భీమవరం; శ్రీమాన్ ఎ. పార్థసారథి– విజయవాడ; శ్రీమాన్ టి.వి. హనుమంతరావు–విజయవాడ; శ్రీమాన్ ఎన్. రామరాజు, శైలజ–జక్కం; శ్రీమాన్ ఎస్. విశ్వానందం–శ్రీకాకుళం; శ్రీమాన్ సిహెచ్. సుబ్బరాజు–గణపవరం; శ్రీమాన్ బి. చలపతి–కొత్తూరు; శ్రీమాన్ సిహెచ్. కృష్ణ మూర్తి–ఒంగోలు; శ్రీమాన్ ఎమ్. భాస్కరరెడ్డి, కమలకుమారి–ఆల్వాల్; శ్రీమాన్ వి. ధర్మారెడ్డి–అల్వాల్; శ్రీమాన్ ఎమ్. పెంచలరెడ్డి, వెంకటసుబ్బమ్మ–ఆల్వాల్; శ్రీమాన్ వి. మాణిక్యాలరావు–భీమవరం; శ్రీమతి ఎన్. శ్రీదేవి–భీమవరం; శ్రీమాన్ ఎన్. నటరెడ్డి–కర్నూలు; శ్రీమాన్ సి.విజయ కుమార్, అరుంధతి–న్యూఢిల్లీ; శ్రీమాన్ సి.సమీర–న్యూఢిల్లీ; శ్రీమాన్ ఎమ్. సౌజన్య– కర్నూలు; శ్రీమాన్ టి. జయలక్ష్మి–సికింద్రాబాద్; శ్రీమాన్ గోపవరం శ్రీనివాసరెడ్డి– హైదరాబాద్; శ్రీమాన్ పి. శివప్రసాద్– హైదరాబాద్; శ్రీమాన్ సిహెచ్. రామమూర్తి– భీమవరం; శ్రీమాన్ ఎన్. రామకృష్ణ– గణపవరం; శ్రీమాన్ పెరుమాళ్ళ నరసింహ మూర్తి–భీమవరం; శ్రీమాన్ వి. వెంకట సత్యవతమ్మ–బోయనపల్లి; శ్రీమాన్ కె.వి. శేషారత్నం–చిలకపూడి; శ్రీమాన్ వి. శేషారత్నం–పొన్నూరు; శ్రీమాన్ జి. వెంకట భాష్యకారాచార్యులు–హైదరాబాద్;

# ఆంధ్రభారతం అందించిన రాజధర్మాలు

మధుర కవి శ్రీమాన్ కోగంటి వెంకటాచార్యస్వామి- ముత్తుపల్లి

కులము గలవాఁడు, శౌర్యము
గలవాఁడును, నధికసేనగలవాఁడును,
భూతలమున 'రా'జనునామము
విలసిల్లఁగ దాల్చు; మూఁడువిధముల పేర్మిన్ (ఆదిపర్వం-షష్ఠాశ్వాసం)

"రాజు" అనబడేవాడు మూడు లక్షణాలు కలిగివుండాలి. సత్కులీనుడై వుండాలి. శౌర్యం కలిగి వుండాలి. అధికమైన సైన్యం కలిగివుండాలి.

రాజు దండనీతిననుసరించి తగిన దండన విధించేవాడుగా వుండాలి. తన పాలనలో ప్రజలు ధర్మం తప్పకుండా వుండేలా చూడాలి. తాను మంచి వృత్తం (నడవడి)తో వుండి ప్రజలను రక్షిస్తూ వుండాలి. ఏ వర్గమునకు చెందినవారైనా అందరనూ వారి వారి ధర్మాలనతిక్రమించనీయకుండగ, తన దండనకు వారు భయపడేలా చేయాలి. రాజు శత్రువులూ–మిత్రులూ లేనివాడుగా వుండాలి. అందరియందూ సమభావంతో ప్రవర్తించాలి. అలానే శిక్షించాలి.

ఇది తగును. ఇది తగదు అనియెరుగక ఇష్టం వచ్చినట్లుగ ప్రవర్తించేవాణ్ణి అలాంటివాడు తన గురువయినా అందరూ గుర్తించేలా రాజు శాసించాలి. రాజు కొడుకులు, మనుమలు, అన్నదమ్ములు, స్నేహితులనక ఆజ్ఞాధిక్కారం చేసిన వాడిని కోపించాలి. దేశక్షేమం కోసం అవసరమయితే శిక్షించాలి.

'జనపాలు'డంటే జనులందరకూ గౌరవింపదగినవాడు. సజ్జనులయినా, మునులయినా రాజశాసనాన్ని అనుసరించి తలవంచక తప్పదు. రాజదండాన్ని గౌరవించాలి. పేదసాదకు, వేదములకు, తాపసులకు–వేయిమాటలేల? సమస్తాదిత్యులకు కూడ రాజదండంతోనే గదా బ్రతుకు.

దండార్హులైనవారల
దండింపకయున్నఁజువ్వె ధాత్రి విభునా
ఖండల సన్నిభునైన ప్ర
చండపు కిల్బిషముపొందు (జగతీనాథా) (శాంతిపర్వం-ప్రథమాశ్వాసం)

దండించదగినవారిని దండించక వదిలితే యింద్రుడంతటి వాడయినా ఆ రాజుకు ఘోరపాపం వస్తుంది. ఆర్జవము, సత్యములు కలిగి ఏడు ప్రకృతులను నడపాలి. దండనీతి తగురీతి పాటిస్తే అది అంతటికీ రక్షణ అవుతుంది.

ఏనుగు అడుగులో అన్ని జంతువుల అడుగులూ (తక్కువై కలిసిపోయినట్లు క్షత్ర ధర్మానికి లోబడి చేసే యజ్ఞాలూ, వేదాలూ, శుభ కృతులూ సత్ఫలాన్నిస్తాయి. రాజు దండనీతి వర్జిస్తే భూమి చెడిపోతుంది. సంస్కారం నశించిపోతుంది. ప్రజలకు చేటు కలుగుతుంది. రాజు ఉత్తముడయితే యీ ధర్మాలన్నీ బ్రతుకుతాయి. కాబట్టి రాజు సర్వోత్తముడు. రాజధర్మమే గొప్పది. ధర్మదేవత అంటే వేరేలేదు. రాజధర్మమే ఆ దేవత.

రాజు దక్షుడై దండనీతి ప్రవర్తింపజేయకపోతే సన్న్యాసులు మార్గం తప్పి ప్రవర్తిస్తారు. ప్రజలు ఒకరికొకరు ధనధాన్య పశు భూములనూ, కాంతలనూ అపహరించుకొంటారు. ఆ పాపమంతా ఆ రాజుకు అంటుతుంది. కాబట్టి రాజు 'దండించడం పాపం' అనుకోకూడదు. రుద్రుడూ, కృష్ణుడూ, కుమారస్వామి దుర్మార్గులయిన వారిని వధించారు గదా! ధర్మోద్ధరణ కొరకు వర్తింపచేసే అర్థకామాలు దూష్యాలు కావు. వాటివల్ల ధర్మసిద్ధి కలుగుతుంది. శుద్ధమయిన వ్యవహారం ప్రజలందరికీ ఇష్టాన్ని కలిగిస్తుంది. అదే రాజుకు అతిశయమయిన ధర్మాన్ని, కీర్తినీ సంపాదించి పెడుతుంది. సత్యప్రియులూ, ధర్మమూర్తులూ అయిన బ్రహ్మవేత్తలూ, రాజూ కలిసి 'త్రాసు' (తూనిక-కాట)వంటి మనస్సులతో నిష్పక్షపాతంగా తీర్పు చెబితే; ధనాసక్తితో ధనికుల పక్షాన తీర్పు చెప్పకుండ, దారి తప్పకుండ న్యాయం చేసి శిక్షిస్తే రాజునకూ దేశానికీ, సమాజానికీ క్షేమం. పక్షపాతంతో తీర్పు చెబితే డేగను చూసిన ఇతరమైన చిన్న పక్షుల్లాగ ప్రజలు రాజు కనబడితే చాలు-చెల్లాచెదురౌతారు.

'దండనీతి' ముఖ్యం అన్నాం కదా' అని మావటివాడేనుగునెక్కినట్లు రాజు ప్రజలనెత్తిన కూర్చున్నట్లు ప్రవర్తిస్తే- క్రింది ప్రజ ఓర్పు నశించి వ్యతిరేకిస్తారు. రాజు వసంతఋతువులో సూర్యుడిలాగ తగుమాత్రంగా ఆలనా, దండపాలనా చూపిస్తే ప్రజలు మంచిప్రవర్తనలో వుంటారు. అలా వుంచేవాడు ఆ రాజే కాబట్టి దండనవిధించేముందు చక్కగా పరీక్షించి, విశుద్ధబుద్ధితో విధించాలి. తనకు తోచినట్లు దండం విధించకూడదు. అలా ప్రజలను బాధించకూడదు.

దండమంటే....

నల్లరంగులో (నల్లకలువరంగులో) నాలుగు కోరలతో, నాలుగు చేతులతో, రెండు నాలుకలతో, ఎనిమిది పాదములతో, శంకువంటి చెవులతో, అనేక నేత్రాలతోనూ వుంటుంది. ఇంకా..... కత్తి, గద, శక్తి, ధనస్సు, ముసలము, చక్రము, ప్రాసము, బాణము, తోమరము, త్రిశూలము, గొడ్డలి మొదలయిన ఆయుధాలతో పాపాత్ములను అనేక విధాల చెండాడి, మంచివారికి ప్రేమకలిగించే ఒక శక్తి. వ్యవహార తంత్రమూ, సంగుప్త మంత్రమూ, దండనీతి, మొదలయిన అనేక రాజనీతులు, దండనీతులు దండమై-అందు విష్ణుడావహించి దండింపచేస్తాడు. ఇలా అనేకుల నామాలు దండనీతి యందున్నాయి. పురుషుడు, ఈశ్వరుడు, భూతాత్మకుడు, జీవుడు, ప్రాణుడు, అక్షయుడు, సత్త్వమూ అనే యేడు పేరులు వున్నాయి. ఎనిమిదవ 'ప్రజాపతి' అనేది దండదేవుని పేరు.

రాజు దండనీతి ననుసరిస్తున్నా కామక్రోధాలను దరిజేరనీయరాదు. శత్రువుల పనులూ విధానాలూ తెలుసుకుంటూ, తన దేశంలోని పురపరివార ప్రజాకృత్యాలను గమనించాలి. గూఢచారులను కన్నులుగా ప్రవర్తిస్తూ వుండాలి. సత్యమును అవగతం చేసుకోవాలి. అలా ప్రవర్తించే రాజులగతి యెంతగొప్పదో చూడండి!

**ధరణీశా! నృపధర్మముత్తమము సద్ధర్మంబులందెల్ల, నే**
**తెరువున్ రా జరయంగఁగాదె తగ సిద్ధింబొందుఁగామంబుఁగ్రో**
**ధరయంబున్ మగిడించి దండము సమత్వవ్యాప్తిఁజెల్లించుచున్**
**ధరఁ బావించిన రాజువొందుగతిఁబొందన్ శక్యమే యేరికిన్?** (శాంతిపర్వం-ద్వితీయం)

ధర్మాలన్నింటిలో రాజధర్మమే ఉత్తమం. కామక్రోధాలు తన వశంలోవుంచుకొని సమమైన ధర్మదండనచేస్తూ పరిపాలించిన రాజు ఎవ్వరికీ శక్యం కాని పదవిని పొందుతాడు. అంతయెందుకూ? వేదపురాణాదుల్లోనూ, అనేక మహాపండితుల వాక్యాల్లోనూ తెలుస్తుంది. విమర్శించి చూస్తూ 'ఎవరైనా రాజుకంటె తక్కువే' అనీ,! ఎన్ని ధర్మాలయినా ధర్మంగా ఆచరించిన దండనీతికి సాటిరావనీ నిర్ణయం జరిగింది. ఈ విషయం పెద్దలద్వారా వింటున్నాం.

రాజధర్మ ప్రవర్తకుడు కాకుంటే తనకూ, తన ప్రజలకూ చేటు. తన ప్రజలకంటె తనకే చేటు.

**అనయముఁచేర్చు కామమున నర్థము ధర్మముఁగ్రాగుఁగామ తం**
**త్ర నిరతుఁడైనవాఁడు సుపథ ప్రతిపన్నుఁడుగాండు, దుష్ట దం**
**దన మొనరింపఁడట్టిపతిడాయరు సాధులు, నార్యులున్, సుహృ**
**జ్జనులును దానఁజేటునగుఁజావునుఁబాటిలునెల్లభంగులన్.**

కామాతిరేకం గల రాజుపాలనలో అర్థధర్మాలు నశించిపోతాయి. కామపరతంత్రుడయిన రాజు మంచిమార్గంలో నడువడు. దుష్టులను దండింపడు. అటువంటి రాజువద్దకు సజ్జనులూ పెద్దలూరారు. స్నేహితులురారు. అందుచే చేటు కలుగుతుంది. రాజుకు చావుకూడా సంభవిస్తుంది. న్యాయశాస్త్రం బాగా తెలుసుకొని, తద్వారా వారి వారి ఇంగితాకార చేష్టలు గ్రహిస్తూ, జనుల మంచిచెడ్డలు తెలిసి దండనీతి ప్రవర్తింపజేసిన రాజు మేలుపొందుతాడు.

రాజు శాస్త్ర, లోకవ్యవహారమెరుగకుండగ వుండరాదు. శాస్త్రలోక వ్యవహారములెరిగిన పండితుల్ని తోడుగా తీసుకొని, దుష్టుల మంచిచెడుగులు తూచి చూచి అతని తప్పుకు సరితూగే దండన విధించాలి. ఆయా వ్యయములు ఉదయమున సంక్షేపంగ చూడాలి. అంతకుముందే దేవతాపూజనము, ధార్మిక, వృద్ధుల పూజలూ చేసి చాల ప్రొద్దెక్కినప్పుడు తగిన భోజనం చేయాలి. ఆ తరువాత గంధమూ, పూమాలలు, భూషణాంబరములూ యిచ్చవచ్చిన రీతిననుభవించ వచ్చును. క్రొత్త క్రొత్త రీతుల సమస్యలేర్పడినా ఓర్పుతో రాజు తీర్చాలి. బద్ధకించకూడదు. బుద్ధిమంతులతో విచారించి చేసినపని సానుకూలమై పూర్తి

అవుతుంది. రాజు మృదుకర్మమయినా, క్రూరకర్మమయినా నేర్పుతో, ఉపాయంతో చేయాలి.

రాజు మిత్రులనధికంగ ఏర్పాటు చేసుకోవాలి. తన యిబ్బందులను (ఆత్మ ఛ్చిద్రముల నన్నింటినీ తెలుసుకోవాలి. తాను మాత్రము ఇతరుల ఛిద్రములనన్నింటిని తెలుసుకోవాలి. బలహీనుడయిన శత్రువును చెరుపవచ్చును. బాహుబలము, సుహృద్బలమూ కలవారిని చెఱుప సాధ్యంకాదు. చాలకష్టపడవలసివచ్చును. దూతలద్వారా ఇతరుల ప్రయత్నాలను తెలుసుకుంటూ వుండాలి. ఇతరుల భూముల వృత్తాంతాలను పాషండుల పంపి తెలుసుకొంటూ ఉండాలి. విహారాలకు వెళ్ళినా పర్వత, ఉద్యాన, సభా, తీర్థ, దేవతా గృహములకూ, వేటకు వెళ్ళేముందు ఆయా ప్రాంతాలూ, పరిస్థితులూ ముందుగా శోధించాలి. రాజయిన వాడు 'వీరిని నమ్మవచ్చును. వీరిని నమ్మరాద'ని పయికనకుండగ, ఎప్పుడూ ఎవ్వరినీ నమ్మకుండ ఆత్మరక్షాపరుడయి వుండాలి.

ఆత్మరక్షవిధించినట్లే మంత్రరక్షకూడా ప్రయత్నం మీద చేయాలి. "మంత్రరక్ష" అంటే సమావేశంలో చేసిన ఆలోచనా విషయాన్ని యితరులకు తెలియకుండ వుంచడం. అలా చేస్తే అన్ని కార్యాలూ సిద్ధిపొందుతాయి. అలాకాక మంత్రాంగం భేదిస్తే బృహస్పతికయినా కార్యం సఫలం కాదు.

అంతఃపురాలలో రాణులకు (అంతఃపురకాంతలకు) ఆప్తులయిన వృద్ధులను కాపుపెట్టాలి. ఏ పనిచేసినా మంత్రులతో ఆలోచించి మాత్రమే చేయాలి. ముఖ్యంగా ఒక రహస్యస్థావరాన్నీ ఒక గదిగానో, మేడపైననో, అడవులయందో నిర్మించుకోవాలి. అలా రహస్యం బయటకు రాకుండగ అన్ని పనులూ ఫలవంతాలౌతాయి.

కుంటివారు, గ్రుడ్డివారు, మందబుద్ధులు, (జాప్యం చేసేవారు) కడువయసు మళ్ళినవారూ, రహస్య భాషణముల తావునకు చేరువకాగూడదు. దేనికయినా శాంతివున్నదిగాని మంత్రభేదానికి లేదు. అందువలన మంత్రాంగ విషయం బయట పొక్కకుండ మంత్రులకు గట్టిగా చెప్పాలి. ముఖ్యమైన బాధ్యతలు కొన్ని వున్నాయి. అలా ప్రవర్తించినరాజుకు జయము, యశస్సులతో బాటు అర్థ సంసిద్ధి కలుగుతుంది.

**శత్రులనాజినోర్చుటయు, సర్వభయంబులఁబొందకుండగా**
**ధాత్రిఁబరిగ్రహించి యుచితస్థితిఁగాచుటయుం బ్రియంబుతోఁ**
**బాత్రుల కర్థమీగియును బ్రాహ్మణపూజయుఁజువ్వెయుత్తమ**
**క్షత్రియధర్మముల్ సుగతి కారణముల్ విపులార్థమూలముల్.** *(అరణ్యపర్వము-ప్రథమ)*

శత్రువులను యుద్ధంలో జయించడమూ, ప్రజలకు ఏ విధమయిన భయమూ కలిగించకుండా భూమికైవసం చేసుకొని తగినట్లు రక్షించడమూ, ప్రేమతో తగినవారికి ధనమునీయడమూ, బ్రహ్మవేత్తలను పూజించడమూ అనేవి ఉత్తమ పాలకుని ధర్మాలు. వీనివల్ల సద్గతి కలుగుతుంది. విపులంగా ధనాలు సంప్రాప్తిస్తాయి.

# శ్రీ భాష్య గ్రంథముల పరిచయము

-శ్రీమాన్ వైద్యం వేంకటేశ్వరాచార్యస్వామి- పొణ్యం.

శ్లో॥ తస్మై రామానుజాచార్యాయ నమః పరమ యోగినే
యశ్రృతి స్మృతి సూత్రాణా మంతర్ జ్వరమశీ శమత్ ॥

శ్రీ రామానుజులవారు శ్రీ భాష్యాన్ని రచించారు. ఎందరో వైష్ణవోత్తములు శ్రీ భాష్యాన్ని ప్రవచనాదులద్వారా ప్రాచుర్యానికి తెచ్చారు. ఆ వైష్ణవ కుటుంబాలు 'శ్రీభాష్యం' అనే ఇంటిపేరుతో వ్యవహారంలో నిలిచిపోయాయి.

భగవద్రామానుజులవారు శ్రీభాష్యం, వేదాంతదీప, వేదాంత సార, గీతాభాష్య, వేదార్థ సంగ్రహ, గద్యత్రయ, నిత్యగ్రంథ అనే (సంస్కృత) రచనల్ని చేశారు.

శ్రీభాష్యం బ్రహ్మ సూత్రాలకు వ్యాఖ్యాన గ్రంథం. దీనిని **శారీరక మీమాంసాశాస్త్రం** అనికూడా అంటారు. ఇది భగవత్తత్త్వాన్ని గురించి తెలిపే శాస్త్రం. బ్రహ్మసూత్రాలను బాదరాయణులవారు (వేదవ్యాసులవారు)రచించారు. వేదాంత గ్రంథాలలో బ్రహ్మ సూత్రాలకు అతయంత ప్రాముఖ్యమున్నది. ఈ రచన ఉపనిషత్తులలోని సారాన్ని ఒక పద్ధతిగా తీర్చిదిద్ది వ్యక్తం చేసింది.

'శ్రీభాష్యం' భగవద్రామానుజులవారి గొప్ప రచన. భాష్యాది గ్రంధరచన చేయటం వల్ల భగవద్రామానుజులవారికి 'భాష్యకార' అనే పేరు కలిగింది. రామానుజులవారికి పేరు తెచ్చిన శ్రీభాష్యం చాలా గొప్పది. శ్రీభాష్యం విశిష్టాద్వైత వేదాంతానికి నూతన చైతన్యాన్ని కలిగించింది. విశిష్టాద్వైతంలోని మౌలిక భావాలను వివరించి చెప్తుంది శ్రీభాష్యం. ఉదాహరణకు శరీర శరీరి భావన (Body - Soul relation ship), సగుణబ్రహ్మ (Brahman with auspicious qualities), (Devotion with sublimte love for God), ప్రపత్తి (Self surrender) మొదలయినవి. బ్రహ్మసూత్రాలపై అద్వైతాదివాదాలు సమర్థనీయం కాదని విమర్శించి సిద్ధాంత స్థాపనం చేయటం జరిగింది.

బ్రహ్మసూత్రాలు నాలుగు అధ్యాయాలుగ రచించబడనవి. ఒక్కొక్క అధ్యాయం మళ్ళీ ప్రథమ ద్వితీయ తృతీయ చతుర్థ పాదాలుగ విభజించబడింది. అధ్యాయాలలోని ఒక్కొక్కపాదం మళ్ళీ కొన్ని అధికరణాలుగ విభజించబడింది. ఒక్కొక్క అధికరణంలో కొన్ని సూత్రాలు చెప్పబడ్డాయి. ఈ వివరాలు క్రింది పట్టికలో పొందుపరచడమైనది-

| అధ్యాయ | పాద | అధికరణ సంఖ్య | సూత్ర సంఖ్య | అధ్యాయాలలోని అధికరణాలు | అధ్యాయాలలోని సూత్రాలు |
|---|---|---|---|---|---|
| ప్రథమ | ప్రథమ | 11 | 32 | 35 | 138 |
| | ద్వితీయ | 06 | 33 | | |
| | తృతీయ | 10 | 44 | | |
| | చతుర్థ | 08 | 29 | | |
| ద్వితీయ | ప్రథమ | 10 | 36 | 33 | 149 |
| | ద్వితీయ | 08 | 42 | | |
| | తృతీయ | 07 | 52 | | |
| | చతుర్థ | 08 | 19 | | |
| తృతీయ | ప్రథమ | 06 | 27 | 55 | 182 |
| | ద్వితీయ | 08 | 40 | | |
| | తృతీయ | 26 | 64 | | |
| | చతుర్థ | 15 | 51 | | |
| చతుర్థ | ప్రథమ | 11 | 19 | 33 | 076 |
| | ద్వితీయ | 11 | 20 | | |
| | తృతీయ | 05 | 15 | | |
| | చతుర్థ | 06 | 22 | | |
| 4 | 16 | 156 | 545 | 156 | 545 |

శ్రీ విశిష్టాద్వైతంలో అత్యంత ప్రాధాన్యమును సంతరించుకున్న శ్రీభాష్యాన్ని గురించిన రచనలు పరశ్శతంగా వెలువడినవి. వాటిలో కొన్ని ముద్రితాలు కాగా మరికొన్ని అముద్రితాలు. ఎన్నో అముద్రిత రచనలు సుప్రసిద్ధ ప్రాచ్య లిఖిత గ్రంథాలయాలలోను పరంపర పీఠాధిపతుల నిలయాలలోను సంప్రదాయ పండితుల తిరువూళిగలలోను భద్రపరచబడ్డాయి.

ఒక పరిశోధనా సంస్థ బ్రహ్మ సూత్రాలకు రచించిన రచనలను విశ్లేషించి వాటిలో ముద్రితాలు 328 కాగా, లిఖిత ప్రతులుగా వున్నవి 750 అని తెలియజేసింది.

శ్రీభాష్యానికి సంబంధించిన వ్యాఖ్యానాలు, స్వతంత్ర రచనలు, తార్కిక రచనలు, అనువాదాలు ప్రస్తుత వ్యాసకర్త దృష్టికి అందిన రచనలు సంక్షిప్తంగా నామమాత్ర పరిచయం చేయబడును–

**శ్రీభాష్యంపై వెలువడిన వ్యాఖ్యానాలు:-** రామానుజులవారు 'వేదాంతదీపమ్' అనే రచన చేశారు. అది బ్రహ్మసూత్రాలకు సంక్షిప్తవ్యాఖ్య. దానిని శ్రీభాష్యసార సంగ్రహంగా పేర్కొనవచ్చు. 'నయమ యూఖమాలికా' అనే సంస్కృత రచనను అప్పయదీక్షితులవారు చేశారు. అది బ్రహ్మసూత్రాలకు సంక్షేపవ్యాఖ్య. ఆ వ్యాఖ్యానం శ్రీభాష్యంలోని నిర్ణాయకమైన అర్థాలకు సంబంధించినదిగా చెప్పబడింది. 'శ్రుతప్రకాశిక' అనే రచనని సుదర్శనసూరి చేశారు. శ్రీభాష్యాన్ని గురించి వెలువడిన వ్యాఖ్యానాలలో దీనికి మంచి ఆదరణ ప్రాచుర్యాలు లభించాయి. దీని పేరున దీని కర్తను 'శ్రుత ప్రకాశికాచార్య'అని వ్యవహరించటం ఈరచన గొప్పతనానికి నిదర్శనం. శ్రీభాష్యానికి రచించబడిన బృహత్ వ్యాఖ్యానాలలో ఇది పేర్కొనదగింది. రాసిలోనేగాక వాసిలోనూ శ్రుత ప్రకాశికకు మంచి గుర్తింపు వచ్చింది. **'భాష్యార్థదర్పణం'** అనేపేర ఉత్తమూరు వీరరాఘవాచార్యులవారు సంస్కృతంలో శ్రీభాష్యానికి చక్కని వ్యాఖ్యానాన్ని సంతరించారు. శ్రీభాష్యానికి పూర్వులు రచించిన వివరణ గ్రంథాలలో నారాయణమునిగారి 'భావ ప్రదీపిక' పేర్కొనదగింది. 'భావ ప్రకాశిక' అనేపేరుతో రంగరామానుజ విరచితమైనవివరణ గ్రంథం కూడా ఒకటి వుంది. అది శ్రుత ప్రకాశిక కన్నా కొంత విస్తృతమైనది.

రంగరామానుజులవారు శ్రీభాష్యంలోని మౌలిక భావాలను వివరిస్తూ **'మూల భావప్రకాశిక'** అనే రచనను కూడా చేశారు. చంపకేశాచార్యులవారు శ్రీభాష్యానికి

వివరణగా **'గురుతత్వ ప్రకాశిక'**ను రచించారు. పరకాల మఠాధిపతులయిన అభినవ రంగనాథ బ్రహ్మతంత్ర స్వాములవారు శ్రీభాష్యంలోని నిగూఢార్థాలను సంక్షిప్తంగా వివరిస్తూ **'గూఢార్థ సంగ్రహః'** అనే రచన చేశారు. మేఘనాథారినూరి రచించిన **'నయప్రకాశిక'**, వరదనారాయణ భట్టారకులు రచించిన **'న్యాయ సుదర్శనం'** సుదర్శనసూరి రచించిన **'శ్రుతప్రదీపిక'**, వేదాంత దేశికులవారు రచించిన **'తత్వటీకా'** మొదలయిన రచనలు కూడా శ్రీభాష్యం గురించి వెలువడిన వ్యాఖ్యానాలే. ఇలాంటి వ్యాఖ్యానాలు మరింకెన్నో.....!!

**శ్రీభాష్య సంబంధిత స్వతంత్ర రచనలు:-** వేదాంత దేశికులవారు శ్రీభాష్యాన్ని గురించి 'అధికరణ సారావళీ' అనే రచన చేయగా కుమార దేశికులవారు అధికరణ సారావళిని గురించి 'అధికరణ చింతామణి' అనే రచన చేశారు. కారైకుచ్చి వేంకట కృష్ణమాచార్యులవారు

**'శ్రీభాష్యార్థ మణి ప్రవాళ దీపిక'** అనే స్వతంత్ర సంక్షిప్త వ్యాఖ్యానాన్ని రచించారు. ఆండాళ్వార్ అనంతాచార్యుల వారు 'వేదాంతవాదావళి'ని, గోపాలా చార్యులవారు 'బ్రహ్మసూత్రం గుళిన్ అనుభవం' అనే రచనను చేశారు.

శఠకోప రామానుజులవారు అధికరణ సారావళిపై వ్యాఖ్యను 'కల్పతరు (పదయోజన)' అనేపేర స్వతంత్ర గ్రంథాన్ని రచించారు. సుందర రాజాచార్యులవారి 'ప్రకాశికా', కొళియాలం శ్రీనివాసాచార్యులవారి **'శారీరక కారివాళీ'**, వేదాంత రామానుజ దేశికులవారి 'శారీరక సారబోధినీ', శ్రీనివాసాచార్యులవారి 'శారీరక శ్రీభాష్యకార తిరువుల్లమ్' అనే రచనలు ఈకోవకి చెందినవే. వాదికేసరి అలగియ మణవాలజీయర్ విరచిత **'శ్రీభాష్య ద్రవిడాగమాద్య దశకద్వంద్వైక కంఠ్యం'** అనే రచనలో తిరువాయ్ మొళి– శ్రీభాష్యంలో ఒకేభావాలు కలిగిన తావులు గుర్తించి వివరించబడింది.

ప్రతివాది భయంకర అణ్ణంగరాచార్య స్వామివారు **'శ్రీభాష్యాధికరణం'** అనే స్వతంత్ర రచనను చేశారు. శ్రీభాష్యంలోని పూర్వపక్ష మరియు సిద్ధాంతాలను వివరించే 'శ్రీభాష్య ప్రకాశికా' అనే రచనను శ్రీనివాసాచార్యులవారు రచించారు. ఆండవన్ స్వామివారు తమిళంలో 'శ్రీభాష్యం– రహస్యత్రయం' అనే అంశంపై ఉపన్యాసాలు ఇచ్చారు. వాటిని లక్ష్మీతాతాచార్యులుగారు 'శ్రీభాష్యసార – రహస్యత్రయసార' అనేపేర గ్రంథస్థం చేశారు. శ్రీభాష్య సారాంశాన్ని కల్కి

నరసింహాచార్య స్వామివారు **'శ్రీభాష్య సారామృత'** అనేపేర రచించారు.

ఈచ్చంబాడి శ్రీనివాసస్వామివారి **'శ్రీమద్భాష్యార్థ సంగ్రహః'**, ప్రతివాది భయంకర అణ్ణంగరాచార్య స్వామివారి 'శ్రీభాష్య సారామృతం', అయ్యంగార్ విరచిత **'శ్రీభాష్య తాత్పర్య సారః'** అనేవి ఈకోవకి చెందిన రచనలలో కొన్ని. నింబాచార్య, మాధవాచార్య, రామానుజాచార్య చెప్పిన వేదాంతాన్ని రత్నగోపాల భట్టర్‌గారు పరామర్శించారు. అది శ్రీభాష్యానికి పదకోశం. **'శ్రీభాష్య వార్తికం'** అనేపేరున ఆ రచన చేయబడింది. వాధూల రామానుజదాస మహాచార్యులవారు **'శ్రీభాష్యోపన్యాసః'**, అనే గ్రంథాన్ని విరచించారు. అనంతపురుష శ్రీశైల శ్రీనివాసాచార్యులవారు **'తత్వరత్నావళి'** అనే నామాంతరంగల **'శ్రీభాష్యప్రదీపిక'**ను ఏడు సంపుటాలుగ రచించారు. ఇది శ్రీభాష్యానికి వివరణగ స్రగ్ధవృత్తాలలో రచించబడిన స్వతంత్ర రచన. శ్రీభాష్యంలోని 'పారాశర్య వచస్సుధాం' అనే రెండవ శ్లోకంలోని వచస్సుధా అనే సమాసాన్ని గురించిన చర్చచేస్తూ **'వచస్సుధా విచారః'** అనే గ్రంథాన్ని పండిత రత్న కుప్పన్నయ్యంగార్ రచించారు. కస్తూరి రంగాచార్యులవారు కూడా ఇదే అంశాన్ని గురించి **'వచస్సుధాతత్త్వమ్'** అనే రచనను చేశారు. శ్రీభాష్యంలోని ఉపనిషద్వాక్యాలను వివరణగ రంగరామానుజ విరచిత **'విషయవాక్య దీపిక'** చక్కని రచన.

**శ్రీభాష్యంపై వెలువడిన తార్కిక రచనలు:-** శ్రీభాష్యంపై వచ్చిన ఆక్షేపణలకు వివరణ ఇస్తూ ఆనందాళ్వాన్ అనంతాచార్యులవారు 17 ఉపన్యాసాలు రచించారు. వాటిలో **ఆకాశాధికరణ విచారః, బ్రహ్మ లక్షణవాదః, లఘుసామానాధికరణ వాదః, సమాసవాదః, సంవిన్నానాత్వ సమర్థనం, శారీరవాదః, తాత్పర్యవాదః**, అనే రచనలు ఒక్కొక్కటి ఒక్కొక్క ప్రత్యేక గ్రంథంగా వెలువడింది. శ్రీభాష్యంపై వచ్చిన ఆక్షేపణలను ఖండిస్తూ వేదాంత దేశికులవారు 'శతదూషణి' అనే రచన చేయగా 'శతదూషణికి' 'చండమారుతం' అనే వ్యాఖ్యానాన్ని మహాచార్యులవారు రచించారు.

శ్రీభాష్యాన్ని మరియు వేదాంతదేశికులవారి శతదూషిణిని అద్వైతి అయిన ఉమామహేశ్వర పండితులవారు విరోధవరూధిని అనే రచన ద్వారా దూషించారు. విరోధ వరూధిని అనే రచనను అనంత పురుష శ్రీరంగాచార్యులవారు

**'కుదృష్టిధ్వాంత మార్తాండ'** అనే రచన చేసి ఖండించారు. వేదాంత దేశికులవారి శతదూషిణిని కృష్ణశాస్త్రిగారు 'శతభూషణి' అనేపేర విమర్శించారు. శతభూషిణికి విమర్శన గ్రంథంగా ఉత్తమూరు వీర రాఘువాచార్యులవారు **'పరమార్థ భూషణం'** అనే రచనను చేశారు. మహామహో పాధ్యాయ అనంత కృష్ణశాస్త్రిగారు రామానుజ శ్రీభాష్యంపై లేవనెత్తిన ఆక్షేపణలకు సమాధానంగ గోపాలా చార్యులవారు **'సూత్రానుగుణసిద్ధి విమర్శ'** అనే గ్రంథాన్ని రచించారు. శంకరాద్వైత వాదులపై రామానుజులవారు చేసిన ఆక్షేపణలను సమర్థిస్తూ రంగాచార్యులవారు **'విశిష్టాద్వైతవిజయః'** అనేతార్కిక గ్రంథాన్ని రచించారు. **తాత్పర్య దీపిక, తత్వసారః, విధి సుధాకరః** మొదలయిన రచనలు కూడా శ్రీభాష్యాన్ని సమర్థిస్తూ వెలువడిన తార్కిక రచనలే.

**శ్రీభాష్యానువాద రచనలు:-** శ్రీభాష్యాన్ని వీరేశ్వరానంద (మాయావతి - హిమాలయ) గారు ఆంగ్లంలోకి అనువదించి వెలువరించారు (1978). A.V. Ahyankar గారు A Gloss on Sri Bhashya అనే రచనన (1914) చేశారు. అనంత రంగాచార్యులుగారు శ్రీభాష్యాన్ని కన్నడంలోకి అనువదించి A Glossary of Technical terms ను కూడ రచించారు. సచ్చిదానంద సరస్వతిగారు కూడ శ్రీభాష్యాన్ని కన్నడీకరించారు. అడయార్ లైబ్రరీ (చెన్నై)వారు శ్రీభాష్యాన్ని ఆంగ్లంలోకి అనువదింపచేసి ప్రచురించారు (1979). పరవస్తు శ్రీనివాస యోగానందస్వామి (విశాఖ) వారు శ్రీభాష్యాన్ని తెలుగులోకి (1980) అనువదించినట్లు తెలుస్తోంది. కందాడై శేషాచార్యులవారు శ్రీభాష్యాన్ని ఆంధ్రీకరించి ప్రచురించారు. 'శ్రీభాష్యం దర్పణ అథవ బ్రహ్మసూత్రగళు' అనే పేరున నాథముని అయ్యంగార్ శ్రీభాష్యాన్ని కన్నడంలోకి తర్జుమా చేశారు. అనంతరంగాచార్యులవారు కూడా కన్నడంలోకి శ్రీభాష్యాన్ని అనువదించారు. గోపాలాచార్యులవారు (శ్రీరంగం) శ్రుతప్రకాశికా సమేతంగా శ్రీ భాష్యాన్ని తమిళంలోకి తర్జుమా చేశారు.

శ్రీభాష్య వాఙ్మయం బహు విస్తరంగా ఎంతో పరిఢవిల్లింది. అందులో ఇప్పుడు మనం ప్రస్తావించుకొన్నది తెలియ వచ్చినంతే. ప్రస్తుత వ్యాసరచయిత దృష్టికి అందనిది మరెంతో...!!

జై శ్రీమన్నారాయణ!

# ప్రచార వార్తలు

## V.T. కార్యకర్తల విస్తృత సమావేశం

అక్టోబర్ 2,3 తేదీలలో, సీతానగరం లోని వేదవిశ్వవిద్యాలయ ప్రాంగణంలో శ్రీశ్రీశ్రీ స్వామివారి పర్యవేక్షణలో **వికాస తరంగిణి కార్యకర్తల విస్తృత సమావేశం** జరిగింది. రాష్ట్రవ్యాప్తంగానే కాక కర్ణాటక, తమిళనాడు ఒరిస్సాలనుండి సుమారు 1000 మంది ప్రతినిధులు పాల్గొన్నారు.

2వ తేదీ ఉదయం జ్యోతి ప్రజ్వలనంతో, సమావేశం ప్రారంభ మైంది. వరంగల్‌జిల్లా V.T. అధ్యక్షురాలు శ్రీమతి డా॥ జ్యోతి ప్రతినిధులకు స్వాగతం పలికారు.

సెంట్రల్‌కమిటీ సభ్యులైన డా॥ రామ నాథం, శ్రీమతి డా॥ శ్రీలక్ష్మి, శ్రీమాన్ లక్ష్మీ నారాయణ సుంత్వాల్ సభ్యుల నుద్దేశించి ప్రసంగించారు. ఆపై జంటనగరాల సమన్వయకర్త శ్రీమాన్ కల్కి అవతారం, చెన్నై జోనల్ కమిటీ సభ్యులు శ్రీమాన్ జి.వి.చలపతిరావు, బెంగుళూరు నుండి శ్రీ జగదీష్, జెట్ ఉపాధ్యక్షులు శ్రీ రామచంద్రా రెడ్డి తూర్పు గోదావరి జిల్లా V.T. అధ్యక్షులు శ్రీమాన్ K.పాపారాయుదు, డా॥ చిలకపాటి విజయ రాఘవాచార్యులు గార్లు ప్రసంగించారు.

అనంతరం గం.11-30 లకు శ్రీస్వామి వారు అనుగ్రహ భాషణం చేసారు.

ఈ ఏడాది జరిగే ఈ రెండవ సమావేశం భవిష్యత్కార్యక్రమాల నిర్వహణకు కీలకం.

సాధారణంగా మనిషికి సమస్యలు వచ్చినప్పుడు కృంగిపోతాడు. ఎంతటి వారికైనా సమస్యలు చికాకు కలిగిస్తాయి. దిగులు తెప్పిస్తాయి. ఎంతటి శక్తిపంతులైనా ఎప్పుడో ఒకప్పుడు సమస్యల తాకిడికి తల్లడిల్లక తప్పదు. మరి సమస్యలు జీవితంలో ఎదురైనప్పుడు బయటపడడం ఎట్లా?

ఎదురైన సన్నివేశాన్ని **'సమస్య'** అను కుంటే అది మనలను కృంగదీస్తుంది. మనకు కోపం, దిగులు, చికాకుల వలయంలోకి తోస్తుంది.

ఈ భావన మారి **'అది భగవంతుడు మనశక్తి నిరూపణకు అందజేసిన ఒక సదవ కాశంగా దానిని మనం స్వీకరిస్తే?'.**

కొందరు సమస్యనే ఒక సవాలుగా (ఛాలెంజ్‌గా) తీసుకోవాలంటారు. అయితే ఇలాంటి భావనలో గూడ కొంత ఇబ్బంది ఉంది. అవతల వాడు గొప్పవాడు. నేనేమో అల్పుడిని? నేనెలా అతడి సవాలును

ఎదుర్కోగలను? అనుకొంటూ, సందేహ పడితే.... మానసికంగా ముందుగానే ఓడిపోయి, డీలాపడిపోయే ప్రమాదం ఈ 'సవాలు' భావనలో ఉంది. మరి బుద్ధిమంతుడు సమస్యను "భగవంతుడిచ్చిన సదవకాశంగా" గ్రహిస్తాడు. వాడే సమస్యల సంఘర్షణనుండి బయటపడ గలుగుతాడు.

కుందేలు-తాబేలు కథ మీకు తెలుసు. కుందేలు తాబేలును సవాలు చేసింది, తనను నడకపంధెంలో గెలవమని. తాబేలుకు కుందేలు శక్తి తెలుసు. తన నెమ్మదితనమూ తెలుసు. కానీ కుందేలు ఇచ్చిన 'సవాలు'ను భగవానుడిచ్చిన అవకాశంగా స్వీకరించి పోటీకి సిద్ధమైంది.

ఆ తర్వాత జరిగింది మనకు తెలిసిందే. తాబేలుది నెమ్మదినడకే. సందేహంలేదు. అయితే ఎక్కడా తన కృషిని మానకుండా క్రమంగానడిచి గర్విష్ఠి, సోమరిపోతు అయిన కుందేలుపై విజయం సాధించింది.

మనం కూడా మన కృషిని నెమ్మదిగానే అయినా సరే, క్రమం తప్పకుండా సాగిద్దాం. క్రమబద్ధంగా మనం సాగించే కృషికి భగవంతుడు తప్పనిసరిగా విజయాన్ని ప్రసాదిస్తాడు.

జీవులంతా భగవంతుని సంతానమే. అయినా కొందరికి మాత్రమే "ఆయన *సందేశాన్ని అందించే దూత*"లయ్యే అవకాశముంది. అలాంటి సదవకాశాన్ని భగవంతుడు మీకందరికీ ఇచ్చాడు. అది తాబేలుకు ఇచ్చిన అవకాశంలాంటిదే కావచ్చు.

భగవంతుడు యిచ్చిన అవకాశాన్ని అందరూ వాడుకోరు. మేఘం నుండి కురిసే ప్రతినీటిచుక్కా ముత్యంగా కాగలదా?

ప్రతి ముత్యమూ భగవంతుడి హారంలో చేరగలదా? దానికి భగవంతుడి కృప కావాలి.

మనిషి జన్మ అలాంటి ఓ అరుదైన అవకాశమే ఈ జన్మను మనం జాగ్రత్తగ వాడుకోవాలి. సమస్త ప్రాణికోటినీ భగవంతుని దేహముగా భావించి, సేవించే ప్రయత్నం ద్వారా మన జన్మ కావాలి.

13 ఏళ్ళక్రితం మన వికాసతరంగిణి గోదావరిలో పుట్టి, కృష్ణలో స్నానమాడి, కావేరీ తీరంతాకి, తుంగభద్రను తట్టి, గంగను పలుకరించి, నయాగరా ఫాల్స్ వరకూ వ్యాపించింది.

మన V.T. లక్ష్యం-ఎంతో సమున్నతమైనదో. ఆలోచించే కొద్దీ ఆశ్చర్యం వేస్తుంది. ఈ లక్ష్యాన్ని సాధించే ఆరు ఆశయాలు మనకున్నాయి.

నిస్సందేహంగా, ఈ లక్ష్యం దిశగా సాగే మన యాత్ర. తాబేలు నడకే. మనకు తోచిన మార్గంలో అపమార్గం కాకుండా కార్యక్రమాలను ఉత్సాహంగా చేస్తూనే ఉన్నాము.

కోనసీమ తుఫాను తాకిడికి గురైనప్పుడు, ఆదుకొనేందుకై తక్షణం స్పందించి వివిధ సేవలందించాం. 42 మందిరాలను పునర్నిర్మించాం. మరో 41 మందిరాలను బాగు చేసాం. TTD ద్వారా 83 మందిరాలకూ మైక్‌సెట్లిప్పించాం.

గుజరాత్ భూకంపం బారినపడినప్పుడు, వల్లభాపూర్‌లో 86 గృహాలు నిర్మించి ఉడతాభక్తిగా మనవంతు కర్తవ్యాన్ని నిర్వహించాం. కార్గిల్‌లో విజయాన్ని కోరుతూ 'మంగళతరంగిణి'ని ఆపై అమరసేవా తరంగిణులను పరమాద్భుతంగా నిర్వహించుకొన్నాం. 10వేల గ్రామాలకు కృష్ణభగవానుని సందేశాన్ని అందజేయడం ద్వారా "కృష్ణం వందే జగద్గురుం" కార్యక్రమాన్ని జరుపుకొన్నాం.

13 వేల పైగా గ్రామాలకు 'గీతాజ్యోతి' సందేశాన్ని అందించాం. గీతాజ్యోతి ద్వారా - **మాధవసేవగా సర్వప్రాణి సేవ** లక్ష్యంతో పాటు **"స్వీయ ఆరాధన, సర్వ ఆదరణ"** అన్న మరో లక్ష్యాన్ని కూడా ఏర్పరచుకొన్నాం.

దేశం కోసం, సమాజం కోసం, ధర్మం కోసం, దైవం కోసం సాగే మనం యాత్రలో ఎన్ని సవాళ్ళు ఎదురైనా అవన్నీ భగవంతుడు అందించిన "సదవకాశాలు"గా భావించాం. వాటిని ధీటుగా ఎదుర్కొని ముందుకు సాగటమే మన కర్తవ్యం.

తాబేలు నడకతో మనం ఎన్నో కుందేళ్ళను దాటి గమ్యాలు చేరుతున్నాం. కథలో కుందేలు గర్వాన్ని వదిలి తాబేలును మెచ్చింది. కానీ నిజజీవితంలో, ఈనాడు వికాసతరంగిణి చేసే నిస్వార్థ, ఉదార, విస్తృత సేవలను ఆడిపోచుకొనే కుందేళ్ళు ఎన్ని ఉన్నా వాటిని పట్టించుకొని దిగులు చెందకుండా మీ శక్తిని స్వామి సేవలో నిరూపించుకొనే 'సదవకాశం' భగవానుడే యిచ్చాడని మీకు గుర్తుచేస్తున్నా"మంటూ శ్రీవారు ముగించారు.

**అక్టోబరు 2వ తేదీ మధ్యాహ్నం**

ప్రతినిధులు జోన్‌ల వారీగా కలిసి వివిధ అంశాలపై చర్చించారు. గత 6నెలల VT పనితీరును భవిష్యత్ ప్రణాళికా స్వరూపాన్ని చర్చించారు.

వాటిని శ్రీస్వామివారు విశ్లేషించి సుమారు 2 గంటలపాటు సాగిన సమీక్షా సదస్సులో 'చెరిగే చరిత్రను చక్కబెట్టండని' తాము సాగించిన ప్రచార వివరాలను ఇకముందు జరుగవలసిన చర్యలను గురించి సూచనలిచ్చారు. సత్సంగాల నిర్వహణ రీతిని వివరించారు. **సత్సంగానికే ప్రాధాన్యము.**

**విష్ణు సహస్రనామ పారాయణం:**

అన్ని శ్లోకాలూ చదువలేకపోయినా, 15ని. సమయం దీనికోసం కేటాయించి, తప్పులు దొర్లకుండా పారాయణ చేసే అభ్యాసం కావాలి.

★ దీనివలన కొత్తసభ్యులకూ ఉత్సాహం కలుగుతుంది. నెలకొక సారి మాత్రం

సామూహిక శ్రీవిష్ణు సహస్ర నామ పారాయణ చేయండి.

★ సత్సంగాల నిర్వహణలో ఆర్భాటాలు పనికిరావు. ప్రసాదాలు వంటి కార్యక్రమాలు డబ్బు ఖర్చుతో కూడుకొన్నవి. వాటివల్ల సత్సంగాలు భవిష్యత్‌లో కుంటు పడతాయి. కనుక ఆర్థికపరమైన అంశాలతో నిమిత్తంలేక సత్సంగాలు జరుపుకోవటం ఒక నియమంగా ఏర్పరచుకోండి.

★ సత్సంగానికి ప్రారంభంలో "పూర్ణ మిదం, ఈశావాస్యమ్ అనే మంత్రాలు పఠించాలి. 'అగ్నేనయ', 'పూర్ణమిదం' అనే మంత్రాలతో ముగుస్తుంది. అందరికీ ఇవి రావాలి.

★ మంత్రపఠనం కాగానే నారాయణ నామస్మరణం తప్పనిసరి.

★ పోతనగారి భాగవంతం కాని, శ్రీఅప్పలాచార్యస్వామివారి భాగవతం కాని మన సత్సంగంలో అధ్యయనాంశంగా విని యోగించుకొందాం.

రాబోయే 5 నెలలో మొదటి రెండు స్కంధాలు పఠిద్దాము.

★ ఈ అధ్యయన సందర్భంగా సభ్యులకు వచ్చే సందేహాలను "వి.టి. సత్సంగ సందేహాలు" పేరుతో మన సీతానగరానికి రిప్లైకార్డు పై పంపవచ్చు.

★ సత్సంగాల సభ్యులమధ్య చక్కని కుటుంబ వాతావరణ నిర్మాణం ఎంతో అవసరం. భగవత్ బంధుత్వ భావన దృఢపడడానికి వీలుగా 3నెలలకొక సారి శాఖలస్థాయిలోనూ, జిల్లా జోన్లు స్థాయిలోనూ సభ్యులు కుటుంబాలతో కలిసి కార్యక్రమం చేసుకోవడం మంచిది.

★ ఏ సభ్యుడైన రాకపోతే రాలేకపోవడానికి కారణం తెలుసుకొని సత్సంగ విషయాలు అతనికి తెలియచేయడం సభ్యుల బాధ్యత.

★ సభ్యులలో ఎవరికైనా అనారోగ్యం వంటి ప్రాకృతిక ఇబ్బందులు ఏర్పడితే వారి ఇబ్బందులు తొలగడానికి భగవంతుని ప్రార్థన చేద్దాం.

★ వికాసతరంగిణి కార్యక్రమాలలో పూలదండలువేసే అలవాటు మానివేయాలి.

అంటూ అరటిపండు వలచి తల్లిపిల్లవానికి తినిపించేటంతగా శ్రీస్వామివారు సత్సంగాల నిర్వహణ గురించి నియమాలు విశదీకరించారు.

అనంతరం నవంబర్ 6వ తేదీన విజయవాడనుండి తిరుపతి వరకు సాగించవలసిన "వేయికాళ్ళ మండప పునర్ నిర్మాణ శాంతి యాత్ర"కు సంబంధించిన విధివిధానాలను శ్రీస్వామివారు వివరించి సాయం సమావేశం గం.7-30కు ముగింపు చేస్తారు.

3వ తేది ఉదయం సమావేశంలో ముందుగ శ్రీమాన్ కల్కి అవతారం

"క్రియాశీలురైన కార్యకర్తలు-పని సంస్కృతి" అనే అంశాన్ని వివరించారు.

అనంతరం ఉ.వే. శ్రీమాన్ నేపాల్ శ్రీకృష్ణమాచార్యస్వామి ఆధ్యాత్మిక సందేశాన్ని అందించారు. తరువాత శ్రీవారి సూచనలపై ప్రతినిధుల స్పందన కార్యక్రమం ప్రారంభమై తదీయారాధనానంతరం కూడ కొనసాగింది. తరువాత వికాసతరంగిణి కార్యకర్తల విస్తృత సమావేశంలో సెంట్రల్ కమిటి ప్రతిపాదించిన తీర్మానాలను ఏకగ్రీవంగా ఆమోదించింది.

ఈ సమావేశం V.T.కార్యకర్తలలో ఎంతో ఆత్మవిశ్వాసం నింపింది. ఈ సమావేశం వల్ల గత కొద్ది నెలలుగ అయోమయ స్థితిలో కొట్టుమిట్టాడుతూ నిస్పృహకులోనై ఉన్న కార్యకర్తలలో నూతనోత్తేజం నిండింది. తమ తమ ప్రాంతాలలో అక్టోబరు 20వ తేదీన శాంతియాత్రల నిర్వహణకు, అనంతరం నవంబర్ 6వ తేదీన శాంతివాహన యాత్ర ఏర్పాట్లకు కంకణబద్ధులై శ్రీస్వామివారి మంగళాశాసనములు స్వీకరించి

**అక్టోబరు 20వ తేదీ విజయవంతమైన శాంతియాత్రలు:**

అక్టోబరు 2,3 తేదీలలో జరిగిన వికాస తరంగిణి కార్యకర్తల విస్తృత సమావేశంలో తీసుకొన్న నిర్ణయాలమేరకు రాష్ట్రవ్యాప్తంగా వందలాది ప్రాంతాలలో, వేలాదిగా వికాస తరంగిణి కార్యకర్తలు శాంతియాత్రను తమ తమ ప్రాంతాలలో నిర్వహించారు. వేయికాళ్ళ మండపాన్ని యథాస్థానంలో నిర్మించాలని, మహాప్రాకార నిర్మాణయోచన మానాలని, ఆలయ పవిత్రతను కాపాడాలని గ్రామ గ్రామాలలో ఉద్ఘోషించారు. వికాస తరంగిణి, శ్రీవేంకటేశ్వర భక్త మండలులు సంయుక్తంగా ఎంతో ప్రభావపూరితంగా విజయవంతంగా ఈ యాత్రను నిర్వహించి కార్యకర్తలలో ఆత్మవిశ్వాసాన్ని, ఉద్యమ స్ఫూర్తిని నింపాయి.

---

**తిరుమల దివ్యక్షేత్రంలోని వెయ్యికాళ్ళమండపం వివాదంపై అవగాహన సదస్సు- (భద్రాచలం)**

ఈ నెల 20.9.04వ తేదీన మా శాఖ నిర్వహించిన 'వెయ్యికాళ్ళ మండప పునర్నిర్మాణం కోసం శాంతియాత్ర'కు విశేష స్పందన వచ్చేందుకు వీలుగా స్థానిక ప్రముఖులందరిని ఆహ్వానించి ఈ సదస్సును నిర్వహించాము.

ఈ సదస్సునకు డి.ఎస్.పి. మొ॥ ప్రముఖులను, స్థానిక ధార్మిక సంస్థలను, సామాజిక సేవాసంస్థలను, అన్ని పత్రికల వారిని, వికాసతరంగిణి శాఖల (మా పరిధిలోని) వారిని, వైద్య ప్రముఖులను అందరినీ ఆహ్వానించాము.

మా ఆహ్వానాన్ని, విషయ ప్రాధాన్యాన్ని దృష్టిలో ఉంచుకుని స్థానికులే కాక చుటు ప్రక్కల గ్రామాలనుండి కూడ జిజ్ఞాసువులు విచ్చేసారు.

అందరి సందేహాలకు సమాధానాలను ఇస్తూ ఈ విషయంలో సదవగాహన

పెంపొందించే వక్తలుగా శ్రీ మురళీ కృష్ణమాచార్యులవారిని, శ్రీమాన్ స్థలశాయి స్వామిని నియమించుకోవడం జరిగింది. ఈ సదస్సుకు రూపకల్పన చేసినవారు వీరే.

ఈ శాఖ ఉపాధ్యక్షులు శ్రీమాన్ అల్లూరి సీతారామరాజుగారి అధ్యక్షతలో శాఖకార్యదర్శి శ్రీ గట్టు వెంకటాచార్యులుగారి సారథ్యంలో ఈ సదస్సు కార్యక్రమం జరిగింది. ముందుగా మురళీకృష్ణమాచార్యులు గారి ఉపోద్ఘాత ప్రవచనంతో 'వివాదాన్ని నిష్పక్షపాతంగా' చర్చించే పద్ధతి ప్రారంభమైంది. శ్రీ స్థలశాయిగారు మండపం యొక్క, చారిత్రాత్మకతను వివరించారు. స్థానిక ఇంజనీరింగ్ కాలేజ్ ప్రిన్సిపాల్ మరియు లయన్స్ క్లబ్ అధ్యక్షులు శ్రీ అబ్రహం (క్రైస్తవులు) వారికి సంబంధించిన ఒక అంశాన్ని ప్రస్తావిస్తూ 'మండపాన్ని కూల్చడం చారిత్రకద్రోహం'గా వక్కాణించారు.

ఇలానే టి.వి.జి.ఆర్. కృష్ణమూర్తి అనే ప్రముఖపాత్రికేయులు (75ఏళ్ళ వృద్ధులు) వేసిన ప్రశ్నలకు కూడ సమాధానాలను చెప్పి, సత్యాలను ఆవిష్కరించడం జరిగింది.

## 42వ ఉభయవేదాన్తసభలు

కీర్తిమూర్తులైన పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ త్రిదండి (పెద్ద) శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారు శ్రీ ఉ.వే. శ్రీమాన్ తె.కం. గోపాలాచార్యస్వామివారున్ను తమ శుభ సంకల్పముతో ప్రారంభించి నిర్విఘ్నముగా నిర్వహిస్తూ వచ్చిన శ్రీమదుభయవేదాన్త పండిత సభలు 42వ సంవత్సరం లోనికి అడుగుపెట్టాయి. ఈ సభలు గతంలో దసరా సమయంలో విజయవాడలో జరిగేవి.

గొప్ప కృషిచేసి ఉభయవేదాన్త మర్మజ్ఞులైన మహాపురుషుల సన్నిధిలో సాంప్రదాయికంగ అధికరించిన వేదాన్త విషయాలను ప్రవచనరూపంగా లోకాని కందజేస్తూ తాము విషయాన్ని పునరావృత్తి చేసుకొనే విధముగా పండితులకు కూడా ఉపకరించాలని ప్రాతఃస్మరణీయులైన మన ఆచార్యచరణులిరువురూ ఈ సభలను ప్రారంభించారు. శ్రీభగవద్రామానుజ సిద్ధాన్త విజయవైజయన్తిగానే ఈ సభలు సాఫల్యాన్ని సంతరించు కొంటున్నాయనేది సర్వవిదితము.

ఈ సభలలో వివిధప్రాంతాలనుండి వేంచేసి ఎందరో ఉభయవేదాన్త విద్వాంసులు ప్రామాణికములైన విషయాలను ప్రవచించి అమూల్యమైన విశిష్టాద్వైత సిద్ధాన్తసన్దేశాన్ని లోకాని కందించారు. ఆ మహనీయులందరికీ మనమంతా కృతజ్ఞులమై ఉండాలి.

ఈ సంవత్సరం 42వ ఉభయవవేదాన్త సభలు 2004 అక్టోబర్ 15,16,17 తేదీలలో శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ [illegible]యర్‌స్వామి వారి ప్రత్యక్షపర్యవేక్షణంలో వేదవిశ్వ

విద్యాలయ ప్రాంగణం సీతానగరంలో వైభవముగా జరిగాయి.

శ్రీవెంకటాచలములో నడుస్తున్న వర్తమాన పరిస్థితిని, సందర్భాన్నిగూడ దృష్టిలో ఉంచుకొని శ్రీమదుభయ వేదాన్తాచార్య పీఠకార్యదర్శులైన శ్రీ ఉ.వే. శ్రీమాన్ డా॥ సముద్రాల రంగరామానుజాచార్య స్వామివారు ఈ సంవత్సరపు సభలను శ్రీవెంకటేశ్వరుని గుణానువాదపరముగా తీర్చిదిద్దారు. పెద్దలందరూ అలాగే అమోదించారు గూడ.

మొదటి రోజు సభ పండితపరిమితంగా చర్చాగోష్ఠిగా సాగింది. శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారి అభ్యర్థనను అనుసరించి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యులు ఉపనిషత్సిద్ధాన్త పీఠసంస్థాపకులైన శ్రీశ్రీశ్రీ త్రిదండి రంగరామానుజ జీయర్‌స్వామి వారు చెన్నైలో కార్యక్రమంలో వ్యస్తులై ఉన్నా శ్రమకోర్చి వేంచేసారు. వారి సమక్షంలోనే ప్రథమ దివసపండిత గోష్ఠి ప్రారంభమైనదది. డా॥ ఉ.వే. శ్రీమాన్ సముద్రాల రంగ రామానుజాచార్యస్వామివారు అధ్యక్ష పదవి నలంకరించి సభలను ప్రారంభించారు.

మొదటిరోజు శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారు తిరుమలకున్న పవిత్ర చరిత్రాన్ని వివిధగ్రంథాలనుండి ప్రామాణికంగా నిరూపించి అక్కడ అక్రమంగా జరిగిన వర్తమాన స్థితిగతుల స్వరూపాన్ని విశదముగా వివరించి అక్కడ అధికారులతో జరిగిన సమావేశాన్ని గూడ దృశ్యరూపంలో వ్యక్త పరిచారు. శ్రీశ్రీశ్రీ రంగరామానుజ జీయర్ స్వామివారు మొదటిరోజు చర్చాగోష్ఠిలో పూర్తిగా వేంచేసియుండి తమ అమోఘ సందేశంతో సభకు పూర్ణత్వాన్ని ఆపాదించారు.

మిగిలిన రెండు రోజుల సభ విషయ ప్రతిపాదనపరముగా సాగినది. విభిన్న ప్రాంతములనుండి వేంచేసిన ఉభయవేదాంత విద్వాంసులు మన ఆళ్వారాచార్యులు ప్రసాదించిన దివ్య ప్రబన్ధములలో శ్రీనివాసుని వైభవ ప్రతిపాదకములుగా ఉండే విషయాలను మృదుమధురముగా ప్రవచిస్తూ భగవద్రామానుజులకు తదనుయాయులైన మనకిన్ని తిరుమలకొండతో విడవరాని దృఢసంబంధమున్నదని నిరూపించారు. పెద్దలందరియొక్క ప్రవచనములు వెంకటాచలమయంగానే సాగాయి. వర్తమాన స్థితిగతుల పరిష్కారానికి శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామి వారు కొనసాగిస్తున్న పునర్వైభవస్థాపన విషయంలో మేమంతా సిద్ధముగా ఉన్నామని తమ తమ హార్దభావాన్ని విద్వాంసులంతా వ్యక్తం చేసారు. 40 మందికి పైగా పండితోత్తములు సభలో పాల్గొన్నారు.

17-10-2004 సాయంకాలం పండిత సమ్మానముతో శ్రీశ్రీశ్రీ జీయర్‌స్వామి వారి అనుగ్రహభాషణంతోను సభాకార్యక్రమం సంపన్నమైనది.

అక్టోబరు 2,3 తేదీలలో శ్రీ స్వామివారి అధ్యక్షతన "వికాసతరంగిణి కేంద్ర కార్యకారణీ" సమావేశం సీతానగరంలో జరిగింది. అందులో ఈక్రింది తీర్మానాలను సెంట్రల్ కమిటీ ఏకగ్రీవంగా ఆమోదించింది.

1. ఇంతవరకు వికాసతరంగిణి నిర్వహించిన వివిధ సేవాకార్యక్రమాలను సమీక్షించి, సమాజంలోని అన్ని వర్గాలకు మరింత విస్తృతంగా సేవలను అందించాలని తీర్మానించడమైనది.
2. **"కృష్ణంవందే జగద్గురుమ్"** కార్యక్రమాన్ని పదివేల గ్రామాలకు, గీతాజ్యోతి కార్యక్రమాన్ని 13,000 పైగ గ్రామాలకు అందజేసిన కార్యకర్తల కృషిని అభినందిస్తూ తీర్మానించడమైనది.
3. గత 2సం॥లుగా నిర్విరామంగా **"తిరుమల శ్రీవారి"** సేవలో పాల్గొన్న 8,600మంది వికాసతరంగిణి సేవకులను అభినందిస్తూ తీర్మానించడమైనది.
4. 9-8-2004వ తేదీన దేవాదాయశాఖామంత్రి శ్రీమాన్ సత్యనారాయణరావు, టి.టి.డి ఛైర్మన్ శ్రీమాన్ టి.సుబ్బిరామిరెడ్డిగార్లు, **"మహాప్రాకార నిర్మాణాన్ని ఆపివేయటానికి, వేయికాళ్ళ మండపాన్ని అక్కడే పునర్నిర్మించటానికి"** అంగీకరిస్తూ శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారికి ఇచ్చిన మెమోను ప్రభుత్వం ఎటువంటి జాప్యం లేకుండా తక్షణమే అమలు జరపాలని తీర్మానించడమైనది.
5. వేయికాళ్ళ మండపాన్ని విధ్వంసం చేయటం ద్వారా దైవానికి, చరిత్రకు తీరని ద్రోహం చేసినవారిపై తగిన చర్యను తీసుకోవల్సిందిగా ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తూ తీర్మానించడమైనది.
6. మహాప్రాకారాన్ని నిలిపివేయటానికి, వేయికాళ్ళ మండపాన్ని అదేస్థానంలో పునర్నిర్మాణం చేయటానికి వికాసతరంగిణి చేపట్టిన మహోద్యమంలో భాగస్వాములుగా పాల్గొనటానికై వివిధ శ్రీవేంకటేశ్వర భక్తమండలులను, ధార్మిక సంస్థలను ఆహ్వానించటానికి తీర్మానించటమైంది.
7. వేయికాళ్ళమండపం పునర్నిర్మాణంలో జరుగుతున్న జాప్యానికి నిరసనగా **"విజయవాడనుండి తిరుపతికి"** 6-11-2004వ తేదీన వేయి కార్లతో **"వేయికాళ్ళ మండప పునర్నిర్మాణ యాత్ర"**ను నిర్వహించటానికి తీర్మానించటమైనది.
8. **"తిరుమలవివాదం"**పై సముచిత పరిష్కారాన్ని నిర్ణయించటానికై అఖిలభారత

స్థాయిలో హైదరాబాద్‌లో ధర్మాచార్యులతో **"సంత్‌సంగోష్ఠి"**ని డిసెంబర్ 4,5 తేదీలలో నిర్వహించటానికి తీర్మానించటమైనది.

9. **"సంత్ సంగోష్ఠి"** నిర్ణయం మేరకు 'తిరుమల వివాదం'పై వికాసతరంగిణి ప్రత్యక్ష కార్యాచరణకి సిద్ధమౌతుందని తీర్మానించటమైనది.

కార్యక్రమాల సమీక్షకై 24.10.04 నాడు తిరిగి సమావేశం కావాలని, దానిలో పాల్గొనడానికి జోనల్, జిల్లా స్థాయి కార్యకర్తలను గూడ ఆహ్వానించాలని నిర్ణయమైంది.

## ముఖచిత్ర పరిచయము

కృపామాత్ర ప్రసన్నాచార్యులు పరమోదారులైన శ్రీభగవద్రామానుజాచార్య స్వామిని జ్ఞానముద్రాంచితులుగా ముఖచిత్రములో మనమంతా సేవించుకోవచ్చు. వీరు జగదాచార్యులే కాక సప్తగిరిపై వేంచేసియున్న శ్రీవేంకటేశ్వరస్వామికి గూడ ఆచార్యులే సుమండీ!!

ఉపనిషత్తులలో నిగూఢముగా నిధివలె దాగియున్న తత్త్వరహస్యములను **"వేదార్థ సంగ్రహ"**మనే గ్రంథముఖముగా శ్రీవేంకటేశ్వర స్వామికి ఉపదేశించి శంఖచక్రములను ధరింపచేసి **"సర్వేషాం ప్రథమాచార్యమ్"** అని కీర్తినందుకున్న ఆ దైవానికి కూడా ఆచార్యులైయ్యారు మన భగవద్రామానుజ మునీంద్రులు.

శ్రీరామానుజులు తిరుమలకు వేంచేసి భగవంతుని ఆరాధనాపద్ధతిని, కైంకర్యవ్యవస్థను క్రమబద్ధం చేసి తమ ప్రధానశిష్యులైన **"అనందాన్ పిళ్ళై"** అనే మహానుభావులను అచ్చట నిత్య కైంకర్యములో నియమించి స్వామికి సర్వోపచారములు జరిగేలా మహోపకారం చేసిన మహోదారులు అన్న విషయము మరువరానిది.

శ్రీరంగాది దివ్యదేశములలో వీరు అంజలిముద్రాఘటితులై వేంచేసియున్నారు. తమతో సంబంధం కలిగినవారందరికీ మోక్షమును ప్రసాదించమని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నారట. శ్రీఅనంతాళ్వాన్‌కి జ్ఞానముద్రాంకితమైన తమ శ్రీవిగ్రహాన్ని శ్రీభగవద్రామానుజులు ప్రసాదించిరి. శ్రీరామానుజులు అవతారమును చాలించిన తరువాత అనంతాళ్వాన్ దుఃఖింపగా శ్రీవేంకటేశ్వరస్వామి **వారు మీకెలా ఆచార్యులో నాకున్నూ ఆచార్యులే. ఆ శ్రీవిగ్రహాన్ని మా సన్నిధిలో ఈశాన్య భాగమున ప్రతిష్ఠింప చేయండి** అని అదేశించగా, అనంతాళ్వాన్ శ్రీభగవద్రామానుజులను అచ్చట ప్రతిష్ఠింపచేసిరి. శ్రీవేంకటేశ్వరస్వామి సన్నిధిలో ఉచ్చస్థానములో ఉపదేశముద్రతో వేంచేసియున్నారు మన స్వామి. ఆ కమనీయమైన సన్నివేశాన్నే మనం ముఖచిత్రంలో సేవించుకుంటున్నాం.

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమత్ పరమహంస పరివ్రాజకులైన శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి తిరునక్షత్ర మహోత్సవ సందర్భంగా జరిగే

# జీయర్ పురస్కార ప్రదాన మహోత్సవము

**(2004)**

ఈ సంవత్సరం దీపావళి ది. 12-11-2004న సమర్పించే **జీయర్ పురస్కారాన్ని** శ్రీశ్రీశ్రీ స్వామివారి తిరునక్షత్ర మహోత్సవ సందర్భంగా టి.టి.డి.లో వేద పారాయణపరులై న్యాయ, మీమాంసా, వేదాంత శిరోమణులైన **బ్రహ్మశ్రీ కె.చంద్రశేఖర ఘనపాఠి** గారికి శ్రీస్వామివారి శ్రీకరముల ద్వారా అందచేయనున్నారు.

**పురస్కార ప్రదానోత్సవము:** సీతానగరం వేదవిశ్వవిద్యాలయ ప్రాంగణంలో 12వ తేది ఉదయం గం. 10-00కి ప్రారంభమై శ్రీవారి మంగళాశాసనాలతో ముగుస్తుంది. భగవద్బంధువులందరినీ ఈ వైదిక కార్యక్రమములో పాల్గొని వేదవేద్యుని కటాక్షమును, ఆచార్య అనుగ్రహాన్ని పొందవలసిందిగా ఆహ్వానిస్తున్నాము.

తిరునక్షత్ర నిర్వాహకులు: **జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్**, సీతానగరం.



# సహస్ర కలశాభిషేకము

**(15-11-2004)**

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ జీయరుస్వామివారి ఆరాధ్యదైవం శ్రీ సీతారామచంద్ర పెరుమాళ్ళకు 15-11-2004న సీతానగరం వేదవిశ్వవిద్యాలయ ప్రాంగణంలో సహస్ర కలశాభిషేకం జరుగును. ఆశ్రిత జనులపై శ్రీరాముని వాత్సల్యాన్ని నిరూపించే అభిషేక మహోత్సవములో భగవత్ బంధువులందరూ పాల్గొని శ్రీవారి అనుగ్రహాన్ని పొందగలరు.

**- జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్**, సీతానగరం

July - 2004 BHAKTHINIVEDANA
Sitanagaram, Guntur Dist - 522 501.

Licenced post with out prepayment
No. AP/VJ/5-34/03.

RNI Regd. No.: 52762/91
Postal Regd. No. PMG/VJ/5-34/03 (2003-2005)
Dt. : 30-12-2002.

## విషయ సూచిక.....



## పంచాంగ వివరాలు

### డిసెంబర్

2 గురుపుష్యమి, జ్యేష్టకార్తె
8 సర్వేషామేకాదశి
9 తిథి, యమప్రీతి దీపదానం, శనిత్రయోదశి
10 మాసశివరాత్రి
11 కోటికన్యాదానం, తాతాచార్యర్ తిరు॥
12 అవమతిథి, అమావాస్య
15 ధనస్సంక్రమణము రా.2-55 మూలకార్తె
16 తెల్లవారుఝామున ప్రథమ పాశురసేవ,
20 తిథిద్వయం
21 ఏకాదశి తిథి
22 సర్వేషాం ముక్కోటి వైకుంఠ ఏకాదశి, శ్రీరంగం, భద్రాచలాదిక్షేత్రములలో పరమపదద్వారదర్శనం, గీతాజయంతి.
23 శూన్యతిథి
24 హనమద్వ్రతం
28 పూర్వాషాఢ కార్తె

### జనవరి

1 ఆంగ్లవత్సరాది
3 త్రిసోష్టకా
6 సర్వేషామేకాదశి
7 నాలూచాన్ తిరు॥
8 తొండరడిప్పొడియాళ్వార్ తిరు॥ పెరియనంబి తిరు॥
9 మాస శివరాత్రి
10 సర్వేషాం సోమవతి అమావాస్య ఉత్తరాషాఢకార్తె
13 భోగి పండుగ సమస్త శ్రీవైష్ణవ క్షేత్రములలో గోదాకళ్యాణోత్సవం.


Printed and published by Sri **T.P. Sriramachandracharyulu** owned by **Jeeyar Educational Trust** and Printed at **Sriman Printers & Processors** Sitanagaram and Published at Sitanagaram, **Editor Sri T.P. Sriramachandracharyulu 7-48, Brindavani, Visakhapatnam - 530 028.**

మీ సేవలో....

**భక్తినివేదన,** సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, & (08645) 272929,
**చందావివరాలు:**-సంవత్సరచందా రూ.50/-, జీవితచందా రూ.500/-,
విదేశాలకు సంవత్సరచందా $ 25,

E-mail : jetsitanagaram@yahoo.com Internet : www.chinnajeeyar.org

D.T.P. & Design by : పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం,


శ్రీమతే రామానుజాయ నమః

# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాస పత్రిక




శ్రీతారణ నామ సంవత్సరం కార్తీకమాసం

సంపుటి 57 **2004 డిసెంబర్** సంచిక 9

వ్యవస్థాపకులు

శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యులు
శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు

సంపాదకులు :

శ్రీ ఉ. వే. శ్రీమాన్ T.P. **శ్రీరామచంద్రాచార్యులు**

సంపాదకీయం

# ఆశలుండాలి - అవధులూ ఉండాలి –

ఆశలేని మనిషి సృష్టిలో ఉండడు. మనిషి పుట్టేది ఆశతో. బతికేది ఆశతో. తనువు చాలించేదీ ఆశతోనే.

మనిషి బతుక్కు ఆధారం ఆశ. మానవుడు వర్తమానంలోంచి భవిష్యత్తులోకి సాగటానికి ఆలంబన ఆశ. మహోన్నత గిరిశిఖరాల ఎత్తులకు చేరాలని, దిగంతాల అంచులు తాకాలని ప్రయత్నించేదీ ఆశతోనే.

సృష్టిలోని ప్రాణులన్నీ గానుగెద్దులే. తినటం, కనటం, ఆయువున్నంతకాలం బతకటం, అది తీరగానే తనువుచాలించటం.

మనిషి అట్లాకాదు. బతుకుకోసం మృత్యువుతో పోరాడుతాడు ఆశతో. ఆకలితో పోరాటం, ఆధివ్యాధులతో పోరాటం, అయిన వారితో పోరాటం, కాని వారితో పోరాటం– ఇన్నీ ఏదో ఆశతోనే.

ఆశ లేకపోతే అడుగు ముందుకు పడదు. ఆశే మనిషిని నిలబెడుతుంది. నడిపిస్తుంది. ఎత్తులకెక్కిస్తుంది.

ఆశ సాధ్యాసాధ్యాల చూడనివ్వదు. ఉచితానుచితాలు గమనించనివ్వదు. ఆశకు మనిషి కాస్తలొంగితే తాను వాణ్ణి సొంతం లొంగదీసుకొని సవారీ చేస్తుంది. వాణ్ణి లొంగదీసుకోవటంతోపాటు అంతవరకూ వాణ్ణంటిపెట్టుకొని వాణ్ణి ఒక తెన్నున నడిపిస్తున్న బుద్ధిని, వివేకాన్ని, ఔచిత్యాన్ని న్యాయాన్ని, ధర్మాన్ని–అన్నిటినీ పక్కకు నెట్టేసి తానే పెత్తనం చేస్తుంది.

కురు పాండవయుద్ధం జరుగుతోంది. స్వచ్ఛందమరణంకల అజేయ పరాక్రమశాలి భీష్ముడు నేలకొరిగాడు. అస్త్రవిద్యాగురుడు ద్రోణుడూ విల్లువిడిచి ప్రాణాలు కోల్పోయేడు. పాండవులను మట్టుపెట్టాలన్న పగతో దుర్యోధనుణ్ణి మించిపోయి అర్జునుణ్ణి మించిన మేటి వీరునిగా తనను భావించుకొంటూ అదే తలంపుతో భరోసాతో దుర్యోధనుణ్ణి బతికిస్తున్న కర్ణుడూ మృతిచెందాడు. ఇంకా పాండవులను జయిస్తారా? అసలు, అట్లాంటి ఊహకయినా తావుందా? కాని ఆశ ఉంది చూడండీ అది వేటినీ ఆలోచించనీయదు. **"ఆశాబలవతీ... శల్యోజేష్యతిపాండవాన్**''– ఇంతమందివల్లకాకపోతే మట్టుకేం? శల్యుడు పాండవులను జయించకూడదా? ఈ ఆశతోనే శల్యుణ్ణి సేనాపతిని చేసి పోరుసాగిస్తాడు దుర్యోధనుడు.

ఇదిగో ఇదే బతుకులో కీలకం. తన ఉనికిని నిలుపుకొంటూ, ఎత్తుకు ఎదగాలనుకోవటంలో, ముందుకు సాగాలను కోవటంలో, అనుకొన్నది పొందాలను కోవటంలో మనిషికి ఆసరాగా నిలిచేది. ఎవరివైపూ చూడనివ్వకుండా, ఎవ్వరిమాటా విననివ్వకుండా, కాస్త ఆగి ఆలోచించనివ్వకుండా చరచర మనిషిని తనతో లాక్కుపోయేది ఆశ.



ఆశ ఓ పాశం. 'ఆశాపాశముతా కడున్నిడుపు వేదంతమ్ము'. ఇది మనిషిని ఆశాంతములకు లాక్కుపోతుంది. ఎక్కడున్నాయి ఆ ఆశాంతములు?

అయితే ఆశవద్దంటారా? అయ్యో, వద్దంటే ఎట్లా? ఆశలేకపోతే మనిషి మనుగడే లేదు. మనుగడలో కదలికలేదు. **'ఇచ్ఛతి శతీ సహస్రం, సహస్రీ లక్షమీహతే'**. వందలున్నవాడు వేలుకావాలని, వేలున్నవాడు లక్షాధికారి కావాలని, లక్షలవాడు కోట్లకు పడగలెత్తాలని కోరుకొనేదీ, అందుకుద్యమించేదీ ఆశవల్లనే.

చదువులో ముందుకు సాగాలని, పదవులలో ఎత్తులకెదగాలని, భోగాలనుభవించాలని, సుఖాలు చూరగొనాలని, కీర్తి, ప్రతిష్ఠలు పొందాలని–వీటికన్నిటికీ మూలంగా సంపదలు సంపాదించాలని–ఇట్లా మనిషి బతుకులో ఏ వైపునుంచి చూచినా ఆశ లేకుండా పోవటమంటూ లేదు. అంచేత ఆశ ఉండాల్సిందే.

ఐతే ఆశకు మనిషితాను దాసుడు కాకుండా తాను స్వతంత్రుడుగా ఆశను యథేష్ట వినియోగార్హ్వంగా తన వశంలో పెట్టుకోగలిగినప్పుడు తాను బాగుపడతాడు. ఒరుల బాగుకూ తోడుపడినవాడౌతాడు. అట్లాంటి ఆశ స్పృహణీయం.

మనిషి మనుగడ పరిపూర్ణం కావటానికి నిర్దిష్ట విధాన చతుర్విధ పురుషార్థములనూ అనుభవించాలి. ధర్మార్థాలతో పాటు మోక్షంతో పాటు కామమూ ఒక పురుషార్థమే. దీన్నీ పొందాల్సిందే.

ధర్మాన్ని తెలుసుకోవటం, దాన్ని అనుష్ఠించటం మనిషి ప్రాథమిక కర్తవ్యం. ధర్మానుష్ఠానం వ్యక్తినిష్ఠయే అయినా దీని పర్యవసానం సమాజంలో. వ్యక్తి మనుగడతో పాటు సామాజిక జీవనానికీ అర్థకామాలు ఆవశ్యకాలు. అర్థాలనార్జించి కామాలననుభవించాలి. అర్థార్జనం ధర్మబద్ధం కావాలి. కామానుభవం ధర్మానుమతం కావాలి. ధర్మావిరుద్ధం కావాలి. ఈ కామానికి పర్యవసానం మోక్షం.

మనిషి మనుగడకు మొదటి మెట్టుధర్మం. చివరిమెట్టు మోక్షం. నడుమనున్నవి అర్థకామాలు. ఈ రెండూ ధర్మనియంత్రితాలు కావాలి. అర్థకామాలు రెండూ వ్యక్తినిష్ఠాలు. వీటిలో అర్థాన్ని సముచితంగా తాను వినియోగించుకొంటూ వ్యక్తి సమాజం కోసం త్యజించి, కామాన్ని మోక్షాభిముఖం కావించుకొని తాను తరించాలి. వీడు వదలిన అర్థం. 'ధర్మార్జితం' కావటాన దానివల్ల సమాజానికి కల్యాణమే చేకూరుతుంది కాని చేటు వాటిల్లదు. వీని కామం ధర్మానుమతం, ధర్మావిరుద్ధం కావటాన అది వీడికి మోక్షప్రాప్తితో చేయూతనిస్తుంది.

ఆడ, మగ కలవటం మాత్రమే కాదు కామం అంటే. ధర్మావిరుద్ధమైన కామం యొక్క విశ్వరూపం గార్హస్థ్యంలో కనవస్తుంది. చతురాశ్రమ వ్యవస్థలో బ్రహ్మచర్యాన్ని కుశల సంప్రశ్న కావించేది, దానికి స్వాగత

మర్యాదలు నెరపేదీ గార్హస్థ్యమే. అట్లాగే వానప్రస్థ ఫలాలనందుకొని సమాజానికి తరగని నిక్షేపాలుగా వాటిని భద్రపరచి, ఉత్తమాశ్రములను ఉత్తమాంగముల నిలుపుకొని వారి ద్వారా ఉజ్జీవించేదీ గార్హస్థ్యంలోనే. ధర్మావిరుద్ధమైన కామం వల్లనే ఇదంతా నెరవేరేది.

ఆశలనండి, వాంఛలనండి, కాంక్షలు అనండి, ఇష్టాలనండి, రాగాలనండి, భోగాలనండి–ఇవన్నీ కామంయొక్క వివర్తాలే.

కామం ఒక పురుషార్థం అయినప్పుడు దానివల్ల ఏర్పడేవి మట్టుకు స్వీకార్యాలు ఎందుకు కావు? తప్పక స్వీకార్యాలే! అయితే ఒక్కటి, ఇవన్నీ కామవివర్తాలన్నాం కదా, ఈ ఆశలూ ధర్మావిరుద్ధాలైనప్పుడే ఆదరణీయాలవుతాయి.

ఆశాస్వరూపం బహుముఖం. వేయి పడగల విస్తరించి ఉంటుంది దీని విశ్వరూపం.

కొందరు బుద్ధిమంతులు బహుముఖమైన ఆశను త్రిముఖంగా సూక్ష్మీకరించి బీజప్రాయంగా చూపించి దీనిపట్ల మెలకువతో ఉండాలని హెచ్చరించారు.

వారు దర్శించిన ఆశాముఖాలు మూడు ఇవి.

మణ్ణాశ, పొన్నాశ, పెణ్ణాశ.

మణ్ణాశ– భూకాంక్ష, పొన్నాశ–కాంచన వాంఛ, పెణ్ణాశ–కామినీకామం. 'మణ్ణాసయు, పొన్నాసయు, పెణ్ణాసయు లేనివారు' అంటాడు ధూర్జటి.

మొదటిది రాజ్యకాంక్ష.

భూమి, పుత్ర, తోట–దొడ్డి, ఇల్లు–వాకిలి, ఇల్లాంటివన్నీ ఈ కోవలోనివే. ఇవన్నీ స్థిర సంపదలు. వీటి వల్ల వచ్చే దర్పం, దీవి, అధికారం ఇట్లాంటివన్నీ ఇందులో చేరతాయి.

రెండవది. కాంచన వాంఛ.

బంగారంపై ఆశ. పొన్నుఅంటే బంగారం. ఇక్కడ బంగారం ప్రతీక. వస్త్ర–ఆభరణము, స్నాన–శయ్యా–ఆసన–వాహన–పాన–భోజనాదులు. సామాన్యులకు ఇవి అవసరాలు. ఇవే శ్రీమాన్యులకు భోగానుభవాలు. ఆశలు పెరగగానే ఇవి భోగాలయి మనిషిని ఆడిస్తాయి.

మూడవది కామినీ కామం. స్త్రీవాంఛ. పెణ్ అంటే స్త్రీ. 'పెంటి'లో ఈ స్త్రీ కన వస్తుంది. దీన్ని జాగ్రత్తగా గమనించాలి. ఇది గార్హస్థ్య రూపమైన దాంపత్యం కాక విశృంఖలంగా ధర్మవిరుద్ధంగా ఏర్పడే స్త్రీ వాంఛ. ఇది సుతారమూ కూడనిది.

సర్వాశ్రమాల వారికీ ఆసరాగా నిలిచే గృహస్థాశ్రమంలో ఉన్నవారికి ఇల్లు–వాకిలి, తోట–దొడ్డి, గొడ్డు–గోద, స్నానం–పానం, కూడు–గుడ్డ. నిరుపద్రవంగా నిలువనీడ అన్నీ కావాలి. ఆలూ కావాలి. చూలూ కావాలి. వారికి అంతో ఇంతో ఆభరణాలూ కావాలి.

సమాజం కొనసాగాలి. అంచేత గృహస్థులకు మణ్ణాశ, పొన్నాశ, పెణ్ణాశ–మూడు కావాలి. ఐతే ఇక్కడ ఒక నియతి ఉంది.



నియంత్రణ ఉంది. ఆవశ్యకతను చూడాలి. పర్యాప్తతను చూసుకోవాలి.

అవధులు లేని ఆశలు కూడదు. అనుచితములైన ఆశలు కూడదు.

ఒకని ఆశలు వాని బతుకులో వెలుగులు నింపినా పరులబతుకులలో చీకట్లు చిమ్మరాదు.

ధర్మాన్ని అతిక్రమించిన నిరవధికమైన రాజ్యకాంక్ష దుర్యోధనుణ్ణి మట్టుపెట్టింది.

ధర్మవిరుద్ధమైన కాంతా కాంక్ష రావణుణ్ణి మట్టిలో కలిపింది.

భోగాలన్నీ తానే అనుభవించాలనీ, భోగభూముల పెత్తనం ఎప్పుడూ తనకే ఉండాలనీ, ఎప్పుడు ఏమి ఉప్పెన వచ్చి ఈ అనుభవాలకు కొరత ఏర్పడుతుందో అనీ ఎవరు ముక్కుమూసుక్కూచున్నా తనకే ఎసరు పెడుతున్నాడనుకొని వాని తపోభంగం కోసం కాని పనులకొడిగట్టి ప్రతిక్షణం భయంతోనే చస్తూ బతికే ఇంద్రుణ్ణి చూస్తే 'పొన్నాశ' ఎంత చెడ్డదో తెలుస్తుంది. ఇట్లాంటి వాటికి మనిషి సిద్ధపడకూడదు.

నువ్వనుభవిస్తున్న భోగాలు ఒరులూ అనుభవించాలని ఉదారంగా భావించినప్పుడు ఉద్వేగం ఉపశమిస్తుంది.

అవతలి వాడి అనుభవంలోని ఆనందాన్ని వీడూ అను భవింపగలనాడు ఆ భోగాలు అనుభవాలు నిరుపద్రవాలు అవే స్పృహణీయాలు.

సంపదలు కాని స్త్రీలు కాని తనకు చెందని వాటిని ఒరులకు చెందిన వాటిని ధర్మాన్ని అతిక్రమించి తనవిగా చేసుకొని అనుభవించాలనుకోవటం దుర్యోధనుడు, రావణుడు–వంటివారు చేసే పనులు. మనిషి అన్నవాడు అట్లా చేయకూడదు.

అర్థకామాలు రెండూ ధర్మబద్ధాలు కావాలి. ధర్మావిరుద్ధాలు కావాలి. అర్థార్జనంలో ధర్మాన్ని పాటించాలి. ధర్మం నిర్దేశించినట్లు అర్థాన్ని వినియోగించాలి. ధర్మావిరుద్ధంగా కామాన్ననుభవించాలి.

పైన పేర్కొన్న మూడాశలూ ధర్మావధిని దాటితే వినాశకరాలు ధర్మావిరుద్ధంగా ఉన్నంతవరకూ ఉపాదేయాలే.

ఆశలు కూడదనటం వేరు. అవధులుండాలి వాటికి అంటున్నారు పెద్దలు.

**- శ్రీ రామచంద్రాచార్య**



## అభినందనలు

భక్తినివేదన పాఠక కుటుంబాన్ని మరింత పెంచేందుకు కృషి చేస్తున్న వారిలో శ్రీమాన్ **ఎల్.వి. శేఖర్**గారు ఒకరు. వీరు గుంతకల్ వికాసతరంగిణి సభ్యులు. వీరికి శ్రీశ్రీశ్రీ స్వామివారు మంగళాశాసనాలు కృపచేశారు.

# చ్యవనమహర్షి

## మహర్షుల చరిత్ర

తమిళమూలం :
వై.వా. నావల్‌పాకం దేవనాథ
తాతాచార్యస్వామి

తెలుగు సేత :
శ్రీ.ఉ.వే.ప్ర శ్రీమాన్ తూపురాణి
ఉడయవర్‌స్వామి, విజయవాడ

**తగిన పేరు :**

చ్యవనుడు, ఒక గొప్పఋషి. ఇతడు తల్లిగర్భంలో ఉండగా, ఆమెను ఒక రాక్షసుడు బలాత్కారంగా ఎత్తుకుపోయాడు. ఆ పెనుగులాటలో అనుకోకుండా గర్భవిచ్ఛిత్తి జరిగి బయటపడ్డవాడు కనుక చ్యవనుడు అనే పేరు ఇతనికి పెట్టారు.'చ్యవనుడు' అంటే జార్చబడినవాడు, విడువబడినవాడు అని అర్థం.

నమ్మాళ్వార్లు పుట్టినపుడే లోకవిరుద్ధంగ పాలుత్రాగడం, ఏడవడంవంటివి లేకుండా ఉండటం చేత వారికి **'మారన్'** అని పేరు ఏర్పడినట్లే, చ్యవనుని విషయంలో కూడ అని గ్రహించాలి.

**సుకన్య :**

ఈ చ్యవనుని భార్యపేరే 'సుకన్య'. 'మంచిస్త్రీ' అని సుకన్య అనే పదానికి అర్థం. ఉత్తమమైన పతివ్రతలలో ఈమెకు కూడ స్థానం లభించింది. సుకన్య చ్యవనునికి ధర్మపత్ని కావడం ఒక విచిత్రమైన కథ.

**ఘోరతపస్సు :**

నర్మదానదీ తీరంలో 'వైఢూర్యపర్వతం' ఉంది. దాని ప్రక్కనే 'పయోషణి అని' ఒక పెద్ద సరస్సు. దాని ఒడ్డున ఆశ్రమం నిర్మించుకుని చ్యవన మహర్షి ఘోరమైన తపస్సు చెయ్యడం ప్రారంభించాడు.

చాలకాలం అలా తపస్సు సాగడంతో అతనిపై ఆకులు మొదలైనవి రాలిపడి క్రమంగా అదొాక పుట్టగా మార్చింది. అది పెద్ద పుట్టుగానే కనపడడంతో అందులో చ్యవనుడు ఉన్న సంగతి ఎవరికీ తెలియకుండా పోయింది.

**జలక్రీడ :**

ఆ ప్రాంతాన్ని పాలించే రాజు శర్యాతి. అతనికి నాలుగు వేలమంది భార్యలట. ఒకే ఒక కుమార్తె. ఆమే 'సుకన్య'.

ఒకసారి ఆరాజు తనపట్టమహిషులతోను, గారాబుబిడ్డ సుకన్యతోను ఆ పయోషణి సరస్సులో జలక్రీడలాడుదామని వచ్చాడు. అతనివెంట చతుర్విధ బలగాలు వచ్చాయి.

**బాల్యచేష్ట :**

రాజు భార్యలతో జలక్రీడలో పరవశుడైపోయి ఉండగా, సుకన్య తన చెలికత్తెలతో వనసౌందర్యాన్ని ఆస్వాదించసాగింది.

ఇంతలో చ్యవనుడుండే పుట్టదగ్గరకు ఆ పిల్లలంతా చేరారు. పుట్టులో నుండి ఏదో ప్రకాశిస్తున్నట్టు సుకన్యకు కనిపించింది.

ఈ ప్రకాశం ఏమిటో తెలుసుకోవాలి అని అనుకుంది 'సుకన్య'. ఒక పొడవైనపుల్లతో ఆ కన్నాలలో గ్రుచ్చింది.



'ఆట' కాస్తా 'పాపం'గా మారింది. గుచ్చిన చోటు నుంచి రక్తంధారగా రావడం ప్రారంభించింది. సుకన్య భయంతో వణికిపోయింది. కాని ఎవ్వరితోను ఈ విషయం చెప్పలేదు. ఏమవుతుందోనని భయం. అంతేకాక చిన్నతనంచేత వచ్చిన అజ్ఞానం దానికి తోడు అయింది.

**భయంకర పరిణామం :**

సుకన్య చేసిన చిలిపి చేష్ట, భయంకర పరిణామానికి దారితీసింది. రాజు సైన్యంలో అందరికి కడుపులు ఉబ్బరించి మల మూత్రాలు నిలిచిపోయాయి. మనుషులకే కాక గుఱ్ఱాలకు, ఏనుగులకు కూడ ఇదే స్థితి ఏర్పడింది. ఈ వార్త రాజుగారి చెవికి సోకింది. ఎంతోమంది ఘనవైద్యులు వైద్యం చేసినా ఫలితం లేకుండా పోయింది. అంతా దిగ్భ్రాంతి చెందిపోయారు.

శర్యాతి మహారాజు సూక్ష్మబుద్ధిగల వ్యక్తి. ఏదో దైవసంబంధమైన పొరపాటు జరిగి ఉండడం వల్లనే ఇటువంటి స్థితి ఏర్పడిందని గ్రహించాడు. లేకపోతే, ఒకే సమయంలో, సేనలో అందరికి ఇటువంటి స్థితి ఏర్పడదని కూడ భావించాడు.

ఒక్కొక్కరినే పిలిచి, 'ఏదైనా పొరపాటు చేశావా?' అని అడగడం ఆరంభించాడు. 'సుకన్య తన వంతు వచ్చేసరికి ఆమె తన తండ్రితో జరిగినది జరిగినట్లుగా చెప్పింది. రాజుకు విషయం అర్థమయింది. వెంటనే ఆ పుట్టవద్దకు పరుగు పరుగున వెళ్ళి చూస్తాడు. ఆ పుట్టలో మహాతేజస్వియైన ఒక మునికంటినుండి రక్తం ప్రవహిస్తున్నట్లు తెలుసుకున్నాడు.

**వివాహం:**

రాజు తన సైన్యంతోను, కుమార్తె సుకన్యతోను ఆ మునికి నమస్కరించి, తన సేనను ఉపద్రవాన్నుంచి కాపాడమని ప్రార్థించాడు. దీనికోసం తనను ఏం చెయ్యమన్నా చెయ్యడానికి సిద్ధంగా ఉన్నానని విన్నవించుకున్నాడు. "ఆ పిల్లవల్ల తన కన్నుపోయి, ఏమీ చేసుకోలేని స్థితికి చేరాను కనుక నాకవసరమైన పనులన్నీ చేసిపెట్టడానికి ఆమెయే నాతో సహజీవనం చేస్తూ పత్నిగ ఉండిపోయినట్లైతే ఆమె దోషం తొలగి, నీ సేనయొక్క రోగమూ తొలగుతుంది'' అన్నాడాయన. ఆలోచించడానికి కూడ వీలు కాని పరిస్థితి. రాజు 'సరే' అని తల ఊపాడు. వెంటనే సైన్యంలో అందరికి వ్యాధిపోయింది.

మెల్లగా పుట్టను తొలగించి చూడగా వారికి ఘోరమైనదృశ్యం ఎదురైంది. ఒట్టి ఎముకలప్రోగు ప్రాణంతో పుట్టలోపల కనపడింది. ఆహారం తీసుకొని ఎన్ని సంవత్సరాలు అయిందో! అందాలరాశి, శర్యాతి చక్రవర్తి ఏకైకపుత్రిక అయిన సుకన్యకు ఇటువంటి వానిని భర్తగా బ్రహ్మవ్రాసి పెట్టాడు.

విధివ్రాతను ఎవరూ మార్చలేరు. ప్రేమ వ్యవహారానికి ఏ కొంచెము తగనివాడు, ఘోరమైన, భయంకరమైన రూపం కలవాడు అయిన మునికి, పూవుకంటె సుకుమారమైన, సౌందర్యమే రూపుదాల్చినట్లున్న రాజకుమార్తె సుకన్యతో వివాహం వైభవంగా జరిగింది. ఏ ముహూర్తంలో అంతఃపురాన్ని విడచి వెళ్ళిందో, మళ్ళీ అంతఃపురాన్ని మనసులో కూడ తలవనైనా తలవలేదు. చూడలేదు. ఆ అడవే ఆమెకు అంతఃపురం. ఆమె 'ఋషిపత్ని' అయింది.

**పతియే దైవం:**

చ్యవనమహర్షి ఆకారం పైకి వికారంగా కనిపించడమే కాక, లోపల కూడ మహా కోపిష్ఠి. ఇతనితో వేగడం మామూలు వారికి మహా కష్టం.

కానీ సుకన్య ఏనాడూ అలా భావించ లేదు. ఎవరైనా అలాటి భావం వ్యక్తంచేసినా ఆ మాటలు ఆమె మనస్సును గాయపరి చేవిగా ఉండేవి. మెడలో తాళికట్టిన భర్త దైవంకంటె మిన్న అని భావించింది అట్టి ఉత్తమురాలు ఆమె. నిజానికి ఆ కాలంకూడ అటువంటిదే. అందహీనుడైనా, కోపిష్ఠి అయినా భర్త దైవంతో సమానమే. పతి శుశ్రూషయే పత్నికి ధర్మం. ఎవరేమి అనుకుంటే ఏమి? చిన్న వయస్సులోనున్న రాజకుమార్తె సుకన్య, ఈ విషయంలో పరిపూర్ణ విజయాన్ని సాధించింది.

మహాభారతంలో వ్యాసమహర్షి, ఆశ్చర్యంతో ఇలా చెప్పాడు.

శ్లో॥ **సుకన్యా చ్యవనం ప్రాప్య,**
**పతిం పరమకోపనం**
**ప్రీణయామాస చిత్తజ్ఞా,**
**అప్రమత్తానువృత్తిభిః ॥**

"మహా కోపిష్ఠియైన చ్యవనుని భర్తగా పొందిన సుకన్య, భర్తసౌకర్యములను గమనిస్తూ, ఏమరుపాటులేని సేవతో భర్తను అన్ని విధములుగా సంతోషపరచినది".

**శోధన-సాధనః :**

'సుకన్యా చ్యవనం యథా' అని రామాయణంలో సీత ఒకమాట అంటుంది. రామునియందు తనకు (సీతకు) ఉన్న భక్తిని, విశ్వాసాన్ని, తన పాతివ్రత్యాన్ని, ఎత్తిచూపే సందర్భంలో చెప్పినదీమాట. ఎటువంటి విషమపరిస్థితిల్లో కూడ పతివ్రత తన ధైర్యాన్ని పోగొట్టుకోకూడదు. చివరకు విజయం ఆమెకు సిద్ధిస్తుంది. సుకన్య చరిత్రే దీనికి ఉదాహరణ. దీనినే మనసులో భావించిన సీతమ్మ చెప్పినదే పై శ్లోకఖండం.

చ్యవనమహర్షి తన ధర్మపత్ని సుకన్యతో గృహస్థాశ్రమ జీవితాన్ని గడుపుతూ ఉండగా, సుకన్యకు ఒక కఠోరమైన పరీక్ష ఎదురైంది. ఇందులో కూడ ఆమె విజయాన్నే పొందింది. చాలగొప్ప విషమపరీక్ష ఇది.

⟹⟹⟹

## పరమపద వార్త



**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామి వారి** శిష్యులు శ్రీమాన్ **టి.ఎస్. వేదవ్యాసాచార్యులు.**

వరంగల్ గీతాభవనంలో శ్రీ.ఉ.వే. శ్రీమాన్ ముడుంబై రామానుజాచార్య స్వామివారి సన్నిధిలో ఆగమాధ్యయనం చేసి అచటనే భగవద్భాగవతాచార్య కైంకర్యనిష్ఠులై యుండి అకస్మాత్తుగా ఆచార్యతిరువడి చేరడం ప్రపన్నగోష్ఠికి తీరని లోటుగా భావిస్తున్నాము. వారి దివ్యాత్మకు ఆచార్యపురుషకారంతో తన దివ్యచరణ సన్నిధిలో సమస్త కైంకర్యములు ప్రసాదించాలని కోరుచున్నాము.



# తిరునక్షత్ర శుభాకాంక్షలు

శ్రీమత్పరమహంసేత్యాది, శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చినజీయరుస్వామివారికి, "తిరునక్షత్రోత్సవ" సందర్భంగా; స్వరూపానురూపముగా పంపిన మంగళాశాసనములు:-

పేరునకది **"తిరునక్షత్రము"**!
తీరునకది వేడ్కరోజు! **"తిరువేదముకు"**న్
ధీరుడు! శ్రీ చినజీయరు!
వారికి **"శతవర్షమాయిరస్తు"**గు గాతన్ ॥

పేరున చినజీయరైన !
తీరున ఖండాంతరములు **"దివ్వెవెలుగున్"**!
శ్రీ రఘురాముని కృపయే!
వారికి వరమై! యశస్సు వర్ధిలుచుండెన్ ॥

పెదపెద్ద ప్రణాళికలలో;
పెదజీయరు మించి – కీర్తి పెంపగుచుండెన్!
సదయయు, గోదాదేవియు,
హృదయంబున నిల్చి జనులకూరటనిచ్చెన్ ॥

వేదము వర్ధిలజేయుచు,
పేదవటుల పోషించును–పెద్దమనసుతో!
**"శ్రీధర పరతత్త్వంబును"**
కాదను–మూర్ఖులనువంచి–గడుసరి!యయ్యెన్॥

శ్రీపతి కృపయే తోడయ,
ఆపదలను బాపి–**"శతము ఆయువు"**తోడన్!
ఆపయి–కార్యములన్నియు,
ఆపుదలలు తొలగ; **"మంగళాశాసనముల్"**॥

(శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీకృష్ణయతీంద్ర రామానుజజీయర్)

**శ్రీ త్రిదండి శ్రీకృష్ణయతీంద్ర రామానుజ జీయరుస్వామి,** శ్రీ గీతాశ్రమం ట్రస్ట్, అలకాపురికాలనీ, కరీంనగర్–1

# నేడు మనకవసరం అయిన కొన్ని మంత్రాలు

శ్రీమాన్ పోరూరి వెంకటనారాయణ - హైదరాబాద్

**మంత్రాలకు చింతకాయలు రాల్తాయా? చూద్దాం.**

మన దృష్టిలో మంత్రం అంటే శ్రమలేని, ఖర్చులేని ఉపాయం. మనకెన్నెన్నో కోరికలు. అవి తీరే సులభమైన ఉపాయం మనకు కావాలి. ఈ కోరికలను తీర్చటమేకాక, అసలుతో పాటు వడ్డీ లభించినట్లు, ముక్తి కూడా లభిస్తే ఇంకా బాగుంటుంది కదా. అలాంటి ఉపాయమే మంత్రం.

మంత్రం అంటే భగవంతుని స్మరింప చేసే అతని దివ్యనామమే. అలాంటి వేయినామాలు ఉన్న స్తోత్రమే శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రం. అందులోని ప్రతినామానికి ఒక ప్రత్యేకశక్తి, అలాగే కొన్ని నామాలుగల ఒక శ్లోకానికి మరొక ప్రత్యేకశక్తి ఉన్నాయి. కొన్ని ఉదాహరణలనిస్తున్నాం. జపిద్దాం. కోరికలు తీరుతాయేమో చూద్దాం.

**1. ఓం రామాయ నమః**

మన కోరిక వేయికాళ్ళమంటపం యథాస్థానంలో యథాతథంగా నిర్మింపబడటం.

పెద్ద సమస్య ఏమిటంటే ముక్కలు ముక్కలై చెల్లాచెదరై కలగాపులగమై ఎక్కడెక్కడో పడివున్న ఆ ముక్కలు ఆ కణాలు దేనిచోట అవి చేరేది ఎలా? చేరితేనే కదా 'యథాతథంగా' అనేది. ఇక్కడ ఒక ఐతిహ్యం.

హనుమ సంజీవినిపర్వతాన్ని తెచ్చి అక్కడ పెట్టగానే వానరులందరూ ఒక్క పెట్టున లేచి నిలబడ్డారుట. ఎవరి అవయవాలు వారినే చేరుకున్నాయి. మరి అట్టి సంజీవిపర్వతం ఎక్కడ వున్నదో, దానిని ఎవరు తేగలరో, తెచ్చినా ఆ స్తంభాలను ఎవరు పెట్టగలరో అని సందేహం వద్దు. అట్టి శక్తి, సామర్థ్యం, తెలివితేటలు ఉన్నవారే మన మారుతి. వారిని ఆనందింప చేయగల నామమే రామనామం.

**2. ఓం విరామాయ నమః**

ఈ మంత్రం శత్రువులను చంపదు. కాని వారిని నిర్వీర్యులను చేస్తుంది.

3. **అమృత్యుః సర్వదృక్ సింహః**
**సంధాతా సంధిమాన్ స్థిరః**
**అజో దుర్మర్షణః శాస్తా**
**విశ్రుతాత్మా సురారిహా ॥**

ఇది 22వ శ్లోకం శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రంలో ఈ శ్లోకం శ్రీనృసింహస్వామివారినే స్మరింపచేస్తుంది అని అంటారు మన పరాశర భట్టర్‌వారు.

స్తంభంనుంచి పుట్టిన స్వామి గనుక, యోగ నృసింహునిగా తిరుమలలోనే శ్రీనివాసుని ప్రక్కనే వున్నారు గనుక, తన తల్లి చెల్లెళ్ళను (ఇతర స్తంభాలను) క్రూరంగాకూల్చిన వారి మీద కసి మామూలు మనిషికే ఉంటుంది గనుక... మంచివాడున్ను, తనను ప్రేమించేవాడైన ప్రహ్లాదుని కాపాడుకుంటే అట్టి మంచివారిని బాధించిన హిరణ్యకశిపుని చీల్చినవాడు గనుక, ఆ నృసింహ స్వామిని తల్చుకుందాం మన యీ పనిని చేసిపెట్టమని, **"వేయికాళ్ళ మంటపాన్ని వెంటనే యథాస్థానంలో యథాతథంగా పునర్ నిర్మించటం. దానిని అడ్డుకునేవారిని నిర్వీర్యులను చేయటం".**

ఈ పనిని చేసి పెట్టగల గుణాలన్నీ ఈ నృసింహస్వామివారికి వున్నయ్ అని చెప్తుంది ఈ శ్లోకం.

200: అమృత్యుః=న+మృత్యుః 'న'కు 6 అర్థాలు.

**తత్సాదృశ్యం అభావశ్చ**
**తదన్యత్వం తదల్పతా**
**అప్రాశస్త్యం విరోధశ్చ**
**నఞార్థాః షట్ ప్రకీర్తితాః**



1 **సాదృశ్యము-మృత్యుసదృశుడు**=మృత్యువు వంటివాడు.

హిరణ్యకశిపునివంటి వారికి మృత్యువు వంటివాడు.

2 **అభావము**= లేకపోవడం, మృత్యువు లేనివాడు; ఈనాటికీ ఉన్నాడు మనల్ని రక్షించుకో గలడు.

3 **అన్యత్వం** = వేరై వుండటం; మృత్యువు కంటే వేరైనవాడు. ఇతడు బాధించడు సాధువులను.

4 **అల్పత్వం** = తక్కువైనది. ఇతనికంటె మృత్యువు అల్పమైనది. మృత్యువువలన ఈ శరీరం పోతుంది. మరొక శరీరం వస్తుంది. ఇతని వలన శరీరమే లేనిస్థితి ఏర్పడ వచ్చును. శరీరం ఉంటే చేయగలిగిన భగవద్భాగవత కైంకర్యం చేసి బాగు పడవచ్చును. భాగ్యాలేశం కూడా లేకుండా చేయగలడు. సాధువులపై బురద చల్లేవారికి అది తగిన శిక్షయే కదా!

5 **అప్రాశస్త్యం** = ప్రశస్తమైనది కాదు.

మృత్యువుకు ఇతనికి ఉన్న ప్రాశస్త్యం లేదు. మృత్యువువంటివాడు హిరణ్యకశిపుడు. వాడి పాలిట మృత్యువు శ్రీనృసింహస్వామి. కనుక మృత్యువుకంటే ఇతడు చాలా చాలా గొప్పవాడు.

6 **విరోధః**=విరుద్ధమైనది. మృత్యువు కానిది. అంటే అమృత స్వరూపుడు.

201 **సర్వదృక్** = అందరినీ గమనిస్తున్నవాడు.

202 **సింహః** = హింసించువాడు, దుష్టులను హింసించువాడు.

203 **సంధాతా** = చేర్చుకొనువాడు, భక్తులను దగ్గరకు తీసుకొనువాడు.

204 **సంధిమాన్** = కలిసి వుండువాడు, భక్తులతో నిత్యము కలిసి వుండువాడు.

205 **స్థిరః** =స్థిరంగావుండేవాడు, విడిచిపోవు వాడు కాదు. తన భక్తులను ఏనాటికీ విడిచి పెట్టడు.

206 **అజః** = జన్మలేనివాడు; మన జన్మవంటి జన్మలేనివాడు. మనం మెత్తగావుండే తల్లి కడుపులోనుండి వచ్చాం. అతడు గట్టిగా వుండే స్తంభం నుండి వచ్చాడు. కనుక అతని శరీరం రాయికంటే దృఢమైనది. కనుక రక్షించ గలడు.

207 **దుర్మర్షణః** = భరింపరాని ప్రతాపం కలవాడు.

208 **శాస్తా** = శిక్షించువాడు. దుష్టులను దృఢంగా శిక్షించువాడు.

209 **విశ్రుతాత్మా**=అందరికీ తెలిసి పోయిన స్వరూపం కలవాడు.

210 **సురారిహా** = సురల శత్రువులను సంహరించువాడు. సు=హితం, ర=యిచ్చు వాడు. అందరికీ మేలు చేయాలి అని అనుకునేవారు సురలు. వారే మన ఆచార్యులు. వారిపై బురద చల్లేవారే వారి శత్రువులు. అట్టివారిని తొలగించ వలసిన అవసరం నేడు ఎంతో ఉన్నది. వారు తొలగకపోతే మనం అందరం ఎంతో నష్టపోతాం. అంటే వారు చెప్పినది నమ్మి, ఆచార్యలనే దోషులనుకొని ఈ అరుదైన జన్మవలన సాధించవలసిన గొప్ప ప్రయోజనాన్ని (అంటే ముక్తిని పొందటాన్ని) పోగొట్టుకుంటాం. తిరిగి ఇలాంటి మానవజన్మ లభించి ఇలాంటి మహాత్ముల సాన్నిధ్యం లభించేది ఎన్ని యుగాలకో. కనుక మనల్ని, కోట్లమందిని భ్రష్టులను చేసే యీ దుష్టులను హిరణ్యకశిపుని వలె సంహావించడం న్యాయమే. అలా చేయగల వారు మన నృసింహస్వామివారు. కనుక వారిని స్తుతిద్దాం. వారిని స్తుతింపచేసేది యీ శ్లోకం. దీనిని జపిద్దాం. శ్రీనృసింహస్వామివారి అనుగ్రహమైనా తప్పకుండా కలుగుతుంది.

జై శ్రీమన్నారాయణ!

## జీయరు గురుకులము- అల్లంపల్లి

# సమీక్ష

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయరుస్వామివారు ఆదిలాబాద్ జిల్లా అల్లంపల్లిలో గిరిజన బాలబాలికల జ్ఞాన విజ్ఞాన వికాసం కోసం నెలకొల్పిన జీయర్ గురుకులము ఇప్పుడు చిగురించి చిరుమొగ్గలు తొడుగుచున్నది. ఆ మొగ్గలు ఇప్పుడిప్పుడే జ్ఞానపరిమళా లను కూడా వెదజల్లుచూ చిరునవ్వుల వెలుగులు చిందించుచున్నవి.

స్వామివారి ప్రతినిధిగా నా పర్యటనలో ఈ గురుకుల బాలబాలికలలో కలిగిన జ్ఞానవికాసమునందు వాస్తవికత, వివేచన ప్రస్ఫుటంగా కనబడతాయి. మన గురుకులములోని విద్యార్థులు వారు చేరినప్పటినుండి, వాళ్ళ తల్లిదండ్రులనుండి అనూచానంగా వస్తున్న మాంసాహారమును మానివేశారు. తల్లిదండ్రులను తమకు వేరే పాత్రలో వండమని వారు ప్రత్యేకంగా గ్లాసులు, పాత్రలు ఉంచుకొని భుజిస్తూ మంచినీరు వగైరా స్వీకరిస్తున్నా రని వారి తల్లిదండ్రులను ప్రశ్నించినపుడు స్వయంగా వారు చెప్పారు. వారలా వెల్లడిస్తూఉంటే నాకెంతో ఆశ్చర్యం కలిగింది. ఇది ఆశింపతగిన **"శుభపరిణామం"**. చిన్నారులలో కలిగిన ఈ ఆశ్చర్యకరమైన మార్పుకు కారణం స్వామి సంకల్పము. మరియు స్వామివారి సౌజన్యంతో వెలసిన ఈ గురుకులము.

స్వామివారి సౌజన్యము గురించి ఒక అల్లంపల్లి గ్రామవాసి "మేము ఏజన్మలో చేసిన పుణ్యమో స్వామివారు ఇక్కడకు వచ్చి మా పిల్లలకు ఈ గురుకులము ఏర్పరచారు. మా జీవితాలలో శోకాలే తప్ప శ్లోకాలు మే మెరుగము. మా పిల్లలు ఇప్పుడు శ్లోకాలు చదువుతున్నారు. ఇంట్లో తిండి (అన్నం) తినేటప్పుడు కూడా ఏవో శ్లోకాలు చదువుతున్నారు. మాకైతే అర్థం తెలియదు కానీ చదువుతుంటే ఎంతో బాగుంటుంది. ఆనందంగా ఉంటుంది. మరో అల్లంపల్లి నివాసి పేరు శంకర్. అతను ఒక టాక్సీ డ్రైవర్ అతడు స్వామి వారు గురుకులము పెట్టినప్పటినుండి గురుకులముతో స్నేహబాంధవ్యాలు ఏర్పరచుకున్నాడు. అతనురోజూ సాయంత్రంపూట 18 అరటిపళ్ళు ఉట్నూరు నుండి తెచ్చి గురుకులములో స్వామివారి సన్నిధిలో విష్ణు సహస్రనామ పారాయణం అయిన తరువాత ఆ అరటిపళ్ళు పెరుమాళ్ళకు నివేదన చేయమని, ప్రసాదం భక్తులకు, విద్యార్థులకు గురువులను పంచమని ఇస్తున్నాడు. అతడు ఇలా అన్నాడు. "స్వామివారు ఇక్కడకు వచ్చి మా పిల్లలకోసం గురుకులము పెట్టడం వల్ల మాకు నెలకు 1000 రూపాయలు ఆదా అవుతోంది, ఇంతకు ముందు మా పిల్లలు సర్కారు బడికి వెళ్ళినా అది నెలకు 4 రోజులు మాత్రమే జరిగేది. పిల్లలు నేర్చుకున్నది ఏమీ లేదు. ఇప్పుడు మా పిల్లలు శ్లోకాలు, పాఠాలు నేర్చుకున్నారు" అని చెప్పాడు. మాకెంతో సంతోషంగా ఉందని అన్నాడు. ఈ అల్లంపల్లిలోని మన జీయరు గురుకులములోని ప్రతి



విద్యార్థి, విద్యార్థిని తిరునామములు ధరిస్తున్నారు. ఉదయం 5 గం॥కే నిద్రనుండి లేవడం, ఉదయం మరియు సాయంత్రం స్నానము చేయుట. ఇంటివద్ద కూడా శ్లోకాలు, పాఠాలు చదువుట, సాపాటు చేసేటప్పుడు కూడా **"అహం వైశ్వానరో భూత్వా"** మొదలైన శ్లోకములు చదువుట వారి నిత్యకృత్యం.

**తల్లిదండ్రులతో సమావేశం**

పూర్వం ఇక్కడ తండాలలో ఎక్కువగా అనైకమత్యం ఉండేదిట. కాని మన స్వామివారు ఇక్కడ ఈ గురుకులము పెట్టిననాటినుండి వారిమధ్య (తండాలు) పిల్లల కారణంగా సయోధ్య ఏర్పడింది. పిల్లల్లో చదువు వల్ల ఏర్పడిన ఐకమత్యమే దీనికి కారణంగా కూడా చెప్పవచ్చు. ది.15-10-04 శుక్రవారం రోజున ఉదయం 10 గం॥కు తల్లిదండ్రుల సమావేశం ఏర్పాటు జరిగింది. ఈ సమావేశానికి సుమారు 100 మందిదాకా తల్లిదండ్రులు వచ్చారు. వారితో స్వామివారు గురుకులము ఏర్పాటును గురించి ప్రశ్నించినపుడు "మాకంతా బాగుంది. స్వామివారి చలవవల్ల మాపిల్లలు బాగా చదువుతున్నారు. వాళ్ళకి మేము పప్పు, కూరలే వండి పెడుతున్నాము. ఉదయం సాయంత్రం స్నానంచేస్తారు. ఇప్పుడు మా పిల్లలను చూసి మేం గర్వపడుతున్నాము. ఇదంతా ఆస్వామి చలవే" అని స్వామివారి పటానికి దాసోహం పెట్టారు. జై శ్రీమన్నారాయణ! అని పలికారు. ఇంకా స్వామివారినుండి మీరేమి కోరుతున్నారు? అని ప్రశ్నించిన పుడు మేము మరల స్వామిని చూడాలి. మా పిల్లలకు హాస్టలు ఇప్పించండి అని అడుగుతాము.

**పిల్లల్లో వచ్చిన చైతన్యం**

పిల్లల్లో వచ్చిన చైతన్యం ఎంతో బాగుంది. మన గురుకుల విద్యార్థులు శ్లోకాల ఉచ్చారణ, ధారణ (జ్ఞాపకశక్తి) ఆసక్తితో గమనిస్తే మనలో ఉన్న అలసట తగ్గుతుంది. పిల్లలు ఇదివరకులాగా 'ఔ' అని అనకుండా 'ఔనండి గురువుగారు' అని నమ్రతగా మృదువుగా పలుకుతూంటే మన హృదయం కరిగి కనులు చెమరుస్తాయి. నాగరికులం అనుకున్న ఇక్కడి ప్రపంచంలోని పిల్లలకు మన గురుకులంలోని పిల్లలకు ఎంతో తేడా ఉంది. ఈ నాగరిక ప్రపంచంలోని పిల్లలకు నమ్రత, వినయం, సహనం మచ్చుకైనా కనిపించవు. తల్లిదండ్రులకు బాగా దూరమై క్రమంగా వారిలో సభ్యతకూడా కరువౌతుంది. మన జీయరు గురుకులము లోని పిల్లలను చూస్తేను వారిని పలుకరించి మాట్లాడినప్పుడు వారు శ్లోకములు వల్లించినపుడు మనలోని నిరాశ తొలగుతుంది.

**నాగరికత - సంస్కారము**

మన జీయర్ గురుకులము విద్యార్థు లను కొంతమందిని ప్రశ్నించినపుడు వారి భావాలను స్పష్టంగా వ్యక్తీకరించారు. అక్కడి ప్రథమ తరగతి (I Class) పిల్లలు శ్లోకాలు ఇక్కడ 7-8 తరగతులేకాదు 10వ తరగి పిల్లలు కూడా వల్లించ లేరేమో? మన గురుకులంలోని పిల్లలకు ఇది ఎలా సాధ్యమయింది? ఇది ఒక శేషప్రశ్న. ఒక గోండు బాలుడు కోవాజంగ్ "నేను

బడికి వెళతాను” దాన్ని వాళ్ళ భాషలో చెప్పమంటే మొదట కొంచెం సిగ్గుపడి తర్వాత “నన్న సాదతు వాన్‌తోన్” అని చెప్పాడు. మరియొక బంజారా బాలుడు పేర్యాగోపాల్‌ను నాకు చక్కెరపొంగలి అంటే ఇష్టము. అది వాళ్ళభాషలో చెప్పమంటే ఆ బాలుడు సంకోచించి కొంచెంఆగి “మౌ శాక్రో బోవ్ లగే” ఇలా మరికొందరిని ప్రశ్నించడం జరిగింది. ఒక బాలుడు మేము తెలుగులో కూడా మాట్లాడతాము అని ధైర్యంగా చెప్పాడు. దానితో నాకే సిగ్గయింది.

**శుభపరిణామం**

ఆరోజు తల్లిదండ్రులకు మన గురువులు చెప్పారు. ఈరోజు మధ్యాహ్నం ఇక్కడ స్వామివారి ప్రసాదం పిల్లలకు ఇస్తాము అని. అంతే వాళ్ళందరూ చేతులెత్తి స్వామివారికి నమస్కరించారు. ఆరోజు 250 మంది విద్యార్థులకు సాంబారు, అన్నము, చక్కెర పొంగలి ఇవ్వటం జరిగింది. వారు భోజనానికి ముందు గురు పరంపర **“శ్రీశైలేశ దయాపాత్రం”** మొదలుకొని **“అహం వైశ్వానరో భూత్వా”** చివరగా “కాశ్యపాన్వయ సంజాతం” అని స్వామివారిని నుతించే శ్లోకం చదివి అప్పుడు భుజించడం ప్రారంభించారు. అంతకుముందు మన పెద్ద జీయరుస్వామివారి ఫోటోముందు టెంకాయ కొట్టి మంగళాశాసనం చేయటం జరిగింది. విద్యార్థులందరూ స్వామివారి తనియ ముక్త కంఠంతో చదువుతున్నప్పుడు నాకు కళ్ళు చెమర్చాయి. “భక్తితత్పరత” అంటే వారికి తెలియదు. కాని అది ఒక ప్రేమతో కూడిన విశ్వాసం. ఉదయం ప్రార్థన చివర **“మాతృదేవోభవ !, పితృదేవోభవ!, ఆచార్య దేవోభవ!”** అని ముక్తకంఠంతో పలుకుతారు.

**వ్యాయామం - క్రీడలు**

ప్రతి ఉదయం 5 గం॥కు సుమారు 40 మంది అల్లంపల్లి విద్యార్థులు గురుకులా నికి వచ్చి పరుగుపందెము, యోగాసనాలు ఉపాధ్యాయుల పర్యవేక్షణలో శిక్షణ పొందు తున్నారు. మా ఉపాధ్యాయులు 1). రాజు, 2). రాంప్రకాష్, 3). చంద్రశేఖర్ పిల్లలకు శిక్షణ నిస్తున్నారు. వారానికి 2 పర్యాయములు బాలభట శిక్షణ (Scout Training) నిస్తున్నారు. కొండల్లో, కోనల్లో వెలసిన ఈ గురుకులము నాగరిక ప్రపంచానికి ఎంతో దూరంలో లేదు. వారు రేపు నాగరిక ప్రపంచానికి పోటీగా నిలవవచ్చు. అదే మన స్వామివారి లక్ష్యం, ఆశయం.

**ఒక విచిత్రమైన సన్నివేశం.**

అల్లంపల్లిలోని ఒక యువతి పేరు రంభాదేవి. ఆమె “జీయరు స్వామివారు ఈ ప్రాంతమునకు వచ్చి ఇక్కడ అల్లంపల్లిలో గురుకులము పెట్టారు. అంతకు ముందు అల్లంపల్లి “ఒక నిప్పులాంటిది”. స్వామివారు వచ్చిన దగ్గరనుండి అది పరిమళంగా మారింది. పూర్వం అల్లంపల్లి అంటే అందరూ భయపడేవారు. కారణం అల్లంపల్లి తీవ్రవాదులకు నడిబొడ్డు. స్వామివారు వచ్చి గురుకులము పెట్టినప్పటినుండి వారి మాటలు విన్న బయట గ్రామాలవారు మమ్మల్ని బంధువులుగా చూస్తున్నారు. స్వామిభక్తులుగా మాపిల్లల్ని కూడా “అక్కడ



గురుకులములో చేర్పిస్తాము, అవకాశం ఇవ్వండి” అని ఆమె ఆవేశంతో అంది. ఇది వరకు భయపడేవారు కదా! ఇప్పుడు ఎలా చేర్పిస్తారు అని అంటే స్వామివారిని చూశాక మాకు భయం తొలగింది. “పూర్వం మేము ఏ దేవతనూ పూజించలేదు. గుళ్ళూగోపు రాలు మాకు తెలియవు. రాయికో, రప్పకో మ్రొక్కేవాళ్ళం. స్వామివారిని చూశాక దేవుడే దిగివచ్చినట్లు అనిపించింది”. రంభను మేమడిగిన ప్రశ్నకు స్వామివారు మీకు ఇంకా ఏమి చేయాలను కుంటున్నారు?

రంభ:- వారు మాకు కనిపించి, వారి చేతులతో మాకు దీవెనలు పలుకుతే చాలు. స్వామివారు మాకు మంగళాశాసనం చేస్తే చాలు. జై శ్రీమన్నారాయణ! అంది. ఆవేశంతో ఇలా పాడింది.

“చీకటి కొండల్లోన - చిగురే పుట్టింది.<br>
వెలుగే వచ్చింది - శ్రీమన్నారాయణ! జైజై శ్రీమన్నారాయణ!<br>
చీకటి గుండెల్లోన - గుడినీ కట్టినారా స్వాములవారు<br>
పూజలింక సలిపేము - మా పుణ్యాలిక పండ.<br>
స్వాములవారు! మా స్వాములవారు!<br>
జై జై శ్రీమన్నారాయణ! జై జై శ్రీమన్నారాయణ!! అని ఆనందంతో పాడింది.

**ఒక సందేశం:-**

మీకు శరీరానికిగాని, మనసునకుగాని బాధ ఏర్పడితే ఏదైనా కష్టం కలిగితే అల్లంపల్లి వెళ్ళి నాలుగు రోజులు గురుకుల విద్యార్థుల మధ్య అక్కడి చక్కని వాతా వరణంలో గడిపి రండి. మీకు కలిగిన ఏ అనారోగ్యమైనా దూరమౌతుంది. ఇది మా అనుభవం. ఇది మా విశ్వాసం. మీ పిల్లలే అనుకుంటూ విద్యార్థులను పలుకరించండి. వారితో మీ ఆనందాన్ని పంచుకోండి. మీ దుఃఖాలు పటాపంచలౌతాయి. కాని మీరు చేయవలసిన పనిఒక్కటే. ఆ చిన్నారులకు సేవచేసే భాగ్యం కలిగించుకోండి. శ్రీమన్నారాయణుని అనుగ్రహానికి పాత్రులు కండి. మీ ప్రేమ, మీలో ఉన్న త్యాగము కొంచెమైనా వితరణ చేయండి.

జై జీయరు గురుకులము! జై శ్రీమన్నారాయణ!

...స్వామివారి ప్రతినిధి **ముడుంబై నారాయణాచార్యులు**, సీతానగరం.



## పరమపద వార్త

శ్రీమతి **ఊడి జయలక్ష్మి** విశాఖపట్నం వాస్తవ్యులు. ది. **16-5-2004**న పరంపదించారు. వీరు శ్రీస్వామి వారి దగ్గర సమాశ్రితులు. వీరి కుటుంబసభ్యులకు శ్రీస్వామివారి మంగళాశాసనములు చేసారు. ఆచార్య శ్రీచరణ సన్నిధి వీరికి లభించాలని ప్రార్థిస్తున్నాము.



## లంకానగరంలో వాయునందనుని సీతాన్వేషణ

# రామాయణంలో రమ్యగాథలు

- శ్రీ చెవుటూరి కుసుమకుమారిగారు, విజయవాడ.

**"నిరీక్షమాణశ్చ తదా
తాః స్త్రియః సమహాకపిః
జగామ మహతీం చిన్తాం
ధర్మసాధ్వసశఙ్కితః"**

"ఆవిధంగా అంతఃపుర స్త్రీలనందరనూ చూచినానుకదా! అయ్యో! నాకు ధర్మ లోపము కలిగినదే! వారంతా పరదారలు. నిద్రావస్థలో వున్నవారు. కాని నా దృష్టి మాత్రము సీతామాతమీదే వున్నది. కానివారి విషయమున కాదుకదా! నేను వారిని చూచిన మాట నిజమేకాని, నా మనస్సు మాత్రము ఎటువంటి వికారమునకు ఏమాత్రము లోనుకాలేదు. పాపపుణ్యములకు మనస్సే మూల కారణము. ఇంద్రియ ప్రవర్తనకు కూడా మనస్సే కదా కారణము. కాని నామనస్సె టువంటి వికారము పొందలేదు.

**"నాన్యత్రహి మయా శక్యా
వైదేహీ పరిమార్గితుమ్
స్త్రియోహి స్త్రీషు దృశ్యన్తే
సదా సంపరిమార్గణే"**

సీతమ్మను స్త్రీల మధ్యనే కదా వెదుక వలసినది. వేరోకచోట వెదికిననూ ప్రయోజనమేముండును? ఏ జాతి జంతువు నాజాతి జంతువుల మధ్యనేకదా వెదుకవలే. స్త్రీ తప్పిపోయినదనిన లేళ్ళ మధ్య వెదికినచో దొరకదు కదా! అందుచేతనే లేశమైననూ పాపపంకిలము కాని మనస్సుతో అంతః పురమున సీతను వెదికినాను. ఎందరో ఉత్తమ స్త్రీలున్నారు. కాని సీతామాత మాత్రము లేదు! అని అనేక విధముల దూరాలోచనచేసి మరల తన ప్రయత్నమును కొనసాగించినాడు.

లతాగృహాలను, చిత్రశాలలను, విశ్రాంతిశాలలను వెదికినాడు కాని ఆ రఘుపతి ప్రియసతి మాత్రము కానరాలేదు.

**"ధ్రువం హి సీతా మ్రియతే యథా న మే విచిన్వతో దర్శనమేతి మైథిలీ"**

తప్పక సీత మరణించియే ఉండును. లేకున్న ఇంత వెదకిననూ నాకెందుకు కనపడ కుండును? శీలరక్షణ వ్రత అయిన జానకిని ఆ రావణుడు నిక్కముగా చంపివుండును. లేదా భయంకర రాక్షస స్త్రీలను చూడగానే సీత భయపడి మరణించి అయిన వుండును. విధిలేక రావణాంతఃపుర స్త్రీలనందరనూ చూచి నానుగానీ, సీతాసాధ్వి కనుపించక వ్యర్థ ప్రయాసమాత్రము మిగిలినది కదా!

ఉత్తరతీరాన నాకొఅకై ఆత్రుతగా ఎదురు చూచుచున్న వానరవీరులు ఓయీ! కపివీరుడా! లంకకు వెళ్ళి నీవు చేసిన కార్యమేమిటి? అని అడిగిన ఎడల, జనక



నందినిని చూడని నేను ఏమని బదులీయ గలను? అట్లని వెళ్ళకున్న వారు ప్రాయోప వేశము చేసి మరణింతురు. నన్ను చూడగానే వృద్ధుడైన జాంబవంతుడు, అంగదుడు, తక్కిన వానరవీరులు నన్నేమందురో ఏమో!

**"అనిర్వేదః శ్రియోమూలః
అనిర్వేదః పరంసుఖమ్,
అనిర్వేదో హి సతతం
సర్వార్థేషు ప్రవర్తకః"**

నిరాశా నిరుత్సాహము లేకుండు టయే అభివృద్ధికి మూలకారణము. అదే సుఖ హేతువు. అనిర్వేదము చేతనే మనుష్యుడు దేనినైనా పొందగలడు. కనుక నేను వెంటనే నిరాశను వదలి ఇంతవరకు వెదుకని రావణ పాలిత లంకనంతనూ వెదకెదను అని యోచించి, భూగృహాలను, చైత్యాలనూ కడకు చిన్నచిన్న గృహాలను కూడా మరల బయటకు వచ్చుచూ ఎక్కుచూ, దిగుచూ ఎక్కడా నాలుగంగుళములు కూడా వదలక వెదికినాడు.

పద్మ సరస్సులు, దిగుడు బావులు, వేదికలు, చెరువులు, చలమలు, జలమయ వన ప్రదేశములు, చొరరాని పర్వతములు ఎక్కడెక్కడ స్త్రీలు వున్న అక్కడ కూడా సీతారమణికోసం భూమినంత వెదికినాడు.

**"ఇహ సంపాతినా సీతా
రావణస్య నివేశనే
ఆఖ్యాతా గృధ్రరాజేన
న చ పశ్యామి తామహమ్"**

సీత రావణుని గృహములోనే వున్నదని సంపాతి తన దివ్యదృష్టితో చూచి చెప్పినాడు కదా! మరి నాకేల కానవచ్చుట లేదు? సీత ఆదుష్ట ప్రవృత్తిగల రావణుని చేరి వుండునా? ఛీ!ఛీ! జనకరాజర్షిసుత (అయోనిజ) విదేహాలో జన్మించినది (వైదేహి) ఆచారమే సర్వస్వమై మిధిలలో పెరిగినది(మైథిలి) అటువంటి సీత ఆ దుష్టరావణుని చేరదుగాక చేరదు. లేక సీతను అపహరించి తెచ్చువేళ, రామ బాణములకు భయపడి అమిత వేగముగా వచ్చుచున్న రావణుని నుండి విడిపించు కొనవలెనని మెలికలు తిరుగుచూ సీత క్రిందపడివుండునా? లేక రావణుడు సిద్ధులు చరించు అంతరిక్ష మార్గమున వెళ్ళుచుండగా క్రిందకు చూచి అగాధ సాగరమును చూచిన సీత గుండె ఆగి మరణించలేదు కదా! ఏమి నా యోచన! వీరపత్ని అయిన రామపత్ని అట్లెన్నటికీ భీరువు కాలేదు. లేక సీత ఎక్కడ జారి పోవునో అని ఆ క్రూర రావణుడు భుజము లతో గట్టిగా నొక్కిపట్టి వేగముగా పోవు చుండ ఆ పద్మపత్రాక్షి తనంత తానే ప్రాణములు వదలివుండునా? లేదు లేదు. అట్లెన్నటికీ జరుగదుగాక జరుగదు.

లేకున్న ఏకాకీ, దీనురాలూ అయిన సీత తన శీలము కాపాడుకొనుటలో తనకు లొంగలేదని ఆ క్షుద్ర రాక్షసుడు సీతను భక్షించినాడేమో! నల్లనల్లని విశాల నేత్రాలతో సౌందర్యరాశి అయిన సీతను రావణుని దుష్టభార్యలు అసూయతో భక్షించినారేమో! ఆ! రావణుడు అంతగా ప్రేమించిన సీతను భక్షించు ధైర్యము వారికెక్కడిదీ!

పరిపూర్ణ చంద్రబింబమువంటి ముఖము గల రామచంద్రుని, రాజీవలోచనుడైన రఘుపతిని తలచుకొని, తలచుకొని హా

రామా! హా లక్ష్మణా! అని విలపించి సీత అశువులు బాయలేదు కదా! లేదు లేదు అట్లెన్నడూ జరుగదు. శ్రీరామ చంద్రునితోడి నిరతి శయానందము కొరకు ఆమె ఎన్ని బాధలనైనా ఓర్చుకొని జీవించియేవుండును. రావణుడు గృహాంతరమున ఎక్కడో బంధించగా పంజరములోని గోరువంకలా విలపించుచూ వున్నదేమో!

**"జనకస్య సుతా సీతా**
**రామపత్నీ సుమధ్యమా**
**కథముత్పల పత్రాక్షీ**
**రావణస్య వశం వ్రజేత్"**

జనక సుత, రామపత్నీ, పద్మపత్రాక్షీ అయిన సీత మాత్రము ఏవిధముగానూ రాక్షసేంద్రుని వశముకాదు. ఏది ఏమైె నను నాకు సీతాదర్శనము లభించుట లేదు కదా! అయ్యో! ప్రియసతియందు అపరిమిత ప్రేమగల రామచంద్రునకు ఈవార్త ఎట్లు చెప్పను? అట్లని చెప్పకున్న అది కూడా దోషమేకదా! నేను తలపెట్టిన కార్యమును ఇట్టి విషమస్థితి పట్టినదేమి? కాలాను సారము ఇప్పుడు నేనెటువంటి నిర్ణయము తీసుకొనవలెను? ఏమిచెయ వలె? అని ఎన్నో విధముల యోచన చేయసాగాడు.

నేను సీతామాతను దర్శించకనే కిష్కింధకు మరలివెళ్ళిన ప్రయోజనమే మున్నది? సాగరమును దాటి లంకను ప్రవేశించి చేసిన సీతాన్వేషణ అంత వ్యర్థమైె నది కదా! ఇప్పుడు ఈ విధముగా కిష్కింధకు వెళ్ళి వానరరాజు సుగ్రీవునకు, ఆ దాశరథికీ ఏమి చెప్పను? సీతమ్మను కనుగొనలేక పోయితిని అను అప్రియము, పరుషము నహింపలేనిదీ అయిన మాట విన్న రాముడింక పుడమిన వుండడు. రాముని విడిచి క్షణమైన వుండని లక్ష్మణుడు భూమి మీద నిలువడు. వీరిరువురూ లేరని తెలిసిన భరతుడూ, అతనిని చూచి శత్రుఘ్నుడు కూడ తనువులు త్యజించెదరు.

అంతట పుత్రులు లేని ఈ శరీరములు మనకెందుకని కౌసల్య, సుమిత్ర, కైకేయీ కూడా కడతేరుట నిక్కము. కృతజ్ఞుడు, సత్యనిష్ఠాగరిష్ఠుడు అయిన రామమిత్రుడు వానరరాజు సుగ్రీవుడు రామచంద్రుని దురవస్థ చూడలేక విగత జీవుడు కాగలడు. సుగ్రీవుడు మరణించగానే పతి మరణాన్ని సహించలేని రుమ ప్రాణాలను త్యజిస్తుంది. వాలి మరణశోకమే తడిఆరని తార సుగ్రీవుడు కూడ లేడని తెలిసిన మరుక్షణమే విగతజీవిగా మారి పతిగతినే అనుసరిస్తుంది. తల్లి దండ్రులు లేక, పినతండ్రిని కూడా పోగొట్టు కొన్న అంగద కుమారుడు కూడా కుమిలి కుమిలి చనిపోవును. **"లాలితాఃకపిరాజేన ప్రాణాంస్త్యక్ష్యంతి వానరాః"** ప్రభువు సుగ్రీవుని చేత లాలనగా పాలించబడిన వానరులు అతడు తమకింక లేడు అని తెలియగానే భార్యాబిడ్డలతో కొండలమీద నుండి దూకి గాని, విషపానము చేసిగానీ, లేక ఉరిపోసు కొనిగాని, బాకులతో గుండెలు చీల్చుకొనిగానీ చనిపోవుట తథ్యము. నేను తిరిగి వెళ్ళితినేని ఇక్ష్వాకు వంశము నశించును. వానరకులము నాశనమగును. భవిష్యత్తులో రోదన మొక్కటే మిగులును.

నేను కిష్కింధకు వెళ్ళకపోయినచో మహారథులైన ఆ రాఘవులు, వానరులు కూడా సీతను కనుగొని హనుమ శుభవార్త



తెచ్చునని ఆశతో జీవించివుందురు. ఇంక నేను కూడా వానప్రస్థుడనై, సాగరతీర వృక్ష మూలమునాశ్రయించి పండి పడిన ఫలము లను నోటవేసుకొనుచూ, దుంపలను తినీ జీవించెదను. లేదా చితినేర్పరచుకొని అగ్నిలో ప్రవేశించుటయో, లేక ప్రాయోపవేశము చేసి తనువు త్యజించుటయో చేసెదను.

**"ఇదం మహర్షి భిర్దృష్టం**
**నిర్యాణ మితి మే మతిః**
**సమ్యగాపః ప్రవిశ్యామి**
**న చే త్పశ్యామ జానకీమ్"**

జానకిని చూడలేకపోతినేని సరాసరి వెళ్ళి జలమున దూకెదను. ప్రాణ త్యాగము నకు మహర్షులు చెప్పిన ఉపాయము ఇదే అని తోచుచున్నది. విడదీయుటకు వీలుగాని యశోవిశాలమైన కీర్తిహారము నేడు సీతను వెదుకలేక పోయితినన్న నెపమున నశించి పోయినది కదా!

కాదు! కాదు! కార్యసాధనకు నిరాశా నిస్పృహలు దరిచేరరాదు. బ్రతికి వున్న అనేక శుభములను పొందవచ్చు, చూడవచ్చు. మరణించుటలో కూడా అనేక దోషములు ప్రాప్తించునుకదా! బ్రతికి వున్న అందరినీ ఎప్పుడో ఒకప్పుడు కలుసుకొన వచ్చును. అయ్యో! నా దుఃఖమునకు అంతులేకున్న దేమి? అని చింతించి మరల దృఢచిత్తుడై ఒక నిర్ణయమునకు వచ్చినాడు ధీమంతుడైన వాయునందనుడు. సీత ఏమైనా కానిమ్ము. మహాబలుడు, దశకంఠుడు అయిన రావణుని ముందు చంపివేసెదను. అదియే అతడి ప్రవర్తనకు తగిన ప్రతిక్రియ. లేకున్న ఈ రావణుని సముద్రము పైనుండి ఎత్తుకొని వెళ్ళి, పశువులను వాటి యజమానికి అప్పగించిన విధమున రామచంద్రునకు అప్పగించెదనుగాక! రామపత్నీ, యశోవతీ అయిన ఆ సీతామాత కనపడునంతవరకూ ఈ లంకానగరాన్ని వెదుకుతూనే వుందును గాని మిన్నకుండను.

ఆ సంపాతి మాటవిని, రాముని వద్దకు వెళ్ళి, రామా! సీత లంకలో వున్నది రమ్ము అని పిలుచుకొనిరాగా ఇక్కడ సీత కనుపించ నిచో వానరులందరనీ ఒక్క శరఘాతమున ఆ దాశరథి కాల్చివేయును. కనుక నియతాహారుడనై, జితేంద్రియుడనై ఈ లంకలోనే వుండి రామాది నరులు, సుగ్రీవాది వానరులు నశించకుండా చూచుకొందును.

అదిగో! పెద్దపెద్ద వృక్షాలతో అశోక వనము కనుపించుచున్నది. నేనింతవరకు ఈ వనమున వెదుకలేదు. కనుక ఈవనమున సీతాన్వేషణము ప్రారంభించెదను అని అనుకొనెను. ⟹⟹⟹

## పరమపద వార్త

శ్రీమాన్ **కనగాల కృష్ణగారు** రిటైర్డ్ హెడ్‌మాస్టర్ గన్నవరం.

వీరు **ది.24.7.2004**న పరంపదించినారు.

వీరు శ్రీస్వామివారి దగ్గర సమాశ్రితులు. వీరి కుటుంబసభ్యులకు శ్రీస్వామివారి మంగళా శాసనములు చేసారు. భగవానుని శ్రీచరణ సన్నిధి వీరికి లభించాలని ప్రార్థిస్తున్నాము.

# ? సందేహాలు - సమాధానాలు 3

**1 భాగతవతాభిమానం, ఆచార్యభిమానం ఏది గొప్పది? పురుషకారం లేని శరణాగతివల్ల మోక్షం లభిస్తుందా? మోక్షానికి పై 4లో ఏది ముఖ్యం?**

జ. రెక్కలు లేని పక్షి ఎగురలేనట్లే పురుషకారం లేనిదే మోక్షం దుర్లభం. పైనాల్గింటిలో, ఆచార్యాభిమానమే మోక్షానికి ముఖ్యం. అది ఉన్నట్లైతే భాగవతాభిమానం వెంటనే లభిస్తుంది. పురుషకారం శ్రీలక్ష్మీద్వారా వీరే చేయిస్తారు. శరణాగతులుగ శిష్యులను తీర్చిదిద్దగలుగుతారు.

**2 ద్విజేతరులకు అమావాస్య తర్పణములు ఆబ్దీకములు జరుపచేతకాదు. వీరి పితరుల ఉద్ధరణ ఎట్లు?**

జ. వీరున్నూ శ్లోకాలతో పురాణోక్తముగ చేస్కొని తీరవలసినదే, నమ్మకం శ్రద్ధ ఉంటే. అదీ చేస్తేనే వారి పితరులు ఉద్ధరింపబడుతారు. ముఖ్యంగ, పెట్టిన వీరు సుఖపడతారు. ఇవి వదిలితే ద్విజేతరులేగాదు ద్విజులుగూడ భ్రష్టులే అవుతారు.

**3 అష్టాక్షరీ జపము కామ్యసిద్ధికద! మోక్షము కూడ కామ్యమే కద!**

జ. కాదు. భార్యభర్తను పొందాలనుకోవడం కామ్యమా? స్వరూపమా? కామ్యము కాదు. స్వరూపమే. శరీరధారుడు శరీరాన్ని నిలుపుకోవటం కోసం తగిన ఆహారం తినాలనుకోవటం కామ్యమా? కాదు స్వరూపమే. ఇవి కోరటం తప్పకాదు. అయితే ఆ తినేది ఇలా ఉంటే కాని దిగదు అలా ఉంటేగాని దిగదు అనేది కామ్యము.

ధర్మానికి కారణమైన శరీరమును జీవింపచేయటానికి సమయానికి తగినట్లు భగవన్నివేదితమైన ఆహారమును తగినంత మాత్రం తినాలనుకోవడం కామ్యము కాదు. స్వరూపమే. జ్ఞానముకల జీవునకు మోక్షముగూడ కామ్యములో చేరదు. అది తప్ప ఇతరములన్నియు కామ్యములు. అది మాత్రం స్వరూపాంతర్భావమే.

అష్టాక్షరీ మహామంత్రానికున్న గొప్పతనమేమిటంటే, మిగిలిన మంత్రాల్లా ఏదో ఒక్కొక్క ఫలాన్నిచ్చి ఊరుకోవడం కాక ఇహలోక ఫలాలనీ యిస్తుంది. పరలోక ఫలాలనూ ఇస్తుంది. భగవంతుని సన్నిధికికూడ చక్కగ చేర్చగలుగుతుంది. "ఐహ లైకికమైశ్వర్యం స్వర్గాద్యం పారలౌకికం, కైవల్యం, భగవన్తం చ మంత్రయా సాధయిష్యతి"॥ అనే ఋషివాక్యం పైవాటికి ప్రమాణము.

**4 నిష్ఠ అంటే హోమాదులా? యమ నియమాదులు చేయ తీరికలేని మాలాంటి వాళ్ళకు ఏదో ఒకచోట కూర్చుండి జపిస్తే ఫలితం లేదా? మరేమిటి గతి?**

జ. నిష్ఠ అంటే కుదురు కలిగి ఒక విషయం మీద నిలకడగ ఉండటం. భగవత్తత్త్వాన్ని గుర్తింప చేసేస్థితి. అలా ఉన్నప్పడు అనుసంధించేది మంత్రం. మంత్రాన్ని భగవంతునిపై ప్రేమతో అనుసంధానం చేస్తారు జ్ఞానులు. అందరూ అలాగే చెయ్యాలి. మనస్సు లగ్నం కావటానికే యమ, నియమ, ప్రాణాయామాదులన్నీను. ఆ మనస్సులో ఏకాగ్రత కుదిరితే ఇవన్నీ సహజంగానే వస్తాయి. మనసు నిలకడ కుదరడానికి ఉపయోగ పడకపోతే యివన్నీ



దండుగ. ఏకాగ్రతతో, ప్రీతితో తలచుటే ముఖ్యం గనుక, బ్రహ్మసూత్రాలల్లో కూడా మొదట నడుము బిగించమని, చూపు ముక్కుకొనపై నుంచమని ఇలా ఎన్నో నియమాలు చెప్పి చివరకు ఎక్కడ కూర్చుంటే, ఎలా కూర్చుంటే, ఎప్పడు కూర్చుంటే, మనస్సు ఏకాగ్రతనొందు తుందో అక్కడే, అప్పడే అలాగే కూర్చునో, మరోలానో తలచుటే ముఖ్యము సుమా అని నిర్ణయించారు. అంటే, అవి మానవేయమని కాదు. అవే ప్రధానము కారాదు. లక్ష్యం, మనస్సు భగవంతునిపై నిలకడగా ఉంచడము. అది నిష్ఠ. దీనికోసం కావలసినది తిష్ఠ. అంటే ఒకచోట కుదురు ఉండడం. జరుగుబాటు ఉంటే ఒకచోట ఉండి చేయగలిగితే మంచిదే. చేయండి.

**5 ముక్తిని పొందుటకై ఏ సాధన చేయాలి?**

జ. ఏమిచేసినా లాభంలేదు. మనప్రయత్నం ఫలిస్తుందనుకోవటం దండుగ. భగవంతుని అనుగ్రహం ఒక సదాచార్యునిద్వారా లభిస్తేనే ముక్తివస్తుంది తప్ప నేరుగా ముక్తికోసం మనప్రయత్నం ఎంతచేస్తే అది అంత దూరమవ్వడానికి హేతువౌతుంది. కర్మబంధ విముక్తి కేవలం భగవంతుని అనుగ్రహంవల్ల మాత్రమే లభిస్తుంది.

**6. సంధ్యాసమయమని దేనినంటారు? ఎప్పటినుంచి ఎప్పటిదాకా? అప్పడు చేయకూడని పనులేమి?**

జ. ఒక కాలానికి మరో కాలానికి మధ్య సమయము సంధ్యాసమయమంటారు. పగటికి రాత్రికి మధ్యకాలం సాయంసంధ్య.అట్లే రాత్రికి పగటికి మధ్యకాలం ప్రాతస్సంధ్య. సూర్యుడు నడినెత్తిన చేరినపుడు మధ్యాహ్నసంధ్య అంటారు. సంధ్యాకాలం సుమారు రెండున్నర ఘడియలు, (అంటే 1 గంట) ఉదయం, రెండున్నర ఘడియలు, సాయం రెండున్నర ఘడియలూ ఉంటుందంటారు. ఉదయమైతే సూర్యోదయా నికి అరగంట ముందు నుంచి, అరగంట తరువాత వరకు, సాయంకాలమైతే, సూర్యాస్తమయానికి అరగంట ముందు నుంచి అరగంట తర్వాత వరకు ఉంటుందన్నమాట. అట్లే మిట్టమధ్యాహ్నానికి అరగంట ముందు, అరగంట తర్వాత మాధ్యాహ్నిక సంధ్య అనవచ్చు.

ఆ సమయంలో నిద్ర, ఆహారం, స్త్రీపురుషసంగమములు కూడవు. చెడు ఆలోచనలు, చెడు మాటలు కూడా కూడదు. ఈ కాలం చాలా పవిత్రమైన కాలమైనందున వీలైనంతవరకు సూర్యునిలో ఉండే నారాయణుని ధ్యానిస్తూ మనపెద్దలు ఆ సమయాన్ని గడుపుతూ ఉంటారు. అలాగే మననీ చేయమని ప్రబోధించారు. ఆత్మకు హితమేమిటో, వాటిని ఆలోచించి ఆచరించే సమయమన్నమాట.

**ప్ర. సంసారం చేయు మాబోటివారలు భక్తిని పొందేదెలా?**

జ. మూడే సాధనాలు: 1) మంచిపుస్తకములు చదువుట, 2) వేదవిశ్వాసము, వైదిక క్రియాచరణ కల సత్పురుషులతో సహవాసము, ఎంత వీలయితే అంత ఎక్కువగ చేయుట, అట్టి వైదిక విద్యను ప్రోత్సహించడం, 3) భగవంతుని స్వరూప రూపగుణ విభూతులను తెలుపు ఒక చక్కని మంత్రమును గురువుద్వారా తెలుసుకొని నిత్యం అనుసంధించుకొనుట. ఇవి మొదట ప్రారంభించారు. ఆపై భగవంతుని గుణాలను నిరంతరమూ తలచుకొంటూ, వాటితో మనకుండే సంబంధాన్ని భావించాలి. అదే మనలో భక్తి పెంచుతుంది. నిరంతరాయంగ సాగే ప్రేమమయ జ్ఞానధారే కద 'భక్తి' అంటే!

**ప్ర. కర్పూరహారతి వెలుగుతూండగనే క్రిందపారవేస్తారేమి కారణం?**

జ. కర్పూరహారతి అంటే దిష్టి తీయుట (దిగతుడుపు) అని మనం భావిస్తాము. భావించాలి. దిగతుడుపు తీసిన పదార్థం ఎవరూ త్రొక్కనిచోట విసర్జించి చేయికడుక్కొని ఎవరికి దిగతుడిచామో వాళ్ళకు కాళ్ళూ, చేతులూ కడిగి "జయమగుగాక"! అని మంగళం పాడతారు.
అట్లాగే భగవంతుడికి కూడా మన భావనలవల్ల దోషమేమీ అంటుకోకూడదని హారతిచ్చి, వెంటనే దానిని విసర్జించి, దానిపై నీరుచల్లి భగవానునికి అర్ఘ్యం, పాద్యం, ఆచమనీయా లర్పించి నమస్కరించుకుంటామేకాని, "హారతి కళ్ళకద్దుకొనుట" ఆచారముగాదు. అంచేత కళ్ళకు అద్దుకోకూడదు.

**ప్ర. శ్రీవైష్ణవులు, బ్రాహ్మణులు ఒకటేనా? తేడా ఏమైనా ఉన్నదా?**

జ. బ్రాహ్మణత్వము శారీరకధర్మము. శ్రీవైష్ణవత్వము ఆత్మధర్మము. శారీరకముగ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రాది ధర్మములను కలవారలలో ఎవరైనా శ్రీమన్నారాయణుని యందు శరణాగతి చేసినచో శ్రీవైష్ణవులనే పిలువబడుదురు. శరీరమున్నంతవరకు శారీరక ధర్మ సంకరము జరుగరాదు. ఆత్మజ్ఞానము పొందితే ఆత్మక్షేమముకై జరిపే అనుష్ఠానము మాత్రం అందరకూ ఒకటే.

**ప్ర. విగ్రహారాధన చేయవలయునని వేదాలలో ప్రమాణాలున్నవా? ఆ కరము తెలుపగలరు?**

జ. ఆహా! వేదాలలో కూడా ఉన్నాయి ప్రమాణములు. యజుర్వేదసంహితలో 5-1-2వ అనువాకములోని మంత్రాన్ని వరుసను పరిశీలించుకోగలరు.

**ప్ర. శ్రీరామానుజులు తొమ్మిది గ్రంథములనే మెట్లను కట్టిరట ఏమిటవి?**

జ. భువినుండి దివికి నిచ్చెన వేసిరి. దానికి జ్ఞానసోపానమనిపేరు. దానికి మెట్లు తొమ్మిది. 1. శ్రీభాష్యం; 2. వేదాన్తదీపము; 3. వేదాన్తసారము; 4. వేదార్థ సంగ్రహము, 5. గీతాభాష్యము, 6. నిత్యగ్రంథము (ఆరాధనను గూర్చి), 7. శరణాగతిగద్య, 8. శ్రీరంగ గద్యము, 9. వైకుంఠగద్యము.

**ప్ర. ముక్తిచేరిన స్త్రీ ఆత్మలు లక్ష్మీరూపాన్నా, విష్ణురూపాన్నా పొందేది?**

జ. ఆత్మలకు స్త్రీ పుంస్త్వాదులు లేవు. శరీరాలకే కర్మనుబట్టి అవి ఏర్పడతాయి. జీవులు పరమ పదం వెళ్ళాక కొందరు భగవదిచ్ఛవల్ల పరిచారక, పరిచారికల రూపాలు ధరిస్తారు. మరికొందరు పక్షి వృక్షాదిరూపాలు, ఇంకొందరు వస్త్ర ఆభరణాది రూపాలు ధరిస్తారు. వీరంతా భగవానుని ఇచ్ఛవల్ల కల్గిన తమ ఇచ్ఛచే పంచోపనిషణ్మయ, దివ్యచైతన్య స్వరూపాలనే ధరిస్తారు.
అవి కర్మవల్ల ఏర్పడ్డవేం కాదు కనుక దివ్యమంగళ విగ్రహాలనాలి. కొందరు జీవులు భగవంతుని నిత్యేచ్ఛచే మహిషీజనంగ వుంటారు. వారు శ్రీ, భూ, నీళాదులు వారికి రూపాలు మాత్రం ఎప్పుడూ మారవట. వారికలాగే యిష్టమని.

**ప్ర. మానవజన్మకు మూలము కోరికలా? మానవజన్మలో కనీస కర్తవ్యం ఏమిటి? ముక్తి లభించుట ఎట్లు?**



జ. జన్మకు మూలం కోరికలను కూడ పుట్టిందే రజస్తమోగుణాలు. వాటివల్ల కర్మ, కర్మకు తగిన శరీరం ఇట్లా వస్తాయి. మానవజన్మలో కనీసం కర్తవ్యమైనది 'అసూయ'ను దూరం చేసి వేదవిశ్వాసం కల్గియుండట. అసూయ దూరం కావాలంటే ఓరిమి, సహనం అలవాటు చేసుకోవాలి.
ఇవి ఆచార్యులను ఆశ్రయించి వారి శుశ్రూషద్వారా మంత్రమునొకదానిని పొంది, ఆ మంత్రరహస్యమును తదర్థములను పదే పదే శ్రవణం మననం చేయటం ద్వారా పొంద వచ్చు. ఓరిమి, సహనం లభించి అసూయ తొలగి గొప్పవారిని చూచి ఆనందించడం తక్కువ వారిని దీనులను చూచి జాలి తలచడం, లభించిన దానితో తృప్తినొందడం, అందరినీ ఆదరించడం, పరమాత్మను ఆచార్యుని ఆరాధించడం, తద్వారా అహంకార మమకారములు తొలగి రజోగుణ ప్రభావం తగ్గితే అదే ముక్తికి ప్రధాన సోపానం. భౌతిక శరీరంలో ఉన్నంతవరకూ ప్రపంచాభివృద్ధికి జ్ఞానం కల మానవునిగ మన కనీసం కర్తవ్య నిర్వహణ, దైవీ విశ్వాసం, ఆచార్యానువర్తనం ఇవే మానవుని కర్తవ్యాలు.

**ప్ర. లక్ష్మి ఎక్కువ పాపాలు చేసిన వారిదగ్గరే ఉంటుందా?**

జ. తల్లి కద! చెడిపోయేవారి మీదే తల్లికి బెంగఎక్కువ. వారినే పట్టుకొని వ్రేళ్లాడుతూ బాగుచేద్దామనుకుంటూ ఉంటుంది. అందుకే కద మన సీతమ్మ కావాలనే రావణుని వద్దకువెళ్ళి ఎంతో హితబోధ చేసింది. వాడు వినలేదు కనుక నశించాడు. అట్లే లక్ష్మి పాపాలు చేసేవారి దగ్గరచేరి, మంచి పనులకు తనను వినియోగించుకొనే అవకాశాన్ని యిస్తుంది. వాళ్ళలా వినియోగించకుండా మరింత "లోభిగా"మారితే పూర్తిగ ఖాళీ చేసేస్తుందంతే.

**ప్ర. ఆత్మయే పరమాత్మగ భావించి పెద్దలను పూజిస్తారు. రెంటికీ తేడా ఏమి?**

జ. కావలసినంత తేడా ఉంది. ఆత్మలు లెక్కలేనన్ని. పరమాత్మ ఒక్కడే, ఆత్మలు అణువులు. పరమాత్మ విభువు, అంటే ఆతడు వ్యాపించని చోటులేదు. ఆత్మలు కర్మననుభవించటానికి ప్రకృతిలోనికి రప్పించబడతాయి. పరమాత్మకు కర్మబంధంలేదు. యింకా ఎన్నో తేడాలున్నా యనుకోండి. పెద్దలంటే పరమాత్మకృపని మనకంటే అధికంగ పొందినవారు. అంటే మనకంటే పరమాత్మకు దగ్గిరవారు కనుక పూజ్యులు.

**ప. భగవన్నామస్మరణ, ఆరాధన వద్దని వాదించే వారితో ఏకీభవించవచ్చా? వారు వద్దన్నా చేస్తే మరి వారిని హింసించినట్లుగద! వారిని లెక్కచేయక ఆరాధన చేస్తే తప్పా?**

జ. ఏకీభవించరాదు. నామస్మరణం మనసులో చేసుకొనేది గనుక దానినెవరూ ఆటంక పరచలేరు. ఇక బాహ్యంగ ఆరాధన చేయనివ్వకపోవచ్చు కొందరు అహంకారులు. వారికి చేయవలసిన సేవ పూర్తిచేశాక అపుడు చేసుకొంటే కాదనరేమో! అపుడుకూడా వద్దన్నారంటే వారిని "నరాధములు" లిస్టులో చేర్చాలని భగవద్గీత చెప్పింది. తప్పనిసరి అయితే ఇక ఆరాధన మన మనస్సుతోనే చేసుకొని తృప్తిపడాలి.
వారిపై భగవంతుని కరుణించేవరకు వారిని లెక్కచేయకుండా ఆరాధన (భగవానునికై గనుక) చేసినా తప్పకాదు. స్వరూపాన్ని రక్షించుకోవాలనుకున్నప్పుడు, స్వరూపానికే ప్రమాదమేర్పడినపుడు, తద్రక్షణకై కొంత తెగించవచ్చు. రావణుని, ఆతని తమ్ముడే అయినా బలపరచవలసి ఉన్నా, విభీషణుడు, వదిలివేసి, రాముని చేరినాడు గద! అంత పరిస్థితి ఏర్పడితే అపుడు అది తప్పకాదు. లేకపోతే అంటే, వారిసూవ అయ్యాకనైనా అంగీకరించేటట్లైతే, వారిని ఎదిరించటం, వదలుట రెండూ దోషమే.

# తిరునక్షత్ర మహోత్సవ విశేషాలు

మన వేదవిశ్వవిద్యాలయ ప్రాంగణంలో శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి 49వ తిరునక్షత్ర ప్రయుక్తంగా 9వ జీయరు పురస్కార వేడుకలు, వేదపరీక్షలు, శ్రీసీతా రామచంద్రస్వామికి సహస్ర కలశాభిషేక మహోత్సవములు అత్యంత వైభవంగా శ్రీస్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో జరిగాయి.

**వార్షిక వేదపరీక్షలు:**

వేద విశ్వవిద్యాలయ శాఖలైన నడిగడ్డపాలెం, నెల్లూరు, నర్శింహులకొండ, సోమశిల, శ్రీరంగం, వారిజ, రాజమహేంద్రి, కల్లూరు, జగ్గయ్యపేట, మేళ్ళచెరువు, హృషీకేశ్ ఇత్యాది ప్రదేశాలనుండి ఆయా శాఖల అధ్యాపకులు, విద్యార్థులందరూ 6వ తేదీ ఉదయానికే వేదవిశ్వవిద్యాలయ వార్షిక పరీక్షల నిమిత్తం సీతానగరం చేరారు.

శ్రీమాన్ నేపాల్ కృష్ణమాచార్యస్వామి, శ్రీమాన్ ప్రహ్లాదాచార్యస్వామి(తిరుమల), శ్రీమాన్ గుదిమెళ్ళ మురళీకృష్ణమాచార్య స్వామి(భద్రాచలం) పరీక్షాధికారులుగ వేదపరీక్షలను నిర్వహించారు. శ్రీస్వామివారు, పరీక్షాధికారులందించిన ఫలితాను పరిశీలించి, అధ్యాపకులందరికీ రాబోయే సంవత్సరం అవలంబించవలసిన పద్ధతిని వివరించారు.

**నరక చతుర్దశి వైభవం :**

11వ తేదీ అరుణోదయాత్ పూర్వమే శ్రీస్వామివారి సాన్నిధ్యంలో విద్యార్థులకు వారి ఆచార్య బృందమునకు మంగళహారతులిచ్చి, అభ్యంగన స్నానాదులు జరిపారు. అలానే శ్రీపాఞ్చరాత్రాగమ శ్రీప్రశ్నసంహిత అనుసారంగా మన పెరుమాళ్ళకు కూడా తిరుమంజనం జరిగింది. ఆ రోజు ఉదయం శ్రీస్వామివారి ఆదేశానుసారం శ్రీమాన్ ముడుంబై మధుసూదనాచార్యస్వామి, శ్రీమాన్ శ్రీనివాసాచార్యస్వామి, శ్రీమాన్ వరదన్‌స్వామి నరకచతుర్దశి వైభవాన్ని గూర్చి వేద, ఆగమ విశేషాలు ప్రసంగించారు. శ్రీస్వామివారి తిరునక్షత్ర వైభవం సేవించడానికి నేపాల్ దేశం నుండి విచ్చేసిన నేపాల్ భాగవతోత్తములకు శ్రీమాన్ శ్రీకృష్ణమాచార్య స్వామి నేపాల్‌భాషలో సందేశం ఇచ్చారు. తరువాత శ్రీస్వామివారి అనుగ్రహభాషణంలో... "భూమిపుత్రుడైన నరకాసురుడు 16వేల మంది స్త్రీలని చెరపట్టి, తను పాలించే ప్రాగ్జ్యోతిషపురంలో బంధించాడు. అగ్ని, వాయు, సర్ప, ఆయుధ ఇత్యాది 6 ప్రాకారాల రక్షణలో ఉంచాడు. అలానే ఈ మానవ శరీరం కూడా ఒక ప్రాగ్జ్యోతిషపురము. 5 కర్మేంద్రియాలు, 5 జ్ఞానేంద్రియాలు, పంచభూతాలు, జీవుడు అనే ఈ 16నూ మనస్సనే నరకాసురుడు ఇందులో బంధించాడు. శ్రీకృష్ణుడు సత్యభామా సమేతుడై గరుడారూఢుడై 6 ప్రాకారాలను ఛేదించి, నరకుని సంహరించి ఆ స్త్రీలను చెరనుండి విడిపించినట్లుగా మనలోని నరకుడనే లోపలి తమస్సును



ఛేదించి జ్ఞానాన్ని ప్రకాశింపచేయాలి అని మంగళాశాసనాలు అనుగ్రహించారు.

తీర్థగోష్ఠాదులు సాగి, తిరునక్షత్రమునకు విచ్చేయు భాగవతోత్తములకు చేయు ఏర్పాట్లను, ఆచార్యబృందం, తమ భుజస్కంధాల మీద వేసుకొని, వికాసతరంగిణి కార్యకర్తల సమన్వయంతో పర్యవేక్షించింది.

**దీపావళి సంబరాలు:**

12వ తేదీ అస్మదాచార్యవర్యుల తిరునక్షత్రోత్సవ ఆనందహేల ఆశ్రమంలో అర్థరాత్రినుండే ప్రారంభమైనది. అది 4గంటల సమయం. ఆనందంతో ఆశ్రమం నృత్యమాడుతోంది. 'స్వాతిముత్యం' ఆవిర్భవించి మరో అంధకారాన్ని తొలగించి వెలుగుల్ని ప్రభాసింపచేసింది. శ్రీస్వామివారి అనుగ్రహభాషణమే మంగళాశాసనాల కృపావర్షంగా విరజిమ్మింది. మన స్వామికి మంగళహారతులు పట్టి పల్లాండుపాడారు. శ్రీస్వామివారు మంగళాశాసనాలు అందజేస్తూ సమాజంలో "భగవత్‌సేవకి, భగవంతుని వైభవానికి అడ్డొచ్చే అర్వాచీన నరకులను భగవంతుడు తుదముట్టించాలని" అనుగ్రహించారు. మనకి నిగ్రహశక్తిని ఇవ్వాలని మంగళాశాసనాలు కృపచేసారు. తీర్థగోష్ఠి అనంతరమే అధ్యాపక, విద్యార్థి, భక్తబృందం అంతా శ్రీశ్రీశ్రీస్వామివారి పాద పూజను నిర్వహించినది. శ్రీస్వామివారి శ్రీపాదతీర్థం భాగవతగోష్ఠికి అనుగ్రహించారు.

**జీయర్ పురస్కార వేడుకలు:**

49వ తిరునక్షత్రమహోత్సవ సందర్భంగా అందించే 9వ జీయర్ పురస్కార కార్యక్రమాన్ని పరిచయం చేస్తూ, శుక్లయజుర్వేద అధ్యాపకులు శ్రీమాన్ వరదన్ స్వామి వేదికపైకి అతిథులని సవినయముగా ఆహ్వానించారు. శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారు వేదికను అలంకరించారు. బెంగుళూరు రామానుజమఠం శ్రీశ్రీశ్రీ త్రిదండి వెంకటరామానుజ జీయరుస్వామివారు కూడ మంగళాశాసనాలు కృపచేయడానికి విచ్చేశారు. అతిథులుగా విచ్చేసిన పురస్కార గ్రహీత బ్రహ్మశ్రీ వేదమూర్తులైన కె. చంద్రశేఖర ఘనపాఠిగారు (తిరుమల ఆస్థానపండితులు), శ్రీ.ఉ.వే. శ్రీమాన్ డా॥ సముద్రాల వేంకటరంగరామానుజచార్య స్వామివారు, శ్రీ ఉ.వే. శ్రీమాన్ నేపాల్ కృష్ణమాచార్యస్వామివారు, శ్రీమాన్ వీరయ్యగారు (వికాసతరంగిణి వైస్ ప్రెసిడెంట్ KC & SI Ltd.), జి. గంగరాజుగారు, (జెట్ కార్యదర్శి ప్రముఖ పారిశ్రామిక వేత్త), శ్రీమాన్ కోటా శ్రీనివాసరావుగారు Hyd, వేదిక మీద ఆసీనులయ్యారు.

శ్రీశ్రీశ్రీ స్వామివారు దీపప్రజ్వలనం గావించగా, వేదవిద్యార్థులు వేదపఠనం చేసారు. అధ్యక్షులు శ్రీ.ఉ.వే. శ్రీమాన్ డా॥ సముద్రాల రంగ రామానుజాచార్యస్వామివారు ఉపన్యసిస్తూ, వేదవిద్యతోపాటు, వేదాంగాలను అభ్యసించిన మహావిద్వాంసులను ఇప్పటి వరకు 8మందిని సమ్మానించాం. వేదవిద్వాంసుల సమ్మానం అనేది వైదిక ధర్మపరిరక్షణలో ఒక భాగమని ప్రబోధించారు. తరువాత జెట్ కార్యదర్శి శ్రీమాన్ గంగరాజుగారు కార్యదర్శి నివేదికలో.... ఇంతవరకు జరిగిన

కార్యక్రమాలని వివరిస్తూ.... నూతనంగా నెల్లూరులో వేద పాఠశాలను మాగుంట కుటుంబీకులు ఏర్పరచడం, ఈ ఏడాది విశేషమని వివరించారు.

శ్రీమాన్ కృష్ణమాచార్య స్వామి(నేపాల్) వేదవేత్తయోగ్యతలను పరిచయం చేసారు. తరువాత పురస్కార గ్రహీతకు పుష్పమాలను, గంధవస్త్రాదులను హైదరాబాద్ గరుడధ్వజ క్రియేషన్స్&ఇన్నోవేషన్ సోల్యూషన్స్ సంస్థ నిర్వహిస్తున్న శ్రీమాన్ కోటా శ్రీనివాసరావు గారు సమర్పించారు. శాలువా, సంభావన (రూ.50,000/-)లను కాకతీయా సిమెంట్స్ & షుగర్స్ నిర్వాహకులైన శ్రీమాన్ పి. వెంకటేశ్వర్లుగారి కుమారులు శ్రీమాన్ పి.వీరయ్యగారు వేదవేత్తకు సమర్పించినారు.

**9వ "జీయర్ పురస్కారము-2004"**

శ్రీశ్రీశ్రీ జీయరుస్వామివారు బ్రహ్మశ్రీ వేదమూర్తులైన కె. చంద్రశేఖర ఘనపాఠి గారికి అనుగ్రహించారు. ఘనపాఠిగారు వైదిక సందేశమిస్తూ.... వేదవైభవాన్ని, వేద ప్రామాణ్యాన్ని వివరించారు. వేదార్థం ఎలా నిర్ణయం చేయాలి? అనేది స్పష్టం చేసారు. వేదములోని విషయాలను వివరించేవి గ్రంథాలు ఏవైనా, ఏ భాషలో ఉన్నా, మనం ప్రమాణాలేనని గుర్తించాలని వివరించారు. వేదవిద్యా ప్రమాణాలేనని స్థానాలు 14 ఉన్నాయని, శిక్ష, వ్యాకరణం, కల్పం, నిరుక్తం, ఛందస్సు, జ్యోతిషం, ఇతిహాసం, పురాణం, మీమాంస, న్యాయ వేదాన్తం, 4 వేదాలు ఇవన్నీ వేదార్థాన్ని వివరిస్తాయి. కాబట్టి ప్రమాణాలు అయ్యాయి. వీటికి అతీతంగా ఏవున్నా అది అవైదికమౌతుంది. వీటిని అనుసరించి సాగేవే వైదికాలు అవుతాయి'', అంటూ వేద వాఙ్మయ శీర్షికగూర్చి ప్రబోధించారు. తరువాత శ్రీస్వామివారు వేదికమీద పెద్దలకు మంగళాశాసనాలు అందజేసారు.

బెంగుళూరునిండి విచ్చేసిన శ్రీశ్రీశ్రీ **త్రిదండి వెంకటరామానుజ జీయరుస్వామి వారు** ప్రసంగిస్తూ ''శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు చూపిన మార్గమే శిరోధార్యమని, ఆచరణయోగ్యమని, ఈ సందర్భంలో శ్రీస్వామివారిని ఇలా సేవించడం వల్ల ధన్యులమయ్యామని", వారి మనోగతాన్ని ఆవిష్కరించి భక్తులకు మంగళాశాసనములు అనుగ్రహించారు.

శ్రీస్వామివారి తిరునక్షత్ర మహోత్సవ మును సేవించుకోవాలని శ్రీమాన్ పద్మన్, లక్ష్మిగార్లు ఆస్ట్రేలియానుండి ప్రత్యేకంగా విచ్చేసినారు. శ్రీమాన్ పద్మన్‌గారు వారి మనోగతాన్ని ఆంగ్లంలో ఆవిష్కరించగా శ్రీమాన్ రామకృష్ణారెడ్డి దానిని భక్తులకు తెలుగులో అనువదించారు.

ఆస్ట్రేలియాలో ప్రప్రథమంగా శ్రీస్వామి వారిని చూసేసరికి ఆనందం కలిగిందని, అందుకోసమే శ్రీస్వామివారిని సేవించడానికి ఇక్కడికి వచ్చామన్నారు. "మేము ఎంతో దూరంగా ఉన్నా, ఈ ధర్మాన్ని, సంస్కృతిని ఎంతగానో అభిమానిస్తున్నాం. లౌకిక విషయాల అంచులు చూసినా, అవన్నీ సార రహితాలు అని మేం తెలుసుకొని, వైదిక మార్గంలో అడుగుపెట్టాం, కాని ఇందులోనే ఉంటున్న ఎందరో ఆ వైభవాన్ని గుర్తించాల్సిన అవసరం ఎంతైనా ఉంది, మేము చెన్నైలో



ఒక హోటల్‌లో దిగాము. ఆ హోటలులో వ్యాయామశాలకూడ ఉంది. అందులోకి వెళ్ళినపుడు ఎంతోమంది అక్కడ ఉన్న వ్యాయామ యంత్రాలపై కసరత్తులు చేస్తున్నారు. దేశీయమైన యోగాభ్యాసం మీద ఎవ్వరూ దృష్టిపెట్టడంలేదు. నేను, నా భార్య మాత్రమే యోగాభ్యాసం చేసుకున్నాం. ఇది చాల బాధాకరం. ఈ దేశంలో ఉన్న మీరు, మీ వైభవాన్ని విస్మరించవద్దు అని మేం కోరుకుంటున్నాం" అని ముగించారు.

జెట్ కోశాధికారి శ్రీమాన్ జె. రామేశ్వర రావు (మైహోమ్ అధినేత), శ్రీమాన్ ఇ. రామారావు-ఖమ్మం జిల్లా వికాసతరంగిణి కన్వీనర్, శ్రీమాన్ టి.కె.రావు- బెంగుళూరు, శ్రీమాన్ సి.హెచ్ రామచంద్రారెడ్డి, శ్రీమాన్ గుదిమెళ్ళ మురళీకృష్ణమాచార్యస్వామి (భద్రాచలం) తదితరులు శ్రీస్వామివారి మంగళాశాసనాలు స్వీకరించి, వారి సందేశాన్ని క్లుప్తంగా అందించారు. తరువాత శ్రీస్వామివారు అనుగ్రహభాషణం మృదు మధురంగా, మనోహరంగా ఇలా సాగింది.

"వేదాన్ని సంరక్షించడం పెద్దస్వామివారి ఆశయం. దానికి అనుగుణంగానే వేద యజ్ఞాలు, స్వాధ్యాయజ్ఞాన యజ్ఞాలు నిర్వహించారు. అప్పట్లో వారికి వేదవిశ్వ విద్యాలయ స్థాపన, వేదవిద్వాంసుల సంరక్షణ ఆశయాలు. వేదము చదువుకొన్నవారు జంగమవిమానాలు లేదా జంగమ వేదం అంటారు. అలాంటి వారిని ప్రోత్సహించడం, సత్కరించడం ద్వారా మనకున్న శ్రద్ధని ప్రకటించుకునే అవకాశం ఉంటుంది.

గ్రంథముద్రణ, విద్యార్థులను తయారు చేయడం, వేదాల్ని (సి.డి.)ద్వారా భద్రపర చడం, వీటన్నిటితో పాటు ఇలాంటి పెద్దల్ని సత్కరించడం కూడా ప్రధానమైన అంశం. **C.D.**లు చేసినా ఏవైనా పొరపాట్లు ఉండ వచ్చేమోగాని, ఇలాంటి పెద్దలలో పొరపాట్లు జరగడానికే అవకాశం ఉండదు. అది ఆ ప్రక్రియలో ఉన్న గొప్పతనం. అందుకు మన ఋషులకు కృతజ్ఞతలు సమర్పించాలి. వాటికి కేంద్రాలు ఆలయాలు. అలాంటి ఆలయా లలో ఏ రకమైన ధర్మగ్లాని జరిగినా, దాన్ని వెంటనే ప్రతిఘటించి, సంస్కరించుకొనే స్థితిలో మనం సిద్ధం కావాలి" అలాంటప్పుడే భగవంతుడు తన ఉనికిని ఏదో చర్య ద్వారా నిరూపించుకుంటూ ఉంటాడు. ముఖ్యంగ మానవుల శక్తికి మించిన సన్నివేశాలలో తానే స్వయంగ స్పందిస్తూ ఉంటాడు. భగవంతు నిపై ఉండే విశ్వాసాన్ని తానే భక్తులలో పెంచుకుంటాడు. ఆ భగవంతునికీ, ఆలయాలకీ రక్షణవేదమే. దానిని ధరించిన మహనీయులను సత్కరించుకోవడం మనకే గర్వకారణం. వారికి మనం చూపవలసిన కనీస కృతజ్ఞత అది" అని అనుగ్రహించారు.

తత్త్వశాస్త్ర ప్రచారకులు శ్రీమాన్ పీతాంబరం రఘునాథాచార్యులు కృతజ్ఞతలు ఆవిష్కరించారు. వేదశాంతితో కార్యక్రమము పూర్తయింది.

**శ్రీరామచంద్ర ప్రభువుకి సహస్ర కలశాభిషేక మహోత్సవము**

జగద్గురువులు పరమహంస పరివ్రాజ కులు శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్నజీయరుస్వామివారి ప్రత్యక్ష

వర్యవేక్షణలో సహస్రకలశాభిషేక మహోత్సవం 15-11-2004 సీతానగరం ఆశ్రమంలో వేలాదిమంది భక్తుల సమక్షంలో శ్రీ సీతారామచంద్ర పెరుమాళ్ళకి వైభవంగా జరిగినది. ఉదయాన్నే యాగశాలలో నిత్య హోమం ప్రారంభమైంది.

పెరుమాళ్ళకి సేవాకాలం మంగళా శాసనం, తీర్థగోష్ఠి అనంతరం వేద ఆగమ పండితుల వేద మంత్రాలతో శ్రీ సీతారామ చంద్రస్వామి పెరుమాళ్ళను వేదికమీదకు ఘనంగా తీసుకు వచ్చారు.

వేలాదిమంది భక్తులు సేవిస్తూండగ ఉదయం 8-30 నుండి సాయంకాలం 5-00 గం॥ వరకు సహస్ర కలశాలతో శ్రీరామచంద్రునికి అభిషేక మహోత్సవం వేద ఘోష మధ్య వైభవంగా జరిగింది. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని ఎంతోమంది పండితులు తమ సందేశాలను అందించారు. విశేషం ఏమిటంటే:- 1993 నవంబరులో శ్రీ స్వామివారి తిరునక్షత్రం ముగిసిన నాటిరాత్రి ఆ పెరుమాళ్ళు అపహరణకు గురై అజ్ఞాతంలో ఉండి అప్పటి S.I. ఉన్న శ్రీమాన్ కోటేశ్వరరావుగారి చొరవచేత రాజ లాంఛనాలతో ఆశ్రమానికి తిరిగి వచ్చారు. అదే ఒక పునర్జన్మగా పెరుమాళ్ళు ఆగమ దినంగా ప్రతి సంవత్సరం సహస్ర కలశా భిషేకం చేస్తున్నారు శ్రీ స్వామివారు. పెరుమాళ్ళను తీసుకొని వచ్చేవరకూ నీరు కూడా ముట్టనని ప్రతిజ్ఞచేసి మూడవ దినాన అలానే తెచ్చిన శ్రీమాన్ D. కోటేశ్వరరావుని సమ్మానించడం, పెరుమాళ్ళకు సహస్ర కలశాభిషేకం చేయడం ఆచారం. అలాగే ఈ సంవత్సరం కూడా వైభవంగా జరిగింది.

C.I. శ్రీమాన్ కోటేశ్వరరావుగారు మాట్లాడుతూ భగవంతుడు ఇచ్చిన వరంగా శ్రీ చిన్న జీయరు స్వామివారి పాదాలను ఆశ్రయించగలిగాను.

సమాజాన్ని మంచిమార్గంలో నడిపిస్తూ కోట్లాదిమంది భక్తులకు ఆదర్శంగా నిలిచి, తనకిలాంటి శాశ్వత అదృష్టాన్ని కల్గించిన శ్రీ చిన్నజీయరు స్వామివారికి నేనెప్పుడూ అంకితమై ఉంటానని తెలియజేసారు.

ఈ కార్యక్రమంలో శ్రీ ఉ.వే. శ్రీమాన్ రంగరామానుజాచార్య స్వామి, శ్రీ ఉ.వే. శ్రీమాన్ నేపాల్ కృష్ణమాచార్యులు శ్రీమాన్ గుదిమెళ్ళ కూర్మనాథాచార్యులు, ఆగమ విద్వాన్ శ్రీమాన్ శ్రీనివాసాచార్యులు, వేద విద్వాంసులు శ్రీమాన్ వరదన్‌గారు, శ్రీమాన్ రాజగోపాలాచార్యులు గారు, శ్రీమాన్ పురుషోత్తమాచార్యులుగారు, తత్త్వశాస్త్ర ప్రచారకులు శ్రీమాన్ రఘునాథాచార్యులు, అరుణ, హైమావతి తదితరులందరూ భక్తులకు తమ సందేశాన్ని అందించారు.

చివరగా శ్రీస్వామివారు అనుగ్రహ భాషణం చేస్తూ మానవజాతికి ఇలవేల్పు శ్రీరామచంద్రుడిని మనం ఆదర్శంగా తీసు కోవాలి. మనమంతా కలిసి ఉండాలి. అందరితో ఆప్యాయంగా ఉండాలి. పరస్పరం ద్వేషాలు వదలాలి. పదిమందికి మంచి చేయాలనే సంకల్పంతో ముందుకు నడవాలని మంగళాశాసనాలు చేసారు. ముఖ్యంగా రాత్రి ఆస్ట్రేలియా నుండి వచ్చిన శ్రీమాన్ సత్యనారాయణ బృందం ఏర్పాటు చేసిన 10 వేల దీపాలతో దీపోత్సవ కార్యక్రమంతో ఆశ్రమం అంతా కళకళ లాడింది.



**నడిగడ్డపాలెం:-** నవంబరు 21వ తేదీ ఆదివారం ఉదయం గం.10-30లకు ఉచిత వైద్యశిబిరము నిర్వహించడమైనది. ఈ శిబిరములో గుంటూరులో ప్రముఖవైద్యులు (Orthopedic) ఎముకలకు సంబంధింత శ్రీమాన్ వై. లక్ష్మణస్వామి, వారి బృందంతో మరియు ప్రముఖ దంతవైద్యులు శ్రీమాన్ సతీష్‌కుమార్, వారి బృందంతో పాల్గొన్నారు. సుమారు 200మందిపైగా ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొన్నారు. ఉచితంగా శ్రీమాన్ రాంప్రసాద్‌గారు మందులను అందజేసారు.

22వ తేదీన ఆశ్రమంలో వేంచేసియున్న శ్రీలక్ష్మీనారాయణ పెరుమాళ్ళకు కార్తీకశుద్ధ ఏకాదశిపర్వదినం సందర్భంగా క్షీరాభిషేకాన్ని సమర్పించారు. పరిసర గ్రామాల నుండి భక్తులు విశేషంగా పాల్గొన్నారు.

ఆశ్రమ దేవాలయంలో పవిత్రోత్సవము లను కార్తీకశుద్ధ త్రయోదశినుండి (నవంబరు 24 నుండి 26) పౌర్ణమివరకు వైభవముగా జరిగాయి.

తెనాలి: వివేకావిద్యాసంస్థల అధినేతలు శ్రీమాన్ రావిపాటి రామచంద్రమూర్తి దంపతుల కైంకర్యంతో ఈ ఉత్సవములు జరిగినవి. మధురకవి శ్రీమాన్ కోగంటి వేంకటాచార్యస్వామి-ముత్తుపల్లి వారు ఈ సందర్భముగా భాగవత ప్రవచనాలు అందించారు.

**చాతుర్మాస్య దీక్షా పరిసమాప్తి:-**

26వ తేదీ మధ్యాహ్నం 2 గం॥లకు చాతుర్మాస్యదీక్ష పరిపూర్ణం చేసుకొని, శ్రీశ్రీశ్రీ చిన్న జీయరుస్వామివారు నడిగడ్డపాలెం వేంచేసి, పెద్ద జీయరుస్వామివారిని సేవించు కొని, పెరుమాళ్ళకు మంగళాశాసనము చేసినారు.

తిరిగి సీతానగరం చేరుమార్గమధ్యంలో శ్రీస్వామివారి ప్రియశిష్యులు, తెనాలి వివేకా విద్యాసంస్థల అధినేతలు శ్రీమాన్ రావిపాటి రామచంద్రమూర్తిగారు, వారి కుమారుల కోరికపై, వారు నూతనంగా నిర్మించిన వివేకా స్కూలు భవనసముదాయమును ప్రారంభించి, చిన్నారివిద్యార్థులకు, అధ్యాపకులకు, సిబ్బందికి మంగళాశాసనములు కృప చేసినారు.

ఆ రోజు రాత్రి కృత్తికా(కార్తీకపౌర్ణమి) దీపోత్సవము జరిగినది. శ్రీమతి జె. రాజాయమ్మ(ఒంగోలు) ద్వారా భక్తులు సమర్పించినద్రవ్యంతో ఆశ్రమప్రాంగణ మంతా దీపములు అందంగా అలంకరిం చారు. తెనాలి వివేకావిద్యార్థినులు 200 మంది ఈ దీపోత్సములో పాల్గొన్నారు. పవిత్రోత్సముల అనంతరం శ్రీలక్ష్మీనారా యణ కల్యాణోత్సవము, విశేషతదీయా రాధనతో కార్యక్రమములు వైభవముగా పూర్తయినవి.

అర్చకులు శ్రీమాన్ ఉత్పల లక్ష్మీనర సింహాచార్యస్వామి, శ్రీమాన్ గుదిమెళ్ళ బదరీ నాథ్‌స్వామి, వారి పరివారములతో పై కార్యక్రమములు నిర్వహించారు.

తెనాలిలోని జీయరు హ్యూమానిటీస్ వైద్య బృందము నవంబరు నెలలో 21వ తేదీన 34వ జీయర్ ఉచిత వైద్యశిబిరాన్ని చుండూరు మండలంలోని పరిమిగ్రామంలో నిర్వహిం చారు. ముఖ్య అతిథులు. ఆర్.పి.ఓ. సూర్య నారాయణమూర్తి, డి.ఎస్.పి. దేవేంద్రరావు గారు పాల్గొన్నారు. సుమారు 900మందికి పైగా సేవలందరించా ఈ శిబిరంలో 42వేల రూపాయల విలువ కల మందులను పంపిణీ చేసారు.

జై శ్రీమన్నారాయణ!

## భాగవత మాహాత్మ్యాన్ని తెలిపే

శ్రీమతి సత్య U.S.A

దక్షిణాది దివ్యదేశాలలో కన్యాకుమారికి దగ్గరగా తిరుక్కురుంగుడి అనే ఒక ఊరుంది. ఆ ఊరికి దగ్గర పల్లెలో దళితుల వాడలో ఓ భక్తుడుండేవాడు. అతడు పరమభక్తుడు. రోజూ తెల్లవారక ముందే లేచి, తిరుక్కురుంగుడికి వెళ్ళి, అక్కడ వేంచేసిన వామనదేవుని కీర్తిస్తూ పాడేవాడు, తోలుచొక్కా, శంఖ చక్రాల చెవి పోగులు, ఊర్ధ్వపుండ్రాలు ధరించి, తంబుర, చిటి తాళాలు, దీపస్తంభము పట్టుకుని రోజూ తిరుక్కురుంగుడికి వెళ్ళేవాడు. గుడిముందు నిలబడి తంబుర మీటుకుంటూ మంగళ కైశికరాగంలో కీర్తనలు పాడుతూ స్వామిని కొలిచేవాడు. తెల్లవారాక, గుడితెరిచి అర్చకులు ఆరాధన పూర్తిచేసాక, పానపట్టంలోంచి వచ్చే నీటిని తలమీద చల్లుకుని, తంబురాదండ సాచి, ఎవరో ఒకరిచేత ప్రసాదం పెట్టించుకుని, ఆరగించి తిరిగి ఇంటికి చేరేవాడు. రోజూ ఇదే ఆ మాలదాసరి దినచర్య.

ఒకనాడు కోళ్ళ గూట్లో పిల్లి చేరడం వల్ల కోళ్ళు, జాముకాక ముందే కూసాయి. అది విని, జామయిందనుకొని లేచి తయారయ్యి గుడికి బయలుదేరాడు దాసరి. చిమ్మచీకటి, దీపం వెలుతురులో దారి చూసుకుంటూ నడుస్తూండగా, కనపడక మరులు తీగతొక్కాడు. దానితో, తోవ మరిచిపోయి తిరిగిన చోటే తిరిగి తిరిగి చివరికి తెల్లవారేసరికి ఒక నిర్జనమైన ప్రదేశాన్ని చేరాడు.

తెల్లవారి వెలుతురులో చూస్తే, అంతా నిర్మానుష్యంగా ఉంది. చుట్టూ కసింద, కోరింత, జెముడు, జిల్లేడు, తుమ్మపొదలు. ఒక పెద్ద మఱ్ఱిచెట్టు కనపడింది. ఊడలు దిగి, బాగా వ్యాపించి, ఆ ప్రదేశాన్ని అంతా చీకటిలో ముంచేంతగా విస్తరించి ఉందా చెట్టు. ఆ చెట్టుమీద ఒక బ్రహ్మరాక్షసుడు ఉన్నాడని జనులు ఎవ్వరూ ఆ చెట్టు ఛాయలకి పోయేవారు కాదు. ఆ చెట్టు పక్కన ఏదో కాలిబాటవలె కనబడితే, దాసరి దారి కనబడిందనుకొని అటు వెళ్ళాడు. చుట్టూ చూస్తే, పుర్రెలు, మాంసఖండాలు, ఎముకలు... ముళ్ళునిండిన ఉత్తరేణి పల్లేరు పొదలు... బక్కచిక్కిన పిల్లులు, దాసరి భయపడుతూ ఉండగానే ఎక్కడినుండో ఊడిపడ్డాడు ఓ భయంకర రాక్షసుడు. దాసరి పిరికివాడేమీ కాదు, అంతకు ముందు సైన్యంలో పనిచేసి ఉన్నవాడు. రాక్షసుడితో తలబడ్డాడు. కొంతసేపు కాగానే, దాసరి అలసిపోయి పారిపోవడం మొదలుపెట్టాడు. రాక్షసుడు దాసరిని పట్టుకుని చెట్టుకి కట్టేశాడు.

అపుడు దాసరి అన్నాడు కదా "ఓయి బ్రహ్మరాక్షసా, నేను నిన్ను గెలవడమనేది



కలలోమాట. ప్రాణరక్షణకోసం ప్రయత్నించడం సహజం కనుక నీతో పోరాడానే కానీ నిన్ను గెలవగలనని కాదు. ఈ శరీరము ఉండేది కాదు, ఏదో ఒకనాడు పోయేదే. అది ఒక ప్రయోజనాన్ని సాధించి నశిస్తోందంటే అంతకన్నా కావలసినదేముంది? నువ్వు నన్ను తినడం నాకు సమ్మతమే. ఐతే నాకొక నియమం ఉన్నది. ప్రతిదినమూ తిరుక్కురుంగుడిస్వామిని ఉదయమే గానంతో కీర్తించి కొలిచి రావడం నా అనుష్ఠానం. నన్ను విడిస్తే ఆఖరిమారు ఆ కైంకర్యం ముగించుకొని వస్తాను, అప్పుడు నువ్వు నన్ను చంపేసినా తినేసినా నాకు బాధలేదు".

అది విని బ్రహ్మరాక్షసుడు నవ్వి, "ఓరి దాసరీ! ఎంతబాగా చెప్పావురా! ఆ విద్యలు నేనెరుగనివా? నేను కూడా చదివాను లేవోయ్. ఏ రాజపురుషుడు సిద్ధాన్నము వదిలిపెడతాడు"? అన్నాడు.

దాసరి ఎన్నో ఒట్లు పెట్టుకున్నాడు. ప్రతి దానికి రాక్షసుడు నవ్వడం, తోసిపుచ్చడం, చివరికి దాసరి, "నేను తిరిగి రాకపోదునేని, శ్రీమన్నారాయణునితో ఇతర వేల్పులను సమానమని చెప్పితే వచ్చే పాపిని అవుతాను"! అని ఒట్టు పెట్టగా రాక్షసుడికి నమ్మకం చిక్కి, "సరే వెళ్ళి రా!" విడిచి పెట్టాడు.

దాసరి ఎప్పటివలె తిరుక్కురుంగుడికి చేరి స్వామిని మంగళ కైశికరాగంతో ఆరాధించి, తిరిగి, ఆ రాక్షసుడుండే మఱ్ఱి చెట్టు వద్దకి వచ్చి, నువ్వు పంపినప్పుడు యే చేతులు, యే కాళ్ళు, యే శిరస్సు, యే ఉరము ఉన్నవో, ఇప్పుడా చేతులు, ఆ కాళ్ళు ఆ శిరస్సు, ఆ యురము ఉన్నవో లేవో చూసుకో"మన్నాడు. రాక్షసుడు చెట్టు దిగి వచ్చి, దాసరినిచూచి ఆశ్చర్యపోయాడు. రాక్షసునిచేతిలోంచి జారి, తిరిగి ఎవరైనా ఇలా మృత్యువును కోరివస్తారా? నీవెవ్వడవో సామాన్యుడవు కావు. నన్ను నీవే తరింపచేయగలవు" అనుకుంటూ దాసరి కాళ్ళమీదపడి, భోజనము రోజూ దొరికేదే. నా పాపానికి పరిహారం అన్నివేళలా దొరుకునా?" అన్నాడు.

అదేమిటన్నాడు దాసరి? "భాగవతుల దర్శనం రోజూ దొరికేది కాదు. నా పాపాన్ని పరిహరించగలిగిన శక్తి నీకుంది, రక్షించు" అన్నాడు రాక్షసుడు. రక్షించేవాడు భగవంతుడు, నాకేమి చేతనగును? అన్నాడు దాసరి. "భగవంతుడు చెయ్యగలిగినది భాగవతులు చేయలేరా? నువ్వు ఈనాడు చేసిన కైంకర్యం యొక్క ఫలము నాకియ్యి, నా ఈ రూపము తొలగిపోవు" నన్నాడు రాక్షసుడు. అనగా దాసరి, "అమ్మో, అది మాత్రము వల్లకాదు" నేను ఏ ఫలమూకోరి ఎప్పుడూ కైంకర్యం చేయలేదు. అంచేత ఫలమును యివ్వడం, కోరడం, పుట్టుకోవడమూ వంటివి నాకేమీ తెలియదు. అన్నాడు. కనీసం పాటలో సగమైనా ఫలమీయవా" అన్నాడు రాక్షసుడు. "సగము కాదు క్షణమైనా ఇవ్వలేన"న్నాడు

దాసరి. “చీమై, దోమై, ఈగై, పురుగై, జంతువై, రాయై, చెట్టై, నువ్వూ నేను ఎన్ని జన్మలెత్తాము కామయ్యా? ఈ శరీరము చిల్లికుండలోని నీరు పోస్తే పనికి రానట్టే దేనికీ విలువలేనిది ఘుణాక్షరము అంటే చెదకొరిని చోట అక్షరం కాకతాళీయంగ ఏర్పడట్టు తయారైనదే. క్షణికమైన ఈ శరీరాన్ని రక్షించుకోడం కోసం నా చేతిలోలేని కైంకర్యఫలాన్ని ఎలాయివ్వ గలను? అయినా, కప్పూరమిచ్చి ఉప్పు కొనే వెట్టి వాళ్ళెవరైనా ఉన్నారా లోకంలో? అన్నాడు దాసరి.

భగవంతుడికి అంత కరుణ ఉంటే, భాగవతులకు ఇంకెంత కరుణ ఉండాలి? నా మీద జాలి చూపావే తిరుక్కురుంగుడి నంబీ! కృపావలంబీ! ఈ రోజు పాడిన పాటలో చివరి కొద్ది క్షణాల ఫలమైనా ఇవ్వు చాలు” అని బ్రతిమాలాడు పాపం! ఆ రాక్షసుడు.

అప్పుడు దాసరికి జాలి కలిగి, “పాట స్వామికి అర్పించినది. నా సొమ్ము కాదు నీకు దానం చేయగలుగుటకు. పాట ఫలమేమో నేనెరుగను. దేనికెంత ఫలమో ప్రపన్నులకేమి తెలియును? కానీ, నిన్ను భగవంతుడు తప్పక రక్షించాలని మాత్రం ప్రార్థించగలను” అన్నాడు రాక్షసుడిని లేవనెత్తుతూ. నోటమాట నోట ఉండగానే, రాక్షసు డికి ఆ రూపంపోయి బ్రాహ్మణ రూపం కలిగింది. బ్రహ్మవర్చస్సు తేజ రిల్లుతూ, శిఖతో, యజ్ఞోపవీతముతో, ఊర్ధ్వపుండ్రాలతో, తెల్లటి శుభ్రవస్త్రము లతో, కమండలముతో, సోమశర్మ తన నిజరూపాన్ని పొందాడు. తన శాపము, రాక్షసరూపము తీర్చిన మాలదాసరి కరుణని కీర్తించి పుణ్యలోకాలకు వెళ్ళి పోయాడు.

తన కూతురైన గోదాదేవికి కలిగిన భగవద్విరహరూపమైన గ్లానినిగని విచారి స్తున్న విష్ణుచిత్తులకు శ్రీవిల్లిపుత్తూరి వటపత్రశాయి ఆలయములో వేంచేసిన పెరుమాళ్ళు చెప్పిన కథ ఇది.

“సాక్షాత్తూ శ్రీమన్నారాయణుడే చెప్పిన కథ గనుకే దీనికి కైశిక పురాణము” అని పేరు కలిగినది. శ్రీరంగంవంటి దివ్యదేశా లలో కైశిక ఏకాదశినాడు భట్టరులు ఈ కథను స్వామిముందర విన్నవిస్తారు. ఆ పురాణ పఠనంచేస్తూ ఉండగ వారికి పెరుమాళ్ళ బహుమానంగ శాలువాలు సమర్పిస్తారు. తెల్లవార్లు కాలక్షేపం జరిగి ముగియగానే శ్రీరంగనాథుణ్ణి మోసే శ్రీపాత్తాంగులే ఈ భట్టరుస్వామిని శ్రీరంగ నాథునికి చెందిన వాహనంపై శ్రీరంగ నాథునికుండే సకల విధమర్యాదలతో వారితిరుమాళికకు మోసుకొని వచ్చి దింపి, వారి మంగళాశాసనాలు తీసుకొని వెడతారు. “బ్రహ్మరథ మర్యాద” అంటారు దీనిని. ఇది జరిపే ఏకాదశిని“కైశికైకాదశి” అంటారు. పాలకడలినుండి శ్రీయఃపతి మేల్కొంటాడని శాస్త్రాలు స్పష్టం చేసే కార్తీక శుద్ధ ఏకాదశి, బోధనైకాదశి అని కీర్తించే రోజే ఈ కైశికగానాన్ని ఆ దాసరి.. స్వామికి వినిపించి చరిత్ర ప్రసిద్ధుని పొందడం వల్ల దీనికే “కైశికైకాదశి” అని కూడా కీర్తిస్తారు.



శ్రీస్వామివారి తిరునక్షత్ర శుభసందర్భముగా అందించిన

# స్తుతిపుష్పాలు

శ్రీమాన్ ఆరుట్ల రంగాచార్య-కరీంనగర్

శ్రీకర వైష్ణవమ్మదియె చిన్మయ రూపము స్వాతిముత్యమై
వ్రేకగు బ్రహ్మతేజమున విశ్వమునెల్లెడ స్వీయదీధితుల్ !
ప్రాకగనంధకారముల పారగత్రోల యతీశ్వరుండు నీ
లోకమునుద్ధరింప నతిలోలత సంభవమయ్యె జీయరై !

పొంగు విరించి తేజమున పూనిక దిద్దిన నూర్ధ్వపుండ్రముల్ !
సింగిణిబోలుభ్రూలతలు చిత్తము దోచు విశాలనేత్రముల్ !
బంగరుమేని చాయయు కృపారసమొల్కెడు మందహాసముల్
కొంగుపసిండి భక్తులకు కూరిమి జీయరుగారిఁగొల్చెదన్!

చిన్మయమూర్తి నొక్కపరిచేరి నమస్కృతి చేసినంతనే
తన్మయులౌచు నాస్తికులు తద్దయు భక్తిని శిష్యులౌదురే!
చిన్మయ వాక్సుధా ఝురిని చిత్తము మొత్తము మెత్తజేయునా
సన్ముని సార్వభౌమునిటు సంస్తుతి జేయుదు నెల్లవేళలన్!

జీయరులెందరున్న నిలజీయరునన్నది రూఢి వీరికే
జీయరునైన గద్దెదిగి శ్రీపతిగూర్చి వచింపవచ్చెనే
యేయెడనైన నొక్కటగు నిష్టిని చేసి వెలింగినార? యా
ప్యాయత భక్తసంఘముల వారగ స్థాపన చేసిరే? యెటన్?
పాయని భక్తిడెందమున పాదమి నిల్వగ సంస్తుతించెదన్

స్వాతిదినంబు పావనము! సద్గురు జీయరుగారు పుట్టుటన్!
పూతచరిత్రు లోకమున పుణ్యము పెంచగ నిచ్చినట్టి మా
స్వాతిదినంబునన్ జనుల స్వాంతములందున మోదవారిధి
వ్రాతము నింగిపొంగ నురు వైభవమొప్పజయంతి వేడుకల్
భూతలమందు చేయుచును భూరి నమస్సులనందజేయు, వి
ఖ్యాతయతీశ్వరుల్ గొనుచు కమ్మని దీవనలీయ వేడెదన్.

# కలియుగ వైకుంఠం కథవిందాం

యతీంద్ర పదవిలాసాల 'శ్రీ'నివాస-భాగ్యనగరం

**పరిచయం :-**

జగమెరిగిన కొండ!
జనములందరికి అండ!
కలియుగమున మానవులను కరుణించ,
విరజానది స్వామి పుష్కరిణిగ!
ఆదిశేషుడే ఆ ఏడుకొండలై!
ఆపై నిలిచె 'శ్రీనివాసుడే' జాలిగుండెలై!

**పూర్వం:-**

చలి ఎక్కువై, పులులుండు మెండుగా!
కొండపైకి చేరుదారి నడకకెంతో కష్టంరా!
భక్తికి బాటలు అవసరమా?
వలపుకు వసతులు అవసరమా?
పసుపు బట్టలు కట్టి, పాదరక్షలు
విడిచిపెట్టి వచ్చేవారు భక్తులెందరొ!
కానుకలిచ్చేవారు, కోర్కెలు తీరి అందరూ!

**పరిణామంలో :-**

సంపద పెరిగిన ఆపదవచ్చును
మంది ఎక్కువైన మజ్జిగ పల్చన! అయ్యేను!
ఆ పేరే పెద్ద దురుద్దేశము!
'దేవాదాయశాఖ' ఇచ్చే సందేశము!

ఇంగ్లీషు చదువులతొ, ఇంగ్లాండు దొరలవేషాలతొ
అధికారులు, ఉద్యోగులు సేవకులయ్యే!
పెరిగిన భక్తుల రద్దీ కొరకు
మార్పులు, చేర్పులు అవసరమయ్యే!

అది, ఇది ఏమని అడిగేవారే లేక
వేరును మరచీ చెట్టును మలచే వేడుక!
పవిత్ర పుణ్యస్థలము
విహార, వినోద యాత్రలకే అయ్యెను వేదిక!

**సామాన్యుల అయోమయం :-**

నిమిషమే దర్శనం!
మరు నిమిషమే వెనుదిరగటం!
వరాలిచ్చే శ్రీనివాసుడే పదివేలు!
బంగారు గుడ్డు మనకు చాలు!
బదులిచ్చే బాతు బాగోగులు
చూచే బాధ్యతకు తిలోదకాలు!

**అధికారుల అనాలోచన :-**

ఆధునిక నగరంలా తీర్చిదిద్దాలని
అధికారులు చేపట్టే విద్దూరాలు!
అడ్డమంటూ వందఏళ్ళ కట్టడాలు
పడగొట్టడాలు!
అవసరమంటూ సరిక్రొత్త సౌధాలు–
కట్టడాలు!
కొన్నాళ్ళకు కొండలు కనుమరుగై
బారులు తీరే మేడల మిద్దెల వరుసలు!
బావురుమంటూ భక్తి
పవిత్రతలిక పోయేను వలసలు!

**ఆచారములలో అవకతవక :-**

నోరు మెదపని స్వామికి,
కాలుకదపని స్వామికి
విశ్రాంతినివ్వక పోవుటచే నిద్రలేమి!
మన పాపభంగ! ఆ సురగంగ!
కన్నతండ్రికి స్నానమాడంగ
కొళాయినీరె కోరిపోసినారేమి!

**స్పందన :-**

చూచేవారు లేని తరుణంలో,
అడిగేవారే కరువైన కాలంలో
వెన్నమనసు! వేదసారాలు తెలుసు!,
చిన్న వయసు! ఆచరణే సొగసు!



ఆ చిన్నజీయరుస్వామి వెన్ను జలదరించి,
కన్ను చెమరించి,
వెంకన్న సన్నిధిలో వెలితిని
పూరించమని అధికార వర్గాన్నికోరె!

అట్లే, అట్లే అంటూ,
అంతా వింటున్నట్టే ఉంటూ,
ఆపై సూచనలివ్వండంటూ!
చర్చలు అయ్యాక యోచన చేస్తామంటూ!
వెయ్యికాళ్లమండపం కూల్రద్రోసే!
వేరే ప్రాకారం కట్టజూసే!

లోగుట్టు బట్టబయలు జేసిన
స్వామిపై నీరుగారే నిందలన్నీ
కుమ్మరించి పోశే!
ఆ అపవాదులతో అప్పులంతా
స్వామికి దిష్టితీసిపారవేశే!

**దుస్సాహసం :-**

పాదము బెట్టుటకే పదుగురాళువారులూ
తగదని వెనుదిరిగిన వెంకన్న కొండ!
కాదు కూడదని శిష్యులంతా కోర,
బట్టలు కట్టి మోకాలితో
రామానుజులెక్కిన కొండ!
రాజకీయాలో, నాటకీయాలో!
నమ్మినవారి దురదృష్టాలో?
నేడు బాంబులతో బ్రద్దలు,
క్రేనులతో చిల్లులు, చేసేరెన్ని దౌష్ట్యాలో?

**సౌకర్యం, సమర్థింపు :-**

అది ఓ మేలి ముసుగు!
కాస్త ఆలోచనకే కానవచ్చులోని లొసుగు!
"భక్తుల సౌకర్యం కోసమే ఈ కూల్చడాలు,
కాల్చడాలు!"
"ఆలయ రక్షణ కోసమే క్రొత్తగ కట్టడాలు,
ఖర్చుకు మార్గం కనిపెట్టడాలు!"

ఇది టి.టి.డి. మాట! మాయలమూట!
నిమిషం, నిమిషం మారే పాట!
ఆపై అవసరానికి మారే సంగతులు!
ఆగమ పీఠం సమ్మతులు!

పిల్లికి ఎలుక సాక్ష్యాలు!
ఊకుమ్మడి ఉపయోగం కోరే విపక్షాలు!
పాపం వారివన్నీ భక్తజన (బహుజన) సేవాలక్ష్యాలు!

**మరెందుకీ రాద్ధాంతం?:-**

**తమ తప్పను సమర్థించుకోవటం కోసం చిన్న జీయరుస్వామిపై నిరాధారపు నిందలు**

ఊరుపేరూ లేనివాడికి గోరులు పెంచో,
గోతులు తీసో కావాలి గాని పేరూ!
ప్రపంచ ప్రసిద్ధి చెందిన "చిన్న జీయరు"
స్వామికెందుకోయి? సారూ!

ఆ కొండపై అధికారుల పేరు–
ఆ క్రింద సేవకులకే తెలియని తీరు!
విన్నారూ! అన్నవారు ఉన్నారు!

ప్రతిగుండెకూ మంత్రమైన పేరు!
"చిన్న జీయరులంటే" పేరుకే మారుపేరు!
ఆ గొంతు వింటే స్పష్టతకే కంగారు!
ఆ శ్రమ చూస్తే ఓపికకే బేజారు!
ఆ రూపు తేజస్సులకే దొరగారు!
ఆ వైపే మంచోరంతా వెదికేరు!
అందుకే కుళ్ళు! చూడలేక కళ్ళు!
ఆడలేక నోళ్ళు! పారేసుకున్నారు!

భార్యాబిడ్డలతో, బానా పొట్టలతో!
పట్టుబట్టలతో, బంగారు లాకెట్టులతో!
సరదాగ తులతూగేవారికి డబ్బులు కావలె కాని!
వారికెందుకు? అంటలేవవి! ఎంతో దూరమవి!
మాయలు చూపరు! మహిమలు చేయరు!
మచ్చలేని చంద్రుడే దిగి వచ్చారు!
దీనులదాక వేదగాథలే తెచ్చారు!

పందొమ్మిది వందల తొంభై నాలుగులో
టి.టి.డి.కే డబ్బులు ఇచ్చారు!
మరి వారు మరచారో? కప్పిపుచ్చారో?
రికార్డుల కళ్ళు కప్పలేరు!
నోళ్ళు మూయలేరు!

**అయితే అవకతవకలకు సాక్ష్యాలు :-**

టి.టి.డి.కే తెలియును చాల!
వేంకటాచల ఇతిహాసమాల!
ఎన్నో పురాణ వచనాలు!
వైఖానస ఆగమంలోని విమాన కల్పాలు!
శిలాశాసనాలు! స్థలపురాణాలు!
తిరుమల ఆలయం వారి ప్రెస్సులో
అచ్చయిన పరిశోధక వ్యాసాలు!
వాగ్గేయకారుల వలపు మీరుగానాలు!
ఎన్నెన్నో చెప్పను! చిక్కుముడులు విప్పను!
ఈ తప్పుడు తడకల నడకలు!
దేశానికి ముప్పుల నిప్పులు!
ముందెన్నడూ వినము కొండపై
ప్రయాణికుల మృతిమాట!
మూలవిరాట్టుపై అగ్గి పడెనంట!
అది బయటపడకుండ
విశ్వప్రత్నము చేసినారంట!
ఇది పక్షపాత రహిత సాక్ష్యం
పెట్టిన పెద్ద హెడ్డింగంట!

నిన్నగాక మొన్న అలర్మేల్‌మంగాపురంలో,
అమ్మవారి ఉత్సవంలో 'రేవతి' అనుగజము
పైనున్న అర్చకులను పడద్రోసి,
భక్తులను భయభ్రాంతులను చేసెనంట!

**సౌకర్యమంటే:-**

ఏదయినా హద్దులో ఉంటేనే ముద్దుకాదా?
అది దాటితే ముప్పురాదా?
నెల నెలా జుత్తును కత్తిరించుకోవచ్చు
సౌకర్యమంటే!
మళ్ళీ మొలచే పనిలేకుండా తలనే
తీసేస్తానంటే
సౌకర్యమా? అది ఘనకార్యమా?

వయసయిందిలే, వాలిపోతుందిలే అని
ముసలి తల్లికి రోగం ముదిరితే-
ముందే చంపేస్తావా?
అది సౌకర్యం అనేస్తావా?
ఆఖరి నిమిషం వరకు
నిలబెట్టే ప్రయత్నం చేస్తావా?

వెయ్యికాళ్ళ మండపాన్నయినా
వేయివిధాలా రక్షించడమే సౌకర్యమంటే!

**భక్తుల కోసమా:-**

చమురు దీపాల వెలుతురులో
మసక మసకగా కనిపిస్తాడు వెంకన్న!
పాపం, వెయ్యి ఓల్టుల విద్యుద్దీపాలు పెడితే
భక్తులు కళ్ళారా కాంచి తరించిపోరా?
మరికాస్త, మరో మరో ఆలయంలోలా
స్వామిపాదం ఒక్కసారి తాకిస్తే -
తన్మయమైపోరా?

అమ్మో! ఆగమం ఒప్పుకోదా?
భక్తుల కోసం అంటే, గప్ చుప్ అయిపోదా?
నున్నని గోడకు సున్నం వేస్తే అది ఘనత!
సున్నపు గోడకు మసిబూసి అలంకారమంటే
అది మతిమాలిన చేత! చేసే మార్పులు,
చేర్పులు మరింత వన్నె పెంచేవై ఉండాలి కాని,
అసలే ఉన్న పేరు పోగొట్టేవి సౌకర్యాలు కావు
భక్తులైనవారు అట్లాంటి అవసరాలు
కోరేవారు కారు.

**నిద్ర అవసరమా? :-**

నిఖిల జగమూ ఏలువానికి నీరసమా?
నిద్ర అవసరమా?
అవ్వ! ఎంత! వింత?
ఇదంతా అమాయకుల మానసమా?
వింటానికి బాగున్న ప్రశ్న!
అంటానికి బాగున్న ప్రశ్న!
అయితే నైవేద్యం, అభిషేకం ఎందుకు?
డబ్బులు, గిబ్బులు ఎందుకు?



బొట్టులెందుకు? బట్టలెందుకు?
నిలువుదోపిడీలెందుకు?
ఇంతకూ స్వామి! బ్రహ్మా? బొమ్మా?
బ్రహ్మకు నిద్రెందుకు? బొమ్మకు నిద్రెందుకు?
మన అమ్మకు, తండ్రికి నిద్ర కావాలి!
మనతోనే ఉన్నందుకు!
మనకోసం, మన లోకం దిగివచ్చినవాడు!
రాయి అంటే దేవుడని గుర్తించు!
నీరంటే తీర్థమని గుర్తించు!
మనకోసం వచ్చిన స్వామికి
'మనలాగే' అనేది గుర్తించు!
అంతట నిండి ఉండే వాడికి
నీవేమి ఇస్తావు నివేదన!
ఒక స్థానంలో ఉండేవాడికి స్నానం,
పానం అవసరం! అవసరం!
నోటికి వచ్చినట్టు ఆడుట పెద్ద పెడసరం!

**ఆలోచించు :-**

భగవంతుడికి తగ్గట్టు భక్తులా?
భక్తులకు సరిపడేట్టు భగవంతుడా?

సినిమాహాలుకి వెళ్ళి డబ్బిచ్చానని,
చూడవచ్చానని, సుఖములేదని
సౌకర్యం కోసం 'కుర్చీ' విరగగొడతానంటే
ఒప్పుకుంటారా? తప్పుకాదంటారా?

మరి దేవాలయమంటే లోకువా?
దేవుడికి లేదనుకుంటావా మెలకువ?

**కొనసాగితే అనర్థాలు :-**

దొరలు నమ్మినారు! సిరులు పొందినారు!
మునులు చెప్పినారు! ముందుకెళ్ళినారు
కవులు పాడినారు!
కలకాలం చెవులలోనే నిలచినారు!

తోచినట్టు చేసేవారు!,
కోరినట్టు శాస్త్రాన్ని మార్చేవారు!
చరిత్రలో, ధరిత్రిలో జీర్ణమైనారు!
నిప్పంటిన గుడిసెకు పక్కనున్నవి మసి అయినట్టు దుష్టులతో నిలబడ్డవారు - నీరసించిపోతారు!

**తనని తాను రక్షించుకోలేడా? :-**

కలదు, కలదు! శ్రీనివాసుడు కలదు!
మనకెన్నో శక్తియుక్తులిచ్చినాడు!
వాడకుండ చూస్తు ఉండిననాడు
అర్థమేమి మన బుద్ధులకు? అంతమాత్రానికే
మానవ జన్మ ఎత్తుటెందులకు?

**తక్షణ కర్తవ్యం :**

సందేహం విడచి!
ఆచార్యుల ఆదర్శం తలచి!
ప్రేమతోనే పెడదారులను గెలచి!
చాలనేరిచి పెద్దలిచ్చిన మన
'శ్రీనివాస నిధానాన్ని' కాపాడుకుందాం!

**ప్రార్థన :**

వైకుంఠం నుండీ వచ్చిన శిల!
మహిమలమల! మన తిరుమల!
అందరినీ కాచే స్వామికిల! కావాలి
భక్తులారా! వలపు వాకిళ్ళ కాపలా!!

**భక్తినివేదన చందాదారులకు విజ్ఞప్తి**

మీ సభ్యత్వపు నెంబర్, గడువు తేదీ రేపరుపై గమనించి గడువుతేదీకి ముందుగనే సభ్యత్వం పునరుద్ధరించుకోగలరు. మాతో జరుపు ఉత్తర ప్రత్యుత్తరములలో నెంబరు తప్పక సూచించగలరు. సభ్యత్వ రుసుమును ఎమ్.ఒ. లేదా డి.డి. విజయవాడలో ఏ బ్యాంక్ ద్వారా అయిననూ భక్తినివేదన, సీతానగరం అడ్రెస్‌కు పంపవచ్చును. మీ చిరునామ వివరములు స్పష్టముగా లేని ఎడల అనుమతించబడవు. భక్తినివేదనకు చెక్‌లు, పోస్టల్ ఆర్డర్లు అనుమతించబడవు.

- భక్తినివేదన -

# ధనుర్మాస వ్రత ప్రాశస్త్యము

శ్రీమాన్ కె.ఇ. స్థలశాయి - భద్రాచలం

దైవానుగ్రహాన్ని శీఘ్రంగా పొందడానికై చేయవలసిన జప, ధ్యాన, అర్చనాది అనుష్ఠానానికి తగిన కాలం ధనుర్మాసం. సూర్యుడు ధనూరాశిలో ప్రవేశించినాటి నుండి మకరరాశిలో ప్రవేశించే వరకూ ఉండే మధ్యకాలాన్ని ధనుర్మాసమంటారు. ఈమాసం దేవతలకూ, దేవాధిదేవుడైన మహావిష్ణువుకూ ప్రీతిపాత్రమయినది, కావున దీనిని ఉత్తమోత్తమమైన కాలంగా శాస్త్రాలు పరిగణించాయి. దీని ప్రశస్తిని వేనోళ్ళ కొనియాడాయి.

**"కాలాస్సంవత్సరగ్గ్ం శ్రితాః।**

**అణుశ్శ మహాసశ్చ।**

**సర్వే సమవయన్త్రితమ్**

**సత్తైర్వైస్సమావిష్టః।**

**---------**

**అధి సంవత్సర విద్యాత్।"**

*(తైత్తిరీయ ఆరణ్యకం)*

"అనంతమైన కాలం, క్షణాలూ-నిమిషాలూలాంటి చిన్న పరిమితితోనూ, రోజులూ పక్షాలూ, మాసాలూలాంటి పెద్ద పరిమితితోనూ ఏర్పడి ఒక సంవత్సరంగా రూపొందుతుంది. సంవత్సరాలుగా కొలవ బడుతుంది" అని పేర్కొంది వేదం.

సంవత్సరాలుగా, ఋతువులుగా, మాసాలుగా, పక్షాలుగా, తిథిలుగా, నక్షత్రాలుగా, వారాలుగా, రోజులుగా, రాత్రి పగళ్ళుగా కాలం విభజింపబడుతోంది. సూర్యచంద్రుల సంచారంవల్లే.

మన పూర్వులు ఇలా కాలాన్ని కొలిచే పద్ధతిని సౌర, చాంద్ర, బార్హస్పత్యమానాలు మొదలైనవిగా నిర్ణయించారు.

ఒక్కొక్కప్రాంతంలోనూ ఒక్కొక్క మానాన్ని అనుసరించి కాలాన్ని అనుసరి స్తారు. ఉదా:- ఆంధ్రదేశంలో చాంద్రమానాన్ని అనుసరిస్తారు. దక్షిణదేశంలో సౌరమానాన్ని, ఉత్తర దేశంలో బార్హస్పత్య మానాన్ని అనుసరిస్తారు. మన ఆంధ్రదేశంలో చైత్ర, వైశాఖ, మాసాల వలె, దక్షిణదేశంలో మేషం, వృషభం మొదలైన రాసుల్లో సూర్యుడు ప్రవేశించే సంక్రమణాన్ని మాసాలుగా లెక్కిస్తారు. అలా సూర్యుడు ధనూరాశిలో ప్రవేశించే లేదా సంచరించే కాలమే ధనుర్మాసం. ఈ ధనుర్మాసం చాంద్రమానం ప్రకారం మార్గశిర, పుష్యమాసాలలో వస్తుంది. ఇది దేవతలకు బ్రహ్మ ముహూర్తం.

రాత్రి నాల్గవజాము అనగా తెల్లవారు జాము బ్రహ్మముహూర్తకాలం. ఈ కాలాన్ని సాత్వికమైన కాలంగా శాస్త్రాలు తెలిపాయి. ఈ కాలంలో 'ఆత్మహితాన్ని' చింతించమని విధించాయి. ఆత్మకు హితాన్ని చేకూర్చేది భగవద్ధ్యానాదులే కనుక అవి ఈ సమయంలో చేస్తే, దైవానుగ్రహంశీఘ్రంగా కలుగుతుంది.

**'మాసేనస్యాదహో రాత్రః పైత్రోవర్షేణ దైవత**

*(అమరకోశః)*



అన్నట్లు మానవుల సంవత్సరం దేవతలకు ఒక రోజు. మనకు రాత్రి, పగలూలా వారికి దక్షిణాయనము రాత్రి, ఉత్తరాయణము పగలు. కర్కాటకం నుండి ధనూరాశి వరకూ సూర్యుడు సంచరించేకాలం దక్షిణాయనం. మకరం నుండి మిధునరాశి వరకూ సూర్యుడు సంచరించే కాలం ఉత్తరాయణం. దక్షిణాయనంలోని చివరి మాసమైన ధనుర్మాసం దేవతలకు తెల్లవారుజాము. మానవులేవిధంగా భగవద్ధ్యానాదులు బ్రహ్మ ముహూర్తకాలంలో చేస్తారో-అదేవిధంగా దేవతలు ధనుర్మాసకాలంలో దేవదేవుడైన శ్రీమన్నారాయణుని ఆరాధిస్తారు. క్షీరబ్ధినాధుడైన శ్రీమహావిష్ణువును ధనుర్మాస శుద్ధ ఏకాదశినాడు వైకుంఠంలోని ఉత్తరద్వారం నుండి దర్శిస్తారు. కనుకనే ఈ ఏకాదశికి "వైకుంఠఏకాదశి, ముక్కోటి ఏకాదశి" అనే పేర్లు ఏర్పడ్డాయి. ముక్కోటి దేవతలూ దైవదర్శనం చేసుకొనే ఏకాదశి కనుక దీనికి 'ముక్కోటి ఏకాదశి' అనే పేరు వచ్చింది. అలా దేవతలంతా సాత్వికమైనబుద్ధితో ప్రసన్నంగా ఉండే కాలం కనుక ఈ కాలంలో ఏ దేవతను ఆరాధించినా ఆ దేవతయొక్క అనుగ్రహం త్వరితంగా కలుగుతుంది. ముఖ్యంగా విష్ణువును అర్చించటం ఈ మాసానికి చాలా విశేషం.

**"ధనూర్మాసేతు సంప్రాప్తే**

**దేవదేవం ప్రపూజయేత్।**

**అరుణోదయ వేళాయాం**

**ముద్గాన్నాదీన్నివేదయేత్॥**

అని పురుషోత్తమ సంహిత "ధనుర్మాసంలో ప్రతినిత్యం తెల్లవారు జామున విష్ణ్వర్చనచేసి, ముద్గాన్నము మొదలైన పదార్థములను నివేదన చేయమని విధించింది".

అలా ఈ మాసంలో ఒకవ్రతంగా విష్ణువును పూజించటంవల్ల రాజుకీ, రాష్ట్రానికి మేలు జరిగి దేశం సుభిక్షంగా ఉంటుందని **"రాజా రాష్ట్రాభివృద్ధిస్స్యాతో దుర్భిక్షం హరతే ధ్రువమ్"** (పురుషోత్తమ సంహితా) అంటే ఫలాన్ని నిరూపించింది.

ఈ ధనుర్మాసకాలంలోనే పార్వతీదేవి విష్ణువును గూర్చి తపస్సుచేసి, గజాసురుని హృదయంలో బంధింపబడిన శివుని తిరిగి కైలాసానికి చేరేట్లుగా చేసుకొంది. అందుకనే ఈ వ్రతానికి 'కాత్యాయినీ వ్రతమ'నే పేరు ఏర్పడింది.

శివ,పార్వతిలిరువురూ 'భోగి' మకర సంక్రమణానికి ముందురోజు కైలాసంలో కలిసారు. కనుక ఆ పండుగకు 'భోగి' అనే పేరు వచ్చింది.

ద్వాపరయుగంలో గోపికలు శ్రీకృష్ణుని భర్తగా పొందటానికై ఈ ధనుర్మాసంలోనే యమునాతీరంలో ఇసుకతో పార్వతిదేవి ప్రతిమను తయారుచేసి పూజించి, శ్రీకృష్ణుని తమకు భర్తగా ప్రసాదించమని వేడుకొన్నారు. ఆమె అనుగ్రహంతో వారికి శ్రీకృష్ణుని సాంగత్యం 'భోగి'నాడే లభించింది. కనుక ఈ వ్రతానికి గోపికావ్రతమనికూడ పేరు.

కలియుగంలో **'శ్రీవిల్లిపుత్తూరు'** అనే గ్రామంలో విష్ణుచిత్తులకు కుమార్తెగా అవతరించిన శ్రీగోదాదేవి ఈ ధనుర్మాస వ్రతాన్ని శ్రీకృష్ణుని భర్తగా పొందటానికై చేసింది.

గోపికలను అనుకరిస్తూ ధనుర్మాసం నెల రోజులూ తానూ, తన స్నేహితురాండ్రతో కలిసి శ్రీవిల్లిపుత్తూర్‌లో వేంచేసి ఉన్న **'వట పత్రశాయి'**నే శ్రీకృష్ణునిగా, శ్రీవిల్లిపుత్తూరే గోకులంగా భావించి, భగవానుని కీర్తిస్తూ రోజుకొక పాట చొప్పున పాడి విన్నివిస్తూ వ్రతాన్ని ఆచరించింది. చివరిరోజున (మకర సంక్రాంతికి ముందురోజు) తనకూ, శ్రీరంగ నాథునికీ వివాహమైనట్లుగా 'కల'గన్నది. అదే విధంగా శ్రీరంగనాథుని (శ్రీకృష్ణుని అర్చా మూర్తి) భర్తగాపొంది లోకపూజ్యురాల య్యింది. ఆమె 'కల'గన్న రోజునే 'భోగి' పండుగ. ఆనాడు 'గోదారంగనాథుల కల్యాణం' చేయటం ప్రతి విష్ణ్వాలయంలోనూ ఆచారంగా వస్తోంది.

ఇన్ని విశేషాలుకల ఈ మాసం సాక్షాత్తు భగవత్స్వరూపం. భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్మ "మాసానాం మార్గశీర్షోహం" అని తానే ధనుర్మాస స్వరూపుడనని చెప్పు కొన్నాడు.

కనుక ఈ కాలంలో భగవంతుని లీల లను, గుణములనుఅనుసంధించు కొంటూ, భగవత్కథాశ్రవణం చేస్తూ, భగవ న్నామాన్ని కీర్తిస్తూ తన్మయులైపోవటమే ఉత్తమవ్రతమని ఆండాళ్ (గోదా)అమ్మవారు 'తిరుప్పావై' ప్రబంధాన్ని లోకానికందించారు. ఈ ప్రబంధంలో ధనుర్మాసవ్రత విధానం, దాన్ని ఆచరిస్తే కలిగే ప్రయోజనం, దాన్ని ఆచరించ వలసిన యోగ్యత కలవారెవరు? అనే విషయంతో పాటు ఆయనను స్తుతించే పద్ధతి వివరించబడింది.

ఈ ప్రబంధాన్ని భగవత్సన్నిధిలో ఈ మాసంలో అనుసంధించటం వల్ల ఆతడు ప్రసన్నుడై మనపై ఆతని దయను ప్రసరింప చేస్తాడని ఈ ప్రబంధానికి ఫలశృతి.

కనుక 30పాటలుగా ఉన్న ఈ 'తిరుప్పావై' ప్రబంధం గొప్ప ప్రభావం కలది. వాచామగోచరుడైన భగవానునే మనం వశం చేయగలిగిన మహిమ కలది.

ఈ నెల రోజులూ తెల్లవారుజామునే నిద్ర లేచి, స్నానానుష్ఠానాలు ముగించి, విష్ణ్వర్చన చేసి, ముద్గాన్నాన్ని నివేదించి, ఈ 'తిరుప్పావై' ప్రబంధాన్ని భగవత్సన్నిధిలో విన్నవించి, హారతినివ్వటం వ్రతంలోని పూజకు సంబంధించిన విభాగం.

దైవనివేదిత ప్రసాదం మాత్రమే మితంగా భుజిస్తూ, భోగలాలసను త్యజించి భూత దయను కలిగిఉండటం, నిరంతరం భగవ న్నామసంకీర్తనలతో కాలాన్ని గడుపుతూ ఉన్నంతలో దానధర్మాలు ఆచరిస్తూ మాట లతో చేతలతో పరులను హింసించకుండా ఉండటం, ఈ వ్రతంలోని ఆచరణకు సంబంధించిన విభాగం. ఇలా ఈ వ్రతాన్ని ఆచరించటం వల్ల ఇహ పర సౌఖ్యాలు రెండూ లభిస్తాయి.

తరచుగా ఈ ధనుర్మాసం, ఇంగ్లీషుకాల మానంప్రకారం డిసెంబర్ 15,16 తేదీల నుండి జనవరి 14,15తేదీల వరుసగా నెల రోజుల పండుగగా జరుగుతుంది. ఈ సంIIరం డిసెంబర్ 16వ తేదీన ధనుర్మాసం ప్రారంభం. ధనుర్మాసవ్రతాన్ని ఆచరిద్దాం! తరిద్దాం!

# ప్రచార వార్తలు

24-10-2004: తేదీన వికాస తరంగిణి ముఖ్యకార్యకర్తల సమావేశం సీతానగరంలో జరిగింది. 20వ తేదీనాటి శాంతియాత్ర కార్యక్రమసమీక్షతోపాటు, 6వ తారీఖున నవంబర్ 6న జరుపతలపెట్టిన **"వేయికాళ్ళమండప వాహనయాత్ర"** వివరాలను కూడా చర్చించారు.

సుమారు 1700మంది భక్తులు తమ వాహనాలతో ఈ "వాహనయాత్ర"లో పాల్గొన టానికి సంసిద్ధులు కాగా, దానికి తగిన ఏర్పా ట్లన్నీ బ్యానర్లు, వాల్‌పోస్టర్లు, ప్రసాద వితరణ వ్యవస్థవంటి విషయాలను కూలంకషంగ సమావేశంలో చర్చించి ఒక నిర్ణయానికి వచ్చింది.

ఈ కార్యక్రమ సమన్వయం కోసం **"కోర్‌కమిటీ"**ని శ్రీస్వామివారు నిర్ణయించారు. ఈకమిటీకి వివిధ సాంఘీక సంస్థలను, వికాస తరంగిణి శాఖలను, శ్రీవేంకటేశ్వర భక్తమండలులను ప్రోత్సాహపరుస్తూ కార్యోన్ముఖులుగా తీర్చిదిద్దే బాధ్యతను అప్పగించారు.

29వ తేదీన శ్రీమాన్ పి.వి.ఆర్.కె. ప్రసాద్‌గారు, శ్రీమాన్ చెంగప్పగారు, శ్రీమాన్ చక్రధరరావుగారు ప్రభృతులు శ్రీస్వామివారిని సేవించి తిరుపతిలో జరుగు తున్న వర్తమాన విషయాలపై శ్రీస్వామివారి అభిప్రాయాలను తెలుసుకున్నారు.

ఇంతలో తిరుపతి వివాదాన్ని పరిశీలించే హైకోర్టులో వాహనయాత్రకు సంబంధించి తమ భయాందోళనలను వ్యక్తం చేస్తూ ప్రధానన్యాయమూర్తిని కొందరు శరణువేడారు. దాంతో కోర్టువారు ఈ విషయంలో చిన్న జీయర్‌స్వామి వారిని పునరాలోచించి 1వ తేదీలోగా తెలియచేయ వలసిందిగా కోరారు.

వేలాదిమంది భక్తులు అన్నిరకములుగా సిద్ధమై ఉన్న ఈ తరుణంలో, వాహన యాత్రను గురించి పునరాలోచించటం' వికాసతరంగిణికి సుతారమూ సమ్మతం కాక పోయినా, కోర్టుయొక్క మర్యాదను గౌరవించడం అందరియొక్క కర్తవ్యంగా శ్రీస్వామివారు వి.టి. కార్యకర్తలకు నచ్చ చెప్పినారు.

చాలా నెలలు తరువాత ఇప్పుడిప్పుడే జవసత్వాలను పుంజుకొంటున్న వి.టి. కార్యకర్తల సామర్థ్యాన్ని అవసరం వచ్చినపుడు వినియోగించ డానికి వీలుగా భద్రపరచు కుందామని శ్రీస్వామివారు కార్యకర్తలకు వాహనయాత్రకు నవంబరు 6వ తేదీనుండి మారుస్తున్నట్లుగా కోర్టువారికి తెలిపారు. మీడియోలో కూడ ప్రకటించారు.

నవంబరు 7వ తేదీన సీతానగరంలో వి.టి.కోర్ కమిటీ సమావేశమైంది. టి.టి.డి. విషయంలో కోర్టులోజరుగుతున్న పరిణామాల దృష్ట్యా, ఈ వివాదాల గురించి పత్రికాప్రకట నలు ఇవ్వవద్దని, కోర్‌కమిటీ నిర్ణయించింది.

గతంలో తీసుకున్న నిర్ణయాలను యథా తథంగా అమలుపరుస్తూ సత్సంగాలను నిర్వ



హించడం, వివిధవర్గాల మధ్య సమన్వయాన్ని బలపరచడం, అవసరమైనపుడు వెంటనే స్పందిచ గలగే విధంగా వి.టి శాఖలను బలోపేతం చేయాలని కోర్‌కమిటీ నిర్ణయించింది.

ఆ తర్వాత మధ్యాహ్నం సమావేశంలో శ్రీ రంగరామానుజ జీయర్‌స్వామివారు వేంచేసారు. డిసెంబర్ 4,5 తేదీలలో జరుపదలచిన "సాధుసంగోష్ఠి"ని కూడా వాయిదా వేసుకుందామని, ఆ స్థానంలో చాతుర్మాస్యదీక్ష పూర్తికాగానే అవకాముంటే జీయర్లు నలుగురైదుగురు కలిసి ఒక 40 దినాలు రాష్ట్రవ్యాప్తంగా "ధార్మికయాత్ర" కార్యక్రమాన్ని నిర్వహించాలని నిర్ణయించారు.

12-11-2004 దీపావళి. మన శ్రీస్వామి వారి తిరునక్షత్రం. ఈ సందర్భంగా విస్తృతమైన ఏర్పాట్లు సీతానగరంలో జరిగాయి. **జీయర్ పురస్కార్ - 2004** (తొమ్మిదవ జీయర్ పురస్కారం) గ్రహీతగా బ్రహ్మశ్రీ కె. చంద్రశేఖర ఘనపాఠిగారు (తిరుమల ఆస్థానపండితులు) అతిప్రయా సతో ఆ ఔద్యోగికిమైన అంగీకారాన్ని పొంది 12వ తారీఖు ఉదాయానికి సీతానగరం చేరి ఉన్నారు.

12వ తేదీ దీపావళి. ఉదయానికి అందిన హృద విచారకరమైన సమాచారం....

**"కంచి పీఠాధిపతులైన శ్రీ జయేంద్ర సరస్వతి స్వామివారి అరెస్టు".**

ఈ విషయం తెలియగానే దిగ్భ్రాంతికి గురైన శ్రీ చిన్న జీయర్‌స్వామివారు వెంటనే స్పందించి చేసిన ప్రకటనసారం "శ్రీకంచి కామకోటి పీఠాధిపతి జయేంద్ర సరస్వతి వారి అరెస్టు సమాచారం బాధాకరం. ఎన్నో వేలమంది శ్రద్ధకునిలయమైన ఆ మఠానికి ఏర్పడ్డ సంకటస్థితి దురదృష్టకరం. వారి వ్యక్తిగతమైన అనుష్ఠానానికి, ఆచారానికి అవరోధములేని స్థితిని కల్గించడం అత్యావశ్యకం. ఈ ధర్మగ్లాని స్థితిని తప్పుకొని సరియైనదిశలో సాగేశక్తి ప్రసాదించాలి అని భగవంతుడిని ప్రార్థిస్తున్నాం. వాతావరణాన్ని దృష్టిలో ఉంచుకొని "మండలదీక్ష" గా కొనసాగించదలచిన జీయర్‌ల **"ధార్మిక యాత్ర"**ను వాయిదా వేస్తున్నట్లు శ్రీస్వామివారు ప్రకటించారు.

26వ తేదీ చాతుర్మాస్యవ్రతదీక్షను సమాప్తి చేసుకొని శ్రీస్వామివారు సీతానగరం నుండి బయలుదేరి నడిగడ్డపాలెం వేంచేసారు. శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామివారి బృందావనాన్ని సేవించుకొని, తెనాలిలో శ్రీమాన్ వీరనారాయణగారి నేతృత్వంలో శ్రీ వివేకా విద్యాసంస్థల నూతనశాఖను దర్శించి, రాత్రికి హైద్రాబాద్ చేరారు. జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ కోశాధికారి, మహాసిమెంట్స్ అధినేత శ్రీమాన్ రామేశ్వరరావుగారు బంజరాహిల్స్‌లో నూతనంగా నిర్మించుకున్న వసతిగృహంలో జరుగుతున్న సుదర్శనయజ్ఞకార్యక్రమంలో శ్రీస్వామివారు పాల్గొని, 27వ తేదీ రాత్రి హైదరాబాద్ నుండి రాజమహేంద్రికి బయలుదేరారు.

రాజమహేంద్రిలో శ్రీ సముద్రాల రంగ రామానుజస్వామివారి గృహంలో విడిది చేసిన శ్రీస్వామివారు గోదావరీ నదీతీరంలో నూతనంగా నిర్మించ సంకల్పించిన తులసీ రామానుజకూటభవనానికి శంకుస్థాపన కార్యక్రమాన్ని నిర్వహించారు.

తీర్థగోష్ఠి అనంతరం అర్తమూరు గ్రామానికి శ్రీస్వామివారు బయలుదేరారు. 1948లో అర్తమూరుగ్రామంలో శ్రీశ్రీశ్రీ పెద్ద జీయర్‌స్వామి వారు తమ పూర్వాశ్రమంలో హరిజనకాలనీకి 128 వసతిగృహాలను నిర్మించారు. శ్రీపెద్ద జీయర్‌స్వామివారి ఆనాటి ధాతృత్వానికి, వదాన్యతకు కృతజ్ఞతగా శ్రీ పెద్దజీయర్ స్వామివారి విగ్రహాన్ని తమ కాలనీలో ఆవిష్కరించుకోవాలని నిర్ణయించారు నేటితరం హరిజనకాలనీ పెద్దలు. పర్యవసానంగా శ్రీస్వామివారి చేతులమీదుగా శ్రీ పెద్దజీయర్‌స్వామివారి విగ్రహ ఆవిష్కరణ ఎంతో వైభవంగ, కన్నుల పండుగగా 28-11-2004తేదీన అర్తమూరులో జరిగింది. శ్రీమాన్ పాపారాయుడుగారికి, శ్రీమాన్ నారాయణగారికి, ఇతర పెద్దలకు, భక్తులకు శ్రీస్వామివారు మంగళాశాసనం చేసి రాజమహేంద్రి చేరారు.

సాయంత్రం రాజమహేంద్రిలో డా॥ కర్రి రామారెడ్డిగారి ఆంధ్రప్రతిభ ప్రతిష్ఠాన్ నిర్వహించిన ''సన్మానోత్సవ సభ''లో శ్రీస్వామివారు పాల్గొని, మంగళాశాసనం చేస్తూ శ్రీరామారెడ్డిగారిని "పూర్ణప్రజ్ఞులు"గా అభివర్ణించారు. అనంతరం రాజమహేంద్రి నుండి విశాఖపట్టణం వారిజ ఆశ్రమానికి బయలుదేరారు. 29వ తేదీన వారిజ ఆశ్రమంలో తీర్థగోష్ఠి అనంతరం శ్రీస్వామి వారు సింహాచలక్షేత్రానికి వేంచేసారు. దేవస్థాన ఛైర్మన్ శ్రీఆనందగజపతిరాజు సాదరంగా శ్రీస్వామి వారిని ఆహ్వానించారు. పెరుమాళ్ళను సేవించు కొన్న అనంతరం దేవస్థాన ధర్మకర్త శ్రీమతి సుగుణాచౌదరిగారు ఇటీవల సింహాచల దేవస్థానంలో తలపెట్టిన అభివృద్ధి పనులను గూర్చి ప్రస్తావించారు. ఈ విషయంపై శ్రీస్వామివారు తీవ్రంగా ప్రతిస్పందిస్తూ ''దేవాలయంలో జరిగే అభివృద్ధి పనులు ఆచార సంప్రదాయాలకు, చారిత్రకతకు అవరోధం కాకుండా ఉండాలని స్పష్టం చేశారు.

దేవస్థానం అధికారులు దేవాలయ ప్రాంగణంలో పూర్వీకులు నిర్మించిన రాతి ఫ్లోరింగ్‌ను బ్యూటిఫికేషన్ పేరుతో తీసివేసి గ్రానైట్‌రాళ్ళను అమర్చేప్రయత్నం చేస్తున్నందుకు శ్రీస్వామివారు తమ అభ్యంతరాన్ని తెలిపారు. ఆలయ ప్రాచీనతకు, పవిత్రతకు భంగకరంకాని రీతిలో మార్పులు ఉండాలే తప్ప ఆధునికీకరణపేరుతో అవకతవకలకు పాల్పడ రాదని శ్రీస్వామివారు హితవు పలికారు. శ్రీస్వామి వారి సూచనలను అర్థం చేసుకొన్న ధర్మకర్త శ్రీమతి సుగుణాచౌదరి అనుగుణంగా స్పందిస్తా నని శ్రీస్వామివారికి వాగ్దానం చేసారు. అనంతరం శ్రీస్వామివారు సింహాచలం గ్రామంలో ఆలయ అర్చకులు చిరంజీవి శ్రీసీతారామచంద్రులు నిర్మించు కొన్న నూతన మంటపంలో ఏర్పరచిన ఇష్టాగోష్ఠి సమావేశంలో పాల్గొని దేవాలయ పవిత్రతను, సంప్రదాయాన్ని, చరిత్రను పరిరక్షించాల్సిన బాధ్యతను గూర్చి సభ్యులకు స్పష్టం చేసారు.

సింహాచలం నుండి శ్రీస్వామివారు అనకాపల్లి గ్రామానికి వెళ్ళి అక్కడ శ్రీమాన్ దాడి వీరభద్రరావుగారి గృహానికి వేంచేసి వారికి మంగళాశాసనం చేసారు. అనంతరం వారు జీర్ణోద్ధరణ చేయించిన కొన్ని ఆలయా



లను దర్శించారు. ప్రాచీన శ్రీవేంకటేశ్వర స్వామివారి దేవాలయాన్ని దర్శించారు. అక్కడ సుమారు 850మంది భక్తులు సామూహికంగా గానం చేసిన అన్నమాచార్య సంకీర్తనలను ఆలకించి, వారి శ్రద్ధా భక్తులకు శ్రీవారు అనేక మంగళా శాసనాలు చేసారు. ఆ తర్వాత శ్రీ పీతాంబరం రఘునాథాచార్య గృహానికి వేంచేసి, అక్కడ వారికి మంగళాశాసనం చేసారు. రాత్రికి వారిజ చేరిన శ్రీస్వామివారు మరుసటిరోజు 30-11-2004 ఉదయం తీర్థగోష్ఠి అనంతరం మందస బయలు దేరారు. రాజం వాస్తవ్యులు శ్రీమాన్ విశాలగుప్తా సమన్వయంలో మందసలో అతిప్రాచీనమైన వాసుదేవస్వామివారి ఆలయజీర్ణోద్ధరణ కార్యక్రమం సమర్థవంతంగా సాగుతున్నది. శిథిలమైన ఆ పురాతన దేవాలయాన్ని ఉత్కళశిల్ప శైలిలో తిరిగి యథాతథంగా పునర్నిర్మిస్తున్నారు.

25 లక్షల రూపాయల ఖర్చుతో రూఫ్ స్థాయికి చేరిన నిర్మాణాన్ని శ్రీస్వామివారు వీక్షించి, తగు సూచనలను నిర్వాహకులకు అంద జేసారు. మందసలో సమావేశమైన భక్తబృందానికి ఆలయ విశిష్ఠతను, సంప్రదాయాన్ని, చారిత్రతను కాపాడుకోవడంలో చూపాల్సిన పట్టుదలను గూర్చి స్వామివారు వివరించారు.

ఆ తర్వాత శ్రీస్వామివారు విజయ నగరంలో జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ నిర్వహిస్తున్న బ్లైండ్‌స్కూలు "నేత్ర విద్యాలయా"న్ని దర్శించారు. 74మంది విద్యార్థులలో ఎంతో క్రమశిక్షణతో, ప్రతిభతో, అంకితభావంతో అధ్యాపకులు, నిర్వాహకులు పాఠశాలను నిర్వహిస్తున్నారు. విద్యార్థులు శ్రీస్వామివారికి కానుకగా బ్రైలీలిపిలో శ్రీ విష్ణుసహస్ర నామాలను, తిరుప్పావైను వ్రాసిన పలకలను అందించారు.

శ్రీస్వామివారు బ్రైలీలిపిలో తమకు వ్రాతపూర్వక మంగళాశాసనాన్ని అందజేయ ఎవలసిందిగ వారు అభ్యర్థించారు.

శ్రీస్వామివారు విద్యార్థుల కోరిక మేరకు వారి సౌకర్యం కోసం స్కూలుకు వాహనాన్ని అందజేయడానికి అంగీకరించారు. అధ్యాపక సిబ్బందియొక్క అంకితభావానికి మంగళా శాసనం చేస్తూ వారికి వేతనాలను పెంచడానికి శ్రీస్వామివారు నిర్ణయించారు. అలాగే గతంలో ఇచ్చిన కంప్యూటర్‌తోపాటు మరో రెండు కంప్యూటర్లు కూడ స్కూలుకు శ్రీస్వామి వారు అందజేశారు. ఆ తరువాత వికాస తరంగిణి సెంట్రల్ కమిటీ సభ్యులు, విజయ నగరం జిల్లా అధ్యక్షులు శ్రీమాన్ ఎస్.ఎన్. రాజుగారి గృహాన్ని దర్శించి, శ్రీమాన్ రాజుగారికి, కుటుంబసభ్యులకి మంగళా శాసనం చేసారు.

విజయనగరం నుండి వారిజ చేరిన శ్రీస్వామివారిని సింహాచలదేవస్థానం కార్య నిర్వహాధికారి శ్రీమాన్ చిలకలపల్లి మోహనరావు, వారి పురోహితులు, శ్రీమాన్ సాతులూరి గోపాల కృష్ణమాచార్యులు, శ్రీమాన్ మోర్త సీతారామాచార్యులు సేవించు కున్నారు. సింహాచల క్షేత్ర అభివృద్ధిపనులపై శ్రీస్వామివారితో వారు చర్చించారు.

శ్రీస్వామివారి సూచలనకు అనుగుణంగా అవసరమైన రిపేర్లు నిర్వహిస్తా మని దేవస్థానం యొక్క చారిత్రకతను సంప్రదాయాన్ని పరిరక్షిస్తామని ఇ.ఓ.గారు శ్రీస్వామివారికి హామీ ఇచ్చారు.

దేవస్థానం ఫిబ్రవరి 2005లో తల పెట్టిన "కోటికుంకుమార్చన" కార్యక్రమంలో పాల్గొన వలసిందిగా ఇ.ఒ.గారు శ్రీస్వామి వారినికోరారు.

మరునటి రోజు 1-12-2004 ఉదయం తీర్థగోష్ఠి అనంతరం శ్రీస్వామివారు కాకినాడ బయలుదేరారు.

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగరామానుజ జీయర్‌స్వామివారి ఆశ్రమ సందర్శనం**

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగమానుజ జీయర్‌స్వామివారు కాకినాడకు సమీపంలోని జి.వేమవరం గ్రామంలో "శ్రీమన్నారాయణ అష్టాక్షరీక్షేత్రాన్ని" స్థాపించారు. 20 ఎకరాల విస్తీర్ణంకల ఈ క్షేత్రంలో శ్రీస్వామివారు 'ఉపనిషత్‌సిద్ధాంత ఆచార్యపీఠాన్ని'' ఏర్పరిచారు. ఇక్కడే వారు "శరణ్య వేదపాఠ శాల"ను నిర్వహిస్తున్నారు.

శ్రీరంగరామానుజ జీయర్ స్వామివారి ఆహ్వానం మేరకు శ్రీ చిన్నజీయర్‌స్వామివారు 1-12-2004 సా. గం. 6-00లకు ''శ్రీమన్నారాయణ అష్టాక్షరీక్షేత్రాని''కి వేంచేసారు. శ్రీరంగరామానుజ జీయర్‌స్వామి వారు తమ పరివారంతో కలసి సాదరంగ శ్రీస్వామివారిని ఆహ్వానించారు.

శ్రీచిన్న జీయర్‌స్వామివారికి ఆశ్రమ విశేషాలను శ్రీరంగరామానుజ జీయర్‌స్వామి వివరించారు. ఆశ్రమంలో ఉన్న తపోవనం, బృందావనం, పుష్కరిణి, గోశాలవంటి ఏర్పాట్లు అన్నీ ఎంతో అద్భుతంగా, అందంగా, ఆకర్షణీయంగా పవిత్రభావాలను ప్రేరేపించేంతటి ప్రభావపూరితంగాఉన్నాయి.

వీటన్నింటినీ చక్కగా అమర్చి, క్రమశిక్షణ, స్పష్టమైన ప్రణాళితో నిర్వహిస్తున్న శ్రీరంగ రామానుజ జీయర్‌స్వామి వారికి, వారి ఆజ్ఞను శిరసావహించి వివిధకైంకర్యాలను శ్రద్ధతో నిర్వహిస్తున్న కార్యకర్తలకు శ్రీస్వామివారు అభినందన పూర్వక మంగళాశాసనాలను అందజేసారు.

మూడున్నర గంటలపాటు శ్రీరంగ రామానుజ జీయర్‌స్వామివారి ఆశ్రమంలో గడిపిన అనంతరం శ్రీస్వామివారు అక్కడ నుండి బయలుదేరి సీతానగరం విచ్చేసారు.

విజయవాడ భక్తులఆహ్వానం మేరకు 3-12-2004వ తేదీన శ్రీస్వామివారు శ్రీభగవాన్, శ్రీ ఎమ్. పూర్ణచంద్రరావు, శ్రీవెంకట రత్నం, శ్రీమతి పుష్ప, శ్రీమతి విజయలక్ష్మి, కీ.శే. ఎమ్. పూర్ణచంద్రరావు, డా॥ పి. నాగేశ్వరరావు, కీ.శే. పిన్నమనేని వెంకటరత్నం, శ్రీ కోటగిరి రమేష్‌బాబు, శ్రీమతి సుజాత, శ్రీమతి జానకిగార్ల గృహాలకు వేంచేసి మంగళాశాసనం చేశారు.

జై శ్రీమన్నారాయణ!





**బదరీ అష్టాక్షరీ క్షేత్రమునకు కైంకర్యము సమర్పించదలచిన భక్తులకు గమనిక:**

మీరు సమర్పించదలచిన కైంకర్యమును ఎమ్.ఒ. ద్వారాగానీ, డి.డి. కానీ ఈ క్రింది విధముగా పంపవలెను. "**బదరి అష్టాక్షరీ క్షేత్రీయ అన్నదాన శాఖాసంఘం**" విజయవాడ అని పంపగలరు. మీ చిరునామ, వివరములు స్పష్టముగా తెలుపగలరు.

**వేద పాఠశాలకు కైంకర్యము సమర్పించదలచిన భక్తులకు గమనిక:**

మీరు సమర్పించదలచిన కైంకర్యము "**జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్**" విజయవాడ పేరున పంపవచ్చు. మీ చిరునామ, వివరములు స్పష్టముగా తెలియజేయవలెను.



## పరమపద వార్త

మన జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ రాజమహేంద్రి నిర్వాహకులు డా॥ రాజారాం గారికి, విశాఖ పట్టణంలోని వారిజ ఆశ్రమ సభ్యులు శ్రీమాన్ రామానుజం గారికి తండ్రిగారైన....

శ్రీమాన్ **సాతులూరి వేణుగోపాల స్వామి** (రాజమహేంద్రి) **4-12-2004**న పరమపదించినారు.

వారి ఆత్మకు పరమాత్మ శ్రీచరణ సన్నిధిలో కైంకర్యము లభించాలని ఆకాంక్షిస్తూ వారి ధర్మపత్ని తిరువెంగళమ్మగారికి, కుమారులకు శ్రీస్వామివారు మంగళాశాసనములు చేసారు.

# సదాచార్య భవ్యస్మృతి

పరమ సాత్వికులు, శాంతమూర్తులు భాగవతోత్తములలో ఎన్నదగినవారు, ఉభయ వేదాన్త ప్రవర్తకాచార్యులు శ్రీమాన్ కల్వపూడి శరణ్యాచార్యస్వామివారి జన్మస్థలం విజయ నగరం జిల్లాలోని శ్రీరామతీర్థమనే ప్రసిద్ధ పుణ్యక్షేత్రం.

శ్రీరామతీర్థం, పద్మనాభం, సింహాచలం, శ్రీకూర్మం అనే నాలుగు దివ్యస్థలాలు ఉత్తరాంధ్రలో మన సంప్రదాయానికి పెట్టని కోటలుగా నిలిచినవి. అందునా శ్రీరామతీర్థం విజయనగర రాజుల గురువుల ఆవాస సీమ కావటం చేతనేమో వాటి వాటిలో మేటిగా నిలిచేది.

ఆంధ్ర దేశంలో ద్రావిడ శ్రీవైష్ణవ సంప్రదాయ ప్రచారకులుగా వాసికెక్కిన పరమభాగవతోత్తములు, సంస్కృతాంధ్ర ములలోను, వ్యాకరణ, అలంకార, సాహిత్యములలోను, ఉభయ వేదాన్తముల లోను దిగ్గజములవంటి మహాపండితులు ఎందరిచేతనో ఆదరింపబడి, వారి నివాస స్థానముగా నిల్చిన ఉత్తమ అభిమాన స్థలం శ్రీరామతీర్థం.

అటువంటి సంప్రదాయ కేంద్రంలో జన్మించిన ఉ॥వే॥ శ్రీమాన్ కల్వపూడి శరణ్యాచార్యస్వామివారి జనకులు శ్రీమాన్ కల్వపూడి రంగాచార్యస్వామివారు. జనని శ్రీమతి సీతమ్మగారు. వారి అతారం దినం క్రోధన నామసంవత్సరం (1925) కార్తీక శుద్ధ ఏకాదశీ తిథి పూర్వాభాద్ర నక్షత్రం.

చిన్నతనాన శ్రీరామతీర్థం దేవస్థాన సంస్కృత పాఠశాలలో ఉ.వే. శ్రీమాన్ శ్రీ తి.ప. రామానుజాచార్యస్వామివారి వద్ద సంస్కృత కావ్యనాటకాలంకార సాహిత్యం గడించుకొని, కొంతకాలం తరువాత విజయ నగర మహారాజ సంస్కృత కళాశాలలో భాషాప్రవీణ పట్టభద్రులైనారు శ్రీమాన్ శరణ్యాచార్యస్వామి.

శ్రీకాకుళం జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో తెలుగు పండితులుగా పలువురకు విద్యాదానం కావించి 1984వ సంవత్సరంలో విశ్రాంతులయినారు. ఉద్యోగ, సంసార బాధ్యతలు నిర్వహిస్తూనే సంప్రదాయ గ్రంథాలను సేవించి పలువురికి ఆ రహస్యాలను అందజేయడంలో కూడ నిమగ్నమయి ఉండేవారు శ్రీస్వామివారు.

శ్రీరామతీర్థం అయ్యవార్లంగారు ఉ.వే. శ్రీమాన్ శ్రీమత్తిరుమల పెద్దింటి సంపత్కుమార వేంకటాచార్యస్వామివారి వద్ద ద్రావిడ వేదాన్తాన్ని, ఉ.వే. శ్రీమాన్ శ్రీభాష్యం అనంత అప్పలాచార్యస్వామివారి వద్ద సంస్కృత వేదాన్తాన్ని అధిగమించారు.

విజయనగరం, విజయవాడవంటి నగరాలలో ఉభయవేదాన్త సభలలో పలుమార్లు ప్రవచనాలు కావించారు.

శ్రీరామాయణం అనుసంధించినా, దివ్యప్రబంధం సేవించినా, స్తోత్రపాఠం కావించినా, శ్రోతను నిలిపి కూర్చుండబెట్టి వినిపింపచేసే మార్దవం, మాధుర్యంవారి గొంతులో గూడుకట్టుకున్నవి. దర్శన రమణీయమైన దివ్యమంగళ విగ్రహం, శ్రుతి



సుభాగమైన వాక్కు, సౌశీల్యము, వినయం, శాంతం జతగూడి రూపుదాల్చినట్టు సాక్షాత్కరించేమూర్తి శ్రీస్వామివారిది.

వారి శ్రీమతి సీతమ్మగారు అన్ని విధముల వారిని వెంటనంటియుండి చేదోడు వాదోడుగా నిల్చేవారు. సతీసమేతంగా వారిని సేవించుకున్నవారు శ్రీసీతారామ చంద్రమూర్తి దర్శనమయినట్లు భావించి ఆనందించేవారు.

వారికి నలుగురు కుమార్తెలు, ఇరువురు కుమారులు వారి పెద్ద కుమారులు వైరాగ్య సంపన్నులై "నిసర్గాదేవ త్వచ్చరణ కనులై కాంత మనసులై" సన్యాసాశ్రమ స్వీకారం చేసి, శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య, శ్రీమదుభయ వేదాంత ప్రవర్తకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగరామానుజ జీయర్‌స్వామి వారిగా అవతరించి అశేష ప్రజానీకాన్ని తరింప చేస్తూ కాకినాడకు దగ్గరలో శ్రీమదష్టాక్షరీ క్షేత్రాన్ని స్థాపించారు.

శ్రీమాన్ శరణ్యాచార్యస్వామివారు, చరమదశలో కూడ భగవద్గుణ అనుభవం కావిస్తూ శిష్యులనందరినీ తమ మృదుమధుర వాక్కులతో దయామృత దృక్కులతో సంప్లావితులను చేస్తూ, శ్రీమదష్టాక్షరీ క్షేత్రంలో పరమపదవాసులయినారు.

వారు ఆచార్య శ్రీచరణాలనలంకించిన దినం, శ్రీ తారణ నామ సంవత్సర కార్తీక శుద్ధ ఏకాదశీ సోమవారం ఉత్తరాభాద్ర నక్షత్రం. (22-11-2004). 79 సంవత్సరాలు నిండిన మరునాడే తిరునాడు అలంకరించడం విశేషం.

## స్వామి! ప్రార్థన

మకరని వధించి గజేంద్రుని కాపాడినావు గద!
స్వామీ! ద్రౌపదిని మానభంగం కాకుండ రక్షించావు గద!
అలనాడు అంబరీషుని కాపాడి భక్తులన్న
నీకెంత ప్రీతియో ఋజువు చేసుకొన్నావు గద!
స్వామీ, సర్వాంతర్యామీ, సర్వజ్ఞ! కౌస్తుభాంగా!
కుచేలుని కుబేరుని గావించినావు గదా!
ఆహా! ఏమీ నీ వాత్సల్యం ! బాల్యమిత్రుడని గదా! భక్తుడని గదా!
అలా పూజించి కాళ్ళు కడిగి మరీ ఐశ్వర్యమిచ్చావు. సర్వజ్ఞుడవైన నీకు
నా మొర వినిపించుట లేదా! మధుసుదనుడా! నీకన్న నాకెవరయ్యా!
దిక్కులేని నాకు నీవే దిక్కని గట్టిగ నమ్ముకొనియున్నాను.
ఆప్త బంధువై ఈ క్లిష్టపరిస్థితిలో నన్నాదుకోవయ్యా!
శ్రీనివాసా! నమస్తే! నమస్తే! నమః

ఎస్.వి. రంగనాథ్

- విశాఖ

ఓం అస్మత్ గురుభ్యో నమః

# పదాల విందు-7



**అడ్డము:-**

1 వృక్షాన్ని ఇలా కూడా ఉంటారు.

2 ఇవి ఓ 14 ఉన్నాయని మనకు శాస్త్రాలు చెప్తున్నాయ్.

3 బదరీక్షేత్రంలో ఇప్పటికీ శిష్యుని రూపంలో తపస్సు చేస్తున్న నారాయణుడు.

4 మంచివారు...

5 ఇది దారిని ఒక్కసారి చూస్తే ఎప్పటికీ గుర్తుపెట్టుకుంటుంది.

6 నాన్నగారూ! అనడానికి ఇది కూడా సంబోధనే. (సంస్కృతంలో)

7 లోకాలను పాలించేవాడు....

8 అర్థానికి మరోపదం

9 హారం తగిలిస్తే అందరికీ ఆరోగ్యం.

10 శ్రీరామునికి వనవాసానంతరం కిరీటాన్ని అలంకరించిన రాజు

11 శ్రీవిష్ణుసహస్రనామాలలో 136వ నామం

12 సరి తిరగబడితే



13 గాన ప్రధానమైన వేదం

14 ఈ భూమిపై మొట్టమొదటి అర్చావతారంగా వచ్చిన క్షేత్రం

15 ప్రకాశించునది అని తెలిపే చక్కని పదం

16 24 అక్షరాలు కల్గిన ఛందస్సు ఇది

17 నకలు

**నిలువు**

1 పార్వతికి ఇది పేరు

2 పుట్టడం....

3 రావణుడే....

4 రెండు కలిస్తే....

5 ఇది వృక్షాలకు రాజువంటిది

6 నేరస్తులను ఉంచే స్థానం

7 అన్ని లోకాలకు స్వామి అని తెలియచేసే విష్ణు సహస్రనామాలలోని నామం....

8 మాలిన్యాన్ని తొలగించుకున్నది

9 విష్ణు అనే పదానికి అర్థం ఇదే

10 ఈ నది ఆవిర్భావనాం అలకనంద

11 తాపాన్ని కలిగించే ఋతువు తిరగబడితే...

12 మనదేశంలో ప్రధానమైన పంట తల్లికిందులౌతోంది.

13 సాయం సంధ్యలో భగవంతుని ఈ రూపంగా భావిస్తారు.

14 ఈ నామం తారక మంత్రం.

15 మునులకు ఈశ్వరుడు.....

పదాలవిందుకు ముందుగా సరియైన సమాధానాలు వ్రాసి పంపినవారి పేర్లు ప్రచురిస్తాం. మీరు చేయవలసిదల్లా సంచికలో పదాలవిందు కత్తిరించి, పూరించి 25వ తారీఖులోగా పంపండి.

| | | 1 క్రౌ | స | 2 ల్య | | 3 ధ | నీ |
|---|---|---|---|---|---|---|---|
| 4 శే | ము | షీ | | 5 హ | 4 వి | ష్ణు | |
| | | త | | 6 అ | శ్వ | మే | 6 ధ |
| 7 తా | ట | కి | | | మి | | న |
| ర | | | 8 సు | 5 మం | త్ర | | ద |
| | 9 త్రి | | 9 బా | ధా | | 11 తా | |
| | జ | | 10 హు | తా | 10 శ | న | |
| 11 జ | టా | యు | వు | | 12 ని | షా | ద |

జూన్ నెల పదాలవిందుకు ముందుగా సమాధానాలు పంపిన వారు

శ్రీమతి వేముల బాల త్రిపురసుందరి–అవనిగడ్డ



# బదరికాశ్రమంలో పునర్నిర్మించే సత్సంగసదనమునకు కైంకర్యములు సమర్పించిన దాతలు

**ఆఫీస్‌ద్వారా:**

**మహారాజ పోషకులు:**

**శ్రీమతి విమల-సికింద్రాబాద్;**
**శ్రీమాన్ కె. లక్ష్మి వరహాలరాజు-విశాఖపట్నం**

**రాజపోషకులు:**

**శ్రీమతి కొడాలి భవానిదేవి-చెన్నై**
**శ్రీమాన్ ఎమ్. శ్రీ వీరాంజనేయగుప్త- హైదరాబాద్;శ్రీమతి ఎమ్. జయలక్ష్మి-బసపట్నం, కర్ణాటక; శ్రీమాన్ టి.లక్ష్మినాథ్-పటమట లంకపల్లి**

**పోషకులు:**

**శ్రీమాన్ ఎమ్. సుబ్బారావు శివ పార్వతి-గుంటూరు;శ్రీమతి కె. వీరరాఘవమ్మ-ఉయ్యూరు; శ్రీమతి బి. సుశీల- కరీంనగర్; శ్రీమతి తులసిలక్ష్మి-హైదరా బాద్; శ్రీమతి చెరుకూరి ఆశాజ్యోతి -హైదరా బాద్; శ్రీమాన్ వి. వెంకట సుబ్బారావు- విజయవాడ; శ్రీమాన్ టి. రమేశ్-వెంకట గిరి క్యాంపు; శ్రీమతి బి. సరస్వతి అప్పారావు-మంగళగిరి; శ్రీమతి లక్ష్మికాంతమ్మ-గుంటూరు;**

**ఆఫీస్‌ద్వారా:**

శ్రీమాన్ జి. రమణయ్యశెట్టి, రంగమ్మ-చెన్నై, శ్రీమాన్ కె. జయచంద్రరెడ్డి; సరోజిని దేవి-హైదరాబాద్; శ్రీమాన్ ఎస్. బుచ్చయ్య శాస్త్రి-రమేశ్‌బాబు-గుంటూరు; శ్రీమాన్ ద్వారకాంత &బ్రదర్స్-సత్యసాయి విలేజ్; శ్రీమాన్ ఎమ్.వి.వి.ఎస్.ఎస్.వరప్రసాద్-రాజమహేంద్రి; శ్రీమాన్ బలభద్రుని కృష్ణారావు-సాలూరు; శ్రీమాన్ వెంకట రమణ-చెన్నై; శ్రీమాన్ జి. సలిల బాలనరసింహారావు-హైదరాబాద్; శ్రీమాన్ పి.వెంకటరావు-సికింద్రాబాద్; శ్రీమాన్ పి. నవీన చంద్ర-సికింద్రాబాద్; శ్రీమాన్ ఎన్ రామ మోహన్‌రావు-హన్మకొండ; శ్రీమాన్ జి. రంగారావు-రాయ్‌పర్తి; శ్రీమతి రాజ్యలక్ష్మి-ఆకివీడు; శ్రీమాన్ కె. రామాను జాచార్యులు-గుంటూరు; శ్రీమాన్ కె. నారాయణ-గుంటూరు; కె.శ్రీనివాసాచార్యులు-గుంటూరు; శ్రీమాన్ వరాహనరసింహశర్మ-అల్లిపురము; శ్రీమాన్ కె. మార్కండేయరాజు-గుండుగొలను; శ్రీమాన్ సత్యనారాయణ, వాణి-కాకినాడ; శ్రీమాన్ యడవల్లి వెంకటేశ్వర్లు-ఖమ్మం; శ్రీమాన్ వెంకటరత్నం, లక్ష్మీ పద్మావతి-వరదరాజనగర్; శ్రీమతి తేజలక్ష్మి-కాకినాడ; శ్రీమాన్ ఎమ్. రాంబాబు-నెల్లూరు; శ్రీమాన్ జి.బదరీనారాయణ-చెన్నై; శ్రీమాన్ ఆంజనేయులు-కురద; శ్రీమాన్ భూపతి పుష్పావతి-శ్రీకాకుళం; శ్రీమాన్ పెద్దిభొట్ల లక్ష్మీనారాయణ-సికింద్రాబాద్; శ్రీమతి&శ్రీమాన్ పెద్దిభొట్ల హైమవతి, పి.ఎస్‌హెచ్. శర్మ-సికింద్రాబాద్; శ్రీమాన్ కె. కృష్ణవేణమ్మ-హైదరాబాద్; శ్రీమాన్ కె.టి. చారి-హైదరాబాద్; శ్రీమాన్ బి. వెంకట రామయ్య-కడప; శ్రీమాన్ కొత్త హరినాథ్-హైదరాబాద్; శ్రీమాన్ పద్మావతి-సోంపేట; శ్రీమాన్ కె.వేదాంత మాధవాచార్యులు-చెన్నై; శ్రీమతి చెరుకూరి స్వర్ణకుమారి, నాగేశ్వర రావు-తిరువూరు; శ్రీవేంకటేశ్వరస్వామి టెంపుల్-కల్లూరు; శ్రీమాన్ ఎమ్. కోదండ



రామయ్య-విశాఖపట్నం; శ్రీమతి ముడుంబై చూడామణి-వీరభద్రాపురం; శ్రీమతి ఐ. అమ్మాజీ-పెరుమలి; శ్రీమాన్ సోము శోభనా చలపతిరావు-విజయవాడ; శ్రీమతి నాగమణి-అనకాపల్లి; శ్రీమతి కోటగిరి విజయలక్ష్మి-అనకాపల్లి; శ్రీమాన్ కె.ఎస్.రాజు-హైదరాబాద్; శ్రీమాన్ దాట్ల వెంకట అచ్చాయమ్మ-భీమునిపట్నం; శ్రీమాన్ ఎల్లా రామారావు, ఉదయలక్ష్మి-తాడేపల్లిగూడెం; శ్రీమాన్ ఎల్లా వెంకటేశ్వరరావు-ఏలూరు; శ్రీమాన్ శనగ శెట్టి శ్రీనివాసరావు-కైకలూరు; శ్రీమాన్ తమ్మిశెట్టి రామారావు-వేపగుంట; శ్రీమాన్ జె. సూర్యచంద్రరావు-తాడేపల్లిగూడెం; శ్రీమాన్ డి. వెంకటరమణ, సూర్య-తాడేపల్లి గూడెం; శ్రీమాన్ అభితేజస్-హైదరాబాద్; శ్రీమాన్ ఆర్. వేణునాథ్-హిందూపూర్; శ్రీమాన్ కె. శేఖరయ్య-వరగలి; శ్రీమాన్ కె.ఎస్.పి. రాధాదేవి-తిరుపతి; శ్రీమాన్ ఎల్లా రామారావు, ఉదయలక్ష్మి-తాడేపల్లిగూడెం; శ్రీమాన్ ఎల్లా వెంకటేశ్వరరావు-ఏలూరు; శ్రీమాన్ ఎస్. శ్రీనివాసరావు-కైకలూరు; శ్రీమాన్ తమ్మిశెట్టి రామారావు శ్రీలక్ష్మీకళ-వేపగుంట; శ్రీమాన్ జె. సూర్యచంద్రరావు, రమాకుమారి-తాడేపల్లిగూడెం; శ్రీమాన్ దాసమ్ వెంకటరమణ, సూర్యకుమారి-తాడేపల్లిగూడెం; శ్రీమాన్ శ్రీప్రగడ ఉమా మహేశ్వరరావు-కైకలూరు; శ్రీమాన్ కొల్లూరి దుర్గాసాయి ప్రసాద్-అమీర్‌పేట; శ్రీమాన్ ఎల్లా రామారావు-తాడేపల్లిగూడెం; శ్రీమాన్ పరిపాటి కాశీవిశ్వనాథ్-గుంటూరు; శ్రీమాన్ నాగిరెడ్డి సులోచనమ్మ-నెల్లూరు; శ్రీమతి వైశానకుల రమణమ్మ-నెల్లూరు; శ్రీమతి వైశానకుల ధనలక్ష్మి-నెల్లూరు; శ్రీమాన్ కె.వి. చంద్రధరరెడ్డి-నెల్లూరు; శ్రీమాన్ వాసిరెడ్డి శ్రీనివాస్-అదిలాబాద్; శ్రీమాన్ బి. సత్యనారాయణ-పాల్వంచ; శ్రీమాన్ రవి కృష్ణారావు-నెల్లూరు; శ్రీమాన్ కె. జయ ప్రకాశ్‌రావ్-ఆదిలాబాద్; శ్రీమాన్ తేలుకుంట్ల చిరంజీవన్-కొత్తపేట; శ్రీమాన్ తాళ్ళూరి రామారావు-ప్రత్తిపాడు; శ్రీమతి ఎస్. స్వర్ణకుమారి-కంకిపాడు; శ్రీమతి సూర్య దేవర లీలావతి-భీమడోలు; శ్రీమాన్ టి. విజయరాఘవేంద్రరావు-విజయవాడ; శ్రీమాన్ వి. శ్రీరామచంద్రమూర్తి-గుండుగొలను; శ్రీమాన్ భీంరెడ్డి సత్యనారాయణ రెడ్డి-పెదపాలెం; శ్రీమాన్ కుదరవల్లి రామ కోటేశ్వరరావు-ఏలూరు; శ్రీమాన్ ఆర్.వేణు నాధన్-హిందూపూర్; శ్రీమాన్ చింతల వెంకట రత్నమ్మ-గుడివాడ; శ్రీమాన్ కోగంటి దేవతామణి-అమృతలూరు; శ్రీమాన్ బొప్పన రాజేంద్రప్రసాద్, రమాదేవి-తమిరిస; శ్రీమాన్ వి.వి.ఎల్ నరసింహారావు-గుడివాడ; శ్రీమాన్ వేగుంట రాధాకృష్ణారావు-ఏలూరు; శ్రీమాన్ వేగుంట మహారాణి సంయుక్త-ఏలూరు; శ్రీమాన్ వెల్లంకి శకుంతల-ఏలూరు; శ్రీమాన్ సిరివెళ్ళ అనసూయమ్మ-ఒంగోలు;

**విమలమ్మగారు-విజయవాడ ద్వారా:**

**అభిమానులు:**

**ఏలూరు:** శ్రీమాన్ జాస్తి రామా రామమోహన రావు; శ్రీమాన్ రమేశ్; శ్రీమతి రామకుమారి; శ్రీమతి ఉషారాణి- శ్రీమాన్ సత్యరాజు;

**విజయవాడ:** శ్రీమాన్ కుటుంబరావు; శ్రీమాన్ శ్రీమాన్ టి.లోకేశ్వరరావు; శ్రీమాన్ దుట్టా గోపాలస్వామి; శ్రీమాన్ వల్లభనేని మోహన రావు, ఎమ్.వీరభద్రరావు-గుడివాడ; శ్రీమాన్ టి. రామచంద్రారావు-పెనమలూరు; శ్రీమాన్ ఎమ్. శంకరరావు-మొవ్వ; శ్రీమాన్ కరపూడి వెంకటేశ్వరరావు- పోరంకి; శ్రీమాన్‌సిహెచ్.రామకృష్ణ- పోరంకి.